## మధ్య మధ్య నా విసుగు

అపుడపుడు గ్రంథము పెద్దదగుటచే విసిగి స్వామితో నిట్లు నివేదించుచుంటిని.

శా. ఎంతోమంది శతావధానులు నిజం బెంతో మహాభక్తులున్
ఎంతోమంది మహానుభావులు జగం బేపారఁగా నుండఁగా
అంతా సున్నకు సున్నయైన నను నీ వానందరామాయణం
బంతా తెన్గున వ్రాయుమందు విది యేలా? రామచంద్రప్రభూ!

మ. యతియుం బ్రాసయు శబ్దలక్షణము చింతాశంసయున్ రాని న
న్ను తపూపాగ నియోజితున్ సలిపి యెన్నోపాట్లు నీ పేటికి
గతిఁ గైకొందువు దిద్ది అచ్చుపడదా కా డూరుకోలేవా! మె
చ్చితివో నా దగు తొక్కుపల్కుల కపూ శ్రీరామచంద్రప్రభూ!

## కవిగారితో పరిచయము

అన్నట్లు కీ. శే. బ్ర. శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి (కవి) గారు నే నున్న గార్ల వచ్చి నా యీ ప్రయత్నముం జూచి చాల సంతోషించి దిద్ది నన్నాశీర్వదించిరి. అప్పటికి వ్రాసి సిద్ధముగానున్న శ్రీ కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలాంధ్రీకరణమును సమగ్రముగా తిలకించి సరిచూచి పీఠిక వ్రాసిరి. అందీ గ్రంథము నుదాహరించిరి.

దానిని మానుకోట నివాసులగు కీ. శే. శ్రీరంగం బాలసుబ్బశ్రేష్ఠిగారు అచ్చు వేయించిరి. తన షష్టిపూర్తికి తులాభారము తూగిన సదాన్యులు. వయన.

ఇట్లు గ్రంథము శ్రీరాముని సంపూర్ణానుగ్రహముచే పూర్తియైనది. ఒక నా డిట్లు స్వామి సన్నిధిం గల్పించుకొని ప్రస్తావించితిని.

శా. గ్రంథం బిప్పుడు పూర్తియైన దిక నిర్వాహంబు గావించి నీ
వాంఛావ్యంబు మహత్తరంబుగ జగత్ప్రఖ్యాతిగా! స్వామి! నా
బంధంబుల్ వెడబాపి లోకమున కావ్యాయంబుగా మేలు గూ
ర్పం ధన్యుంగవు నీవు చేయవలె దేవా! రామచంద్రప్రభూ!

నిజాంరాష్ట్రమున చెలరేగిన అల్లరులతో తన మానమును గాపాడుకొన నా సతీమణి బావి గోడి చనిపోయినది. అపుడు నేను వరంగల్లులో నుంటిని. నా యాప్తులీ దురంతము విని కడుంగడు పరితపించిరి. దుండగుల శిక్షింప ప్రభుత్వముం గోరిరి. న్యాయము కలుగలేదు. భగవానుడే దానిని సెలవిచ్చెను.

నేను నా ఏకైక పుత్రుఁడగు చిరంజీవి గోపాలరావుతో తెనాలి నా చెల్లెలు లంక లక్ష్మీకాంతమ్మ శరణు జేరితిని. 4 సంవత్సరములుం డుంటిని. నా స్వగ్రామము పిడపర్తినందలి కీ. శే. మల్లెల వెంకటశివయ్యగారి కనిష్ఠ కుమార్తెను చి. సౌ. సరస్వతిని

నా కుమారున కిచ్చి వివాహము కావించిరి. బస్తీనివాసము గిట్టక స్వగ్రామము నివాస యోగ్యముగాక దైవయోగమున మా అత్తవారి యూరు కృష్ణాజిల్లా గొడవర్రు జేరితిమి.

## గొడవర్రు నివాసము

అచట సద్గోష్ఠియు మనశ్శాంతియు ఏర్పడి నిరంతర భగవచ్చింతా పరాయణుఁడనై యుండగా "పటమట" నివాసులు వదాన్యులు శ్రీ కోనేరు బసవయ్యచౌదరిగారు నేనున్న గొడవర్రునకువచ్చి ఆనందరామాయణము నెఱింగి ముద్రణకు నన్నుత్సహించిరి.

అయాచితముగ ఇట్లు జరుగుటకన్న రామలీలా మహిమ నింకేమని కొని యాడవలె! వాని సంకల్ప మప్రతిహతముగదా!

## అయాచితముగ గ్రంథముద్రణము

గీ. రెండువేలైదువందలు నిండు హృదయ,మున సమర్పించి శ్రీరామమూర్తి కృపకు
పాత్రుఁడైనట్టి కోనేరు బసవయార్యుఁ డెంతటి కృతార్థవంతుఁడో ఎవరికెఱుక!

చ. అడుగక తల్లియేనియు యథార్థముఁగాఁగ పదార్థమేమియు
న్నిడదను నట్టి సామెతకు హెచ్చి, యనన్య హరిప్రశీలు నె
ల్లెడఁ గనిపెట్టి తా మనుజవృత్తిని యోగము క్షేమముం గడుం
గడుఁ గనుఁగొందు నన్నుడికిగా నొడఁగూర్చె నితండు నాతఁడే!

శా. లేరే? దాతలు ద్రవ్యవంతులు ధరిత్రిన్ వార లీ తీరునన్
శ్రీరమ్యంబగు సత్కృతుల్గనిరె? నిస్సీమ ప్రమోదంబునన్
ఈ రేడుం జగముల్నుతింప గనిరే? ఈ నేర్పు నీకబ్బెఁబో!
శ్రీరామాయణ కావ్యతన్మయత నర్థిన్ బస్వయార్యాగ్రణీ!

ఈయన వలన కోనేరు వంశము తరించినది. యథార్థముగ కోనేరు వంశము మంచిది. శ్రీ కోనేరు సుబ్బయ్యగారు భూజీవనము కల్పింప నాకు మిక్కిలి సాయపడిరి. శ్రీ కోనేరు వెంకట్రామయ్యగారు శ్రీ కోనేరు బసవయ్యగారికీ రామాయణ వ్యవహారమున ప్రేరకులైరి. దాని పర్యవసానమే ఈ

## నవరత్నములు

క. కోనేఱుతో సమానము, కానేర్చునె? ఏఱు - చెఱువు - కంధియుఁ గొప్పౌ
కానబడియు నొకవడువున, పానయోగ్యమై సుమధుర భవ్యంబగునే?

సీ. వానకారునపొంగి తాను కల్మషమయి, ఎండకాలంబున నింకిపోవు
శ్రేష్ఠోపయోగంబుఁ జెందక కశ్మలం,బై యుండు కట్టుబాటాను తఱుఁగు
బ్రహ్మాండమంతయై పరఁగియు దప్పితీ,ర్పదు సుంతయేని ఆపన్నులకును
స్నానపానాదుల సమభావమునన ఈ,నాడు నానాడ ననక చెలంగు

గీ. ఏఱు, చెఱువు, సముద్రము లెవ్విధమున, నెఱిని సరిపోల్పఁదగును ? కోనేఱుతోఁడ
స్వచ్ఛజలము శుభోపయోగ్యలమున, సుమధురంబయి కనులకు సొంపుఁగూర్చు !

శా. పొంగుం గ్రుంగును సార్వకాల మొక సొంపుం బెంపు స్వచ్ఛత్వ మె
న్నంగా సున్నగు, కట్టుబాటునకు లోనై మట్టసంబైన యిం
పుం గూర్పన్ నెఱిఁజాల దేఱిగుటపో పుణ్యాన కోనెఱె మా
కుం గూడెన్ బహుళోపయోగ భృశమై కోదండరాముం దయన్.

చ. కలవు సముద్రముల్ జలముఁ గల్గు ననంతముఁ గాఁగఁగాని గొం
తులు తెగయెండిపోయి మతిదూలి, కనుంబడుచుంట నాశలం
జెలఁగి తపించుచున్నను, స్పృశింపఁగ నొక్క మొగిన్ అనుజ్ఞ మి
మ్ముల నిడకన్, ఇడన్ రసనముల్ చెడఁజేయును! దప్పిఁ దీర్చునా ?

గీ. వట్టి కోనేఱుకాదొప్పునట్టి దైవ,తాలయంబు సంబంధంబు నంటినట్టి
దల్ల ఆ ఆలయమ్ము రామాలయంబు, నా కభీష్టదైవంబ! ఇంకే కొఱంత ?

క. కోనేఱుపైన నా కిం,తైన యాదరంబు కలుఁగు నక్కారణ మా
కోనేఱు నాపయిందగ, నూనిన యాదరమె యింత యొప్పుం గూర్చెన్.

సీ. శూద్రత్వమన్నది, క్షుద్రత్వమన్నది, పేరుకైనం జూడనేరమచట !
శుచి దైవభక్తి పెంబుచి పుణ్యకథల నా,చారమ్ములును వ్యవహారములును !
బ్రాహ్మణోత్తములకు పైచేయి, మనసిచ్చు, పట్టున నిచ్చుటే ప్రాణమైన !
దుర్వ్యవహారమందున దమ్మిడియు ఖర్చు,చేయరు ధర్మంబుచేయుచోట

గీ. వేయికైనన వెఱువరు వితరణమున, రారు రాజాధిరాజు లెవ్వారు సాటి
సత్రములు చేలివేంద్రలు సంతరింప, పాఠశాలల నిర్మింపఁ బరఁగుచుంద్రు !

శా. శ్రీ కోనేరు శుభాన్వవాయ జలధి శ్రీ పూర్ణచంద్రోదయా !
శ్రీ కారుణ్య కటాక్ష వీక్షణ లసచ్ఛ్రీశ్లిష్ట ప్రభాన్విత వి
ద్యాకల్లోజ్జ్వల భాసమాన సుకృతీ ! తత్ర్కోవ శోభాకృతీ !
నీకున్ దక్కెను రామకావ్య ప్రకటా నేకోద్యశశ్శ్రీశ్లిష్టతల్ ! ! !

గీ. సప్తసంతానములను ప్రశస్తిమీఱఁ, గాంచినాడవు ! శ్రీరామ కథ కతమున
సత్ప్రకాశతఁ గాంచి శాశ్వత సుఖంబుఁ, గనుమ ! కోనేరు బసవయాఖ్య ప్రశీల !!!

## కృతజ్ఞత

నాకు మొదటినుండియు నా కష్టసుఖములు శ్రీరామునితో చెప్పుకొను టలవాటైనది !

శా. అజ్ఞానావృతమైన పుట్టువును నన్నత్యంతమున్ నీ కృపా
ప్రజ్ఞాలబ్ధి నొసర్చి ప్రోచితివి జీవన్ముక్తి ప్రాపించి స

దివ్యజ్ఞానం బోడఁగూర్చి కొల్చెదను హృద్వీథిఁ విహారింపుమో
సుజ్ఞానామల భవ్యతేజమ! నమస్సుల్ రామచంద్రప్రభూ!

శా. నాకుం జూడఁగ నిన్నుబోలు హితుఁడుఁ నానార్థ సంధాయి సు
శ్లోకస్తుత్య చరిత్రుఁడుఁ సుభగుఁడుఁ శోధింపఁగా లేదు ము
ల్లోకంబుల్ కలయంగఁ జూచినను కొల్తుఁ తల్తు నా సంస్కృతుల్
నీకే యర్పణసేతు ధన్యమతి తండ్రీ! రామచంద్రప్రభూ!

ఈ గ్రంథముద్రణాకాలమున 10 సంవత్సరముల క్రితము చేనిపోయిన నా భార్యయు అంతకుమున్నే చేనిపోయిన నా యనుంగు నెచ్చెలి కీ. శే. శ్రీ ఆలూరి వెంకట చలపతిరావుగారు నాకు స్వప్నమున కన్పించిరి. వా రింతకు మున్నెప్పు డు కన్పింపలేదు. వారి కీ రామాయణము ప్రాణపదము కాన వారిని స్మరించుట అప్రస్తుతము కాదు.

దివ్య స్మృతి

శా. నా యర్థాంగి! అనన్య భవ్యగుణ సుస్నాత ప్రభా పూర్ణ! ని
శ్శ్రేయ శ్రేష్ఠ విశిష్ట భక్తమతి! యిచ్చెం బ్రాణముల్ మానర
క్షా యేకైక సునిశ్చితార్థమతి! నీసాన్నిధ్య మందాసతిఁ
నా యుద్దేశము మీఱఁగాఁ దలఁతు నన్నా! రామచంద్రప్రభూ!

మ. ఎవనిఁ నిక్కపు స్నేహితుండని సభాహేరాళరంగంబులఁ
సవిశేషస్థితిఁ జెల్ప గర్వమతినై సంతోషవార్ధి తరం
గ విలోలత్వముఁ దేలియాడుదునొ? తద్గంభీరు నాలూరి వం
శ వరుఁ చల్పతిరాయ నెంచెద రమేశా! రామచంద్రప్రభూ!

శ్రీ సమర్థ రామదాసస్వామి స్మృతి

శా. గోస్వామిఁ, నిజరూపుఁ దాల్చి మహిమఁ గోచీ విసర్జించి, రా
మస్వామిఁ దరిశింప భద్రగిరి రా మద్గోచరుండై మహా
నిస్స్వార్థంబుగఁ బల్కు రామకథ తండ్రీ! యన్న శ్రీరామ దా
స స్వామిఁ కమనీయమూర్తి మదిలో సంధింతు నశ్రాంతముఁ.

అది ప్రభవసంవత్సరము. భద్రాచలమునకు రైలుమార్గము క్రొత్తగా పడిన సంవత్సరము. నా కపుడు వయస్సిరువది. శతసంఖ్యాకులగు వైశ్య సమూహముతో నే నొక్కడనె బ్రాహ్మణుఁడను వారలతో భద్రగిరియాత్ర చేసితిని. దాదాపొక పక్షము దినము లుంటిమి. షుమారు పదిలక్షల జనులు వచ్చిరి. ఋషిసాంప్రదాయులగు కొందఱు మహనీయులును దయచేసిరి. అం దొక దిగంబర యోగికి నాకు సమావేశమై నీవు రామకథ వ్రాయుదువనిరి. నేను నమ్మలేదు. తాను చూచిన మహాసామ్రాజ్యపట్టాభి

షేకములలో ఇది ఏడవ దనెను. నాకు నమ్మకము కలుగలేదు. మరల నీ నా సమావేశము కలదనెను. ఎప్పు డగునో ? తెలియను. ఎచ్చట నగునో తెలియదు.

తరువాత శ్రీ సమర్థ రామదాసస్వామి పఠమును దాసబోధలో చూచి నాకు దర్శన మిచ్చిన దాయనయే యని నిర్ధరించి పై పద్యము వ్రాసి నిత్యము సంస్మరించుచుంటిని. గ్రంథమును వ్రాయ ప్రారంభింపగా శ్రీ సమర్థుని సంబంధము మిక్కిలి సన్నిహితమగుచు రాఁగా మూలగ్రంథకర్త ఆయనయేయని తెలిసి కడుంగడు విస్మయము నందితిని.

ఇక ఆ మహనీయుని పునర్దర్శనవిషయమున నెట్లు నాకు సందేహము కల్గును?

## ప్రకృతగ్రంథ విషయము

కథాసందర్భమున కొన్ని మార్పులు 24000 రామాయణమును బట్టి చూచిన కన్పించుచున్నవి. అవి రసపుష్టికి దోహదములుగనున్నవి. రామాయణము కావ్యము. కేవల ఇతిహాసదృష్టితో దీనిం జూడరాదు. కాళిదాస భవభూతి మురారేత్యాది మహాకవులు ఆశ్రేయములగు భారతరామాయణాది గ్రంథములనుండి గ్రహించిన కథలయందు సమంజసములైన మార్పులు గావించినారు. అది జగద్విదితము. అందువలన కావ్య ప్రయోజన మినుమడించినదని చెప్పవచ్చును. శ్రీ సమర్థుఁ డొనరించిన మార్పులును అట్లే సమంజసములైయున్నవని నా యభిప్రాయము. వాటిని వివరింపవలె నన్న మూల గ్రంథమును మించును. దిఙ్మాత్రముగ కొన్నిటి నుదాహరించుచున్నాను.

పాయసవిభాగము: అందొక భాగమువల్ల ఆంజనేయుని జననము. దశరథుడు తన ముగ్గురు భార్యలకు పాయసము సమముగా నిచ్చెను. స్వభావగర్వ మతియగు కైక తక్కినవారితోపాటె నాకును సమభాగ మిచ్చిన పతికి నా యందుగల ప్రత్యేకానురాగ మేదని తన కిచ్చిన పాయసముం బొఱవయిచెను. దానిని సువర్చలా నామక గంధర్వ స్త్రీ శాపవశమున గ్రద్దయై తన్నుకొనిపోయి అంజనాద్రిం బడవైచె. దానివల్ల తన శాప విముక్తి యయ్యె. అది అంజనీదేవి గ్రహింప నాంజనేయుఁ డుద్భవించె. దీనివల్ల ఏకైక కార్యప్రవణులగు శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులతోబాటు ఆంజనేయుడు నేకైక పాయస కారణజన్ములుగ చెప్పఁబడుట ఎంత శ్లాఘాపాత్రము! ఎంత సమంజసము!

మారీచుడు లేడిరూపమున శ్రీరాముని బాణాహతికి ప్రాణమువీడుచు హా ! లక్ష్మణా ! హా! సీతా! యని రావణోపదేశ ప్రకారము పలికి ప్రాణములు వీడ నా ధ్వని విని సీత అది శ్రీరాముని యార్తధ్వని యని భ్రమసి లక్ష్మణు నన్నకు విపత్తున సాయపడ బొమ్మనును. లక్ష్మణు డట్టి యాపదకు లోనగువాడు కాడు మా యన్న, యని ధీరుఁడై ప్రత్యుత్తరమిచ్చును. అపుడు సీత అనరాని వినరాని ప్రసంగము చేయును. సాక్షాల్లక్ష్మీఅంశ సంభూతురాలగు సీత యిట్లు పల్కునా ? యని ప్రతి పాఠకునకును సందేహము గల్గును.

దానిని సమర్థుఁ డెట్లు సమర్థించెనో గనుఁడు. ఇంతకుముున్నే శ్రీసీతారాములీ విషయమై రహస్య సంభాషణ సల్పుకొనిరి. సాత్విక యగు సీతను తనయందును, రజో సీతను అగ్నియందును ప్రవేశము గమ్మని శ్రీరాము డుపదేశించును. మిగిలిన తామసి యగు సీత ఎన్నిమాటలు పలుకుటకును ఎట్టిమాటలు పలుకుటకును రావణుని చేబడుటకును సందేహ మేమున్నది? రావణ సంహారానంతరము త్రిగుణైక్య యగుటకే సీత అగ్నిప్రవేశము గావించుట కాని సీతా శీలశంక చేగాదు రామ నియుక్తయగుట. ఇట్లు అనేకఘట్టముల సందేహనివృత్తి గావింపబడినది.

వాలీసంహార సమయమున నతఁడు శ్రీరామునిగూర్చి తన నేరముం గుఱించి ప్రశ్నించును. వంశక్రమాగతమైన వదినను మఱది వివాహమాడు నాచారమున నీ భార్యను నీవు మరణించితివనుకొని సుగ్రీవుఁడు పెండ్లియాడెను. అది కూడదని ఎఱిఁగియు నీవు కండపావరున నీ మఱదలిం జేకొని తమ్ముని వెడలనడచితివి! ఇది నీ దురంతము కాదా? అని శ్రీరాముఁడు ప్రశ్నించును. ఇప్పటికిని వాలి సుగ్రీవ కులము మాది అని చెప్పుకొను లంబాడీల యందీ యాచారము సుస్థిరమై యున్నది.

సీతాదేవి వాల్మీకాశ్రమమునుండి వచ్చి మఱల పరీక్షార్థము శ్రీరామునిచే ప్రశ్నింపఁబడగా భూదేవిని దాయ యిమ్మని భూగర్భమునకు పోయినట్లు మన మెఱిఁగిన కథ. కాని ఇక్కడ భూదేవిని శ్రీరాముఁడు భార్యాభర్తలతగవును సాకుగగొని నీవు సీతం దీసికొని పో తగదని చెప్పగా ఆమె వినక అట్లే ఆమెం గొనిపో నాయత్తపడగ లక్ష్మణా! ధను విటు తెమ్ము! అని మేఘగంభీర భాషణంబుల బలుకును. అది విని భూదేవి సీతాదేవిం దెచ్చి కిక్కురుమనకుండ రామునంకమునం జేర్చి యాశీర్వదించి యేగును. రాముఁడు సీతాదేవితో 11000 సంవత్సరములు సుఖము లనుభవించి రాజ్యమేలి కొడుకులు, మనుమలు, మనుమరాండ్రు వీరి వివాహములు మొదలైన అనేక వేడుకలను చూచి భార్యా సోదర సమేతుఁడై యే వైకుంఠగమనము చేయును. ఇది సర్వజ్ఞుఁడును, సర్వస్వతంత్రుఁడును, సర్వలోకైకనాథుఁడగు శ్రీరాముని కీర్తి ప్రతిష్ఠల కెంత వన్నెయిడినది?

యాత్రలలో కైలాసాధిపతి చింతామణిని, కౌస్తుభరత్నమును, బ్రహ్మదేవుడు కామధేనువును కానుకలిత్తురు సీతారాములకు.

శ్లో. వైదేహీ సహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యే పుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితం
అగ్రే వాచయతి ప్రభంజన సుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాభిః పరివృతం రామం భజే శ్యామలం.

అని పండితప్రపంచమునగల శ్లోకమున కనుగుణ్యముగ అయోధ్యకు కల్పవృక్ష మెట్లువుడు వచ్చినదో ఆ కథను దూర్వాసప్రయుక్తముగ అద్భుత రసావిష్కృతి యగునట్లు కూర్చు

చేసిన సమర్థుని సమర్థత ఎంతపొగడినను చాలదు. ఆతని చేర్పులు కూర్పులు తీర్పులు మార్పులు మిపుల నేర్పులు.

## ఆనందరామ సప్తాహ మహోత్సవము

10-14 సంవత్సరముల క్రిందటి సంగతి. ఒక కార్తికమాసము. గార్ల గ్రామ మధ్యమున జీర్ణోద్ధరణము కావింపబడిన శ్రీరామలింగేశ్వరాలయమున కార్తికోత్సవములు వైభవముగ జరుగుచున్నవి. భజనతో తెల్లవారుజామున భక్తులు మా యింటి మార్గముననే మాద్గల్య నదీస్నానమునకు వెళ్లుచు నను బిలుచుకొనిపోవుట వాడుక.

వారు వచ్చునప్పటికే నా కొక స్వప్నము. అందు నేను రైల్వేస్టేషనుకు విజయవాడప్రాంతమునుండి ఆహూతులైన ఋత్విక్కులను స్వాగతమిచ్చి తీసుకొనిపోవ వచ్చితిని. రైలు వచ్చెను. అన్ని పెట్టెలలోనుండి శతసంఖ్యాకులు బ్రాహ్మణోత్తములు శాలువలు దేవతార్చనపెట్టెలతో దిగిరి.

గార్లలోని కలపవ్యాపారస్థుడు రా. శ్రీ కొదుమూరి వరదయ్య స్టేషనులో కలసెను. ఏమిటి సంగతి అని ప్రశ్నించెను. ఋత్విక్కులతోసహా ఈయనను వెంటబెట్టుకొని యజ్ఞశాలకు పోయితిని.

దీనికి ద్రవ్య మేది ? అని ఆయన ప్రశ్న. పందిరిలో ఒక ప్రక్క చూపితిని. అక్కడ వందల బియ్యపుబస్తాలు తక్కినపదార్థములు రాసులుగ పడియుండెను. ఇంతలో భక్తుల జేజేధ్వనులతో మెలుకువ వచ్చినది. లేచి ఈ సంగతి వారి కెఱింగించితిని.

తరువాత 10-15 రోజులకు యువకవర్గము సమూహమై మా యింటికి మధ్యాహ్నవేళ వచ్చిరి. నా దేవతార్చనయై మహానివేదన మైనది. భోజనము చేయ బ్రారంభింపలేదు. భోజనము తరువాత చేయవచ్చును. ముందు మాతో మాటాడుడని, బలవంతపరచి వా రిట్లనిరి. అయ్యా ! సప్తాహమున కెంత ద్రవ్యము పట్టును ? 8 రోజులకు కనీసము 800 లైనను కావలె నంటిని. వారిలో వారు నీ వెంత యిత్తువు? అనగా నీ వెంత యిత్తు ? వని తలకొక పుట్టెడుధాన్యము నిర్ణయించి అప్పుడు రానివారివలనకూడ చందా వేయింతమని అభోజ్యముగనే నన్నాహ్వానించిరి. నేను వెనుకంజవేయలేదు. 2 గంటల వేళకు దాదాపు 30 పుట్ల ధాన్యము చందా లభ్యమాయెను.

నా మిత్రులు. మ. రా. రా. శ్రీ మాకేటి వరవరరాయశర్మగారు పేష్కారు పట్వారీల(కరణముల)తో మా కెదురై ఆవేశపరులుగ కనబడుచున్నారే అనిరి. చందాలిస్టు చూపితిని. తా మందొకనాటికగు వ్యయముభరింతుమని తమ దివ్యోత్సాహముం బ్రకటించిరి.

తరువాత వారి కభిప్రాయభేదము కల్పింపబడినది. అది రామకార్యము ద్విగుణీకృతముగ జరుగుటకు కారణభూతమైనది. శ్రీ వేజండ్ల అప్పదాసుగారి ఆధ్వర్యమున శ్రీమదానందరామ సప్తాహము బ్రహ్మానందముగ జరిగినది. ఆనందరామాయణ ఘట్ట

ములు పారాయణ చేయబడినవి. 108 దంపతులతో కళ్యాణము, 108 దంపతులతో శ్రీ సామ్రాజ్య పట్టాభిషేకము నయనపర్వముగ జరిగినవి. ఆంధ్ర దేశమునుండి పలువురు విద్వాంసులు హరిదాసులు భజనపరులు వచ్చిరి.

హనుమద్ఘట్టము సిద్ధమైననాడు హనుమత్ప్రత్యక్షము - ఒకనాడు గరుడుని ప్రత్యక్షము అప్పదాసుగారి సమక్షమున జరిగినవి. పోయిన అప్పదాసుగారి నిధిమూరము హనుమత్పరాక్రమమున తిరిగి వచ్చినది. రాముని దయామృతము వెల్లివిరిసినది. ఆసంఘటనలు విపులీకరింపవలెనన్న అది యొక రామాయణ మగును. అవి చాల దొడ్డదినములు!

ఆనంద రామాయణము నింతకుము న్నొకరిరువు రాంధ్రీకరించిరని తెలియ వచ్చినది. ఒకరు సారకాండము మాత్రము తెనిగించిరి. వారికి గ్రంథకర్త సమర్థుండనియే తెలియదు. దానిని గుఱించి వ్రాసిన పండితులు వాల్మీకి స్వవచనవ్యాఘాతముగ వేర్వేరు గ్రంథముల నెట్లు వ్రాసెనని శంకించిరి.

ఇంకొకరు గ్రంథము పూర్ణముగ తెనిగించినట్లు తెలిసినది కాని నాకది లభ్యము కాలేదు. అందువల్ల దానిసంగతి యెటులున్నదో తెలియదు.

మద్రాసులో చాల కాలముక్రిందట మూలము తాత్పర్యసహితముగ ప్రకటించిరి. వారును సమర్థుని కర్తృత్వము గుర్తింపరైరి. వ్యాఖ్య అశ్లీలములతో నిండియున్నది. అయినను నా కావ్యాఖ్య చాలసాయపడినది. వారికి నా కృతజ్ఞత తెలుపవలసియున్నది.

మా చిరకాలమిత్రులు శ్రీ శేషాద్రిరమణకవులు రచించిన దాసబోధలోని శ్రీ సమర్థుని చరిత్రము నిందు చేర్చితిని. మ. రా. రా. శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి, ఎమ్. ఏ., బి.యల్. గారు దయతో వ్రాసియిచ్చిన ఉపోద్ఘాత మిందు చేర్చితిని. వారికి నా మేలు మఱువమి ప్రకటించుచున్నాను.

ఇందు చిత్రపటములు అచ్చుల పటములు సమకూర్చుటయందును రమ్యముగా ముద్రించుటయందును సాయపడిన శ్రీ భారతీ ప్రెస్‌వారికి కృతజ్ఞతాపూర్వకాభినందనముల సమర్పించుచున్నాడను. ఈ రామకార్యమున సాయపడిన ఎల్లరకు కృతజ్ఞుడ.

ఓయి రామా! తక్కిన గ్రంథము నెట్లు నడిపింపనున్నావో? నీకె తెలియును!

శా. బాల్యం బాదిగ నీదు భక్తి మదిలో పాదై సుధాంకూరమై
 తుల్యం బెయ్యెడ లేని వృక్షమయి యెంతే సత్ఫలావాసమై
 కల్యాణప్రదమై సుఖాశ్రయమునై గావించె మోదంబు కౌ
 సల్యానందన! భక్తచందన! వయస్యా! రామచంద్రప్రభూ!

విధేయుడు
శ్రీ రామదాసు
పండిత చిలుకూరి శ్రీరామశాస్త్రి

# ఉపోద్ఘాతము

జీవితశైవలిని సాహితీపూరమై స్రవించును. జీవనమే ప్రవాహము. రెండింటికిని అవినాభావసంబంధము కలదు. స్థలకాలప్రభావము వ్యక్తిహృదయముపై సోకును. బాహ్యనిమిత్తములు అంతరంగమున నిహితమైన శక్తులను లేపును. ఈ నిమిత్తములు సంప్రదాయమును, సంస్కృతిని, సభ్యతను అనుసరించును. వీని సంయుక్తశక్తివలన సృష్టియగు భావవాతావరణమందే ఉదారాశయ సందీపితకవిత యుదయించును. నేలకు గాలి, కరువలికి వెలుగు, ఆలోకమునకు వ్యక్తికృషి తోడైనపుడు గింజ నిండైన పండగునట్లు నైసర్గిక ప్రతిభకు పూర్వోక్తాంశములు సహకరించినపుడు మనసు నలరించు సాహిత్యము సృష్టియగును.

బీజాక్షరయుత రామనామమును పురశ్చరణ మొనరించిన ముని యంతరంగమున ఆధ్యాత్మికశక్తి తలసూపినది; అందలి మాలిన్యము తొలగినది; అద్భుత సంస్కృతి గోచరించినది. మహత్తర సాహిత్యసృష్టికా హృదయము గంగోత్రి యాయెను.

వజ్రపుతునకవలె తూర్పుదిక్కున శుక్రతార గోచరించిన శుభంకర ముహూర్తమున, వేగుచుక్క వెలుగు వెల్లువపై పడినపుడు అపూర్వశక్తిసమన్వితమై ధునీమతల్లి విలసిల్లినది.

స్వచ్ఛసలిల సంభరిత తమసా సరిత్తలముపై చూపు సారించి, మలయసమీర సంస్పర్శవలన మహిత భావబంధుర మధురానుభూతినందు మంగళముహూర్తమున వాల్మీకి కర్ణపుటములందు క్రౌంచశకుంత గళ వినిర్గతాక్రందన స్వరము ప్రవేశించెను. ఋషి హృదయము ఉత్తాలతరంగ సంకుల కరుణరస మహోదధి యాయెను. ఆ వీచికలే రామాయణమందలి అమృతముక్తములాయెను. సాహితీజగతిలోని తొలిసృష్టి అదియే!

పల్లవిత మాకందమున జొక్కి మధువ్రతము మాడ్కి, కల్హారతల్పమున శయించు కుముద్వతీసీమంతిని కవుంగిటిలో కులుకు చంద్రిక కైవడి, వెన్నెలవెలుగుకై తపించు చకోరము చాడ్పున, శతపత్రసుందరీ ప్రఫుల్లముఖమున చిందులాడు స్వర్ణరశ్మి చందమున, జలదమునుండి జాలువారు వానచినుకునకై గ్రుక్కిళ్లుమ్రింగి యలరు చాతకము పోలె, వాల్మీకి హృదయ సముద్భవ మధురాతిమధుర కవిత్వసృష్టి నాశ్రయించి, బహుళ జిజ్ఞాసువుల చిత్తము లనంత పరితోషము నందినవి. ఈ పరమానందమున వెలలేని కృతులెన్నో యుదయించినవి. ఆదిసృష్టి కివి యనుకరణములు, అనుసరణములు, అనువాదములు. ఆంధ్రవసుంధరలో భాస్కరాదులు, వంగ వసుమతిలో కృత్తివాస తీర్థులు, ఆర్యావర్తమున తులసీదాసు, తమిళనాడులో కంబ, మహారాష్ట్రసీమలో సమర్థ రామదాసు సృష్టించిన రామాయణము లిట్టివి. ఉత్తేజిత నైసర్గిక ప్రభయం దివి యుద్భవించినవి. మనసు నలరించు ప్రత్యేకతయును నవనవోన్మేషశాలినియైన ప్రజ్ఞయును వీనియందు పరిఢవిల్లుచున్నవి.

శ్రీ సమర్థ రామదాసస్వామి పవిత్ర మహారాష్ట్రభూమిలో సౌందర్యసంశోభిత ప్రకృతియందు బుట్టెను. రామనామ పునశ్చరణమువలన వామలూరు తనయుఁడు ఆదికవి

యారెను. శ్రీ సమర్థ రామదాసు పూర్వభవమునుండి రామదాసే! ఆతడు మారుతి. ఆ మహాత్ముని భక్తిభరితహృదయమున రామాయణ ముద్భవించినది. తక్కిన రామాయణగ్రంథములందు గోచరింపని శ్రీరామ జీవితవిశేషము లీ స్వామి యుద్గ్రంథమునగలవు.

శ్రీరామాదుల దీపావళీమహోత్సవము, శ్రీరాముడు భరతశత్రుఘ్నులను సంజీవనిచే బ్రతికించుట, కార్తికమాసమున శ్రీవిష్ణువ్రత మహిమ, దశరథునకు కౌసల్య ఎదుట శ్రీరామునిచే తత్త్వోపదేశము, శివరామాగస్త్యసమావేశము–రామేశ్వరమహిమ, భరతుని అగ్నిప్రవేశము, బ్రహ్మవాల్మీకాశ్రమమునకు వచ్చుట మున్నగునవి; సామాన్యాంధ్రపాఠకు లీ వరలో నెఱుగని బహుళాంశము లీ మహాగ్రంథమున వెలయుచున్నవి.

శ్రీ బాలభారతీ ప్రసాదలబ్ధ కవితాధౌరేయ పండిత చిలుకూరి శ్రీరామ శాస్త్రిగారు శ్రీ సమర్థ రామదాస ప్రణీత సంస్కృత కృతిని విశేషకౌశలముతో నాంధ్రీకరించిరి. ఈశ్వరప్రేరణ నంది, వీ రీ యద్భుతక్రియను నిర్వహించి ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులైరి. అక్షరక్షరమందు వీరి రామజపము వెలయుచున్నది.

వైదేహీసహితుఁడై పుష్పకయాన మొనరించిన శ్రీరాముని కాళిదాసమహాకవి అద్భుతముగ వర్ణించెను. విమానమున పయనించి శ్రీరాముడు బహుళక్షేత్రములను సందర్శించిన సందర్భములను విశేషనైపుణ్యముతో వర్ణించి ప్రస్తుత కవీంద్రులు తమ పాఠకులను మానసికముగ నా యా పుణ్యతీర్థములందు విహరింపఁజేసిరి.

ఉదారభావములకు, భాస్వదాశయములకు రూపుచూపులు ప్రసాదించి ఈ మహాకవి పాఠకుల మానసనేత్రము మ్రోల నిలిపెను. సౌందర్యోపాసనమందును, ఆనంద వ్రతమందును బద్ధదీక్షితులైన మహనీయులే ఈ యద్భుత చిత్రలేఖనమున సిద్ధహస్తులు కాజాలుదురు. వీరి రచనములు రసభరితములు; వ్యంగ్యభూయిష్టములు; ఔచిత్య సమన్వితములు. పూర్వజన్మ సుకృతమువలన లభించిన భావశబలతను ప్రస్తుత భవసాధనవలన నీ గ్రంథకర్త క్రియాసఫలతయం దవలోకించెను. గంభీర భావబంధురమై, సర్వాంగ సుందరమైన ఈ పవిత్ర కృతి ఆంధ్రశారద కపూర్వాలంకారమై వెలయగలదు. ఆర్షమత సముద్ధరణము మిక్కిలి అక్కరైన ప్రస్తుతకాలమున ఈ మహాగ్రంథమువలన విశేషముగ లోకోపకారము జరుగజాలును. స్వధర్మ పునరుద్ధరణ మొనరించుటకై నడుముగట్టు ప్రజానాయకులును, జిజ్ఞాసువులును, సాధకులును, కళోపాసకులును ఈ పూత శ్రీరామ కైంకర్యమునకు హృదయామృత ముప్పొంగ నంజలి ఘటించి తరింతురుగాక! ఈ రీతి కైసేతల నీ మహాశిల్పి వాగ్దేవికి సమర్పించుచు, ధన్యజీవులయ్యెదరని విశ్వసించు సోదరుడు

9-2-1956

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, యం. ఏ., బి. యల్.,
ఎస్. ఆర్. ఆర్. ఎండ్ సి. వి. ఆర్. కాలేజి, విజయవాడ.

శ్రీరామః ప్రసన్నోఽస్తు

# ఆనందరామాయణము



## పీఠిక



మద్భూమిజ వామయై, మును కపిశ్రేష్ఠుండు, పశ్చాద్దిశన్
సౌమిత్రుండును, పార్శ్వగుల్ భరతుఁడున్, శత్రుఘ్నుఁడున్, కోణగుల్
తామై యంగద జాంబవ త్సుకపిరాట్ దైత్యోత్తము ల్గొల్వ, సు
శ్యాముణ్ రాముని నీలనీరదనిభున్ ధ్యానింతు నశ్రాంతమున్.

శా. శ్రీ వాల్మీకిముని ప్రణీత సుకథాచింతామణిశ్రేష్ఠ మా
హా! విజ్ఞాననిధాన మంచిత ప్రశస్తానందసంధాయక.
శ్రీ విశ్వైక పవిత్రకావ్య మిది యాంధ్రీకర్తృభాగ్యం బహా
నీవే యీయఁ దలంప రామ యిఁక సందేహంబు నా కేఁటికిన్.

కం. పలికెడిది రామకథ యది, పలుకుమనినవాఁడు రామభద్రుండది నేఁ
బలికిన నిహపరమగు నది, బలుకక చెడుటెల్ల నా యభాగ్యమ కాదే?

గీ. కావ్యసంస్కారమైనను కాని నన్ను, పూని యింతటిపనికె హా పూన్చినావు
తనర కోతులచే అంత పని యొనర్ప, చేసితివి నీవు నాచేఁత చేతువేమొ?

ఉ. శ్రీజనకాత్మజాంచిత విచిత్రకథా విలసత్ప్రబంధ వి
భ్రాజిత మాత్మతత్త్వగము; రామసహస్ర రహస్య భద్రసం
పూజిత ముత్తమంబు, సురపూజ్యము, రామకథాప్రసంగ మే
పూజఫలంబొ? సల్పుటకు పూనగఁ గల్గితి రాము నాజ్ఞపై.

సీ. దశరథ జననాదిఁ దవిలి రామాయణ షట్కాండ కథయెల్ల సారకాండ
శ్రీరామచంద్రుఁడు చెలఁగి బంధువులతో యాత్రలుసేయుట యాత్రకాండ
పది యశ్వమేధము ల్మోదముమీరగసేయు నా యా కథ లవెల్ల యాగకాండ
కుశలవు లుదయించి కోరి రామాయణ సంగీత మొనరింప జన్మకాండ

గీ. వారి వైవాహికములు వివాహకాండ, రామభద్రుని రాజ్యము రాజ్యకాండ
పోవ వైకుంఠమున కది పూర్ణకాండ, లమర వెల్గు నానందరామాయణమున.

ఉ. శ్రీరమయై మహాయశముఁ జెందిన సీతయు రామచంద్రు లిం
పార విలాసలీలల శుభంబులఁ గ్రాలుచు నున్నయప్పు డా
నీరజగంధి కిచ్చెను వినిర్మల జ్ఞాన రహస్యపేటికన్
ధీరుఁడు రాముఁ డా కథలఁ దెల్పెడు భవ్యవిలాసకాండమున్.

గీ. తత్త్వపురహస్యములను సుధామయముల, రాముని యుపాసనముసేయు రమ్యఫణితి
ఆత్మ రాముని పూజించునట్టి విధుల, నెరి మనోహరకాండ మన్నించి తెల్పు.

కం. ఇట్టుల తొమ్మిది కాండలఁ, దొట్టి, లసద్భక్తజనుల దుర్విషయాళిం
గొట్టి, జగంబున కీర్తిం, గట్టిన యానందరామకథ విరచింతున్.

## విఘ్నేశ్వర స్తవము

మ. తొలుతన్ నీకు నమస్కరింపక కృతార్థుల్ లేరు ముల్లోక వా
సుల, నిన్ మ్రొక్కిన విఘ్నముల్బొరయునే? శోభాయమానంబు నీ
విల సద్భవ్యశరీర సంపద భవద్విఖ్యాతి ప్రఖ్యాతిగా
వెలయంగా దగు నాదు కావ్యము నెడన్ విఘ్నేశ్వరా మ్రొక్కెదన్.

## సరస్వతీ ప్రార్థన

శా. వీణాపుస్తకపాణి! వాణి! నిను సంప్రీతిన్ మదిన్ గొల్తు వి
న్నాణెంబైన వచఃప్రవృత్తి నిడి ధన్యత్వంబు చేకూర్పవే
యేణీలోచన! నీ కృపామహిమఁగాదే సత్కవుల్ సద్వచ
శ్శ్రేణిం గ్రంథపరంపర ల్బలుకు టర్థిన్ దైవచూడామణీ!

## ఈశ్వర స్తవము

శా. నీ వెల్లప్పు డమేయభక్తిమతి నే నిక్కంపు మంత్రంబు ధ్యా
నావృత్తిం గనుచుందువో అభవ! అయ్యక్షేశునిన్ రామునిన్
శ్రీవృత్తంబు పవిత్రరీతి తెనుఁ గే సేయం దొరన్ కొంటి నా
కీవే భవ్యసమర్థతాగరిమ మోయియా, రామలింగేశ్వరా!

## బ్రహ్మ స్తవము

మ. నొసటన్ వ్రాసెడి వ్రాతకాడ విక నన్యుల్ లేరు తద్రీతి దె
ల్ప సమర్థుల్ మునిలోక పూజిత! యతుల్యానంద! ఆనందరా
మ సముద్యచ్చరితంబు వ్రాయుదునె? చెప్మా! అట్లయైనన్ లిఖిం
తు సరే లేదను! మానుకొంటి నను కొందున్ శారదావల్లభా.

గీ. ముప్పదియురెండునక్షరము లిలంగు, శ్లోకమున పదియక్షరా లొక్కలోక
మునకుగాపంచి, మిగిలిన పుణ్యమూాల, మైన తారకమును నాకుగా నొసంగె.

క. ఆ తారకంబె గాదే! నాతీ! నే నిపుడు వారణాశీపురియం
దాతత ప్రాణుల చెవులన్, ఖ్యాతిగ వచియింతు నంత్యకాలమునందున్.

క. శ్రీపతి కృప భూలోకపు, నీ పుణ్యగ్రంథభాగ మేర్పడ సప్త
ద్వీపములకు హరి పంచె, న్నేపున వారలకు తగవు లేర్పడకుండన్.

గీ. ఇటుల హరి పంచ ద్వీపమొక్కటికిగల్గె, నాల్గుకోట్ల డెబ్బదియారులక్షలపయి
పదియు తొమ్మిదివేల నల్బదియు నేడు, శ్లోకసంఖ్య నా పయి చతుశ్శ్లోకి మిగిలె.

ఉ. వానిని బ్రహ్మ వేడిన నవశ్య మొసంగెను మాధవుండు, న
వ్వాని మహత్త్వముం బొగడ వారిజగర్భున కౌనె? అద్వయ
జ్ఞాన నిధానముల్ పరమ సత్యవిధానము లద్భుతావ్యయ
శ్రీ నిలయంబు లా మహిమ చెప్పగ నా తరమౌనె కోమలీ!

క. ఆ శ్లోకచతుష్కము పు, ణ్యశ్లోకుం డైనయట్టి నారదునకు, ప్రే
మాశ్లేషబుద్ధి యవ్విధి, సుశ్లోకుండై వచించె సురుచిర లీలన్.

ఉ. వేదవిభాగముల్ సలిపి, విశ్వహితంబగుపొంకు, సంస్కృతా
ష్టాదశ సత్పురాణముల సల్పియు, భారత సంహితన్ ప్రియం
బూది రచించియున్, ముదమునొందక వ్యాకులుఁడైన వ్యాసునిన్
ఆదట నారదుండు గని యా స్థితియెల్ల యెఱింగి వెండియున్.

క. ఆ దివ్యశ్లోకంబుల, బ్రోదిన్ ఉపదేశమిచ్చి పొరి భాగవతం
బాదరమున రచియించిన, నీ దుఃఖోపశమనంబు నెగడు నటన్నన్.

ఉ. భాగవతంబు నప్పుడు ప్రభావముమీర రచించి వ్యాసుఁ డు
ద్వేగముబాసి సుస్థిరమతిన్ నిజమైన సుఖంబునొందె, త
ద్భాగవతంబు మూలమగు భాసురశ్లోక చతుష్టయంబు, స
ర్వాగమసారమై యెసగు రామకథాంతర మౌను పార్వతీ.

## శ్లోక చతుష్టయము

౧. అహమేవాసమేవాగ్రే నాన్య ద్యత్సదసత్పరం
పశ్చాదహం యదేతచ్చ యోవశిష్యేత సోస్మ్యహం.

౨. ఋతేర్థం యత్ప్రతీయేత న ప్రతీయేతచాత్మని
తద్విద్యాదాత్మనోమాయాం యథాభాసోయథాతమః.

3\. యథామహాంతిభూతాని భూతేషూచ్చావచేష్వను
ప్రవిష్టాన్యప్రవిష్టాని తథా తేషు నతేష్వహం.

౪\. ఏతావదేవ జిజ్ఞాస్యం తత్త్వజిజ్ఞాసునాత్మనః
అన్వయ వ్యతిరేకాభ్యాం యత్స్యాత్సర్వత్ర సర్వదా.

క. తదుపరి జంబూద్వీపా, స్పదమగు రామాయణంబు స్తవనీయముగా
పదపడి నవఖండములకు, కుదురుగ విభజించెఁ గ్రమత గోవిందుఁ డొగిన్.

ఆ. ఇట్లు ఖండమునకు నేబదిరెండు లక్షలును తొంబదొకటి జను సహస్ర
ములును పైన నైదు మొనకొనుశ్లోకాళి, పంచియిచ్చె హరి ప్రభావగరిమ.

గీ. రెండుశ్లోకముల్ కడవడియుండునెట్టెఁగి, యక్షరాప్తినిబంచి (శ్రీ) యనఁగ మిగిలి
నట్టి దివ్యాక్షరమ్ము కావ్యాదినుండు, నటుల శాసించెఁ జగతిఁ బద్మాక్షు డబల.

ఉ. భారతఖండమందుగల భవ్యమునీంద్రులు గ్రంథ ఖండముల్
వారక భక్తియుక్తులయి పాఠముసేయుచు, శిష్యపాళికిన్
గారవ మొప్ప జెప్పుచు, యకల్మషమానసులై చరించి రీ
తీరున పెక్కువర్షములు, తెంపు నెఱుంగక నుల్లసాత్ములై.

ఉ. ఎవ్వరి గ్రంథభాగముల నేపుగఁ గైకొని వారు వోయి ర
ట్లవ్వరభవ్యభారత మహాద్భుత వర్షపుభాగ మమ్మునుల్
గ్రొవ్వున కొంతకాలమునకున్ ఖిలమై చన శ్రద్ధబాయగా
నవ్వరగ్రంథరాజమును నారసి వ్యాసుఁడు సంశయాత్ముఁడై.

గీ. చదువు లన్నిటి కాదియై జగతి ఖ్యాతిఁ, గాంచినట్టి రామాయణ గ్రంథభాగ
మట్టె ఖిలమైన లోకకల్యాణమగునె? యనుచుఁ గల ఖండముల నేకమునుఁబొనర్చె.

చ. ఇరువదినేల పైఁబడిన యిమ్మహనీయచరిత్ర మిమ్ములన్
సరిగ కథాక్రమంబు పెలుచన్ బొనగూర్పగ పైనఁగల్గు భా
స్వరమగు శ్లోకసంఖ్య సమవాక మొనర్చి, విచిత్రరీతిగా
యిరువదినాల్గువేలయిన యిప్పటి గ్రంథముఁ గూర్చె నిమ్ములన్.

క. ప్రతివేయి శ్లోకములకున్, కుతుకముతో మొదటివర్ణకోటిని విలస
న్నుత గాయత్రీ వర్ణాన్వితముగ నొనరించి శోభ నెసగించె రహిన్.

గీ. అట్లగుటచేతనే యిప్పు డందరకును, లభ్యమైన రామాయణ లక్షణంబు
సంస్కృతంబై మహాయశస్కరము నగుచు, అఖిలవాంఛదమై భూమి నలరుచుండె.

చ. అది యగుగాదె? రామకథ యంతయు నిర్వదినాల్గువేలె యై
పొదలిన నందు చాలకథ పొల్పుగ తా పదునాల్గువత్సరా

# ఆనంద రామాయణము



## బాలకాండము

## ప్రథమ సర్గము

### కథా ప్రారంభము

### శ్రీ పార్వతీపరమేశ్వర సంవాదము

చ. ఒకసమయంబునందు పరమోత్సుకయై గిరిరాజకన్య నా
యకుఁడగు శంకరుంగని ప్రియంబున రాఘవుపైని భక్తి పా
యక నెలకొన్న డెందమున నర్మిలి నిన్నొక ప్రశ్నచేతు; త్రో
యక నను తృప్తిసేయఁదగునంచు వచించినఁ గాంచి నవ్వుచున్.

చ. ప్రియుఁడను; సాధ్వి! నీవెలమి వేడినదెల్లను చేయుచుందు; అ
ట్లయినను శంక నీకు మెటులయ్యెనొ? చిత్రముకాదె యిద్ది? న
న్నయుత మహానిగూఢ విషయంబులఁగూర్చి వచింపుమన్న ని
శ్చయముగ వానినెల్ల మనుశంక ఒకింతయులేక చెప్పనే?

క. అనిన ముదమంది పార్వతి, యనియెన్ మహనీయ! నాకు నతులప్రియ వ
ర్ధనమగు శ్రీరాముని స, జ్జననాదిక శుభ విచిత్రచర్యలఁ జెపుఁడా!

గీ. రామకథయన్న నాకు హర్షమ్ముదేలో? హృదయమెప్పుడు దానిపై పదిలపడును;
కాన మన్నాథ! శ్రీరాముగాథ లెల్ల, నాకు నెఱిఁగించి ప్రోవవే నాకవంద్య!

వ. అనిన నగ్గౌరిఁ గౌరవించి, మించుప్రేమ నప్పంచముఖుం డిట్లనియె.

గీ. ఓ నగతనూజ! భవ్య దివ్యోక్తి నీది; చక్కఁగా పృచ్ఛచేసితి సరసమతివి;
రమ్యమంగళప్రదము శ్రీరామచంద్ర, విమల సత్కథ; చెప్పెద; వినుము ప్రీతి.

### సూర్యవంశపురాజుల పరంపర

గీ. ఆదినారాయణునినుండి అజుఁడు పుట్టె; అతనికొడుకు మరీచి మహర్షివరుఁడు;
అతనిపుత్త్రుఁడు కశ్యపుఁ; డతనిసూతి, సూర్యభగవానుఁ; డాతని సుతుఁడు యముఁడు.

క. అతఁడే వైవస్వతమను; వతనికి నిక్ష్వాకువు సుతుఁ డతనికి కొడుకై
మతిమంతుఁడగు వికుక్షుఁడు, వితతయశమునందె జగము వినుతియొనర్పన్.

క. ఇతఁడే శశాదుఁడనబడు; ఇతని పుత్త్రుఁడగు పురంజయేశ్వరుఁడు జగ
న్నుతుఁడు కకుత్స్థుఁడు; వీనిని, నతులు సేతు రింద్రవాహనామని పేర్మిన్.

సీ. వీని కుమారుండు విశ్వరంధి, అనేనుఁ డితని పుత్త్రుఁడు చంద్రుఁ డిద్ధతేజుఁ;
డీయన పుత్త్రకుండే యవనాశ్వుండు; శాబస్తుఁ డీతని సత్సుతుండు;
అతనికి బృహదశ్వుఁడగు పుత్త్రుఁ డాతని, కొడుకు శూరుండైన కువలయాశ్వుఁ;
డాతని సుతుఁడు దృఢాశ్వుఁ డాతని పట్టి, హర్యశ్వుఁ; డాతని యాత్మజుఁడయి

గీ. చను నికుంభుఁడు; మఱి వానితనయుఁడగును, బర్హణాశ్వుఁడు; తద్రాజభవుఁడు ధన్యుఁ
డౌ కృతాశ్వుఁడు; శ్యేనజిత్తతనికొడుకు, వీనికిన్ యవనాశ్వుండు విదితసుతుఁడు.

గీ. అలరు యువనాశ్వపుత్త్రుఁడై అధికకీర్తి, ధరఁ త్రసద్దస్యుఁడనగ మాంధాత యనఁగ
ఇతఁడు కనె పురుకుత్సుని; ఇతనికొడుకు, మఱి త్రసద్దస్యుఁ; డనరణ్య మహివిభుండె
యితని సుతుఁడయి చెందె నహీనయశము.

క. వీనికొడుకు హర్యశ్వుఁడు; వానికి నరుణుండు; నతనిపట్టి త్రిబంధుం;
డా నృపతికి సత్యవ్రతుఁ, డా నరపతియే త్రిశంకుఁడన చెలువొందెన్.

గీ. తగ హరిశ్చంద్రుఁడాతని తనయుఁడయ్యె; రోహితుఁడు వాని పుత్త్రుఁడు; రోహితాత్మ
జుండు హరితుఁడు; చంపుఁడాదండిచేని, పుత్త్రకుఁడు; సుదేవుఁడు వాని పుత్త్రకుండు.

గీ. వానిపుత్త్రుఁడు విజయుఁడు; వానికొడుకు, భరుకుఁ; డాతని సుతుఁడయి పరఁగె వృకుఁడు
బాహుకుఁడు వాని పుత్త్రుఁడు వానిసుతుఁడు, సగరుఁడను చక్రవర్తియై నెగడెమిగుల.

గీ. అతని సుతుఁ డసమంజసుఁ డతని పుత్త్రు, డంశుమంతుఁడు వానికి ఆత్మజుఁడయి
తనరెను దిలీపుఁ డాతని తనయుఁడే భగీరథుడు; శ్రుతుఁ డతని కుమారుఁడయ్యె.

గీ. శ్రుతుని పుత్త్రుఁడు నాభుఁడై సొంపుమీఱె; అతనికొడుకు సింధుద్వీపుఁడన తనర్చె;
అతని కయుతాయువయ్యె తా నాత్మజుండు; తనరె ఋతుపర్ణుఁడాతనితనయుఁడగుచు.

సీ. అతనికొడుకు సుదాసాతఁడే మిత్రసహుండను పేరుతో నొప్పి పిదప
కల్మాషపాదుఁడై క్రాలె; ఆ నృపతికి, అశ్మకుం డుదయించె నాత్మజుఁడుగ
అతనికి మూలకుఁడను సుతుండు జనించి, నారీకవచుఁ డనుపేరఁ బరగె,
అతనికి దశరథుం డా మహానేతకు, నాత్మజుండయ్యె నాయైడవిడుఁడు;
వీనికి జన్మించె విశ్వసహుండన; అతఁడు కనియె ఖట్వాంగరాజు;
దీప్యత్ప్రభావుండు దీర్ఘబాహుఁడు వాని, పుత్త్రకుండయ్యె ఆభూమిజాని.

గీ. రహినిగాంచె దిలీపుని; రఘుమహా ప్రభుండు వానిసుతుండయి పొలుపుగాంచె;
తత్సుతుఁడజుండు; వానికి దశరథుండు; దశరథునకు శ్రీరాముఁడు తనయుఁడయ్యె.

ఉ. ఎవ్వని దివ్యనామముల నెంతయు యోగులు జ్ఞాననిష్ఠచే
మవ్వపు భక్తియుక్తిఁ బరమాత్ముని వంచు నెఱుంగనేర్తురో
అవ్వరమూర్తి రాఘవుని అచ్యుతు, దివ్యపదాధినాథుగా
జవ్వని! చక్కగా నెఱిగి చాల పవిత్రవుగమ్ము ధన్యవై.

గీ. విష్ణుఁడాదిగ శ్రీరామ పృథ్వినాథు, వఱకుఁగల్గిన రాజుల నఱువదియు నొ
కండు రవివంశజులనీకు నింపు వేడ్క, వివరముగ చెప్పినాఁడ శాంభవి! భవాని!

గీ. రామచంద్రుని తరువాత భూమిపైన, సూర్యవంశపురాజులు సారిది నఱువ
దియునొకం డుద్భవించిరి దివుటమీఱ, నడుమ శ్రీరామచంద్రుఁ డున్నాఁడు విభుత!

ఉ. అమ్మహనీయ సచ్చరిత మచ్చుపడన్ వివరింతు నీకు; చో
ద్యమ్ములు రాము సత్కథలు, తప్పక సంగ్రహరీతిగా రహ
స్యమ్ములనెల్ల డాపక ప్రశంసయొనర్తు జగన్నుతంబుగా
ఇమ్మహి రాము సత్కథకు ఈడగు సత్కథ వేరయున్నదే?

వ. అని వెండియు నిట్లని చెప్పఁదొడంగె.

## కౌసల్యా పరిణయము

మ. బలవంతుండు, ప్రసిద్ధుఁ డాఢ్యుఁడు జగద్భద్రైకకీర్తి ప్రభా
విలసత్తేజుఁడు, ముఖ్యుఁ డర్యమజగద్విఖ్యాతవంశాబ్ధి భ
వ్యలసత్పూర్ణ శశాంకుఁడుత్తముఁ డయోధ్యానాథుఁడై యొప్పె ని
శ్చల సద్రాజ్యవిభాసియై దశరథక్ష్మాజాని విజ్ఞానియై.

గీ. ఏలు నతఁడు జంబూద్వీపమెల్ల నొకఁడె, విమల సరయూనదీతీర విలసితమయి
తగు నయోధ్యాపురము రాజధానిగాగ, విపులసైన్యసమేతుఁడై విభవమొప్ప.

గీ. ఆ యయోధ్యాసమీపమునందు గల్గు, కోసలానగరమునేలు కోవిదుండు
కోసలుఁడు పుణ్యమతి; వాని కూర్మిపుత్రి, యైన కౌసల్యకలదు కన్యాలలామ.

క. ఆ కన్యక నీ దశరథ, భూకాంతునికిచ్చి పెండ్లిపొలుపుగఁ జేయన్
శ్రీ కోసలాధిపతి యా, సాకేతపురంబునకు స్వజనములఁ బంపెన్.

ఆ. పెండ్లినిశ్చయించి ప్రియమగు లగ్నంబు, పెట్టుకొనెడితలఁపు పెల్లుగలుగ
బంధు మిత్ర ముఖ్యపరివారములఁబంపె, కోసలుండు ముదముకొనలుసాగ.

వ. అట్టి సంతోష సమయంబున.

క. సరయూనదిలో దశరథ, ధరణీశుఁడు బాంధవులును తన మంత్రులు రా
సరసజలక్రీడల నొగి, జరిపెను నావపయి మోదసంపద పొదలన్.

గీ. వారనారుల నృత్యముల్ వరుసమీఱ, వందిమాగధుల్ పొగడఁగా వైభవమున
హాస్యగాయకబృందముల్ హాయిగూర్ప, దశరథుఁడు జలక్రీడలఁ దనియుచుండె.

## రావణుఁడు బ్రహ్మవలన తన మరణమునుగుఱించి ప్రశ్నించుట

క. ఆ కాలమ్మున లంకన్, భీకరుఁడగు రావణుండు పృథులబలుండై
నాకు మరణమెటు గల్గునొ? నా కెఱిగింపుమ యటన్న నవ్వి యజుఁ డనున్.

క. దశరథునకు, కౌసల్యకు, విశదముగా రామచంద్రవిభుఁ డుద్భవమై
యశమొప్ప నిన్నుఁ జంపును, దశరథునకు నలుగు రగుచు తా హరి పుట్టున్.

క. ఆ కౌసల్యకు దశరథ, భూకాంతుని కింక పెండ్లిపొసగ నయిదు నా
ళ్ళే కలదు, నీకు మృత్యువు, చేకుఱు నిటులనుచు బ్రహ్మచెప్పెన్ పెలుచన్.

చ. అది విని రావణుండు హృదయంబున బెగ్గిలి తత్క్షణంబె నే
నిదె యిపుడేగి బ్రహ్మపలు కియ్యెడ దబ్బరగా నొనర్తు నం
చదటున పుష్పకంబుపయి ఆ సరయూనది కేగి నావపై
ముదముననున్న బాంధవ సముజ్జ్వలు, కోపపరీతచిత్తుఁడై.

## కౌసల్యాపరిణయవిఘ్నముచేయ రావణప్రయత్నము

చ. కనుఁగొని యొక్క పెట్టున సుఖమ్మగు వేడ్క జలమ్మునందు క్రీ
డను పొనరించు భూభుజు గడానికలమ్మును నీటముంచె మిం
చిన ఘనపౌరుషమ్మున; నశించిరి తజ్జలమధ్యమందు త
జ్జనపతి బంధుమిత్రులు నిశాముఖమంద చికాకునందుచున్.

గీ దశరథుఁడును సుమంత్రుఁడు దైవవశత, నమల సరయూనదీప్రవాహమునఁబోయి
గంగలోఁబడి అటనుండి గడచి తుదిని, కాంచి రొక చిన్నదీవి సాగరమునందు.

క. ఆ రావణుండు కోసల, చేరి అనిన్ దానిరాజు చెనకి గెలిచి అ
న్నారీమణిఁ కౌసల్యన్, తా రయమున పుష్పకమున తార్చి, కడంకన్.

ఉ. లంకకు చేరఁబోవుచు కళంకమునొందిన డెండమందు తా
శంక వహించి, వేల్పులు మృషాకలితాత్ములు కన్య నెట్టులో
చంకను బెట్టుకొంచు చనజాలుదు రీ పెను లంకనుంచినన్
ఇంక మఱేడ నీ సతి నికెట్టుల భద్రముసేయువాఁడనో?

మ. అనుచున్ యోచనసేయుచుండఁగనె నెయ్యంబొప్ప నా సంద్రమం
ద నివాసంబొనరించు దీర్ఘమగు మత్స్యాధీశుఁ డుల్లాసియై
కనుపింపన్, కని మంచితావనుచు నా కన్యాలలామంబు నొ
క్క నిగూఢంబగు పెట్టెలోనిడి యహంకారంబు దీపింపగన్.

క. ఓ మత్స్యరాజ! ఇపు డీ, శ్రీమించెడు పేటికను వసింపగ నిమ్మా
నీ మా నెయ్యపు పేర్మిని, మేము దీని నడుగుదాక మీవుల పొదముగన్.

మ. అని మత్స్యేంద్రున కొప్పగించి పరమంబౌ మోదముంబొంది, రా
వణుఁడేఁ పారఁగ లంకఁ జేరె సుఖియై; మత్స్యేంద్రుఁడున్ పేటికన్
తన నోటంగొని, స్వేచ్ఛగా తిరుగుచున్ తచ్ఛత్రుసంహార బు
ద్ధిని, తత్పేటిక నొక్క ద్వీపమున నెంతే దాఁచి పోరాడఁగన్.

గీ. విధివశమ్మునఁ జేరిరా ద్వీపమునకె, దశరథుఁడును సుమంత్రుఁడు తత్క్షణమున
వారు తీరమ్ముఁ జేరి, యింపారుచున్న, పేటికారాజమునుగాంచి ప్రీతిమీఱ.

వ. దశరథుండు తదీయ నవరత్నఖచితమ్మగు స్వర్ణపేటికం బ్రియమ్ముమెయి డగ్గరి.

గీ. తెఱచి యచ్చెరువున నందు తెఱవఁ గాంచి, పరగనన్యోన్యవార్తల వరుసనెఱిఁగి
చెలఁగి గాంధర్వవిధి నామెచేఁబట్టు, నంతలో మత్స్యమునుజూచి యధికభీతి.

వ. దశరథ కౌసల్యలును సుమంత్రుఁడు నాపేటికం బ్రవేశించి, లోన బంధించుకొనిరి; అంత నమ్మీటిమీను తన శత్రువుం బరిమార్చినదై మగిడి యరుదెంచి, - యథాప్రకారమ్మున నా పేటికం దన విశాల ముఖాంతర్భాగంబునం బదిలపరచి సంచరించుచున్నంత.

## రావణుఁడు బ్రహ్మను పరిహసింపజూచుట

గీ. తన సభాభవనంబున దర్పమొప్ప, మంత్రిపౌరోహితులుగొల్వ మందబుద్ధి
రావణుఁడు బ్రహ్మదేవుని రాబనిచి వి, ధీ! బళీ నీదుపల్కులే తెఱ్ఱగావె?

క. నీటం దశరథుఁజంపితి; నేటుగఁ కౌసల్య నొక్కనెలవున మీవుల్
వాటముగ దాఁచితిని; నీ, మాటలు పొల్లయ్యె; వేయిమాట లిఁకేలా?

చ. అని సభలోన నవ్విన మహామతియైన విరించి యిట్లనున్
ఘనతర భీషణధ్వనుల గమ్మున, ఎంతవివేకశాలివో
చనవున రావణా! కడు ప్రసంగము చేసెదవేల? నేను తె
ల్పిన వరదంపతుల్ ముదముమీఱ వివాహమునాడి రిష్టులై.

## విధితప్పదని బ్రహ్మ రావణున కుపదేశించుట

క. నావ్రాలు తప్పిపోవునె?, నావ్రాలున్ తప్పఁజేయ నాచేఁగాదే!
నావ్రాలు తప్పఁజేసితె?, తీవ్రపడన్ తగునె? విధిని తెలియఁ డెవండున్.

సీ. అని పల్క రావణుం డత్యంతముగమండి, పడి వేగవంతుల వడిగఁ బిలిచి
తత్క్షణంబున ప్రమత్తతలేక ఆ లవ, ణోదధి మత్స్యేంద్రు నొయ్యఁ జేరి
యే నా జలచరేశు నెలమి దాఁచగఁబంచి, యిచ్చిన పేటికం దెచ్చి యిపుడ
నా సన్నిధినియుంచుఁడో సేవకాగ్రణు, లార! యీ బ్రహ్మ కగౌరవముగ

గీ. ననుచు నాజ్ఞాపనముసేయ నంతలోన, వారు చనివచ్చి పేటిక వడిగ రావ
ణేశ్వరుని సన్నిధినెయుంచ నెంచరాని, గర్వమున నాతఁ డా పెట్టెఁ గదిసి తెఱచె.

చ. అరుదుగ దానిలో దశరథావనిపాలుఁడు మంత్రి కోసలే
శ్వర దుహితృప్రయుక్తముగ చప్పున కానగరాగ రావణుం
డురవడి వారిఁజంపగ మహోగ్రాద్ధతఖడ్గము చేతఁబూన నం
బురుహాభవుండు పల్కె; అయిపోయినదానికి అల్గనేటికిన్.

శా. ఏ కాలమ్మున కేది కావలయునో! ఏ కర్మ మెట్లున్నదో!
ఆ కాలమ్మున కద్దికావలెఁజుమా! ఆ కర్మ మట్లేయగున్
ఈ కౌసల్య నొకర్తెనే అపుడు నీ వీ పెట్టెలోనుంపగా
ఏ కౌశల్యముచేత వీ రిరువు రిందే చేరిరో యెంచుమా.

ఉ. ఇప్పుడు నీవు సాహసము నేమియు చేయుట పాడిగాదు, నే
నొప్పుగఁ బల్కువాక్యముల నొయ్యన బుద్ధినెఱుంగుమా; జగం
బుప్పతిలున్ వికారములనూని యొనర్చిన వీరిఁజంపినన్
కుప్పలుతెప్పలై జనులు కోట్లుగఁ బుట్టుదు రిద్ది మానుమా.

ఉ. రాముని చేత నీకు మృతి వ్రాసియెయుండఁగ తప్పిపోవునే?
గోమున నిప్డు వీరలను గూల్పగఁ జూచెదవేని యిప్పుడే
రాముఁడు పుట్టి, నిన్ను సుకరంబుగఁ గూల్చునో యేమొ! నీకు నీ
వే మునుమున్ను నీ మృతికి పెంపరలాడుట వెఱ్ఱికాదొకో?

క. వీరల కాయుర్బలము ల, వారితముగనుండ చంపువాఁడున్నాఁడే?
వీరల సాకేతపురికి, గారవమునఁబంపి సుఖము గాంచుము వేగన్.

క. నమ్ముమము; నామాటలు స, త్యమ్ము; దురవగాహమైన ధర్మము కర్మం
బిమ్మహి, విధివచనమ్ములు, వమ్మగునే? యెందు నవి యవారితములగున్.

క. అని చెప్పిన విధివచనము,లను విని రావణుఁడు భీతిలక్షణయుతుఁడై
తనభటులఁ బిలిచి యాపె, ట్టెను సాకేతపురి కప్పుడే పంపించెన్.

వ. అంత నచట నయోధ్యాపురంబున.

గీ. రాజదర్శన మతుల హర్షమ్ముగూర్చె, కోసలాధిపునకు నటకోవిదులకు;
ఆ యయోధ్యఁ గోసలమున నర్హమతులు, మిపుల నుత్సవములచేసి మించిరెలమి.

ఉ. తుల్యతలేని సంపదలతోడుత కోసలరాజు వెండి కౌ
సల్యను రాజ్యమున్ పృథివిజాని కొసంగి విలాసమొప్ప సా
ఫల్యము నొందె జన్మమని పల్మరు సంతసమందె; వానితో
తుల్యులు ధన్యులెవ్వ్యరిల దోపరు మూఁడుజగంబులందునన్.

గీ. నాఁడుగా కోసలేంద్రు లైనారు సూర్య, వంశసంజాతులైన భూవరులు ఘనులు
ఆవెనుక సుమిత్రను పెండ్లియాడె, నృపుఁడు, మగధరా జతివైభవంబుగ నొసంగ.

### దశరథుఁడు కౌసల్యాది ౭౦౦ మంది పత్నులను పెండ్లాడుట

క. కేకయ నృపపుత్రికయగు, కైకేయిని, కమలనేత్రిఁ గైకొనియెను మూఁ
డో కాంతగ నత్యాదర, ప్రాకృతప్రేమావిలాస భాగ్యమువలనన్.

సీ. ఇ ట్లేడువందల యెలనాగ మిన్నల, నరపతి పెండ్లాడి నవ్యములగు
అఖిల భోగములతో అఖిలదానములతో, పాలించె ఆభూమిపాలుఁ డయుత
సంవత్సరంబులు సంతానహీనుఁడై, ముదుసలి యయ్యె సమ్మోదములేక
యి ట్లయోధ్యాపురి నీ స్థితి దశరథుఁ, డుండగా స్వర్గంబునుండి సురలు

గీ. దేవదానవులకు యుద్ధ మావహిల్ల, దశరథుం డున్నచోట సత్యంబు జయ మ
టంచు విని వాయుదేవుని బంచి రపుడు, దశరథుని తేర మివ్వులఁ బ్రార్థనము చేసి.

### దేవదానవయుద్ధమున దశరథునకు కైకేయిచేసిన విచిత్రసహాయము

గీ. వాయుదేవునితోడ అప్పృథ్విభువరేణ్యుఁ, డసురసంహారణార్థమై యరిగె దివికి;
అచ్చట మహాహావంబెంతొఁ పెచ్చుపెరిగె; అట్టి సంరంభమున పృథివ్యధిపుఁ డపుడు.

చ. తన రథమధ్యమం దిరుసు తాళగలేక విభిన్నమైనఁ తాఁ
గనుఁగొనఁడయ్యె అట్టియెడఁ కాంతుని చెంగటనున్న కైక తాఁ
గని తన వామహస్తమును గ్రక్కున నక్షముఁగాగ పట్టి చ
య్యన రథ మెప్పటట్లు చన ఆహవభంగము మాన్చె తేనికిన్.

క. జనపతి రాక్షససైన్య, మ్మును సాంతముగా నడంచి మురిపముతోడన్
తన భార్యఁగాంచి యిట్లను, వనితా ! నిన్నెంతొ. మెచ్చవచ్చును గాదే ?

క. రథమేడ ? నీదుహస్త, ప్రథయేడ ? భరించె యిరుసు వంటిదిగా ఈ
కథ యద్భుతావహము, దశ,రథుఁ డీ యుద్ధమున నీదుప్రాపున గెలిచెన్.

మ. అనినం బార్వతి యప్పు డి ట్లను మహేశా ! కోమలంబైన చే
తిని యక్కైక రథాక్షమ శ్లెటుల సంధించెన్ మహాశ్చర్యమం
చేనినన్ శంకరుఁ డిట్లు పల్కె రమణీ ! ఆ చంద మేఁ దెల్పెదన్
వినుమా ! కేకయుఁజూడ నొక్కముని తా విచ్చేసి యందుండగన్.

అ. కైక బాల్యచపలకారణంబునఁజేసి, మానివదనమందు మచ్చగాంచి
దుష్టబుద్ధిజేసి తులువతనము మీఱ, ముఖమునిండ మసినిఁబూసి వదలె.

గీ. నిదురలేవఁగనే మానియెదుట నిల్చి, వామభుజమెత్తి అతనికి వంగి మ్రొక్కఁ
నాతి! నీచేయి వజ్రముభాతి నాశ, రహితమై యొప్పుననుచు వరంబొసంగె.

శా. అంతన్ పక్కన నవ్వె కైక, యిదియేమా? యంచు విప్రుండు వి
భ్రాంతింజెంది, నిజం బెఱింగికొని; ఔరా? నీకు మాతోడనా
యింతల్ వింతలు పంతముల్, తెలియవో యేమో? మునిబ్రాహ్మణ
స్వాంతప్రస్ఫుట ఘోరకోపమహితప్రారబ్ధ చిత్రవ్యథల్.

## కైకకు శాపము

గీ. నా ముఖమునకు మసిపూసినావుగాన, నీ ముఖము చూడకుందురు నిఖలజనులు
ఘోరమగు అపవాదంబుగూడు కతన, కైక! దుష్టత్వమెప్పుడున్ కలసిరాదు.

చ. అని శపియించె మౌని అటులాతని సద్వరహస్తమాట చే
తనె అటు కైక చయ్యన రథంబును ప్రోవఁగఁగల్గె; అద్దిగాం
చిన నరనాథుఁ డద్భుతముఁజెంది సఖీమణి! నీవు నేఁడు కో
రిన వరమిత్తు నన్న, అలరెన్ సతి నాథుఁడు తన్ను మెచ్చినన్.

గీ. నాథ! రెండువరంబులు నాకువలయు; కాని నేఁ గోరినప్పుడు వాని నిమ్ము;
కొదువలేదిప్పు డింత మీ కూర్మికతన, రమ్యగుణసాంద్ర దశరథరాజచంద్ర.

వ. అని వేడిన కైకమాటలకలరి దశరథుఁడు వల్లెయని సతీయుతుండై విజయలఁ
సమేతుండై సురలవలన అసామాన్యంబులగు మన్ననలం జెంది నిజనగరంబునకు
చనియె, అంత.

## దశరథునికి శ్రవణ వధచే శాపమువచ్చుట

చ. మఱియొకనాఁడు భూమిపతి మధ్యమరాత్రిని వారి బంధనన్
గుఱిగొని పెక్కుజంతువులఁగూల్చె మహామృగయుండు గావునన్
గరిమను దైవయోగమున కాశికి నేగెడు వైశ్యుఁ డొక్కఁ డి
ద్దఱఁ తన తల్లిదండ్రుల, ముదంబునఁ గావడినుంచి మోయుచున్.

చ. అలసటఁజెంది డప్పిగొనినట్టి కడున్ ముదుసళ్ల మంచినీ
ళులఁ పరితృప్తిసేయు పనిలోఁగొని వేసారకాయబుఱ్ఱ నీ
రులనోఁగి ముంచినన్ సరిగ రూఢి యొనర్పకె, యేనుఁగన్న జా
డ లెసగ, రా జొగిన్; బుడబుడధ్వనికై శరమేసినంతటన్.

ఉ. హా! యెవఁడో ననుం దునిమె; అయ్యయొ! వృద్ధులు గ్రుడ్డులైన పెన్
ప్రాయపు తల్లిదండ్రుల కెవండిఁక దిక్కు? దగన్ తపించు వా
రీయెడ దాహశాంతి గనుటెట్లని యార్చిన గుండె జల్లనన్
తోయములున్న చక్కిని మృతుండగుచుండిన బాలునిన్ గనెన్,

మ. కని చింతించి, తదీయబాణమును వేగన్ దీసినన్, వాఁడు చ
చ్చె! నితాంతంబగు దాహ మేఁచ, సుతుఁ డిచ్చే నీటిచేఁ దృప్తియా
నని యోజించుచునున్న వృద్ధులకు దాహంబార్చ భూమీశుఁడుం
గొని యేగెన్; సొరకాయలో జలము, సంక్షోభాత్ముఁడై, ఖిన్నుఁడై.

గీ. కాళ్ళచప్పుడు విని, "మంచినీళ్ళు తెచ్చి, నావె? నాతండ్రి"యని పుత్రభావ మొప్పఁ
పల్కరించిన వృద్ధులఁ పుల్కరించు, మేనితో దశరథుఁడు సంభీతిఁ బలికె.

శా. అయ్యా! దప్పికదీర్చుకొండు, సురవంద్య శ్రీప్రభావాఢ్యుఁడున్
నెయ్యుండౌ తమ పుత్రుఁగూర్చి పిదపన్ నేఁదెల్పెదన్; నీరముల్
చయ్యన్ ద్రావుఁడు, కొండు; తెచ్చితిననన్ జాగేమియున్ లేక, ఓ
అయ్యా! ఎవ్వఁడ వీవు? మా సుతుని నొయ్యన్ దెల్ప జాగేటికిన్.

క. నీమాటల నశ్లీలం, బేమో ధ్వనిపెట్టు, తెలుపు మేమయ్యె? సుతుం
డీ మాగతిఁ గలదే? యిఁక, మా ముద్దు సుతుండు మమ్ము మహి వీడినచోన్.

గీ. మా కుమారుని వేగమే మాకు తెల్పు, మయ్య! దాహముగొన నొప్పదయ్య! మనసు
నీరు గొనితేరచనిన కుమారుఁ డేల, రాఁడు? నీరము తెచ్చు టిదేడ నీవు?

మ. అన నిర్భాగ్యుఁడ! ద్రోహకర్ముఁడ! మహానర్థంబు నేఁ జేసితిన్
నను దుర్మార్గునిఁ గ్రూరచిత్తు నిపుడే నాశంబుగా శాప మి
చ్చి, త్వరన్ చంపుఁడు; వారి బంధమున గాసింబెట్టి వన్యంబులౌ
ఘనజంతువ్రజహారినై, గజమంచుంగా నెంచి మీ పుత్రునిన్.

గీ. బుడబుడ ధ్వని సొరకాయ, బుఱ్ఱవలన, విని, గజం బిదియని నేన వేసినాఁడ
శబ్దభేదిని; తెలియక సలిపిన పని, ముప్పు తెచ్చితి; నను క్షమింపుఁడు మహాత్మ.

క. అనినన్ హా పుత్రక! యని, ఘనతర దుఃఖాబ్ధి మునిగి కడఁగి దశరథుం
గని నీవు మావలెనె చ, య్యన చత్తువుగాతఁ పుత్రకా! యని వ్యధచేన్.

క. అని పుత్రుతోడఁ జితి పే, ర్చను దశరథుఁబల్కి, దానఁబడి దగ్ధంబై
చని రా వృద్ధులు; రాజున్, కనె దుఃఖముతోడ తోప.గరిమము కొంతన్.

గీ. పుత్రకులులేని నాకెట్లు పుత్రశోక, మొదవు? ఈతని పల్కులే విదితములయి
నిజమె యైనచో, నాకు ఆత్మజులు కలుగ,వలయు,అదినాకు ముదమె కావలయుఁగాదె?

ఉ. చచ్చెదఁగాక; వృద్ధులు నిజంబుగ చచ్చినత్రోవఁ పుత్రులే
చెచ్చెర్కఁ పుట్టినన్ ముదము చెందెద; నాకిది శాపమెట్లగున్?
మెచ్చుగుణంబులున్న వరమే! ఇది; పోయి వశిష్ఠుతోడ నీ
ముచ్చట చెప్పవాఁడ; మునిముఖ్యుఁడు తెల్పును దీనిచందముల్.

చ. అని కడుసంభ్రమమ్మున రయంబునచేరె నయోధ్యకున్; వశి
ష్ఠునికి యథార్థ సంభవిత సూక్తులనెల్ల నెఱుంగఁజెప్పె; ఆ
యన నియమింప పాపపరిహారముగా, ఒక అశ్వమేధమున్
పొనరిచె; తా నయోధ్యకడ, పొల్పగు ఆ సరయూతటంబునన్.

## రోమపాదుని చరిత్రము

క. ఇది యిటులుండగ, దశరథుఁ, డదివఱకే రోమపాదుఁడను మిత్రునకున్
ముదితహృదయమునఁ గూతున్, మదిరాక్షిన్ శాంత నిచ్చె మఱిపెంచుకొనన్.

సీ. రోమపాదుండేలుభూమి ననావృష్టి, బాధ కల్గంగ విభాండకాత్మ
జుండు ఋశ్యశృంగుఁ డుండు వనంబున, కంపించెఁదేర వారాంగనలను
వారలు సంగీత వాద్య నాట్యములచే, విభ్రమాలింగనావిష్టుఁజేసి
ఆ విభాండకసుతు నట్టె మోహింపించి, మచ్చికతో వెంటతెచ్చిరపుడు.

ఆ. రోమపాదున కంతఁ పుత్రులు కలిగిరి, రాష్ట్రమత్యంతసంపద్విరాజమయ్యె;
కఱవులేదయ్యె కఱవులే కఱవులయ్యె, ఋశ్యశృంగుఁ డానాటఁ తా నెలమి నుంట.

క. అని పెద్దలచే విని అ, జ్జనపతి ఆ ఋష్యశృంగు సాకేతపురం
బునకుఁ బిలిపింప, అత డింద్రునిచే ఒక యాగమును నిరూపించె వెసన్.

.. పాయసముతోడఁ పొడసూపెఁ పావకుండు, యజ్ఞకుండమునుండి ప్రత్యక్షమగుచు
రాజునకు పరమాన్నంబు రమణనొసఁగె, పడఁతులకు దశరథుఁడది పంచియిచ్చె.

. కైకేయి నిజదౌష్ట్యగరిమ గృధ్రీశాప, మోచకంబుగఁ బొఱవైచె దాని;
అది యేలనిన, దివి నచ్చరయొకతె, సు, వర్చలానామక బ్రహ్మచేత
నాట్యభంగమువలనన్ మహాశాపంబు, నొంది గృద్ధ్రై భూమినుండె జడత;
నా లేమ శాపమ్ము దూలుపెట్లని వెంట,నే మ్రొక్కి ప్రార్థింపఁ తెలిపె బ్రహ్మ;
ఎపుడు కైకేయి పాయస మేపుమీఱ, అంజనాద్రినిఁ బడవేయు నపుడు నీకు
మఱల గతిగల్గు; అపుడ అప్సరసవగుదు, వనుచు వరమిచ్చె అవ్వేధ కనికరమున.
ఆ పాయసమును కైకే,యీ పాటలగంధి విసర నిలపై గృధ్ర
వ్యాపారమైన తత్సతి, యేపున నప్సరసయై యథేచ్ఛన్ చనియెన్.
అంతట తక్కిన ఇరువురు, కాంతలు తమ పాయసముల కైకకు చెరి కా
సంత యిడి, రపుడు తత్సతు, లంతర్గర్భములుఁ దాల్చి రాహ్లాదమునన్.

## కౌసల్యా కైకేయీ సుమిత్రా గర్భధారణము

వేవిళులు వారలకు కల్గె భావిపుత్ర, భవ్యసత్కథలో యన భామలకును;
వేవిళులచేతనే కదా వేత్తలెఱుగ, నేరుతురు భావిపుత్రుల నేర్పులెల్ల.

క. అని వచియించిన శంకరుఁ, గని పార్వతి ఓమహాత్మ! కమనీయంబై
వినుతిఁగను రాము సత్కథ, వినవిన మనసెల్ల దాని విసఁగోరు నొగిన్.

వ. అవ్వలి కథావృత్తాంతంబెట్లయ్యె? నని పార్వతి యడుగుటయు అప్పరమేశ్వరుం డిట్లనియె.

# ద్వితీయసర్గము

## శ్రీవిష్ణ్వాజ్ఞచే సురలు భూమి నవతరించుట

గీ. ఈ నడుమ భూమిసతి రావణేశ్వరాది, ప్రబలరాక్షస పీడలఁ పడఁగలేక
బ్రహ్మదేవుని ప్రార్థింప పద్మభవుఁడు, శ్రీమహావిష్ణుఁగూర్చి ప్రార్థించెనపుడు.

శా. శ్రీవిష్ణుం డశరీరవాణి ముఖుఁడై చెప్పెన్; ప్రపంచంబునం
దావిర్భావమునందు దేను; కపి జన్మావిష్కృతిన్ భూమిపై
దేవానీకములెల్లఁ పుట్టుఁ; డట ముందే దుందుభీనామకన్
దేవన్ మంథరగాఁగ పంపుఁడు మునిశ్రేయంబుగన్ శీఘ్రమే.

క. గంధర్వస్త్రీ యగు నా, మంథర నే రాజ్యకార్యమతిఁగాకుండన్
బంధురమగు మీకోర్కి, వసుంధర సాగించునట్లు సొరిది నొనరుచున్.

గీ. రాజ్యవిఘ్నంబు సేయుత రమణి, పిదప, ద్వాపరాంతమునందు గంధర్వయువతి
కంసు సన్నిధిఁ కుబ్జయై కడఁగి నన్నుఁ, గొలచి భక్తిని మోక్షంబు కూర్చుకొనుత.

## శ్రీరామావతారము

క. అని అభయమిచ్చి ఆమోనున శ్రీవిష్ణుండు చైత్ర శుక్ల నవమినాఁ
డనుపమ మధ్యాహ్నంబున, కనుపడెఁ కౌసల్య యెదుటఁ కాన్పుగృహమునన్.

సీ. కరికరంబులఁబోలి కమనీయములగు ఆ,జానుభవ్య చతుర్భుజములవాఁడు
నీలకోమల రమ్య నిర్మలదేహ వి,భ్రాజిత పీతాంబరమ్మువాఁడు
కోటిసూర్యప్రభా ధాటిమించినయట్టి, ముమ్మరమైన తేజమ్మువాఁడు
శంఖంబు చక్రంబు శార్ఙ్గంబు ధరియించి, యింపైన మందస్మితంబువాఁడు.

గీ. పరమకరుణాసముద్రుండు భక్తలోక, పాలకుండు, విభూషిత ఫాలకుండు
బాలకుఁడు గాక తోఁచిన గోలయైన, సాధ్వి కౌసల్య యిట్లను సాధ్వసమున.

ఉ. ఈవు సమస్త లోకముల నింపెసలారగ సృష్టిసేయఁగన్
ప్రోవఁగ సంహరింపఁగఁ ప్రభూ! బహురూపులఁ దోఁచుచుందు వో
దేవ! భవత్కృపాంబువులఁ దేలినఁగాక యెఱుంగవచ్చునే?
నీ వరమాయ; యెంతటి మునిప్రవరాళి కికేను నేర్తునా?

ఉ. నీ మహిమావిశేషముల నేనెఱుఁగన్; భవదీయమైన యా
భీమసుతీక్ష్ణరూపమున భీతిలె నామది; నీవు కోమల
శ్యామల బాలకుండవయి చయ్యన నింపొనరింపుమన్న! నే
మోమును వాచితిన్, సుతులమోమును గాంచుటయందు శ్రీహరీ!

మ. అనినంతన్ క్షణమందె శ్రీహరియు దివ్యంబైన చంద్రాకృతిం
గనుమోముల్, కమలంబులన్ దొరయు అక్షుంబుల్, మహాగ్నిస్ఫుర
ద్ఘనతేజంబును, నీలనీరదనిభాంగంబున్, జగజ్జాల మో
హన సద్రత్నవిభూషణంబులును చెన్నారన్ తగెన్ బాలుఁడై.

## లక్ష్మణ భరత శత్రుఘ్నావతారములు

క. అంతట సుమిత్ర కప్పుడ,నంతుఁడు శేషుండు పుత్రకాకృతి వెలసెన్
మంతుగ శంఖము చక్రము, లంతట కైకేయి కమడలై పుట్టి రిలన్.

గీ. ఇట్లు నలుగురు బాలకుల్ పుట్టిరపుడు, మించు శుభసమయములందు; సంచరించి
రమరులతిమోద మొదవఁ;తూర్యములుమ్రోగె;పుష్పవర్షంబుకురిసె;సొంపుగ పుడమిని.

గీ. జాతకర్మాదులైన సంస్కారసమితి, ఎలమి దశరథుఁ డపుడు చేయించె, గురువు
లౌవశిష్ఠులచేత; యథావిధిగను, ఆ కుమారుల కలఘు సౌఖ్యాకరముగ.

చ. గురుఁడు వశిష్ఠమౌనియును కోసల రాజకుమారి పట్టికిన్
మెఱుఁగుగ రాముఁడంచును సుమిత్ర కుమారుని లక్ష్మణుండు నా
గరిమ విచారణంబుననె కైక కుమారుల ముద్దుకుఱ్ఱలన్
భరతుఁడు శాత్రవఘ్నుఁడన భాసుర నామము లుంచె నిష్ఠుఁడై.

క. నామము లన్వర్థములుగ, శ్రీమహితుండైన యా వశిష్ఠుఁడు పెట్టెన్
రాముఁడు లక్ష్మణుఁడని, భర, తామల శత్రుఘ్ను లనుచు అంచితమతితోన్.

వ. అంత వారలు శుక్లపక్ష క్షపాకరుని చందంబున దినదినప్రవర్ధమానులై.

## శ్రీరామాదుల బాల్యక్రీడలు

సీ. రామునితోడుత సౌమిత్రి, భరతుని, తోడుత నెపుడు శత్రుఘ్నుఁ డుండు
ఆటపాటలలోన ఆహార నిద్రల, నొక్కరి నెడఁబాసి ఒక్కరుండఁ
జాల రా నలువురు; చారురత్న సువర్ణ, కేయూరకటకగ్రైవేయ తార
హారభూషితులయి నేరుపుగా, రావిరేకలు ముఖమున వ్రేలుచుండ

గీ. స్వర్ణనిర్మిత మణిమయ వ్యాఘ్రనఖర, భూషణమ్ము లెడందల వ్రాలయగా గృ
హాంగణమున పారాడుచు అమ్మలకును, తండ్రికిని ముద్దుగూర్చిరా తనయులోలి.

గీ. దశరథుఁడు పొంగ, తల్లులు తమతమ కొమరులను వేడుక మించుచు పొలుపు మిగుల
లలితభూషణములతో నలంకరించి, అధిక మోదాంబునిధి నోలలాడుచుండ్రు.

ఉ. భోజనవేళ రాముఁడు, ప్రభుండగు తండ్రి భుజించుచుండఁగా
తాఁ జని, ఒక్కముద్దగొని తద్గృహమున్విడి పర్వువెట్ట, అ
య్యోజనెఱింగి తల్లి ఘనయోగుల కందని రామచంద్రునిన్
తా జని పట్టనెంచి కలతంగని పట్టఁగలేక డస్సినన్.

ఉ. వేగమెవచ్చి రాముఁడు ప్రవీణత తోఁపగ వారి కొయ్యనన్
తాఁగొని చన్నముద్ద విదితంబుగ నోటనిడన్, మహామిద
శ్రీగని; రిట్లు రాఘవుఁడు క్రీడల, ముద్దులమాటలన్, రణో
ద్యోగములన్, గడంగి; పరితోషముఁగూరిచె పెక్కుభంగులన్.

ఉ. పొంకముమీఱ వారు, కడుపోడిమి వర్ధిలి, వస్త్రభూషణా
లంకృతులై, సభాస్థలి చెలంగు నృపాలుని, సింహపీఠికా
లంకరణంబొనర్చి, సమలంకృత పౌరహృదంతురాళులై;
కొంకరు మంత్రిజాలమునకున్, బహుళాజ్ఞల నిచ్చు పట్టులన్.

క. వచ్చెడు పోయెడువేళల, ముచ్చటగా తండ్రిమ్రోల మ్రొక్కులిడుదు రా .
సచ్చరితులైన బాలకు, లచ్చెరువగు వారిచేష్ట లాలోచింపన్.

## శ్రీరామాదుల కుపనయనములు

మ. ఇటులుండంగ, వశిష్ఠు నాజ్ఞగొని, పృథ్వీశుండు రామాదులన్
వటులన్ చేయఁగ, పంచమాబ్దమున, ఐశ్వర్యంబు మించన్ విశం
కటవృత్తిన్ బహువైభవంబుగ; మహాకళ్యాణమేపార, వి
స్ఫుటలీలన్ నుపనీతులన్ బొనరిచెన్, పుత్రాళి నొక్కుమ్మడిన్.

గీ. బ్రహ్మవర్చస్సు కోరిన, బ్రాహ్మణునకు, పంచమాబ్దంబునందును బలము కోరు
నట్టి క్షత్రియునకు షష్ఠమాబ్దమున, అవశ్య ముపనయంబు పావనమటంచు.

ఆ. వె. అర్థకాంక్షియైన యట్టి వైశ్యునకు అష్టాబ్దముననె ఉపనయనము సలుప;
శాస్త్రమంచు నిట్లు జ్ఞానులచే నిర్ణయింపఁబడియె ఆచరింపబడియె.

క. మంగళమగు సుముహూర్తమునం గురుకులవాసమును పొనర్పగ వటువుల్
పొంగుచు వేదములను వేదాంగములను శాస్త్రముల ప్రియముగ చదివిరొ.

## శ్రీరామాదుల విద్యాభ్యాసములు

చ. అరువదినాల్గువిద్యల ననంతర సూక్ష్మములన్ ముఖోద్గత
స్ఫురణ గ్రహించి; అంతటను పోడిమి మీఱఁగ ఆఱుమాసముల్

జరిగెడులోనె, యాత్రలనుసల్పి; గురూత్తముండౌ వశిష్ఠుతో;
గరిమ ననుజ్ఞనొంది, తమకంబునఁ జేరి రయోధ్య కర్మిలిన్.

క. ఆ రాజపుత్త్రు లటుపయి, గారవమున తండ్రికిన్ నగరజనములకున్
భూరితర మైత్రిపాత్రులు,గా రాణించిరి విశేషగతులన్ సుతులన్.

క. అని వచియించిన శంకరు, గని పార్వతి, యో మహాత్మ! కమనీయంబై
వినుతిగను రాము సత్కథ, వినవిన మనసెపుడు దాని వినఁగోరు నొగిన్.

వ. అవ్వలి కథావృత్తాంతం బెట్లయ్యెనని అడిగిన ఆ పార్వతికి పరమశివుం డిట్లనియె.

# తృతీయ సర్గము

## విశ్వామిత్త్రుఁడు యజ్ఞరక్షణకై రామలక్ష్మణుల పిలచికొనిపోవుట

శా. ఆ మధ్యమ్మున యజ్ఞరక్షణము తా నర్థించి వేంచేసి వి
శ్వామిత్త్రుండు నయోధ్యకున్, దశరథక్ష్మాపాలునిన్ చూచి, శ్రీ
రామున్ లక్ష్మణుఁ గొన్నివాసరములో రాజా! మదీయాశ్రమం
బోమన్ పంపుమటన్న రాజు విని అయ్యో! అంచు తా నిట్లనెన్.

ఉ. మానివరేణ్య! నీ వచనమార్గము వింతగఁ దోఁచె; బాలకుల్
పూనగనేర రస్త్రములు పూనికతో; బెదరింప జంకువా
రా నిను నీదు యజ్ఞమును రాక్షసబాధలనుండి కాచువా
రేను కడంగివచ్చి తమ రేపని చెప్పిన చేసివచ్చెదన్.

క. పసిబాలురు; నేరరు తమ, వసనంబులు కట్టుకొనఁగ; వారిని మీ రిం
పెసలార పంపవలెనని, పసికూనల నడుగ నెట్లు పాల్పడితి? రయో!

క. అని పల్కిన దశరథనృపుఁ, గని మానీంద్రుఁ డను నీవు గాదుగదా! ని
న్నును మించినవారలు వేలును రామునితోడఁ పోరిలో పోలుదురే?

క. నీ వేల? నీదుపుత్త్రుల, వేవేగమ పంపుమిపుడు వేడుకమీఱన్;
కావలసినన్ని శుభములు, నీ వొందుదు వింక; శంక నెడలుము కడఁకన్.

సీ. అనెడు విశ్వామిత్ర మునినాథు పల్కులు, గురుఁడౌ వశిష్ఠుతో కొమరుమిగుల
యోచించి, ఆయన యుచితంబు పంపుమా! అని ఆజ్ఞసేయగాఁ బనిపె సుతుల
రథముపై; తనదు పెన్నిధి పాయుచందాన, దశరథుం డొందెను తత్తరంబు;
ఆ రామలక్ష్మణు లతిసముత్సాహులై, మునినాథు వెన్వెంట చనిరి వేగ

### రామలక్ష్మణులకు విశ్వామిత్రుఁడు శస్త్రాస్త్రరహస్యము లుపదేశించుట

గీ. చెలఁగి సంతుష్టుఁడైన కౌశికుఁడు త్రోవ,లోని కామాశ్రమమున సుస్నానములను
చేసి, చేయించి, వారలఁ జేరఁదీసి, అస్త్రశస్త్రవిద్యలనెల్ల నపుడు నేర్పె.

గీ. ఎంతయో శ్రద్ధగా నా మహేశ్వరి యన, చను సువిద్య విల్విద్దెతో శస్త్రవిద్య
నస్త్రవిద్యను లౌకికంబైన రథ గ,జాశ్వవిద్యను మౌనీంద్రుఁ డమరనేర్పె.

క. బల అతిబల అను విద్యలఁ, చెలఁగెడు నాకలియు దప్పి చెందక మెలఁగన్,
పలుతెఱఁగుల విద్యల ఇ,మ్ములను నుపదేశించె మౌని మోదము మీఱన్.

### తాటకా సంహారము — పూర్వజన్మ వృత్తాంతము

సీ. ఆ రామలక్ష్మణు లారయ సర్వవి,ద్యల నేర్చి య వ్వనతాపసులకు
హితవుగా రాక్షస తతులను చంపిరి; మార్గమధ్యమ్మున మారిఁబోలి
అతిభయంకర మైన ఆ తాటకిని కూల్చె, ఒక్క బాణమున పెంపెక్కి రాముఁ
డది మును పొక అప్సరాంగన; ఒక మునిని, తొందర పెట్ట నమందగతుల

గీ. అతఁడు రాక్షసి వగుమన అయ్యె నల్లె, దాన సుందుని భార్యయై తనరె, అతని
వలన మారీచుని సుబాహు నెలమిఁగాంచె, రామబాణోపహతి పుణ్యధామయయ్యె.

క. రాముని మార్గణహతిచేఁ, కామిని తా దివ్యదేహకలితాత్మకయై
రాముని వినుతించి వెసన్, భామిని దివమునకు చనియెఁ ప్రణతుల నిడుచున్.

శా. అంతన్ రాముఁడు యజ్ఞఘాతుకుని విశ్వామిత్ర దివ్యాశ్రమ
ప్రాంతంబందు సుబాహుఁ చంపి, బల మేపారంగ మారీచునిన్
కాంతారమ్ములు దాఁటి యోజన శతాగ్రంబైన సంద్రంబునన్
భ్రాంతాత్మున్ పడనేసె బాహుబల వీర్యప్రౌఢిమానూనుఁడై.

### శ్రీరాముఁడు రణయజ్ఞమున కారంభించుట

శా. నిర్విఘ్నంబుగ యజ్ఞపూర్తి సలిపెన్ విఖ్యాతిమై మౌని; తా
దోర్వీర్యంబున రాముఁ డా సవనమున్ తోడ్తోన తద్దైత్య దు
ర్గర్వాటోపములెల్ల భిన్నముగ వేడ్కన్ చేసి చాలింపఁ డా
దుర్వారోగ్ర మహాప్రతాపము జగద్దోదూయమానం బగున్.

గీ. జనకరాజమందిరమున జరుగనున్న, వనిత సీతా స్వయంవరంబునకు వెడలె
రామ లక్ష్మణ సహితుఁడై రమణమీఱ, మిథిల కపుడు విశ్వామిత్రుఁ డధిక ప్రీతి.

### అహల్యా శాపవిమోచనము

గీ. దారినే పోవునపుడు తత్పదతలమున, సోఁకినట్టి నల్లనిశిల సుందరాంగి
యై వినుతిసేయఁగాంచినయట్టి రాముఁ, డద్భుతమునంది మౌనీంద్రు నడిగె నిట్లు.

ఆ. ఉన్న ఆలితోనె తన్నులుతినలేక, ఉన్నవాఁడ ఇంక నొక్కఁడైన
నే భరింపఁజాల నీ పదరజమును, కడిగి పిదప భద్రపడుదుఁగాని.

గీ. అని చమత్కారమును భక్తి పెనగొనంగఁ, పల్కఁగా విని నవ్వి రామప్రభుండు
కూర్మితో కాళ్లుకడిగించుకొని రయమున, పడవనెక్కె; ఎక్కిరి సోదరుఁడు మునియును.

## సీతాకళ్యాణ కథనము

శా. గంగన్ దాఁటి మునీంద్రుతో జనకజా కల్యాణ కార్యాంచితో
త్తుంగ శ్రీ సమలంకృతోత్తమ గృహస్తోమావళీ విస్ఫుర
చ్ఛృంగారంబుల జూచుచున్ ముదితులై శ్రీరాముఁడున్ లక్ష్మణుం
డుం గొల్వన్ మిథిలాపురోపవనమున్ జొచ్చెన్ మునీంద్రుం డొగిన్.

క. మునినాథునితో రాముం, డును లక్ష్మణుఁ డరిగి అటఁ గడున్ స్ఫటికశిలా
ఘన నిర్మిత సౌధమ్మునఁ, దనరఁగ సుఖముండి రుచిత ధర్మము పేర్మిన్.

సీ. మేదినీనాథులు మిథిల కాహ్వానింపఁ, బడి యేగి రమితవైభవము లొప్ప;
పిలువకుండినను చారులు చెప్ప విని రావణుండు సేనలతోడ దండువెడలె;
పుత్రవియోగాగ్నిఁ పొక్కుచు పిలిచినన్, రాఁడయ్యె దశరథరాజవరుఁడు;
వచ్చె విశ్వామిత్రుఁ డచ్చటికేగి వారలఁ దోడితేర పోవలయు ననుచు

గీ. జనకుఁ డాప్తులతో పల్కు సమయమునకె, కౌశికునిశిష్యుఁ డొక్కఁ డక్కడకువచ్చి
వందనముగొని, రాజుచే యందికొని రహస్యమున కేగి యిట్లనె నంచితముగ.

క. భూకాంత! కౌశికుఁడు నీ, కేకాంతమునందు నిట్టు లేర్పడఁ బల్కన్
నా కుపదేశించిరిపో, నీకు తగిన యల్లురను వినిశ్చయ పఱచెన్.

గీ. రామలక్ష్మణుల్ దశరథ రాజసుతులు, వచ్చియున్నారు నాతోడ వార లిపుడు
సీత నూర్మిళలను పెండ్లిచేసికొంద్రు! కాన వరపూజచే వారి గారవింపు.

క. నీచే పందెంబిడబడు, నా చాపము త్రుంచివైచు నల రాఘవుఁ డే
మీ చేయజాలక వృథా, చూచెద రొగి రాజు లపుడసూయాపరులై!

గీ. వరవిధాన లాంఛనములఁ వారి నిపుడు, రాజధానిలోనికి నీవు రయముమీఱ
తీసికొనిపొమ్ము; పెఱలకు తెలియనీకు, శివధనుర్భంగమగుదాఁక చెప్పకుమిది.

క. అని యిట్లు పలికి వేగమ, తన గురుసన్నిధికివచ్చె; తగిన విధముగా
జనకుఁ డతిముదముతోఁ జ,య్యన భద్రగజంబులను వరార్థము తెచ్చెన్.

సీ. పట్టణంబెల్ల శోభాయమానంబుగా, తగు నలంకృతులు సేయఁగనొనర్చె;
సేనావృతుండై ధరానాథులను మంత్రులను వెంటనిడుకొని ఘనత భద్ర

గజములన్ తోడ్కొని కడఁగి సుమేధాది, కాంతలు వెంటరాఁగా విశేష
వాద్యమ్ములు మహోత్సవంబుగా మ్రోయ వి,శ్వామిత్రుపాలికిఁ జని జనకుఁడు
గీ. మౌనిపుంగవుఁ బూజించి, మగిడి తెలియ,నట్లుగా వారి వృత్తాంతమడిగి యెఱిఁగి
విధివిధానంబుగా మించు వేడ్క వసన, భూషణాలంకృతులతోడఁ బూజచేసి.

సీ. రామలక్ష్మణుల భద్రగజద్వయిని చామ, రాద్యుపచార సుఖాంచితులుగ
గురుఁడు విశ్వామిత్రుఁగూడి యమ్మిథిలకు, స్తుతులుకాంచుచు వారితోడి తేఁగ
వారాంగనలు నృత్యవైభవంబులు సూప, వందిమాగధులు మిన్నంది పొగడ
అఖిలవాద్యములు శ్రావ్యంబుగ మ్రోయ అ, పణ్యవీథుల రామభద్రుఁ డొప్పె
గీ. లక్ష్మణుఁడును విరాజిల్లె లక్షణముగ, నగర నారీమణులు మహానందమెసఁగ
గోపురాట్టాలకములెక్కి చూపుకొనుచు, ఒకరికొక రిట్లనిరి మోదమొదవ మిగుల.

మ. తగు నీ రాముఁడు సీతకున్; గరిమచేతన్ లక్ష్మణస్వామియున్
తగు నీ యూర్మిళకున్; భువిన్ గలుగునే? దాంపత్య మీ పద్ధతిన్;
నగరీవాసుల మేము ధన్యులము తన్నారీమణుల్ వీరలన్
మగలంగా బడయంగ గల్గునెడ; సామాన్యంబె తద్భాగ్యముల్?

ఉ. చక్కని వారలున్ మిగుల సౌమ్యులు చారువిశాలనేత్రులున్
చిక్కని పెం రురస్థలముచేఁ గడు నొప్పెడువారు, సంపదల్
గ్రక్కెడు మోమువారలు, జగమ్మును మోహము గొల్పఁజాలువా
రిక్కడ వీరిఁగానరె! నరేంద్రుని కన్యలు ధన్య లిమ్మెడన్.

గీ. వారిలో వార లీరీతిఁ బలికికొనుచు, పేర్మిఁ బూలవానలు కురిపించిరపుడు;
రామలక్ష్మణు లివ్వనిరి తద్రామలాడు, కొనెడు శుభవాక్యములు ప్రీతికొనలుసాగ.

ఆ. అంత నచటఁ జేరినట్టి రాజులు వీరి, కిట్టి వైభవంబు లేమి? మనకు
చేయఁబడవదేల? చెనటి యీ జనకుండు, మానభంగమునకె పూనెనిట్లు.

గీ. మనల కవమానమున్ గూర్చె జనకుఁడిపుడు, సీత నీ రామునకెయిచ్చి చేయుపెండ్లి
ఇది స్వయంవరమనిచెప్పె నిదియె మోస,మనెడు రాజుల గుజగుజల్ ముని వినియెను.

ఉ. రాముఁడు లక్ష్మణుండు విని రమ్యగుణాధికులాటచేతనే
యా మునిరాజు నెమ్మొగమునన్ తమచూపులు నిల్పి నవ్వి రు
ద్దాములు కోమలాంగు లతిదర్ప మెలర్పగ; వాద్యఘోషముల్
దీమములై కడున్ జెలగ దివ్యసభాస్థలి డాసి రిమ్ములన్.

• తిన్నగా భద్రగజముల దిగి మునీంద్రు, వెనుక భక్తిమై చనువారిఁ గనినయపుడు
నాగి స్వయంవరసభ తీవి నున్న యపుడు, నూరివారల కయ్యె నేత్రోత్సవంబు.

క. మునిశాలయందు కౌశిక,ముని ముంగల ముదితహృదయములతో రాముం
డును లక్ష్మణుండుఁ గూర్చుం,డను వినయం బొప్ప నంతటన్ జనకుండున్.

సీ. ఏ నూఱు వృషభముల్ పూనిన బండిపై, పూన్చినయట్టి శంభుని ధనుస్సు
తనదు శస్త్రాగారమున నుండి సభకుఁ దేఁ,బంచె; అయ్యది మున్ను పరశురాము
నాజ్ఞపై సీతాస్వయంవరంబునకయి, నిర్ణయింపఁగఁబడె నెమ్మి నెవఁడు
బల సుసంపన్నుఁడై విలు నారిఁకూర్చునో, అతనిఁ బెండ్లాడు నా అనుఁగుపుత్రి

గీ. అనుచు జనకుండు పల్కినాఁ డనిన వినిన, పార్వతియు చంద్రశేఖరా! పరమమైన
నీ ధనుస్సెట్లు జనకునిన్ జేరె ననిన, శాంభవిన్ చూచి పలికె ఆ శంకరుండు.

## హరచాప వృత్తాంతము

గీ. పరశురాముండు నా వద్ద పరఁగ అస్త్ర,విద్య నేర్చినయప్పు డీ విల్లు మెచ్చి
అతని కిచ్చితి; త్రిపురసంహారకంబు, ఈ ధనుస్సును పోల దిం కే ధనుస్సు.

క. తనతండ్రిని హింసించిన, చెనఁటి అయిన కార్తవీర్యుఁ జెండిన దీ విం
టనె, మఱి యిరువదియొకపరి, చెనకి మహీవరచయంబు చెండెను దీనన్.

క. జనకునిగుఱించి మిథిలాం,గణమున పడవేసిపోయె గరిమ నతఁడు; దా
నిని సీత గుఱ్ఱముగఁ జే,కొని బాల్యక్రీడలందు కొనకొని యాడన్.

క. అదికాంచి పరశురాముఁడు, ముదితన్ శక్తిస్వరూపముగ నెఱిఁగి పదిం
బదిగ జనకునకు నీపిల్లది లక్ష్మియ! లాతిగా తలంతువొ యేమో!

గీ. అనుచు బలవంతపెట్టి విల్లును స్వయంవ, రంబునకు పందెముగఁ బెట్టె ప్రౌఢిమీఱ
అనితర సుసాధ్య మీ విల్లు నఱసి రాజు, లందఱును మోము వ్రేల్చిరి డిందువడుచు.

సీ. ఇలమీఁదినుండి విల్లెత్తుటకే అస, మర్థులై కొందఱు మానుకొనిరి;
ఎత్తినవిల్లు తా మెనసి చక్కఁగ నిల్పనేరక కొందఱు నిలిచిచనిరి;
నిల్పఁగా నెత్తగానేఱని విలు నారి, కూర్చుటెట్లని నవ్వుకొనిరి కొంద;
ఱట్టి వింటికి బాణమెట్టుల తొడగనౌ, ననుచు కొందఱు తర్కమును సలిపిరి;

ఆ. తోనక్షర్వగర్వ ధూర్వహుఁడైన రావణుఁడు వింటికడకువచ్చి నగుచు
జనకుతోడ నిట్లు సభలో ప్రసంగంబుచేయ మొదలుపెట్టె జెట్టియగుచు.

ఉ. ఎవ్వనిచేత వజ్రి అమరేశ్వరుఁడున్ కడు భీతినొందునో
ఎవ్వఁడు మూఁడులోకముల నేకముగా స్వవశంబుచేసెనో
ఎవ్వఁడు వెండికొండను వహించెనొ? బాహులమీఁద, అట్టి నా
కివ్విలు గడ్డిపోఁచయని యెట్టులెఱుంగకపోతి వక్కటా.

క. అని చెప్పి రావణుం డా, ధనువు నెడమచేత నెత్తఁదలఁచి కదల్పన్
అణుమాత్రమైన అది కద, లని కతనమున రెండుచేతులన్ కదిపి వేసన్.

చ. కదలకయున్న నివ్వెఱఁగు గాంచి దశాస్యుఁడు క్రమ్మఁజూచు ని
ర్వది ఘనబాహువుల్దనర వాయువులైము బిగించి చాపమున్
కదలిచి, ఒక్కకొమ్ము గడకన్ పయికెత్తి బిరాన నల్లెత్రా
డదటునఁ దీయ వంగి పడె నప్పుడ వి ల్లెదపైఁబడన్ ధరన్!

## స్వయంవరసభలో రావణ పరాభవము

క. క్రిందన్ గిజగిజలాడుచు, వందురుచున్ రావణుఁ డిగునదిబాహువులన్
క్రిందఁబడనొత్తఁజూచిన, సందీయకయున్నఁజూచె సభ్యుల నా ర్తిన్.

ఆ. కచ్చ పీడిపోయె; కనక కిరీటంబు, క్రిందఁబడియె; రాజులంత లొక్క
పెట్టు నవ్విరపుడు; బిట్టు ప్రాణాంతిక, మయ్యె రావణునకు సత్య మకట!

ఆ. కనులు తిరిగె; చొంగకారె మోమున; శరీ, రమ్ము నమఁకె; ముని యెమ్మ
మఱి సభాంగణమున మలమూత్రములు చేసె, రావణుండు ధనువు క్రిందనుండి.

గీ. అతనిమంత్రులు పరివారి మతిరయమున, రాక్షసులు చుట్టుముట్టి, ఆ రావణాస్యు
రుని ధనుర్ముక్తుఁజేయఁగా చనిరిగాని, విల్లు కదలింపలేక నివ్వెఱ్ఱులైరి!

క. జనకుఁడు శంకించుచు ని, ట్లను, భూమినొకండు గల్గఁడా? వీనికి డ
తని ప్రాణముఁ గాపాడఁగ, కనెనా? నిర్వీర్యమన్ జగము బిమ్మొ నిదే.

గీ. ఈ సభామధ్యమునఁ చచ్చు నీదశాస్యుఁ; డెవ్వఁడే వీనిఁ బున్నచో విల్లు క్రిందనుండి
పాచి రక్షింపుఁ డీ పంక్తివదను నిపుడు, రాజులందఱు నిటుల నరాధములని.

క. అను జనకు వాక్యబాణము, మనమున నాటంగ రామమనుజాధిపుఁ డున్
ఘనుఁడగు లక్ష్మణుఁడును మునిఁ, గని రథికక్రుద్ధు లగుచు కనుగొను లపుడు.

సీ. అపుడు విశ్వామిత్రుఁ డనె రఘువీర! లెమ్ము! రావణుఁడు సభామధ్యమున
అంతమాటను చూతువా? లెమ్ము! బ్రతికింపు, మీ రాక్షసుని ధనస్సెత్తి వేగ
మని ఆజ్ఞయిడినంతఁ అతి సత్వరమ్మున, కౌశికునకు నమస్కారము నిడి
హారకిరీటముల్ ధీరత సవరించి, నడుముబిగించి బల్కడిమిఁ వెడలి

గీ. పోవుచున్నట్టి శ్రీరామమూర్తిఁగాంచి, జనులు సభ్యులు నాశ్చర్యచకితులైరి
రాజు లందఱు బాలుఁడౌరా! యితండె, యెత్తునా? చాపమని గేలి సల్పుచుండ

ఉ. ఏ విలు నెత్తఁగన్ మన మహీన పరాక్రమముండియున్ సలు
పే వెనుకాడఁజేసితిమొ! ఏ ధనువెత్తఁగరానిదో! భళీ!

ఆ విలునెత్తఁగన్ చనెడు ఆ పసిబాలుఁడు; పంపు మాని దే
కావరమంచు చెప్పవలెఁ గాని యెఱుంగునె ? బాలు డింతయున్.

సీ. రావణాసురు చూడ రాముఁ డేగెడుఁగాని, అతనిచే నేమగు ననెడి వారు;
పసిబాలుఁ డాటచే బాల్యచేష్టలఁచూపి, ఆడుచున్నాఁడటం చనెడివారు;
అటులైనచో కంఠహారాదులను సవరించునే యని వెక్కిరించువారు;
పగచేత ముని వీనిఁపంపినాఁ డీపని, కని వేడ్క గుసగుసలాడువారు;

గీ. ఇతని పెండ్లిసేయఁగ మదినెంచి మాని, పంపెఁగాక ధనుస్సెడ ? బాలుఁడేడ ?
అనుచు నానావిధములుగా ఆ సభాంత, రాళమున రాజు లనిరి శ్రీరామచంద్ర.

మ. జనకుండున్ మునితోడ ఇట్లనియె; విశ్వామిత్ర మానీంద్ర! ఈ
ఘనులౌ రాజులు, రావణాసురునితో గర్వంబు సర్వంబుఁ పా
సినవా రీ ధనువుం గదల్పఁటనె; మీ శిష్యుండు బాలుండు మో
హనుఁడున్ కోమలుఁ డీ ధనుస్సు నెటు తా నాశించె సంధింపఁగన్?

గీ. కోమలుండైన యీ రాచకుఱ్ఱఁ డేడ ? దుర్ధరంబైన ధనువేడ ? తొడరి యెత్తు
టేడ ? సంధించు టేడ ? ఇ దేడ కేడ ? చాతకపుదప్పికే యింకు సంద్రమున్నె ?

వ. అని జనకుండు సెప్పుచుండ ప్రాసాదంబులపైనున్న సుమేధాదిసుదతు లందఱును
గవాక్షరంధ్రంబులనుండి చూచుచు.

## అంగనలు శ్రీరాముఁడే సీతకు భర్త కావలెనని ప్రార్థించుట

సీ. సర్వాంగసుందరు, సర్వభూషణ భూషి,తాంగు, సుస్నిగ్ధ సర్వావయవుని
అతి సుకుమారు, మహాపూరుష గుణాంకు, అతి మనోహరుని మహానుభావు
నిజకాంతి సామ్రాజ్య నిఖిల సభాంగణ, రాజితచంద్రు శ్రీరామచంద్రు
శివధనురభిముఖు స్త్రీ లందఱున్ కాంచి, ఊర్ధ్వముఖంబుల నుత్సుకలయి

గీ. చేతులెత్తి ప్రేమముతోడ శ్రీమహేశ ! పంకజాసన ! కేశవా ! పాహి ! పాహి !!
ఈతఁడే భర్త యగుఁ గాత సీత కలమి, ఈతనికె సీత పూమాల యిడెడుఁగాత!!!

మ: గతజన్మంబుల మేము సుంతయిన సత్కార్యంబులం జేయుచో
వ్రత దానాదిక ధర్మపుణ్యఫలముల్ రాణించుతన్; తత్ఫల
ప్రతతుల్ శ్రీరఘురామచంద్రునకు తద్భాగ్యంబుచే ఈ ధను
స్సితఁడే పుష్పమువోలె తేలికఁగ తా నెత్తన్ సమర్థుం డగున్.

క. సీతారామ వివాహము, చేతోమోదంబుమీఱ చెలఁగి కనుల్ సం
ప్రీతిన్ చెందుత, మును మున్నాతతముగ నిట్టి సుందరాంగులు గలరే ?

సీ. అని వేఁడుచుండగా నంతలో సీత సాలంకృతఁజేయ విలాసమొప్ప
సౌధమునెక్కి, ఆ సభనున్న శ్రీరామచంద్రుఁగాంచి, యమంద సంభ్రమమున
సఖియైన తులసికై చని దాని మెడఁ తన కరములువైచి సాదరముగ ననె;
జనకుఁ డీ పందెము శత్రుస్వరూపుఁడై, కూరిచె; ఈ సుకుమారుఁడైన

గీ. రాముఁడేడ ? ఈ కోదండరాజమేడ ? ఓ విధీ ! ఇపుడెటు చేయనున్నవాఁడ
వోకదా ! రాముఁ దక్క నన్యులను గోరఁజాల; అనలాంబుపతితనై చత్తుఁగాక.

సీ. ఓ శంకరా ! విధీ ! ఓ పార్వతీదేవి ! సావిత్రి ! ఓ సరస్వతి ! నమోస్తు !
ఓ మహాగాయత్రి ! ఓ సూర్యభగవానుఁడా ! మహేంద్రా ! వరుణా ! నమోస్తు !
ఓ శంకరసఖుండ ! ఓ యమ ! అగ్నిభట్టారకా ! ఓ శేషుఁడా ! నమోస్తు !
ఓ గరుత్మంతుఁడా ! ఓ లక్ష్మి ! ఓ విష్ణుఁడా ! ఓ సుధాకరుఁడా ! నమోస్తు !

గీ. ఓ సమస్త దేవతలార ! దోసిలొగ్గి, మిమ్ము మిగుల ప్రార్థించెద మీరలెల్ల
నన్ను కరుణించి మము వేచుచున్న ధనువు, పుష్పముగఁజేయుఁడీ రామభుజయుగళికి.

క. మీ రందఱు శ్రీరాముని, భూరి భుజంబులను చొచ్చి పూర్తిగ మీ యిం
పారు బలమెల్ల నతనికి, చేరిచి శివుధనువునెత్తు చేవ యొసఁగుఁడీ !

గీ. నేను పదునాలుగేఁడులు నియమమూని, వనములందు వసింతు; ఈ ధనువు రామ
చంద్రుఁ డుక్కున ఎక్కిడఁజాలునేని, వేల్పులార ! సాయపడుఁ డా వీరమణికి.

క. అని వినయాలాపమ్ముల, ఘనులగు దేవతలను వశముఁ గావించుకొనెన్
జనకసుత సీత తన నెమ్మనమున శ్రీరామచంద్రు మగనిగఁ దలఁచెన్.

శా. ప్రాసాదమ్ముననుండి రాజవదనల్ భాషించు సల్లాపముల్
శ్రీ సీతామధురాయమాణ సువచశ్శ్రేష్ఠంబులన్ రాజులెం
తో సంరంభముమీఱఁ పల్కు పలుకుల్ తోన్ మైథిలుండన్న నా
నా సంభాషణముల్ ముదంబుఁ కడిమి న్గల్గింప శ్రీరాముఁడున్.

## శ్రీరాముఁడు శివధనుర్భంగము చేయుట

క. చిఱునవ్వు నవ్వి, చాపము, దరియన్ చని, మ్రొక్కి సంప్రదక్షిణపరుఁడై,
పరశివుని, తల్లిదండ్రులఁ, గురునిఁ తలఁచి, యెడమచేతఁ గొనెఁ చాపమ్మున్.

క. కుడిచేత నారి తాలిచి, తడయక సంధింపఁబోవ తటుకున విఱిగెన్
గడు ప్రాచీనం బగుటనో !, గడితపు శ్రీరామశక్తి కారణముననో !

గీ. హరమహాచాపము విఱిగి సరిగ మూఁడు, తునకలై చన అస్వనమ్మునను మివుల
గగనమున గొప్పధ్వనిగల్గె; జెగడి నీవు, నన్ను నాలింగనము చేసినావు గౌరి !

చ. ధర వడఁకెన్ సముద్రములు తల్లడమందెఁ; గులాచలమ్ములున్
విఱిగిపడెన్; దిశాదశక విస్ఫుట ఘోర మహాధ్వనుల్ చెవిన్
పఱచుచు దిబ్బెడల్ వడెడు భంగినొనర్చెను; తార లూడి వే
గిరమున రాలె, శేషుఁ డొరఁగెన్ ఫణిరాజులు తూల నయ్యెడన్.

చ. పరిమళమొప్ప చల్లని శుభంబగు వాయువు వీచె; మింటిపై
సురతతి వాద్యముల్ మొఱసి చొక్కిరి, పూవులవాన పెల్లుగా
కురిసెను; దేవకన్యకలు గోముగ నాడిరి, దేవతల్ ముదం
బురువుగ పెండ్లిసందడికి ఉబ్బుచు నింగినిఁ జేరి రర్మిలిన్.

ఉ. ఆడిరి పాడి; రిచ్చట సభాంగణమందు విలాసమొప్ప ఇం
పోడఁగ వారకామినులు; హోరున వాద్యరవంబులున్ చెవుల్
గాడెను; వందిసంతతి పొగడ్తలు మీఱె; గవాక్షసంస్థితల్
చేడెలు పూలతోడఁ గయిసేసిరి; రావణుఁ డట్టె లజ్జతోన్.

క. మొగమెత్తలేక, తత్తర, సిగ లెల్ల స్వేద బోడిచెందిన శిరమొ
ప్పఁగ కలఁతనొంది పుట్టము, తగ జాఱన్ వేగ లంకదారిం బట్టెన్.

ఉ. రామునిచేత భగ్నమగు రమ్యధనుస్సునుగాంచి పొంగి, ఆ
రామ లెలుంగులెత్తి, ఇదె రామునికిం జయమంచు కంకణ
శ్రీ మహితధ్వనుల్ చెలఁగ చేతుల చప్పటు లుప్పతిల్లఁగా
శ్యామల కోమలాంగుని ప్రశంస యొనర్చిరి యుత్సుకంబునన్.

శా. సీతాదేవి అమందమౌ ముదమునన్, శ్రీరామునిన్ గాంచెఁ దా
చేతోమోదముతోడ ఱెప్పలిడకే, శ్రీ మైథిలుం డింపుగా
మాతంగంబుపయిన్ సురక్షితముగా మా తల్లి సీతమ్మఁ దే
రే! తాత్పర్యముమీఱ భద్రముగ దోర్వీర ప్రబోధమ్మునన్.

క. అని మంత్రుల కాజ్ఞాపిం,చిన వారటు వెడలి ధన్య! సీతాసతి! నీ
వనితర సులభుండగు పతిఁ, గనినావమ్మా! అదృష్ట ఘనఫలము క్రియన్.

మ. సరసీజాక్షి! ధరిత్రిజాత! సభలో చాపంబు ఖండించి, భా
స్కరవంశాబ్ధి శశాంకుఁడౌ దశరథక్ష్మాపాల పుత్రుం డసుం
దరతా మన్మథుఁ డొప్పె! భద్రకరిఁ భద్రంబొప్పగా నెక్కి వే
గిరమే రమ్మనె నీదుతండ్రి; కడు పొంగెన్ రాము దోశ్శక్తికిన్.

క. లెమ్మా! భద్రగజముపై, రమ్మా! సంతసముమీఱ రాముని వేకై
కొమ్మా! రత్నఖచిత హా,రమ్మా యన మెడనువైచి రామామణిరో!

చ. అని మధురమ్ముగా పలుకు నప్పటి మంత్రుల మంగళప్రద
స్వన మృదుభాషణమ్ములను జానకి కూర్మిని ఆలకించి, త
జ్జననికి మ్రొక్కి నెచ్చెలులు సంతసమొప్పఁగ చుట్టురా ముదం
బున పొలుపారు హేమమయ భూషల దాలిచినట్టి యేన్గుపై.

సీ. ముంగల వివిధ సన్మంగళ వాద్యాళి, కర్ణపర్వంబుగాఁ కలయ మ్రోయు
వెనుకను వాద్యాళి వివిధ మార్గంబులన్, వాయింపఁబడి ఎంతొ హాయిగూర్ప
చిత్ర శిరస్త్రాణ వేత్రహస్తులు నగు, కంచుకుల్ రొద నివారించుచుండ
ముసళిదాదులు శస్త్రములు పైఁడిబెత్తముల్, పట్టి మేల్ గుఱ్ఱాలపైని చనఁగ

గీ. ఆడుచును పాడుచును వారనారులొప్ప, గానములుసేయ నటులు, మాగధులుపొగడ
చెలఁగి సాలంకృతులు వేలకొలదిగాఁగ, పురుషవేషాల తరుణులు తరలిరాఁగ.

గీ. తురగములమీఁద ముఖములు మఱుఁగుచేసి,కొనిన కంచుకీ జనములు కొలిచినడువ
రమణవ్యజనముల్ వింజామరములతోడ, సఖులు సేవింప సీతమ్మ సుఖముమీఱ.

క. తమతమ వాహనములపై, తమతమ సైన్యములతోడ తగుమంత్రు లొగిన్
తమతమ మెలఁకువ లొప్పఁగ, తమతమ దిక్కుల నలజడి దగవారింపన్.

గీ. నగర నారీమణులు తమ నవ్యదివ్య, హర్మ్యములనుండి ముదముమై నవ్యదివ్య
కుసుమముల వాన వెల్లిగా కురియుచుండ, సీతచేరె స్వయంవర శ్రీసదనము.

గీ. దివ్య నవరత్నమాలికన్ సవ్యకోమ,లారుణ కరంబునన్ పట్టి, అవ్యయాత్మ
భవ్య కరుణాకటాక్షశోభావిలాస,కలితు శ్రీరామచంద్రు డగ్గరుచు సీత.

ఉ. ఏనుఁగునుండి డిగ్గి సఖులేపున వెంబడిరాఁగ, కూర్మితో
తా నొక కొంతదవ్వు చని, తన్ను కలంపఁగ లజ్జ వెల్లుగా
పూనికఁ రామసన్నిధికిఁ పోయి వినూతన రత్నహారమున్
వాని మెడన్ వడంకుచును వైచి, మెయిన్ మఱచెన్ ముదంబుమై.

## సీత రామునికంఠమున పూలదండవేసి నమస్కరించుట

గీ. సుముఖియై సీత శ్రీరాముఁ చూచి, లజ్జఁ, తన కరద్వయిఁ హారమున్ తమినివైవ
పులక లుదయించె మేన; రాముని పదద్వ,యికి నమస్కార మిడఁగ జానకి చెమర్చె.

ఆ. మిగులసిగ్గుతోడ మగువ మోమును వాంచి, నిలువ, రాముఁ డపుడు చెలఁగి నూత్న
రత్నహారకాంతి రాజితమూర్తియై, సీతఁ కాంచి ముదము జెంది, సరగ.

గీ. మౌనిపదముల కెలమిఁ నమస్కరింప, కౌశికుఁడు రామచంద్రుని కౌఁగిలించి
చొక్కి తనతొడపైని కూర్చుండఁబెట్టు,కొని, శిరమ్మును చెలిమిఁ మూర్కొనియె నంత,

క. అపు డా జనకుఁడు సీతను, తపసి యొడమతొడను సంస్థితన్ జేయంగా,
ఇపుడు గదా సఫలము నా, తపముఁ జననమనుచు కడు ముదమ్మునఁ దేలెన్.

వ. ఇట్లా మునిచంద్రుఁ డపుడు సీతారాములు తన తొడలపైన న్వెలుంగ పరమానంద భరితుండై ప్రకాశించె. అంత జనకచక్రవర్తియు కడుంగడు నుప్పొంగి ఒడలుమఱచి.

సీ. మీ ప్రసాదముచేత మిథిలాధినాథుండు, ధన్యుఁ డయ్యె! మునీంద్ర మాన్యుఁడయ్యె
కులము కేవలము సఫలమయ్యె; ఇపుడు నా, తలిదండ్రులిమ్ముల ధన్యులైరి
లోకులు గొల్వ త్రిలోక విక్రముఁడు శ్రీ,రామచంద్రున కేను మామ నైతి
పరిపూర్ణ దివ్యసుందరి మోహనాంగి మా, జానకి జన్మంబు సఫలమయ్యె

గీ. అనుచు మునికి నమస్కారమును బొనర్చె; జానకి కటాక్షబాణముల్ చాల నాట
తమ యదృష్టమ్మునుం గూర్చి తలఁచి తలఁచి, వికలులైరి రాజులు లజ్జఁ వెకలులైరి.

గీ. సిగ్గుచే తలవంచి నిశ్చేష్టులైన, రాజులన్ గాంచుచు విదేహ రాజవరుఁడు
మీరలీ వివాహము నెఱవేఱుదాఁక, నన్నుఁ కరుణించియుండినఁ గనెద ముదము.

వ. అని ప్రార్థింప వారు తమలోఁ దాము.

సీ. శ్రీరామునిన్ బోరఁ జెనకుట కిద్ది దు,ష్కాలము జయముగల్గదు మన కిట
చెడ్డముహూర్తాన చెలఁగివచ్చితిమి; యు,ద్ధమునకై తగు ముహూర్తంబునందు
మరల వత్తము; నాఁడు మనకు తప్పక జయం,బయ్యెడు వేగిరం బంద రాదు;
ఎందాఁక రాముని నెలమి జయింపమో, అందాఁక మనకు లే దవిరళసుఖ;

గీ. మిపుడు జనకునితో మన కేల కర్జ, మనుచు జనకుని ప్రార్థన విని యశేష
నరపతులు తలలూపిరి ధరణిపతియు, తగిన విడుదుల వారికింపుగ నొసంగె.

క. మునులకు పూజ్యంబగు చో,టున మునులకు విడిదిఁగూర్చుచున్ విశ్వామి
త్రుని సంప్రేరితుఁడై వెం,టనె దశరథుఁ దోడితెచ్చుటకు మంత్రితతిన్.

## జనకుఁడు వివాహమునకు దశరథాదులను రప్పించుట

మ. పనిచెన్ మైథిలుఁ డెవ్వరెవ్వరికి నేర్పా టెట్లు గావింపఁగాఁ
చనునో వారల కట్లు చేయుచు మహా సంతోష మేపారఁ గాం
చు నయోధ్యాపురి మార్గమున్, దశరథున్ చూడన్ సబంధు ప్రజా
ఘన మంత్రిద్య పురోహితాప్త విలసత్కాంతాయుతున్, వేడ్కగన్.

వ. అట నా జనకరాజ మంత్రులు.

చ. అరిగి అయోధ్యకున్ దశరథావనిపాలుని మ్రోల మ్రొక్కి, చె
చ్చెర నరపాలుఁ డచ్చటి విశేషములన్ విని చిత్తపద్మమున్

విరియ సమస్త బంధుపరివేష్టితుండై చనె మంత్రి ముఖ్య నా
గరికులు వెంబడించి చనంగా మిథిలానగరంబుం చేరంగన్.

క. జనకుండు సముచితమగు రీతిని దశరథు నెదురుకొని పదింబదిగా మ
న్ననలన్ చేయుచు, తగు లాంఛనములం తృప్తిగనె సరస సల్లాపములన్.

గీ. అపుడు జనకుండు దశరథ నృపునివద్ద, నున్న కైకేయి సుతులను కన్నులలరం
గాంచి, రామలక్ష్మణులనే కా తలంచి, మిపుల నాశ్చర్యచకితుండై మించు వేడ్క.

సీ. వింత తోంపంగ రా జనంత సైన్యావళి, మధ్య శ్రీరామ లక్ష్మణులతోడ
నున్న విశ్వామిత్రు మన్నన సంభ్రమా,తిశయంబునన్ కని దశరథుం కడు
వినుతించి, ఆ పిమ్మటను వశిష్టునికి ప్రణామము కావించి రామలక్ష్మ
ణులవలె వెలయు వీర లెవరో తెలుపుమా, అనుచు విశ్వామిత్రు నడుగ, అతండు

గీ. రామునంశ జనించె భరతుండితండు, లక్ష్మణాంశ శత్రుఘ్నుండీ లక్ష్యవేది;
ఈ కుమారు లిర్వురుగూడ కైకసుతులు, పోలికల వీర లొకటియే పోల్ప లేము.

క. అని విశ్వామిత్రుండు పల్కిన జనకుండు సభ్యకోటికిన్ మ్రొక్కి యనున్
ఘనులార! మీరు నా మన,విని విని న న్నాదరింప వేండెద నెలమిన్.

గీ. అనుచు నంజలి ఘటియించు నంతలోన, రామ లక్ష్మణుల్ భక్తిమై రమణమీఱ
తల్లిదండ్రుల కొగి ప్రణమిల్లి వార,లెల్ల ఆశ్లేషములు సేయ అల్లనలరి.

క. ఉన్నంత జనకభూపతి, క్రన్నన దశరథుండు ధరణి కాంతులు మునుల్వన్
మన్ననకాంచగ ఇట్లనె, నెన్నంగారాని ప్రేమ యేర్పడం కడంకన్.

## దశరథుని జనకుండు ప్రార్థించుట

సీ. సీరాగ్ర సంజాతం సీతం అయోనిజం, సరవిమై శ్రీరామచంద్రునకును
నా కౌరసయు శాంత నయగుణ ఊర్మిళం, లక్షణమూర్తియా లక్ష్మణునకు
నా బంధుండగు కుశధ్వజు ముద్దుకూంతును, మాండవి నిచ్చి మీ భరతునకును
మాన్యగుణోపేతం మాండవి చెల్లెలిం, శ్రుతకీర్తి నిచ్చి శత్రుఘ్ననకును

గీ. ఇప్పుడు వివాహము లొనర్ప ఏను తలంతు, పెద్దలౌ వారి యనుమతి పేర్మిగాంచి;
మిమ్ముం ప్రార్థింతు అత్యాదరమ్ముమీఱ, మీర లంగీకరింపుండా గారవమున.

వ. అని విన్నవింప దశరథుండు.

ఆ. జనకచక్రవర్తి తనకుం దా వియ్యంకుండై కుమారులకు సుధాకర ముఖు
లను నొసంగ నొల్లననువాడు గలుగునే, సిరిని కాలద్రోయు చెనంటి గలండె?

చ. అని తన పూర్ణసద్హృదయ మచ్చుపడన్ వచియించి సీతయై
ట్లనితర సాధ్యమైన జని అందగంజాలెను భూమినంచు మిం

చిన ఘనవిస్మయంబు మెయి చిత్తమువిూఱగ ప్రశ్న చేయ, ఆ
జనకపురోహితుండు విలసన్మృదుభాషల వాని కిట్లనున్.

## సీత భూజాతయైన వృత్తాంతము

అమలాత్మ! వినుము పూర్వమున విఖ్యాతుఁడై, పద్మాక్షుఁడను రాజు పరఁగుచుండె
లోకు లెల్లరును లక్ష్మి కామతత్పరు, లైయుంటఁ కనుగొని ఆమె నాత్మ
తనయగాఁ బడయుదునని ఘోరతప మా మ, హాదేవిఁగూర్చి చేయఁగా తొడంగ
శ్రీ మహాలక్ష్మి వచ్చి ప్రసన్నురాలయి, వరము వేఁడుమన, కూఁతురవు కమ్మ;

చాల కాంక్షతో తపమును సల్పినాఁడ, నమ్మ! నా తొడపైని నీ వాటలాడ
చూడఁదలఁచితి నా కోర్కి సొరిదిఁ తీర్పు, మనుచుఁ పల్కిన రాజున కనియె లక్ష్మి.

నేను పరతంత్ర నో రాజ! నీకు పుట్ట, శ్రీ మహావిష్ణుఁ ప్రార్థింపు మా మహాత్ము
నాజ్ఞమై నీకు తప్పక నాత్మజాత, నగుదు ననుచు నంతర్హిత అయ్యె లక్ష్మి.

క. సరి యని అప్పద్మాక్షుఁడు, మరల తపము నాచరించి మా నాథుని స
ద్వరదునిగా చేసికొనన్, సరసిజనాభుం డొగిన్ ప్రసన్నుండైనన్.

నాకు శ్రీ మహాలక్ష్మి! కన్యకగ నిమ్ము, కూఁతురని పేర్మితో పెంచుకొనెద ననిన
మాతులుంగ ఫలంబొండు చేత నిడి అ, నంతు డప్పు డంతర్ధానమంద, నృపతి.

దాని నొలిచిన అందులో శ్రీ నిధాన, మైన యొక స్వర్ణవర్ణాంగి కానఁబడినఁ
చూచి కౌతూహలమున అచ్యుతుఁడు తనకు, శ్రీమహాలక్ష్మిఁ కూఁతుగాఁ జేసెననుచు.

మ. పరమానందము నొంది, దేహ మొగి శోభల్ మీఱఁగా తండ్రి మం
దిరమం దొప్పఁగ శుక్లపక్ష శశి వృద్ధిన్ పొందు చందాన సుం
దరియై వర్ధిలె ఎల్లరన్ తనుపుచున్ తన్వీ లలామంబు; అ
త్తరళాక్షిన్ జను లెల్ల పద్మ యని మోదంబొప్పఁగాఁ పిల్వఁగన్.

పెండ్లి యీడయి చెన్నొందు పిల్లదాని, ఎవ్వరికొసంగుదు నటంచు నెంచి వగచి
ఆమె యిష్టముఁ నెఱిఁగి, పద్మాక్షుఁ డొక స్వ, యంవరంబును చాటించె నన్నిదిశల.

మ. మునులున్ దేవతలున్ మనుష్యు లురగుల్ మున్ గా నదీవృక్ష వా
ర్ధి నగాధీశులు కామరూపులయి ఏ తేరంగ గంధర్వులున్
ఘనులౌ యక్షులు రావణా ద్యసురులున్ కన్యాలలామంబు పే
ర్మిని పెండ్లాడఁగ వచ్చి రెల్లరును దోర్వీర్య ప్రభావాఢ్యులై.

గీ. ఇట్లు వచ్చిన వారల యెట్టయెదుట, నా స్వయంవర మంటపమందు నిలిచి,
అంచితాకాశ నీలవర్ణాంగుఁడైన, వాఁడు వచ్చి పద్మను వివాహ మగుత.

క. అని పద్మాక్షుఁడు పల్కిన, విని యెల్లరు దుర్లభంబు వీని వచనముల్
మన కెల్లర కవమాన,మ్మును చేయఁగ ఈతఁ డిట్లు మొనకొని చేసెన్.

ఆ. వె. కనుక ఇది నిజంబుగా స్వయంవరమా నె? ఆకసంబుచాయ రాకొమారు
లేడనుండ్రు? మేల్మి కీడగువారలు,గాక! వీని మాయగాక! యనుచు.

క. పద్మిని నెటులేనియుఁ ఒక, ఛద్మ మొనరిచియె హరింపఁ చను గుజగుజల
పృద్మాక్షుఁ డెఱిఁగి వారల, సద్మములకుఁ జేరుదాఁకఁ చయ్యన తరిమెన్.

గీ. దానవులు పెల్లు పోరి, పద్మాక్షుఁ చంపి, పద్మఁ చెఱపట్టనేగ, ఆ పద్మనయన
అగ్నియందుఁ ప్రవేశించి అచట డాఁగ, వార లా నగరమున అవారితముగ.

ఆ. వె. వెదకి వెదకి విసివి వేసారి సౌధాళిఁ, గూల్చి, రవులుచున్న క్రోధవహ్ని
నగరమెల్ల నొక్క నాలుగు గడియలఁ, చెలఁగి వల్లకాడు చేసి చనిరి.

### కేవల లక్ష్మీసాంగత్యము హానికరమనుట

శా. లక్ష్మీసంగతి దుర్ణయం బగుటవల్లన్ స్వల్పకాలమ్మునం
దా క్ష్మాపాలుఁడు నాశనమ్మయ్యెఁ గద! పద్మాక్షుండు హీనంబుగన్;
లక్ష్మీసంపద కోర రార్యజను లేలా? యన్నచో యోగ్యులా
సూక్ష్మజ్ఞాను లెఱుంగనేర్తురు సిరిన్ శూన్యంబు దుఃఖంబుగన్.

సీ. చిత్తచాంచల్యంబుఁ చెందించెడున్ లక్ష్మి; అనవరతంబు భయంబు కొలుపు;
శోక మెప్పటికప్పు చూపుచుండును; పెల్లు, హింసలు దానితోనే మెలంగు;
అడగించివేయు ఆహారవాంఛను; చాల, నిద్ర మాన్పించు పెన్నిధి కనులకు;
ఐనవారలయందు ఆపేక్ష నెడఁబాపు; నమ్మనీయదు సతిన్ నందనులను;

గీ. సుగుణసంపదలను దగ్ధముగ నొనర్చు; స్నేహితులనైన మఱపించు; చెలఁగి పిచ్చి
వానిఁగా, లోభిఁగా, దుష్టుఁగా నొనర్చి, విడుచుఁ ఆ లక్ష్మి కాంక్షించి మిడుకువారి.

క. పద్మాక్షుఁడు మృతినొందన్, పద్మాక్షుని భార్యలైన పదివేల సతుల్
పద్మాక్షుని చితిలోఁ బడి, పద్మాక్షునితోడ స్వర్గపదవిఁ గని రటన్.

సీ. శ్రీ మహావిష్ణుని స్థిరశక్తియైన ఆ, పద్మ అగ్నినె తన సద్మముగతి
భావించియుండి, అవ్వలి కివ్వలికి స్వేచ్ఛ, మీఱ సంచార మింపారఁ జేయ
అంతలో రావణుం డా బాటనే పుష్పకంబుపై నేగుచు సంబరముగ
సారణుం డెఱిఁగింపఁ చయ్యన ఆ పద్మ, నెఱిఁగినవాఁ డాట ఎలమిమీఱ

గీ. కామమోహితుఁడై పట్టఁగా విమాన, రాజముననుండి దిగి పట్టరా నెఱింగి
పద్మ అగ్నిప్రవేశమై పరఁగియున్న, రావణుం డిట్టులను మహాగ్రత్వ మెసఁగ.

గీ. అగ్నిలో డాఁగి నీవు మున్నసురులకును, నృపులకును శ్రమ మిచ్చితి; విపుడు నిన్ను
ఓ మనోహారిణీ! అగ్నినుండి నేను, పట్టి నిన్నొక సతిగఁ చేపట్టువాఁడ.

క. అని యగ్నికుండమును వా,రుణ దివ్యాస్త్రమునఁ తడిపి, రుచిమీఱు ప్రశ
స్త నవీన రత్నపంచక,మును గని పేటిక లగించి ముదమున్ వెరవున్.

క. పెనగొనఁగ లంకఁ దేవళ,మున దానిని భద్రపఱచి మోదంబున రా
త్రిని మండోదరితో ని,ట్లను బంగరు నగిషిపనిని అలరెడు సెజ్జన్.

ఉ. వెల్లికిలన్ పరుండి, వినవే తరుణీమణిరో! రహస్య ము
త్ఫుల్ల సరోరుహాక్షి! నిను తుష్టనొనర్పఁగ నూత్నకాంతి రా
జిల్లెడు రత్నపంచకము చేకొనివచ్చితి సంతసింపుమా
పెల్లుగ వాని నీవు సిగఁబెట్టి, వెలుంగుమ! నాకుఁ బ్రీతిగన్.

మ. అదిగో నా పరమేశ్వరాలయమునం దా మూల నా పేటికన్
పదిలం బొప్పగ నుంచినాఁడ; చనుమా వానిన్ వెసన్ తెమ్ము స
మ్ముద మేపారఁగ నన్న, అల్లె చని యేమోకాని మండోదరీ
ముదితారత్న మదెత్తలేక కినుకన్, మో మెఱ్ఱనై యిట్లనెన్.

ఆ. వె. చాలుచాలు; నాదు శక్తికిమించిన, పనికి పంపి ఖిన్నపఱుపఁ దగునె?
అనిన రావణుండు విని, అద్భుతం బంది, తానె వచ్చి పెట్టె పూని పట్టి.

శా. ఎత్తంజాలక చేతు లిర్వదియు ఎంతే బెండులై పోవఁగా
చిత్తంబందు భయంబు విస్మయమొగిన్ చేరంగ, ఆ పేటికన్
బత్తున్ పిల్వఁగనంపి అచ్చటె పగుల్పన్ పద్మ అందుండె; త
ద్వృత్తాంతం బపు డానుపూర్వముగఁ తెల్పెన్ భార్యతో అంతటన్.

గీ. సూర్యబింబంబువలె వెల్గుచున్న కన్నె, చూడఁజాలక ఎంతయు చోద్యపడుచు
రావణుని బంధుమిత్రులు రాఁ దొడగిరి, అర్ధరాత్రి మద్దెల దర్వు లన్నరీతి.

క. ఇదియెల్లచూడఁగా త,త్సుదతి కదున్ కలఁగి తా నసూయామతియై
మది భయమును క్రోధమ్మును, కదురఁగ రావణునిఁ చెనఁకి గ్రక్కున ననియెన్.

సీ. దీని వృత్తాంతంబు తెలిసియు నీ వెట్లు, లంకకు తెచ్చితి జంకులేక;
ఆ చిన్నతనమందె అంత అనర్థంబు, తలిదండ్రులకె తెచ్చె తనయ యిద్ది;
కులనాశనము చేసికొనఁగ ఉద్దేశంబు, కలదేమొ? యీ మారిఁ గడగి తెచ్చి;
తీవు నెప్పుడు నిట్టి వేవొ అనర్థంబు,లే తెచ్చిపెట్టెద వెఱఁగి యెఱఁగి;

ఆ. ఈ మహాప్రకాశమేమి? కన్నులు మిఱు,మిట్లుగొల్పు నీమె మెలఁతగాదు;
ఇదియు శక్తి: దీనిఁ గదియు ముల్లోకము, లేలువాఁడె ఇతరు లేరుఁ కారు.

క. కావున ఇప్పుడు వేగమ, యే వనముననైన పాఱవేయుఁడు, కాదేఁ
పోవును లంకారాజ్యం, బీ వనితాకారణమున ఈ క్షణమందే.

క. అని పల్కఁగ మండోదరి, విని రావణుఁ డదరిబెదరి వే వేగంబే
చని పేటిక నెటనైనఁ, మనదేశము దాఁటవైచి మఱి రండనుచున్.

గీ. భటుల కపు డాజ్ఞచేయఁగా వారు వేగ, పేటికాతలమున పద్మఁబెట్టి ఒక్క
భవ్యమైన విమానముపైఁ చనంగ, వేగ నుద్యుక్తులైయుంట తాఁ గనుఁగొని.

క. మండోదరి అను, మీరలు, పొండి వడిఁ పేటిక భువిఁ బూన్పుడు కడఁకన్
చండి ఇది; ఇద్ది బయలున, ఉండిన మాత్రాన జనుల నూడ్చి వయివదే?

ఆ. ఇది గృహస్థుడై జితేంద్రియుఁడై చరా,చరము నాత్మభంగి నరయువాని
యింటనున్న పొసఁగునంట నిక్కముగాని,వారి వీరికెల్ల మారిగాదె?

క. మందోదరి వాక్యమ్ముల, నందఱు విని అద్భుతావహ స్వాంతులుగా
సుందరిగల పేటిక మ,ధ్యం దనర విమానమున భటావళి వెడలన్.

వ. నభోభాగంబున కెగసిన నవ్విమానరాజమున న్వీరాజిల్లు నప్పేటికనుండి.

సీ. మరల నే లంకకుఁ అరుదెంతు రావణుఁ, బంధు భటాన్వితు వధ మొనర్ప
మరల మూఁడవసారి అరుదెంతు పౌండ్రకుఁ, శతకంఠ రావణుఁ సంహరింప;
మరల నాల్గవసారి అరుదెంతు కుంభక,ర్ణాత్మజు మూలకు నలమిచంప;
మరల వత్తునుగాన మఱచియుండకుఁడు నే, మీకొఱకే పుట్టి మెలఁగుదాన;

గీ. రావణా! ఏల నీకు విభ్రమమటంచు, పల్కు అప్పద్మ పల్కుల కుల్కి రావ
ణేశ్వరుఁడు హృదయంబు దహింపఁ తీక్ష్ణ, ఖడ్గమున పద్మఁ చంపఁగా కడఁగె నపుడు.

సీ. ఆయుర్బలంబుండ ఆయను నిప్పుడే, చంపుట కీవు యోచింపవలదు
తొందరి చంపుటకె ఉద్యుక్తుండవైతివా? తప్పక నీ మృతి యిప్పుడె యగు;
ఈమెమాటలు బొంకులెన్నటికిన్ కావు; వెనుకవచ్చెడు చావు కనకు మిపుడె;
సాహసం బెప్పట్ల సాగిరా దేరికి, శాంతంబు రమ్యభూషణము సుమ్ము;

గీ. అనుచు వారించు మండోదరిని నెదిర్చి, యేమియున్ చేయఁజాలక యెసఁగకుండె
రావణేశ్వరుఁ డతి దీనభావమొప్ప; దూత లా పెట్టెఁ గైకొని తొందరి చనిరి.

## సీతనుంచిన పెట్టెను మిథిలాసమీపమున పాతిపెట్టుట

చ. చనిచని దాఁటి సంద్రమును, చయ్యన కాననముల్తరించి, వే
చని మిథిలా సమీపమున జానగు నాఁగటిచాలునన్ భయం
బున ధరఁ బాతి, వేగమటుపోయి కనుంగొని రావణేశ్వరున్
కని, తమ చేసినట్టి ఘనకార్యము గ్రక్కునఁ దెల్పి రిమ్ములన్.

సీ. ఆ భూమి ఒక్క బ్రాహ్మణునకు మిథిలాధి,పుఁడు రవి గ్రహణంపు ప్రొద్దునందు
దానంబుగా నీయ ధరణీసురుండును, దాని దున్నింపఁగ తగు ముహూర్త
మును బ్రతీక్షించుచు కొనకు లభించిన, ఈ ముహూర్తమున ఆ భూమి నొక్క
శూద్రునిచేతను సారిది దున్నింప రెం,డవచాలునందున అవనిలోని

గీ. పెట్టె నాగటి మొనఁతాఁకఁ, అట్టె తెచ్చి, బ్రాహ్మణునికిచ్చి మ్రొక్కఁగా బ్రాహ్మణుండు
నాకు వలదన్న శూద్రుండు నాకు వలద,టంచు కలఁతయొక్కటి గాంచి మించిరపుడు.

గీ. బ్రాహ్మణుని సొమ్ము నే భరింపంగలేను; దున్ని పండించుకొన నిచ్చియున్న భూమిఁ
కల్గు నిక్షేపమున కధికారి నెట్లు? ఈ సువర్ణపేటిక గొను భూసురేంద్ర!

క. అను శూద్రునితో భూసురుఁ,డను, భూమిని నేను నీకు ననుభవమున కి
చ్చిన దాన నేమి దొరకిన, కననీయదె రొక్కమొకటెగా నాది యగుఁన్!

వ. అని పలుతెఱంగుల వివాదపడి తుట్టతుద కప్పాఱుండు.

క. నీ కక్కఱలేకుండిన, భూకాంతున కిత్తు నాకు భూమి నతండే
కైకొన నిచ్చెం గావున, శ్రీకరముగ ధనము రాజుఁ చేరఁగవలయున్.

గీ. అనుచు బ్రాహ్మణుఁ డా పేటికను జనకుని, సభకు తెచ్చి సమర్పించి, జరిగినట్టి
తత్కథన్ విన్నవించిన ధరణిసురునిఁ, కాంచి ధరణీశుఁ డను సత్కరించి వాని.

గీ. నేను నీ కిచ్చితిన్ భూమి దానముగను, దానిలో నీకు దొరకిన ధనచయంబు
నీదె అగుఁగాక ఎట్టుల నాదియగును, భూసురేంద్రా! అటన్న ఆ భూసురుండు.

క. కాదను; భూపతి అట్టుల, కాదను; భూసురుఁడు మరల కాదను; మంత్రుల్
మీఁద ఎవరేని కైకొనఁ,గాదగు నా పెట్టె నేమిగలదో కనుఁడీ.

చ. అనుటయు భృత్యులన్ పిలిచి అమ్మహినాయకుఁ డాకరండికన్
కనఁ తెఱిపించి అందు పరికంపిత హేమ విచిత్ర విగ్రహన్
ఘనరవికోటి సన్నిభ వికాసిని బాలికఁగాంచి ఆమె నా
జనకుఁడు ప్రేమబద్ధుఁడయి సాకె స్వుతాసమ గౌరవంబునన్.

వ. అంత బ్రాహ్మణుండును కృతకృత్యుండైన చందంబున సమ్మదంబునొంది చనియె;
అప్పు డనేక శుభశకునంబులయ్యె.

సీ. జనకుఁడు తన పుత్రి యని ఆమె కైకొని, జాతకంబు లిఖింపఁజాలువారి
నియమించి, ముదముతో నిఖిలదానములఁ ధ,ర్మముల నొనర్చె బ్రాహ్మణులకెలమిఁ;
అల్లారుముద్దుగా అతి వినోదమ్ముగాఁ, పెరిఁగె ఆ భూమిజ పేర్మిమీఱ;
జనకుండు కన్న బిడ్డనుమించు ప్రీతిచే, ఏమిట కొదువ యింతేనఁగకుండ

గీ. పెంచుచుండెను తాను మన్నించు సతియు, విద్యలను, ఆట పాటలఁ వివిధగతులఁ
తల్లిదండ్రులఁ పౌరకాంతలఁ మహా ముదాంబుధినిఁ దేల్చుచుండె ఆ అవనిజాత.

సీ. మాతులుంగమ్మున జాతమాటను మాతు,లుంగి అనే పేర పొసంగె ఆమె;
సీరాగ్రగతమగు సీతను వెల్వడక, సీత అనంగ విఖ్యాతయయ్యె;
పద్మాక్షు పుత్రియై పరగుటచేతను, పద్మ యని స్మరింపఁబడుచునుండె;
అగ్నిలోన వసించినందుల కగ్ని గర్భ అనంబడియె; రత్నరాజియందు

గీ. చేరి యంతర్నివాసంబుచేయు కతనఁ, సహితి రత్నావతి యని పిల్వంగఁబడియె;
భూమిలో దొరకుటఁ భూమిపుత్రి అయ్యె; జనకునింటఁ పెరుఁగుటఁ జేసి జానకియగు.

గీ. నేఁడు దశరథ! ఆకాశ నీలవర్ణుఁడైన శ్రీరామునికి సీత అయ్యె భార్య;
ఇపుడు పద్మాక్షుని ప్రతిజ్ఞ సఫలమయ్యె; చెప్పినాఁడ నే నెఱిఁగిన సీత కథను.

క. ఇఁక నలుగురు స్నుషలంగొని, సకలానందంబులొంది చయ్యనఁ చనుమా!
ప్రకట శతానందుని కౌతుకమును వ్యర్థంబుచేయ దోషము సుమ్మీ.

ఆ. అనుచు చెప్పుచున్నయంతలో దశరథు,చేత పిలువఁబడి ప్రసిద్ధులైన
మగధ కేకయాధిపతులు కోసలుతోడ, బంధుమిత్ర యుతులు వచ్చి రపుడె.

సీ. జనకుండు సంతోషజనకుఁడై వారల, స్వాగత సల్లాప సంభ్రమములఁ
సమ్మానమొనరించె; సరగున దశరథుఁ పూజించి యమ్మహా తేజమొప్ప
రాము లక్ష్మణుని భరతుని శత్రుఘ్నుని, దివ్యాభరణముల నవ్యముగ అ
లంకృతులఁ జేయ లలి మహోత్సాహులై, వారలు పెద్దలవగుసఁ మీట

గీ. తగ వశిష్ఠ విశ్వామిత్ర తాపసులకు, దశరథునకును మువ్వురు తల్లులకును
వందనంబుల నొనరించి వారిచేత, పడసి పెక్కులు దీవనల్ వెడలిరపుడు.

వ. శ్రీరామచంద్రుని పరాక్రమంబునకు దశరథుఁడును కౌసల్యాదులును కడుంగడ సంబరపడి వారలవలన సముత్సాహకరంబులగు వారి చర్యల వినుచు.

గీ. దశరథునిముందు స్త్రీలు బాంధవులతోడ, పెండ్లికొమరులు నలువురు వేడ్క లెసఁగ
భవ్యమంగళ వాద్య వైభవములలర, జనకనగర ప్రవేశమై చనుసవేళ.

సీ. అత్యంత సంభ్రమాహ్లాద చేతస్కలై, పురకాంతలెల్ల గోపురములందు
సౌధాదులందు ఆశ్చర్యమానసలయి, తమతమ పనుల నధఃకరించి
చంకల శిశువులు జాఱ శ్రీరామ దర్శన ధన్య లగుచు ఆ రాముపైని
అతని తమ్ములపైని అధిక సువాసనల్, చిమ్ము పుష్పచయంబు చిమ్మి చెలఁగ

ఆ. తరలి దశరథుండు తనయులతో వచ్చి, పరమ విభవ నికర సురుచిరంబు
సకల భోగ్యవస్తు సర్వ సత్కార సంపూర్ణమైన భవనమునను విడిసె.

## శ్రీ సీతారామాదుల వివాహ మహోత్సవాభివర్ణనము

క. దైవజ్ఞులచే మంత్రులు, వైవాహిక లగ్నముల ధ్రువంబొనరిచి, ఎం
తో వైభవముగ మంటప, శ్రీ వెలయఁగ తోరణములు చిత్రధ్వజముల్.

క. కట్టించి, రోగిఁ పతాకలు, బిట్టు చెలఁగె; నగరమెల్ల పెండిలి పనులే;
చుట్టు నొక యోజనము సొం, పుట్టిపడ నలంకరించి రుజ్వలమతులై.

సీ. మిథిలాపురమ్ము పరిధిదాఁక కడు నలం, కార శోభితముకాగా నొనర్చి
రాజమార్గంబులు రమణీయ చందన లిప్తంబులుగ చేసి లేఁజివుళ్లు;
వివిధ పుష్పమ్ములు విరజల్లి రింపుగ, చంద్రాస్తమయ శుభసమయమందు
రాత్రి కౌసల్యాది రాజ్ఞీజనంబులు, వరుసనే వృద్ధ సువాసినులును

గీ. రాముఁ డాదిగ వరులను నీమ మొప్ప, శుభముహూర్తంబునందు కూర్చుండఁజేసి
హర్ష మొప్పంగ మంగళహారతులను, పాటలఁగ పాడి మిగుల వైభవమెసంగ.

క. మంగళవాద్యమ్ములతో, మంగళ ఘోషములతోడ మంగళముగ అ
భ్యంగనము లాచరించిరి, పొంగుచు శ్రీరామ ముఖ్య భూమీశసుతుల్.

శా. ఆ స్త్రీలందఱుఁ తాముకూడ శుచిగాఁ అభ్యంగన స్నాతలై
వస్త్రాలంకరణాది దీప్తలయి, దివ్యచ్ఛ్రిద్ధమైఁ ఇంపుగఁ
శాస్త్రంబొటఁ ఎఱింగి, ఆ దశరథ క్ష్మాపాలుఁ తోడ్తెచ్చి రా
జ స్త్రీ లెల్లరు మంగళప్రదముగా స్నానంబు చేయించిరఁ.

వ. అంత వశిష్ఠ మునివరుండు రాజకాంతలఁ పిల్వనంపి మౌక్తిక వినిర్మితంబయి విరాజిలుచుండిన స్వస్తిమంటపాభ్యంతరమందు వారితో ఎడమవైపున దశరథమహారాజును వారిముందట రామాదులగు రాజకుమారులను కూర్చుండజేసి.

సీ. స్వస్తివాచనములు చదివించె బ్రాహ్మణ, శ్రేష్ఠులచేత విశిష్ట గతిని;
శ్రీ మహాగణపతిఁ ప్రీతితో ముందుగాఁ, పూజచేయించె విభ్రాజితముగ;
రహిని పుణ్యాహాదిత్రయమును క్రమముగ, ఆచరించెను విధి సూచితముగ;
కులదేవతలఁ ప్రతిష్ఠలఁ జేసి దశరథ, రాజచంద్రుండు పరమముదమున

గీ. గ్రామ కుల దేశ వృద్ధవిరాజమాన, విధి సువాసినీ యాచార విధుల నెఱపి
తోయకుంభస్థ మంటపాదులను పూజ, చేసి చెన్నొందె ఎంతో సంతోసమెసఁగ.

వ. కౌసల్యాది సువాసినులును.

గీ. అట్టి మంగళ శ్రీమంటపాంగణమున, హెచ్చు నాజూకగు పసుపుపచ్చవన్నె
అఘరు బంగారు సరిగ వస్త్రములతోడ, పసుపుఁ కుంకుమఁ కైసేసి ఎసఁగి రెంతో,

గీ. రాజు జనకుఁడు వాద్య పురస్సరముగ, రాముఁ డాదిగ వరులను రమ్యరీతి
దశరథునితోడ పూజించి తన మనికికి, పిలిచికొనిపోవ వచ్చె సంప్రీతి చెలఁగ.

సీ. వరులను పూజించి వారికి బంగారు, సరిగ వస్త్రముల ఆభరణములను
ఇచ్చి పూజింపఁగ ఇంపు నింపుచు వారు, రాజిలుచుండిరి తేజమొప్ప;
అందఱుఁ అవిరళానంద కందళిత సద్హృదయారవిందులై యొసఁగిరపుడు;
చామరంబులువీవ రాముఁడు ఉత్తమ, గజములనెక్కి సుఖముగఁ జనఁగ

గీ. ఆడుయేనుగుల నెక్కినయట్టి తల్లు, లడుగడుగునకు అలఘు మంత్రాక్షతలును
కుసుమములు కురిపింపఁగా కోమరు మిగుల, పౌరనారులు లాజలు బలసి కురియ.

సీ. వారాంగనల నృత్యవైఖరీ రీతులఁ, మృత్పాత్రములఁ పుష్పవృక్షతతులఁ
కృత్రిమలతలఁ, విచిత్ర పతాకధ్వజంబులఁ బాణసంచాల పుష్ప
వృక్షంబులను, అంతరిక్షాంతర విరాజమాన తటిల్లతానానసకలిగి
చిత్రధ్వజ పతాక శ్రీ వినోదంబుల, చిఱునవ్వు లొలుకు ఆ నరనికరము

గీ. ఎల్లవారికి సమ్మోద ముల్లసిల్ల, జనకరాణ్మందిర ప్రవేశంబుచేసి
మత్తగజముల దిగి పెండ్లి మంటపముల, భద్రపీఠమ్ములఁ జేరి పరఁగియున్న.

గీ. దేవతలు తమ విమానమ్ములఁ తేజరిలుచు, పెండ్లి వేడుకలను చూచ్చు వేడుకుండ
మిగుల వేడ్కతో తిలకించి మించిరి తమ, అనిమిషత్వంబు సార్థకంబై చెలంగ.

సీ. వాల్మీకు లాదిగా వర మునుల్ తముఁ పరివేష్టించియుండఁగా తుష్టిగనిన
జనకు దశరథు నాచార్యులైన వశిష్ఠ, ముని శతానందులు మోద మొసవగ
మధుపర్క విధమును మఱి ఆసన ప్రదానాది సత్కారము లాచరింపఁ
సలిపిరి; దశరథ జనపతియు వశిష్ఠునాజ్ఞ వధూపూజ ఆచరించ

గీ. పిదప వరులను వధువుల వేఱువేఱు, మంగళములైన వేదికామధ్యములల వి
వాహ శుభముహూర్తమ్ముల వరుస కూర్చుచుండఁ జేసిరి ముచు లతిశోభనముగ.

గీ. దంపతుల మధ్య తెరవేసి, ఇంపుపెంప, ఆ శతానందుడు వశిష్ఠుఁ డాదిమున
మంగళశ్లోకములను సన్మానజనక, ముగ మహోచ్చైస్స్వరాన ఇంపుగా చదివిరి.

వ. సభాసీనులగు పెద్దలపై దంపతులచేత కుసుమాక్షతాది మంగళద్రవ్యంబులు చల్లించి సభాపూజనం బిమ్ములఁ జేయించి మంగళంబు లిట్లు పాడిరి.

సీ. బ్రహ్మాది సురలును ప్రథిత వజ్ర్యాద్యష్ట, దిక్పాలురును, సర్వదేవఋషులు
బ్రహ్మర్షివరులును, రాజర్షి వరులును, సూర్యచంద్రాదులు, సూచిదా
సర్వ నదీనద సరస పుణ్య సరో వరమ్ములు, ఘన తీర్థరాజములును
శ్రీ సతీసుతుఁడును, శివుఁడును సర్వ మృగేంద్రంబులును, సర్వగేంద్రములును

గీ. జలధియును, దశదిశలును, సకల దైత్య,వరులు, మంగళముల వధూవరుల కీర్తు
గాత! కాశీపతి స్మరణాతి పుణ్య,దినమె సుదినము సల్లగ్నమును నిజంబు.

క. తారాబలయుక్త దినం,బారయ చంద్రబలయుక్త మాదినమే యిం
పారఁగ విద్యాబలయుత,మై రాజిలు దైవబల శుభావహమనుచున్.

వ. అని యివ్విధంబున.

క. మంగళ పద్యమ్ములతో, మంగళ సంగీతములు సమంబయి యొప్పన్
మంగళ వాద్యధ్వను లిం,పుంగూర్పఁగ నాద బ్రహ్మమునకుఁ గడంకన్.

మ. మురిపంబొప్పఁ దెరన్ దొలంచి, మఱి "ఓం పుణ్యోస్తు"నాఁ పల్కుచున్
వరచాతుర్య వధూచతుష్కములకున్ వైవాహికం బింపుగా
జరిపించెన్ ఘన లాజహోమములతో, శాస్త్రోక్తరీతిన్ వశి
ష్ఠ ఋషీంద్రుండును గౌతమాత్మజుఁ డొగిన్ సాయంబుచేయన్ గడున్.

గీ. క్రమత వైవాహిక విధాన కర్మ సమితి, జరిగె సంతృప్తిగా యథాశాస్త్రముగను;
వరమహోత్సవ కల్యాణమంటపమున, గణిక లొనరింప నృత్యముల్ గానములును.

గీ. వందిమాగధ సంస్తుతి పాఠములును, భవ్యమంగళ సంగీత ప్రౌఢిమయును
నయనకర్ణ పర్వమ్ము, హృదయహారమ్ము,లైన దశరథ జనకు లనూనముగను.

క. నానావిధములగు మహాదానంబుల నొసఁగి విప్రతర్పణచేయన్
మానిని! మనలన్ భక్తిన్, (శ్రీ) నూతన దంపతులు భజించిరి మివులన్.

శా. (శ్రీ)రామాదులు పత్నులున్ కలసి, రాట్స్త్రీలెల్ల అగ్గింప వె
వ్వేరౌచున్, మఱి యేకమై, ప్రియమునన్ విందారగింపన్, ముదం
బారన్ బంధుచయంబు తోడుత అయోధ్యానాథుఁడున్, మైథిలా
గారంబందున మృష్టభోజనములన్ గావించె సంప్రీతుఁడై.

శా. కౌసల్యాదులు రాజకాంతలు తమున్ కైసేయ, ఆ మైథిలీ
స్త్రీ సంఘంబులతో సుమేధయును ప్రార్థింపఁగ, సంతృప్తురాం
డ్రై సంతుష్టిగ మేలుభోజనము లాహారించి యింపొప్ప, మి
థ్యా సల్లాపములన్ చెలంగిరి, ప్రమోదంబెంతొ సంధిల్లఁగన్.

ఉ. పిమ్మట మాతృసన్నిధిని పేర్చినకూర్మిని రామచంద్రుఁడున్
తమ్ములుఁ పోకలాకుల ముదమ్మొదువన్ గొఱుకన్, ప్రియాంగనల్
క్రమ్మఱనట్లొనర్ప, పురకాంతల బంధురనర్మవాక్య శ
స్త్రమ్ములఁ తూలబుచ్చుచు, కరంబు మనంబులు చెంగలింపఁగన్.

వ. వివిధ విలాసమ్ముల నోలలాడుచుండ, మహా విభవంబుగ జనకుండు వివాహా
త్సాహ మహోత్సవంబులు సలుపుచుండె. అపుడు,

మ. కరుణాలోల కటాక్ష వీక్షణుఁడు, ముక్తాహార విభ్రాజకం
ధరుఁడున్, సర్వచరాచరాత్మకుఁడు, శ్రీధాముండు లోకేశ్వరే
శ్వరుఁడున్, కోమల సుందరాంగుఁడు, జగద్వంద్యుండు, శ్రీరాముఁ డా
ధరణీ పుత్రికఁ పెండ్లియై సరఁగ ప్రోద్యద్వర్ణ వస్త్రాఢ్యుఁడై.

ఉ. రాజ లలాముఁడైన రఘురాముఁడు, తమ్ములతోడ నంతయున్
రాజిలుచుండె నాలుగవరాత్రిని, సుందర వేణుపాత్ర వి
భ్రాజిత దీపకాంతులు విరాజిలుచుండ, విచిత్రలీల నీ
రాజనము ల్గనన్ వెలుఁగ, రంజిలుచుండె కళాభిరాముఁడై.

గీ. అపుడు జనకుఁడు వరుల రాజార్హములయి, పొసఁగు వసనములచేత పూజచేసి
లక్షలాదిగ కరులఁ, పాలకులఁ లక్షఁ, లక్ష రథములఁ, పదిలక్షల హయతతుల.

మ. విమలాలంకృతులన్ సువర్ణ విలసద్వ్యాఘ్రాది పీతాంబరా
సమసద్వస్తుచయంబులన్, విరివిగా సంతోషజన్యంబులై
అమరన్ మైథిలుఁ డిచ్చె మోదయుతుఁడై అల్లుండ్రకున్; తమ్ములున్
తమతో ఏన్గుల నెక్కి రా విడిదికిన్ తర్లించి రారా సుతుల్.

మ. జనకుండెంతయు వేడ్కఁగా దశరథక్ష్మాపాలుఁ డుత్సాహుడై
మనివెన్ మాసముదాఁక నమ్మిథిలలో, మాన్యుల్ సుతుల్ తత్సతుల్
ఘన సద్వైభవ సంతతుల్ తనర శృంగార ప్రయోగాళి చే
తను వెందంబున కింపొనర్ప, కని మోదంబందె సంతృప్తిమై.

క. ప్రొద్దొక సింగారముగా, ముద్దియలును ముద్దుసుతులు ముద మొదవింపన్
తద్దయు జనకునితోడుతఁ, అద్దశరథరాజచంద్రుఁ డానందించెన్.

శా. కౌసల్యాదికమున్ సుమేధ మొదలౌ కాంతామణుల్, వేడ్క నిం
పౌ సల్లాపములన్ వధూవరుల నత్యంతంబు మెప్పించి, నా
నా సత్కారము లాచరించుచు మహానందంబునన్ తేల్పగా
కాసంతైనను భేదమున్ కనక, యేకస్ఫూర్తిగా నుండిరా.

గీ. జనకుఁ డందఱ కానందజనకుఁ డయ్యె, పిదప నిజసైన్యములతోడ వెడలి సా ర
యోధ్యకున్ ప్రయాణములయి యున్నవేళ, ఆ వధూమణులైరి బాష్పాకులలుగ.

## సీత అత్తవారింటి కేగుట

ఆ. ఆ సుమేధ వారి నందఱ డగ్గర, చేరి కౌఁగిలించి చెక్కిళులను
ముద్దువెట్టుకొని సముత్సాహ వచనాళిఁ, వారి బుజ్జగించె కూరిమిమెయి.

చ. జనకుఁడు సాశ్రులోచనవశంవదుఁడై కడు గద్గద స్వరం
బునఁ దన మోమువాడ నను; పుష్పములట్టుల పెంచినార మీ
వనితలఁ లాలనంబు మెయిఁ పాయని కూరిమిఁ వీరి నందఱ
కనుఁగొని, మమ్ము ధన్యులనుగా నొనరింపఁగ మీఁదె భారమా.

క. అని ఆ నూత్న వధూవరులను పరివారంబుతోడ లలిత స్ఫూర్తిన్.
పనిపి జనకుండుఁ సతులును, వెనుతిరిగిరి సుతల గతుల విధము తలచుచున్.

ఆ. అంత దశరథుండు సంతోషయుక్తుఁడై, సుతుల సతులఁ తనదు సతులఁగూడి
సుతులఁగూడి రాజ వితతిగూడి స్వసైన్యములను గూడి విభవములఁ చెలంగి.

వ. అయోధ్యాపుర మార్గముంబట్టి.

క. మిథిలకు మూఁడామడ దశరథుఁడు చన నచట శకున పరంపర లతి దు
ష్పథమునఁ కలుగగ మిగులన్, శిథిలీకృత మతిని తా వశిష్ఠున కనియెన్.

గీ. స్వామి! యేమిది? ఎటను దుశ్శకునములె తటస్థమై కానుపించు స్పష్టముగనవిన
అను:కలుగఁబోవుభయము సూచనముచేయు,శకునములు;త్వరలోనీకుజరుగుశుభము.

వ. అని వశిష్ఠుండు సాదృశ్యమున్ జూపుచు నిట్లనియె.

క. మృగములు సచ్ఛుభసూచకములగ నిన్నుఁ ప్రదక్షిణంబు మొనకొని చేసెన్;
తగ వీక్షించుచు నేగెను, అగడొందగ తగదు తుదిఁ శుభావహమె యగున్.

## పరశురామ గర్వభంగము

చ. అని వచియించుచుండనె భయంకరరీతిఁ ప్రచండవాయువుల్
పెనఁగొన, ధూళి వాన లతిభీకరమై కనులింతయేనియున్
కనుపడకుండ దుమ్ము చెడఁ గ్రమ్మఁగ; కాంతలు పూరుషుల్ చికా
కును కనుచున్నయంతఁ అతి క్రుద్ధుఁడుఁ భీషణభాషణోగ్రుఁడై.

చ. ఇరువదియొక్కమాఱు ధరణీశుల గర్వము లెల్ల మాపి, ఉ
ర్వరఁ ఘనుఁ కార్తవీర్యుని కరంబు చలంబునఁ చంపి శాపమున్
శరమును గూడ వీడఁగల సర్వసమర్థుఁడు తీక్ష్ణకోప దు
ర్ధరుఁడయి కాలుఁడై పరశురాముఁ డభంగ జటాకలాపుఁడై.

ఆ. నీలమేఘనిభుఁడు నిర్మలుఁ డాజాను,బాహుఁ డుగ్రతేజుఁ డాహవ ప్ర
సిద్ధరక్తముఖుడు శితపరశ్వధ ధనుర్ధరుఁడు వచ్చి నిలువ దశరథుండు.

ఉ. ఆతనిఁజూచి మించిన భయంబున అర్ఘ్యముపాద్య మీక భీ
త్యాతురుఁడై మెయి వ్రాలిచి, అల్లన దండమువెట్టి సత్కృపన్

ప్రోతువుగాత ! నా యనుఁగు పుత్రుల, నూత్నవివాహులన్, కృపన్
చూతువుగాత ! నన్ను, పరిశోషిత రాజకులాబ్ధి భాస్కరా.

క. అని పలువిధములఁ బ్రార్థించినను వినక పరశురామక్షితిదేవుఁడు వా
నిని సరకుగొనక రాముని, కనలుచు నిష్ఠురత మీఱఁగా, ఇటు పలుకున్.

ఉ. రాముఁడ వీవె? నేఁ పరశురాముఁడనై క్షితినుండఁగా? భళీ!
రాముఁ డటన్న పేరు గొని, ప్రాఁతధనుస్సది త్రుప్పుపట్టఁగా
భీమ పరాక్రముండనఁగ పెళ్ళున దానిని త్రుంచినావె? క
న్గొమ్మ మహనీయ వైష్ణవ ధనుస్సిది; త్రుంపుము చేతనైనచో.

గీ. తొడరి వీరుఁడవైన నాతోడి యుద్ధ మొనరుపుము; నేటిబీటికా యనఁగిఁ బెరుఁగు
తోటకూరన రాముఁడవౌట; పరశురాముఁడే నుండ నింకొక రాముఁ డున్నె?

మ. అని ఆక్రోశముచేయ రాముఁ డను; ఆర్యా! స్వామి! మా దొక్కటే
గుణ; మీ రెన్న గుణాధికుల్; రఘుకులాంకూరం బెనంపైన బ్రా
హ్మణ గో స్త్రీవధ సేయఁజాలఁ డిపుడే మా ప్రాణముల్ నీకు అ
ర్పణకావింతును చంపు మిచ్ఛకలదేన్ రాముం! కుఠారాయుధా!

క. అని వినయములోఁ పలికిన, వినక కుపితుఁడగుచు, సక్కవినయంబులతో
పనిలే దీ వైష్ణవ ధనువును సంధించెదవా! చచ్చిపోదువా! చెప్పుమం.

గీ. పరశురామునితో తొక్కు పల్కులాడి, తప్పిపోఁజూతు వెఱుఁగ వింతయును నన్ను;
క్షత్రియ శిరశ్శిలామయ స్వర్గమార్గ, భవ్యసోపాననిర్మాణుఁ బరశురాము.

వ. అని ప్రళయకాల రుద్రుని భంగి భూతలం బదరఁ పల్కిన పరశురామునిన్ గని దశరథ
రాముం డత్యంత కోపాటోప వివశుండై.

ఆ. అతని చేతనున్న ఆ వైష్ణవధనుస్సు, కొనుచు ఒక్క మొగిని గొనము గూర్చి
చెవిని తాఁకలాగి; చెచ్చెరన్ భార్గవా! దీని కేదిగుఱిచెము? తెలియఁజెపుమ.

గీ. రామబాణ మెన్నటికి వ్యర్థంబుగాదు; నీదు పుణ్యలోకంబుల నే తెలిపెదా!
నీదుపదములె తెలిపెదో! ఏదొ రెంట, వేగ తెలుపుము దీనిని విడుచువాఁడ.

గీ. ఇట్టి రామవాక్యంబుల నట్టె నిలిచి, వినిన భార్గవుఁ డత్యంత వికలుఁడగుచు
పూర్వ వృత్తాంతమెల్ల సంపూర్ణముగ స్మరించి రాఘవుఁగూర్చి వచించె నిట్లు.

మత్తకోకిల. రామ! రామ! మహానుభావ! పరాత్పరా! పరమేశ్వరా!
నీ మహాసంకల్ప మాత్రన నీ జగంబులు పుట్టి పెం
పై వృతింగను నిన్నెఱుంగ అనంత! ఎంతో కడిందియౌ;
నీ మహాత్మ్య మెఱింగితిన్ కరుణింపవే జగదీశ్వరా!

ఉ. ఈవు పురాణపూరుషుఁడ వీవు సమస్తము; నీవు లేనిచో
లేవు ద్విసప్తలోకములు లేరు సురల్ మును లెల్లధర్మముల్
లేవు; అధర్మమున్ తలఁగ లీలగవే అవతారమూర్తి వై
తీవు; త్వదంశసంభవుఁడ నేను; పరుండనె? శ్రీ రఘూత్తమా!

సీ. నేను బాల్యంబున నినుఁగూర్చి తపమాచ,రించితి; సాక్షాత్కరించి తీవు;
శంఖచక్ర గదాది సాధనంబులు తాల్చి, నీవు మందస్మిత భావమొప్ప,
తపము చాలింపు, ముత్తమ బ్రాహ్మణుండవు, నీ తపంబు ఫలించె నీవ నేను
నాదు దివ్యాంశంబునన్ కార్తవీర్యుని, చంపఁ పుట్టితి బాహుశక్తి మెఱియ

గీ. అతని చంపుదు; మఱియు ధరాధిపతుల, దుర్మదాంధుల ముయ్యేడుతూర్లు త్రుంచి,
సర్వభూమండలంబు కశ్యపున కిడెదు; త్రేత నే బుట్టికొనెద నీ తేజమెల్ల.

గీ. అంత తపమాచరించుచు అమలవృత్తి, బ్రహ్మ దివసాంత మగుదాఁక బ్రతుకువాఁడ;
వనితర సుసాధ్యమగు సుఖమందుదువని, చెప్పి, అప్పుడ మాయంబు జెంది తీవు.

క. నీ చెప్పినవిధముననే, ఆచరణము జరిగె; విష్ణువగు నీ వరులన్
వీచమడంపఁగ పుట్టితి; నాచేఁబడి పరులు బ్రదికి నా విలు గొంద్రే.

శా. నా యందుండిన నీదు తేజమును విన్నాణంబుగా వైష్ణవం
బై యొప్పారు ధనుస్సుతోడ కొని నా వయ్యారె! నీ; వప్పుడే
నా యీ జన్మము ధన్యమయ్యె! ఇఁక వే నా పుణ్యలోకంబులన్
నీ యీ బాణముతోడ కొట్టఁగ తగున్; నీ మాట తీర్పన్ తగున్.

క. ఓ కారుణ్య సుధాబ్ధీ! లోకైకేశ్వర! మునీంద్ర లోకస్తుత్యా!
శ్రీకాంత! దీనరక్షక! నాకు శరణమిమ్మ! కరుణఁ ననుఁ కైకొమ్మా.

గీ. భక్తలోక పరాధీన! పాహి పాహి; శ్రీశ! శ్రీరామచంద్రమూర్తీ! నమోస్తు;
మరల మరల సహస్ర నమస్కృతులను, నీకొనర్చెద భక్తిమై నీరజాక్ష!

క. ఈ రీతి పరశురాముఁడు, శ్రీరాముని వేఁడుకొనిన చిర్వున అతఁడున్
నారాచము భృగురాముని, పేరిన సుకృతంపు రాసి వేసి దహించెన్.

క. కరుణాంబుధి శ్రీరాముఁడు, పరశుధరుండైన రాము వదనముకని, ప
వరములు కావలెనో నీ, వరమరలేకుండ కోరుమని పల్కుటయున్.

క. నాపై నీ కృపయుండిన, నీ పదభక్తియె సతంబు నెగడెడు నట్టుల్
నీ పరమభక్తతతితో, ప్రాపగు స్నేహంబుకలుగ వరమీయఁగదే.

వ. అని ప్రార్థించి వరంబు కైకొని, పరశురాముండు శ్రీరామునికిఁ ప్రదక్షిణ నమస్కా
రంబు లాచరించి సంపూజితుఁడై, అనుజ్ఞనంది మహేంద్రాచలంబునకుఁ తపం బాచ

రింప వెడలెనని చెప్పి, అప్పరమేశ్వరుం డగు శంకరుండు పార్వతీదేవితో నిట్లనియె.

గీ. దేవతలఁ జెండి విడిచిన రావణుఁ తన, గరిమఁ జంకలోఁ ఇఱికించె కార్తవీర్యుఁ;
డతనిఁ బోరిగొన్న జమదగ్నిసుతు జయించి, క్రాలె రాముఁడు తత్పరాక్రమ మలఁతియె!

ఆ. మడిసి బ్రతికివచ్చి మరలఁ గన్పడినట్లు, దశరథుండు సుతుని ధన్యు రాముఁ
గాంచి సంతసించి గట్టిగా ఆలింగనంబు చేసె! కను ముదంబు మెఱయ.

క. ఆనంద బాష్పలోచనుఁడై నవవాత్సల్య పూర్ణుఁడై నయబుద్ధిన్
శ్రీనిలయుండై నిర్భయ, మానసుఁడై రాజధాని మగుడఁగ చేరెన్.

## శ్రీరాముఁడు అయోధ్యకు వచ్చుట

ఆ. అతుల వైభవముగ ఆ రాజచంద్రుఁ డ,యోధ్య చేరు టెఱిగి ఒప్పులొలుక
రాజమార్గములు విరాజిలఁ జేసిరి, మంత్రు లమిత విభవ మహిమ వెలయ.

ఉ. భద్రగజంబులన్ గొని, సుమంత్రుఁడు లోనగు మంత్రులెల్ల, ని
ర్ణిద్రముగాఁగ స్వాగతము నెమ్మి కుమారుల కిచ్చి తేర, సం
భద్రములైన వాద్యములు పల్కను స్రూ్యగ వచ్చి [illegible]
క్షుద్రములై మహావిభవ శోభ చెలంగెడు పెద్దవీథులన్.

గీ. మిగుల వేడుకలడర తన్నగరమును ప్ర,వేశమై రిపులోల్క ఆ పెండ్లివారు
వరులు, వధువులు ముందర పఱఁగ, వెనుక, దశరథనృపుం [illegible] రోత్సవముతోడ.

క. తన నగరు చేరి, విధిగతిఁ, జనపతి కోడండ్ర చేత జయ్యన చేయిం
చెను లక్ష్మీపూజనములఁ, తనయులచే అధిక దానధర్మ చయంబుల్.

గీ. అపుడు మిత్రవర్గపు రాజు లధిక భక్తిఁ, దివ్యవస్త్రాభరణ రాజి దీప్తుల ప్ర
కాశమొసగంగ ఆ అయోధ్యేశు సుతుల, పూజచేసిరి మిన్నుల నమ్మికముగాఁగ.

గీ. దశరథుఁడు వారి నెల్లర తగినరీతి, సత్కరింపంగ తమతమ స్థలములకును
పెండ్లి విభవంబులను తలపెట్టుకొనుచు, చేరి రా రాజనరులు సుశ్రీ చెలంగ.

గీ. ప్రేమమై యుధాజిత్తను భూమిపతిని, దశరథుం డంపు మనసుంచె తనివిదీఱ;
రాముఁ డాదిగ రాసుతుల్ రమణమీఱ, రాజమందిరముల సుఖరాజగనిరి.

క. అను శివవాక్యామృతముం,గొను పార్వతి భవునకను [illegible]కుండాంశమునన్
జననమయి పరశురాముఁడు, మనునెడ ఎటు రాఘవుఁ డగ మాధవుఁడయ్యెన్!

## శ్రీ రామావతార శ్రేష్ఠత్వము

క. అని అడిగిన మృదువుగ శివుఁ,డను శ్రీవిష్ణుండు పెక్కు లవతారములన్
కనఁజాలు నొక్క సమయం,బున నే; అతనికి అసాధ్యముండును ఎందున్.

క. కనుపింపఁజాలు నొక్కఁడె, ఘనుఁడగు విష్ణుం డనేక కాయంబులతో
జనియింపఁజాలు నొక్కఁడె, అనయ మనేకాంశముల సహస్రముఖములన్.

గీ. ఎవని సంకల్పముననె సంభవమునొంది, పెరిఁగి లయమగు లోకంబు లరయనట్టి
శ్రీ మహావిష్ణు మయమిూ విశిష్టజగము; అతనికి అశక్యమున్నదే అతివమిన్న!

క. అన విని పార్వతి శంభున్, కని, అవతారంబు లెన్ని కలవా? హరికిన్
ఘనములెవి అందు? అనినన్, విని శంభుం డిట్లు తెలిపె విశదముగ దయన్.

సీ. శ్రీ విష్ణుమూర్తి తాఁ జెన్నొందెను దశావ,తారంబుల నటంచు తలఁతు రెందు;
ఇరువదియొనిమిది యెత్తినాఁడంచును, పలుకుదు రొకకొంద అలఘుబుద్ధిఁ;
ఏకవింశతి యని యెంతురు కొంద ఱుద్భవమైన హరి యవతారములను;
శిష్టరక్షణమును దుష్టశిక్షణమును, సలుపుట కనువగు సమయములను

గీ. తాల్చు నాతఁడు దివ్యావతారములను, కోట్లకొలఁదిగ ఎపుడుఁ ముకుందుఁడెందు;
శ్రేష్ఠమగు పదార్థచయంబు చింతసేయ, అఖిల జగముల విష్ణుమయంబుకాదె?

గీ. అన్ని అవతారములలోన అధికతమము,లైన యవి రామ కృష్ణ దివ్యావతార
ము; లవి శ్రేష్ఠముల్ కాక సంపూర్ణములగు: అందు రామావతార మింపొందుమివుల.

క. రామావతారమునకున్, సామెత చెప్పంగఁదగిన సామ్యము కలదే?
రాముండు రుక్మవర్ణుఁడు; ఆ మహితుఁడు కృష్ణుఁడనిన అలరున్ నలుపై.

క. సీతాస్వయంవరంబను, ఏతత్కథ చెప్పితిని, శుభేచ్ఛామతినై
ప్రీతినిది వినినఁ చదివిన, నాతఁడు గను శుభనిచయ మహా సుఖగణముల్.

# చతుర్థసర్గము

## శ్రీరామాదుల దీపావళీ మహోత్సవము

చ. అటుపయి సీతతోడ మనసారఁగ భోగ పరంపరా సము
త్కటుఁడయి రామచంద్రుఁడు సుఖంబుగనుండె అయోధ్యయందు, వి
స్ఫుట వివిధావనీ పతి సముత్కర సేవల కౌశలంబునన్
చటుల పరాక్రమ స్ఫురణఁ శాంత శమాదులు తొంగలింపగన్.

వ. ఇట్టి సీతారాములును, లక్ష్మణ భరత శత్రుఘ్నులును, వారి సతులును; దశరథ మహా
రాజునకు, కౌసల్యాదులకును, అత్యంతాహ్లాద మొనఁగూర్చుచుండిరి. అంత

మ. శరదారంభమువేళఁ ఆశ్వయుజ మాసంబందు అమ్మైథిలే
శ్వరుఁ డత్యాదర వృత్తిఁ అల్లురను పిల్వన్‌పంచె దీపావళీ

పరమోత్సాహ మహోత్సవంబునకునై భవ్యాత్ములన్ మంత్రులన్
త్వరగా వార లయోధ్యచేరి తెలుపన్ రాజేంద్రుఁడున్ తృప్తుఁడై.

మ. పరివారంబులతో ప్రయాణమయి, శుంభద్గండ శుండాలకో
త్కర సంరోహితులౌచు పుత్రులును తత్కాంతా లలామంబులున్
తరుణుల్ తానును నింపువేడుక, అమందప్రీతి సంధిల్ల వే
గిరమే ఆ మిథిలాపురంబునకు సంఘీభావ సంధాయియై.

గీ. దాస దాసీజనంబులు తరలిరాఁగ, పుట్టినింటికి వేవేగ పోవఁగోరు
క్రొత్త కోడండ్రు తమవెంట హత్తిరాఁగ, చనిరి కౌసల్య కైకేయియును సుమిత్ర.

సీ. దశరథాగమనంబు తనకు ఎఱుంగింప, జనకుండు సంతోష జనకుఁడగుచు,
ప్రత్యుద్గమించి, శుంభ ద్వాద్యఘోషంబులును దుందుభీ నాదమును చెలంగ
వెలయాండ్రు నృత్యమున్ లలితంబుగా చేయఁ, పాటకాం డ్రింపుగా పాడుచుండ
మేడలపైనుండి వేడుకమై స్త్రీలు, తెరువులలో పూలు కురియుచుండ

గీ. అలరి వియ్యంకుఁ, వియ్యపురాండ్రఁ ముద్దు, టల్లురను, కూర్మి కూఁతులన్ ఉల్లమలర
పిలుచుకొని వచ్చి మివుల సంప్రీతుడగుచు, వారివారల విడిదులన్ చేరఁజేసె.

గీ. నిఖిల భోగసామగ్రి వినిర్మలంబులైన విడుదులన్ అందఱన్ అన్ని వగలఁ
పొలుచు వివిధ మృష్టాన్న విస్ఫూర్తి వలన, దివ్యవస్త్రాభరణములన్ తృప్తి చేసి.

క. జనకుం డా దీపావళి, దినమునఁ గడు నుత్సహించి తృప్తిగొలుపు భో
జన వస్త్రాదులఁ బాంధవ, జనములఁ పూజించె వారిస్వాంతము లలరన్.

గీ. అల్లురను విశేషంబుగ అడుగడుగున, కమల రత్నదీపమ్ముల హారతుల నొ
సంగి, ఆరాధనము చేసె పొంగుచును మహా పవిత్ర దీపావళియందు రాజు.

ఆ. ప్రతి గృహంబునందు పరఁగె లోకానంద,కరములగుచు దీపకళిక వితతి
బలి మహాప్రభుని ప్రభావమ్ము కన్పడ, రాజు తలఁప ఏది రాజిల దిల ?

గీ. నాఁడు జనకుఁ డల్లుండ్రకు పోఁడిమి మెయి, మంగళాభ్యంగనంబులు మంగళరవ
యుతముగాను చేయించి, ఆమెతలు పెట్టి, దాసదాసీజనంబులన్ తనియనిచ్చి.

క. గోవుల రథేభహయములఁ, చేవగలుగు దినుసులిచ్చి శ్రీ జనకుఁ డయో
ధ్యావాసుల నందఱ సంభావిత హృదయుల నొనర్చె బహుమానములన్.

క. దీపావళి పండుగ కడు, నేపుగ చెలరేఁగ జనకునింట శుభదమై;
ఆ పిదప దశరథుఁ డయోధ్యాపురికి ససైన్యముగ ప్రయాణంబయ్యెన్.

మ. పరమానందముమీఱ నేగునెడ, దీవ్యత్క్రోధమున్ పూని సం
గరమున్ చేయుటకై స్వయంవరమునన్ గర్వంబులన్ పాసి త

త్తరఁ సిగ్గుంగనినట్టి రాజవరులు దృచ్ఛౌర్యమేపార దు
ర్భర సైన్యంబులతోడ వచ్చిరి, రిపుల్ రాముల్ ప్రహరింపఁగన్.

## శ్రీరామునికి రాజులతో యుద్ధము

గీ. జనక దశరథు లాశ్చర్యచకితులైరి; హృదయములు మహా భయమునుపొందెవె; రాముఁ
డంత లక్ష్మణుతోవచ్చి చింతమునుఁగు, తండ్రి దశరథుఁగాంచి నిస్తంద్రుఁడగుచు.

చ. వినయముతోడ మ్రొక్కి, సరవిన్ జనకా! ఇటు కుందనేల? నే
ననిఁ అణుమాత్రులౌ రిపుచయంబులఁ గూలిచి నీకు కౌతుక
మ్మును పొనఁగూర్తుఁ, ఎందులకు పూనెదు రిత్త విచార మాజ్ఞ యి
మ్మనిన, నరాధిపుండు పులకాంకితుఁడై అను రామచంద్రుతోన్.

మ. పదునాఱేండ్లును నిండవయ్యెఁగద! యీ ప్రాయంపు బాలుండ వీ
కదనక్షోణిఁ కఠోర దుష్టరిపు సంఘాతంబుపై కెట్లు పం
పుదురా? ఘోరవనిన్ కుటుంబసహితుల్ పొంచుండిరే ముట్టి; రే
గుదునే యుద్ధముచేయ; స్త్రీ సమితి నీకున్ పోలుఁ కాపాడఁగా.

మ. అన, కాదట్టులు కూర్మి తండ్రి వినవయ్యా! ఏల నీ విట్లు భీ
తిని దుఃఖించెద, వాహవంబున ధరిత్రీనాథులన్ చెండువాఁ
డ ననున్ పంపుమ! నాకుఁ కానితరి యిష్టం బైన చందంబునన్
చనఁగా వచ్చును కాని, మీ రరుగుటల్ చాల్చాలు మేముండగన్.

గీ. నేను రణరంగమున శక్తిహీనుఁడనయి, పోయినప్పుడు మీరు సహాయులగుడు
అంతవఱ కిచ్చటనె రాజకాంతలను స్వ, సైన్య తతి ప్రోచుచుండుడు మాన్యవృత్తి.

క. అని తండ్రికి మ్రొక్కిడి వే, ధనువుల్ సంధించి చనె రథముపై వేగన్;
చనె లక్ష్మణుండు తోడ్తో; చనిరా వెనువెంట భరత శత్రుఘ్ను లొగిన్.

ఉ. వారిని కాంచి రాజపరివారముతో పదివేల సైన్యముల్
మీఱిన నింపు వేడుకతమిన్ చని; రంతట రాజులందఱున్
బారులుగట్టి స్వీయరథపాళిపయిన్ చెలువొంది, వచ్చుచు
న్నారదె రామ లక్ష్మణు లనంత బలాఢ్యులు దివ్యతేజులై.

శా. ఏమా రామముఖారవింద! మది యేమీ! ఉజ్జ్వల స్కంధమున్;
ఏమా భాసుర కోవిదారపు ధ్వజం బెంతేని భీతావహం
బై; మాబోంట్లకు వీనిఁ గెల్వఁ తరమా? అయ్యారె: మధ్యందిన
శ్రీ మీఱెన్ రఘురామ సూర్యగరిమ శ్రేణీవిలాస ప్రభల్.

గీ. దశరథు రథంబుపైనెక్కి తరలినాఁడు, రాముఁడనుకొంచు వారలు రయముమీఱ
రణమునకు వచ్చి కడు భీకరమ్ము గమర, పోరఁ దొడగిరి విజయంబు పొందుకొఱకు.

సీ. శస్త్రాస్త్రములఁ రామసైన్యమ్ములను పడ, మొత్తి, రామునిపైని హత్తుకొనఁగ
గగనంబు దిక్కులు గప్పి బాణంబులుఁ, భీతిదంబుగ వచ్చురీతిఁ గాంచి
లక్ష్మణుఁ జెదిరించె, లావొప్ప భరత శ,త్రుఘ్నులు వైరుల త్రుళ్ళడఁచిరి;
పోరొప్పె నపుడు కుమార తారక యుద్ధ,మును వోలి అతి భయస్ఫూర్తి కదుర;

గీ. రాజులందఱు చెలఁగి శస్త్రములచేత, భరత శత్రుఘ్నులను మూర్ఛపడనొనర్చి;
రపుడు వారలు పుడమిపై నట్టెకూల, మిగుల హాహారవంబులు మిన్నుముట్టె.

గీ. ఇట్లు తమ్ములు పడిపోవ బిట్టుకనలి, లక్ష్మణుఁడు విజృంభించి నిర్లక్ష్యముగను
పేర్చి బాణాగ్ని కురిపించి విజయమందఁ, జాలమి గ్రహించి రాముఁడు శరమువట్టె.

గీ. జాల రంధ్రములంనుండి జనములును స,తులు కనుంగొన అతఁడు మంత్రులును,రాజు
వెఱఁగుపడఁ పవనాస్త్రంబు వెసఁపగఱప,యిని ప్రయోగించె; ఎంతయు కనలుమిగుల

గీ. శుష్కపర్ణముల్ పవన విస్ఫూర్తినెగిరి, పోవునట్టుల రాజసమూహమెల్ల
రామవాయవ్య దివ్యాస్త్ర భీమబలము,వలన సంద్రంబులోపడి మ్రగ్గెనపుడ.

ఉ. తక్కినవారి నందఱను తాలిమిఁ రాముఁడు మోహనాస్త్రముల్
చక్కగనేసి మూర్ఛితుల చయ్యన సల్పెన, అప్డు సేనన
మ్మక్క! ఒకండు లేఁ డెదిరియై నిలుచుండ; రఘూత్తముండు పెం
పెక్కిన క్రోధమందిన ఇకేఁడు జగంబున నిల్వనోపెడుల్

క. కైకేయి గజముఁదిగి కడు, శోకాకులచిత్తయై స్వసూనుని భరతుల్
గైకొని తన మూపున హా,హాకారంబుల నొనర్చి అట దుఃఖింపల్.

గీ. దశరథాదులుకూడ రోదనముసేయ, మొదలువెట్టిరి; వారి రాముఁడు కడంగి
ఊఱడించుచు లక్ష్మణు తేరఁబంచె, ముద్గలాశ్రమ సంజీవి మూలికలను.

గీ. తోడనె రథంబుపై పోయి తొడరి లక్ష్మ,ణుండు ముద్గలాశ్రమమున ఉండు శిష్య
తతిని కని వేడ, వార లాతం డపుడు స,మాధిలోనున్న చందంబు మగిడి తెలుప.

క. వారిని యాచింపక కై,కోరాదే వస్తువనుచు కొనకొని వడిగా
శ్రీరామునికడకేగి వి,చారంబొదవించువార్త చయ్యన తెలుపల్.

శ్రీరాముఁడు భరత శత్రుఘ్నులను సంజీవనిచే బ్రతికించుట

మ. విని శ్రీరాముఁడు పల్కె లక్ష్మణునితో; వేవేగ మౌద్గల్య స
ద్వనముల్ చేరుము; నీవు ఎవ్వ రవరోధంబైన అవ్వారిఁ త

క్షణమే కంటను పంటఁ కీడ్పఱచి తత్సర్వౌషధీరత్నము
ల్గొని రమ్మన్న, మహాత్మువు బెసఁగ సంకోచంబు లేకుండఁగన్.

చ. త్వరితముమీఱగా చని అతండు బలాత్కృతితోడ మూలికా
వర నికరంబు తెచ్చిన, అపాయము పాపె రఘూత్తముం డహా!
భరతుని వాని సోదరుని ప్రాణములిచ్చి; ముదంబునందె భూ
వరుఁడును; కైక సంతసము వర్ధిలఁ రాముని కౌఁగిలింపఁగన్.

క. వారికి వశిష్ఠులాదిగ, పేరొందినవారితోడ ప్రియ మేపారం
గా రక్షా శుభకర్మల, భూరమణుఁడు నిర్ణయించె; ముద్గలమునియున్.

ఆ. తన సమాధినుండి తా బహిర్గతుఁడయి, వటులవలన నెఱిఁగి వార్త లెల్ల
లక్ష్మణుం డెవండు? లలిఁ మూలికల నాతఁ, డాహరించుటేమొ? అరయవలదె?

క. చని వేగమరండని అమ్ముని శిష్యులఁపంప వారు పోయి దశరథున్
కని యేతద్వృత్తాంతము, వినిపింపఁగ రాజు తాప విహ్వలమతియై.

గీ. అక్కటకట! తపోధనులైనవారి, కోపమున కగ్గమైతి మెట్లో పరాత్ప
రా! అని అపార చింతాపరంపరా ప్రకంపితాత్ముఁడై మివుల దుఃఖింపుచునను.

ఆ. ఏను దశరథుండ; ఇద్దఱు కొమరుల, ఇచట బ్రతుకసేయ ఏను కోరి
మీ వనమ్మునుండి మివిలి తెప్పించితి, మూలికలను కష్టకాలమందు.

గీ. ఇది ఎఱింగించి, నా నతు లెఱుఁగఁజేసి, ఆ మహర్షిని మన్నింప అడిగితి ననుఁ;
డిదిగో! వారి సమాధాన మొదవజేయ, ఏను మీ వెనువెంటనే ఏగుదెంతు.

మ. అని పుత్తెంచిన మౌని శిష్యులుఁ అయోధ్యాధీశుఁ డా రీతిఁ ప
ల్కిన వాక్కుల్ మునితోడఁ తెల్ప, కడు భక్తిన్ రామచంద్రున్ కనుం
గొను వేడ్కన్ కని మౌనిచంద్రుఁడు కనుంగోఁ బోవు తీర్థంబు డా
పునకే వచ్చినయట్లు మిక్కిలిగ సమ్మోదంబునన్ తేలుచోన్.

గీ. అవనిపతియు డగ్గఱుచు బద్ధాంజలి అయి, మ్రొక్కి ప్రార్థింప మొదలిడ ముద్గలుండు
సముచితంబుగ రాజును సత్కరించె, భయమునొందెకు రాజు నిర్భయుఁడుకాఁగ.

గీ. ముద్గలునిపత్ని సుమతి సముత్సుకతను, కడఁగి కౌసల్య మొదలైన కాంతలను వి
శేషముగ గారవించె; అశేష భయముఁ, భక్తియును మించ రా జిట్లు పల్కె మునికి.

శా. స్వామీ! నేనపరాధిఁ మీ యెడ; క్షమింపన్ వేఁడుచున్నాడ; మ
మ్మోమ్మన్ చంప సమర్థులీర; నను ఎట్లో కాచి రక్షింపుఁడా
ప్రేమాలోకనముల్ నిగిడ్చి, అన సంప్రీతాత్ముఁడై మౌని, ఓ
భూమీపాలక! నీవు నాకు మివులన్ పూజ్యుండ విప్పట్టునన్.

గీ. శంక తొలఁగుము; నీవు నిజంబుగా మ,హామహోపకృతిఁ జేసితయ్య నేఁడు;
అటులు కాకున్న నాకిప్పు డెటులు కల్గు, ధరణిజాయుతుఁడౌ రామదర్శనంబు.

ఆ. ఇతఁడు మాయతోడ ఇల మానుషాకృతి, పొందినట్టి మాధవుండుగాక
కేవలమ్ము మనుజభావంబుతోఁ జూచు, చుందువేమొ దశరథోర్వినాథ.

క. అనుచుండఁగ సమ్మోదం,బున తేలిన దశరథుండు మునిచంద్రునికిఁ
బ్రణమిల్లి రహస్యమ్ములు, మునినాథునివలన వినెడు బుద్ధి తలిర్చెఁ.

క. అది యెఱిఁగి ముద్గలుఁడు స,మ్మోదిత హృదయురాజు కడు సముజ్వలమతియై
సదయత తులసీ ఖండ,మ్మదరికి కొంపోయి అడుగఁ బూనితి వేదో!

చ. అడుగుమటన్న, రాముని మహా మహిమంబులు వేడ్క మిమ్ము పో
లెడు మునినాథు లష్డపు డలేఖ్యముగా వినుతింప వింటి; ఈ
తఁడు మును మున్ని కెట్టి సుకృతంబులు చేయు; ఇతండు కష్టముల్
కుడుచునో? సౌఖ్యములఁ గనునో? కోరెద వీని నెఱుంగ జెప్పుడా.

## ముద్గలముని శ్రీరామ వృత్తాంతమును దశరథునకు దెల్పుట

క. అని ప్రశ్నచేయ, ముద్గల,ముని యిట్లను : సర్వజీవమూర్తి స్థితుఁడౌ
ఘనుఁడౌ శ్రీమన్నారా,యణుఁడే ఉదయించె పుత్రకాకృతిఁ నీకుఁ.

క. వరమిచ్చె నీకు మును; భూ,భర మొక్కట తీర్పవలసె; వరపుణ్యుఁడవై
పరఁగిన నీ కగ్రసుత, స్ఫురణత కనె; నిన్నుపోలు పుణ్యులు కలరే ?

గీ. శిష్టరక్షణమును, దుష్టశిక్షణంబు, ధర్మసంస్థాపనమ్ముఁ అధర్మహాని
చేయ రఘువంశవరులలో శ్రేష్ఠుడనఁగ, అవతరించె రాముని పోల రవని పతులు.

చ. ఈవు మహీతలంబువిడి యేగినపిమ్మట, రామచంద్రుఁడే
భూవిభుఁడై అయోధ్యఁ జన-పూజితుఁడై పదొకండు వేల సం
భావిత వత్సరంబులు శుభంబుగ పాలనచేయు, జేండ్ల జేఁ
డై విలసన్మహామహిమ అంతట పర్వఁగ ఏడుదీవులఁ.

క. కలుగుదు రిద్దఱు కొడుకులు; నలుగురు కోడం; డ్రిరువది నలువురు మనుమల్
కలుగుదురు; మనుమరాం డ్రం,దుల సగముందురు; విశేష తోషముపర్వఁ.

వ. అయినను.

గీ. కొన్నిదినములలో ఈతఁ డెన్నొ కష్ట,ములుపడుఁ వృందశాపము కలుగుకతనఁ
పదియునాల్గు వత్సరములు భార్యతోడి, దండకాటవి; అటుపయి ధర్మరతిని.

గీ. ఘనతరంబౌ మహారాజ్య మనుభవించి, ఈతఁ డెల్లలోకములకు ప్రీతిచేయు;
ఇది నిజంబని ముద్గలుం డుదితహృదయుఁ,డై వచింపగ దశరథుం డనియె ఇట్లు:

క. ఆ వృంద ఎవరు ? ఘనురా,లై విలసిల్లుటకు ఏ మహత్వంబబ్బెన్ ?
దేవర ! ఆ సీమంతిని, ఏ విధమున హరికి శాపమీయంగలిగెన్.

క. ఆ సకలవిషయములు సరి,గా సందేహింప కిపుడు కరుణార్ద్రమతిన్
భాసిల్లి తెలుపుఁ డనఁగా, ఆ సంయమివరుఁడు పలికె అర్మిలి వెలయన్.

## వృందా శాపముచే శ్రీహరికి అరణ్యవాస భార్యావియోగము

పూర్వము జలంధరునికి అపూర్వమైన, యుద్ధమొక్కటి కల్గె నత్యుగ్రరీతిఁ
శ్రీ మహేశ్వరుతోడ; తద్భీమబలుఁడు, వెలసె వృంద పాతివ్రత్య బలము నొంది.

ఉ. ఎంత పరాక్రమంబున మహేశ్వరుఁ డొప్పుగ పోరుచుండినన్
సుంతయినన్ చలింపఁడు విశుద్ధ ముదంబునె చెందుఁగాని త
త్కాంత పతివ్రతా మహిమ తన్నెగిఁ బ్రోవగ; వాని నష్టు ర
వ్వంతయు ఒంపఁజాలక ఉమాధిపుఁ డెంతయు బాధ పొందినన్.

ఉ. పార్వతి విష్ణుమూర్తిఁ కని, భర్త అనిన్ పడుపాట్లు తెల్పి, ఎ
ట్లోర్వఁగఁగల్గు? శంకరుఁ డెటో మధుసూదన ! నీవు వృంద దా
సర్వ పతివ్రతామహిమ చయ్యన దగ్ధముసేయకున్న, త
ద్గర్వముఁ బాపకున్న, ననుఁ గావకయున్న, కృపామహాంబుధీ !

మ. అనినన్, పార్వతి! ఎట్టి కట్టడిపనిన్ నన్ చేయఁగాకోరినా
వని చింతించియు, ఒం డుపాయమును తా నావంతయున్ కానమిన్
చనె ఆ భామిని ఉండు పట్టణమునన్ జానొప్పు శుద్ధాంతపున్
వనమున్ చేరఁగ; అంత దైవవశతన్ భ్రాంతాత్మయై వృందయున్.

గతరాత్రి తనపతి కలయందు కలయ తై,లాభ్యక్తుఁడౌచు దిగంబరుడయి
మహిషంబుపైనెక్కి మఱి దక్షిణంబుగా, ముండనుఁడై ముఖమున్ తమస్సు
నిండఁగా, చింతాకులుండయి చనుచుండి,నట్లు కన్పింపగా అతివ మిన్న
తెల్లవాఱఁగలేచి ఎల్ల స్వప్నమ్మును, చింతించి కడు భయాక్రాంత అగుచు
ఎచటనుండినన్ తోఁచక ఏమి చేయు, దాన ? నని, విష్ణువున్న ఉద్యానవనము
నందలి విహార భూములయందు కూర్మి, చెలుల నిరువుర తోడుత కలసి తిరుగ.
కఠిన దంష్ట్రలు మిడిగ్రుడ్లుకలిగి మివుల, సింహనాదములేసియుచు చెలఁగి ఘోర
భీషణ ముఖమ్ములన్ చాల బెగడుపఱుప, కాంచి రిరువుర ఘోర రాక్షసుల నంత.
వృంద సంక్షుబ్ధ హృదయారవిందయై మ,హా భయభ్రాంతయై వారి నట్టె కాంచి
తనదు మీఁదికి పఱతెంచు ఘన కృపాణ, పాణులకు దవ్వుదవ్వుగా పరుగుపెట్టె.

ఆ. ఇటుల కొంతదూర మేగఁగా అచ్చట, మౌనముద్ర ధ్యానమూనియున్న
శిష్య పరివృతుఁడయి చెలువొందెడు మునీంద్రుఁ, గాంచి అమ్మహాత్ము కాళ్లఁబడుచు.

ఆ. జయ ! మునీంద్రచంద్ర ! శరణాగతను నన్ను, ప్రోవవలయు ననుచు పొక్కుచున్న
ఆ జలంధరుసతి ఆర్తనాదము విని, ధ్యానముడిగి లేచి ఆమె కనియె.

గీ. భయమువీడు మో నాతి ! నిర్భయముకనుము; ఏను కల్గంగ నీ కింక నేల భయమ
టంచు పెల్లారడించి, ఆ చంచలాక్షిఁ, తఱుముకొనివచ్చు అసురుల దర్పమడఁచి.

మ. వెడలంగొట్టిన మౌనిచంద్రుని మహా విక్రాంతికిన్ మెచ్చి, తాఁ !
గడు నాశ్చర్యమునొంది దండమిడి, వీరన్ మౌనిచంద్రా ! దయన్
కడిమిన్ ప్రోచితి; విప్ర నిన్నుఁగన ఒక్కండైన సంప్రశ్న చే
సెడు బుద్ధిన్ కనునన్ను నిశ్చయములన్ శిక్షించి కాపాడుమా.

గీ. నా పతి జలంధరుఁడు పోటునన్ మహేశ్వరుని చెనకి పోరచనియెను; ఘనులుమీరు
ఆగత గతంబులను చెప్పఁగాఁగలుగుదు, రెట్టిదో నాదుపతి వైన మెఱుగఁజెప్పుఁడ ?

క. అని వినయంబుగ ప్రార్థించిన ముని గగనంబుచూచి, చెలఁగెడు దయతో
వనితామణి యడిగిన ప్రశ్ననుగూర్చి తలంచునట్టి సరణి నటించెన్.

ఉ. అంత కపీంద్రులిద్దరు ఘనాసుర శీర్ష కబంధహస్తులై
వింతగ మింట కన్పడగ, వృంద కపీంద్రులచూచి పెల్లు వి
భ్రాంత మతిన్ కలంగి తన భర్త మృతిన్ కడు దుఃఖితాత్మయై
చింతమునింగి తత్క్షణమె చెందెను మూర్ఛ; పడెన్ మహీస్థలిన్.

మ. మునిచంద్రుండు కమండలోదకములన్ మూర్ఛాగతన్ తత్సతిన్
కని సంబోధితఁ జేయ, ఆమె మిగులంగా దుఃఖమున్ పొంది ఓ
మునినాథా ! బ్రతికింపు నా ప్రియపతిన్; మోదంబుతో నుందు; ని
న్ననయంబున్ భజియించుచుందు ననఁగా ఆ మౌనిచంద్రుం డనున్.

గీ. అబల ! రుద్రునిచే చచ్చినట్టివాని, మరల బ్రతికించు టరయ దుష్కరమెకాని
అతివ ! నీ యందు కల్గిన ఆదరమున, నీ పతిని బ్రతికించెద నిజమటంచు.

శా. అంతర్ధానమునందె; అయ్యమయు భవ్యానందమున్ పొందె; త
త్కాంతుండున్ మృతినందియున్ ముని కృపన్ కాఁబోలు తానంతఁ త
త్ప్రాంతంబం దొక వృక్షవాటిక నొగిన్ ప్రత్యక్షమైరాఁగ త
త్కాంతారత్నము గౌఁగిలించె విరహోత్కంఠావకుంఠాత్మయై.

గీ. మగనితోడ మహానందముగ చెలంగె, వృంద కొన్నాళు లా వనమందె ఉండి;
వివిధ కామవినోద సంప్రీత తృప్త, మానసుండగు జలంధరుండూనె సుఖము.

క. పరిపాటిగ కాలం బిటు, జరిగిన యామీద ఒక్కసారి అతివ తా
సురతాంతంబున ఆతని, హరిగా కనుగొని యనెన్ మహాకోపమునన్.

క. పరదార రతుండగు ఓ, హరి! నీ శీలంబు కాల్పనా? మాయివిగా
పరఁగిన నీ మునివేషము, సరిగా తెలిసినది నేఁడు ఛా! దుష్టాత్మా!

గీ. ఎవరు నీమాయఁ రాక్షసాకృతిధరించి, నన్ను వెంటాడిరో వారె నిన్నెదుర్చు
వార లందు జ్యేష్ఠుండు నీభార్యను కొని, పోవు; జయవిజయులు వారు పోల్చుకొంటి.

గీ. నీవు సర్వేశ్వరుండవై నెగడుచున్న, వనమున సతీవిరహమున వనరగలవు
నీకిపుడు తోడువచ్చిన ఆకపియుగ,మే వనిన్ నీకు తోడుగా ఎసఁగువారు.

వ. వారు పుణ్యశీల సుశీలురని నా కిపు డెఱుకపడె, వటువేషమున నీయొద్దనున్నవాడు తార్క్ష్యుండు, నీవింత ద్రోహంబునకున్ పాల్పడుదువే? విష్ణుండవైననేమి? జిష్ణుండవైన నేమి? నీదు పాపకర్మంబు నిన్ను కట్టికుడుపక పోదని మహాక్రుద్ధయయి శాపంబిడి వృంద చితిన్ పడి తన ప్రాణంబులన్ పాసె. అపుడు రుద్రుండు జలంధరున్ పరిమార్చె కావున.

గీ. ఓ మహారాజ! జయవిజయులు ధరించి, రవనిఁ రావణ కుంభకర్ణాకృతులను
వారిపుడు లంకలో ఉన్నవారు వారిఁ, చంపి శ్రీరాముఁడపుడు రాజ్యంబు చేయు.

క. పంచవటి నుండ సీత హ,రించి దశాస్యుండు తల్లిరీతి అశోకో
దంచితవనమం దిడి తా, పంచత్వమునొందు రాము బాణాహతిచేన్.

గీ. వాలిఁ జంపు సుగ్రీవు భుపాలుఁ చేయు, శిలలచే సంద్రమున్ కట్టి సీతఁ దెచ్చు
తీర్థయాత్రలు సల్పు నీద్వీపసప్త, కంబును జయించు చేయు యజ్ఞంబులెన్నొ.

ఉ. రాముని దివ్యశక్తియు పరాక్రమమెవ్వరు చెప్ప నేర్తు? రీ
భూమిని తత్కథల్ మునులు బుద్ధికితోచినయట్లు గాక శ్రీ
రామకథా ప్రసంగములు రమ్యరహస్యము లివ్వి ఏరికిన్
గోమున చెప్పవద్దనె, అకుంఠితమా దయఁ మాని; రాజుతోన్.

మ. వినవే పార్వతి! యిట్లు ముద్గలుఁడు తాప్రేమంబు తళ్కొత్తఁగా
ఘనుఁడౌ ఆ మనుజాధినాథునకు పొంకంబౌ భవిష్యత్కథన్
తన యోగప్రతిభావిశేషమున ప్రత్యక్షంబుగా చూచిన
ట్టనుమానంబిక దక్క తెల్పిన అయోధ్యాధీశుఁ డా మానితోన్.

గీ. పూర్వజన్మంబునందు ఏపుణ్యములను, చేసినాఁడను శ్రీహరి చెలిమిఁ నాదు
గర్భవాసమునన్ పుట్టె? కాంత సీత, నాకు కోడలౌటకు కారణం బదేమి?

క. దీని నెఱిగింప నేర్చరి, మౌనీంద్రా! నీవుగాక మహిలో గలరే?
ఏ నిన్ను వేడుకొనియెద, పూనిక వివరింపుమన్న ముని యిట్లనియెన్.

## దశరథుని పూర్వజన్మ వృత్తాంతము

సీ. పూర్వంబు సహ్యాద్రిఁ పొలుపారు కరవీర, పట్టణంబున ధర్మపరుఁడగుటను
ధర్మదత్తుం డన తనరె విప్రోత్తముం, డామహాత్ముండు నారాయణు నన
వరతంబు పూజించు; భక్తిమైకార్తిక, వ్రతమాచరించు ఆ వితతయశుఁడు;
ద్వాదశాక్షరమంత్రవరజపతత్పరుఁ, డతిథి సత్కార సంతత రతుండు

గీ. అఖిలభూతదయాపరుం డైనయట్టి, మహితుఁ డాతండు కార్తీకమాసమందు
ఒకట హరిజాగరణమున కుద్యమించి, పుష్పపత్రాంబుకరుఁడయి పోవుచున్న.

వ. అవ్విప్రోత్తముని కట్టెదుట విష్ణ్వాలయ ప్రాంతంబున.

గీ. నాల్క వ్రేలాడ సంరక్తనయన అగుచు, వంకకోఱలుఁ శుష్కాంగపాళికలిగి
బెడిదపుఁ బొబ్బలిడుకొంచు పెద్దదయ్య, మెుండుకనఁబడె అతనికి మొండిమొలది

శా. దానిం జూచి భయంబున న్వడఁకుచుం దద్బ్రాహ్మణుం డట్టె హా
హా! నారాయణ! అంచు నేలఁబడ పుష్పానీకముల్ నీరముల్
జానా ఆ తులసీదళంబులును రక్షస్త్రీపయిం దూలె, అ
ద్దానం దాని దురంత పాప మపుడే దగ్ధంబు గాం నమ్రయై.

వ. ఆ పిశాచ మిట్లనియె:

గీ. బ్రాహ్మణోత్తమ! బహుజన్మ పాపచయము, చేతను పిశాచరూపంబుచెంది చెప్ప
రాని బాధలు పొందినదాన; ఇంక, ఎట్లు సద్గతికాంచెద ఏమొనర్తు?

గీ. అనుచు భక్తిమై మ్రొక్కిన ఆపిశాచ, వచనములు విని పల్కె నా బ్రాహ్మణుండు
ఏమి పాపంబుకావించి ఇట్టులైతి, వనిన అది ఇట్లు చెప్పెను వినయమునను.

క. సౌరాష్ట్రదేశమున నే, నారయ జన్మంబుపొంది అట భిక్షుకుఁడౌ
పాటునకు భార్యనైతిని, పేరు కలహ యనఁగ జగతి వెలసెం నాకుం.

సీ. నే నపు డత్యంత నిష్ఠురవృత్తనై, మగనితోడుత మంచిమాట యెఱుఁగ;
అతనికి ఒకనాఁడుఁ అన్నంబు తిన్నగా, ఇడనైతి; వండినదెల్ల నేను
మొదటనే తినివైచి పిదప నాతనికింత, మిగిలిన పెట్టుచు మెటిక లెపుడు
విఱుచుచు మోమున మఱి వాని పల్కుల, కెదురొడ్డి పల్కుచు పదురుచుంటి;

గీ. ఇట్లు బాధలు పడిపడి ఎట్టకేల, కొక్క స్నేహితుఁ కని తన కక్కసంబు
లెల్ల నా పతి వివరింప హితుఁ డతనికి, ఒక్క మంచి యుపాయంబు నుగ్గడించె.

క. ఔ నన్నది కాదను నీ, చానకు ఒక యుక్తి ఇట్లు సల్పం లేవే!
పూనఁదలఁచుపని కాదని, కానిపనికి పూను మిట్లుగా చూడఁతగుం.

ఉ. ఇష్టములేని వస్తువునె ఇష్టము తెమ్మని పల్కుచుండుమా!
ఇష్టముగల్గు వస్తువు ననిష్టపుఁ బల్కుల గేలిచేయుమా;

కష్టము తప్పు; నీ వింక సుఖంబును చెందెదవన్న, అట్టులే
స్పష్టముగా చరించె పతి; బాగుగ నే నది కానఁజాలమిన్.

క. కాదన్న పనియె చేసితి, వాదమ్మున; అట్లు జరుగ మామామ కొగిన్
ప్రోదిగ శ్రాద్ధం బిడఁదగు, ఆ దినమున ఆతఁ డిట్టులనియెన్ దుడుకై.

గీ. నేఁడు నా తండ్రి తిథియె; ఈ యేఁడు దానిఁ, ఆచరింపను-నా విని అట్టె నవ్వి,
తగిన బ్రాహ్మణుఁడవె నీవు తండ్రి తద్దినంబు పెట్టనియెడల అన్నంబె పెట్ట.

గీ. పుత్ర ధర్మము తెలియదే ముందు నీకు, ఏమిగతి కాఁగలదో! చింతవల చేయ
వనుచు చీవాట్లు పెట్టి బ్రాహ్మణులఁ తగ నిమంత్రణముచేసిరాఁగ నా మగఁ డిటులనె.

క. ఐనన్ పక్వాన్నంబుల, నైన వలదు వండ; ఒక్కఁడైనన్ చాలున్
జానగు విప్రుఁడు వినఁగదె, నానావిధములుగా ధనంబు నాశపఱుపకే.

వ. అనిన పతి మాటల కులికి ప్రతికూలనై.

సీ. పదునెనిమిదిమంది బ్రాహ్మణులన్ పిల్చి, అన్నివిధముల పక్వాన్నములను
వండితి; ఆతండు పల్కె తా నిట్లు – నా, మాటను వినుము; మోమోటపడక
మన మిపు డిరువురమును వండినవి తృప్తిగా తిని ఆపైని కలది ఏదో?
బ్రాహ్మణులకు పెట్టవలెనన్న నే ధిక్కరించి వారలకె యర్పించితి నవి;

గీ. ఇట్లె సర్వనిషేధోక్తు లెసఁగ శ్రాద్ధ, మెల్ల సాంగముగా సాగె; మెల్ల పిండ
దాన మొనరించి, ఉపవాస మేను జేతు, ననిన మృష్టాన్నతృప్తు నాతని నొనర్చి.

క. పొరపాటున ఆతం డే, మఱి యీ పిండములు తీర్థమధ్యమునందున్
సరిగ విడువంగవలెనన, సరగున మలకూపమందు జాఱవిడిచితిన్.

గీ. అప్పు డతఁడు హాహాకార మొప్ప ఖిన్నుఁడై నిదానించి నా తోడ అనియె నిట్లు:
పిండములు తీయకుము దానినుండి అనిన, ఏను మలకూపమున దిగి ఎత్తి కడిగి.

ఆ. ఉన్న కాంచి వాని ఎన్నఁటికిని తీర్థ, రాజమందు వేయరా దటన్న
ఆదరమున నే సమర్పించితిని పిండ, రాజి భవ్యతీర్థరాజమందు.

క. ఇటు లేను చేయుచుండుట, చటులత; నా తోడ నెగ్గఁజాలక, ఒకతన్
కుటిలాలకఁ పెండ్లాడిన, చటుకున విష మేను క్రోలి చావఁగ అంతన్.

గీ. ఉగ్రులౌ యమకింకరు లుఱికివచ్చి, యముని కడకు నన్నున్ చేర్ప ఆతఁ డపుడు,
ఏ శుభాశుభములఁ జేసె ఈపె అనుచు, అడుగ ఇట్టుల చిత్రగుప్తుఁడు వచించె.

సీ. దుర్మార్గురాలు సత్కర్మ మింతేనియు, ఎఱుఁగదు మును తాని ఎసఁగ మెక్కి
పతికి పెట్టెడిది యీ పాతకి వల్గుని, నుంచుఁడు మలము భక్షించుగాత!

నిత్యము పతితోడ నిష్ఠతో కలహించె; సూకర గర్భాన సృక్కఁగాత !
పాకభాండముననె పాపాత్మురాల్ తినె; పిల్లియై ఉండుత పెక్కునాళ్లు !

ఆ. ఆత్మహత్య చేసినందుల కీ ధూర్త, భూతమగుచు తిరిగి పొగులుఁగాత !
అంత మూఁడుపుట్టు లమరి ఎంతయు బాధ, అనుభవించుఁగాత ! అనిన పిదప.

క. యమునాజ్ఞనంది వేగమ, యమభటు లతి క్రుద్ధులై మహాశ్రమలెల్లన్
క్రమముగ కలిగించి నన్నున్, తమ మనదగు నీ పిశాచ తనువున నుంపన్.

క. ఆనే నిటు భూతాకృతి, పూనితి; పదునైదు వర్షములు కడ చనియెన్
నానాహింసల నొందితి, మానని ఆఁకలియు డప్పి మాడ్చుచునుండన్.

ఆ. వణుజు నొకనిఁ పట్టి వాని వేధించితి, కొన్నినాళ్ళు దయను సున్న చేసి;
పిదప నుంటి కృష్ణవేణి సాగరమును, కూడునట్టిచోట కొన్నినాళ్ళు.

గీ. అచటి శివ విష్ణు గణము లత్యాగ్రహమున, వెడలనడచిన నన్ను; ఇక్కడ తిరుగుచు
ఏను నిన్గంటి నీచేత పూనియున్న, తులసి తీర్థ ప్రభావాన తెలివికంటి.

ఆ. పాపసంఘమెల్ల పరిహారమైపోయె, ముక్తనగుదుకాని భూత రూప
మెటుల విడువఁగలనొ! ఇఁక మూఁడుజన్మము, లెటుల కడపఁగలనొ! ఎఱుఁగఁజాల.

క. నన్నున్ శరణాగత నీ, వున్నత మతిచూపి ప్రోవుమో విప్రా ! నీ
కన్నను ననుప్రోచెడి వా, రెన్నఁటికిన్ కలుగ రింక ఈ లోకమునన్.

సీ. అని యిట్లు ప్రార్థింప అప్పు డా కలహా వా,క్యములెల్ల ఆలించి అవనిసురుఁడు
పాపచరిత్రంబు పట్టున భయమొందె; జ్ఞానమబ్బె నన ఆశ్చర్యపడియె;
అట్టి పాపంబుల కట్టి కష్టంబులు, కల్గెనన్నపుడు దుఃఖంబు కాంచె;
అత్యంత సాత్వికుం డగు హేతువున ఇట్టి, ఘోరంబుల న్వాని కూలఁబడియె;

ఆ. కొంతసేపు మివుల చింతింప శ్రీహరిన్, వాని మానసంబు స్వస్థతకనె;
కరుణతోడ కలహఁ కడతేర్పఁ తలఁచి యి, ట్లనియె ధర్మదత్తుఁ డాదరమున.

వ. అనిన శంకరునకు అవ్వాలి వృత్తాంతం బెటులయ్యెనని ప్రశ్నించిన పార్వతికి భవ్య వాగమృత లహరీ ప్రభావుండగు భవుం డిట్లనియె.

## పంచమ సర్గము

సీ. దానధర్మములచేతను తీర్థవ్రత జపా,దులచేత అఘములు కలగి తొలఁగు
అవిచేయ ప్రేత దేహమునందియున్న నీ, కనువు కామిని లాభ మందువలన
నీ కింత కలుగదు; నీదు దుస్థితి కన, దుఃఖంబు నాకెంతొ తోఁచు నిపుడు;
అల్పపుణ్యమున నింద్యమగు నీ ప్రేతత్వ, ముడిగిపోవుటకు వీలొదవదింత;

గీ. అదియునుంగాక జన్మత్రయానుభవము, కలుగఁజేయు పాపము భయంకరముకాదె ?
కాన నేనాచరించిన కార్తిక వ్ర,తార్థ ఫలమిచ్చువాఁడ ! కృతార్థవగుమ !

వ. అని చెప్పి ధర్మదత్తుండు.

ఉ. ఆ కలహాన్ కడున్ తులసి యంబులచే అభిషిక్తఁజేసె సు
శ్రీకర ద్వాదశాక్షర విశిష్ట శుభంకర మంత్రరాజమున్
ఏకరువెట్టుచున్; కలహ యింతని చెప్పఁగరాని దీప్తితో
మేకొనె దివ్యదేహమున మించగ అందము దేవకన్యనాన్.

గీ. యజ్ఞ దానఫలంబు లేవైన కార్తి,క వ్రతోత్కృష్ట పుణ్యసంకాశములొకో ?
కార్తిక వ్రతమహిమంబు కడఁగి పొగడ, బ్రహ్మ రుద్రేంద్రులకెకాదు; పరులకగునె ?

వ. అంత.

సీ. అది ధర్మదత్తున కొదిఁగి ప్రణామించి, ఆనందతుందిలయై చెలంగి
గద్గదస్వరమున కడఁక ఇట్లను: బ్రాహ్మ,ణోత్తమా! నీచేత ఉద్ధరింపఁ
బడితిని; దురితాబ్ధి పడి మునింగిన నాకు, నావపోలిక చిక్కినావు నీవు
నన్ను బ్రోచితివి ! నీకెన్న నేనేమి ప్ర,త్యుపకార మొనరింతు యోగి వినుత !

గీ. అనుచు వినుతించుచున్నయంతనె నభంబు, నుండి దిగె విమానము , విష్ణుదూతలద్ది
మోచికొనివచ్చి , రందున్న పుణ్యశీలుఁ,డును సుశీలుఁడుదానిలో ఉనిచి రామెఁ.

గీ. అప్సరసలు సేవింపఁగ అతుల వైభ,వమున మించెడు కలహను బ్రాహ్మణుండు
చూచి విస్మయమంది ఆ సురల కెలమి, భక్తి వెలయంగ సాష్టాంగపడియె నపుడు.

ఉ. లేవఁగఎత్తి భూసురుని లీలఁ సుశీలుఁడు పుణ్యశీలుఁడున్
పావనశీలు పుణ్యమయు బ్రాహ్మణుమ్రొల నమస్కరించి సం
భావితమైన నీ చరిత భవ్యము; నిన్ను జగంబులందు ఎం
తే వినుతించు వారలిఁక నెప్పుడుఁకూడ దయాపయోనిధీ !

సీ. ధర్మదత్తా ! నీవు ధర్మజ్ఞుఁ డవును; నా,రాయణధ్యానపరాయణుఁడవు
మేల్మేలు! హరివ్రతమే సల్పు భక్తుఁడ; వంచిత దీన దయాపరుఁడవు;
నీవు బాల్యం బాది నిష్ఠమై చేసిన, కార్తికవ్రత పుణ్యగరిమమందు;
అర్థంబు కలహకై అర్పించి తది ద్విగు,ణీ కృతంబయి బ్రోచె నిశ్చయముగ;

గీ. వెనుక నూఱుజన్మంబులన్ చెనకి చేసి,నట్టి పాపములెల్ల పోఁగొట్టె నిద్ది :
ఇంక రానున్న జన్మత్రయాంక పాప,మంతయున్ దగ్ధమయ్యె రవంతలేక.

సీ. మంత్రోదక స్నానమహిమచేతను దీని, పాపసంఘము పటాపంచలయ్యె !
విష్ణుజాగరణాది విమలపుణ్యములచే, ఇమ్మాల నీ విమానమ్ము వచ్చె !

దీపదాన మహాకలాప పుణ్యమ్మున్న, పరమ తేజస్స్వరూపంబు గల్గె!
తులసి కార్తికమున తోడరి పూజించిన, నేర్పుచే విష్ణుసాన్నిధ్య మొదవె!

గీ. ఇపుడు వైకుంఠమున కీమె నెలమి మేము, తీసికొనిపోవుచున్నాము భాసురముగ;
కార్తిక వ్రత ఫలదాన ఘనత నీవు, నిజసతీయుక్తి విష్ణుసన్నిధిని గనెదు.

ఉ. నీ వలె భక్తితోడుత వినిర్మల చిత్తముతోడ ఎవ్వఁడే
పావనుఁడైన విష్ణుని శుభవ్రతుఁడై తమిమీఱఁ గొల్చునో
ఆ వరమూర్తి ధన్యుఁడు; మహామతియౌ అతఁ డొందనట్టి సం
భావిత సద్గతి వ్రజము బ్రాహ్మణసత్తమ! కల్గ దేయెడన్.

సీ. నారాయణశ్లోక పారాయణముచేయు, నతనికి దుర్లభం బరయ కలదె?
విష్ణుసేవాయత్త విమలమానసునకు, పడయరానట్టి శుభంబు కలదె?
మాధవస్మరణామృతాధి కోన్మత్తున, కిహపరదుఃఖమ్ము లింత కలవె?
కేశవాత్యంత భక్తి వశాత్ముడయిన మహాత్మునికిన్ సాటి అగుదు రెవరు?

గీ. ధ్రువుఁడు గజరాజు లెవ్వాని తోడరికొల్చి, శాశ్వతసుఖంబు కనిరో! ఆ జాడ యెఱిఁగి
శ్రీ మహావిష్ణుఁ గొల్వని చేతులేల? నలిననయనుని పొగడని నాల్క ఏల?

క. ధరణిన్ దేహులకు హరి, స్మరణంబునకన్న మించు సద్గతి నొసఁగే
శరణంబున్నదె? విష్ణు, స్మరణామృతపాన రతుఁడె మహి ధన్యుండౌ.

గీ. నీవు నీసతితోడుత శ్రీవికుంఠ,మందు సారూప్య పదవియం దలరి, పిదప
దశరథుండను పేరుతో తరణివంశ, రాజవై పుట్టుదువు శుభరాజి మెఱయ.

క. నీ కిరువురు భార్యలతో, ఈ కలహాయు అర్ధపుణ్య మిట నొందుటచే
కైకయనఁగ నెగడును మూఁడో కాంతగ హరిఁగొలువఁ గదుర్; నీసుతుడై.

క. దేవతల బాధ లుడుపన్, శ్రీవిష్ణుఁడు రాముఁ డనగ చెలఁగి సుతుండై
ఓ విప్ర! నీకు కలుగు ప్రభావయుతుఁడ వీవు భాగ్యవంతుఁడ వనఘా.

గీ. రావణాదుల హరియించి రాజ్యమేలు, రామచంద్రుఁడు జగదభిరాముఁడగుచు
ధర్మదత్త! కార్తిక సువ్రత ప్రభావ, మింతగా నున్నయది తెల్ప ఎవరితరము?

## కార్తీకమాస శ్రీవిష్ణువ్రత మహిమ

వ. మహాత్మా! ఏ తీర్థములును, ఏ యజ్ఞములును, ఏ దానములును విష్ణువ్రతంబున కీడు కావు. అందును కార్తికమున విష్ణువ్రతం బఖిల ఫలప్రదంబు కావున సర్వదా విష్ణువ్రత సుస్థిరుండవై ఉండుము. మదమాత్సర్య దంభాదుల వదలి సమదర్శనుండవగుము. చైత్ర వైశాఖ కార్తిక మాఘమాసంబులనేని ప్రాతఃస్నానం బవశ్యాచరణీయంబు; బహుళ ఫలప్రదంబు. సర్వకాలం బాచరించుటంగూర్చి చెప్పవలసినదేమి? తులసీ

వనం బత్యంత శ్రద్ధమెయిర్ గొంపుము. ఏకాదశీ వ్రతం బాచరణీయంబు. గోబ్రాహ్మణ హరిదాస సంసేవనం బనుష్ఠేయంబు. చిఱుసెనగలు – తరవాణి – వంకాయలు మొదలగునవి ఆరగింపరాదు. విప్రోత్తమా! ఇవ్విధంబున ప్రవర్తించి తుదకు మావలె విష్ణుసాన్నిధ్యంబు నొందువాడవు.

క. ఏ నీ వ్రతార్థఫలమున, ఈనాతి వికుంఠ మందిరేద్ధ సుఖంబుల్
పూనఁగ నున్నదొ! ఆ నీ,మానిత ధన్యతకు వే నమస్కృతు లనుచున్.

గీ. పుణ్యశీల సుశీలు రగణ్యవృత్తి, ధర్మదత్తుని కీర్తించి తరలి కలహఁ
తీసికొని వికుంఠముఁ జేరి తేజరిల్లిరి, అమ్మహావిష్ణుమూర్తితో సమ్మదమున.

క. ఆ ధర్మదత్తుఁడే నీ, వై ధరణిన్ దశరథుఁడుగ ప్రభవించితివౌ
మాధవుఁడే నీ సుతుఁ డా,రాధించెదు నిన్ను మిపుల రాముఁ డనంగన్.

గీ. అరయ శేషుఁడె లక్ష్మణుం డయ్యెనిపుడు, భరతుఁడను పేర చక్రంబు ప్రభవమొందె
శంఖమిపుడు శత్రుఘ్నుఁడై జానుమీఱు; భాగ్యమన నీదెచుమ్ము! భూపాలవర్య!

గీ. శ్రీమహావిష్ణు కొమరుగా చేసికొన్న, నీవెకాకింక ధన్యులీ నిఖిలజగము
లందు కలుగుదురే? నీకు చెందరాని, సద్గతులు కల్గునే లోకసముదయముల?

క. అని యివ్విధమున నుడ్గల,ముని దశరథరాజుతోడ భూత భవిష్య
ద్ఘన వృత్తాంతము తేటగ, వినిచి అతని సత్కరించి వేడుక వెలయన్.

శా. శ్రీరామాదుల కౌఁగిలించి కడుఁ నాశీర్వాదజాలమ్ములన్
నారీరత్నములన్ సుతృప్తలుగ విన్నాణంబుమైచేసి, తా
నారీరత్నముతోడ వారలకు క్రన్నన్ భోజ్యసత్కార మిం
పారంజేసి తరించె జన్మమని సంభావించి వీడ్కొల్పినన్.

గీ. సైన్యయుతుఁడైన దశరథ సార్వభౌముఁ, డొప్పుచు అలంకృతంబయి యున్న ఆ అ
యోధ్య చొచ్చె నుదముఁగొని ఉచితరీతి, సచివ మర్యాదలన్ కని సంతసమున.

## శ్రీరామాదులు మరల నయోధ్యకు వచ్చుట

క. ఎప్పటికప్పుడు రామున్, తప్పక కనుఁగొనఁగ నెంచు తరుణులు తమిచే
కుప్పలు తెప్పలుగా కన, అప్పుడు రాముం డయోధ్యయం దడుగిడియెన్.

ఉ. కొందఱు పుష్పసంతతుల కొందఱు లాజల మీఁదఁ జల్లుచున్
కొందఱు కుంభదీపముల కొంచును హారతుల న్నలింపుచున్
కొందఱు సుందరాకృతిని క్రోలుచు కొందఱు భక్తిచేయుచున్
సుందరు లొప్ప రాముఁడు యశోవిభవాఢ్యుఁ డయోధ్య చేరినన్.

ఉ. మంగళవాద్య ఘోషము లమందగతిన్ చెలువొంద, భవ్యవా
రాంగన నృత్యముల్ చెలఁగ, ఆయతగాయక గాయనమ్ము లు
త్తుంగ గతిం చెలంగ, పరితోషితమానసలై ఎసంగు రా
జాంగనలెల్ల అంతిపురియందు ప్రవేశమునొంది రింపుగన్.

వ. దశరథుండును జనకమంత్రుల వస్త్రాలంకారాదుల సత్కరించి భోజనాదుల సంతుష్టులం గావించి మిథిలానగరంబునకంపె, ఇట్లే సర్వోత్సవంబులకును శ్రీరామాదుల మిథిలా పురంబునకున్ పిలిపించుకొని జనకుండు కౌసల్యాదులకు దశరథునకు ఆనంద జనకుం డగుచు ఉత్తరోత్తరాభివృద్ధిగ అల్లురన్ తృప్తిచేయుచుండె అంత.

క. రాముఁడు వినోదలీలల, ప్రేముడిఁ తమ్ములనుకూడి వివిధగతుల ను
ద్దామసుఖుఁడై చరించె ధ, రామరముఖు లయిన జనము లానందపడన్.

## శ్రీరామాదుల శోభన కళ్యాణోత్సవములు

ఉ. పిమ్మటఁ ఆఱుమాసముల మీఁదటఁ ఒప్పగు లగ్నమందు సీ
తమ్మ సమర్త యయ్యెను, ముదంబుగ తచ్ఛుభవార్త వేగ ది
వ్యమ్మగు బ్రాహ్మణప్రతతివల్ల ఎఱుంగఁ జేసె తండ్రికిన్
అమ్మహితాత్ముఁడౌ దశరథావనిపాలుఁడు సత్వరంబుగన్.

క. ఆ శుభవార్తకు మిథిలా,ధీశుఁడు కడు సంతసించి దీవ్యత్ప్రేమా
వేశ వివశుండగుచు ఆ, దాశరథి ప్రముఖ సముచిత ద్రవ్యములన్.

ఉ. కైకొని మంత్రివర్గములు కామినులున్ పరివార మొప్ప, సీ
తా కలవాణి దర్శన సుధామయ కాంక్షయు తొందరింప, సు
శ్రీకరమౌ అయోధ్యపురిఁ చేరె ముదంబున, రాజు తగ్గ సౌ
ఖ్యాకరమైన గౌరవము లారసి కూర్పఁ వికాసితాత్ముఁడై.

గీ. దశరథుని స్వాగతమునకు దద్దయు మది, సంతసమునంది జనకుఁడు సముచితముగ
అపుడు వియ్యంకు ఆలింగనాళిఁ దన్పె; అప్పు డందఱు ధన్యులమని తలఁచిరి.

వ. కౌసల్యాదులు సుమేధాదుల నమంద ప్రీతి నాదరించి సీతమ్మకనేక వేడుకలం జేయనంత.

సీ. మంటపావళిని అరంటి కంబములతో, తోరణంబులతోడ తొడరికూర్చి,
రాజసౌధావృత ప్రాకారములు నిండ, చలువపందిరులఁ ఇంపలరఁ గూర్చి,
సౌధమ్ములెల్ల భాస్వరచిత్రవర్ణ వి,భ్రాజిత రీతుల రమణఁగూర్చి,
నిలువు టద్దంబులు నిల్పి, మంగళరత్న, దీపకాంతులను సందీప్తిఁ గూర్చి,

గీ. కడు నలంకృతమైన శృంగారకేళి, మందిరంబులు, విహరణ మందిరములు
స్నానమందిరములు భటసమితిగూర్ప, రాజగృహ మొప్పె శోభనరాజి మెఱసి.

వ. ఇట్లలంకృతం బగు రాజమందిరంబున పరస్పర గౌరవాలింగనాదులచే ఆహ్లాదవార్ధి మగ్నులైన జనక దశరథ రాజకాంతలత్యంతానందాతిశయంబున సంచరింప వశిష్ఠ మహర్షీంద్రుండు సీతారాముల గర్భాదాన మహోత్సవంబు చేయించె నప్పుడు.

గీ. కొడుకు కోడ లిల్లాండ్రతో కూడియున్న, దశరథుని జనకుండు సత్కార మొప్ప వస్త్రము లలంకరణము లవారితముగ, పూజకావించి యిచ్చె సమ్మోద మెసఁగ.

చ. ఒక నెలనాళు లా జనకుఁ డుత్సవపాళి నయోధ్యయందు స్త్రీ
నికరము లొప్పగా ప్రభుని నెయ్యపు ప్రార్థనమీఁద నుండి, వే
డుకలను గాంచి బాంధవపటుస్ఫుట గౌరవము ల్చెలంగ, పు
త్రికలను బుజ్జగించి తన దేశముచేరె ప్రమోద మొప్పఁగన్.

గీ. సీతతోడ శ్రీరాముఁడు చెలఁగి పూర్ణ, భోగముల హేమరత్నప్రపూరితంబు లైన సౌధాంతరమ్ముల ననుభవించె, దాస దాసీ జనములు సదా భజింప.

గీ. తోన లక్ష్మణ భరత శత్రుఘ్నులకును, సముచితములైన ఆ యాయి సమయములను జరిగె నెలమి గర్భాదానవరమహోత్సవంబు లొప్పుగ జనకుండు వరుస కొల్వ!

చ. జనకుఁ డయోధ్య చేరియొ ? లసన్మిథిలాపురిచేర పంచియో ?
తనయుల నల్లురన్ పలువిధంబుల పండుగులన్ మహోత్సవా
ళిని పరితోషులౌనటు లలేఖ్యవిలాస సమస్త వస్తు వా
హనములఁ గౌరవించి ముదమందుచునుండె అనేక భంగులన్.

గీ. మాఱుమ్రోగునెచ్చట నైన మంగళములె, శుభమహోత్సవములెయెటచూడఁబడియె; అనుపమంబగు ఆ అయోధ్యాపురమున, వ్యాధి చింతాది బాధలు వదలిపోయె.

గీ. దశరథాత్మజు లంత నితాంత దివ్య, తేజులై, సర్వభోగవిభ్రాజులై, స మస్త జన మానసానంద మహిత సుగుణ, వితతినెల్లర తనిపిరి వివిధగతుల.

వ. అన విని పార్వతి, నాథా ! అప్పటి శ్రీరాముని నిత్యకృత్యంబు లెట్లుండెనని ప్రశ్నింప ప్రమోద మాన మానసుండైన శంకరుం డిట్లు చెప్పందొడంగె.

## శ్రీరాముని దినచర్యా వర్ణనము

క. శ్రీరాముఁ డువిద ! శౌచా, చారాదికములను తీర్చి సరయూనదికిన్
చారుతరాందోళికపై, భూరమణుని ముదలమీఁద పోవుచునుండున్.

మ. సరయూతీరమునందు డిగ్గి అచటన్ శౌచాప్తుఁడై మంత్రులున్
పరివారంబులు వెంటనంటి కడునొప్పన్ వారితో ముచ్చటల్
పరమానందముతోడ చేయుచు నదిన్ ప్రత్యూషమం దార్య భూ
సుర బృందంబులతోడ స్నానమొనరించున్ రాముఁ డుల్లాసియై.

గీ. నిత్యకర్మలు తీర్చి సన్నియమనిష్ఠ, రౌప్యలవణాజ్యధాన్యహిరణ్యముఖ్య
వివిధ దానంబుల నొసంగి విప్రవరుల, గౌరవపురస్సరంబుగా కడఁగి కొలిచి.

గీ. పట్టుబట్టలచేతను స్వర్ణరజ్జు,వులను వెలయుచు గుఱ్ఱముల్ పూన్చినట్టి
రథముపై స్నాతుఁడైన సారథి చెలంగ, రామచంద్రుండు మడితో పురంబుఁ జేరు.

గీ. వెండిబంగారు బెత్తాల వేడ్క మీఱ, పట్టి గజ్జెల కంచుకుల్ భక్తితోడ
చూపఁగా రాజమార్గముఁ జొచ్చి యేగి, రథముపై తాను నిజమందిరంబుచేరు.

గీ. రాజమార్గములందలి రాజముఖులు, పుష్పవృష్టులు హారతుల్ పొనరకూర్ప
నిత్యవిధిగాఁగ రాముఁ డమాత్యయుక్తి, చేరు నిజమందిరము సీత చేరికొల్వ.

గీ. రథము దిగి పాదుకలపైని రమణి యొసఁగు, అర్ఘ్యపాద్యాది పూజలనంది, విభుత
నగ్ని గృహమున సతితోడ ఆహుతులిడి, అగ్నిభట్టారకుని పూజ లమరఁ జేయు.

గీ. స్ఫటిక లింగవిస్ఫూర్తి శ్రీసాంబమూర్తి, నలరి, అభిషేక మొనరించి, అవనిజాత
యిడిన నైవేద్య మొసఁగి పసిఁడి ధరామ,రులకొసఁగి వారి యాసీస్సులెలమిఁ గాంచు.

వ. ఇవిగాక నిత్యవిధిగా గోపూజయు, అశ్వత్థ సమర్చనంబును, అతసీతులస్యారాధనంబులును కావించి, శ్రీ సూర్యనారాయణోపాసనంబుచేసి, బ్రహ్మయజ్ఞ విధానానంతరంబు సీతాసమేతుండై గురుఁడగు వశిష్ఠుండుచెప్ప వివిధ పురాణ పుణ్యకథా శ్రవణంబొనరించి, వారల సత్కరించి, తదనంతరంబ స్వబంధుపరివృతుండై వినోద సల్లాపశీలుండగుచు.

సీ. పత్నిచే పలుమారు ప్రార్థింపఁబడి రాముఁ, డారగించును ఫలాహారములను;
దివ్యఘృతానూన నవ్యపక్వాన్నము, లుపహారముగ కొను నిపుణతమెయి;
తదనంతరము సుఖతాంబూలమును స్వీక,రించి వస్త్రముల ధరించి, మించి
దర్పణమునచూచి, తత జానకీకటాక్ష కవచధరుఁడై, యశంబుమీఱ

గీ. రథ మధిష్ఠించి, మాతృదర్శనముచేయ, మంత్రి పరివారుఁడై యేగి, మాతలకు స
మంచితముగ వేర్వేర నమస్కరించి, సింహపీఠిక తండ్రినిఁ జేరి మ్రొక్కు.

ఆ. రాజు నాజ్ఞనంది, రాచకార్యంబుల, నధిక గౌరవమున నాచరించు;
అంది మన్ననగమి; అటనుండి మగిడి రా,జాజ్ఞపొంది, ఇంటి కరుగుచుండు.

గీ. జానకి ఒసంగు అర్ఘ్య మాచమనముకొని, ఆదరంబొప్పఁగా ఆమె కన్ని విషయ
ములును సరసహాస్యోక్తులు పొలుపుమీఱ, తాను తెలుపుచునుండును మానితముగ.

క. సరయూనదిలోనో! మం,దిరముననో స్నానమాడి, నియమముతోడన్
కరమరుదుఁగ కావించున్, సురుచిర మధ్యాహ్న సమయ శుభకర్మంబుల్.

క. ఎచ్చోటున సరయూనది, నచ్ఛముగా రామచంద్రుఁ డధిక ప్రీతిన్
విచ్చలవిడి స్నాతుండగు, నచ్చోటును రామతీర్థమందురు విబుధుల్.

ఉ. ఇప్పటికిన్ ప్రసిద్ధమయి యేర్పడియుండిన రామతీర్థమం
దొప్పుగ చైత్రమాసమున తుల్యతలేని మహాఫలంబులున్
చొప్పడ మూఁడులోకముల సుశ్రుతమౌ సరయూనదీస్థలిన్
తప్పక భక్తులెల్ల విదితంబుగ స్నానముచేతు రిష్టులై.

సీ. మధ్యాహ్నమగుడు బ్రాహ్మణులిష్టులును మంత్రి, సమితికొల్వఁగ రామచంద్రుఁడెలమిఁ
స్వర్ణపాత్రముల దివ్యరసైకపక్వాన్న, ములను కంకణములు మ్రోయుచుండ
మంజీర కింకిణీ మంజులరవములు, కర్ణపేయంబులై క్రాలుచుండ
సీతామహాదేవి చిఱునవ్వులొలయ వ, డ్డింప సాపడి చాల సొంపుమీఱ

గీ. దివ్యతాంబూలమున్ గొని తేజరిలుచు, శతపథగతుండగుచు వేడ్కసంచరించి
కొంచెముగ నిద్రవోయి అభ్యంచితముగ, లేచి నవనవవస్త్రము ల్చెలఁగ తాల్చి.

సీ. కోదండపాణియై కొమరొప్పగా పురో, ద్యాన వనముల వాహ్యాళితిరుగు;
పుష్ప దివ్యారామ భూములలో కొంత, హాయిగ తిరుగు విహారకేళిఁ;
మరల మంగళవాద్య మహనీయ వర్తనా, దులతోడ మందిరంబులకువచ్చు;
సాయంతనంబున సంధ్యాదికముల స, త్కర్మలు తీర్చు నితాంత నియతిఁ;

గీ. అగ్నిదేవు నుపాసించు, హరుభజించు; భోజనం బొనరించు, సంపూజ్య దివ్య
భవ్య సౌధాంతరముల సువర్ణరత్న, ఖచిత పర్యంక శాయియై క్రాలుచుండు.

ఆ. సీతతోడ హాస్యగీతాదులను వినో, దించు; సౌఖ్య నిద్రఁ గాంచు నిటుల
అధిక వైభవమున ఆ రామచంద్రుండు, పరఁగె పదియురెండు వత్సరములు.

వ. ఇటులుండ.

## దశరథునకు కౌసల్య ఎదుట శ్రీరామునిచే తత్త్వోపదేశము

చ. ఒక సమయంబునన్ దశరథోర్వివిభుం డురుభక్తియుక్తుఁడై
ప్రకటముగాగ ముద్గలుఁడుఁ, పల్మరు దేశికుఁడౌ వశిష్ఠుఁడున్
సుకరుని రామచంద్రుని విశుద్ధ గుణాకరు విష్ణుమూర్తిగా
అకుటిలవృత్తిఁ బల్కుట యథార్థమె అంచు తలంచి వెండియున్.

గీ. రాముని అమానుషములైన రమ్యకృత్య, ములను మదినెంచి, శ్రీరామమూర్తి నెఁ
లమ్ము శ్రీమహావిష్ణువన్ నమ్మకమున, సమ్యగురుభక్తి పారవశ్యంబుమీఱ.

శా. శ్రీరామున్ సుగుణాభిరాముని యశోసీమంతినీ నాథునిన్
ఆ రాజేంద్రుఁడు రామభద్ర! అని నెయ్యంబొప్ప నా

పేరఁ బిల్చి, అమందమోదమెసఁగఁ బ్రేమాభిసంధాయియై
రా రమ్మంచు రహస్య మందిరముచేరఁ బోయె ఉల్లాసియై.

వ. ఇట్లు చని, రహస్యమందిరమున ద్వారముకడ తెగువరులను కాపుంచి శ్రీరామునిఁ బిలిచి.

గీ. ఎన్నినాళ్ళయ్యెనో తండ్రి! నిన్నుఁగూర్చి, ఒక్క ప్రశ్నముచేయ నే నూహచేసి
నేటికట్టి సమావేశమాట కలిగె, సరగ నన్ బ్రోవవలయు నా శంకపాపి.

క. అజ్ఞానులైన లోకులు విజ్ఞానములేక సుతుఁడవే నాకీవం
డ్రో జ్ఞానసముద్దీపక! ప్రజ్ఞానిధి! దేవుఁడవు నిరంజనుఁడ వహో!

ఆ. భూభరము హరింప పుట్టిన శ్రీహరి, వీవకాదె? నన్నుఁ బ్రోవరాదె?
మాయచేత మోహమగ్నుఁడ నైతి స,ముద్ధరింపుమయ్య! ఇద్ధతేజ!

గీ. ఈషణత్రయబద్ధమా ఈభవంబు, నందు విశ్రాంతి కల్గుట అరయ సున్న;
జ్ఞానసముపేతుఁ కావించి సంస్కరించి, నన్ను బ్రోవంగరాదె? ప్రసన్న! వరద!

వ. అనిన విని శ్రీరాముం డిట్లనియె. రాజా! వినుము నీకొఱకు జ్ఞానమును నిరూపించెద కౌసల్యయుఁ సమీపంబుననుండుఁగాత! మనిన, రాజట్లె కావించె. అంత రఘువల్లభుం డిట్లనియె.

సీ. నశ్వరంబైన యీ విశ్వమంతయు చూడ, శాశ్వతంబను నట్టి జాడతోచు;
ముత్తెపుచిప్పపై మొనయు వెండితలంపు, త్రాడు పామనెడు చందంబు కలుగు;
ఎండమావులు నీళ్లనిండుపట్టుగతట్టు, ఆత్మయందున మాయ అంటిపట్ట
అజ్ఞానమున తెలియంగఁజాలరు కాని, సుజ్ఞాని యెఱుఁగు నీసుద్ది మివుల

గీ. నిస్పృహము,పరిశుద్ధము,నిర్మలంబు, సచ్చిదానందమయమైన సన్ను తాత్మ!
మాయచే కప్పబడి బంధమగ్నమగుచు, పలుతెఱంగుల దుఃఖాల పాలుపడును.

ఉ. ఏ పరమాత్మ అంశమున ఈ సచరాచర వస్తుకోటితో
ఈ పృథివీతలం బొగి నహీనగతిన్ సృజియించి బ్రహ్మనా
తోఁపగఁజేసి, విష్ణుడయి దుష్టుల చంపి భరించి, రుద్రుఁడై
మాపుదు అట్టి ఆత్మపరమంబు, వికారవిదూర మెయ్యెడన్.

గీ. ఆటలో వచ్చు పాత్రము లట్లు సగుణ, సర్వబింబాకృతులు తాల్చి సన్నుతాత్మ
సంచరించు; ఆత్మకు లేవు చావుబ్రతుకు; లద్ది ఆనందమయము ధరాధినాథ!

సీ. ఛేదింపఁబడదు ఖడ్గాదికంబులచేత; అగ్నిచే దహియింప ననువుపడదు;
ఎండచే శోషింప దింతయు; వానచే, తడియదు; నిత్యమంతట చెలంగు;
అది స్థిరంబైనది; అచలం బనాదిసి,ద్ధము, దానిఁ చూడ నేత్రములుచాల;
వవ్యక్త మది; అచింత్యము; అవికారంబు; అజ మవ్యయం; బవినాశకంబు;

గీ. అట్టి ఆత్మ అజ్ఞానంబునందు మునుఁగ, తెలియఁజాలక చింతింతు రిల మనుజులు;
కష్టసుఖము లహంకార గరిమ లెల్ల, ఆత్మ కాపాదనము చేయు టదియె ప్రకృతి.

గీ. బ్రహ్మ మొదలు పిపీలికవఱకు జగము, కదలఁజాల దాత్మయె లోన పొదలకున్న;
కాని స్థూలదేహమ్ములు లేనియెడల,నైన ఆత్మ సుస్థిరమయి అమరియుండు.

గీ. నీవు నేను నాత్మాంశ జనించినాము; కాని అందును భేదంబు కలదు చాల;
జన్మచే నీకు దుఃఖసంచయము కల్గు; నాకు అవి కల్గకుండు; పరా కిఁకేల ?

గీ. అబ్జపత్రంబునందు నీరంటనట్లు, నాకు అవతారములఁ కల్గునట్టి కష్ట
సుఖము లంటవు, నీవు విస్ఫుటముగాఁగ, ఇది యెఱుఁగక కష్టాలఁ పొదలు దెపుడు.

ఉ. కావున దేహగేహములు కామినులున్ సుతులున్ ధనంబులున్
నా వను భ్రాంతి వీడుము; దృఢంబుగ ఆ పరమాత్మ వస్తువే
ఈ వనుకొమ్ము; శాంతియు జితేంద్రియతా కరుణామయత్వముల్
దైవముపైని భక్తియు సదా శుచి కల్మి అహింస నూనుమా.

క. ఏవం విధ సద్గుణముల,తో వేదోక్తంబులైన త్రోవల జనుమా!
ఆవల లేదిక కష్టము, భూవర! దుర్గుణము కష్టముల కాకరమా.

గీ. దొంగతనము, జూదంబు, అభంగురమగు, దంభమును, వివాదంబు, క్రోధంబు, క్రూర
తయును,మాత్సర్యమును,భీరుతయును,లోభ,మాదియగుదుర్గుణములనర్థములుచుమ్ము.

గీ. వేద సజ్జన యతి పర విప్రనింద, లివి తగవు-సర్వవిధముల, నివ్వివదలు
మెపుడు పరమార్థ చింతతో విపుల నియతి, మై సదానంద చిత్తుఁడవై చరింపు.

మ. గత జన్మంబున నీవు నన్గుఱిచి విఖ్యాతైక భావుండవై
వ్రతముల్ పూనితి వెన్నియేనియు; జగత్ప్రఖ్యాత భక్తుండవై
కుతుకం బొప్పఁగ నేను కన్పడితి; నాకున్ మ్రొక్కి నన్ పుత్రుఁగా
అతులోత్సాహముమీఱఁ కోరి; తిపుడిట్లె నాడ నీ పట్టిగన్.

ఉ. కావున నేను నీ కొడుకుగా జనియించితి నీదు పట్టపున్
దేవికి; అందువల్ల నగు తీయని కూరిమి, ఇప్డు నీకు స
త్పావనమైన జ్ఞానము శుభంబుగ తెల్పితి; ఈ రహస్యమున్
కావలెనంచు కోరిననెకాని వచింపకు మెల్లవారికిన్.

వ. నేనిపుడు నీకు వచించిన అజ్ఞాన పరిహారకంబగు ఈ వృత్తాంతమును భద్రపఱుపు మనిన శ్రీరామచంద్రున కపగతమాయామలుండైన దశరథుండు రోమాంచిత శరీరుండై దివ్యజ్ఞాన సమ్యగ్భావపరిపూర్ణుండై ప్రణామంబొనర్చి పాదముల గాఢాలింగనము కావించుకొనిన శ్రీరాముఁ డిది మించి వచ్చెనని యెఱింగి.

గీ. తండ్రి ! నీ విట్లు బిడ్డకు దండమిడుదె? ఈ వెఱుంగని ధర్మము లెందు కలవె?
నరులమైయున్న మనకిట్టి వరుస తగునె? ధరణి నియ్యది హాస్యాస్పదంబుకాదె?

గీ. మానసికముగ సద్భావమూని నన్ను, నిత్య మారాధనము సల్పు నిష్ఠమీఱ
ఆదరముగల్గి మిపుల నాయందె ప్రాణ,ములు నిలిపి దృఢభక్తినిఁ బూనుమయ్య!

క. అని చెప్పి తల్లిదండ్రుల, జనితానందుల నొనర్చి చయ్యన రథమం
దున మంగళవాద్యమ్ములు, పెనగొన రాముండు చేరె ప్రియమందిరముఁ.

క. ఈ రీతి శుభకలాపుం,డై రాముఁడు పరమ సుఖము లలర నయోధ్యన్
గారవమును పరమాదర, మారయకొనె జనులవలన అనుజులతోడన్.

గీ. అపుడపుడు సీతతోడ అయ్యవనిపాల, సుతుఁడు జనకుల యిండ్లను సోదరుల గృ
హంబులందును తండ్రి గేహంబునందు, పంక్తిభోజనములచేయు ప్రముద మొదవ.

క. తనయింటికి తమ్ములు తం,డ్రిని భార్యలతోడ పౌరనికరంబును సం
జనితాదరుఁడగుచున్ భో,జనములకున్ పిలిచి సంతసంబును పొందున్.

గీ. సంతసంబున రాఘవుండెంతయేని, మురిపమున వారి నందఱ వరుస పిలిచి
భోజనాది సత్కారసమ్మోదితులుగ ఒ,నర్చి ఆదరణముచేయు నన్యాగతుల.

## శ్రీరాముఁ డందఱకు నానందప్రదుఁడగుట

క. వనవాసులు రాముని ద,ర్శనముంజేయంగవచ్చి రాజద్వారం
బున కాపుండెడు భటు లొ,ప్పనిచో వనికేగలేక పడియుందు రొగిన్.

ఉ. వందల సంఖ్యవచ్చి వనవాసులు మానులు రాముచేత మేల్
వందనముల్ ముదంబుమెయిఁబట్టుచు దీవనలిచ్చుచున్ ముదం
బందుదు; రుత్తమోత్తమములైన ఫలాదుల ఆరగించుచున్
ఉందురు పెక్కునాళ్ళు పడియుందురు రాముని పాయజాలమిన్.

గీ. రాఘవుడుచేయు నాతిథ్య రాజికొనుచు, పుణ్యకథల విన్పించుచు పూరుషోత్త
మునికి సంతృప్తి కూర్చుచు మునులు వలయు, దినములుండి యేగుదురు తద్వనములకును

గీ. జానకీదేవి తనపతి వేనియందు, ప్రీతిగలవాడొ? అది కనిపెట్టి, వాని
చేసి, సరసహాస్యక్రీడ చెలఁగ తాను, మిపుల నానందపడుచుండె మేలుమీఱ.

ఆ. ఇట్లు సీతతోడ ఇలరామచంద్రుండు, పెండ్లియైన వెనుక ప్రీతి వెలయ
పదియు రెండు నేండ్లు పరగె నయోధ్యలో, వర్ణనీయమైన వైభవముల.

గీ. కృతయుగంబున వేయిరెట్లతిశయించి, త్రేతయందున నూఱురెట్లాతతమయి
ద్వాపరంబున పదిరెట్ల నేపుమీఱి, కలియుగంబున సమమయి కాలముండు.

గీ. దేవభోగంబు లొందుచు దేవదేవుఁ, డైన శ్రీరాముఁ డున్నప్పు డాతతముగ
సర్వదా ఫలపుష్పముల్ పర్వమిగుల, చెలఁగుచుండెను వృక్షముల్ పొలుపెసంగ.

ఆ. చోరభయము లేదు, జారఘోర మృగాది, బాధలేదు, కఱవు భయములేదు
పిసినితనము లేదు, పీడలు లేవు; శ్రీ, రాముఁ డా యయోధ్య రమణనుండ.

గీ. రాసుతుల పెండ్లిపిలుపున రమణమీఱ, వచ్చినట్టి యుధాజిత్తుఁ బావయగు ద
శరథుఁ డపు డయోధ్యను నిల్వ సరవిఁ గోరె, ఆయుధాజిన్నృపుండు కైకేయి భ్రాత.

ఆ. చాలకాలమాయె; సమ్ముదమయ్యె మీ, ముదలసాగె; ఇపుడు ముదలయింపు
త్వరగ అల్లురైన భరత శత్రుఘ్నుల, తోడ మానగరికి నేఁడుపోవ.

వ. అని కోరి దశరథుని సమ్మతి పొంది సతీయుతులైన అల్లుండ్రఁ దోడ్కొని కేకయ రాజ్యంబునకు యుధాజితుం డరిగె. సంప్రీత హృదయులై దశరథ కౌసల్యలు వారిఁ సాగనంపిరి అంత.

గీ. పార్వతీ! నీవు నన్ను సంప్రశ్న చేసి, నట్టి శ్రీరామ బాల లీలావళులను
నీకు ప్రియముగ, తరియింప లోకమెల్ల, తెల్పినాఁడ; అవ్వలి కథ తెల్పువాఁడ.

ఆ. మంగళప్రదంబు, మాన్యంబు శుభగ, మత్యంతవైభవంబు, సంముద ప్ర
దంబు, రామచంద్ర సంబంధ బాల్య చా, రిత్ర మిదివినంగ ధాత్రి గౌరి!

గద్యము

ఇది శ్రీ బాలభారతీ ప్రసాద లబ్ధకవితా ధౌరేయ
పండిత చిలుకూరి శ్రీరామశాస్త్రి నామధేయ
ప్రణీత శ్రీమదాంధ్రానంద
రామాయణాంతర్గత
సారకాండస్థ
బాలకాండము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# ఆనంద రామాయణము



## అయోధ్యా కాండము

### ప్రథమ సర్గము

#### శ్రీరామునకు నారదముని దేవప్రార్థన విన్నవించుట



శ్రీరాముఁడునున్ సీతయు, ఈ రీతి నయోధ్యయందు ఎలమిన్ మెలఁగన్
నారదుఁడు వచ్చె నింగిన్, ఆరయ రవి మబ్బునుండి అరుదెంచు క్రియన్.

గీ. సీతతోడుత రాముఁడున్ భ్రాతయైన, లక్ష్మణునితోడ వచ్చిన సూక్ష్మబుద్ధి
నారదమహర్షిఁ దద్దయు గారవించి, అర్ఘ్యపాద్యాది పూజల నమరఁ జేసె.

క. ముదమంది మౌని, రామా! త్రిదశు లిటుల్ విన్నవింప తెల్పిరి నీతో
మొదటన్ రావణుఁ జంపుము, పిదపన్ రాజ్యంబుచేయు పృథుశక్తి హరీ!

మ. అనినన్ రాముఁడు సంతసించి, ముని నెయ్యం బొప్పఁగా పంపి, సీ
తను వీక్షించి సతీమణీ! యిపుడు చిత్రం బయ్యెడున్; నీదు మా
మ ననున్ తా యువరాజుఁ జేయఁ దలఁచున్; మన్నించి యేన్ రాక్షసా
ళిని చంపంగను దండకాటవికి వే లీలాగతిన్ పోయెదన్.

గీ. పట్టభంగంబు సమకూడు పడఁతి మిన్న! నీవొ? అత్తమామలసేవ నియతి నుండు
మిచట నన్న, రామునిఁ గాంచి యివ్విధమున, సీత! మృదువాక్య జాలవిఖ్యాత! అనియె.

గీ. నాథ! మూఁడుకారణముల నన్ను మీరు, మీదు వెనువెంటఁ తోడ్కొనిపోదు రటవి
సీమకని నాకు దృఢముగా చెప్పు నాదు, హృదయ; మా కారణంబు ల వేమటన్న.

చ. వినుఁ డొక మౌనిసత్తముఁడు! విశ్రుతకీర్తి! యథార్థ వాఙ్మి! న
న్గని, ఒకనాఁడు, తండ్రి కడఁకన్ పరిఖేలనశీల గాంచి, హా
యనముల నేడొ? యెన్మిదియొ? యైన నన్ దరిఁ జేర్చి కేలుదో
యిని పరికించి ఏమొ వచియించి, తుదన్ ననుఁ గూర్చి యిట్లనెన్.

గీ. "ఈమె పతితోడుత అరణ్యసీమ కేగు", వినుము! తచ్ఛాస్త్ర మ మ్మహామౌని వచోవి
ధాన మది అసత్యం బగునేని లోక, జాలములు నిల్చునే? రఘుస్వామి! ఇంక.

నా స్వయంవర సమయమునఁ త్రినేత్రు, ధనువునీ వెక్కు వెట్టి[illegible] దేవతలుల
కేను శ్రీరాముఁడే ధను వెత్తునేని, ఎలమి మునివృత్తి పదునాలుగేండ్లు వనము
లందు వసియింపఁగ ప్రతిజ్ఞ నందియుంటి.

చ. అది నెఱవేఱఁగా వలదె? ఆర్యులు రామకథాప్రసంగముల్
చదివెడువేళ వింటి, నట జానకి సంగతి రామచంద్రుఁడుఁ
వదలి యొకండె లేడు వనవాసము చేసినయట్టు, లిప్డు మా
ర్పొదవఁగఁ జేతు రెట్టుల? నరోత్తమ! ఇద్ది యెఱుంగచెప్పుఁడీ.

క. ఈమూఁడు కారణంబుల, స్వామీ! నను వనములకు ధ్రువంబుఁగ మీతో
ప్రేమ కయిసేతు రనుటయు, నామాటకు నవ్వి రాముఁడను విహ్వలుఁడై.

అట్లకానిమ్మ; ఇన్ని వచోశు చయము, నెచట డాచితి విన్ని నాళ్ళింత ప్రజ్ఞ
కలుగుట యెఱుంగనని మెచ్చి చెలిమితెలిపి, రమణి కౌఁగిటఁ అలరించె రాముఁడపుడు.

పిమ్మట దశరథుండును శ్రీరామచంద్రునికి యౌవరాజ్యపట్టాభిషేకంబు చేయందలంచి
వశిష్ఠ మహర్షి నవలోకించి.



క. రామునకు నిఖిల జగదభి, రామునకు మునీంద్ర! యౌవరాజ్యపు పట్టం
బీమెయికట్టింపుఁడు నే, నో ముదుసలి; నాతఁడేలు టొయ్యనఁ కాంతుఁ.

చ. అని కడుకౌతుకమ్మున ధరాధిపుఁడన్న, వశిష్ఠమౌని ఆ
తనిఁ గొనిపోయె కోసల సుతాసదనమ్మున; కప్పుడే సుమి
త్రను పిలిపించె నచ్చటికి, రాజువచించిన రీతి రాణులుఁ
వినగ వచించి, యిట్లనియె విశ్రుత దివ్యభవిష్యదర్థముల్



క. కైకవరమ్ముల వలనన్, భూకాంతా! రాక్షసులను పోరిగ్గొన రామునా
డా కలముల భక్షించుచు, తాకాంతానుజులతోడ తరలు నడవికిఁ.

క. రేపే శుభలగ్నంబగు, ఏపుగ పట్టంబు కట్ట నేర్పాటుల నిం
పౌ పగిదిఁ చేయింపుము, భూపా! అది జరుగవలయు పొలుపున జరుగఁ.

సీతయును లక్ష్మణుఁడు వెంటఁ జెలఁగి రాగ, దండకాటవిచేరు రాముండు రేపె
రావణాది రాక్షసుల దురంబునందు, సంహరించు; ఆపయిని రాజ్యంబునొందు.

జరుగవలసిన విధియెట్లు జరిగితీఱు, రామవిరహముచేత స్వర్గంబు నందు
దీవు శాపంబుచే; చేయఁగా వలసిన, పనుల చేయింపు మభిషేకమును పొసర్ప.

మరల రామరాజ్యోత్సవ మరయు నీమె, పూతచరిత, కౌసల్య, ఓభూతలేంద్ర!
నీవు వైమానికుండవై నిలిచి చూతు; వవని విధివ్రాలు తప్పింప నెవరితరము?

మ. అనినఁ రాజు కలంగి తేఱుకొని, ఔరా! యెట్లు గాఁగల్గె; త
ప్పునె? ఆనాఁటి మహోగ్రశాపము – సుఖంబుల్ కష్టముల్ వచ్చి ఎ

ష్టు నరుఁ బొందునో? దుష్ట కర్మఫలముల్, పూర్ణంబుగా బాధ నెం
దును చేకూర్చియె పీడ – జ్ఞానమగునే? దుఃఖించుటే చొప్పునన్?

## శ్రీరామ పట్టాభిషేక ప్రయత్నము

క. అని గుండె దిటవుకొని అ,జ్జనపతి రాజ్యాభిషేక సంభారములన్
పొనరంగకూర్చి మునులన్, మనుజపతులఁ పిలువనంపె మాన్యుండగుచున్.

గీ. నగరమెల్ల నలంకృతముగ నొనర్ప, చూడ కన్నులపండువై చోద్యమయ్యె;
రాజులెల్ల వచ్చిరి భక్తి రాజిలంగ; ఋషులు దయచేసి రెల్లరు నెలమి మిగుల.

గీ. తోరణములతో ధ్వజములతో వెలయు వి,శాల మంటపాంగణముల చక్కనైన
హేమకుంభంబు లొప్పార శ్రీ మనోహ,రంబయి చెలంగె పందిరి రమణమీఱి.

గీ. అప్పు డాజ్ఞాపన మొనర్చె వ్యశిష్ఠు,డల సుమంత్రుని కట్టుల అరసి నీవు
రేపు ప్రొద్దున ఇవియెల్ల నేపుమీఱ, సిద్ధపఱుపంగవలయు అశ్రద్ధలేక.

సీ. మధ్యకక్ష్యమున సువర్ణ భూషణముల, నొప్పారు కన్యక లుండవలయు;
షోడశ గజములు సుందర స్వర్ణ ర,త్న విలసితములౌచు తనరవలయు;
ఐరావతీయమై నట్టి చతుర్దంత, భద్రగజంబట పరఁగవలయు;
పులిచర్మములు మూఁడు వలయు, శ్వేతచ్ఛత్ర, మొకటి ముక్తాహార ప్రకటితంబు;

గీ. సర్వతీర్థ సాగర పుణ్యజలమువలయు; దివ్యకుసుమమాలికలును, దివ్య వస్త్ర
భవ్యభూషణములు సిద్ధపఱుపవలయు, రామపట్టాభిషేక ముద్దామత కన.

గీ. మునులు సంస్కృతులై ముదంబున చెలంగి, ప్రాఙ్ముఖముగ సమిత్కుశపాణులగుచు
సిద్ధముగ నుండ్రుగాత! మహోద్ధతముగ, మొనసి మంగళవాద్యముల్ మ్రోగుఁగాత!

ఆ. సాయుధముగవచ్చి చతురంగ బలములు, నిలుచుఁగాత! దేవనిలయ పూజ
లమరి భక్ష్యముల్ ఫలము లుపహారముల్, కడు నివేదనములు కాగవలయు.

క. కప్పంబులు కైకొని తా, మొప్పింపఁగ రాజులెల్ల రుత్సాహముతో
ఒప్పగు భక్తిశ్రద్ధల, తప్పక నిలుచుండవలయు తత్సమయమునన్.

వ. అని ఆజ్ఞాపించి, రథంబెక్కి, శ్రీరామమందిరము డాయన్ చని గౌరవపూర్వకంబుగ శ్రీరామునివలన అర్ఘ్యపాద్యాదులంది, ఆసీనుండై; మఱునాడు జరుగవలసిన పట్టాభిషేక వృత్తాంతంబంతయు శ్రీరామచంద్రుని కెఱింగించి, ఇట్లనియె.

ఆ. నేఁడు సీతతోడ నీవు యథావిధి, నుపవసింపుమయ్య ఉర్వినేలు
పట్టమునకొ! వననివాసపట్టమునకొ! పనికివచ్చు రామభద్ర! వింటె?

వ. లోకరీతిన్ తండ్రిమాటన్ బట్టి పట్టాభిషేకంబున కంగీకరించి, జితేంద్రియుండవై, భూశాయిగా నుండుము. యథార్థమేమన, రామా! నీవురేపు దండకాటవికి ప్రయా

ణం బగుదువు. పదునాల్గు వత్సరంబు లట వసించి, రావణాదుల సంహరించి, సీతాలక్ష్మణ సమేతుండవై, మరల అయోధ్యకువచ్చి, రాజ్యాభిషిక్తుండవగుదువు. నీ కిడిన సుము హూర్తం బదియ అనిచెప్పి శ్రీ సీతారామలక్ష్మణులఁ తనివితీర దర్శించి, వెడలె. అపుడు కౌసల్యాసుమిత్రలు వశిష్ఠుని వలన రామరాజ్యాభిషేక భంగం బెరింగినవార గుట మహానుతాపతప్తలై, విఘ్నశాంతి అగుఁగాక! అని మునులచే శాంతి కర్మం బులు చేయించి, దేవినారాధించుచుండిరి. అంత అపరాహ్ణసమయంబున.

గీ. దాసిపుత్రికయైన మంథర పురంబు, నందుకలుగు అలంకరణాతిశయము
కాంచి రాజవీథిని, విచారించి రామ, చంద్రు పట్టాభిషేకముఁ జాడయెటేఁగి.

మ. త్వరగఁ కైకను చేరి, సత్వరమె వృత్తాంతంబు సర్వంబుఁ ఉ
ద్ధుర సంతాపముతోడ తెల్ప, విని సంతోషించి ఆకైక భా
స్వర సద్రత్నమయోపహారపరితోషం బిచ్చె, బిట్టల్గి మం
థర మేల్మో! లిటువంటి పిచ్చి తగునే? నామాట నీ వెంచితే?

శా. కైకా! ఎంతటి వెఱ్ఱిదాన! వయయో! కౌసల్య పుత్రుండు రా
జై కూర్చుండిన, రాజమాతయగు కౌసల్యాసతీదాసివై,
నాకుఁ దాసికి దాసి పట్టమిదు విన్నాణంబు నూహింపకే
యీ కళ్యాణపు వార్త కుబ్బెదవు; నీ కింపైన నా కౌనటే?

ఉ. బేలవుగాన, "రాజునను పేర్మిని, చూచును రాణులందఱుఁ
జాలరు నీ"కటంచు పరుసారులు పల్కెనటందు; వేది భూ
పాలుని కూర్మి నీ యెడల? పట్టముకట్టునె నీ కుమారునిఁ ?
గోలవు తెల్లవైన ననుకొందువు పాలని, నమ్మవచ్చునే?

క. పట్టముకట్టఁగ రాముం, డెట్టో? భరతుండటన్న ఎట్టికి కనితే?
పట్టుగ తన కక్కఱయగు, పట్టున కొనియాడు ప్రేమపాడైనదటే!

క. అబ్బా! మగవారనినఁ, గొబ్బున నమ్మంగరాదు; కొనకొని తమ స్త్రీ
లుబ్బి సుఖమీయ పల్కుదు, రబ్బో! దబ్బరలు వేలు రక్తి కలుగఁగఁ.

గీ. అనుచు నేమేమొ పల్కుచున్నట్టి దాసి, వచనముల వినుచుండె తా వాఁడియైన
శూలముల కర్ణముల గ్రుచ్చుచున్నదనఁగ, శివశివా! ఏమి అందువే! చెలియ! యనుచు.

క. కైకేయిపలుకు, జ్ఞానము, లేకన్! ఏమేమొ? భయములేక పలుకుదే!
పోకదల యటవె? మంథర! నా కొడు కెటు రాజ్యమేల అర్హుండగునే?

చ. భరతునికన్న మిన్నయగు భక్తిని, తల్లినిమించు గౌరవ
స్ఫురణను, నిత్యముఁ ధరణి సోఁకఁగ నాకు నమస్కరించి ఆ

దరమున సేమ మారసి, సుధామయకీర్తిని కోల్చు రాముఁడా
పరమ గుణాభిరాము నిజపట్టము నాకెటు కష్ట మయ్యెడిన్ ?

గీ. ఎట్టు పల్కెదే మంథరా! ఇట్టి విప్పుడు? అనిన కడు మండిపడి ఏడ్చి, యైన బాగె
నీకు ముఖమున దాసీత్వమే కలిగి, లిఖించియున్న దాసిగ నే భరించఁజాల.

ఆ. నాకు సెలవొసంగినన్ పోవుదాన; ఎచ్చోటనైన కలుగ రోటు దొరలు!
తొత్తుక్రింద ఒక్క తొత్తునై పడియుండఁ జాల; ఋణముతీఱె సరిగ మనకు.

గీ. నీదు శ్రేయస్సు చెప్పిన నీ వెఱుంగఁజాలకున్నావు, ఇన్నాళ్లు పాలొ? నీళ్లొ?
నీవి త్రాగుటఁ ఇంతగా నే వచింతు; కందకున్ లేని దురద చే మందనేల ?

క. అను నిష్ఠురోక్తులకు, ఏ, మనెదవె? కోపింతువేల? అర్థం బటవే?
ఘనుఁ డగ్రజుండు శ్రీరామునికిన్ గా కెటులగునొ చెపుమ భరతునకున్ ?

వ. అని అడిగిన అక్కైకకు మంథర యిట్లనియె.

క. అటు లడిగితివేఁ చెప్పెద, పటుతరమగా వెరవు; నీవు బవరంబున మున్
పటిమమెయి రెండు వరముల, నటుపయి కోరెద నటంచు ఆర్జించితిగా.

క. ఆ రెండువరము లిప్పుడు, భూరమణుని కోరు మంత పొలుపుగ నీపై
కూరిమి కలదో లేదో! ఆరయు, మా వరములేమి? అనినన్ వినుమా.

గీ. భరతునికి యౌవరాజ్యంపు పట్ట మిచ్చునట్టు లొకవరంబును కోరు మమ్మ! కైక!
రెండవ వరాన రాముని దండకాటవిని పదియునాలుగేండ్లుండ పనుపుమమ్మ.

ఆ. అనుచు పల్కుమాటలను విని కైక మూర్ఛిల్లె ధరణిపైని చెలులు శీత
లోపచారములొగి నొనరింప తా తెప్పతిల్లి యిట్టులనియె మెల్లమెల్ల.

గీ. ఎంతదానవె? మంథరా! ఇట్లు పల్క, నీకు నోరెటు లాడెనే? నెలఁతవటవె?
రాక్షసివొ! ఏమొ! భరతుని రాజుఁ జేయఁ, కోరతగు; రాము వనికంపఁ కోరుటేల?

క. అనినన్, బేలవు కానన్, కనలేవింతైన నిజము; కౌసల్య నినున్
చెనకి అవమానపఱుపం, గను ప్రత్యపకార మిట్టుగా చేయఁతగున్.

గీ. నీకు భయమేల? అంతయు నేనుచెప్పి, నట్లచేయుమ; నీవు నిప్పట్ల భూష
ణాదులన్ తాల్చి యచటికి కాదు పోవ; కోపగృహము ప్రవేశింపు మోపడంతి!

ఆ. వారలెల్ల పనులు తీరిచి, నీరాము, నెటఁగి కొంత్రు; నిన్ను మరగియున్న
రాజు నిన్ను పిల్వ రా వరంబుల నియ్య, వలయు ననుము; అతఁడు తల నటూఁపు.

గీ. కోరుమిా! వరంబులు కోర్కికొనలుసాగ, నీకొడుకు రాజగును; ఎంతయో కులికిన
యట్టి కౌసల్య పాట్లు నా కవగతంబు, లా నవుడు, నాకనులు చల్లనౌను రమణి!

క. అని తెలుపుటయున్ కైకయు, విని మోహంబున మునింగె; విధికృత మెటు త
ప్పును ? కైక కోపమందిర, మును చేరెన్; దశరథుండు మోదముతోడన్.

గీ. సర్వసన్నాహములుచేసి, సరగ కైక, కోపగృహమందు చేరెనన్ ఘోరవార్త
విని, కడున్ వేగ అచటికి చని విశీర్ణ, కేశయై స్రుక్కుచున్న కైకేయిఁ చూచె.

ఆ. భూషణాళి లేక భూమిపై పడియున్న, సతిని చూడ గుండె జల్లుమనియె;
భరత యౌవరాజ్య పట్టంబు, రాముని, వనికి పంపవలయు వార్తతెల్పె.

శా. హా! కైకా! యని మూర్ఛపొందె నృపుఁ డాహా! స్త్రీలుగా యెంతకున్
వీకన్ సాహసమున్ పొనర్తురట నుర్వీనాథుఁ డా మూర్ఛతో
నే కైకేయి గృహంబునన్ పడియె; నిర్ణీతంబుగా మంత్రియున్
వే కాలంబున రాజచంద్రు నెలమిన్ వీక్షింపఁగా చెచ్చెరన్.

ఉ. కైకగృహంబునన్ ధరణికాంతుఁడు చిక్కినటం చెఱింగి, తా
నాకులుడై సుమంత్రి ఉదయం బయినంతనె యేగి సత్వరన్
కైకను పిల్చి, ఱేనికయి క్రన్నన ప్రశ్న మొనర్ప, ఆమె యి
ట్లే కొనిరమ్ము రాము; ధరణీశుఁడు వానిని చూడ నెంచెడున్.

క. అనిపల్కి కైకవచనం,బును విని, ఆమంత్రి అపుడు భూపునిముదలన్,
కొని తోడితెత్తు నన, అ,జ్జననాథుఁడు హీనమైన సవ్వడి ననియెన్.

గీ. రామచంద్రుని కొనిరమ్ము రయమునుమీఱ, ననిన రాజాజ్ఞ నెరవేర్చె ఆ సుమంత్రి;
రామచంద్రుఁడు కైక వార్తవలననె ఎఱింగె తన వనవాసము సంగతమని.

ఉ. పూర్వము స్వర్గమం దొక అపూర్వమహాహవమైన దానిలో
ధూర్వహవృత్తి దేవతలు దుష్టనిశాచరధాటి కోడ తా
నుర్వరనుండి నీజనకుఁ డుగ్రరణంబున కేగి రాక్షసో
ద్గర్వముల న్విభిన్నములుగా నొనరించె పరాక్రమోద్ధతిన్.

గీ. అట్టి సమయంబునందు నే నాహవమున, నీమతండ్రికి మిగులసమ్మోద మొఁదవఁ,
జేసి రెండువరంబులు వాసి మీఱ, కొంటి వానిని ఇపుడ ఇమ్మంటి రామ !

గీ. దీనికై సూర్యవంశభూజాని యితఁడు, వెనుకముందాడు; అహ! భరతునికి యౌవ
రాజ్యపట్టంబుకట్టుట, రాము వనికి, పదియునాల్గు వత్సరములు పంపుటయును.

క. కోరితి; దీనిగుఱించియె, (శ్రీ)రామా ! నీకు తెలుప చెచ్చెరనిను ఈ
భూరమణుఁడు రమ్మనె ననఁ,గా రాముఁడు మందహాస కలితాననుఁడై.

ఆ. ఇంత కొలది పనికి ఇంత చింతిల నేల ?, భరతునందు రాజ్యభరము నిలుపు;
ఏ నరణ్యమునకు ఏగి వచ్చెద తండ్రి !, గడవు కడపి వత్తు కడఁక ననిన,

ఆ. ఇటను నన్నువీడి చటులఘోరారణ్య, ములకుబోదె? రామమూర్తి! అనుచు
నిన్నుపాసి ఇచట నిలువ నెట్లోపుదు?, ననుచు దశరథుండు కనియె మూర్ఛ.

క. హా రామభద్ర! ఇట్టుల, ఘోరారణ్యమున కేగ కొనకొనియెదవా?
హా రామ రామ రామా!, శ్రీరామా! యనుచు రాజు చెందెన్ మూర్ఛన్.

వ. అంతట శ్రీరాముఁడు తండ్రికి శైత్యోపచారంబులఁ గావించి తేర్చి.

ఆ. తల్లి యిచ్చ సఫలతన్ పొందుఁగాక! వాగ్దానమదియు నీది క్రమముగాను
చెల్లుఁగాక! ఇపుడ చెప్పిన భంగి నే, పోయివత్తుఁగాక! పురము వదలి.

క. నా తల్లి సెలవు కైకొని, సీతయు మఱి లక్ష్మణునకు చెప్పి ఇపుడ సం
ప్రీతిమెయి పోయెదను వి,ఖ్యాతారణ్యముల నుండగా నుత్సుకతన్.

మ. అనుచున్ శాంతవచోభిరాముఁడయి నెయ్యంబొప్ప రాముండు తా
జననీ సౌధము చేరి మ్రొక్కి, ఆట కౌసల్యన్ సమాధాన పు
చ్చి నయంబొప్ప అనుజ్ఞపొంది, మగఁడన్ శ్రేయంబుకై మ్రొక్కి, సీ
తను కాంచన్ నిజమందిరంబునకు ఉద్యద్వేగియై ఏగుచున్.

ఉ. కాంచె యథార్థమంతయు వికారవిదూరుఁడు రాముఁ డప్డు వి
న్పించె ప్రయాణమై వెడలి ప్రీతిని జానకి భర్తమాట గు
ర్తించె; సుమిత్రనందనుఁడు తెప్పున రామునికిన్ ప్రణామ మ
ర్పించి ప్రయాణమయ్యె; సరవిన్ రఘురామునిమీఁది ప్రేమమై.

## శ్రీరామాదుల అరణ్య ప్రయాణము

ఆ. ఒకరివెంట నొక్క రొకరి నొక్కరు నెడఁబాయఁజాల కపుడు పరమమైత్రిఁ
తరలి రా త్రయీ సుధామయమూర్తులు, వననివాస మనుభవంబుసేయ.

మ. తన సొమ్మంతయు బ్రాహ్మణోత్తములకున్ దానంబుగావించి, అ
గ్నిని సీతాసతిఁ లక్ష్మణున్ కొనుచు నేగెన్; తండ్రి సాన్నిధ్యమున్
కనె; పౌరుల్ బహుభంగులన్ తలచి దుఃఖంబొందుచున్ పాదచా
రిని శ్రీరాముని సీతఁ లక్ష్మణుని నార్తిన్ చూచి ఖిన్నాత్ములై.

సీ. అతి సుకుమారుఁ డాహా! రామచంద్రుఁడే, అటులేగు పదచారియై యదేమి?
ఎండకన్నెఱుగని యింతి యీ జానకి, నడువీధి నీ రీతి నడచుటేమి?
వారల కనుగామి బౌర! లక్ష్మణమూర్తి, ఖిన్నుఁడై చనుటేమి మిన్నకుండి?
శ్రీరామునకు నేఁడు చెలువుగా యువరాజ, పట్టాభిషేకమం డ్రిట్టిదేమి?

గీ. అనుచు గుంపులుగాకూడి అయ్యయోధ్య, పౌరు లనుతాపభరమతి భారమైన
కథ విచారించుచుండఁగా కడఁగి వామ,దేవుఁ డప్పౌరులకు శంకతీర్చె నిటుల.

క. నారదు నాగమనమ్మున, శ్రీరాముఁడు ప్రతినపూని చెనఁటి దనుజులన్
పారము ముట్టించిన యా,పై రాజ్యము నేలుట కన వారలు తృప్తిన్.

వ. మార్గమ్ము లందంతటఁ బౌరులుదీరి క్రిక్కిఱిసి శ్రీ సీతారామలక్ష్మణులఁ గనుం
గొనుచుండునంత వారలు కైకేయీ మందిరంబునకుఁ జని, దశరథకైకేయులకు
వందనం బాచరించి నిలిచినంత శ్రీరాముఁడు కైకఁ గాంచి యిట్లనియె.

గీ. తల్లిరో! అరణ్య యాత్రకుఁ దరలివచ్చి, నాఁడ! యిమ్ము అనుజ్ఞయన్నఁ గడంగి
నారచీరల నిచ్చె యన్నాతి కైక, రాముఁడవి కట్టి జానకి మోము గాంచె.

క. అది యెఱిఁగి వశిష్ఠుండును, సుదతీ! కైకేయి! యెంతచోద్యమె? కష్టా
స్పద వృత్త; వేల? సీతకు, మదవతి! వల్కము లీయవలసెఁ నీకుఁ.

గీ. రాముని నరణ్యముల కంపు నీమమొకఁడె, నీకు వరమయియుండ పునీత సీత
కీవు నారలు దుష్టస్వభావగరిమ, బయలువడ నిచ్చెదవు పాపభయములేక.

ఆ. అని తిరస్కరించి ఆభూమిజాతను, రమ్యవస్త్రములఁ పురస్కరించె
అపుడు తండ్రియాజ్ఞ నంది రామాదులు, పితరులకును మ్రొక్కి వెడల నృపుఁడు.

ఆ. ఓ సుమంత్రి! రథముపై సుమంబులరీతి, వనచరప్రియులను వారి మువ్వురఁ
పంపిరమ్మటంచు పాపిని రామా! య, టంచు మూర్ఛవడియె అడలి రాజు.

గీ. రథమునెక్కి తోలుటకు సారథికి చెప్పి, తల్లిదండ్రులనెటో? సమాధానపఱచి
పౌరజనులకు ఊఱటపల్కి వెడలి, వారు చేరిరి తమసాగ్రతీరమునకు.

సీ. జానకి పెండ్లి అష్టాదశాబ్దములయి, మసలిన పిమ్మట మాఘశుక్ల
పంచమినాఁడుగా పరఁగె అయోధ్యను, వీడి ఆ తమసాపవిత్రతీర
భూమిని చేరుట; పొలుపొంద ఇంద్రాది, సురలు రామునిఁ గాంచి చొక్కి; రపుడు
శుభశకునంబులెచ్చో కల్గె; వారల, కొకరాత్రి, అచ్చట నుండుటయ్యె

గీ. శృంగబేరపురంబును చేరి గుహుని, సత్కృతులనంది ఒకరేయి చనఁగ జడలు
దాల్చి నావ నధిష్ఠించి, తత్సుమంత్రి, వీడ్కొనియె రామచంద్రుండు వేడ్కమీఱ.

## శ్రీరామాదులు గుహుని సత్కారమునంది గంగదాటి మునిసంపూజితులగుట

క. గుహుఁడు తనవారిఁ గూడుక, బహు సంతోషాంతరంగ పరితృప్తుండై
సుహృదయ మేర్పడ నావన్, ముహూర్తమునకు మును గంగఁ మునుకొని కడపెన్.

గీ. గంగ! భగవతి! యిదె నమస్కారమమ్మ! ఏను వనవాసముననుండి యింపెలర్ప
తిరిగివచ్చెదు నప్పుడ సురయు మాంస,మిచ్చెదను కాన్కగా కావు ముత్తమవిధి

క. అని సీత జాహ్నవిని ప్రార్థన చేసెఁ; గంగదాఁటి రాముఁడు గుహుని
కని వీడుకొల్పె; వారలు, చనిరి భరద్వాజముని సద్మనమునకున్

ఉ. ఆ ముని సత్కృతుల్గొని ప్రయాగను అయ్యమునన్ క్రమించి, శ్రీ
రాముఁడు మ్రొక్కఁగా నదికి, రంజిలి సీతయు లక్ష్మణుండు బల్
ప్రేమ నమస్కరించి, కడు వేడుక మా వనవాస మింపుగా
శ్రీ మహిత ప్రభావిజయచిహ్నితమయ్యెడుఁగాక నీ కృపన్.

మ. అని ప్రార్థించి కడంగి, అవ్వనమునం దల్లెగి ఆ రాసుతుల్
కని వాల్మీకిమునీంద్రు నాశ్రమము, సత్కారంబులన్ పొంది, అ
మ్మౌని దివ్యాశ్రమమున్ క్రమించి; రొకచో పొల్పారఁగా పర్ణ శా
లను నిర్మించెను లక్ష్మణుం డట మహోల్లాసంబు సంధిల్లగన్.

శా. సీతారాములు సంతసం బెసఁగఁగా చెన్నొంది రచ్చోట, వి
ఖ్యాతారణ్యక మాంసభోజనములన్ యజ్ఞేశునర్చించుచున్
ప్రీతిన్ పంచవిధాయకంబులగు సుశ్రీయజ్ఞముల్చేసి, సా
కేతంబందున నున్నరీతిని యథాక్షేమంబు సౌఖ్యంబుగన్.

ఉ. మంచి విహారభూములు, సమంచిత పుణ్యనదీజలంబులున్
మంచి రుచించు భోజ్యములు, మానిత పుష్పలతా వితానముల్
మంచి ద్విజాతి స్నేహములు, మక్కువమీఱఁగ వార లప్పు డ
భ్యంచిత సౌఖ్యముల్ కని రభంగురమైన యయోధ్యలోఁ బలెన్.

గీ. పంచయజ్ఞంబులందును బలియొసంగి, వన్యమృగ మాంసభక్ష్యాళి ధన్యుఁడగుచు
సీతయును లక్ష్మణుఁడు కొల్వ శ్రీరఘూధ్వ,హుండు సుఖియించె తనయింటనుండినట్లు.

సీ. ఆ పర్ణశాలయం దా లక్ష్మణుఁడు కూర్చె, పడుకటిల్లును మఱి వంటయిల్లు
ఓలగంబు నకిల్లు నొనరనగ్ని గృహంబు, స్నానగృహంబును మానితమగు
దేవతాగృహమును దేని కయ్యవి వేఱు, వేఱుగా తరులతా వేదికలను
చలువ చప్పరముల చోపల సకలోప,చారంబులకు తగు సర్వవస్తు

ఆ. నికరములు చెలంగ నిఖిలోపచారంబు, లొనరఁజేయు భక్తి కొనలుసాగ
అట్లు వార లందు అత్యంత సంతోష, గరిమనుండి భక్తిగరిమవలన.

చ. మునులకు కందమూల ఫలముల్ పరితృప్తిగనిచ్చు, వన్య వ
స్తు నికరముల్ మెసంగి అతిథుల్ బహుభంగుల సంతసింప, ల
క్ష్మణుఁడు గడించి తేర, పరమంబగు భోగములొందు రాముఁడా
జనకసుతాప్రమోదభరసత్కృతివారిధి నోలలాడుచున్.

వ. ఇట్లు వారు పురంబువాసియు తిరంబులును రుచికరంబులునగు సుఖంబుల నొందు
చుండ, నొకనాఁడు.

## చిత్రకూటములో ఐంద్రకాకాక్షిభేదనము

సీ. శ్రీరామచంద్రుఁడు సీతామహాదేవి, తొడనె యింపగు తలగడగ నూని
నిద్రవోవుచునుండ నైంద్రకాక మొకండు, అచ్చటి కరుదెంచి అవనిజాత
మృదులారుణాంగుష్ఠ మదటున మాంసేచ్ఛ, ముక్కుచే గోళ్ళచే మొనసి చీల్చె;
పతికి నిద్రాభంగము తలంచి జానకీ, సతి దాని వారింప సాహసింప

గీ. కున్న నంత రాముడు తెలివొంది మొగము, గోళ్లు నెత్తుటఁ తడిసి అఘోరమైన
భీతిఁ పరువెత్తు కాకినిఁ సీతరక్త, సిక్తపదతలముఁ కాంచి శీఘ్రగరిమఁ.

గీ. ప్రళయకాల రుద్రుండు నా పరిఘవిల్లి, కెరలి యిషికాస్త్రమును ప్రయోగించె; దాన
మూఁడులోకముల్ తిరిగియు ఏడఁగాని, శరణమొదవక శ్రీరాము చరణములనె.

క. శరణమని మరణభీతిని, శరణొందిన, కాకమును ప్రసన్నముఖుండై
అరసి దయఁ ప్రోచియు సుం, దరి జానకి యెగ్గు తీర్పఁ దలఁచి కడంకన్.

మ. తన యస్త్రంబెట మొక్కవోని దనుచుఁ తా చూప కాంక్షించి కా
కిని ఏకాక్షిగ చేసె; ఇవ్విధమునఁ క్రీడావినోదంబులఁ
ఘనుఁడా రాముఁడు సౌఖ్యవృత్తిఁ పరఁగెఁ కాంతాసమేతుండుగా
వనమైనఁ కులకాంతతో భవనమా ప్రాపంచధర్మంబునఁ.

చ. ఇది యిటులుండ అచ్చట నరేశ్వరుఁజేరి సుమంత్రి అయ్యెడఁ
సదమలరీతి తాఁ గనిన సంగతులెల్ల వచించి, రాముఁడుఁ
ముదిత ధరేజ లక్ష్మణులు పోయిరి గంగనుదాటి, భీకరా
స్పదమగు ఘోరకాననము చయ్యనజేరి రటన్న దుఃఖియై.

గీ. రామ! రామ! యటంచు ఘోరముగ హృదయ,భేదముగ పెద్దపెట్టున పిలిచి తలఁచి
ప్రాణములుపాసె దశరథరాజవరుఁడు, రాజకాంత లేడ్వంగ దుర్వారరీతి.

ఆ. రాజు మృతియెఱింగి రయమొప్ప తైల ఘు,టంబునందు శవముఁ డాచి పంపె
సత్వరంబ దూతసంఘాళి నా యుధా,జిత్పురంబునకు వశిష్ఠమౌని.

క. భరతుని శత్రుఘ్నుని స,త్వరమే తోడ్తేర, వారు తత్క్షణమే భూ
వరపుత్రులఁ తోడ్తెచ్చిరి, ఎఱిఁగెఁ భరతుండు తల్లి యేహ్యంపు పనిన్.

చ. ఎఱిఁగి, అనేకరీతుల నహీనతిరస్కృతి చేసి, అగ్ని సం
స్కరణము తండ్రి కిమ్ముల విశంకటమా సరయూనదీస్థలిన్
గరిమ నొనర్చి, విస్తరముగా కడు భక్తి యథేచ్ఛనెల్ల యు
త్తరక్రియలన్ పొనర్చి, కడు తామసవృత్తిఁ చెలంగి మంథరన్.

సీ. తన తల్లి మ్రోలనే తాడనం బొనరించి, తటిమిక్కొట్టి సమందగరిమమీఱ
రాజ్యాభిషేక సంప్రార్థితుఁడై అనం,గీకారముగ మహాక్లేశపడుచు
అనఁదగినట్లుగా జననికి విన్పించి, కటురోషభీషణోత్కారము; లంత
మంత్రి భూదేవ సామంత పౌరాళితో, అమ్మలతోడ భక్త్యతిశయమున

గీ. రాముని అరణ్యవాస విరాముఁ జేసి, మరల సాకేతమునకు తేవలయుననుచు
వెడలి గుహుని మన్ననలకు వేడ్కనంది, అపుడు కాంచె భరద్వాజు నాశ్రమమ్ము

ఉ. ఆ మునినాథుఁ డప్డు భరతావనిపాలు మహాజనావృతున్
శ్రీ మహనీయవృత్తిని, విశిష్ట తపోధికశక్తి నచ్చటన్
భూమిని స్వర్గమొక్కటి, అపూర్వముగా సృజియించి, ఎక్కుడౌ
గోమున గారవించె; కయికో మన సొప్పక అతఁ డిట్లనున్.

మ. మునిచంద్రా! భవదీయ సత్కృతులు సమ్మోదార్హాముల్; నేను రా
ముని సాన్నిధ్యముకోరి సత్వరమ నిర్మ్మలైకహార్దుండనై
చనుచున్నా డనటన్న, నీ విమల హృత్సంతాపము న్నే నెఱుం
గనిదే! తెల్పెద రాము జాడ; స్థిరతన్ కైకొమ్ము నా మన్ననల్.

గీ. అను భరద్వాజముని సదాహ్వానమొంది, వీరమాతల కూఁడుక వెలయు భరతుఁ
డమల సత్కారములనంది యా మునీంద్రుఁ, వందనంబులఁ వీడ్కొని భక్తి యుక్తిఁ.

క. ఆ మునిచంద్రుడు చూపిన, యా మార్గము ననుసరించి, అట చని వేగన్
శ్రీ మహిత చిత్రకూటము,లో మానిత పర్ణశాలలో రఘురామున్.

శా. సీతాలక్ష్మణ సేవితున్ కనుఁగొనెన్ చేతంబు రంజిల్ల సం
ప్రీతుండై భరతుండు, భ్రాతఁ చెలిమిన్ శ్రీరాముఁ డాలింగన
శ్రీ తృప్తుండయి, సేమమారయుడు విన్పెన్ తండ్రి వృత్తాంతమున్
హా తండ్రీ! యని మూర్ఛనంది మరలన్ హా! యంచు చింతించుచున్.

గీ. సీతయును లక్ష్మణుండును చింతనొందు, చుండ వారలనోదార్చి ఓర్మితాల్చి
అమలమందాకినిన్ స్నానమాడి భక్తి, తండ్రికి తిలాంజలులు చేసె ధర్మరతిని.

చ. అటుపయి కొండమీఁద తన యాశ్రమమందు వసించి యున్న వి
స్ఫుట గుణశాలి రాముఁగని పూజ్యుఁడ! రాజ్యము నేలుమంచు ను
త్కటమగు భక్తిఁ వేఁడుకొని కైకసుతుండు వశిష్ఠు నాజ్ఞఁ త
చ్చటుల మహాపరాధమును సైపఁగ రామునిఁ గూర్చి మ్రొక్కెనన్.

మ. భరతా! నీ యపరాధమేమి? అటవీవాసంబు పిత్రాజ్ఞ; నీ
వరయన్ రాజ్యమునేలునప్డె పితృదివ్యాజ్ఞన్ ప్రవర్తించుటన్

నేమముతో అయోధ్యపురి నెమ్మిగ చేరుడు, వారి వీడి బ
ల్గోమున నంది గ్రామమునకుఁ జని అచ్చట సింహపీఠికన్.

సీ. శ్రీరామపాదుకల్ చేర్చి, పట్టాభిషే, కము చేసి, మునివృత్తి నమలుఁడగుచు
రాజ్యకార్యముల సర్వము పాదుకలకు త, త్సన్నిధినే నివేదనము చేసి
ఆపాదుకలనె మహాభక్తిఁ అన్నగా, రని నమ్మి నెమ్మనంబున కడంగి
కందమూలములనె విందుగా మెసవుచు, బ్రహ్మర్షివలె రామభక్తి వెలయ

గీ. అహరహంబును శ్రీరాము నాత్మనిల్పి, రామనామ పరాయణుండై మనంబు
లోన దినములలెక్కించు నా నియమము, తోడనుండె యోగిగ భరతుం డచటను.

సీ. శ్రీరామచంద్రుఁడు చిత్రకూటాద్రిపై, మునులతోడ నివాస మొనర చేయు
చున్నవాఁడై, సుఖశోభియై ఒకట సీ, తమ్మ మోమున తిలకమ్ము వెట్టు;
కోమలతర పుష్పకోటులన్ కైసేయు; చెక్కిళ్ళపై వ్రాయు చిత్రలతల;
మోము మోమున చేర్చి ముద్దాడు, మృదుతర, పల్లవశయ్యలన్ పవ్వళించు;

గీ. ఇటుల పత్నీసమేతుఁడై ఇంపుమీఱ, నూత్నమంజుల లీలా వినోదములను
కొన్ని నాళ్లుండి అచటికి కొల్చిపోవ, నగరవాసులు వచ్చుచున్నారటంచు.

మ. మన కేకాంతపు వన్యవృత్తి కనువౌ మర్యాద లిం దొప్పవే!
అని డెందంబున నూహచేసి, వడిగా ఆ కొండ తప్పించి, త
మ్మునితోడన్, సతితోడ కూడి చనె రాముం డత్రి మున్యాశ్రమం
బునకున్ వేడుకమీఱ మానులను సమ్మోదంబునన్ కొల్వగన్.

## శ్రీ సీతారాములు అత్ర్యాశ్రమమున సత్కారములొందుట

చ. చని, అట అత్రిమానిఁ కని, సమ్ముద మొప్పఁగ వాని కొల్వ త
మ్ముని సతిఁగూడి రాఘవుఁడు, మూఁడుదినంబులు స్వేచ్ఛనుండె; ఆ
మునిపతి తెల్పఁగా కడు ప్రమోదముతో అనసూయఁ కందరం
బున వసియించుదానిని ప్రపూత చరిత్రను సీత పేర్మిమై.

గీ. చూచి ప్రణుతించి ఆమెచే సుఖముమీఱ, కౌఁగిలింపంగఁబడి ఎంతో ఘనతమెఱ
ఆమె సన్నిధిఁ కూర్చుండె, అప్పు డామె, జానకిన్ కాంచి మన్నించి సంతసమున.

ఉ. ఆమెకు విశ్వకర్మ వినయంబుగ నిచ్చిన కుండలంబులున్
శ్రీ మయమా దుకూలతతి; చెల్వగు దివ్య శుభాంగరాగమున్
ప్రేమనొసంగి యిట్లనియె ప్రీతి; నహో! జనకాత్మజాత! నీ
కీ మహనీయకాంతి యిఁక నెన్నఁటికిన్ చెడకుండుఁ గావుతన్!

# ఆనంద రామాయణము



## అరణ్యకాండము

## ప్రథమ సర్గము

### విరాధ సంహారము



శ్రీరాముడంతట సీతను లక్ష్మణు, నమర గైకొని దండకాటవికిని
వెడలె; శ్రీరాముని వెనుక సీతయు నామె, వెనుక లక్ష్మణుఁ డుగ్రధనువుఁ బట్టి
పోవుచు, భవ్యమౌ ఆ వనంబున ఒక్క, కాసారమున్ కాంచి, కడఁగి, అందు
స్నానపానంబులు సల్పి, సుఖమ్ముగా, పక్వఫలంబుల భక్షణంబు

గీ. చేసి, అచ్చట క్షణకాల మా సరోవ,రంబు ప్రాంత్యంబునన్ నివాసంబు చేయు,
అంతలో అచ్చటికి వచ్చె అమిత తీక్ష్ణ, ప్రబల దంష్ట్ర రాక్షసుఁడు విరాధుఁ డెలమి.

చ. అతఁడు మహాబలుండును భయంకరుఁ డౌ, తన వామపార్శ్వమం
దతులితమైన శూలమున కాయత మానవపాళి గ్రుచ్చి, అ
ద్భుతగతిఁ దానిమోచికొని మూపున, తర్జనభర్జనంబులన్
కొతికి మృగావళుల్ బెదరి కుందుచు ప్రాన్పడఁగా కనంబడెన్.

ఆ. గజముబట్టి రాజకంఠీరవ మొకండు, మెదడు తినఁగ దాని బెదరఁగొట్టి
మహిష మొకటి పట్టి భక్షించు వ్యాఘ్రంబు, నదరఁగొట్టి, వాని నట్టె తినుచు.

ఉ. వచ్చెడు నవ్విరాధుని నభంగుర పర్వత దీర్ఘదేహునిన్
చెచ్చెర రామలక్ష్మణులు సీతయు కాంచిరి; రాఘవుండు వి
ల్లొచ్చెములేక పట్టి పుయిలోడక లక్ష్మణు సీతఁ గావుమం
చచ్చుగ వానిఁ ద్రుంచుటకు ఆయితమై నిలుచుండినంతటన్.

ఉ. వాఁడును రామలక్ష్మణులఁ మైథిలిఁ గాంచి, అనున్, గృహంబు మీ
దేడ? మహాభయంకర మహీజమృగాకుల మీ అరణ్యమున్
చూడఁగ వచ్చినారె? ననుఁ జూడరె? మీ రెపుడైన వింటిరే?
ఈడ విరాధుఁ డుండునని; ఏర్పడ మీ తెఱఁగెల్లఁ జెప్పుఁడా.

పన్నములైన పూజల నభంగుర లీలల నొందుచుండ్ సము
త్పన్నమనోభిలాషుఁడయి మైథిలిఁగూడి, విలాసభాసియై.

చ. అచటికి కుప్పతెప్పలుగ ఆశ్రమవాసులు వేల సంఖ్యలై
ప్రచురమహాపరాక్రముని రాముని దర్శనకాంక్షచేత వ
చ్చుచు చనుచుండ్ త్రిమూర్తుల యశోపరిశోభితులండ్ మహాముద
ప్రచురిత సద్వికాసముఖ భాసితులై కడు సాదరాత్ములై.

## శ్రీరామాదులకు మునులుచేయు సత్కారములు

క. శ్రీరామ లక్ష్మణులఁ సీ,తా రమణిన్ కొలిచెదరు ముదం బేపారన్
వారక నయ్యాశ్రమములఁ, చేరి వసించెడు మునీంద్ర శేఖరు లెలమిన్.

వ. అమ్మునిపల్లెయందు వసించు నశేష శేముషీవిభవులగు మునీంద్రులు.

ఉ. కొందఱు కొంద ఱొక్కనిశి, కొందఱు భక్తిని మూఁడు రాత్రులున్
కొందఱొకొక్క వారమును, కొందఱు మాసము మాస మింపుగన్
కొందఱు వత్సరం బిటుల కోర్కులమీఱఁగ రాము లక్ష్మణున్
సుందరి భూసుతన్ కొలిచి చొక్కిరి, స్వాశ్రమమందు నిల్పుచున్.

క. తమతమ శక్తికొలందిగ, తమతమ భక్తికొలఁదిగ సుధామయ సత్కా
రముల నొనరించి రిమ్ముల, సముఁడై రాముండు సంతసమ్మును వొందన్.

గీ. ఇట్లు మునుల యాశ్రమముల నింపుమీఱ, సుఖవసతితోడ రామాదు లఖిలతృప్తి
తొమ్మిదేండ్లుండిరా యరణ్యమ్మునందు, పెక్కు రాక్షసులను రాముఁ డుక్కడంప.

గీ. పుష్పవనములయందును, పొసగు దివ్య,మైన ఆరామములయందు, అద్రి భవ్య
శృంగములయందు, పూ పొదరిండ్లయందు, రమణఁ విహరించి రవనిజారాము లెలమి.

గీ. తేటనీటఁ జెలంగు కోనేటి దరుల, కదళికా వృక్షముల నీడఁ గలసి మనిరి
పార్వతీ పరమేశులు భవ్యలీల, పూర్వము విహారములు సేయు పోల్పుమీఱ.

## శ్రీరామునకగస్త్యముని ధనువు బాణముల నొసఁగుట

సీ. పిదప శ్రీరాముఁడు సుదతి జానకిఁగూడి, సుమతి యాశ్రమమున శుభములొంది
అటనుండి ఆయన అన్నగారైన అ,గస్త్యులవారి ముఖ్యవనమందు
అఖిల వృతాశ్రయమగునెడ నమ్మునిని, ప్రత్యుద్గమించి, సంబరముమీఱ
ఆలింగనమొనర్చి అర్థింప, అచ్చట, కొన్నిదినంబు లచ్ఛిన్న భవ్య

గీ. పరమ సమ్మానముల నంది, పరఁగ నింద్రు,వలన దీపింపఁబడిన దివ్యమగు ధనువు
నిర్భరాక్షయ బాణ తూణీరమొకఁడు, రత్నఖడ్గము ముని యీగ రాముఁ డొందె.

క. నే నిపుడు రాము దాసుఁడ, పూనుదువో దాసివై ప్రభుని సేవింపన్?
దాన సుఖమేమి నీ? కనఁ,గా నిప్పులు త్రొక్కి,పట్టఁగా జనె సీతన్.

గీ. అపుడు శ్రీరామచంద్రుఁ డయ్యతివఁ జూచి, సుందరీ! బాణ మిదె కొని చూపితేని
లక్ష్మణున, కిది గుఱుతుగా లలితరీతి, నీ మనోరథ మీడేర్చు నెలత! యన్న.

చ. అది నిజమంచు నమ్మి, చని, అంబక మిచ్చి సుమిత్రసూతి, కి
య్యది భవదీయ భ్రాతృవరుఁ డంబకమున్ గుఱుతిచ్చె; పెండ్లియై,
ముదమిఁక మన్న, రాము మది మోదముమీఱ నెఱింగి లక్ష్మణుం
డదయత నేసె బాణ; మది అయ్యసురాంగనఁబట్టి జెట్టియై.

క. ముక్కున్, చెవులును, పెదవులు, చిక్కని పాలిండ్లు నియతిఁ ఛేదించి, వెసన్
చక్కఁగ గుఱిపెట్టిన గతి, గ్రక్కున శ్రీరాము పొదిని క్రమ్మఱ చేరెన్.

ఆ. ముక్కుపోయి చెవులు మొదలూడి, పెదవులు, పగిలి, చన్నుగవయు తెగి కృశించు
శూర్పణఖ కరంబు స్రుక్కి, ఆ ఖరదూష,ణాది బంధువులకు ఆర్తి కలుగ.

## ఖరదూషణ త్రిశిరాదుల సంహారము

క. అయ్యో! చెచ్చితినని కడు, కుయ్యిడు చెల్లెలి యవస్థకున్ బలు క్రోధం
బొయ్యన పూని ఎవండి, ట్లియ్యెడ నిన్ గాసి చేసె? ఎఱిగింపు వెసన్.

మ. అని గంభీర భయానకోక్తుల ఖరుం డార్భాటమున్ చేసి, ఆ
పెను నోదార్చి మృదూక్తులన్, నిజము వేవే అంతయున్ చెప్పఁగా
విని, పద్నాలుగు వేల శూరు లతి దోర్వీర్యంబు పొంగారగా
చని రా రామునిఁ ద్రుంప మండిపడుచున్ సైన్యాళితో యోధులై.

మ. క్షణమాత్రంబున రాముఁ డా అరితతిన్ సంహారమున్ చేసె, తా
నణుమాత్రంబు కలంగకే పదియునాల్గమ్ముల్ వడిన్ వైచి, అ
గ్గణము ల్చచ్చినవార్త తా మెఱిఁగి, శీఘ్రం బాహవక్షోణికిన్
గుణటంకారముతో ఖరాసురుఁడు తానున్ దూషణుంతోన్ వడిన్.

చ. త్రిశిరుఁడు రాముఁపైకి పఱతెంచిరి, వేనకువేలు సైన్యముల్
మిశిమిని చుట్టుఁగొల్వ; అది లెక్కగచూడక రాముఁడప్డు దు
ర్వశమగు నొక్కకొండ గుహఁ భామిని లక్ష్మణునిన్, వసింపఁజే
సి, శరముచేత తాఁగొని విశేషపరాక్రమ మొప్ప ఉగ్రుఁడై.

ఉ. అందఱకన్ని రూపులయి, అందఱ నొక్క త్రుటిం జయించి, తా
నందఱనంపె మోక్షమున; కంతట నొక్క ముహూర్తమందు ఆ

ఆ చాతుర్య మదేడ ? చంపె నొకఁడే అవ్యాహతంబైన బా
హా చంచచ్ఛర సంతతుల్ పఱపి సైన్యం బెల్ల నాశంబుగన్.

గీ. కంచురథములు దుమ్మయ్యె! గడియలోన; ఒక్కఁడే రాముఁ డిందఱ నోర్చినాఁడు;
ఇంక రాక్షసుల్ బ్రదుక రో లంక ఱేఁడ! ఈవు మనియుండ మా గతి ఇట్టులయ్యె.

ఆ. అను కురూపిణి అగు తన చెల్లెలిన్ గాంచి, సింహపీఠినుండి చెంగున డిగి,
యుద్ధ మేల జరిగెనో! మఱి నీ గతి, అయ్యె నేల నిట్టు ? లనిన అదియు.

మ. పలుకున్ రావణ! అన్న! జానకి కదున్ ప్రఖ్యాత సౌందర్య రా
శి! లసచ్చారు పవిత్ర నేత్ర! జగతిన్ చెన్నారు నారీచయం
బల సీతా నఖకాంతి కీడగుదురే ? అయ్యింతి నీ కీయఁగా
తలఁపై, దానిని పట్టనేగితిని; అంతన్ రాము సంజ్ఞాగతిన్.

క. అతని అనుజుండు లక్ష్మణుఁ, డతి కఠినుఁడు నన్ను ఇట్టు లాఱడిపెట్టెన్;
మతిమంతులు ఖరదూషణు, లతి క్రుద్ధులు పోరి చచ్చి రందుల కన్నా!

సీ. తప మాచరించు నా తనయుండు సాంబుఁడు, నిష్కారణముగ ఖండింపఁబడియె!
నీదు తమ్ములు సైన్యనివహంబుతోడుత, స్వర్గభూముల నేలఁ చనినవారు!
నీకు శౌర్యంబున్న నియతి సీతన్ గొని, రమ్ము! వారు పరాభవమ్ము చెంద!
కాదేని నీవు మగండు చచ్చిన ముండ,రీతిని పడియుండు!!! భీతిచేత!

ఆ. అనుచు క్రోధశోక ఘన ఘూర్ణమానస, యగుచు పల్కుదాని కనియె; ఏల
ఇంత కొలఁది పనికి ఇట్లు చింతిల్లెదు ? నిముషమాత్ర మాఁగు; నేను పోయి.

గీ. రామలక్ష్మణులను చంపి రమ్యరీతిఁ, వారిరక్తము తోడుత వఱలు చేతఁ
బాష్పజలములు తుడిచెద; భయముమాని, దుఃఖముడిగి, చరింపుమా! తొట్రు పడక.

ఆ. అనుచు పెక్కుమాటలాడి దానికి సమా, ధాన మొనరఁ చెప్పి, తనకు మేలు
చెప్పు మంత్రియగుచు చెలఁగు మారీచుని, కడకు రథముమీద కదలిచనియె.

## రావణమారీచ మంత్రాలోచన

గీ. అతఁడు తపమాచరించెడి అవసరమున, చని దశాస్యుఁడు తన సమాచారమెల్ల
అతనికి నిరూపణము చేయ, అతఁడు వెఱచి, అల్లునిన్ వెఱపించుచు, అనియె నిట్లు.

సీ. నాయనా! రావణ! నామాట వినవయ్య, అపుడు విశ్వామిత్రుఁ యజ్ఞమందు
శ్రీరామచంద్రుని చేతి బాణంబున, చచ్చి వచ్చినవాడ చావకుండ;
గుఱితప్పి బాణంబు తఱిమినన్నిచటికి, కొనివచ్చె, అది మొదల్ చెనకు భీతి
రామనామంబుచే రథమన్న రత్నము, న్నను రజతంబన్న నవసి రాక్ష.

గీ. రంబుగల పల్కు విని నంత రామభీతి, ఆతని పరాక్రమంబేడ ? అవనిజాతఁ
తెచ్చి నీవు బ్రతుకు టేడ ? చెచ్చిపోవ, తలఁపు నీకున్న వేవేగ తరలిపొమ్మ !

ఉ. ఏ పగవాఁడు నీకు వలనేర్పడ ఈ చెడుబుద్ధి నేర్పె ? తే
నోపుదె సీతఁ ? రాముని మహోద్ధత బాణకృతాధికార్తి ఎ
ట్లోపుదు ? వింతయేనియు, అహాహా ! తలపోయవు నీవు; మృత్యువున్
పాపక కోరి తెచ్చుకొను పాపతలంపు తలంగి యుండుమా !

క. లంకావినాశకర మగు, సంకరమా బుద్ధి ఎవఁడు చక్కఁగ మప్పెన్
ఇంకేమయినన్ చేసెద; లంకేశ్వర ! రాముఁ చేర లావుగ వెఱతున్.

క. ఈ బుద్ధి మాని రావణ ! నీ బహుళ మహావిభవ వినిశ్చయ సుఖివై
ప్రాబల్యమ్మున బ్రతుకుము, మాంబోఁటుల చంపి నీవు మడియకు కుర్రా !

ఉ. రాముఁడు మేటి జోదు; బలరాజిత శాత్రవ దుర్మదేభ దు
ర్దామ మహోగ్ర సింహముఁడు; వృథా ఉసురుల్ నశియింపచేసికో
కో మహితాత్మ ! రావణ ! మహోన్నత సత్యపరాక్రముండు శ్రీ
రాముఁడు, వానిముందు అసురా ! నిలువం గలవే ? దురంబునన్.

వ. అని పలు తెఱంగుల రావణునకు హితంబులు పల్క, ఆ పౌలస్త్యుం డదరిపడి.

గీ. నీవు రామునియొద్దకు రావయేని, ఇప్పుడే నిన్ను సమయింతు, తప్పఁ బల్క
కే ప్రయాణంబు గమ్ము ! మృగీస్వరూప, ధారివై రాముఁ డున్నట్టి దారివట్టి.

గీ. నీవు పర్ణశాల కడను నిలిచియున్న, సీత నినుఁ గాంచి తెమ్మని చెలఁగి రాముఁ
కోరు, ఆతఁడు నీ వెంట కొమరు మిగుల, రా మివుల దూర మాతని రాఁ దిగువుము.

క. చాలా దూరముగా చని, హా ! లక్ష్మణ ! చచ్చితి నని యాతని ధ్వనితో
గోలయిడి పలికి పాఱుము !, ఆ లక్ష్మణుఁ డన్నకొఱకు అడవిన్ పట్టున్.

క. సీతను నేఁ గైకొని సం, ప్రీతిని రథమందు నిలిపి, ప్రియ మొప్పఁగ వి
ఖ్యాతమగు లంకఁ చేరుదు, నీ తెఱఁగున చేయవేని యిప్పుడ కూల్తున్.

గీ. ఇట్లు నాకు తోడ్పడఁ ప్పూని యింపు మీఱ, కార్యసాధన మొనరింపఁగాఁ గలిగిన
లంకలో నర్థ మిత్తు నీ; కింక వేగ, రమ్ము ! లేకున్న ప్రాణమ్ము లిమ్మటన్న.

ఆ. దుర్మదుండు వీనితో వాదులేల ? శ్రీ, రాము చేత పడిన రహి చెలంగ
మోక్షమునకు పోదు; మొనసి నరకమున, పడఁగ నేల వీనివలన చచ్చి.

మ. అని యూహించుచుఁ రావణానుగునితో అత్యంత సంతోషియై
చని బంగారమువంటి మేని పయి పెల్చన్ వెండి పూ లొప్పఁ పో

మ. దశకంఠుండట స్వస్థచిత్తుఁడయి సీతన్ కానమిన్, క్రోధ ధూ
ర్వహుఁడై మోమున రక్తమున్ తొణఁక, దుర్వారున్ జటాయున్ వెసన్
కసిచే ఖడ్గపుధారఁ ఱెక్కలఁ కడంకన్ కూల్చి, సీతాసతిన్
వశముం జేసి విహాయసంబున చనెన్, వాయూగ్ర వేగంబునన్.

క. ఱెక్కలు విఱుగఁగ, రక్తము, గ్రక్కుచును, జటాయు వధిక క్రౌర్యముమీఱన్
రక్కసు పదములు కఱచియు, ఱెక్కలు లేకుంటఁ జర్ఝరిత తనుఁడగుచున్.

క. కొనయూపిరితో చూచుచు, పనివడి రామునకు సీతవార్తన్ తెలుపన్
మని, వేచియుండె, తానా, జనకజఁ కావంగలేక శతధృతివ్రాతన్.

వ. అంత ఆ రావణుం డత్యంత వేగమ్మున సీతన్ గయికొని చనుచుండె.

ఉ. అప్పుడు త్రోవ నేగుచు, విహాయస మందున నుండి సీత, తా
నొప్పుగ రామరామ! యని, ఓర్వఁగ రాని మహార్తిఁ కుందుచున్
తెప్పున నుత్తరీయమున, తెంపరియై తన భూషణమ్ములం
గుప్పునకూల్చె భూమిపయి, కొంకక వానరులున్న కొండపైన్.

ఉ. ఏవురు వానరోత్తము లహీనముదమ్మున కాంచి సొమ్ములన్
పావనమైన "రామ" యను భవ్యశుభాక్షరముల్, నభంబునన్
పోవుచు జానకీరమణి బోరునఏడ్చిన యేడ్పు వించు, సం
భావనచేసి రా చనిన భామను రాముని భార్యయం చెదన్.

క. ఈరీతి రావణుం డొగి, శ్రీరాముని భార్యయైన సీతాదేవిన్
క్రూరత హరియించి వెసన్, ఆరామ నశోకవనము నందట నుంచెన్.

క. ఇటులుంచి రావణుఁడు కడు, కటువగు తనవాంఛ తెలియఁగాఁ జేయ, సము
త్కట దుఃఖితాత్మయయి యి, ట్లటులని భాషింప నట్టి యవనీజాతన్.

ఆ. శిక్షచేసి తన్ను సేవించునట్లుగాఁ, చేయుఁడనుచు బహుళ స్వీయదాసి
జనుల నచట రాక్షసస్త్రీలఁగాపుంచి, చనె గృహమ్మునకు నిశాచరుండు.

### బ్రహ్మాజ్ఞచే ఇంద్రుఁడు సీతాదేవికి పాయస మర్పించుట

గీ. అట్టి సమయంబునందు బ్రహ్మాజ్ఞవలన, వత్సరసుతృప్తికరదివ్యపాయసంబు
దేవనాథుండు సీతకుఁతెచ్చియిచ్చె, దానికై సీత సంతస మూని కడఁగి.

క. రామునకు లక్ష్మణునకున్, ప్రేమ నివేదించి, ధేనువితతికి నిడి, తన్
గోమున గను త్రిజటకు నిడి, తా మక్కువఁ దినియె నంతఁ తత్పాయసమున్.

చ. అటుపయి రావణుండు పదునార్వుర రాక్షసులన్ చలంబునన్
పటుతరశక్తి రాముని విపత్తులఁ కూరిచి చంప దుష్టలం

పటుఁడయి పంపె, వారల కబంధుఁడు మేసె, క్రమంబుమీఱ; న
చ్చట రఘురాముఁజూచి యనుజా! యని లక్ష్మణుఁడట్టె దుఃఖియై.

ఆ. మాయమృగమునేసి మరిదాని బాణాగ్ర, మునకు వ్రేలవైచి మొనసి యెదురు
వచ్చు నన్నుఁ గాంచి వదిన తొందరవడ, వచ్చినాఁడ నీదు వార్తఁదెలియ.

క. అన, పర్ణశాల సమ్ముఖుఁ, డనుజ సహితుఁడైన రాముఁ డటు వేగమునన్
జనుదెంచుచుండె త్వర భూ,తనయ కేయపాయ మగునో? తడసిన ననుచున్.

చ. ఇటు చనుదెంచు రామున కనేకము దుశ్శకునంబులయ్యె దు
శ్చటుల మహావిభీషణ విశంకటవృత్తిని, అంతలోన ఉ
త్కటమగు సీతరోదనము కర్ణములంబడె రామమూర్తి, కం
తట జనుదెంచి పంచవటి తాలిమి సీతనుఁగాన కార్తుఁడై.

క. మానుషలీలా నటుఁడై, జానకి నంతట వెదకుచు సరసజటాయున్
జ్ఞానస్థాయుఁ తృణీకృత, ప్రాణానిల హరివిధేయు పరగంగాంచెన్.

సీ. కొనయూపిరిని కంఠమున డాచి శ్రీరామ, భద్రున కీవార్త పరగఁదెలిపి
ప్రాణంబువిడువ సమ్యఙ్నిష్ఠనున్న జ, టాయువువలన నాద్యంతమునను
రఘురామచంద్రుఁడు రమణివృత్తాంతము, విని జటాయువు మృతిం గనిన నతని
కగ్నిసంస్కారమ త్యాసక్తిఁ గావిఁచి, యతని భక్తికయి బాష్పాకులుఁడయి

గీ. వన్యమాంసంబు బలియిచ్చి వరుసమీఱ, వాని కూర్ధ్వలోకముల నవారితముగఁ
గూర్చి స్నానాదులంజేసి, కూర్మిమివుల, సీతయాకృతి కుశలతో చేసికొనియె.

గీ. అగ్నికార్యంబుసేయగా నాకుశముల, చేసినట్టి సీతను ప్రక్కచేర్చి చేయు
తా జగత్ప్రభుఁడైయుండి ధరణిజాత, కొఱకు పరమ మూఢునియట్ల కొంతవగచు.

## శ్రీరామచరిత్రము ప్రత్యక్ష సిద్ధమని పరమేశ్వరుఁ డానతిచ్చుట

వ. అనిన నగజాత నాథా! జగన్నియంతయు, సర్వప్రభుండును, ఆనందమయుండు, నగు శ్రీరాముం డట్లు వగచెనని వచియించితి, రదియేమి హేతువోకో? దాన పామరజనంబులకున్ రఘుపతికిం గల భేద మేమయ్యె? నని వక్కాణింప పార్వతీ! నీ వెప్పటి వృత్తాంత మప్పుడ మరచెదవా? యేమొ? కాని నాడు శ్రీరామచంద్రుఁడు సీతకై దుఃఖించుచు వనంబులఁ ద్రిమ్మరుచున్నయపుడు ప్రభూ! ఏ రాముని నీవు సతతము మనంబున జపియించుచుందువో ఆ శ్రీరాముఁ డదే స్త్రీవిరహంబునఁ జిక్కి మూఢునివలె చరించుచున్నవాఁడు చూడుమని నీవలన పరిహాసింపఁబడియు, నీకిట్లు సమాధానంబు చెప్పితి.

క. శ్రీమన్నారాయణుఁడే, భూమిని శ్రీరాముఁడగుచుఁ బుట్టె నిజం బీ
పామరజనులకు నిటు స్త్రీ, వ్యామోహఫలంబు తెలియఁబడ బోధించెన్.

శా. స్త్రీ సాంగత్యము లోకులందరికిఁ దా క్షేమంబు కాదంచు, నా
భాసం బంచును, జ్ఞాను లద్ది విడువన్ భావించుటే శ్రేష్ఠమం
చీ సంసారపు సౌఖ్య మిట్టి దనుచున్, యేర్పాటుగన్ చూప హా!
హా! సీతాయని రాముఁ డార్చె, పరమాహ్లాదుండు శోకించునే?

మ. అని నీకప్పుడచెప్పితిన్ మరచితే? అత్యంత సంకోచ వృ
త్తిని సీతాకృతిఁదాల్చి నీవు రఘుమూర్తిన్ డాసి, రక్షోవిభున్
కనులం బ్రా మిదె వచ్చినాను సఖుఁడా! కన్గొమ్మనన్ నవ్వ రా
ముని సిగ్గింతయు దోప విన్ననగు మోముం బూనలేదే? సతీ.

క. నీ వెంతటి సీతవో? నా, కావంతయు తెలియు నెట్టు లంభోజాక్షీ!
సేవింపుమ భావింపుమ, నా విభవ విశేష మని గనంబఱచెఁగదా?

గీ. విశ్వరూప సందర్శన విహ్వలవయి, సర్వభువనమయుండును సర్వభూత
మయుఁడు సర్వాత్మకుండు బ్రహ్మంబు రాము, నట్టిగని నీవు నిశ్చేష్ట వైతివికద!

ఆ. నేను నీకు దెల్పు నిజమైన రూపంబు, నపుడు నీవు చూచి యలరితి కదె!
తనర రామునకు ప్రదక్షిణ మొగిచేసి, మగిడి యిట్టు లడుగు మఱవు తగవె?

వ. అపుడు శ్రీరాముఁడు నిన్ను.

చ. ఎవతెవు? నీవు, ఏల నిటు లెవ్వరికై అరుదెంచితం, చహా!
శివ! నిను బల్క, లజ్జ కడు చెందితి; వప్పు డదే స్థలంబు ప్రా
భవ మహనీయ పట్టణ మభంగుర లీల చెలంగె, సంజ్ఞచే
మివులగ మేటి లజ్జ పురమే యన, సద్విభవాభిశోభమై.

సీ. పంచవటీస్థలి పఱగు గౌతమ తీర్థ,మందు మాయామృగ మొందు నెందు
శ్రీరాముఁ భయముచే చెలగి పోయెనొ? అట్టి, స్థలములు క్షేత్రరాజంబులయ్యె
మృగనూపురము పడి తగ దొరలిన చోట, నూపురంబను పురం బేపుమీరె!
చపలాక్షియైన యా విపరీత మృగము చ,చ్చిన యెడ చాపల్యమను పురమ్ము

ఆ. గాదనర్చె; రాతఁ గోదావరీతటిఁ, రామబాణ హతి కురంగ పతన
చిహ్న మిప్పటికిని జీర్ణంబుగాలేదు, వీనినెల్ల చూడు! విమలనేత్రి!

.. లక్ష్మణస్వామి పర్ణశాలకును చుట్టు, గీచినటువంటి గీత యేరై చరించె
ఇప్పటికిని సతీ! భూమి యెల్ల గుంట,యయ్యె నా రావణుని పదన్యాస మచట!

క. ఖరదూషణాది యుద్ధ, స్ఫురణ జానకియు సుమిత్రసూతియు నే భూ
ధరగుహల డాగిరో? అట, పరగుదు రిప్పుడును శిలల పరమాకృతితోన్.

ఆ. జ్ఞానులైనవారు కనుఁగొననేర్తురు, జ్ఞానదృష్టి! నిపుడు చాన! వారి
సతిసమేతు రామచంద్రు లక్ష్మణమూర్తి, చెలగు భక్తి మివుల కొలిచిరేని.

సీ. గౌతమీనదియందు గ్రాలెడు నాపర్ణ, శాలాసమీపమం దో లతాంగి!
రామతీర్థంబన రాజిలు లక్ష్మణ, తీర్థమనంబడి తేజరిల్లు!
ఈనాటికింగూడ నేకొండపైని సీ, తారాములపుడు నిద్ర గయికొనిరో?
ఆగిరి రామశయ్యాగిరి; యిప్పుడును, అచటి పచ్చిక పాన్పనను గమించు;
గీ. ఇట్టి చిహ్నంబు లలరారు నీ స్థలములు, క్షేత్రరాజములై సుప్రసిద్ధిగాంచె!
వీని దర్శించు మాత్రనే విబుధు లతి కృ, తార్థతం జెందుచుండ్రు యథార్థ మబల!

## కబంధ ముక్తి

ద్వి. ఆరామలక్ష్మణు లామీద నేగి, క్రూరరాక్షసపాళి కూలంగ నేసి
స్వేచ్ఛావిహారులై చెలఁగు రక్కసుల, స్వచ్ఛమూర్తులఁ గాగ చయ్యన సలిపి
వైకుంఠమున కంపి వరలిరి వార, లాకాననంబున అంతనె దీర్ఘ
యోజన విస్తీర్ణయుతబాహుఁడైన, భ్రాజిత కుక్షివిభాసిత ముఖుని
ఆ కబంధునిచేత అటుపడి వాని, జోకఁ గూల్ప శిరంబు చూచి లేకున్న
బాహుల నఱికిరి పరమ సుస్తోత్ర, సాహసంబున నంతచచ్చె నతండు.
దివ్యరూపమునొంది తేజంబుమీఱ, భవ్యమూర్తిని రాము భజియించి పల్కె-
వెనుకనే గంధర్వవిభుఁడ నోరామ! మునుపునే బ్రహ్మదేవునిఁ గొల్చి వరము
ఎవ్వరిచేత నే నెటు చావకుండ, మవ్వపు కూర్మిని మఱి గాంచినాఁడ
గర్వంబుచే కన్నుగానక యొక్క, ధూర్వహుఁడగు ముని తోడరి హింసించి
ఆతని యొంటె మోమట్టె వీక్షించి, చేతముమై గేలి చేసిన కతన
ఈ రాక్షసాకృతి నేఁ జెందినాఁడ, ఓ రామ! రక్షించితో రణభీమ!
అని తెల్పి నిలిచిన యాతనిఁ గాంచి, అను రామచంద్రుఁ డత్యాశ్చర్యమంది.
గీ. ఓయి! మేము ననేక మహోగ్ర వికృత, రాక్షసులఁ జూచినాము ధరాతలమున
శిరము పాదముల్లేని యీ చిత్రరూప, మెట్లు నీ కబ్బె? నన ఆతఁ డిట్టు లనియె.
క. నే రాక్షసరూపమ్మున, శ్రీరామా! ఇంద్రుఁ దరిమి చెనకితి నతనిన్
వారక నాతఁడు వజ్రము,తో రయమున నన్ను గొట్టె తుత్తునియలుగన్.
గీ. ఎట్లు కొట్టినన్ చచ్చుట యెట్లు కల్గు? చావకుండ వరంబు నా సరసనుండ
అపుడు శిరము వజ్రాఘాత విపులశక్తి, పొట్టలో చేరిపోయె నప్పుడును నేను.
ఆ. కాళ్లతోడ నింద్రు కడఁగి ప్రవహరింప, నవియు పొట్టయందె యడగునట్టు
లిముడ గొట్టె, నపుడు నే బంతివలె భూమి, దొర్లుచుంటి, చావు తీర్లులేక.
గీ. అప్పు డింద్రుండు కరుణించి అట్టులయ్యు, యోజనము పొడవైన ఇయ్యుగ్రబాహు
లిచ్చి, వాని కందినవెల్లఁ దెచ్చి పొట్టనున్న నోటితో తిని భూమి నుండు మనియె.

క. ఇది నా కథ! ఇక మిా కథ! పదపడి యెఱిఁగింతు; ముందు మాతంగమునిం
దదుపరి శబరిం గందురు, అది విశదముగా నెఱుంగు నవనిజ జాడన్.

ఆ. దానివలన మిారు తప్పక జానకి, గూర్చి తెలిసి యాపెఁ గూడుకొందు
రనుచు చెప్పి యేగె నత్యంతభక్తిమై, వందనములచేసి పొందుమిాఱ.

శ్రీరామలక్ష్మణులు శబరికి ముక్తినిడి ఋష్యమూకాద్రి కేగుట

క. వారలు మతంగమునిఁ గని, వారక శబరీసతీనివాసంబునకున్
చేరిరి తన్నారీమణి, శ్రీరాముని రాకకై నిరీక్షించె నొగిన్.

సీ. తియ్యని పండుల తిని చూచి రాముని, కవి యారగింప నెయ్యమున నుంచి
అర్ఘ్యపాద్యములిచ్చి ఆమిాద సుఖముగా, నున్నయప్పుడు బల్కు సన్నుతముగ
ఋష్యమూకాద్రిపై ఎనయును సుగ్రీవుఁ, డనుచర సహితుఁడై అతని సఖ్య
మున సీత వృత్తాంతమును వినగల్గుదు, కొను! వన్యఫలము లత్యనుపమాన!

ఆ. అనుచు భక్తిఁబల్కి, అంతట చితిపేర్చి, ముందు "పంప"గలదు సుందరోద
క ప్రపూర మందు గల్గు ఫలంబుల, నారగించి తేటనీరు గ్రోల.

క. తరువాత ఋష్యమూకపు, సరణి జనుఁడు ధన్యనైతి! చయ్యన మిా మిా
దరిశనమగుటను ఇక నే, నురికెద రామా! యటంచు నొగి బడె చితిలోన్.

గీ. దానిభక్తికిఁ గడుమెచ్చి తన్వినపుడు, దివ్యవైకుంఠమున కంపి తేజరిలుచు
చెనకి పంపాసరోవరంబునకు నేగి, ఫలములం దిని నీర్గ్రోలి పరమమైత్రి.

క. సీతాదేవిం దలచుచు, చేతముమై ఋష్యమూక క్షితిధర మతి వి
ఖ్యాతిగ నెన్నుచు వచ్చుచు, నీతీరున నయ్యరణ్య మెలమిన్ తిరిగెన్.

గీ. పార్వతీ! నీకు నాచేత పరమ శ్రద్ధ, లక్ష్మణునితోడ సీతా విలక్షణుఁడగు
శ్రీరఘూత్తము నారణ్య చిత్రకథలు, చెప్పఁబడె లోకులకు భక్తి చెంగలింప.

క. అనిచెప్పిన విని పార్వతి, ఘనతర శ్రీరామచంద్రకథ యద్భుతమై
విన విన నింపై మది యడె, వినగోరున్ నాకు దాని వినిపింపు శివా!

వ. అని అవ్వలికథా వృత్తాంతం బెటులయ్యె? నని అడిగిన నమ్మహాదేవుం డిట్లనియె.

గద్యము

ఇది శ్రీ బాలభారతీ ప్రసాద లబ్ధకవితా ధౌరేయ
పండిత చిలుకూరి శ్రీరామశాస్త్రి నామధేయ
ప్రణీత శ్రీమదాంధ్రానంద
రామాయణాంతర్గత
సారకాండస్థ
అరణ్యకాండము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# ఆనందరామాయణము



## కిష్కింధకాండము

### ప్రథమ సర్గము



శ్రీరాముఁ డంతట చేతిలో ధనువు మూఁపున నంప పొది వ్రేల పుల్కుపుల్కు అటునిటు చూచుచు నా లక్ష్మణునితోడఁ, ఋష్యమూకాద్రికై యేగ వెడలి అటు వోవుచున్న, నప్పటుతర గిరిమీఁద, నున్న సుగ్రీవుండు నొయ్యఁ భీతిఁ జూచి మంత్రులతోడ యోచించి, యాంజనేయునితోడ నిట్లను మనలఁజంప

గీ. వాలి పంపున మనుజులు వచ్చుచున్న, వారు కాబోలు! ధనువులఁబట్టి వేగ
నీవు వటురూపమున నేగి,నిఖిలవార్త, లెఱిఁగి, సంజ్ఞసేయుము! మేము గురుతుఁగొనఁగ!

ఆ. వారి యింగితంబు వఱలిన మంచిదై, నగుమొగంబు మీఱ నున్న గనుమ !
లేకయున్న మిగుల భీకరముఖుఁడవై, తనువుఁ జెంపు మపుడ ! తరలు దేము.

శ్రీరామలక్ష్మణులను ఆంజనేయుఁడు ఋష్యమూకమునకు తీసికొనిపోవుట

మ. అని ప్రేరేచిన వాయుపుత్త్రుఁ డమలుండై బ్రాహ్మణాకారముం
గొని శ్రీరాము నమస్కరించి, ఘనులౌ కోదండ పాణుల్ జగ
మ్మును మోహమ్మునఁ గొల్పఁజాలెడి స్వరూపుల్ మీర లెవ్వారు? లీ
వని కేలా చనుదెంచినా? రనుచు సద్భక్తిం బ్రశంసించినన్.

చ. అది విని లక్ష్మణుండు గత మంతయు చక్కఁగఁ దెల్పి, యొక్క బో
యది శబరీసునామక ! ప్రియంబునఁ జెప్పగ వాలి తమ్ముతోన్
ముదముగ నేస్తముం గొనెడి బుద్ధిని వచ్చితిమన్న, నాతఁడుం
గదిసి నిజస్వరూపమును, గ్రమ్మఱ వారలతోడ నిట్లనున్.

క. అయ్యా! వారలు గిరిఁగల, రియ్యెడ నే, వారిబంట; నెక్కుడు నాపై
చయ్యన వారలఁ జేర్చెద, నెయ్యము మీ మాటలందు నెలకొను మివులన్.

ఆ. అనుచు మూపులందు నారూఢుల నొనర్చి, రామలక్ష్మణులను రయముమీఱ
కొండపైన నున్న కోఁతులగుంపులో, నిముషమాత్రముననె నిలిపి మ్రొక్కె.

గీ. చెట్లనీడల మిన్నుల నాసీనులైన, కపుల సన్నిధి శ్రీరామ కథనమెల్ల
ఆంజనేయుఁడు సుగ్రీవుఁ డదివినుంగఁ, బల్కి, రపు డగ్ని హోత్రముం బ్రజ్వలించి.

క. సుగ్రీవుఁడు శ్రీరాముని, యగ్రభాగమందు నిలచి యగ్ని ముఖమునన్
ఉగ్రమగు దీక్షఁగొని సమ, నుగ్రహముం గోరి నిలిచె నూత్నోజ్వలుఁడై.

## శ్రీరామసుగ్రీవ సఖ్యసంభాషణము

గీ. రామ సుగ్రీవు లపుడు పరస్పరంబు, ప్రేమనాలింగనమొనర్చి శ్రీఁజెలగిరి
అంత సుగ్రీవుఁ డొకరెమ్మ నాసనముగ, విఱచివైచిన శ్రీరాముఁ డురుముదమున.

శా. ఆసీనుండయె, నంత నందరును సౌఖ్యాసీనులైయుండి, ర
ఘ్వౌ సుగ్రీవునితోడ లక్ష్మణుఁడు నెయ్యంబొప్ప నాద్యంతమున్
శ్రీసీతాహరణంబు, నందులకు నై చేయంగ నుంకించు నిం
పౌ సహాయ్యము, నెల్లఁ జెప్ప విని; యొయ్యంబల్కు సుగ్రీవుఁడున్.

వ. మిత్రమా! మదీయ వృత్తాంతంబు కొంత విస్తరింతు నింత సావధాన స్వాంతులరై వినుం డని యిట్లుపక్రమించి చెప్పందొడంగె.

సీ. మునుపు నే వాలితో ననుభవించిన స్థితి, చెప్పెద వినుఁడు నా తప్పుఁ గనుఁడు
మయపుత్రుఁ డొకఁడు దుర్మదుఁడై మదీయ కి, ష్కింధకు వచ్చి మిక్కిలి మదించి
ఆర్భాట మొనరించి అన్నయా వాలిని, పిలిచిన నాతండు వెలికివచ్చి
తన పిడికిలితోడ ఘనముగా నొక మొట్టు, మొట్టిన తల గింగుర్వెట్ట నతఁడు

గీ. తన గుహకుచేరఁ బరువిడె, ననుజుఁ డతని, వెంబడించె నే నాతని వెంబడించి
పోతి; గుహలోన జొరఁబడి పోయె నన్న, అతఁడు వచ్చెడుదన్క న న్నచట నిల్పి.

ఉ. నే నటనుంటి; నొక్కనెల నిండె; గుహా ముఖమందు నుండి కం
పూనిన రక్తమాంసములు పొంపిరి వోవగవచ్చె, నే భయ
మ్మూనితి నన్న రాక్షసుని యుజ్వలశక్తికి తాళలేక ప్రా
ణానిలముల్ దొరంగెనని, యాతఁడు నాపయి వచ్చునం చొగిన్.

గీ. ...గుని దారిఁగట్టగా తొడరి నేను, ఒక్క ఘోరశిలం దెచ్చి యుంచినాఁడ
...ద్వారమున నంత వేగవంతు, లనగ కిష్కింధ ముట్టడి నపుడ వింటి.

...న వచ్చి చేరితిని ఆవేశమ్మునన్; నన్నటం
...పారిపోయి, రటుపై కష్టమ్ము! నామంత్రులున్
...న విన్నాణంబుగా నిల్వ, రం
...స రౌద్రస్ఫూర్తిమై నుగ్రుఁడై.

క. మాయన్న గుహకుని శిలనిడి, పాయక తన రాజ్యమేలు పాపిష్ఠుని న
న్నాయత కరపాదంబుల, నాయువెడలఁ బాయఁదన్ని యవ్వాలి కిడ్చెన్.

గీ. ఎల్ల లోకంబులందున నెవ్వఁడేని, వీని హీనుని సుగ్రీవు వెనుకవైచి
ప్రోచువారలు నాచేత పోవఁగలరు, స్వర్గభూముల రంభను సంగమింప.

క. అని చాటఁబంపె లోకము,లను నాతని భీతిఁ తిరిగి లలి నీ నగముం
గని యాశ్రయించినాఁడను, కన నాతఁడు దీని నెక్కఁ కడఁగడు కానన్.

వ. అనిన సర్వలోకంబుల నవలీల సంచరింపఁగల నీ సోదరుం డీ పర్వతంబుపయి కేల రాఁజాలఁడని ప్రశ్నించిన లక్ష్మణమూర్తిం గని యక్కపికుల శేఖరుం డిట్లనియె.

సీ. అది యిట్లు; దుందుభి యను దైత్యుఁ డుగ్రమా, మహిషరూపముఁ దాల్చి మాపురమ్ము
నడిరేయి వచ్చి యన్నను యుద్ధమున కయి, యపుడ పిల్వంగ నా యన్నవచ్చి
వాని కొమ్ముల చేతఁబట్టి తలంజీల్చి, యూచి నేలకు కొట్టె సుగ్రుఁడగుచు
రాముఁడా! ఆ తల రయముమీఱఁగవచ్చి, యీ ఋష్యమూకుని యెడఁదఁ బడియె

గీ. మీద నెత్తురువాన స్రవించఁ కనలి, యా ముని శపించి పలికె నా యన్న కెలమిఁ
ఎవ్వఁ డీ రాక్షసుని నిట్లు ద్రవ్వనేసె, వాఁ డిటకు వచ్చినను మృత్యు వాతఁబడుత!

వ. అని శపియించె.

క. అది మొదలు వాలి తా నిట, పదమిడఁ డది యెఱిఁగి యిచటఁ బడితిని యుసురుల్
పదిలపడె, నీకు నేఁ జెప్పెదను ప్రతినఁజేసి నన్ను విను మేమఱకన్.

గీ. సీతఁ త్వరలోన తెచ్చి యిచ్చెదను నీకు, అన్న బారిని పడకుండ నన్ను బ్రోవు
రావణుఁడు కొనిపోవ నీరామ నేను, గగనమునఁ జూచినాఁడ నిక్కంబు రామ!

గీ. ఆమె యుత్తరీయంబున నంటఁగట్టి, మమ్ముఁ గనివైచె నీ భూషణమ్ము లివిగో!
చూడు మని రామచంద్రుని సారిది మ్రోల, నిడిన చూచి శ్రీరాముఁడు నుడివె నిట్లు.

గీ. లక్ష్మణా! నీవుచూడుమా! లక్ష్యబుద్ధి! యివి యవనిజాత భూషణా లవునో యేమొ?
అనిన రఘునాథ! ఎఱుఁగ నేనన్నినగల, కాని పాదాంగుళీయమా దీనిఁదక్క!

గీ. నిత్యపాదాభివందన నియతి నేను, గుర్తుపట్టితి దీని నిక్కువము రామ!
వదినె పాదాంగుళంబులఁ బొదలు నిద్ది, ఔను! నిజమని లక్ష్మణుం డూని పలికె.

క. అని యిట్లు లక్ష్మణుఁడు చెప్పిన పలుకుల కలరి సీత విధము తెలిసె నం
చనితరదుర్లభసంతస,మునుఁ జెంది రఘూత్తముండు మునుకొని యంతన్.

శా. ఓ సుగ్రీవ! భయంబు దక్కు మిక నిన్నొప్పార కిష్కింధ నిం
పౌ సింహాసనమందు కూరిమి మెయిన్ పట్టాభిషేకంబొగిన్

చేసేదే నిజ మంచు నమ్ము! మిక దోషిౕ వాలి నీ సోదరుౕ
నే సంహారమొనర్చుమాట నిజమా! నిక్కంబు కీశాధిపా!

మ. అన సుగ్రీవుఁడు వాలి బాహుబలమత్యంతంబు; మీా అద్ది క
న్గొనకే యీాఅక రిత్తప్రజ్ఞ వలుకం, గొండంత సంతోషముం
గనఁగాఁగల్గుదు నెట్లు? యోజన మహాగంభీర మీా దుందుభీ
తనువుౕ మాపురినుఁడి యీాడఁ బడమొత్తౕ ప్రజ్ఞ సామాన్యమే?

క. రామా! యీాదుందుభి తను, వే మాత్రము దూరమునకు నేయఁగలుగుదో?
మేము కని నీవు సోదరు, నీమెయిఁ గెల్చెదవో లేదో? యెఱిఁగింతు మనౕ.

## శ్రీరాముఁడు సుగ్రీవునికి నమ్మకము నిచ్చుట

వ. మోమున చిరునవ్వు దొలఁకంగ నవలీలౕ శ్రీరామచంద్రుఁడు.

శా. పాదాంగుష్ఠము చేతఁ గీటిన మహా పాపిష్ఠుఁ డా దుందుభౕ
ఆ దేహమ్ము పదేను యోజనము లయ్యాకాశమార్గంబునౕ
మీాదై క్రిందవడెౕ, కనుంగొనియు స్వామీా! యెన్నినాళ్ళయ్యెనో?
యీాదేహంబు కృశించె యెండలకు కాదేనిౕ సుసాధ్యంబకో?

మ. అనువయ్యెౕ ఎటులేని; దేహబలమి ట్లంగీకృతంబయ్యె; నా
యనుజుం డద్భుత ప్రజ్ఞవాఁడు ధనుషవ్యాపారమం దీవు నీ
ఘనతాళంబుల సప్తకంబు నొక జ్యాఘాతంబున న్నేయుచో
నిను నమ్మందగు వాలిగెల్తు వనుచు న్నిక్కంబు శ్రీరాముఁడా.

ఆ. అనిన రామచంద్రుఁ డనుజునిపాదము, తనదు బొటనవ్రేల తడివినంత
సర్వ దేహమందు చక్రమాకారంబు, నొందియున్న చెట్టు లొందె జక్క.

వ. శేషుండగు లక్ష్మణుం డన్న సన్నయెఱింగి తనయంశజుండగు పన్నగంబునకు సన్నయిడ
నతండు మెలికలువాయ తనదేహంబును చక్క నిగుడ్చ.

ఆ. ఒక్క బాణమేసి నెక్కొని రాముండు, సప్తతాళములను సరిగ నఱికె
దానిగాంచి కపి ముదంబున నిట్లను, నింత వాఁడ వనుచు నెఱుఁగరామ!

గీ. ఐన నింకొక సందియ మందె మనము, మునుపు శివునిచే కశ్యపముని గడించి
నట్టి రిపుబల విధ్వంసిమైన మాల, యింద్రున కొసంగ నది వాలి కిచ్చె నతఁడు.

గీ. దాని ధరియింప నెదిరించువాని బలము, లోని యర్ధంబు క్రన్నన లుప్తమౌను
అటుల శత్రువు దుర్బలుండైన వాలి, వాని వధియించితీరు నవారితముగ.

ఉ. దీనికి నేమిసేయు టని దెల్పిన, రాముఁడు సర్పరాజు నుం
బూనికఁ గాంచి పల్కు, నిను బ్రోచెద! మేలుతలంచి వాలి ప

ట్నానికి పోయి, మాలిక నెటైనను తైకొని ర మ్మటన్న, న
త్లైన శుభం బటంచు గడియర్ ఉరగం బాగి మాలఁదెచ్చినర్.

ఆ. నీకు శాపముక్తి నే ప్రసాదించితి, దీని నెప్పటట్ల దేవవిభున
కిచ్చి మనుము సుఖత! సచ్చరితంబుగా, ననిన సర్పరాజు చనియె దివికి.

వ. సుగ్రీవుండును రామా! యీ సర్వవృత్తాంతం బెఱుంగుదే? ఒకపరి మాయన్న ఇప్పర్వతగుహం దాళఫలంబులఁ డాఁచిన, నీ యురగం బపహరించి సప్తతాళఫలంబుల మెసవె. అదిగని మాయన్న కనలి అవి నీ శరీరంబున వృక్షంబులగుఁగాత! మని శపియించిన, నవి తక్షణంబ దాని శరీరంబున న్మొలచె, నప్పు డప్పాపరేడు కపిరేనికి ఈ సప్తతాళముల నొక్కుమ్మడి భేదించు వానిచే నీకు మృతి కలుగుఁగాత! మని ప్రతిశాపంబిచ్చె, రామా! నీ విపుడు సప్తతాళ ప్రభేదనంబు గావించితివి, కాన తప్పక వాలీసంహారణంబుఁ గావింతువని సంతసంబున నను సుగ్రీవునకు తడవేల! కిష్కింధకు ప్రయాణంబు కమ్మని శ్రీరాముండు పలుక, వారెల్లరు కిష్కింధకు తక్షణంబ ప్రయాణంబై చని రంత సుగ్రీవుండు.

గీ. సింహనాదం బొనర్చె కిష్కింధ పొంత, దాని విని ఉగ్రుఁడై వాలి దర్పమొప్ప
ప్రాత గాయము లెల్లను పాసె నటర?, మరల వచ్చితి సుగ్రీవ మఱుపుకల్గి.

## వాలిసంహారము

క. అని రోషభీషణుండయి, చెనకెర్ సుగ్రీవుఁ వాలి చెప్పగనేలా?
మునుపటికన్న ఘనంబగు, పెనుముష్టిప్రహారణముల భీతునిఁచేసెర్.

క. కడు బడలిన సుగ్రీవుం, డడలుచు వెన్నిచ్చి పారి యను రామునితో
కడుమంచి చేసినాఁడవు, జడతర్ నేనన్నచేత చాఁజూచెదవే?

శా. ఏమో! నాకు సహాయమిత్తువని నిన్నెంతో కదుర్ నమ్మి సం
గ్రామంబుం బొనరింప నేగితిని, వేడ్కర్ చంపు రామా! యనర్
రాముం డొప్పుగఁ బల్కె నో కపివరా! రాముర్ మృషావాదిగా
నేమీ తల్చెదె? మీ స్వరూపముల సుంతేఁ భేదముం గానమిర్.

మ. చను ప్రామాదికమై మదీయ శరమొంచర్ రాని యుద్వేగతర్
నిని తాకర్, విఫలంబు కార్యమని నే నిందాకగా వేచితిర్;
జను మిప్పట్టున పుష్పమాల మెడలో సంధించి యొక్కుమ్మడిర్
చేన నీ భ్రాత వికుంఠముర్ శర మిదే సంధించి పోకార్చెదర్.

మ. అనినర్ లక్ష్మణుఁ డొక్క మాలికను నెయ్యం బొప్ప సుగ్రీవునిం
ఘనకంఠమ్మున వైచె, నాతఁ డతిశీఘ్రుంబేగి యవ్వాలినిం

ఘన సంభీషణ కంఠుఁడై పిలచె సంగ్రామంబు కాంక్షించి, యా
తని నారీమణి తార యిట్టు లనియెన్ తత్త్వంబు నూహింపుమా !

గీ. నిన్న నీచేత దెబ్బల నెన్నియేని, తినిన నీసోదరుఁడు నేఁడు చెనకి యుద్ధ
మునకు రమ్మని పిలుచుట కనఁగ నాకు, ఏదియో ? బలమందెనం చెఱఁగికొంటి.

గీ.. అంగదునివల్ల వింటి నీ యనుజుఁ డిపుడు, రామ సాహాయ్యమున వచ్చె రణముసేయ
కాకపోయిన నతనికిఁ గలదె గుండె, నాథ! యుద్ధము సేయమి నా మతంబు.

ఆ. పోయి రామచరణమును శరణముఁ జెంది, తమ్ముఁ గౌరవించి తెమ్ము వేగ
యౌవరాజ్యమునకు నాతని పట్టంబు, కట్టుఁ డట్టులైనఁ గందు సుఖము.

క. అని తార పలుకు పలుకుల, విని వాలి హసించి, యేల భీతిల సతి! రా
ముని నెఱుఁగుదు నే నారాయణుఁడని నా మృతియుఁ గలదు ఆతని చేతన్.

ఉ. ఆతనిచేత నే మృతుఁడనై కనెదన్ కడు పుణ్యలోకముల్
ప్రీతిని నీవు నా యనుజు ప్రేమ భజింపుము, అట్టులౌటచే
నాతని భార్యఁ బొందిన మహా కలుషంబు ననుం గలంచ దీ
చేతనె నాదు మాలిక నసించె కృతార్థుఁడ నౌదు కోమలీ!

గీ. అని సమాధానముం జెప్పి అనికి వెడలె, పెక్కు లుత్పాతములు కనుపింప నతఁడు
చూచి సంతోషమంది యథోచితముగ, చేసె యుద్ధంబు సుగ్రీవుఁ జెనకి మగిడి.

ఉ. అప్పుడు వృక్షచాటున రయంబుగ నిల్చిన రాముఁ డొక్క సొం
పొప్పు మహోగ్రబాణమున నొయ్యన వాలినిఁ గూలనేసె, న
ష్టప్పెనుకోఁతినాతి అకటా! యని దుఃఖము నొందె; వాలి తా
చెప్పఁదొడంగె రామునకు చెట్టుల చాటున నున్న వానికిన్.

ఆ. వృక్షచాటునుండి మగటిమిలేక నా, యెదను కూల్చినాఁడ విదియు ఘనమె ?
కీర్తి నాకును నపకీర్తి నీకును కల్గె, ఏల చంపితీవు ఏది తప్పు?

వ. అనిన కపీంద్రుం గని శ్రీరామచంద్రుం డిట్టులనియె.

క. నీవు రుమాలోలుఁడవై, కావరమున సుంతయేని కన్నుఁ గనక సు
గ్రీవుని నీతమ్ముని నిటు, చావ మోదుటెల్ల తప్పుసంగతి కాదే?

గీ. నీవు రుమ నెట్టు లటులె సుగ్రీవుఁ డొందుఁ, గాఁత నా యాజ్ఞ నీభార్య కరమువట్టి;
మీ కులమ్మున కిద్దియే మేలుగూర్చి, నెగడుఁగాత! ఆచారమై నిశ్చయముగ!

### శ్రీరాముఁడు వాలికి భవిష్యజ్జన్మము నెఱింగించుట

క. ఐన దురాచారుఁడ వీ,వేను నిన్ను చంపుటన్ ప్రవిమల మహా సా
ఖ్యానాన పదముఁ గందువు, మానక నీ చేత నేను మడయఁగ వలయున్.

గీ. ద్వాప రాంతమునందు ప్రభాసమునను, నీవు బోయవై బాణము వైవ నాదు
కృష్ణ దివ్యావతార నిష్కృతి చెలంగు, వాలి! నీవు చేసినపని వట్టి తప్పు.

క. ఈ కారణమున నివ్విధి, నీకు మరణమయ్యె! తదుపరిన్ చెందుదుగా
వైకుంఠము, దిగు లుడుగుము, ప్రాకృత కర్మంబు తప్ప బ్రహ్మాతరంబే?

క. అని పల్కి మరల మర్కట,మను రామా! నీవు మొదట అడిగిన నన్నా
క్షణమున రావణుతోడుత, వనిత సీత నిటకుఁ దెచ్చువాఁడను కానే?

గీ. ఐన దానికి చింతింప నగునె లాభ? మంగదుని మాత్ర మోము రామా! యటంచు
మ్రొక్కి రాముని మోముపైఁ జక్కి, చూడ్కి, నిల్పి నిశ్చమై యూపిరి నిలిపివైచె.

క. శ్రీరాముఁ డంగదునిచే, పారలౌకిక క్రియల వివరముగ విధిగా
కూరిమిచే చేయించెన్, శ్రీరాముని వంటి ప్రభుఁడు క్షితిలోఁ గలఁడే.

## సుగ్రీవునికి కిష్కింధరాజ్యము నిచ్చుట

సీ. పిదప శ్రీరాముఁడు ముదమున సుగ్రీవు, రాజ్యమేలింప త్వరన్ వహించి
లక్ష్మణమూర్తిచే నా క్షణంబునఁ బ్రీతి, నాతని రాజుగా నానతిచ్చి
వార్షికమాసముల్ వాఁటిక పురమున, తా ముండు టెంతయు తగదటంచు
ఆ ప్రవర్షణగిరియందలి కడు పత్ర, పుష్పశోభితమగు భూరుహములు

గీ. స్ఫటిక శిలలును వేదికల్ జతపరచిన, చందమున నొప్పు నొక గుహ చేక్కఁబఱచి
నాల్గుమాసము లట నుండె నవ్యమైన, వనిత సీతావియోగతాపమ్ముతోడ.

సీ. ఒకనాఁడు లక్ష్మణుం డొనర స్నానముచేసి, శ్రీరామునిన్ గాంచె సీతతోఁడ
సాత్వికి యా సీత సౌమిత్రి మ్రొక్కిన, కని రాము నంకమందున నడంగె
సీతావియోగ మీ స్థితి నుండ శ్రీరామ, చంద్రున; కచట నిస్తంద్రుడగుచు
సుగ్రీవుఁ డేలె యశోమతి కిష్కింధఁ, హనుమంతుఁ డొప్పు దోహదమొనర్ప

గీ. నేటికి ప్రహర్షణమ్మున నూటిరైన, రామలక్ష్మణ తీర్థముల్ రమణ నొప్పు
అంత శరదాగమమున నత్యంత కోప,మూర్తియై యను శ్రీరామమూర్తి కడక.

## శ్రీరాముని సీతా విరహ విశేషము

గీ. లక్ష్మణా! యెంత తడవు శిలానివాస, మీ నిరీక్షణ మీ వియోగానలంబు
శాంతి నొందుట యిక లేదె? చేనుము పల్కి, మిపుడు సుగ్రీవుతోడ నా విపులవార్త.

గీ. లక్ష్మణుఁడు చేని వానరులన్ మహోగ్ర, కోపదృష్టిని ఝళిపింప భూపుఁ డెఱిఁగి
తత భయభ్రాంతుఁడై సమాధానపరుప, ఆంజనేయుని పంపె నత్యంత భక్తి.

క. ఆతఁడు లక్ష్మణమూర్తికి, చేతోమోదంబుగా, సుచిత్రభాషణముల్
ప్రీతిఁ వినిపించి పురమున, కేతెంచుఁ డటంచు మ్రొక్కె నెంతయు భక్తిన్.

వ. అంతలో సుగ్రీవుండు

శా. తారం బంపెను కోపశాంతి పరుపఁగ, తారామహాదేవియుఁ
జేరంబోయి సుమిత్రసూతుఁ గని యో శ్రీరామచంద్రానుజా!
మీరుం గోపము చెంద మా బ్రతుకులుఁ మే మెంత ? సైన్యంబు లిం
పై రాజిల్లఁ గడంగుటే తడవు దేవా! మమ్ము రక్షింపుఁడా!

క. అని మృదుమధురంబులగు వచనముల చేఁబట్టి వేగ సౌమిత్రిని తా
కొనియేగె రాజగృహమున, కనితర సౌఖ్యమున నున్న యక్కపి కడకున్.

గీ. పీఠమున నుండి లేచి సంభీతుఁ డగుచు, మన్ననలసేయు సుగ్రీవు మగిడి కాంచి
రాము మఱచితివే ? వాలి ప్రాణములను, కొన్న బాణంబు లట్టులే యున్న వింక !

గీ. జాగ్రత సుమా! యటంచును సాహసమున, క్రూరముగ నొక్కి చెప్పిన భీరుఁ డగుచు
వ్రేళ్లు నలుపుచునున్న సుగ్రీవుఁ గాంచి, లక్ష్మణునిఁజూచి మారుతి లలివచించు.

గీ. ఇంత యాగ్రహ మేల ? మే మెల్లపుడును, రామకార్యమునందు జాగ్రత వహింతు
మనఘ! మాకు మరుపెక్కడ నయ్య! యిపుడు, గారవింపు సుగ్రీవు సత్కారగరిమ.

## శ్రీరామునివద్దకు సుగ్రీవుఁడు సేనలతోవచ్చి చేరుట

గీ. లక్ష్మణుని శాంతునొనరించి లలిని సర్వ, కపి మహాసైన్యములతోడ కలసి వారు
రాఘవుని సమీపించి శ్రీరామచంద్ర!, కనుమిదే సైన్యమిపుడ సంగరముఁగోరు.

గీ. ఈ మహాసైన్యమును కను మెంత కలదొ ?, ఇందు సేనాపతులు పదునెనిమిదైన
పద్మసంఖ్యాకులున్నారు పఱగ వీరి, కిపుడు సీతజాడకు సెల వియ్యవలయు.

క. అని యన్ని దిక్కులకు పంపెను వానరముఖ్యులను, ప్రవీణత సీతం
గని రాగ; నంపె దక్షిణమున కనుటకు పంపె నందు ముఖ్యులఁగడఁకన్.

## కపులను, సుగ్రీవుఁడు సీతాన్వేషణకై పంపించుట

సీ. అంగద జాంబవ దాంజనేయ సుషేణ, నల మైంద శరభ ముఖ్యులనుఁగూర్చి
ఒక నెలలోపల నొకవేళ నెఱిఁగి రా, కున్న ప్రాణములిక సున్న యనుచు
చండశాసనము నుద్దండలీల నశేష, కపిజనంబులకిచ్చి కడకఁబంపె
అంత శ్రీరాముఁ డత్యంతాదరముతోడ, తనచేతి ముద్రిక ధన్యమూర్తి

గీ. ఆంజనేయున కిచ్చి ముఖ్యముగ దీని, సీత కప్పగింపుము! నీకు చెప్పుచుంటి
నెఱిఁగొనుము నాదు మంత్రము నియతి దీని, జపముసేయుము! కను! కార్యసాధనంబు.

గీ. అని మహాప్రీతి నాంజనేయుని ననేక, విధములుగ దీవనముచేసి వెడలు మనియె!
అట్టి మంత్రము లక్షమార్లనియె మారు, తాత్మజుడు లక్షమార్లు నెయ్యమున వ్రాసె.

క. ఇదిగాక చిత్రకూటా, స్పదుఁడగు రాముండు భూమిజకు చెక్కిళ్లన్
నుదుటను పత్త్రావళిగా, ముదమున తిలకమిడినట్టి ముచ్చటలెల్లన్.

ఆ. కడురహస్యములను కడకొని యెఱిఁగి శ్రీ, రామువలన వాయుభీమబలుఁడు
తనర రామునకు ప్రదక్షిణ వినతుఁడై, కపులతోఁడ వెడలె కడుముదమున.

ఉ. తక్కినవారు దిక్కులను తప్పకచూచి ధరాత్మజాత యా
చక్కని లేదటంచు, పెలుచన్ పదిరోజులలోన వచ్చి; రీ
దక్కన మేగువానరులు దర్పముమీఱఁగ నాకసంబునం
దెక్కి బిరాననేగుచు ననేకుల రాక్షసులన్ వధించుచున్.

## హేమాపురమున కపులు దారిఁగానక చిక్కువడుట

చ. ఒక గుహనుండి నీరముల నొయ్యనఁ గ్రోలిన యట్టి సిక్తమా
మొకములు గల్గు రాక్షసులు పొల్పుగ వచ్చుటఁ గాంచి, డప్పిచే
తికమక నొందియుంట దగఁ దీర్పగ వారలు దాన నేగి; వా
రిక నిక పోవపోవ పదునెన్మిది వాసరముల్ గతించినన్.

ఉ. ఆ గుహలోని చీకటినె యట్టిటు సైగన పోయిపోయి, యిం
పౌ గృహరాజముం గనిరి పచ్చలు రత్నము లొప్పు దానిలో
యోగిని నొక్కతెం గనిరి, యోగ్యశుభాంగి నదే క్షణంబు వా
రా గరితన్ గుఱించి యెవరమ్మరో ? నీవని పృచ్ఛ సేయగన్.

వ. అ వ్యధూటీ రత్నం బాటంకంబులేక పాటవంబున నిట్లనియె.

సీ. వినుము ! హేమ యనంగ విశ్వకర్మ తనూజ, తన నృత్యమున నీశ్వరినిఁ గరంచి
యీ పురమ్మును వరమ్మేపునఁ గొని యిట, చిరకాలవాసమ్ము చేసి పిదప
పోవుచు నా తోఁడ పొలుపార వచియించె, నీ వీ గృహమ్మున నిలచియుండి
రామాగమనమును ప్రేమఁ ప్రతీక్షింపు, మా మహనీయుని రాముఁ గొలిచి

గీ. ధన్యమానసవై రమ్ము ! తరలి యనుచు, తనర దివమున కేగె, రాముని చెలంగి
ఏనుఁగనుఁగొందు నాపేరు నెరుగఁదలఁప, నను స్వయంప్రభయండ్రు వానరులెఱుగుడు.

క. నే నేమి మీకు సాయము, చేనోపుదు ? చెప్పుఁ డనుచు చిత్రమధురతా
శ్రీ నిలయములగు పలుకుల, పూని వచించిన లతాంగి పొడఁ గని కపులున్.

గీ. తల్లి ! శుభమగు నీకు సంతసము కల్గె, నీదు పల్కుల, మేము జనెదము సీత
జాడఁ గనుగొన; శ్రీరామచంద్రుకార్య,మునను తడవయ్యె ! మేమీ గుహానఁబడుటను.

క. మము వెలుపట త్రుటిఁ జేర్చుట, తమరు మాకు చేయతగిన దండి సహాయం
బమ ! యనిన నామె యొక్క క్షణమునన్ వానరుల బయలునన్ బడవైచెన్.

వ. మరియు నుదక ప్రదానాది సత్కారంబులఁ గావించె నంత.

సీ. కన్నులు చీకటుల్ గ్రమ్మగా మనలకు, దారి గానక కొంత తడవు చేనిమె!
గుహాలోననే; వృథా బహుకాలముగతించె, నయయో! యటంచు క్రించేయిరి కొంద
ఱా రాముసేవలో నట్టె ప్రాణం బిచ్చె, నా జటాయువని పెల్లనెడివారు
ధన్య మాతని జీవితమ్ము ధన్యము మన, మింతవారలమయి యింతయైన

గీ. ఏమిలాభము? పక్షితో నీడువచ్చు, రామకార్య పరత్వనిర్వహణశక్తి
కల్గదయ్యె; వృథాజన్మ కలిగె మనకు, కటకటా! యేమి లాభమీ కపులు బ్రదికి.

గీ. యింత తిరిగితి మింతకు యీవడువున, సీతయున్నదఁ జాడయే చేతమలర
చెప్పువారలె లేరైరి చెనకి చూవ, కేల బ్రదుకుట? మగిడి యిం కెటకు చనుట.

గీ. అనుచు కపివరులెల్ల దుఃఖార్తులగుచు, చెలఁగి ప్రాయోపవేశముచేసి చత్త
మనుచు దర్భల పఱచి దక్షిణ సముద్ర, తీరమునున్న యిసుకపైఁ జేరియున్న.

## సంపాతి కపులకు సీతావృత్తాంతముఁ జెప్పి రెక్కలుమొలచి చనుట

గీ. అచ్చటనె యున్న సంపాతి యనుజుఁడౌ జ, టాయువనుపేరు విని చావటంచు వినిర
యంబుమీఱగ వారి ప్రాణంబు కొనెదు, నాగ్రహంబున వచ్చె దుష్టాత్మ్ము లనుచు.

ఆ. వచ్చి వారి వలన మెచ్చు గుణంబుల, చచ్చినట్టి యనుజు సంస్థితియును
అర్హమైన వార్త నటువిని తా జలాం, జలి యొసంగె వాని కలఘుప్రేమ.

ఆ. ఇచ్చి కపుల వృత్తమెల్ల నెఱింగి మీ, రేల చావజూతురింత మాత్ర?
నూరుయోజనముల దూరము సంద్రము, దాట లంక కలదు దానియందు.

గీ. సీతయున్న దశోకముచెంత రావ,ణాసురుని పుష్పవాటికోద్యానమందు
చూడఁగల్గిన నిప్పుడ చూచిరందు, నాకు లేవు రెక్కలు నే జనంగ ననిన.

సీ. నీ పర్ణములులేని లోపమెట్లయ్యె? నం, చడిగిన సంపాతి యనియె కపుల
కేనును నాతమ్ముఁ డూని పంతము వట్టి, సూర్యుని ముట్టగా చూడ నొకట
నేను పైన జటాయువో నిమ్నతముగ దా, దాపు సూర్యుని జేర దగ్ధమయ్యె
పైనుండుటను నా పర్ణమ్ము లంతట, భూమిస్థలిని పడిపోయినాఁడ!

గీ. రెక్కలున్న నాతమ్ముఁ డేదిక్కు చనెనొ?, నాటినుండియు నిక్కము నేటిదనుక
వాని వార్తలే లేవు మీవలన వింటి, నపుడ నాకు రెక్కలులేని యార్తి కల్గె.

ఉ. అప్పుడు మానిచంద్రుఁ డొకఁ డచ్చట బిట్టు తపంబు సేయుచున్
చొప్పడె, నమ్మహామహుఁడు సూరిజనుం డతనిన్ ముదంబునన్
గొప్పగ మ్రొక్కి, నా కథ నకుంఠితభక్తిని విన్నవింపగా
నప్పురుషోత్తముం డనియె నయ్యెడ పూర్ణకృపాసముద్రుఁడై.

ఆ. సీతవార్త కపులచెంగట నెప్పుడు, చెప్పగల్గు నపుడు తప్పకుండ
సీదు భవ్య పర్ణ నివహంబు వచ్చును, అనుచు మెచ్చి పలికె నందువలన.

మ. ఇవిగో! మెత్తని రెక్క లిప్పు డిపుడే యేపార రాసాగె, నే
నవలోకించెద రావణాసురుని యుద్యానంబునన్ దూర దృ
క్కృపుటన్ సీతను, భీతియేల? నని వేగన్ పైకి ఆకాశ మ
ధ్యవకాశమ్మున కేగి సీతఁ గని నెయ్యం బొప్పఁగా నిట్లనున్.

గీ. సీత భద్రముగా నివసించె రావ,ణాసురుని పుష్పవాటి కోద్యానమందు
మీరు చింతింప పనిలేదు మేలె కలుఁగు, నేను మున్న యెఱుంగుదు నీ నిజంబు.

గీ. రావణుఁడు సీత గైకొని పోవునపుడె, చూచి నా పట్టి వచియింప, కాచి తల్లి
యైన సీతమ్మ దేక యజ్ఞానమతిని! ఛీ దురాత్మ! వచింపగా చేరినావె?

మ. అని నే నాతని కోపగింప నపు డయ్యో! పోయె, నీ నాటికిం
గనరాఁ డెచ్చటి కేగెనో? యనుచు వేగన్ పోయె సంపాతి, దా
నిని విన్నట్టి కపీశులెల్ల జలధిన్ నిర్వక్రమౌ శక్తి దా
టను నెవ్వారలు శక్తివంతులిక జాడల్వచ్చెనం చార్తులై.

క. నీ వెంత దూకఁగలవన, నీ వెంతగ దూకఁగలవు నీవెం తనుచున్
ఆవంతయైన కార్యము, చేవ నెఱుఁగకుండ బల్కు చెయిదిం గనుచున్.

గీ. దూరమునఁ గూరుచుండె సమీరసూతి, ఒక్కఁడును చెప్పరే! శతయోజనముల
జలధి లంఘింపఁగలమని జాంబవంతుఁ, డప్పుడను, కపివరుల నెయ్యమునఁ గాంచి.

ఉ. నేను త్రివిక్రముం గని విధేయత మ్రొక్కి ప్రదక్షిణింపఁగా
పూనిన, నొక్క కొండ యది ముల్లయి గ్రుచ్చుకొనన్, అదే అదే
మ్రానయి దూకినప్పుడు ప్రమాదముఁ గూర్చును, కాని లేనిచో
నే నవలీల సంద్రము కనీసముగా తరియింతునం చొగిన్.

ఆ. విన్న వోయి చెంతనున్న యొక్క శిలాత,లంబునందునన్ మనంబునందు
రామనామజపపరాయణు హనుమంతుఁ, చేరి చేయివట్టి చేరఁ దీసి.

సీ. నీకన్న నెవ్వరు? నిఖిలపరాక్రముల్, నీ మహాత్మ్యమ్మును నీ వెరుఁగవు!
నిన్ను బోలెడు వీరు లెన్న నీరేడులో,కంబులం దున్నారె? కపికులేంద్ర!
నీ విట్లు చిన్నవోయి విచారమగ్నత, కూర్చున్న కార్యంబు కొఱంత వడదె?
లెమ్మ! శ్రీరాముఁడు మమ్ములఁ బిలచి యీ, ముద్రిక నిచ్చెనా? మొనసి నీవె

ఆ. లంక కేగఁగలవు, శంక నీ కేటికి, జయముకల్గు నీకు జయ! హనూమ!
అనుచు పల్కనంత నట్టె యుప్పొంగి యా,కాశ మంట నూర్ధ్వకాయుఁ డగుచు.

క. బంగారువంటి మేనును, యింగలమునుబోలు ముఖము నిరు నీలాక్షుల్
పొంగిన శరీరమును కని, ఖంగారైపోరె రిపులు కపి యాకృతికిన్.

ఆ. కొండ నెక్కి నేల గ్రుంగంగ నట్టహాసంబు చేసి రామచంద్రు మదిని
ధ్యానమొనరఁ జేసి తన్మయుండై సముద్రంబు దుముకనుండె తనువు పెంచి.

గీ. పార్వతీ! పాపహారియై భవ్యమైన, రామచంద్రుని కిష్కింధ రమ్యచరిత
చెప్పఁబడియె నా చేత నీ చేత ముల్లసిల్ల రసికులు భువిని రంజిల్ల పెల్లు.

క. అని చెప్పగ విని పార్వతి, అనితర దుర్లభ విశేషమానందంబుం
గొని యవ్వలి వృత్తాంతము, వినఁ జెప్పుఁడటన్న గౌరి విభుఁ డిట్లనియెన్.

గద్యము

ఇది శ్రీ బాలభారతీ ప్రసాద లబ్ధకవితా ధౌరేయ
పండిత చిలుకూరి శ్రీరామశాస్త్రి నామధేయ
ప్రణీత శ్రీమదాంధ్రానంద
రామాయణాంతర్గత
సారకాండస్థ
కిష్కింధకాండము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# ఆనంద రామాయణము



## సుందరకాండము

## ప్రథమ సర్గము

### హనుమంతుఁడు సాగరము లంఘించుట



రామజప పరాయణుఁడై రాజిలు శౌర్యవంతుఁ డగు హనుమంతుం
డా రామముద్రికం గని, శ్రీరామునికార్య మేనె చేతు నటంచున్.

ఉ. అంతట ఆంజనేయుఁడు రయమ్మున సంద్రము దాఁటనెంచి, అ
త్యంత పరాక్రమం బెసఁగ అద్భుత సింహనినాదమున్ జగం
బంతయు గజ్జనన్ వడక అట్టె యొనర్చి, రసాతలంబు నం
టన్ తతపర్వతాగ్రము నడంచు ఉసిన్నెగసెన్ నభోస్థలిన్.

క. ఎగసి చనుచున్న మారుతి, తగు బలము నెఱుంగ, దేవతలు సురసాప
న్నగమున్ పంపిరి; తత్పన్నగ మంజని సుతుని త్రోవనన్ అడ్డగుచున్.

ఉ. ఆఁ యని యోజనాయత మహాముఖ ముగ్రత విప్పి, నీవు రా
వోయి! హనూమ! ఆకలి బహున్ నను వేచెడు, నిన్ను మెక్కి నే
పాయుదు నా క్షుధ మ్మనిన, మారుతి యిట్లను: రామకార్యమున్
జేయఁగ నేగువాఁడ; అది చెచ్చెరఁ తీరిచి వెండి వచ్చెదన్.

గీ. తత పరోపకారార్థ మిదం శరీర, మనెడు పల్కులు నా హృదయమున కలవు;
మాంస మెమ్ముల ప్రోవె! ఈ మలినదేహ; మిట్టి సద్వినియోగమా కెట్టు లొదవు?

చ. అదె లభియింప, కాదనెడు నట్టిఁడు మూర్ఖుఁడు కల్గునే? నిజం
బిది తలపోయు; మేను పృథివీసుత! రాముని భార్య! సీతకై
వెదకుచు పోవువాఁడ, కడు వేగముగా; నను అడ్డగింపకే
వదలుము; సీత యున్న దనువార్త రఘూద్వహుఁ జేర్చి వచ్చెదన్.

ఆ. నీ మనోరథంబు నెఱవేర్తు నపుడన, కాదు కాదు; నిన్ను కదలనీయ
ననిన, ఆంజనేయుఁ డటు రెండుయోజనాలైన అదియు నోటి నటులె పెంచె.

చ. అది కని, ఆంజనేయుఁ డొక యై దగు యోజనము ల్పెరింగె, ఒ
ప్పిదముగ; పాము ఆస్యమును పెంచెఁ గడుఁ దశయోజనాయత
మ్మొదవఁగ; వాయుజుండు శతయోజనము ల్తనువుఁ పెరుంగఁ జే
యఁ, దవిలి పాము కోపమున అంతకు ఇబ్బడి మోము వెంచినన్.

క. అంగుష్ఠమాత్ర తనుఁడై, పొంగుచు ఆ సర్పముఖము పొలుపుగ దూరెన్
చెంగున బయటం బడె నిం, పుం గూర్పగ కాలహరణమును లేకుండన్.

వ. ఇట్లుపాయంబునన్ వెడలిన దేవతలెల్ల వాయుజు ఋజుత్వ పరాక్రమ ప్రయోగ
కౌశలంబుల కచ్చెరువంది రామకార్య ధురంధరుండవు కమ్మని ఆశీర్వదింప.

శా. ఆకాశంబున పక్షికిన్ సదృశుఁడై, అత్యంత వేగమ్మునన్
వీరన్ పోవఁ దొడంగె, ఆ సురసయున్ వేవేలుగా సంస్తుతుల్
జోరన్ చేయుచు, వందనం బిడుచు, అస్తోకంబుగా స్వర్గమున్
చేకొంటన్, జయ మారుతీ! అనియె! సంశ్రేయాభిలాషాత్మయై.

ఆ. అంతుపంతులేని ఆ సంద్రముం దాఁట, అలసిపోవునేమొ? ఆంజనేయుఁ
డని సముద్రుఁ డొక్క పనిపూని మైనాకు, నంపె కొంత శ్రాంతి అతని కొసఁగ.

సీ. వివిధ రత్నమయమ్ము లవుశృంగములతోడ, మించు మైనాకుని మీఁదుగాఁగ
నరరూప మంది వానర వీరుఁ డేగుచో, మైనాకుఁ డత్యంత మమత కదుర
ఓ వాయుపుత్ర! రమ్మో రామదాస! వి, చ్చేసి ఫలములు భక్షించిపొమ్ము!
అమృత కల్పమ్ములై అమరు పక్వఫలమ్ము, లాయత్తములు కొంచెమంత సేపు

గీ. విశ్రమించి ఆ పయి పొమ్ము స్వేచ్ఛమీఱ, అలసియున్నావు శ్రీరాము నమలకార్య
మునకు పోవుచునున్న నీకొనర కొంత, శ్రాంతి కల్పింప వచ్చితి సాదరమున!

వ. అనాపేక్షితముగ సహాయ మొనరింప నేల? నని సందేహింతువేని.

క. మును శైలరాజులకు నిం, ద్రునకున్ యుద్ధమయి దశరథుని వలనన నే
కని రక్షణమ్ము సంద్రం, బున డాగితి నాటి స్నేహమును మదిఁ దలఁతున్.

ఆ. రామదాస వగుచు రామకార్యమునకై, ఏగు నీకు సాయ మే నొనర్తు
ననిన, ఆంజనేయుఁ డను రామకార్యమం, దలపులేదు నాకు సొలుపులేదు.

గీ. స్వామి కార్యమునందు విశ్రాంతి తగునె? ఫలములేల? భక్షణమేల? పఱతు నన్ను
అకట! నీదు స్పర్శముచేతనైన ననుఁ బు, నీతుఁగా చేయుమనుచు ప్రార్థించినంత.

మ. గిరి సంప్రార్థన మాలకించి తన కేల్ కించిత్తు తాఁకించి, వే
గిర మే ముందుకు సాగిపోయె; ఒకచో క్లిష్టంబుగా వేగము
త్వర మందంబయిపోవ, కారణ మదేమో? యంచు యోచించి చె
చ్చెరఁ గాంచెన్ కపి సింహికన్ సురమహాక్షీణైక ఘోరాకృతిన్.

క. ఛాయాగ్రాహిణియగు నది, ఆ యాకాశంబు దారిఁ అరుగు మృగములన్
పాయక భక్షించుచు నవు, డా యంజని సుతుని వేగ మాకర్షించెన్.

మ. కనియెన్ మారుతి నీటిపై విపులమై గంభీరమౌ దాని నో
టిని; దీనిన్ తరియించుటెట్టు? లెటులో? డీకొంట అం చందు దూ
టి నిరీక్షించుచు, సింహికన్ వడిగ దోర్వీర్యంబునన్ ప్రేగు లె
ల్లను ఖండించి, వెసన్ హరించి; వెడలెన్ లంకా ప్రయాణాప్తుఁడై.

ఉ. లంక సమీపమందు పరిలబ్ధిత సింహికఁ జంపినట్లుగా
కొంకక క్రౌంచిఁ జంపి, యటకున్ జలధిం దరియించి, యొద్దునన్
లంకిణిఁ గాంచి అయ్యసుర లావు నెఱింగి ధరిత్రిపైన కా
లుంకువ జేసినంత పుయిలోడక రక్కసి ఘీంకరించినన్.

వ. సముద్రలంఘు నారంభంబునుండియు విఘ్నపరంపర లెన్నిగల్గినన్ కుంటువడక నింత వఱకు గెంటితి, నిక సంకటంబు లేదీ రక్కసి నెటులేని నిర్జింతునని భావించుచున్నంత ఆ రక్కసికాంత ఘోరాకృతిం దాల్చి.

గీ. ఎవఁడవుర? నీవు భయ మొకయింత లేక, ఇచట లంకిణి గలదని యెఱుఁగనట్లు
ఎంతస్వాతంత్ర్యమున వచ్చి తింత యెఱుఁగు,మిపుడ నీయమపురియాత్ర ఎలమిఁ గలుగు.

క. అని హుంకరించి కనుమని, ఘనమగు ముష్టిప్రహారగరిమ కపిన్ చ
య్యన అదలించిన కపివరుఁ, డను దుష్టా! తగునె యింత ఆగడ? మతివా!

శా. నిన్నేమంటినె? నీదు జోలికనినానే? ఈడకున్ వచ్చుచో
తిన్నానే చెడ మీదు స్వత్వముల? భీతిన్ స్నీతిఁపోఁ బుచ్చి మీ
రెన్నాళ్ళిట్లు చెలంగి యేలెదరు? చండీ! ధూర్తవై ముష్టిమై
నన్నుం గొట్టుదె? యింత మత్తతయ? ఓ నా శౌర్యముం జూడుమా.

చ. అను కపిఁ గాంచి, పిట్ట యవురా! కడు కొంచెము కూఁత యూఁత మ
న్ఘన వచనానుసారముగ నాకు గనంబడ చేయు శౌర్య మో
వనచర! నీకు గల్గునె? ఎవంకు యమాలయ మేగకుండ పో
యెను, నను లంకిణిం గదిసి? ఎక్కడి కేగుదు వంచు నుగ్రమై.

ఉ. మీఁదికివచ్చి పట్టుటకు మేకొననున్న పిశాచి వెండ్రుకల్
బ్రోదిని వామహస్తమున పూని లగించి కలంచి వంగగా
నూది పరాక్రమం బెసగ, హుమ్మని గ్రుద్దొక టిచ్చినంతనే
మేదినిఁ గూలె బోరనుచు; మించిన యార్తిని బిట్టు అర్చుచున్.

గీ వనచరోత్తమ! కన్గొంటి ఘనుని నిన్ను, బ్రహ్మవచనంబు లిపుడ జ్ఞాపకము వచ్చె!
కపి యెపుడు నిన్ను నోర్వఁగాఁ గలుగునపుడు, రావణుని చంపవచ్చు శ్రీరాముఁడనియె.

మ. కనుగొంటిన్ కనుగొంటి, రావణుని నింకన్ జంప శ్రీరాముఁడే
చేనుదెంచున్, నను నీవు గెల్చితివి, నిశ్శంకన్ చేనంజెల్లు, లం
కిణి ప్రాణంబులబాసినన్, పరుల శిక్షింపంగ నే డోపజా
లు నహో! రాక్షసులందు; సీతఁగని మేలుంజెందు దీ వేగుమా.

గీ. కపికులశ్రేష్ఠ! నీచేతఁ గడగి నేను, కందు నూర్ధ్వలోకమ్ముల క్రమ్మరంగ!
ధన్యుఁడవు నీవు, స్వామి సత్కార్య నిర్వహణమునన్ జయమందుదు వనుచు పలికి.

శా. చచ్చెన్ లంకిణి, యోజనాయత మహోచ్ఛ్రాయాంగ విస్రంభియై;
జొచ్చెన్ లంక కపీంద్రుఁ, డద్భుతముగా చూచెన్; మహాత్మంగ సం
పచ్చిత్రోరు త్రికూట శృంగవిలసద్భవ్యాద్భుతానూన దీ
వ్యచ్చాతుర్య విశేష గోపురలసత్ వ్యాపారి! లంకాపురిన్!

## లంకా ప్రవేశము – సీత నన్వేషించుట

సీ. అమిత పణ్యశ్రేణి రమణీయమై, మహా, భంగ శృంగాటక సంగతమయి
గోపురాట్టాలకంబై పొలుపారెడు, పుష్పవనాయత పుంఖమైన
గాంగేయ రత్న వికాసితమై యొప్పు, కాసార విభవ ప్రకాసితమయి
వివిధ ధ్వజాశేష విఖ్యాత భీమమై, చతురంగబల మహాసాధ్యమైన

గీ. శ్రీ పురం బయి వెలయు లంకాపురంబు, చూచి యద్భుతమంది, నిస్తుల వినిశ్చ
యాత్ముఁడై, శ్రద్ధగా జనకాత్మజాత, వెదకె కపి అశోకం బేడ పొదలు నంచు.

క. ఇల్లిల్లు తిరిగి త్రోవల, నెల్లం గని తోటలెల్ల నెఱి శోధించెన్
సల్లలిత జానకీముఖ, మల్లనఁ కనుఁగొనఁగ అనిలు నాత్మజుఁ డంతన్.

వ. ఇట్లు సంచరింప నంత సంధ్యాసమయం బతిక్రమింప.

సీ. గుహలోన నిద్రించు కుంభకర్ణునిఁ గాంచె, అతి భయంకరమైన యతని రీతి!
సజ్జనుఁడౌ విభీషణుని వీక్షించె సాత్వికమూర్తి మఱచి నిద్రించువాని!
మేఘనాదుని కాంచె మించు సులోచనాయుతు నొగి నిద్రలో నున్నవాని!
రావణాసురుఁ గాంచె రాజమందిరమున, వివిధ దాసీ సమావృతుని నతని!

గీ. కాంచి రాక్షసపాళి చికాకు పఱుప, నిశ్చయించి మారుతి కొంత నియమ రహిత
ముగఁ బ్రవర్తించె కపిజాతి బుద్ధికొలఁది, గోచరించుచు ఒకట నగోచరముగ.

క. రక్షఃపరివేష్టితుఁడగు, రక్షోవల్లభుని మందిరంబునఁగల దీ
పాక్షయ సంఖ్యల నార్పె ఒకే క్షణమున వాయుసుతుఁ డహీన ప్రజ్ఞన్.

సీ. రావణాద్యసురులఁ చేవఁ భ్రాంతులఁ చేసె, అంజనీసుతుఁడు రయంబుమీఱ!
కొఱవి చేపూని ఉక్కున రాక్షసేశ్వరుఁ, గడ్డాల మీసాలఁ కాల్చివైచె!

లక్షల కొలఁదిగ రాక్షసకాంతల, కమితభయంబు తా నబ్బె కొల్వ !
జలభాండముల నడుముల కంటఁగట్టి; దూతల తోలె తొలకలో చలమువీఱ !

గీ. అపుడసురు లందఱును భయాకులత నంది, నేఁడు సీతామహాదేవి గాఢకుపిత
యయ్యె!సత్యము! ప్రాణాంతమయ్యె!మనకు, కాక యెపుడైనఁ గలదె యిక్కారణినునుచు.

క. ఒండొరులు చెప్పికొనుచుం, గుండె లదఱ, ఇట్టి పనులు కొనకొని కలవే ?
ఒండు మహిమమ్ము కాదిది, ఖండితముగ సీత మహిమ కాక ! యటంచున్.

గీ. చెప్పికొన సాగి రది విని జెట్టియైన; ఆంజనేయుండు సంతస మంది రావ
ణాసురుని యంతిపురమును అవనిజాత, సీతఁ గానక వెదకె సంప్రీతి మీఱ.

ఆ. తిరిగి తిరిగి కాంచె దివ్యపుష్పకమున, స్త్రీ వృతుండు కడిఁది రావణుండు
లోక మోహనాంగి తాఁకి నిద్రింపఁగ, కాంచి యామె సీతఁగా తలంచి.

గీ. లక్ష్మణుఁడు చెప్పినట్టి తల్లక్షణములు, కానుపింపక యున్నను కర్కశులగు
క్రూర రాక్షసులన్ సుకుమారి సుంద,రాంగి యిటు లుండునే ? యని యడలిపోయె.

వ. అనిన అప్పు డప్పర్వత రాజపుత్రియు.

గీ. మూఁడులోకంబులందును ఈడులేని, పూజ్య సౌందర్యరాసి ! భూపుత్రి ! యనెడు
భ్రాంతిఁ గలిగించు నట్టి శోభన్ వెలుంగు, నట్టిదిగను మందోదరి ఎట్టులయ్యె ?

## మందోదరీ జన్మవృత్తాంతము – గోకర్ణ మహాక్షేత్రోత్పత్తి

ఉ. రక్కసి దాని కిట్టి సుకరంబగు రూపముగల్గె నెట్లు ? స
మ్యక్కమనీయబుద్ధి హనుమంతుఁడు రావణు శయ్యనున్న అ
మ్మక్కిడిఁ సీతయంచు తలపోయగ తగ్గ మహా విలాస మ
మ్మక్క ! గడించె నెట్లు ? చెపుమా ! పరమేశ్వర ! జీవితేశ్వరా !

శా. నా సందేహములెల్ల తీర్చుటకు, తీక్ష్ణ జ్ఞానదోర్వీచికా
(శ్రీ) సందోహముఁ దెప్పఁ దేల్ప, పరమ (శ్రీ) మించు మీఱగానిచో
కాసంతేనియు చెప్పఁగల్గు నెవఁ ? డీ కల్యాణ సంధాయియా
(శ్రీ) సాకేతపురాధినాథ చరిత (శ్రీ) భవ్యవాల్లభ్యముల్.

క. అనినన్ పార్వతిఁ గని తా, నను పరమేశ్వరుఁడు ప్రీతి, ననుపమ గాత్రీ !
వినిచెద ! విను ! మిది చిత్రం, బనఘము సురుచిరముఁ అవ్వ యానందదమున్.

ఉ. ఎప్పటి కప్పుడే మఱతు వేమొ ? ఎఱింగియు నన్ను ఊరకే
చెప్పు మటందువో ? ఎఱుఁగ ! చేడియ ! చెప్పెద ! పుణ్య సత్కథల్
చెప్పుటకన్న సత్కృతి విశేషము కల్గునె ? విన్నవారినిన్
చెప్పినవారినిన్ ముదముఁ చెందగఁ జేయవె ? (శ్రీ) ప్రదంబులై.

వ. విను మక్కథా వృత్తాంతం బెట్టులనిన.

గీ. రావణుని తల్లి కైకసి రమణి యొకట, తనయుఁ గని చాల దుఃఖ సంతప్తయగుచు
ఒక్కనా డిట్లు వచియించె ఉక్కుదక్కి, రావణా! నీవు కల్గి వ్యర్థ నయిపోతి.

చ. అదిమితి నష్టదిక్పతుల నందువు; లోకములందు వీరులన్
చిదిమితి నందు వంతటను శ్రేష్ఠ పరాక్రమశాలి నందు; వీ
ముదిమిని తల్లినైన నను మూఁడు దినంబులనుండి యన్నమున్
తుదకును మంచినీళ్ళయిన తోఁచని న గ్గనకుంటి వక్కటా!

గీ. కాల్పనా? నీ పరాక్రమ క్రమమదేల? నాదు దురవస్థ చెప్పుకొనంగనైన
పరసతీరతిఁ తిరుగు పాపరతివౌట, నీవు మూఁడునాళులుగ కన్పింప వైతి.

గీ. కటా కటా! ఏమితెల్పుదు? కాంచినాను, పాపఫలమున మిమ్ము దుర్భరముగాఁగ;
అని వగచు తల్లి వగ కని, అట్టె మండి,పడి కనుల కెంపు తోఁపఁగా పల్కె నిట్లు.

మ. అపకారం బొనరించి నాయమకు ఇట్లాయాసమున్ కూర్చు పా
ప పటిష్ఠుం డిదె చచ్చె; కేసరములన్ బంధించి ఉయ్యాల లూఁ
గు పనిన్ చేకొను వానిరీతి నెవఁడోకొ? నిన్ను కారించె త
ల్లి! పరాకేల? వచింపు మాతని ధరన్ లేకుండ కావించెదన్.

గీ. నీకె అపకార మొనరించి నిఖిల లోక,పాలకుఁడె యైన బ్రదుకునే? ప్రాణయుక్తిఁ
తల్లి! ఎఱిఁగింపుమా! ఖలు తక్షణంబ, నీ యెదుటఁ బెట్టి, యిపుడె ఖండించివైతు.

క. అను రావణుఁ గని కైకసి, తనయా! యెవ్వరినిఁ చంపఁ దగ దిప్పుడు నే
ననయము భజియించెడు మ,న్నన లింగము కోలుపోతి నా యశ్రద్ధన్.

గీ. ఆదిశేషుని నిశ్వసనాహతిఁ బడి, నేను పూజించుచున్న అనూనమైన
నా పరమలింగ మిప్పుడ నన్ను విడిచె; అద్ది లేకున్న నా కన్నమవని కలదె?

ఆ. లింగపూజలేక యెంగిలి పడనని, పలుకనేల? నీరె పనికిరాదు;
దొరకె నేని దాని, దొరకక పోవునేన్, శివుని నడిగితెమ్ము శ్రేష్ఠమొకటి.

మ. అని యక్కైకసి పల్కు పల్కు విని యమ్మా! యింత మాత్రానకే
నను నిందించితివే? పరాక్రమమునన్ నాకీడెవండయ్యెడిన్?
చని నేఁ తక్షణమందె ఆ శివుని పజ్జన్ చేరి ఆత్మప్రభా
ఘనలింగంబునె తెచ్చియిత్తు, ఇపుడే కైకొమ్ము సంప్రీతవై.

ఉ. పోయిన లింగమున్ మగిడి పొందుటకన్నను శంభు నుత్తమం
బై యలరారు నాత్మ పరమాద్భుత లింగము తెచ్చియిత్తు త
ల్లీ! యవమాన మిందు లవలేశము లేదని పుష్పకంబుపై
పోయె రయంబున, న్నసురపుంగవుఁ డమ్మ హితంబు కోరుచున్.

శా. కైలాసాచలభూమి చేరి, కని సాక్షాచ్ఛంకరుఁ బ్రీతిమై
చాలా భక్తిపురస్సరంబుగ నమస్కారంబుఁ గావించి, వి
ద్యాలావణ్యము తోప సామము సముద్యల్లీలలం బాడుచున్
ఆలాపించె అనేక రాగముల, నొయ్యన్ శంభుఁ డుల్లాసిగాన్.

గీ. పార్వతీపతి రావణబ్రహ్మ సేయు, సామసంగీతమునకు బల్ సంతసించి
ఏమి కోరిన నిత్తునోయీ! వచింపు, మన్న, నది విని రావణుం డనియె నిట్లు.

వ. శంభో! నా యభీప్సితం బియ్యది.

శా. నా కన్నమ్మకు ఆత్మలింగమును, ధన్యత్వంబు చేకూఱఁగన్
నాకై చంద్రనిభాస్య పార్వతిని, విన్నాణంబుగా నీయవే;
ఓ కైలాసపతీ! మహేశ! అభవా! ఓంకారరూపా! అనన్
ఓ కాంతా! నిను, ఆత్మలింగసహితం బొక్కమ్మ డే నిచ్చితిన్.

ఉ. ఇచ్చెడువేళ లింగము నికెచ్చట నేనియు త్రోవయందు నీ
వచ్చుగ నుంపరాదు; అటులైన అశక్యము నీవు కొంచుఁ బో
నెచ్చట దీని నిల్పుటకు నీవు తలంతువా? ఆ ప్రదేశమం
దచ్చుగ నుంచు మంచు, విదితాకృతి దోఁపగఁ దెల్పి పంపితిన్.

ఉ. వానికి చిక్కి నీవు భగవానుని విష్ణునిఁ గూర్చి మ్రొక్కఁగా
పూనిక విప్రరూపమును పూని అతం డరుదెంచి రావణా!
యీ నలినాక్షి యెవ్వ? రని యేర్పడ పల్కిన, రావణుండు రూ
పూనిన గర్వమో! యన మహోద్ధతి పార్వతి యంచు పల్కినన్.

శా. అయ్యో! యెంతటి పిచ్చివాఁడ వయయో! ఆ శంకరుం గూర్చి నీ
వి య్యత్యంత కఠోరమా వరము నీ వే రీతిగా కోరినా
వ య్యాతండు స్వకీయ భార్య నెటు లొయ్యన్ బుద్ధిలే కిచ్చెనం
చి య్యీ మాయపిశాచి చేంక నిడి నీ విల్లీలఁ గొంపోదువే?

గీ. పార్వతీదేవి నెచటనో భద్రపఱచి, కృత్రిమపు గౌరి నీ కాంత నిచ్చె నీకు
పార్వతి నెఱుంగ రెవ్వ రీ యుర్విపైని, నిన్ను వంచించె హరుఁ డిది నిజము! నిజము!

క. అని పల్కు బ్రాహ్మణున్ విని, తన బుద్ధిఁ దలంచి, కడు యథార్థమె కా యీ
తని పల్కు లనుచు, నిట్టూర్పు నిగుడ్చి, నిశాచరుండు బోరనఁ బలికెన్.

గీ. బ్రాహ్మణోత్తమ! నీ పల్కు భవ్యమును నిజంబుగా నాకు పొడకట్టె; జగతి నొకఁడు
చేతులారంగ తన భార్య చెనటి కిచ్చు, వెఱ్ఱి యుండునె? తప్పుకో వెఱవుఁ గనక!

ఉ. కావున శంకరుండు తమకంబున వంచన చేసె నన్ను; ఏ
తావున పార్వతిన్ ధరణిదైవమ! శంకరుఁ డుంచె; నేర్పడన్

ప్రోవుము నాకు తెల్పి, యని పొల్పున మ్రొక్కిన గాంచి, యద్ధరా
దేవుఁడు పల్కు, నేల కడు దీనత నొందగ నీవు రావణా!

గీ. మయుని కడ డాఁచినాఁడు పార్వతిని నిజము, దివ్యదృష్టిని కంటి, ఇదే క్షణమున
పోయి యాతని భంజించి పొలుపుమీఱ, తెచ్చుకో! పార్వతిని నీదు దీప్తి మెఱయ!

గీ. స్వర్గమర్త్యములం దెల్ల సంచరించు, నీవు పాతాళమున కేగ నేరవో? య
టంచు చింతింప కాతఁ డాయతివ నచట, డాఁచె; కైకొని రమ్ము రేడా! రయమున!

ఆ. అపుడు శంకరుండు అతితేజసుఁడవైన, నిన్ను మోసపుచ్చ నేర్పు నెఱిఁగి
సిగ్గు జెందుఁగాత! ఛీ! యీమె విషమని, చెప్పి యేగె నంత శీఘ్రబుద్ధి.

క. చను బ్రాహ్మణు నా పల్కులు, విని రావణుఁ డట్టె గౌరి విడిచెన్; కైలా
స నగాగ్రమందు: తక్షణమున పాతాళమున మయుని పురమ్మున్ చేరెన్.

ఆ. చేరి భీకరమగు సింహనాదమ్మున, మయుని పిలిచి నీదు పజ్జఁ గలదు
సర్వమంగళాంబ; సరగున ఆపెని, మ్మిపుడ! యీయవేని యి మ్మసురుల.

మ. అని గంభీర వచో భయంకరుఁడు దైత్యస్వామి పల్కంగ, వాఁ
డను! దైత్యోత్తమ! పార్వతీసతి యొకో! అబ్భారతీదేవియో!
వనలక్ష్మి మణియో! రతీ సతియొ! అవ్వామాక్షి యెవ్వర్తెయో!
కనఁగా చాలనుకాని నాకడ జగత్కల్యాణి నొక్కర్తెనున్.

చ. ప్రమధగణంబులం దొకనిభంగిని విప్రు డొకండు, తత్సతిన్
కమలదళాక్షి నాకడకు గ్రక్కున కైకొని వచ్చి, యీపెఁ బ్రో
వుమ! మహనీయ! రేపకడ పొల్పుగ ఈమెను కొంచుపోదు నం
చమలినవృత్తిఁ పల్కి చనె నాతఁడు, చయ్యన నేను నాతనిన్.

చ. అడుగుచు నుంటి నీమె యెవ రంచు; అతండు త్వరన్ వచింపకే
చిడిముడిపాటుతో చేనియె; చెప్పెడిదేమి? నను న్వధింపఁగా
కడఁగితి, విప్రు డీ సతియె కారణకారిణి గాఁగ; కావునన్
తడయక నీపెఁ గైకొనుము; తత్సతి నీదియె యైన రావణా!

క. అని మయుఁడు పల్క రావణుఁ, డను, నీమె వివాహమాడు నాపేక్ష మెయిన్
కొని చనుచు నున్నవాడను, వనిత నొడంబఱచి నీకు వార్తన్ జేతున్.

ఉ. నన్నవమానపెట్టి శివుఁ డట్టుల చేసె నెఱుంగనట్టులే;
క్రన్నన నీమె నేను కడకన్ గ్రహియింతు వివాహభంగి; నీ
వు న్నను అల్లునిన్ గ తలపోసి, కుమారిత నీమె నిమ్ము; నీ
కున్నతి గల్గఁ జేతు, పరమోత్సుక మయ్యెడు, నాదు కూరిమిన్.

గీ. ఈమెఁ గొని నేను లంకకు నేగి, ఈపె, నొడఁబఱిచి, నిన్నుఁ పిలిపింతు; తడయ కీవు వచ్చి నాకు కన్యాదాన మచ్చెరువుగ, చేయవలయు! నటంచును చెప్పి, అపుడ.

క. ఆ వనితామణిఁ గొని చను, ఆ వెఱవును గాంచి విష్ణుఁడా విప్రుండా
త్రోవ నెదు రగుచు పల్కెన్, రావణ! నీ విక్రమంబు రమ్యంబయగున్.

వ. మఱియు నీవు కోపించిన త్రిభువనంబులును, తత్తదధిపతులునుం గూడ నిలువం గలరే? వేదవేత్తవు, శతకోటి శివాలయంబులకు పూజచేసినంగాని సాపడవు, దేవతలన్న నీకు తృణప్రాయులు, నీవు క్షణమాత్రన మయు నిర్జించి యీామెం దెచ్చితివి. నీ వీమెం బెండ్లియాడి అనితర లభ్యులైన పుత్రులం గందువు. నీవు భయంకరములైన నీ వేఁడి చూపుల నిర్జరేంద్రాదులకు దుర్జేయుండ వగుదువు.

క. అని ముచ్చట లాడుచు రావణుఁడున్ మలమూత్రభారబాధితుఁడగు మ
ట్టునకున్ జా గొనరించినఁ, గని బ్రాహ్మణు రావణుంను కడఁగి వచించున్.

వ. అయ్యా, ఇది శివుని ఆత్మలింగంబు. దీనిన్ క్రింద నుంపరాదు. నేను మలమూత్రాదికముల బాధ నిర్వర్తించుకొని శుచినై క్రన్నన వత్తు; అంత దనుక దీనిన్ దయచేసి పట్టుకొండు; అదియుంగాక ఈ మెలఁతన్ కూడఁ కనుపట్టి ఒక్క ముహూర్తమాత్రం బుండుఁ డనిన, ఆ బ్రాహ్మణుండు.

గీ. చాల తడవయ్యె; నే నేగు సమయమయ్యె; రహిని ఒక్క ముహూర్తమాత్రంబు కంటె ఒక్క గడెయయు నుండ; నే నిక్కడ నిది, విడిచి చేనియెద నలసతఁ గడపుదేని.

క. అని పల్కు బ్రాహ్మణున కీ, క్షణమున వచ్చితి నటంచు చని, రావణుఁ డో
క్క నిమేషము క్రమ్మర త,ద్ఘనలింగము భూమిపైచి గడ చనె నతఁడున్.

క. అది భూమి బాతుకొనె న,య్యది గని రావణుఁడు పట్టి యట్టె పెనఁగినన్
కదలక తదూర్ధ్వభాగము, పొదలెన్ గోకర్ణము నన పోలిక సాటై.

వ. ఆ ప్రదేశము నేటికిని గోకర్ణక్షేత్రంబని ప్రజలు వాడుకొందు రా శివలింగ మాకృతి పైని గోకర్ణస్వరూపం బగుపడుచున్నది గదా? తదనంతరంబ చేయునదిలేక.

గీ. రావణుఁడు రామతోడ విరాజమానుఁ,డగుచు నిజరాజధాని జేరఁగ కడంగి తల్లి కైకసి పుత్రు నధఃకరించి, చెలగి పలువిధములుగ దూషింప నలిగి.

క. మరల తప మాచరింపఁగ, త్వరగా గోకర్ణమునకు వచ్చి, తపముచే
వరముల నందె, విరించిన్, పరమామోదాత్ముఁ జేసి ప్రాభవమెసఁగన్.

ఆ. మూఁడులోకములను మొనసి జయించి రా,వణుఁడు లంక నేలి వఱలుచుండె;
అందువలన అయ్యె మందోదరీసతి, సీతఁబోలు సొగసు చెందుఁ కాంత!

వ. మందోదరీ వృత్తాంతంబున విష్ణుని మాయానాటకంబు నెఱింగి, ఆతనిపై రావణుండు

మఱింత క్రుద్ధుండై ద్వేషాక్రాంతాంతరంగుండయ్యె. మందోదరి నిచ్చిన మయుని తన లంకయందె నిలిపె.

సీ. అట్టి మందోదరి అచట నిద్రింపఁగా, అంజనీసూనుఁ డా అతివఁ గాంచె;
లంకయందే మయుం డుంకువ యగుటచే, అతని తమ్ముఁడు గయుం డనెడివాఁడు
బ్రహ్మవరంబుల బలు పరాక్రమవంతుఁ, డై యుండె నచ్చట; అతఁడు కాన
వచ్చిన హనుమంతు డొచ్చెములేకయే, ఆతని వస్త్రంబు నద్భుతముగ

గీ. రావణుని శయ్యయందు, తద్రావణుని సు,వర్ణ వస్త్రంబు కైకొనివచ్చి ఆ వి
భీషణుని శయ్యయందును, వెలయ వైచె! వారిలో వారి కప్పుడే వైర మొదవ.

వ. ఇట్లు కపికులశ్రేష్ఠుఁడైన ప్రభంజన సుతుండు వినోద లీలాభాసురుండై.

గీ. నాఁటి సీత నెచ్చటను గానక అశోక,వనమునకు వచ్చి అచట దివ్యమయి యొప్పు
ఒక్క ప్రాసాదమును దాని ప్రక్క నొక్క, శింశుపావృక్షముఁ గాంచి చెలఁగి యతఁడు.

## హనుమంతుఁడు సీతను దర్శించుట

సీ. ఆ వృక్షమూలము నందునఁ రాక్షసీ,క్రాంతయై శ్రీరాము కాంత తోఁచె;
చక్కని కురులెల్ల ఒక్కటే జడకట్ట; కృశియించె దైన్య విక్లేశకలన;
మలిన వస్త్రము కట్టె మలిన భూభాగంబు, పైఁబడి రామ! రామా! అటంచు
అంగలార్చుచు నుండు నంగనామణి సీత, నాంజనేయుఁడు కాంచి అట్టె పొంగి,

గీ. ఇపుడు కద! నేను ధన్యుండ; ఇపుడు కద! మ,దీయ జనని యుదరము సుస్థితి వహించె
ననుచునె అశోక వృక్షశాఖాగ్రముననను, దాఁగి కూర్చుండి చూచె త ద్ధరణిజాతఁ.

గీ. మునుపు సీతా స్వరూప మెప్పుడును చూచి, యుండనట్టి మారుతి పడి యుండి యేని
మూఁడులోకంబులందున ఈడులేని, కాంతి శోభిలు సీత విగ్రహము కాంచి.

గీ. ఒడలు తెలియక కిలకిల నొప్పు శబ్ద,జాలమును చేసి గంతులు చాల వైచు
నంతలో రావణుఁడు కడు వింతతోఁప, స్వప్నముఁ గాంచి తర్కించి స్వగతముగను.

గీ. కపియొకఁడు వచ్చి నా యశోకవనమందు, సీతఁ గాంచిన యట్టు వచ్చె కల బళిరె!
త్వరగ చావు శ్రీరాము చేతఁ గలుగఁగ, సీతను బలాత్కరించెద చెలఁగి యిపుడె.
కపి చూచి రాముని కడ చెప్పఁగాత! నే, నవమానపఱిచెద నవనిజాత;
నా చేష్టలన్నియు చూచి యా కపి చెప్ప, విని రాముఁ డదయుఁడై వెడలుఁగాత!
అని నిశ్చయించి స్త్రీ జన పరివృతుఁ డయి, కోలాహలంబున కొమరు మివిలి
సీతమ్మ యున్న యా చెంతకు చనుదేర, నూపుర ధ్వని విని నొచ్చి సీత

గీ. విహ్వలత నందె; అసురుండు విఱ్ఱవీఁగి, ఎదురుగా వచ్చి నిలిచి, చెందెద వదేల
సీత! ననుఁచూచి యా రీతి చెనటి సిగ్గు? ఏది? యిటు చూడు! విడు రాము మీఁది ఆస.

మ. సుకమన్నన్ మృగతృష్ణమై, అడవులన్ శూన్యాత్ముఁడై యొంటిమై
నకటా! యొక్కఁట దిక్కుమాలి నిజరాజ్య భ్రష్టుఁడై సంచరిం
చు కురూపుం డగు రాముపై హృదయమున్ జొప్పించి, యేలా? చెడన్
సకలైశ్వర్యసుఖంబులం గనుమ! నా సాన్నిధ్యముం బొందుమా!

సీ. పితృవిహీనుండు విపినవాసియును జోగి, వేసంపుమానిసి కోస మీవు
కట కటా! వృథ సేయఁగా నౌనె? నీ వయ, స్సబల! నా తోడ నవ్యాజరీతి
రాజభోగంబుల రమణీయముగ బొందు,మీ! మూర్ఖతను విడుమీ! మెలంత!
శక్తిహీనుండు త జ్జనమాత్రు తోడ నీ, కేమి సుఖంబు ల వెట్లు గల్గు?

గీ. భాగ్యయుక్తుండ నేను, అప్సరస లెల్ల, నన్ను సేవించువారలు; నిన్ను సతము
పూజసేయింతు మండోదరీజనములు, మొదలుగా దాస్యములు చేయ మోహనాంగి!

ఉ. నేను త్రిలోకపాలకుఁడ! నీ విభుఁడో? చెలి! రాజ్యదూరుఁ; డిం
కేను వశంవదుం డగుదు నెప్పుడు, నిష్ఠురవృత్తి యాతఁ; డిం
కేను సమస్త సైన్యముల నేలుదు, నాతఁడో? యొంటివాఁ; డహో!
నేను సుఖంబు కూరుపఁగ నేర్తునో! ఆతఁడో! ఊహ సేయుమా!

క. నా రాజ్యము నా ప్రాణము, నారీ! నీ పరము సేతు న న్నేలిన నీ
వా రామునిపై ఆశన్, దూరము సేయుమ; విచార దూరవు కమ్మా!

శా. నీతో నెప్పుడు నిష్ఠురోక్తుఁడగుచున్ నిర్భాగ్యుఁడై జోగియై
ఆతం డేమి సుఖంబు కూర్చు? వనితా! ఆ మందభాగ్యున్ వృథా
చేతంబందు తలంతు; భాగ్యయుతు నీ చిత్త ప్రకారస్థితిన్
సీతా! వర్తిలు నన్ను దూఱెదవు! ఛీ ఛీ! యింగితం బిట్టిదే?

క. అని నానావిధములుగా, దనుజుఁడు పలుకంగ సీత తన కడ్డముగా
తృణమొకటి వైచి రక్కసు, నను నిష్ఠురవృత్తి మీఱి అతి క్రుద్ధతమై.

రావణుఁడు సీతచే తిరస్కృతుఁడగుట

శా. ఘోరా! రాము నలంతిగా తలఁచు నీ వానాఁడు మావారు తా
మేరన్ లేని తరిన్ దురాత్మత వనిన్ హీనుండ! భిక్షుండవై
క్రూరా! యజ్ఞహవిస్సు కుక్క కరణిన్ గొందే? దురంబందు నీ
శ్శీరం బొప్ప జయించి తేవయితివే? భీతాత్మ! మాటాడదే?

ఉ. రాము త్రిలోక విక్రము పరాక్రమ మిప్పు డెఱుంగ నేర్తువే?
రాముని బాణఘాతముల వ్రయ్యలువారి శరీరమెల్ల దు
ర్దామ పరాక్రమాగ్ని బహుధా దహనం బొనరించు నాఁడు కా
కా మహనీయ మానుష మహత్త్వము నీ విపు డెల్లెఱుంగుదో?

గీ. అనుచును తృణీకరింప రావణుఁడు మిగుల, క్రోధ ఘూర్ణితుఁ డగుచు పల్కె నతిదుష్ట
దుర్ణయపుఁ బల్కులను కను తుచ్ఛములను, మిగుల కర్ణకఠోరంబులుగ నుడియఁగ.

గీ. లంకలో త్రిదశవదనగ్లానియగుత, నిలుచునా? లక్ష్మణాగ్రజుఁ డెదిరి యగుచు
ఉచ్ఛమౌ విపదావళి నొందు జటిలుఁ, డాతఁ డపజయమందు; నా చేత మలరు!

గీ. అనుచు పల్కె రావణు విని, అవనిజాత, తుచ్ఛుఁడా! పల్కులేల? నీతోడ నాకు
లుప్త మొనరింప నీదు పల్కులను మొదటి, నాలుగవ యక్షరము లదే! నా మతంబు.

మ. అనుచుఀ పల్కెడు సీత వాక్శరవిఘాతాహ్లాదుఁడై రావణుం
డను క్రుద్ధుండయి కత్తినెత్తి, యిదె నేడంతంబు కావింతు వే
గ నినుఀ నన్నికఁ గొల్వవేని, యని యేగఀ మీఁది; కా రక్కసుఀ
వనితారత్నము వాని నాపి యను దేవా! యిట్లుగా కూడునే?

వ. నాథా! చక్కగ యోచింపుము.

గీ. ఈ కృశాంగి తోడుతఁ గల్గు నేమి? సుఖము, నాకు మించిన చక్కని నాక కన్య
లెందఱో యుండ, నిట్టు లీ యింతినేల, బాధవెట్టుదు వని యూది పల్కె నపుడు.

ఆ. కొంత ఉపశమించి, అంత ఆ రావణుఁ, డతి కురూప రాక్షసాంగనలను
ఎట్లు నాకు సీత యిష్టురా లగునకో, అట్లు గా నొనర్పుఁ డహరహంబు.

క. ప్రియ నయ భయవాక్కులచే, ప్రయత్నము సలుపుఁడు సీత వశవర్తినియై
దయ నఀ ప్రోచు విధమ్మున; నియమించిన పనిని చేయనేరక యున్నఀ.

గీ. మిమ్ము శిక్షింతు! నిక్కంబు! మీర లిందు,ముఖ! అవనిజాత! మతిఁగాంచి ముచ్చటించి
యెట్లు చేసిన ఆపె యిక్కట్లు పాసి, నన్ను తరియింపఁ జేయు, ఆ తెన్ను కనుఁడు.

గీ. ఆమెకు కుతూహలంబు నా యందు కల్గు,నట్లు నయభయముల మీర లడరవలయు
రెండు నెల లింక గడవిత్తుఁ జుండు; అట్టి, గడవులో వినకున్న నప్పుడ కఠినతఁ.

గీ. ముక్క ముక్కలుగా కొట్టి నిక్కవముగ, ప్రాత రన్నమునకు తోడు వంటకముగ
వండి తెం, డిదె నా యాజ్ఞ సుం డటంచు, చెప్పి వెడలంగ నిట్లనె సీత అలిగి.

వ. ఓరి దురాత్మా! నన్ను వండించి ప్రాతరాన్నంబున తింపువే?

సీ. మునుపు నే బాలనై చేనుచు పేటికనుండి, యిచటఁ పల్కిన పల్కు లెట్లు? మఱచి
పోయితి వక్కటా! పాలియింప నిన్ను స,పుత్ర మిత్రముగ నేఁ బోయివత్తు
నని వచింపగ లేదె? ఆ మాటలే నిజ,మయ్యెడు కొఱకు నే నిచ్చోట కిటు
వచ్చితిరా! రాముఁ డొచ్చెములేక నిఀ, నీ వారితో చంపు; నిశ్చయ మిది;

గీ. నే నయోధ్య కేగుదు; దైవమే నిజంబు; ఏల విభ్రాంతి నీకు? నీ యింటి కరిగి
బాగుగా తిని కొన్నాళ్ళు బ్రతుకు; సరిగ, బ్రతుకు తలఁపున్న రాము శరణము పొందు.

క. అని చెప్పిన సీతా వా,ఙ్మునశరములు నాటి మేను కంపింపఁగ సి
గ్గును చెంది సంధిబంధము,లును విడిపోవంగ నగరిలోనికి చేనియెఁ.

## సీతా విలాపము — త్రిజటా సాంత్వనము

ఆ. అంత క్రూరవృత్తులయిన ఆ రాక్షస, వనితలెల్ల రావణుని యనుజ్ఞ
ననుసరించి వేఁగి అతిఘోరముగ దుష్ట,భాషణముల సీత భయము కొల్పి.

ఉ. భీకర ఖడ్గహస్తములఁ భీకర చేష్టలఁ వెల్లు చూపి, ఆ
రాకసి ముండలెల్ల రఘురాముని కామిని జానకిఁ భయో
ద్రేక నొనర్పసాగిరి, ధరిత్రి సుతఁ కడు బుజ్జగించి, ది
వ్యాకృతితో విభీషణుని యాత్మజయా త్రిజటాఖ్య యిట్లనుఁ.

సీ. దుఃఖించు సీతను ధూర్తలై యింకేల, వెఱపింపఁ జూతురే! వెఱపు లేక?
సర్వలక్షణమూర్తి! స్వప్నగతుండయి, (శ్రీ)రాముఁ డరుదెంచె చేడెలార!
లంకను కాల్చె; చెలంగి రావణుఁచంపె; సీతను విడిపించె చెఱను పాపి;
ఒడలెల్ల రావణుం డొగి నూనె కాఱఁగా, ఒక పేడగుంటలో ఒదిగి యుండె;

గీ. కనుక ఈమెకై సాహసమును విడువుఁడు; సంతసము కల్గఁజేత; మీ యింతి కరుణ
కల్గె నేని రాముని కృప కాంచకల్గు; లేక యీమె వైరము మృత్యుభీకరమ్ము!

క. అను త్రిజటావాక్యమ్ములు, విని వారందఱును మిగుల వెఱచి, సుముఖులై
కనికరముచేత సీతా, వనితను బాధింపమాని, వర్తిలుచున్నఁ.

చ. అది విని సీత కొంత ముద మారసియుఁ, తనకైన కష్టముఁ
సదయుని లక్ష్మణుఁ వనిని జాల్మత నెన్నొ విధంబులఁ కడుఁ
హృదయ విదారితమ్ములుగ నేహ్యముగా వచియించినట్టి య
ప్పదముల దుష్ఫలం బని విపత్పరికంపితయై రురోదయై.

వ. ఇట్లంగలార్పం దొడంగె.

మ. అకటా! లక్ష్మణ! నిన్ను నే నపుడు అన్యాయంబుగా ఎంత దు
ర్వికటక్లేశనిధాన వాక్యముల నిర్విణ్ణాత్ముఁగాఁ జేసితిఁ
సకలమ్ముఁ కనుచుంటి తత్ఫలము! నిశ్శంకంబుగా నేడు; పా
యక నా ప్రాణము డుల్చి దాని కిటు ప్రాయశ్చిత్తముం జెందెదఁ.

వ. అని తన వేణీబంధంబును మెడకు పెనవైచి.

క. వనరెడి మరణ వినిశ్చయఁ, గని మారుతి తడయఁ దగదు; క్షణము తడసినఁ
పనిచెడు నని (శ్రీ) రామా,యణ కథ క్లుప్తముగఁ పల్క నారంభించెఁ,

గీ. అనుచును తృణీకరింప రావణుఁడు మిపుల, క్రోధ ఘూర్ణితుఁ డగుచు పల్కె నతిదుష్ట
దుర్ణయపుఁ బల్కులను కడు తుచ్ఛములను, మిగుల కర్ణకఠోరంబులుగ సుడియఁగ.

గీ. లంకలో త్రిదశవదనగ్లానియగుత, నిలుచునా? లక్ష్మణాగ్రజుఁ డెదిరి యగుచు
ఉచ్చమా విపదావళి నొందు జటిలుఁ, డాతఁ డపజయమందు; నా చేత మలరు!

గీ. అనుచు పల్కు రావణు విని, అవనిజాత, తుచ్ఛుఁడా! పల్కులేల? సీతోడ నాకు
లుప్త మొనరింప నీదు పల్కులను మొదటి, నాలుగవ యక్షరము లదే! నా మతంబు.

మ. అనుచున్ పల్కెడు సీత వాక్యరవిఘాతాహ్లాదుఁడై రావణుం
డను కృద్ధుండయి కత్తినెత్తి, యిదె నేడంతంబు కావింతు వే
గ నినున్ నన్నికఁ గొల్వవేని, యని యేగన్ మీఁది; కా రక్కసున్
వనితారత్నము వాని నాపి యను దేవా! యిట్లుగా కూడునే?

వ. నాథా! చక్కగ యోచింపుము.

గీ. ఈ కృశాంగి తోడుతఁ గల్గు నేమి? సుఖము, నాకు మించిన చక్కని నాక కన్య
లెందఱో యుండ, నిట్టు లీ యింతినేల, బాధపెట్టుదు వని యూది పల్కె నపుడు.

ఆ. కొంత ఉపశమించి, అంత ఆ రావణుఁ, డతి కురూప రాక్షసాంగనలను
ఎట్లు నాకు సీత యిష్టురా లగునకో, అట్లు గా నొనర్పుఁ డహరహంబు.

క. ప్రియ నయ భయవాక్కులచే, ప్రయత్నము సలుపుఁడు సీత వశవర్తినియై
దయ నన్ బ్రోచు విధమ్మున; నియమించిన పనిని చేయనేరక యున్నన్.

గీ. మిమ్ము శిక్షింతు! నిక్కంబు! మీార లిందు,ముఖి! అవనిజాత! మతిఁగాంచి ముచ్చటించి
యెట్లు చేసిన ఆపె యిక్కట్లు పాసి, నన్ను తరియింపఁజేయు, ఆ తెన్ను కనుఁడు.

గీ. ఆమెకు కుతూహలంబు నా యందు కల్గు,నట్లు నయభయముల మీార లడరవలయు
రెండు నెల లింక గడవిత్తుఁ జుండు; అట్టి, గడవులో వినకున్న నప్పుడ కఠినతఁ.

గీ. ముక్క ముక్కలుగా కొట్టి నిక్కువముగ, ప్రాత రన్నమునకు తోడు వంటకముగ
వండి తెం, డిదె నా యాజ్ఞ సుం డటంచు, చెప్పి వెడలంగ ఇట్లనె సీత అలిగి.

వ. ఓరి దురాత్మా! నన్ను వండించి ప్రాతరాన్నంబున తింపువే?

సీ. మునుపు నే బాలనై చేనుచు పేటికనుండి, యిచటఁ బల్కిన పల్కు లెట్లు? మఱచి
పోయితి వక్కటా! పొలియింప నిన్ను స,పుత్ర మిత్రముగ నేఁ పోయివత్తు
నని వచింపగ లేదె? ఆ మాటలే నిజ,మయ్యెడు కొఱకు నే నియ్యెడ కిటు
వచ్చితిరా! రాముఁ డొచ్చెములేక నిన్, నీ వారితో చంపు; నిశ్చయ మిది;

గీ. నే నయోధ్య కేగుదు; దైవమే నిజంబు; ఏల విభ్రాంతి నీకు? నీ యింటి కరిగి
బాగుగా తిని కొన్నాళ్ళు బ్రతుకు; సరిగ, బ్రతుకు తలఁపున్న రాము శరణము పొందు.

క. అని చెప్పిన సీతా వాక్యనిశరములు నాటి మేను కంపింపంగ సి
గ్గును చెంది సంధిబంధములును విడిపోనంగ నగరిలోనికి చేనియెన్.

## సీతా విలాపము — త్రిజటా సాంత్వనము

ఆ. అంత క్రూరవృత్తులయిన ఆ రాక్షస, వనిత లెల్ల రావణుని యనుజ్ఞ
ననుసరించి వేగి అతిఘోరపరుషగ మష్ట, భాషణముల సీత భయము కొల్పి.

ఉ. భీకర ఖడ్గహస్తములఁ భీకర చేష్టలఁ పెల్లు చూపి, ఆ
రాకసి ముండలెల్ల రఘురాముని కామిని జానకిన్ భయో
ద్రేక నొనర్పసాగిరి, త్రిరత్రి సుశీల నదు బుజ్జగించి, ది
వ్యాకృతితో విభీషణుని యాత్మజయౌ త్రిజటాఖ్య యిట్లనున్.

సీ. దుఃఖించు సీతను ధూర్తులై యేఁకేల, వెలిపింపఁ జూతురే! వెలుపు లేక!
సర్వలక్షణమూర్తి! స్వప్నగతముగనయి, శ్రీరాముఁ డరుదెంచె చేడెలార!
లంకను కాల్చెఁ; జెలఁగి రావణుఁ చంపె; సీతను విడిపించె చెలఁను పావి;
ఒడలెల్ల రావణుం డొగి నూనె పూయఁగా, ఒక పేడగుంటలో ఒదిగి యుండె;

గీ. కనుక ఈమెకై సాహసమును వినుపృఁడు; సంతసము కల్గఁజేత; మీ యింతి కరుణ
కల్గె నేని రాముని కృప నందచెల్లు; లేక యీమె వైరము మృత్యుభీకరమ్ము!

క. అను త్రిజటావాక్యమ్ములు, విని వారందఱును మిగుల వెఱచి, సుముఖులై
కనికరము నేఁడు సీతా, ననినెను బాధింపము ని, వర్తిలుచున్నన్.

చ. అది విని సీత క్షోంగి మొదట మూరసియున్, తనకైన కష్టమున్
సదయుని లక్ష్మణున్ వనిని జాల్నాఁ నెన్నో విధంబులన్ కడున్
హృదయ విదారితమ్ములుగ నేహ్యముగా వచియించినట్టి యు
స్పదముల దుష్ఫలం బని విపత్పరికంపితమై దురోదమై.

వ. ఇట్లంగలార్పం దొడంగె.

మ. అకటా! లక్ష్మణ! నిన్ను నేనపుడు అన్యాయంబుగా ఎంత దు
ర్వికటక్లేశనిధాన వాక్యముల నిర్విణ్ణాత్ముఁగాఁ జేసితిన్
సకలమ్ముల్ కనుచుంటి తత్ఫలము! నిశ్శంకంబుగా నేఁడు; పా
యక నా ప్రాణము ద్రుంచి దాని కిటు ప్రాయశ్చిత్తముం జెందెదన్.

వ. అని తన కేశబంధంబును మెడకు పెనవైచి.

క. వనజాడి మరణ వినిశ్చయుఁ, గని మారుతి తడయఁ దగదు; క్షణము తడసినన్
పనిచెడు నని శ్రీరామాయణ కథ క్లుప్తముగఁ పల్క నారంభించెన్.

గీ. అనుచును తృణీకరింప రావణుఁడు మిపుల, క్రోధ ఘూర్ణితుఁడగుచు పల్కె నతిదుష్ట
దుర్ణయపుఁ బల్కులను కడు తుచ్ఛములను, మిగుల కర్ణకఠోరంబులుగ సుడియఁగ.

గీ. లంకలో త్రిదశవదనగ్లానియగుత, నిలుచునా? లక్ష్మణాగ్రజుఁ డెదిరి యగుచు
ఉచ్ఛమౌ విపదావళి నొందు జటిలుఁ, డాతఁ డపజయమందు; నా చేత మలరు!

గీ. అనుచు పల్కె రావణు విని, అవనిజాత, తుచ్ఛుఁడా! పల్కులేల? నీతోడ నాకు
లుప్తమొనరింప నీదు పల్కులను మొదటి, నాలుగవ యక్షరము లవే! నా మతంబు.

మ. అనుచున్ పల్కెడు సీత వాక్శరవిఘాతాహ్లాదుఁడై రావణుం
డను క్రుద్ధుండయి కత్తినెత్తి, యిదె నేడంతంబు కావింతు వే
గ నిను న్నన్నికఁ గొల్వవేని, యని యేగన్ మీఁది; కా రక్కసున్
వనితారత్నము వాని నాపి యను దేవా! యిట్లుగా కూడునే?

వ. నాథా! చక్కగ యోచింపుము.

గీ. ఈ కృశాంగి తోడుతఁ కల్గు నేమి? సుఖము, నాకు మించిన చక్కని నాక కన్య
లెందఱో యుండ, నిట్టు లీ యింతినేల, బాధపెట్టుదు వని యూఁది పల్కె నపుడు.

ఆ. కొంత ఉపశమించి, అంత ఆ రావణుఁ, డతి కురూప రాక్షసాంగనలను
ఎట్లు నాకు సీత యిష్టురా లగునకో, అట్లు గా నొనర్పుఁ డహరహంబు.

క. ప్రియ నయ భయవాక్కులచే, ప్రయత్నము సలుపుఁడు సీత వశవర్తినియై
దయ నన్ బ్రోచు విధమ్మున; నియమించిన పనిని చేయనేరక యున్నన్.

గీ. మిమ్ము శిక్షింతు! నిక్కంబు! మీర లిందు,ముఖి! అవనిజాత! మతిఁగాంచి ముచ్చటించి
యెట్లు చేసిన ఆపె యిక్కట్లు పాసి, నన్ను తరియింపఁజేయు, ఆ తెన్ను కనుఁడు.

గీ. ఆమెకు కుతూహలంబు నా యందు కల్గు,నట్లు నయభయముల మీర లడరవలయు
రెండు నెల లింక గడ విత్తుఁ జుండు; అట్టి, గడవులో వినకున్న నప్పుడ కఠినతఁ.

గీ. ముక్క ముక్కలుగా కొట్టి నిక్కవముగ, ప్రాత రన్నమునకు తోడు వంటకముగ
వండి తెం, డిదె నా యాజ్ఞ సుండటంచు, చెప్పి వెడలంగ ఇట్లనె సీత అలిగి.

వ. ఓరి దురాత్మా! నన్ను వండించి ప్రాతరాన్నంబున తిందువే?

సీ. మునుపు నే బాలనై చేనుచు పేటికనుండి, యిచటఁ పల్కిన పల్కు లెట్లు? మఱచి
పోయితి వక్కటా! పాలియింప నిన్ను స,పుత్ర మిత్రముగ నేఁ బోయివత్తు
నని వచింపగ లేదె? ఆ మాటలే నిజ,మయ్యెడు కొఱకు నే నియ్యెడ కిటు
వచ్చితిరా! రాముఁ డొచ్చెము లేక నిన్, నీ వారితో చంపు; నిశ్చయ మిది;

గీ. నే నయోధ్య కేగుదు; దైవమే నిజంబు; ఏల విభ్రాంతి నీకు? నీ యింటి కరిగి
బాగుగా తిని కొన్నాళ్ళు బ్రతుకు; సరిగ, బ్రతుకు తలఁపున్న రాము శరణము పొందు.

క. అని చెప్పిన సీతా వాక్యఘనశరములు నాటి మేను కంపింపఁగ సి
గ్గును చెంది సంధిబంధములును విడిపోనంగ నగరిలోనికి చేనిరొగ.

## సీతా విలాపము — త్రిజటా సాంత్వనము

ఆ. అంత క్రూరవృత్తులయిన ఆ రాక్షస, వనిత లెల్ల రావణుని యనుజ్ఞ
ననుసరించి వేగి అతిఘోరముగ దుష్టభాషణముల సీత భయము కొల్పి.

ఉ. భీకర ఖడ్గహస్తములఁ భీకర చేష్టలఁ పెల్లు చూపి, ఆ
రాకసి ముండలెల్ల రఘురాముని కామిని జానకిఁ భయో
ద్రేక నొనర్పసాగిరి, ధరిత్రి సుతఁ కడు బుజ్జగించి, ది
వ్యాకృతితో విభీషణుని యాత్మజయా త్రిజటాఖ్య యిట్లనున్.

సీ. దుఃఖించు సీతను ధూర్తులై యుండకేల, వెఱపింపఁ జూతురే! వెఱపు లేక ?
సర్వలక్షణమూర్తి! స్వప్నగతుండయి, శ్రీరాముఁ డరుదెంచె చేడెలార!
లంకను కాల్చెఁ; చెలంగి రావణుఁ చంపె; సీతను విడిపించె చెఱను పాపి;
ఒడలెల్ల రావణుం డొగి నూనె కాలఁగా, ఒక పేడగుంటలో ఒదిగి యుండె;

గీ. కనుక ఈమెకై సాహసమును విడుపుఁడు; సంతసము కల్గఁజేయ; మీ యింతి కరుణ
కల్గె నేని రాముని కృప గాంచకల్గు; లేక యీమె వైరము మృత్యుభీకరమ్ము!

క. అను త్రిజటావాక్యమ్ములు, విని వారందఱును మిగుల వెఱచి, సుముఖులై
కనికరముచేసి సీతా, వనితను బాధింపమని, వర్తిలుచున్నన్.

చ. అది విని సీత క్షోంత మంద మారసియున్, తనకైన కష్టమున్
సదయుని లక్ష్మణున్ వనిని జాల్మొన నెన్నొ విధంబులన్ కఠున
హృదయు పిచారితమ్ములుగ నేహ్యముగా వచియించినట్టి య
స్పదముల దుష్ఫలం బని విపత్పరికంపితయై రురోదయై.

వ. ఇట్లంగలార్పం దొడంగె.

మ. అకటా! లక్ష్మణ! నిన్ను నే నవుడు అన్యాయంబుగా ఎంత దు
ర్వికటక్లేశనిధాన వాక్యముల నిర్విణ్ణాత్ముఁగాఁ జేసితిన్
సకలమ్మున్ కనుచుంటి తత్ఫలము! నిశ్శంకంబుగా నేఁడు; పా
యక నా ప్రాణము ద్రుచ్చి దాని కిటు ప్రాయశ్చిత్తముం జెందెదన్.

వ. అని తన కేశబంధంబును మెడకు పెనవైచి.

క. వనజాడి మరణ వినిశ్చయుఁ, గని మారుతి తడయఁ దగదు; క్షణము తడసినన్
పనిచెడు నని శ్రీ రామాయణ కథ క్లుప్తముగఁ పల్క నారంభించెన్,

గీ. తిన్నగా రామవృత్తము విన్నవించి, అడవిఁ జేరిన దాదిగా, నాంజనేయుఁ
కాంచువఱకు వచించిన, మించు కూర్మి, సాదరమున సీతమ్మ! ఆశ్చర్యపడుచు.

శా. ఏ నేమీ! కల గాంచుచుంటిన? నిజంబే నాకు విన్పించెనా?
యీ నా స్వీయకథావిధానము వచించేవార లీ లంకలో
నే నెన్నంకుఁ గలారటం చెఱుఁగ; వాఙ్నిర్మాణ కౌశల్యతన్
ఆ నిక్కంపు కథ న్వచించు మహనీయ స్వాంతు లెవ్వారలో?

ఉ. వారలు నన్ననుగ్రహ ప్రభావమునన్ కరుణింప వచ్చినన్
ఊరక దాపరం బిక నయో! అది యెందుల? కిప్పుడే నమ
స్కారముసేతు; సాంగముగ చయ్యన నాకు ప్రసన్నమూర్తులై
ధీరత నన్ను బ్రోచునెడ, దీనదయాపరులన్ నుతించెదన్.

సీతకు హనుమంతుఁడు రామముద్రిక నర్పించుట

మ. అని సంప్రార్థన సేయఁగా, నెదుట ప్రత్యక్షంబుగాఁ దోచె, బొ
ట్టన వ్రేలంతటి చిట్టి క్రోఁతి, ముదమోదన్ రామవృత్తాంత మె
ల్లను నా మూల సవిస్తరంబుగను తెల్పన్, మ్రొక్కె నా సీత; యం
తనె య మ్మారుతి రామముద్రికను మాతా! యంచు నందించినన్.

చ. అది కొని కండ్ల నద్దుకొని అమ్మహిజాత! అనేక భంగులన్
అదిమిన పొంగివచ్చు మహదంబుధిఁ బోలెడు దుఃఖ మాపుచున్
ముదమున పల్కె; నిచ్చట సమూలముగా కనుఁగొన్న నాదు గా
థ దయవహించి రామునికి తప్పక చెప్పెదు[illegible] యశోనిధీ!

ఆ. అనిన ఆంజనేయుఁ డామె సమాధానఁ, చేయువాఁడ యగుచు చెప్పసాగె!
రామచంద్రుఁ వేగ నా మూపుపైఁ గొని, వత్తు నిముషమాత్ర వగవకమ్మ!

క. రణమున త్రుటిమాత్రన రావణు రాముఁడు చెంపి నిన్ను మాతా! సీతా!
కొని యేగు నయోధ్యకు నీ, వణుమాత్రము సంశయింప నక్కఱ కలదే?

క. సీతమ్మా! నా మాటల, చేతమ్మున నమ్ముమమ్మ! చింత న్విడుమా!
ఆ తమ్మునితో రాముఁడు, ఖ్యాతమ్ముగ వచ్చి యసురు ఖండించు త్రుటిన్.

సీ. అని మఱియును భూమి తనయ తన్ నమ్మగా, శ్రీరామచంద్రుఁడు చెప్పినట్టి
చిత్రకూటమున విచిత్ర తిలకముల, నిడినది మొదలుగాఁ గను నిగూఢ
మైన సంగతులతో నానంద నిర్మగ్న, సీతఁ గావించి తచ్చేత మధిక
సుప్రసన్నం బయి శోభిలుచున్నంత, అమ్మా! అభిజ్ఞాన మిమ్ము! వేగ

గీ. మన్న, తన తండ్రి యిచ్చిన యట్టి విమల, భవ్యచూడామణి నొసంగి, పతికి తొల్లి
కాకవృత్తము వచియింపగా కపీంద్రు, తోడ వచియించి నంత, నపో్ప్రిష క్రోంతి.

గీ. సీతకు నమస్కరించి తచ్చేత మలర, స్వామికార్యము నెరవేర్చినాము! కాని
నా ప్రతాప మించుకయేని చూపుట యది, కాద? ప్రస్తుతమని యెంచి క్రన్ననంగ.

గీ. తల్లి! మిక్కిలి బడలితి! నల్ల నొకటి, రెండు పండ్లను తిని క్షుధ నుండిపాతు
నింతమాత్ర మిమ్మాజ్ఞ! కాసంతయేని, అనుచు సంప్రార్థనము సేయ నవనిజాత.

క. తన సేవకాగ్రణికి వెస, తన కంకణ మొకటియిచ్చి తనివి దలిర్పన్
కొని తిను మెన్ని ఫలమ్ములు, తినవలతో? అంగసుల నతి ప్రముదమునన్.

గీ. కావలసినన్ని ఫలముల కపివరేణ్యా!, విలచి భుజియింపు మయ్యా! క్రూరులు గదయ్యా!
అసురు లీ వనముల పండ్ల నంటకయ్యా! నాదు వార్తలు చేర్పుమా! నాథు కడకు.

మ. అనినన్ వెండి, కపీంద్రుఁ డిట్లనియె, నమ్మా! నేను నా జన్మలో
తినగాలేదు సరాయిచేతి ఫలమున్, దివ్యాజ్ఞ మీరైన నీ
వనమం దొక్కటొ? రెండొ? పండ్లు తినెదన్; వల్లన్నచో నేగెదన్
కనెదన్ తృప్తి సముద్ర సువలసె వీకన్ నాదు మిత్రాళితోన్.

ద్వి. అని పోవ నుద్యుక్తుఁడగు కపి వీరు, కని ఓయి నాయనా! కపికుల వీర!
ఈ వనంబున కెల్ల నెవ డధికారి? రావణుం డని తెల్యరాదె? నీ కఱయ!
ఏ నెట్లు నీ కాజ్ఞ యిత్తురా! తండ్రి? ఘూని నీసేనియు పోరి నిల్తువెట్లు?
అని మందలింపగా నంజనీ సుతుఁడు, విని సీతతోడ తా విన్నవించు నిటు.

క. అత్యంత దుర్లభంబై [illegible]త్యంతము మధురమైన యట్టి ఫలము ల
న్నత్యంత శ్రద్ధ దినె[illegible]ం, రత్యయు లెదుటైనవారి నట్టి హరింతున్.

క. పెల్లుగ సంశయపడెదవు, సల్లలితము రామనామ సన్మంత్రము నా
హృల్లలితంబై యుండగ, తల్లి! నా కిల నశక్యతయు కలుఁగునొకో?

క. శ్రీరామ పరమ మంత్రము, ధారాళముగాగ నా హృదయమున నుండన్
ఈ రాక్షసాధములు నా, కారయ తృణరూపు లెరుఁగు మమ్మా! హృదిలోన్.

క. అను కపి ధైర్యపు పలుకుల, విని జానకి వాయుజా! ప్రవీణుఁడవైనన్
అనవసరంబుగ కల్పన, మును చేయకుమయ్య! కయ్యమునకై నీవే.

ఉ. రాలిన పండు లియ్యవె! కరంబు భుజింపుము తృప్తితీరఁగా
గోల నొనర్పకయ్య! యని కొద్దిగ నాజ్ఞ యొసంగినంతనే
వాలముచేత వృక్షముల వానరవీరుఁ డదల్ప సర్వమున్
రాలె ఫలంబు, లవ్వనిన రాజిలు వృక్షము లెల్ల విన్నవోన్.

గీ. తిన్నగా రామవృత్తము విన్నవించి, అడవిఁజేరిన దాదిగా, నాంజనేయుఁ
గాంచువఱకు వచించిన, మించు కూర్మి, సాదరమున సీతమ్మ! ఆశ్చర్యపడుచు.

శా. ఏ నేమీ! కల గాంచుచుంటిన? నిజంబే నాకు విన్పించెనా?
యీ నా స్వీయకథావిధానము వచించేవార లీ లంకలో
నే నెన్నండుఁ గలారటం చెఱుఁగ; వాఙ్నిర్మాణ కౌశల్యతన్
ఆ నిక్కంపు కథ న్వచించు మహనీయ స్వాంతు లెవ్వారలో?

ఉ. వారలు నన్ననుగ్రహ ప్రభావమునన్ కరుణింప వచ్చినన్
ఊరక దాపరం బిక నయో! అది యెందుల? కిప్పుడే నమ
స్కారము సేతు; సాంగముగ చయ్యన నాకు ప్రసన్నమూర్తులై
ధీరత నన్ను బ్రోచునెడ, దీనదయాపరులన్ నుతించెదన్.

సీతకు హనుమంతుఁడు రామముద్రిక నర్పించుట

మ. అని సంప్రార్థన సేయఁగా, నెదుట ప్రత్యక్షంబుగాఁ దోచె, బొ
ట్టన వ్రేలంతటి చిట్టి క్రోఁతి, ముదమొందన్ రామవృత్తాంత మె
ల్లను నా మూల సవిస్తరంబుగను తెల్పన్, మ్రొక్కె నా సీత; యం
తనె య మ్మారుతి రామముద్రికను మాతా! యంచు నందించినన్.

చ. అది కొని కండ్ల నద్దుకొని అమ్మహిజాత! అనేక భంగులన్
అదిమిన పొంగివచ్చు మహదంబుధిఁ బోలెడు దుఃఖ మాపుచున్
ముదమున పల్కె; నిచ్చట సమూలముగా కనుఁగొన్న నాదు గా
థ దయవహించి రామునికి తప్పక చెప్పెదు[illegible] యశోనిధీ!

ఆ. అనిన ఆంజనేయుఁ డామె సమాధానఁ, జేయువాఁడ యగుచు చెప్పసాగె!
రామచంద్రుఁ వేగ నా మూపుపైఁ గొని, వత్తు నిముషమాత్ర వగవకమ్మ!

క. రణమున తృటిమాత్రన రా,వణు రాముఁడు చంపి నిన్ను మాతా! సీతా!
కొని యేగు నయోధ్యకు నీ, వణుమాత్రము సంశయింప నక్కఱ కలదే?

క. సీతమ్మా! నా మాటల, చేతమ్మున నమ్ముమమ్మ! చింత న్విడుమా!
ఆ తమ్మునితో రాముఁడు, ఖ్యాతమ్ముగ వచ్చి యసురు ఖండించు తృటిన్.

సీ. అని మఱియును భూమి తనయ తన్ నమ్మగా, శ్రీరామచంద్రుఁడు చెప్పినట్టి
చిత్రకూటమున విచిత్ర తిలకముల, నిడినది మొదలుగాఁ గను నిగూఢ
మైన సంగతులతో నానంద నిర్మగ్న, సీతఁ గావించి తచ్చేత మధిక
సుప్రసన్నం బయి శోభిలుచున్నంత, అమ్మా! అభిజ్ఞాన మిమ్ము! వేగ

౧. మన్న, తన తండ్రి యిచ్చిన యట్టి విమల, భవ్యచూడామణి నొసంగి, పతికి తొల్లి
కాకవృత్తము వచియింపగా కపీంద్రు,తోడ వచియించి నంత, నప్పొ్రిడ క్రోటి.

౧. సీతకు నమస్కరించి తచ్చేత మలర, స్వామికార్యము నెరవేర్చినాము! కాని
నా ప్రతాప మించుకయేని చూపుట యది, కాద? ప్రస్తుతమని యెంచి క్రన్ననంగ.

౧. తల్లి! మిక్కిలి బడలితి! నల్ల నొకటి, రెండు పండ్లను తిని క్షుధ నుండిపాతు
నింతమాత్ర మి మ్మాజ్ఞ! కాసంతయేని, అనుచు సంప్రార్థనము సేయ నవనిజాత.

క. తన సేవకాగ్రణికి వెస, తన కంకణ మొకటియిచ్చి తనివి దలిర్పన్
కొని తిను మెన్ని ఫలమ్ములు, తినవలతో? అంగుళుల నతి ప్రముదమునన్.

౧. కావలసినన్ని ఫలముల కపివరేణ్యా!, విలచి భుజియింపు మయ్యా! క్రూరులుగదయ్యా!
అసురు లీ వనముల పండ్ల నంటకయ్యా! నాదు వార్తలు చేర్పుము! నాథు కడకు.

మ. అనినన్ వెండి, కపీంద్రుం డిట్లనియె, నమ్మా! నేను నా జన్మలో
తినగాలేదు పరాయిచేతి ఫలమున్, దివ్యాజ్ఞ మీదైన నీ
వనమం దొక్కటొ? రెండొ? పండ్లు తినెదన్; వద్దన్నచో నేగెదన్
కనెదన్ తృప్తి సముద్ర మావలనె వీకన్ నాదు మిత్రాళితోన్.

ద్వి. అని పోవ నుద్యుక్తుండగు కపి వీరు, కని ఓయి నాయనా! కపికుల వీర!
ఈ వనంబునకెల్ల నెవ డధికారి? రావణుం డని తెల్యరాదె? నీ కఱయ!
ఏ నెట్లు నీ కాజ్ఞ యిత్తురా! తండ్రి? పూని నీవేనియు పోరి నిల్తువెట్లు?
అని మందలింపగా నంజనీ సుతుండు, విని సీతతోడ తా విన్నవించు నిటు.

క. అత్యంత దుర్లభంబై [illegible]త్యంతము మధురమైన యట్టి ఫలము ల
న్న త్యంత శ్రద్ధ దినె[illegible]ం,రత్యయు లెదుతైనవారి నట్టె హరింతున్.

క. పెల్లుగ సంశయపడెదవు, సల్లలితము రామనామ సన్మంత్రము నా
హృల్లలితంబై యుండగ, తల్లీ! నా కిల నశక్యతయు కలుంగునొకో?

క. (శ్రీ)రామ పరమ మంత్రము, ధారాళముగాగ నా హృదయమున నుండన్
ఈ రాక్షసాధములు నా, కారయ తృణరూపు లెరుంగు మమ్మా! హృదిలోన్.

క. అను కడు ధైర్యపు పలుకుల, విని జానకి వాయుజా! ప్రవీణుండవైనన్
అనవసరంబుగ కల్పన,మును చేయకుమయ్య! కయ్యమునకై నీవే.

ఉ. రాలిన పండు లియ్యవె! కరంబు భుజింపుము తృప్తితీఱంగా
గోల యొనర్పకయ్య! యని కొద్దిగ నాజ్ఞ యొసంగినంతనే
వాలముచేత వృక్షముల వానరవీరుం డదల్ప సర్వమున్
రాలె ఫలంబు, ల వ్వనిన రాజిలు వృక్షము లెల్ల విన్నవోన్.

గీ. వానరేంద్రుండా మెసవ తత్ఫలము లెల్ల, సఫలతం బొందుకాని వృక్షముల నెల్ల
నొక్క ఘనవృక్షమున రాల్చు టొక్క లేని, ఫలము లేదు! పేరునకు తద్వనమునందు.

క. వాలాగ్రంబునఁ గడునా, భీల మహా వృక్ష మొకటి పెనవైచి నిజో
ద్వేలపరాక్రమ మొప్పఁగ, గాలించె వనంబు నెల్ల క్షణకాలమునన్.

మం.ద్వి. వనరక్షకులువచ్చి వాయునందనుని, వెరపించి తరుమగా పరువిడి రటకు
వచ్చినవారిని వచ్చిన యట్లె, పడ మొత్తె! తరులచే పవనాత్మజుండు
మఱియు నావనమున మహిజాత యైన, సీతకూర్చున్న యా చెట్టుకా కెల్ల
చెట్టులన్నియు భూమి మట్టంబు చేసె, అందున్న చైత్యాలయంబు భేదించె
కావలిగాండ్రను కడఁగి మార్కొనియె, అదిచూచి యా రాక్షసాంగన లెల్ల
వీఁడెవ్వఁ డెచ్చటి వాఁడు శ్రీరాము, బంటు గానోపు చెప్పవా? సీత యనుచు
ప్రశ్నింప భూజాత వాక్రుచ్చె నిట్లు, నర్మగర్భంబుగా నలినాయతాక్షి.

గీ. కామరూపులు దుష్టు రక్కసులు మీరు, ఎంతటికినైన తగుదురు వింతయేమొ?
మీర యెఱుఁగుదురపుడు కాంతారమందు, దొంగ యెవ్వరైనదియు మీరెఱుంగరొక్కొ!

గీ. భిక్షుగాని వేషముఁ దాల్చి రాక్షసుండు, వేషగాండ్రు మీఱలు పలుభాష లేల?
ఈతఁ డెవరను సంగతి యే నెఱుంగ, మీరెఱుంగ, వలెంగాక మెలతలార!

చ. అని వచియింప తోన, భటు లార్చుట వీనుల నాలకింపలే
కనితర వేగులైన యసురాంగన లార్చుచు రావణాసురుం
గని మన లంక కేదొ? చెడుకాలము దాపురమయ్యె! లేనిచో
కని వినినామె? యింతటి యకార్యము; రాక్షసరాజ! యెప్పుడున్.

క. ఒక కోఁతివచ్చి తృటిలో, సకలమ్ము నశోకవనము సలిపెఁ బయలుగా
నొకఁడైన లేఁడు భటుఁడిం, తకు వార్తయు నిన్ను జూసి తవిలి వచింపన్.

గీ. సీతయున్న యా యిరుగుడు చెట్టుదక్క, చెట్టులే లేవు, మేము నా సీతయొద్ద
కూరుచుంటిమి కాన మమ్మూరుకొనియె, లేనిచో మాకు యమలోకమానో? యేమొ!

క. అని లొల్లిఁ బెట్టి చెప్పెడు, వనితల యార్పులకు లేచి బహు విస్మయముం
గని రావణుండు ఛీ! క్రోఁతినిఁగని భయపడెదు మిమ్ము తెలియుదు నెటులన్.

గీ. మఱియు రాక్షసు లందఱు మట్టుపెట్టె, ననుచు సిగ్గొకింతయు లేక ననెదరేల?
అనుచు వానరుఁ బట్టగా జనుఁ డటంచు, రాక్షసుల కొందఱినిఁ బంపి రావణుండు.

## రావణుఁడు భ్రాంతుండై గయునిఁ జంపుట

సీ. గయుఁ డను రాక్షసు కటి వస్త్రమును తన, మంచము పైఁజూచి మండి పడుచు
మందోదరిం ద్రుంచు నందులకై ఖడ్గ, మెత్తినన్ స్త్రీ లెల్ల మొత్తుకొనుచు

అకట! స్త్రీ హత్యా మహాపాతకము సేతు,వా? ఇది యపరాధియా? యటంచు
అతనిని వారించి రతి ప్రయత్నంబున, నటనుండి యతఁడు నుత్కటతర ఘోర

కోపనుండయి యట పంపుకొన్న గయుని, నట్టులే త్రుంచె; రావణు కటివసనము
నా విభీషణుఁడు తన పర్యంకమందు, కాంచి సరమను తృటిలో హరించె వెడలె.

క. నిజ మెఱుఁగకుండ నూఱక, గజిబిజి వడి రావణేశు కటి వస్త్రాప్తిన్
సుజనుండ వీవు త్వరమై, ప్రజలనుండి నీమెఁ బాప పాడియె? చెపుమా!

క. అని రజనీచరవనితా, మణు లొప్పఁగఁ పల్కి కొంత మానెన్ పూన్కిన్
తన యన్నపైని మాత్రము, కనె ననుమానంబు నాడుగా మన మందున్.

ఇటుల కపివీరుచే నట, చటుల ఘోర, వికటమైన వినోదంబు వెలసె నపుడు
మరల గోడుగోడున దుఃఖభరిత లగుచు, రాక్షసాంగన లరుదేర రావణుంఁడు.

## రావణుఁడు వనభంగము విని వానరునిఁ గట్టించుట

వనభంగ వృత్తాంతమును విని రావణుం, డోలి వీరుఁడు జంబుమాలి యనెడు
వనపాలకునిఁ బిల్చి, చని నీవు పదివేల, సైన్యంబుతో కపిఁ జక్కఁబట్టి
తెమ్మని యాజ్ఞాపన మ్మొనరించె; వా, డతి వేగమునఁ జనె నతుల సైన్య
విభవుఁడై, యది కని సభయంకరంబైన, సింహనాదం బట్టె చేసె కపియు

దానివిని రక్కసులు మహోత్తమములైన, బాణములువైవ, నంజనీసూనుఁ డపుడు
వృక్షముల పెల్లగించి యా రాక్షసులను, నుగ్గు నూచంబు కావించె నగ్గలముగ.

మ. ఒక తాళాగ్రము చేతఁబూని చటులాత్యుగ్రాకృతిన్ జంబుమా
లి కనద్భీకర దీర్ఘశీర్షమున నోలిన్వైవ పడ్యోజన
ప్రకటస్ఫూర్తి నతండు కూలె; నపు డావార్తన్ స్వభృత్యాళిచే
వికటం బొప్పగ రావణుండు విని గంభీరాట్టహాసోగ్రుఁడై.

క్రోతియట! సైన్యయుతుఁడు రక్షఃప్రవీరు,నంట వధియించె నంట! యీ బంటు వీరు
లెంత బలశాలురో? మది కెంతో వింత,తోచుచున్నది, భళిభళీ! దోర్బలంబు.

అని లక్షసైన్యంబులను, కూర్చి యేవుర, సేనాపతులఁ బంపె శీఘ్రగరిమ
నయ్యోధులను సైన్యమంతను తృటిలోన, కపివీరుఁ డోక్కట కలయఁజూచి
తోర్ధణ ప్రహరణ తోనె వారల నుగ్గు,నూచేంబు కావించి వేచియున్న!
అదివిని బెగ్గిలి యత్యాగ్రహము నొంది, యక్షనామకుని స్వీయాత్మ జాతు

చటుల చతురంగ బలముల జతన పఱచి, అంజనీపుత్రు పైకి రయంబుమీఱఁ
బంపగా వాయుపుత్రుండు పంపె వారి,ముద్గరాఘాతమున మృత్యు ముఖమునకును.

క. అత్తరి దశకంఠుఁడు హరి,జిత్తగు నమ్మేఘనాదుఁ చింతాభరముణ్
తత్తరము మీఱ నిజపు,త్త్రోత్తముఁ కపిపైకి పంపె నుగ్రుండగుచుణ్.

సీ. కోటి సైన్యము తోడ ఘోరయుద్ధముచేసె, శస్త్రాస్త్రముల తన్నిశాచరుండు
చిత్రప్రయోగ విచిత్ర చాలనముల, మారుతి యదియెల్ల మారుమాట
లేకుండ నొక గడె తేకువమై చూచి, వీఁడొకించుకయంత వాడి కలఁడు
రావణు పక్షాన రవ్వసేయుట కని, లఘుకాలమునన వాలంబు పెంచి

గీ. సైన్య మంతటి చుట్టు ముష్కారముగాగ, కోటగోడకువలె చుట్టి కోటిసైన్య
మెటులఁ బోకుండజేసి తత్త్రుటినె చంపె, తోరణ స్తంభమున మోది వారినెల్ల.

చ. మఱియొక వృక్షరాజము నభంగులలీలఁ బెకల్చి మేఘనా
దు, రయమునణ్ మహోగ్రుఁడయి దోర్బల మొప్పఁగ యంగ సంధులణ్
విఱియఁగ మోదె; నాతఁ డతి భీతిలి కొండ బిలంబుఁ జొచ్చె త
త్తరమున నింక బైట తలఁదాల్చిన ప్రాణము దక్కుదం చెదణ్.

ఉ. చచ్చిన రాక్షసాధములు సర్వులు పీనుఁగు పెంటలై భయం
బచ్చుగ గూర్ప, రావణుఁ డహా! యిక నెట్టులు? మేఘనాదుడుం
జేచ్చెనొ యేమొ? యంచు పెలుచణ్ కడు దుఃఖము నొందుచుండఁగణ్
హెచ్చుములేని శౌర్యమునఁ పొల్చె! సమీరకుమారుఁ డమ్మెయిణ్.

శా. అంతణ్ బ్రహ్మ నభంబునణ్ నిలిచి ఓరా! అంజనీపుత్ర! దు
ర్దాంతంబైన భవత్ప్రతాపమున మోదం బయ్యె! మా కెల్ల, ని
న్నెంతో సన్నుతిసేతు రుర్విజనముల్ నీ విష్ణు నా యస్త్ర వి
క్రాంతిణ్ మన్ననసేయు మేడు గడియల్; కళ్యాణముల్ సేకుఱణ్.

గీ. పఱగ బ్రహ్మాస్త్రమున కట్టుపడుము నీవు, ఏడిగడియలు, రాక్షసుల్ పోడిమి కన!
రావణునివద్ద కేగుము నీ విధంబు, వాని మ్రోల చూపింపఁగా నౌను హనుమ!

మ. అని సంప్రార్థనచేసి వల్లె యను నెయ్యంబైన తద్వాయు సూ
నుని వాక్యంబు గ్రహించి, మేఘు నిన్నదుణ్ దుర్వార భీతాత్మునిం
గని, బ్రహ్మాస్త్రముచేతఁ గట్టువడు వీకణ్ వాయుపుత్రుండు, భీ
తిని బొందం బనియేమి? నీకు; మును నద్దేవేంద్రు భంజింపవే?

క. గుహలో డాగఁగ తగవే? తహతహ పడె నీదు తండ్రి, తనయుఁడు యమునిం
గృహవాసి యయ్యెనో? యని, బహుళ యశముఁ గనుమ! కపిని బట్టి యథేచ్ఛణ్.

గీ. నీ పరాక్రమ మకట! ఏ నీటఁగలసె? కపిని బ్రహ్మాస్త్రమున వేగఁగడగి కట్టి
తండ్రివద్దికి కొనిపొమ్ము! తప్పకుండ, దిక్కులన్నియు నిన్ను కీర్తింప దనుజ!

క. అని చెప్పి వెడలిపోయిన, విని యింద్రజితుండు మఱల వెడలి కడిమిమై
అనిలసుతున్ బ్రహ్మాస్త్రమ్మునఁగట్టి చెలంగి తండ్రి మ్రోలన్ నిలిపెన్.

గీ. చచ్చిపోయిన పుత్రుండు వచ్చెనంచు, నందు శత్రుం జయుం డయెనంచు మిపుల
రావణుఁడు పట్టరాని గర్వంబునొందె, నడుమ శిరి కల్గు నాతని వడువుగాఁగ.

గీ. రావణుని సభయెల్ల దుర్భర ముదాబ్ధి, దేలి యాడుచునుండ పేరోలగమున
నిండు తీవిని ఆ రావణుండు కడఁగి, కట్టువడియున్న మారుతిఁ గాంచి పలికె.

ఆ. ఓ ప్రహస్త! వీని నొయ్య విచారించు, మెవడో? వీడటంచు నేవఁ బలుక
నప్పిశాచి పల్కె తప్పక కపిఁగాంచి, ఏల వచ్చితీవు? ఎవడ? వనుచు.

ఆ. ఎవ్వఁడంపినారొ? ఎరుగఁబల్కు? మటన్న, ఆంజనేయుఁ డనియె, అన్ని సంగ
తులను రావణునికె పలికెద ముంజేతి, ఆభరణము చూడ నద్దమేల?

### రావణుఁడు ఆంజనేయుని సద్బోధనను వినక విఱ్ఱవీగుట

క. నాతో మాటాడుట వి,ఖ్యాతికి లోపంబటంచు కడఁగి యడుగఁగా
యీతనిఁ బురికొల్పితి వని, నే తెలిసితిగాని నీకు హితము వచింతున్.

సీ. రావణా! నీదు మూర్ఖతవల్ల కలిగిన, శత్రుభావమునకు స్వస్తి చెప్పి
శరణాగత ప్రియుం డరయ శ్రీరాముని, సేవింపు మిప్పుడ సీత నిచ్చి
అనుజాత్మజులతోడ నందరు సుఖముగా, భయ మించుకయు లేక బ్రతుకఁగలరు
సింహ తుల్యులును నశేష విక్రములును, నఖ దంష్ట్రయోధులు నగ సమాన

గీ. మూర్తులౌ కపుల్ నీ లంక ముట్టడించి, ధ్వంసమును సేయుటకు మున్నె త్వర వహించి
జానకీదేవి శ్రీరాము సన్నిధాన, మందు నర్పించి ధన్యత నందవయ్య!

మ. అటు కాదేని యముండె అడ్డినను, నెయ్యంబొప్ప నా శంకరుం
డెటులేనిన్ దయ కావఁజూచినను, న య్యింద్రుండు తో వచ్చినన్
తటినీతోయములందు డాగినను, పాతాళంబునం జొచ్చినన్
చటులుండై నిను రాముఁ డెట్లు విడుచున్; సంధించి ప్రాణంబుతోన్.

క. అని చెప్పిన ప్రియవచనము,లను విని రావణుఁడు కుపిత లక్షణుఁడై యి
ట్లను; చచ్చెడు రోగి సుధ,మ్మును తెగడెడి భంగి దుష్టముఖ దశకుండై.

ఆ. ఓరి క్రోఁతి! నిన్ను నొయ్యన నిప్పుడే, చంపఁగలను కాని క్షమవహించి
దూతవనుచు తాల్మి ద్రుంపఁగ మానితి, శరణ మనఁగ వలెనె! నరున కహాహ!!!

ఆ. దేవతలఁ జయించి దేదీప్యమాన ప,రాక్రమమున వెల్గు నాక్రమంబు
నీ వెఱుంగ కిట్లుగా వాగెదవు కాక, ఒక్క నరుఁడు నాకు లెక్కయౌనె?

వ. ఓరీ! దుష్టమృగమా! ఇటువిన్నుము.

సీ. బ్రహ్మదేవుఁడు నాకు పంచాంగమును జెప్పు, నరయ సూర్యుఁడు ప్రతీహారి నాకు!
చంద్రుండు విడకెప్డు ఛత్రంబు వట్టును, వరుణుం డనగ నీళ్లవాఁడు నాకు!
అగ్నిహోత్రుఁడు వంటలయ్య నాయింట న, వ్వాయుదేవుఁడె యూడ్పువాకిళులను!
ఇంద్రుండు పూమాల లిచ్చు తోమాలి య, గ్గణపుఁడే గుఱ్ఱాలఁగాచు నాకు!

గీ. తనర దేవతాస్త్రీలు నా దాసిజనులు, పరగ సప్తగ్రహములు సోపానపంక్తి!
నాదు సింహాసనమునకు, నన్నెఱుఁగవు, దండపాణి! సన్నిధి దండపాణి నాకు.

గీ. గుడ్డ లుతుకును రజకుఁడై గ్రుడ్లనీరు, గ్రుడ్లగ్రుక్కుచు నయ్యగ్ని గొణిగికొనుచు
పరగ మార్తండుఁడే మాకు మంగలి సుమ! చంటివానికి మాదాది! షష్ఠిదేవి!

గీ. చేతనాడిస్తి కైలాసశిఖరి నొకట! నేజయిస్తి కుబేరుని నిముషమాత్ర!
నీదు గతి యేమొ యెఱుగక నిర్భయముగఁ, వదరుచున్నావు అదరును బెదరు లేక.

శా. ఏమీ! కోతులకై భయంపడుదునా? ఏదిక్కు లేకాటవిన్
ఛీ! మానివ్యథ వృత్తి బూని తిరిగే చెంబేలి సన్నాసులన్
స్ఫ్రామాణోర్వరు పరాక్రమ క్రములనే భావంబుతో భీతినం
దేమా? మమ్మెట్టుఁగాఁ దలంచెదవొకో? దేవేంద్ర భజింపమే.

మ. అసలేకోఁతివి; అందు నీచుఁడవు, నీ యాలాపముల్ కూర్మి నె
ట్లెసలారున్ భళి! రాముఁగీముఁ తృణమో యేమో! యనే దృష్టి పెం
పెసలారున్ అసురాళికెల్ల, నికమమ్మెంచన్ కపివ్రాతమా;
ససిగా చూచిన పాటిపోవె? యిక నీసల్లాపము ల్మానుమా.

క. నీరాముని సుగ్రీవుని,తో రావణుఁ డొక్కతృటిని దోర్బల మొప్పన్
చేఱుచు యమపురి కని నీ, వాఱయఁగా లేక నిట్టు లఱచెదు మివులన్.

క. అని చెప్పి రావణాసురుఁ, డనిలసుతుని జంప తివుర నది ధర్మముకా
దనుచు విభీషణుఁ డాపన్, కనలుచు కపి పరిభవింపఁగావలె ననుచున్.

ఆ. దూత యగుట వీని ద్రుంప ధర్మముకాదు, వీని తోక గోసివేయుఁడంచు
దూతజాలమునకు తొలుత నాజ్ఞాపించె, రావణుండు క్రోధరాజితుండు.

గీ. తక్షణమె వేలకొలది దూతలు కడంగి, అంపముల బట్టి కోయ నారంభపడిరి
కాని యాయుధములు మొక్కవోను కాని, ఆంజనేయుని వెంట్రుకయైన తెగదు.

కం. కొడవళ్ళను గొడ్డళ్ళను, బడిబడిగా పూని భటుల బలమేపాఱన్
తొడబడి నఱికం జూచిరి, వెడగుతనమె కాని యొక్క వెంట్రుక తెగదే?

ఉ. దాని నెఱింగి రావణుఁడు తత్తరమొప్పఁగ నాంజనేయునిం
బూనికమీఱఁగాంచి తలపోయుము! వీరులభక్కి, మృత్యువె

గ్లానో? యెఱుంగ జెప్పిడుదు; రట్లగుటన్ యెటిగింపు మెట్లుగా
నానొకో? నీదు వాలము రయంబున భిన్నము; మారుతాత్మజా.

మ. అనినన్ వాయుసుతుండు నవ్వి, యను నౌరా! రావణా! యెంత తె
ల్విని మాటాడితి, వైన చెప్పెద! నినున్ వీసానికిన్ లెక్కసే
యని నాకేటికి? భీతి; నాకు మృతిలే దాచంద్ర తారార్కమున్
మను దేనుర్వి సుఖప్రవృత్తిఁ గనుకన్, వాలం బభేద్యంబగున్.

కం. కావున నింకే వడువున, రావణ! నీ కచ్చుడీరు? రాణ నెఱుఁగుమా!
చేవ కలదేని తోకకు, పావకుఁ దాకొల్పి చూడుమా! ఏమగునో?

చం. అని యెద తండ్రిమిత్రుఁడగు నగ్ని; యతండొగి నన్ను కాల్చునే?
కినుకను దాని తోడుతనె గీల్కొని లంక దహింతు లీలగా
నని తలపోసినన్; వికటుఁడైన నిశాచరుఁ డట్టి సేన నె
ల్లను పురికొల్పి ఆజ్ఞఇడె; లావుఁ బలంబు చలంబులేర్పడన్.

గీ. మీఱలెల్ల ప్రయత్నము మీఱ తోక,నిప్పుముట్టించి వీధుల నేర్పుమీఱ
పఱగ నూరేగచేయుడు పగతులెల్ల, గ్లాని నొందుచు మివుల చికాకు నొంద.

కం. అను నాతని యాజ్ఞను మా,లిని నపుడ ధరించి భటులు లేలెం డని పో
యి నిశాచర సంఘము నూ,నెన ముంచిన గుడ్డలను వనేచరు కడకున్.

ఉ. పెల్లుగఁ దెచ్చివైచి సరవిన్ కపి వాలముఁ జుట్టుచుండినన్
మెల్లన సాగసాగె నది, మేలని రక్కసులెల్ల, వస్త్రముల్
కొల్లలు గాఁగ దెచ్చి, పలుకుండల నూనియదెచ్చి, ముంచుచున్
గొల్లున చుట్టసాగి, రిదె! కోఁతిని బట్టితిమంచు వేఁడుకన్.

సీ. పెరిగిన కొలఁదిగా పొరిబొరిఁ జుట్టిరి, ఘోరరాక్షసులు గగ్గోలుమీఱ!
రావణాసురు మందిరం బందు కల వస్త్ర,రాజంబులెల్ల పారంబు మీఱ!
బట్టల కొట్టలో పరగు వస్త్రంబులు, పరువుల గుడ్డలు పరు వెఱుగక!
అవి చాలకున్న న య్యసురుల నెత్తి వ,స్త్రములును ధ్వజవస్త్రతతులు చుట్టి

గీ. చాల కవి రాజభటుల వస్త్రములు రాజ, సభన కలవారి వస్త్రముల్ సంతరించి
రాచటికము వారివి చుట్టి రావణాదు, లవియు మందోదరివియును దవిలి చుట్టి.

మ. అవియుం జాలక సీత వస్త్రములకై యాలోచనల్ రావణుం
దవులన్ రాక్షసరాజభావము నెదం దా నెంచి య య్యంజనీ
భవుఁ డెంతె తనతోక హ్రస్వముగఁ గూర్పన్, రాక్షసానీకము
ల్మివులన్ సంతస మంది యగ్ని పురికొల్పె యోచన ల్చేసినన్.

మ. గుములై గుడ్డలకెల్ల రాక్షసులునుక్ గొట్లాడఁగా సాగి, రా
జ్యము తైలంబులు పూజ్యమయ్యె; నపు డోజక్ నిప్పుముట్టింప నెం
తో ముదం బొందిరి కాని, రాక్షసులు ప్రాదుర్భావ మగ్నిక్ పౌన
ర్ప మరేమాత్రము చేతకాక, దిశలన్ పంకించి వీక్షించినన్.

గీ. ఆంజనేయుఁడు యజమానుఁడైన రావ,ణాసురుఁడె వచ్చి యూదిన నగ్ని వెలుగు
నేమొ? యటుకాక మీవల్ల నేమి? యగు న,టంచు వచియింప రావణుం డంతవచ్చి.

శా. తోకక్ నిప్పు లగించి యూదె, నట తోక్ తోక్ మీసము ల్గడ్డముల్
వీకన్ వెంట్రుకలెల్ల నంటుకొని వేవే మండగాఁ జొచ్చినన్
ఆ కష్టుం డగు రావణాసురుఁడు, బాహానీకముల్ వింశతిక్
జోకన్ తాను కడంగి మంటల వెలార్చున్ నల్పి నిర్లజ్జుఁడై.

క. ఇరువది చేతులతోడన్, గరిమను రావణుడు మోము కలయ తుడుచుటల్
పురవాసులైన రాక్షసు, లజుసి పకాపకల నవ్వ నటు సాగి రొగిన్.

క. అపు డాంజనేయుఁ డాతని, నపహాస్యము సేయ, రాక్ష సాధిపుఁ డలుకన్
కపి వీని నావలకు మీ, రిపుడే కొని చనుఁడటంచు నెలమిన్ బలుకన్.

ఆ. వారు క్రోధమున సమీరసూతికిని సం, కెళ్లు వైచి చక్క కెరలికట్టి
శ్రద్ధ మీఱ లంక రమణీయ వీధుల, నపుడు త్రిప్ప సాగి రతి ముదమున.

గీ. శస్త్రధారులై యెసఁగు రాక్షసులు కడఁగి, వాద్యములు మ్రోయుచుండగా వాయుసుతుని
కేకలును బొబ్బలిడుచు క్రిక్కిరిసి మూఁగి, లంకవీధుల ద్రిప్ప నల్వంకలందు.

## లంకాదహనము

మ. కపివీరుండును గంతుల న్నిడుచు సూక్ష్మంబైన రూపంబు న
ప్డపుడే గైకొని సంకెలల్ డులిచి బ్రహ్మాస్త్రంబు తత్స్థానముం
గృపఁగైకొన్న, విజృంభమాణతనుఁడై ఛీంకారము ల్సేయుచుక్
విపదారంభము సేసె రక్కసులకుక్; విక్రాంతితాక్రాంతుఁడై.

క. పశ్చిమ లంకాద్వారము, నాశ్చర్యముతోడనెక్కి యద్భుతలీలక్
దుశ్చరితులైన రాక్షస, నిశ్చయ వీరుల వధించె నిశితబలుండై.

సీ. తోరణ స్తంభంబు తొడరి యెత్తి యతండు, ద్వారపాలకుల నధఃకరించి
తన్ను కావలి కాయుచున్న వారలచేర్చి, సంహార మొనరించి సంభ్రమమున
ప్రాసాదముల నెల్ల పటుభయంకరముగా, తనతోక నిప్పుచే తగులఁబెట్టి
ప్రతిగృహం బంమను బహుళ కోలాహల, సంరంభముం గూర్చె సత్వరమున !

౹. నిద్రపోయెడు శిశువుల న్విడచి ప్రాణ, రక్షణము చేసికొనఁగ తద్రాక్షసాంగ
నలు కురులు వస్త్రములు కాల నులుకుఁజెంది, ఇండ్ల బయటికి పరువెత్తి ఏడ్చునంత.

చ. క్రమముగ రావణాదుల సుఖంకర దివ్య గృహాంగణంబులన్
ప్రముదము మీఱ రావణు సభాస్థలిఁ గాల్చి, కపీంద్రుఁ డడ్డు వ
చ్చు మదరిపూత్కారంబుల యశో విభవుండయి కాలుఁసన్నిధిన్
శ్రమముఁ దొలంచుభంగి పెలుచన్ బడఁగూర్చె బలాప్రమేయుఁడై.

క. నోటికి చేతికి తాళము, మీఁటినగతి కొట్టుకొనుచు మిన్నుల నఱచుచున్
గాటమగు కాల్పులకు నా,రాటముతో చచ్చి రచటి రాక్షసులెల్లన్.

గీ. క్రుద్ధుఁడై రావణుఁడు పదికోట్ల రాక్ష,సులు కొలువ తానె యుద్ధము సలుపుటకును
వెడలఁగా వాయుపుత్రుండు వేనవేల, సైన్యముల తోక దెబ్బలఁ జంపెఁగడక.

గీ. తోరణస్తంభ మను గదతోడఁ గూల్చె, కోట్లకొలది రక్కసులను కొంకులేక
అప్పుడె వినోదముగ రావణాసురుని శి,రంబుపై తోకతో కొట్టె సంబరమున.

ఉ. వాలపు టగ్ని తేజమున వాని శరీరము మండ, మూర్ఛమై
సోలె శతుండు రావణుఁడు; శూరుఁడు వాయుజుఁ డాజ్ఞ లేమిచే
కూలఁగ మోదఁడయ్యె, నది కూరిమి పుత్రుఁడు గాంచి యింక నీ
లీలఁ జెలంగ ప్రాణ మవలీలన డుల్చు నటంచు భీతుఁడై.

౹. ఇంద్రజిత్తుఁడు బిలములో నెలమి డాఁగె, వాని లక్ష్మణుప్రీతికై వానరుండు
గెడపఁడయ్యె, నివ్విధమునఁ గీలఁగొల్పి, సుందరంబైన లంకను సొరిదిఁ గాల్చె.

౹. గోపురాట్టాలకాలంకృతోపవనవి,రాజమానమౌ లంకాపురంబు కడఁగి
క్షణములో కాల్చి నుసిచేసి సంద్రమునకు, తోఁక నిప్పు నార్పఁగనేగె తోష మొప్ప.

౹. చూచిరమ్మన్న కాల్చివచ్చుట యటన్న, సామెతయు నాఁటి నుండియే జగతిపైని
ఖ్యాతి గాంచెను; అంతటన్ ఆంజనేయుఁ, డబ్ధి జలజంతువులకు కీడగు నటంచు.

మ. తనవాలంబు తరంగతోయములచేతన్ వేగ చల్లార్చి, చి
చ్చున రేకెత్తిన ధూమజాలముల నచ్చో లోనికిన్ పీల్చుటన్
తన గొంతంతయు నల్లవాఱ, కపియున్ తచ్ఛ్లేష్మమున్ థూత్కృతం
బును గావించుచు కూరుచుండిన తలంపుల్ సీతపై కేగగన్.

## సీత నిప్పులో చిక్కెనని భ్రాంతుఁడై హనుమంతుఁడు విలపించుట

క. అయ్యో! సీతాసతి నేఁ,డి య్యనలమునందుఁ గాలె; ఇఁక నాకృషియో!
అయ్యో వృథ యని, హా తాశుం,డ య్యనిలసుతుండు మూర్ఛితాంగుండగుచున్.

మ. గుములై గుడ్డలకెల్ల రాక్షసులునున్ గొట్లాడఁగా సాగి, రా
జ్యము తైలంబులు పూజ్యమయ్యె; నపు డోర్జన్ నిప్పుముట్టింప నెం
తో ముదం బొందిరి కాని, రాక్షసులు ప్రాదుర్భావ మగ్నిన్ పౌన
ర్ప మరేమాత్రము చేతకాక, దిశలన్ పంకించి వీక్షించినన్.

గీ. ఆంజనేయుఁడు యజమానుఁడైన రావణాసురుఁడె వచ్చి యూదిన నగ్ని వెలుగు
నేమొ? యటుకాక మీవల్ల నేమి? యగు న,టంచు వచియింప రావణుం డంతవచ్చి,

శా. తోకన్ నిప్పు లగించి యూదె, నట తోకన్ తోకన్ మీసము ల్గడ్డముల్
వీకన్ వెంట్రుకలెల్ల నంటుకొని వేవే మండగాఁ జొచ్చినన్
ఆకష్టం బగు రావణాసురుఁడు, బాహానీకముల్ వింశతిన్
జోకన్ తాను కడంగి మంటల వెలార్చున్ నల్పి నిర్లజ్జుఁడై.

క. ఇరువది చేతులతోడన్, గరిమను రావణుడు మోము కలయ తుడుచుటల్
పురవాసులైన రాక్షసు, లఱసి పకాపకల నవ్వ నటు సాగి రొగిన్.

క. అపు డాంజనేయుఁ డాతని, నపహాస్యము సేయ, రాక్షసాధిపుఁ డలుకన్
కపి వీని నావలకు మీ, ఱిపుడే కొని చనుఁడటంచు నెలమిన్ బలుకన్.

ఆ. వారు క్రోధమున సమీరసూతికిని సం,కెళ్లు వైచి చక్క కెరలికట్టి
శ్రద్ధ మీఱ లంక రమణీయ వీధుల, నపుడు త్రిప్ప సాగి రతి ముదమున.

గీ. శస్త్రధారులై యెసఁగు రాక్షసులు కడఁగి, వాద్యములు మ్రోయుచుండగా వాయుసుతుని
కేకలును బొబ్బలిడుచు క్రిక్కిరిసి మూఁగి, లంకవీధుల ద్రిప్ప నల్వంకలందు.

## లంకాదహనము

మ. కపివీరుండును గంతులన్నిడుచు సూక్ష్మంబైన రూపంబు న
ప్డపుడే గైకొని సంకెలల్ డులిచి బ్రహ్మాస్త్రంబు తత్థానముం
గృపఁగైకొన్న, విజృంభమాణతనుఁడై ఘీంకారముల్సేయుచున్
విపదారంభము సేసె రక్కసులకున్; విక్రాంతితాక్రాంతుఁడై.

క. పశ్చిమ లంకాద్వారము, నాశ్చర్యముతోడనెక్కి యద్భుతలీలన్
దుశ్చరితులైన రాక్షస, నిశ్చయ వీరుల వధించె నిశితబలుండై.

సీ. తోరణ స్తంభంబు తొడరి యెత్తి యతండు, ద్వారపాలకుల నధఃకరించి
తన్ను కావలి కాయుచున్న వారలచేర్చి, సంహార మొనరించి సంభ్రమమున
ప్రాసాదముల నెల్ల పటుభయంకరముగా, తనతోక నిప్పుచే తగులఁబెట్టి
ప్రతిగృహం బంమను బహుళ కోలాహల, సంరంభముం గూర్చె సత్వరమున !

గీ. నిద్రపోయెడు శిశువుల న్విడచి ప్రాణ, రక్షణము చేసికొనఁగ తద్రాక్షసాంగ
నలు కురులు వస్త్రములు కాల నులుకుఁజెంది, ఇండ్ల బయటికి పరువెత్తి ఏడ్చునంత.

చ. క్రమముగ రావణాదుల సుఖంకర దివ్య గృహాంగణంబులన్
ప్రముదము మీఱ రావణు సభాస్థలిఁ గాల్చి, కపీంద్రుఁ డడ్డు వ
చ్చు మదరిపూత్కారంబుల యశో విభవుండయి కాలుఁసన్నిధిన్
శ్రమముఁ దొలంచుభంగి పెలుచన్ బడఁగూర్చె బలాప్రమేయుఁడై.

క. నోటికి చేతికి తాళము, మీటినగతి కొట్టుకొనుచు మివుల నఱచుచున్
గాటమగు కాల్పులకు నా,రాటముతో చచ్చి రచటి రాక్షసులెల్లన్.

గీ. క్రుద్ధుఁడై రావణుఁడు పదికోట్ల రాక్ష,సులు కొలువ తానె యుద్ధము సలుపుటకును
వెడలఁగా వాయుపుత్త్రుండు వేనవేల, సైన్యముల తోక దెబ్బలఁ జంపెఁగడక.

గీ. తోరణస్తంభ మను గదతోడఁ గూల్చె, కోట్లకొలది రక్కసులను కొంకులేక
అప్పుడె వినోదముగ రావణాసురుని శి,రంబుపై తోకతో కొట్టె సంబరమున.

ఉ. వాలపు టగ్నితేజమున వాని శరీరము మండ, మూర్ఛమై
సోలె శఠుండు రావణుఁడు; శూరుఁడు వాయుజుఁ డాజ్ఞ లేమిచే
కూలఁగ మోదఁడయ్యె, నది కూరిమి పుత్త్రుఁడు గాంచి యింక నీ
లీలఁ జెలంగ ప్రాణ మవలీలన డుల్చు నటంచు భీతుఁడై.

గీ. ఇంద్రజిత్తుఁడు బిలములో నెలమి డాఁగె, వాని లక్ష్మణుప్రీతికై వానరుండు
గెడపఁడయ్యె, నివ్విధమునఁ గీలఁకొల్పి, సుందరంబైన లంకను సొరిదిఁ గాల్చె.

గీ. గోపురాట్టాలకాలంకృతోపవనవి,రాజమానమా లంకాపురంబు కడఁగి
క్షణములో కాల్చి నుసిచేసి సంద్రమునకు, తోఁక నిప్పు నార్పఁగనేగె తోషమొప్ప.

గీ. చూచిరమ్మన్న కాల్చివచ్చుట యటన్న, సామెతయు నాఁటి నుండియే జగతిపైని
ఖ్యాతి గాంచెను; అంతటన్ ఆంజనేయుఁ, డబ్ధిఁ జలజంతువులకు కీడగు నటంచు.

మ. తనవాలంబు తరంగతోయములచేతన్ వేగ చల్లార్చి, చి
చ్చున రేకెత్తిన ధూమజాలముల నచ్చో లోనికిన్ పీల్చుటన్
తన గొంతంతయు నల్లవాఱ, కపియున్ తచ్ఛ్లేష్మమున్ ధూత్కృతం
బును గావించుచు కూరుచుండిన తలంపుల్ సీతపై కేగగన్.

## సీత నిప్పులో చిక్కెనని భ్రాంతుఁడై హనుమంతుఁడు విలపించుట

క. అయ్యో! సీతాసతి నేఁ,డి య్యనలమునందుఁ గాలె; ఇఁక నాకృషియో!
అయ్యొ వృథ యని, హాతాశుం,డ య్యనిలసుతుండు మూర్ఛితాంగుండగుచున్,

సీ. తెలివొంది నేనెంత తెలివిమాలిన పని, గావించినాడ దుర్గర్వవశత!
పరమమూఢుడ! దుష్టవర్తనుండను కటా! మొదల నింతటి తెల్వి గదురదయ్యె!
హా! రామకాంత నన్యాయంబుగా నగ్ని, కాహుతి చేసితి నక్కటకట!
అవివేకినైతి; అయ్యయొ! యింక నే నెట్లు, రాముని చూతు దుర్భరము! కరము

గీ. ఘోరమైన యీ వార్తను (శ్రీ) రఘూత్త,మునకు వచియించు టెట్టులు? మూర్ఖవృత్తి
నే వచించిన ఒకవేళ నిల్చుటెట్లు?, రామచంద్రుని యుసురులు రామఁబాసి.

కం. ఎంత తెలివిమాలిన పని, చింతా లేశంబులేక చేసితి నకటా!
ఇంతిని గాల్చితి నని (శ్రీ),కాంతుని కెటు దెల్పుదును వికట గర్వమునన్.

సీ. (శ్రీ)రామచంద్రుండు సీతాసతీమృతి, విని యింక బ్రదుకునే పృథ్విపైని?
ఆ మహాత్ముఁడు పోవ ఆ దుఃఖమునకు, లక్ష్మణుఁ డప్పుడే తాను చచ్చు నిజము!
ఆ వార లిరువురు పోవ సుగ్రీవుండు, మృతినొందకుండుట మృషయకాదె?
అందులకై మంత్రు లందఱతో రుమ, కీర్తిశేషయ యగు ఆర్తి గదుర

గీ. అకట! అంగదు డుండునె? అతని కొఱకు, తార మరణించు పుత్రశోకా రభటిని:
రాజు లేమిచే కపులు స్వర్గస్థులగుదు; రెంత ప్రళయంబునకు నేను హేతువైతి.

మ. పదునాల్గేం డ్లట నిండఁగానె అకటా! భ్రాతుండు రాకుండుటచే
ఎద వ్రీలన్ మృతినొందు పో! భరతుఁ; డీ యెగ్గొందినన్ కైక త
ప్పదు స్వర్గమ్మునకేగు; రామ విరహ ప్రారంభ కౌసల్య ని
ల్వదు; సౌమిత్రికినై సుమిత్ర విడుచున్ ప్రాణంబులన్ ప్రేల్మిడిన్.

క. వీరల మరణమ్ములు విని, వీరల బాంధవులు శోక వివశాత్మకులై
భోరనఁ గూలుదు; రట మిథి,లా రాజగు జనకుఁ డెట్లు లావఱక మనున్?

మ. ఇటులే వారికి వారు రాజకులముల్ హీనంబులై పోవ, అం
తట స్వేచ్ఛామతులై ప్రజానివహమంతా గూలు; హావ్వాళి లే
కట స్వర్గంబున దేవతా వితతి హాహాకారముల్ చేయరే?
చటు లార్తిం గలిగింపఁజాల; కన నా చావింతకున్ మేలగున్.

వ. నేను మరణింపకున్న నేమగును?

క. ఇట్టి యకాల ప్రళయము, చుట్టుకొనన్ చివికి కమలజుండు నశించున్;
అట్టి యెడన్ బ్రహ్మాండమె, బిట్టుచెడి నశించు; నింత విలయము పుట్టున్.

ఉ. ఇందులకున్ నిమిత్తముగ నేను జనించితినేమొ? అక్కటా!
చెందితి నెంతయో ముదము సీతనుగంటి; నికేమి? రామునిన్
కందు; మహా ముదంబుగ, స్వకల్పిత కృత్యము రాముతోడుతన్
విందుగ, చెప్ప వాఁడ నని వీగితి గర్వముతోడ నయ్యయో!

క. ఏ మగిడి సిగ్గువిడి శ్రీ,రాముని దర్శించు టెట్లు! రావణు వీటన్
భూమిజఁ గని, కాల్చితి నని, ఏ ముఖమున పల్కువాఁడ ఇట చాకుండన్.

క. నా నేస్తులైన ప్రముఖుల, వానర వీరుల నికెట్టి భంగిని గందున్
న్యూనత నా కార్యము నె, ట్లూని వచింతున్ మఱెట్టు లోర్తు మనంగన్.

శా. నా యీ వాలమె రజ్జుగా పెనచి ప్రాణంబు ల్వెసన్ పాయుదున్
ఈ యన్యాయపు వార్త! రామునకు నా యీ నోటితో మొండినై
చీ! యేలాగున చెప్పఁగాఁగల; నిదే సిద్ధాంత మం చాదటన్
రాయింజేసి మనంబు చచ్చుటకు శీఘ్రంబే ప్రయత్నించుచున్.

ఉ. అంజనిసూతి వాలము రయంబున కంఠమునందుచుట్టి, గుం
జం జనుచో; దివంబున విశంకటవృత్తిని ఒక్కవాణి! ఓ
యంజని పుత్ర! జానకి సుఖాస్పద! నీ విక భీతి దక్కి వే
గంజని రామసన్నిధికి క్రమ్మఱు, నీ శుభవార్తఁ దెల్పుమా.

చ. అన నశరీరవాణి వచనావళి వాయుసుతుండు సంతసం
బున విని, హర్షపూరిత సముత్కట సద్హృదయారవిందుడై
చనియె! అశోక వాటికకు, జానకి గన్గొన, నా ప్రదేశ మం
దున నొకచోట గాంచెను, చతుర్దిశలన్ చను హేమకాంతులన్.

క. అని శంకరుండు పల్కిన, విని పార్వతి భూమి యచట వింతగ హేమం
బును బొందె నెట్లు? తెల్పుమ, యనినన్ ముద మొప్ప ఇట్టు లనియె శివుండున్.

## గజేంద్రమోక్షణము - లంకాస్వర్ణమహిమము

చ. కలదు త్రికూట పర్వత మఖండపయోధిపరీతమేదినీ
వలయిత సర్వసంపద వివర్ధన మయ్యది యోజనాయతం
బలఘు సువర్ణరౌప్య విదితామల లోహ త్రికూట రాజితం
బిల తిలకంబనంగ తగి యింపునొసంగు దిశాష్టకమ్ములన్.

సీ. అద్దాని సానువులందు పూజ్యుండైన, వరుణదేవుని ఋతుమంతమనెడి
ఉద్యాన మొక్కటి ఒప్పియుండెను, దేవ,తా స్త్రీ విహార సుందరము మహిత
కమనీయ కువలయ కుముద కహ్లార స,త్కాంతి కాంతంబు సుధామయంబు
కనక నీరేజ సంకాశంబు విస్తార,మా నొక్క కాసార మందు దనరు

గీ. అది కృతఘ్నులకును నాస్తికాధములకు, హింసకులకును డాంభిక హేతు జనుల
కన్నులకు కానుపింపదు గడఁగి యందు, నుండె పెద్ద కాలమ్ముగ ఒక్క మొసలి.

మ. అది దుష్టంబు, బలాన్వితంబు, బహు ఘోరాకార సందీపితం
బుదితాహంకృతి మత్తవారణమునే నుంకించి జంకించి పె
ల్లెదురై పట్టు భయంకరాకృతి; కనన్ హేలా మహోల్లాసియై
ముదమొప్పన్ జలమందునం దనరు సంపూర్ణోన్మదోపేతమై.

ఆ. అంత నచ్చటికిని దంతభీకరముఖు, డైన మత్తహస్తి ఆఁడయేన్గు
లెల్ల చుట్టికొల్వ ఉల్లాస మూర్తియై, దప్పి తీర్చుకొనఁగ తరలివచ్చె.

ఆ. వచ్చి నీరు ద్రావు మత్తేభమును నక్ర, మట్టె యొడిసి పట్టె; పదరి ఆఁడు
యేన్గులెల్ల దాని నెట్టులో రక్షింపఁ, గడఁగెఁగాని లాభకారికాద.

క. అనుతాపభరముచేతన్, వెనుక నిలిచి కరిణులెల్ల వ్రేఁగగు నింతిం
తనరాని బలముతోడన్, పెనఁగొని లాగినను లాభమే లేకున్నన్.

గీ, ఆశ త్యజియించి కరిణులా హస్తివీడి, తమ నివాసంబులకుఁ జేర తత్తరమున,
ఆ గజేంద్రుఁడు మివుల ధైర్యంబునూని, పోరె వేయి వత్సరము లా మొసలితోడ.

ఆ. స్థాన బలముచేత తతబలాన్వితమయి, మొసలియొప్పె గజము పసచెడంగ
నన్నమునకు నిద్ర కతిదూరమై డస్సి, సత్వమెల్ల పోయి సన్నగిల్లె.

శా. సంతోషమ్మును బాసి, ఆర్తిమెయి, ఉత్సాహంబుఁ గోల్పోయి, దు
ర్దాంతంబైన భయంబునొంది, స్వబల ప్రాశస్త్య ధైర్యాదులన్
చింతాకంతయు తృప్తిఁగూర్పమి, మదిన్ శ్రీనాథుఁ జింతించె శ్రీ
కాంతా! దీనశరణ్యా! ప్రోవు మని దుఃఖంబంది యీ రీతిగన్.

చం. బల ముడిగెన్, మనంబున సమాహిత ధైర్యము సన్నగిల్లె, ని
శ్చలమగు శాంతభావము భృశంబు నశించె, జయింతునన్న ఆ
శలు విడిపోయె, సాకినను జంపిన నీవె మహానుభావ! భ
క్తుల కడు బ్రోచినావట! అకుంఠిత సత్కరుణాపయోనిధీ.

క. ఏ దిక్కు లేనివారలు, నీ దిక్కై కొల్చిరేని నెటిఁ బ్రోతువటే
ఏ దిక్కు లేదు నాకిట, నీదిక్కే నమ్మినాఁడ నే! ప్రోవవయా.

మ. సుదతుల్ లెక్కకు మిక్కుటంబయి ననున్ సొంపొప్పగా చుట్టె ను
న్మదమొప్పన్ ధరపై చరించునెడ, దేవా! నేఁడు యీ శత్రు వి
ట్లుదితానూన పరాక్రమమ్మున కనద్యుద్ధమ్ముఁ గావించుచో
అదయన్ వన్ విడిపోయి రిట్టివె కదా! ఆయాయిసంబంధముల్.

కం. ఋణ సంబంధులు సతులును, తనయులు పశువులును గేహ ధన ధాన్యంబుల్
ఋణ మది తీఱన్ వోవును, ధన ధాన్యాదికము వాని తలపఁగ నేలా?

ఉ. ఎవ్వఁడు నిర్మలాత్ముఁడయి, యీ యిహవస్తువులందు భ్రాంతి దా
దవ్వులవీడి, నిన్ను శతథా స్మరికించి భజించి కొల్చునో?
అవ్వర భక్తుఁడొందు శుభ, మయ్యతఁడే చరితార్థుఁ డాతఁడే
నెవ్వగలెల్ల పాయగ హరీ! నినుజేరు నొగీ! కృతార్థుఁడై.

ఆ. దిక్కులేకయున్న దేవుఁడే దిక్కను, సామెతగ భజింతు స్వామి! నిన్ను
ఘోరమైన మొసలి బారి నొందిన నన్ను, బ్రోవవయ్య! దేవ! కావవయ్య!

క. అని నిర్మలచిత్తుండగుచు, కనక కమలమొకటి బట్టి కరమున దానిన్
మనమున నర్పించుచు నొగి, ఘనముగ సరసిజనేత్రు పూజఁ గావించె తృటిన్.

వ. మఱియు బహిరంతరింద్రియముల నిగ్రహించి నిర్మలంబగు నంతరంగంబున ఆపత్పరిహారంబు నెంచుచు హృదయాన్ సుస్థిరన్ భగవంతున్ స్తోత్రంబుఁగావించి అర్చించిన అప్పరమేశ్వరుండగు విష్ణుభట్టారకుండు అత్యంతాప్తుండయి వచ్చి ప్రసన్నుండై.

మ. నిజచక్రాయుధ ధారచే మకరమున్ నిర్మూలముంజేసి, అ
గ్గజరాజున్ శరణాగతున్ మనిచె, నిక్కంబైన ప్రేమమ్మునన్
భజనల్ చేసెడివారిఁ బ్రోచుననుచు దివ్యద్భద్ర కీర్తి ప్రభా
విజయోత్సాహ పరంపరాక్రమిత దోర్విఖ్యాత సంభావ్యుఁడై.

వ. పార్వతీ! ఇగ్గజేంద్రుని పూర్వజన్మ కథనంబు వినవలసినది. వర్ణింతు న్వినుమని శంభుం డిట్లనియె. తొల్లి.

సీ. పాండ్యదేశమునకు పతిగ ఇంద్రద్యుమ్నుఁ, డొకట తపముసేయుచుండు వేళ
ధ్యాననిష్ఠుండగు తాపసప్రభు సన్నిధి, కరుదెంచ అర్థిమై యగస్త్యుఁ
డదిగాన కర్ఘ్యపాద్యము లీయనట్టి రా,జునుగాంచి అమ్ముని కినిసి పలికె
తప మను మదమున ధర్మంబు తప్పి ప్ర,త్యుత్థాన మీవు నా కిద్ద తేజ

ఆ. నకును కాన మదమునను విపినంబులఁ, దిరుగు మొక్క గజము కరణి ననియె;
అంత రాజు తెలిసి, అతి భీతితో శాప,ముక్తి నేఁడ, కరుణ ముని వచించె.

క. నక్రము నినుఁపట్టిన హరిఁ, చక్రధరుని నీవు తలఁప చయ్యన అతి దో
ర్విక్రమము మెఱయ అతఁడు, చక్రముచే మకరి ద్రుంచి జను నినుఁ బ్రోచున్.

ఆ. అతఁడే గజేంద్రుఁ డయ్యె పార్వతి! విను, పూర్వ కొలంకునందు అడఁగియున్న
నక్రకథను వినుమ! నయమున తొల్లి ఆ, ప్రాంతమున సరోవరంబు గలదు.

క. ఆ దివ్య సరోవరమున, ప్రోదిన్ హూహూ యనెడు విభుఁడు గంధర్వుం
డాదరమున నప్సరసల, తో దైనందినము స్నాన ధూర్వహుఁడగుచున్.

వ. జలక్రీడాలోలుండై యొక్కట.

సీ. అఘ మర్షణస్నాన మాచరింపఁగ వచ్చి, నట్టి దేవలుఁడను అవనిసురుని
చూచి కారడమున జొచ్చి నీరమ్ముల, దాఁగి యవ్విప్రు పాదములు పట్టి
లాగిన, నమ్ముని లావు భీతిలి చూచి, గంధర్వు నెఱిఁగి ఉగ్రంబు గాఁగ
శాపాయుధుండయి సహనంబు విడనాడి, మొసలి పోలిక నీట మునిగి నన్ను

గీ. పట్టిలాగితి వటువొలె పరఁగ ఈ స,రోవరంబున మకరంపు రూపుదాల్చి
యుండుమని శాప మీయఁగా గుండె లదర, పాదములఁ బడి,అతఁడను బ్రాహ్మణునకు.

క. మునివర ! మదమున నియ్యెడ, కనుగానక నీకు దోసఁగు కావించితి; నన్
కనికరమున బ్రోవవె ఇ,ప్పని యిఁక సేయుదునె? యెన్ని భవములనైనన్.

వ. శాపముక్తి చేకూర్చుమని ప్రార్థించిన ఆ బ్రాహ్మణుండు.

క. కరుణాకరుఁడై నీ వాక, కరిరాజు న్నొడిసిపట్టఁగా అతఁడా శ్రీ
హరిఁగూర్చి మ్రొక్కు; ఆ హరి, కరమరుదుగ నిన్ను మోక్షగామిన్ జేయున్.

వ. అనె.

ఆ. ఇవ్విధమున వార లిరువురు పూర్వ శా,పమునుండి ప్రోవఁబడిరి విష్ణు
మూర్తివలన; వారి మూర్తులు ధరఁపడ, వారిలోకములకు వారు చనిరి.

క. గరుడుఁడు ప్రార్థింపగ శ్రీ,హరి కరి నక్రములు పడిన యట్టి తనువులన్
గరిమ నొసగంగ అతఁడు, సరగున నవ్వానిగొని విశంకట వృత్తిన్.

ఆ. పోవఁజూచుచున్న భ్రాభంగుఁడను గృధ్ర, రాజు తత్కళేబరముల కడకు
రాఁగ వానిఁజంపి వేగ నాతని ఒక్క, కాల వీని ఒక్క కాలఁ పట్టి.

మ. అతివేగమ్మున నవ్విహాయసమునం దాహ్లాద మేపార పో
వు తరిన్ యోచనచేసె, ఏ యెడ అగున్ భోసేయఁగా వీని; ఉ
ద్ధతి క్షీరార్ణవమందు భాసిలు కనద్ధన్యంబు జాంబూనద
క్షితిజంబొప్పు నటంచు నెమ్మదిని కాంక్షించెన్ సముత్సాహియై.

క. నిడుపును వెడలుపు వేయా,మడలు గలిగినట్టి యది శుభంబగు దృఢమౌ
ఎడ అగునని తృప్తిని గరు,డుఁడు సువిశాలంబగుచు, కదున్ తగుశాఖన్.

చం. నిలిచి భుజింపఁ చూచునెడ నిష్ఠమెయిన్ తగ నందు వాలఖి
ల్యులు ఋషిసంతతుల్ ఘను లలుబ్ధులు షష్టిసహస్రసంఖ్య ని
శ్చల తపమౌ విశాల తరుశాఖకు వ్రేలుచు చేయుచుండఁగా
బలువపు డెచ్చుటన్ విఱిగె, ఘట్టున అయ్యది కాంచి అతఁడున్.

గీ. కటకటా ! మునిశాపము కలుగునేమొ? అనుచు శంకించి తచ్ఛాఖ అంతలోన
తనదు తుండమునన్ పట్టి అనుపమాన, వేగమున ఆకసమునకు వేడ్క నెగసె.

చం. చనిచని చోటుఁగానక, విశంకటవృత్తిని తండ్రి కశ్యపుం
గని, తిన మంచితావు కనఁగా అసమర్థుఁడనైతి; ఎచ్చటన్
తినతగు తావుగల్గు ? నన ధీయుతుఁ డాతఁడు పల్కు : లంక యో
జన శత సంఖ్య దక్షిణదిశన్ గల సంద్రముదాఁట నొప్పెడున్.

క. ఆ లంకయందు శుద్ధ వి,శాలంబగు భూమి గలదు ! చయ్యన చని నీ
వీ లొప్పుగ భుజియింపుము, జాలంబేలా ? బుభుక్షు శాంతిన్ కనుమా !

చ. అనుచు వచింప ఆ గరుడుఁ డట్టులె చేయుదు నంచు తండ్రి మ
న్ననమెయి పంపఁ ఏఁగి, త్వరలో కనె లంక ముదంబుమీఱ, ఎ
త్తిన తన ఱెక్కలన్ దృఢగతిన్ తరు శాఖను కీలుకొల్పి వా
నిని భుజియింపసాగెను ముని ప్రవరుల్ ముదమంది మెచ్చఁగన్.

గీ. ఆ సమయమున రాలినయట్టి యెమ్ము, లెల్ల మూఁడు శృంగములయి యుల్లసిల్లె
పిదప అవి త్రికూటములను పేరుగనియె, గరుడుఁ డా శాఖ నొగి శిఖాగ్రముల నిలిపె.

ఆ. ఇట్లు గరుడుఁ డధిక తృప్తియై చనె విష్ణు, సేవ; కచట మునులు చింతలేక
తపము లాచరించి తరువాత నారాయ,ణుని పదంబు నొంది రనఘు లగుటఁ.

క. ఆ శృంగంబుల కొనలం, దా శాఖయు పాచివట్టి అయ్యెన్ శిలగా
ఓ శాంభవి ! లంకాగ్నికి, ఆ శిఖరములెల్ల కరఁగి అగు లోహంబుల్.

అ. ఆ త్రికూట పర్వతాగ్ర శిఖరములు, స్వర్ణ రజత లోహ సంజ్ఞనొందె
స్వర్ణ శిఖరజ ప్రవాహము ల్లంక నం,తటిని హేమమయము త్రుటిని చేయు.

వ. అందువలననె లంక స్వర్ణపట్టణంబని పేరొందె అపుడు.

ఆ. దాని చూచి చకితుఁడైన అంజని సూతి, జానకిఁ కని సన్నిధానమునకు
తత్క్షణంబె వచ్చి తనియుచు గుండియ, దిటవు గాఁగ మివుల తృప్తినొంది.

గీ. తల్లి ! యీఘోరరాక్షసులెల్ల నీకు, ఏమి యపకారమొనరింతురో మఱేమొ ?
ముందుసంగతియేమొ ? నాభుజములపయిఁ, తాల్చినిను రామునిన్ చేర్చెదనుక్షణమున.

ఆ. నీ యనుజ్ఞయైన నిన్ను భద్రంబుగా, మోచికొని రయమున శ్రీచరిత్రు
రామచంద్రు పాద రాజీవసన్నిధిఁ, చేర్తునమ్మ నిన్ను; సెలవొసంగు !

చం. అను పవనాత్మజాతు వచనాళికి సీత ముదంబునంది, ఓ
వనచర ! నీకట్టులె ధ్రువంబుగ నీ వొనరింప నేర్తు; వై
నను రఘురాముఁ డిట్లితెరఁ డార్జనచేయు జయంబు కూర్మిమై
కొనఁ డటులౌట నీవిపుడు కోరిన కోరిక తీర్పరాదుగా.

క. ఈ ముద్రిక గొని చను మిఁక, ఏ మాత్రము తడయవలవ దేమఱకు సుమా !
నా మాటల వచియింపుము!, రామునితో మగిడి వేగ రమ్మా! యిటకున్.

మ. అని వాక్రుచ్చిన, అంజనీసుతుఁడు బ్రహ్మానందముం బొంది, భ
క్తిని తోడ్తోన ప్రదక్షిణించి, అనురక్తిన్ మ్రొక్కి భూజాతకున్
ఘనవేగంబున తత్క్షణంబ నగ శృంగం బెక్కి దోర్విక్రమం
బున నాదం బొనరించి ఉల్లసముమై, పూనెన్ ప్రయాణోద్ధతిన్.

సీ. అంతలో బ్రహ్మ ఆ ఆంజనేయుఁడు లంక,యందు చేసిన పను లన్నియును వి
వరముగ ఒక లేఖ వ్రాసి మారుతి కిచ్చి, శ్రీరామునకు ఇది చేరుపు మన
అది గొని హనుమంతుఁ డజునకు మ్రొక్కి ఆ,యన చేత ఆశీస్సు లంది మిపుల
ఆయన యుత్తరు వంది భీకరముగ, ఆర్చుచు గగనంబునందు నెగసి

గీ. గంతులో నుత్తరంపు సాగరపు తటము, చేరి నే నింత పని చుల్క చేసితి నని
కొంత గర్వంబు మది నూని అంత అచట, నిల్వ మునినాథుఁడొకఁడు కన్పించె కడక.

## శ్రీరాముఁడు మునిరూపముతో ఆంజనేయుని గర్వ మడఁచుట

వ. అమ్మునీంద్రుం గనుం గొని అంజనీ సూనుండు.

ఆ. ఓ మునీంద్ర ! నేను రామకార్య దురంధ,రుండ, డప్పియయె, నెరుంగ బల్కు
మేడ ? మంచినీర మెలమిమై దొఱకునో ? అనిన కపటదండి అతనిఁ జూచి.

ఉ. ఆ మునినాథుఁ డక్కపి కులాభరణాభునితోడ, నీర మా
యా మెయి నున్నదంచు, నటు లాయత సంజ్ఞ నొనర్ప, వాఁడు శ్రీ
రాముని ముద్రికన్, మఱి కరంబగు సీత మణిన్, విరించి తా
నా మెయి వ్రాసియిచ్చిన సుధాక్షరలేఖను చాల భద్రతన్.

గీ. ముని యెదుటఁ బెట్టి యట నీరములను గ్రోల, నా సరోవరమున కేగ నంత నొక్క
క్షుద్రకపి వచ్చి శ్రీరామ ముద్రికను ము,నీశుని కమండలంబున వేసిపోయె.

ఉ. మారుతి వచ్చి యమ్మణిని, పత్రముఁ గైకొని, రామ ముద్రికన్
గూరిచి, మౌని చంద్రుని నకుంఠిత భక్తిని ప్రశ్న సేయగా
ఆరయుమా ! కమండలము నందని యాతఁడు సంజ్ఞసేయ, వే
యారులు రామముద్రికల నక్కపి కాంచె కమండలంబునన్.

ఉ. అక్కట! బాపురే! భళిరె ! అన్నియు ముద్రికలే కనుంబడెన్
ఎక్కడనుండి వచ్చె? నిటు లిన్ని; చమత్కృతి ! యంచు నమ్మునిన్
నెక్కొను వేడ్కఁ బ్రశ్నయిడ, నెందఱు సీతలఁ గాంచి వచ్చిరో
అక్కపులెల్ల తెచ్చినవి యంగుళి ముద్రలటంచు పల్కుచున్.

ద్వి. అందు నీ ముద్రికయైన దెయ్యదియొ? క్రందుగ గుర్తించి కైకొనవయ్య!
అని పల్క కపి కడు నాశ్చర్యమంది, అను; రాము లెందఱీ యవనిని కల్గి
రో? మునిచంద్రమా! ఓ మహనీయ! రాముఁ డొక్కఁడె కాక! రాములు కలరె?
అనిన మారుతికి అయ్యతి పల్కె నీవు, కనుము లెక్కిడి ముద్రికల నెన్ని కలవొ?
అందఱు రాము లీ అంబుధిఁ దాటి, అందఱ నీ రాక్షసాళిఁ జంపి రొగి
అందఱ కపివరు లా లంక కేగి, ఇందు వైచిరి తెచ్చి ఈ ముద్రికలను
ఎఱుఁగఁ జాలక వార లేగి రయ్యెడల, ఎఱిఁగిన నీయది యెలమిఁ కొమ్మనిన
అత్యంతముగ కపి ఆశ్చర్యమంది, సత్యంబుగా లెక్క సల్ప జాలకయ
తన ముద్రిక యిది యగా తప్పదటంచు, అనువుగా నిర్ధారణను చేయలేక
ఎన్ని పర్యాయము లెన్ని ముద్రికలొ? అన్నిటి లెక్కిడ అన్నియే మివుల
అది కని విసివి అయ్యంజనీసుతుఁడు, మదిగల గర్వంబు మాని ఇట్లనియె.

క. నావంటివారు పెక్కురు, లా వానరు లీవలఱకె రయంబునఁ జని సీ
తా వృత్తాంతము రామున, కై వినిపించిరి మఱెంత అగుదును నేనుౘ.

క. వారందరు ముద్రికలౘ, ఈరీతిని విడచి చనిరి; ఏ నెట్టుల నీ
శ్రీరామముద్రికను కొని, చేరుదు; నిది చేయరాని చెయిద మటంచుౘ.

గీ. ముద్రికను వీడి అమ్మౌని మ్రోల మ్రొక్కి, గర్వమున నేనె కపికులాగ్రణి నటంచు
విఱ్ఱవీగితి నిందాక వెకలి నగుచు, నాదు గర్వంబు సర్వంబు నాశమయ్యె.

గీ. నాకిదు మనుజ్ఞ! ఏగెద నాకయి అట, వేచియున్నారు సహచరు ల్విసువునొంది
ప్రాణములఁ బాయుదురు, మున్నె ప్రాణములను, బాయఁ జూచిరి; అని ఆజ్ఞవడసి హనుమ.

సీ. ప్రాయోపవేశ దివ్యవ్రతంబున నున్న, అంగదాది కపుల అటకువచ్చి
చేరె; నాతనికని వారంద అధిక స, మ్మోదము కనిరి సముత్కటముగ
ప్రేమచే సంతసంబొమెయి నుప్పొంగ, గా పరస్పరమును గాఢలీల
ఆలింగనంబుల నాచరించి హనూమ, చెప్పగా; నంతయు సీతవృత్త

గీ. మా సముద్రలంఖనమున నైనకథలు, అచట లంకలో జరిగిన అట్టి కథల
ఆలకించుచు మిన్నంది నట్టి ముదము, తోడ శ్రీరాము సన్నిధిం గూడఁ జనిరి.

వ. చనుచు తన్మధ్యంబున మితిమీఱిన ఆనందాతిరేకమున.

సీ. దారిలో సుగ్రీవు కూరిమి మధువనం, బునుడాసి పరవశమున చెలంగు
అక్కోఁతులెల్లను అంగదు తోడుత, ఆవన తరులెల్ల హతముచేసి
తేనియలం ద్రావి పూని అడ్డమువచ్చి, నట్టి ఆ దధిముఖు నదరఁగొట్టి
ఇదియేమిరా? మీర లిటుచేఁతురా! భువి, మనవాండ్రె మనతోట మంటగలుప

గీ. వచ్చునా? నన్ను యెఱుఁగని వారి వలెనె, కొట్టితిరె! ఎంతహద్దు లేనట్టిలయ్యో
చూడు మీకిప్పుడే చావుమూఁడు నట్లు, చేతునని ఇనసుతునితో చెప్పనేగ.

గీ. అతఁడు సుగ్రీవు మేనమామా; నతండు, పోయి సుగ్రీవునకు పడిపోయినట్లు
ఎల్ల వృత్తాంత మెఱిఁగింప నుల్లసిల్లి, కార్య విజయం బతఁడు సరిగా గ్రహించి.

వ. మఱియు వాని కిట్టులనియె.

క. పోనీ! వారల నడ్డకు, మా! నేను స్వయంబుగా వివాదము నెఱుఁగం
గా నేరుతు వారలు శుభ, మానితులగుదు రిట వేగఁ బంపగవలయున్.

వ. అని వచియింప నతని యోచన సాగనందులకు నివ్వెఱఁజెంది.

గీ. అతఁడు చనె; అంత వారలు అతిరయమున, వేడ్క సుగ్రీవు నాజ్ఞను విని దొఱఁకొ
వాయుపుత్రుని వెన్నంటి వచ్చిరెలమి, వారిఁ గని వానరములు రవములు సేయ.

## శ్రీరాముఁడు సీతావృత్తాంతము విని హనుమంతుని సన్మానించుట

సీ. శ్రీరామచంద్రునిఁ జేరి వారలు మ్రొక్కి, కపులెల్ల నిలచిరి క్రమముమీఱఁ
అంత నంజనిపుత్రుఁ డతి కృతార్థతఁదోప, బ్రహ్మ పత్రంబును మణిని భక్తి
శ్రీరామచంద్రునిఁ జేర్చి వార్త లెఱుంగఁగా దెల్ప మృదుల వాగ్జాల ఘణితి
నాదరమ్మున రాముఁ డాంజనేయుని, మెచ్చి, ఆలకించియును బ్రహ్మ తను వ్రాసి

గీ. నట్టి పత్రంబు వలన, నయ్యనిల సుతుని, చేష్టలెల్ల యెఱింగి ఆ శ్రీరఘూత్త
ముండు నానంద పారవశ్యం డగుచును, అట్టి యాలింగనము చేసి అనియె నిట్లు.

సీ. వాయునందన! నీకు ప్రత్యుపకారంబు, నెఱుఁగ నిబ్బువిని యే నింతయైన
అత్యంత దుర్లభంబైన నా యాలింగనం బెంతవారికి సంభవించు?
అది దుర్లభంబు నీకబ్బె నియ్యెడ కాన, మిపుల నాభక్తుల మేటి వీవ!
అనుచు సమ్మానించె అంబికా! ఎవ్వాని, పాదారవిందంపు భక్తి యుక్తి

గీ. నొక్క తులసీదళం బుంచు నుచితరీతి, అట్టివానికి బ్రహ్మలోకాప్తి పరమ
పదనివాసంబు కల్గఁగా, వాఁడె మెచ్చి, కౌగలించు నాతని కేమి కల్గునో? కద!

క. ఆ మారుతి భాగ్యంబును, ఆ మారుతి ధన్యతయు నహా! జగదంబా!
ఆ మారుతి పుణ్యము నే,నేమని పొగడం గలాఁడ హీనప్రజ్ఞ.

గీ. ఏ మహాత్ముని గూర్చి వేలేండ్లు తపము, చేసినను దర్శనంబేని చేకురదొకో?
మానులకు; అట్టి శ్రీపతి మానితముగ, కౌఁగలించుట అతని భాగ్యంబు కాదె!

గీ. ఇంద్రుడాదిగ దేవత లెంతయేని, ఎవని కరుణకు వేచెద రెంతొ భక్తి
నట్టి శ్రీరామచంద్రు డయ్యాంజనేయుఁ, గౌఁగలించుట యతని భాగ్యంబు కాదె!!

వ. అంత నమ్మారుతి.

ఉ. పండిన పుణ్యపుంజమొ, శుభంబుగ పూచిన పారిజాతమో
నిండి తటంబులెల్ల ప్రవహించెడు గాంగఝురంబొ, యన్నటుల్
పండిమనంబు; మారుతి గబాలున ముద్రిక జ్ఞప్తివచ్చి రా
ముండెటు వల్కునో ? యని ప్రభూత భయాఖిల కంపితాంగుఁడై.

క. కడు వెఱచుచు మారుతి గడ,గడ వడఁకుచు రామచంద్ర! కనుఁగొనక నె
క్కుడు నాచరించితిని మీ,యెడ నపచారంబు నేనహీన మదమునన్.

క. అని ముద్రికా కథనమును, వినిపించిన రామమూర్తి విని నవ్వుచు పా
వని ! యిదె ముద్రిక కనుమని, అనుగ్రహముసేయ మారుతాత్మజుఁడంతన్.

గీ. అద్భుత స్వాంతుఁడై రాము నఖిల ప్రజ్ఞ, కచ్చెరువు నంది భయభక్తి నమ్మహాత్ము
రాము మ్రోలఁ గడున్ శ్రద్ధ రాజిలంగ, శ్రీమహా విష్ణుఁడని సేవచేయఁదొడఁగె.

క. నాబల సంపద కెల్లన్, ప్రాబల్యం బిమ్మహాత్ము భక్తిగరిమమే
కాబట్టి గర్వ మేటికి ? యీ బహుళ పరాక్రమంబు యీతనిదె సుఁడీ.

వ. అని మనంబున వితర్కించుకొని, నిశ్చయించి.

గీ. ఆది మొదలు ఆంజనేయుఁ డహర్నిశంబు, రామచంద్రుని మహిమ దుర్వార లీల
నెఱిఁగి అనవరతంబు నహీన నిష్ఠ, రామనామజపాత్తవిస్రంభుఁడయ్యె.

వ. అంత సుగ్రీవుం డంజనీసుతుని వలన నమస్కరింపఁబడి మన్నించె నంత.

ఉ. రామునిబోలి లక్ష్మణుఁడు రమ్యముగా కడుసంతసించె, దు
ర్దామ పరాక్రముండయిన తన్మహనీయుని మారుతాత్మజున్
ప్రేమఁ గవుంగిటన్నిలిపె; ప్రీతిని కోఁతుల మూకలెల్ల శ్రీ
రాముని దాసుఁడైన కపిరాజును వాయుజుఁ గొల్చి రిమ్ములన్.

గీ. పార్వతీ! ఇట్లు మిక్కిలి భవ్యమై స,మస్తభక్తుల కోర్కెల మగిడి తీర్చు
నాంజనేయుని సుందరమైన కథను, నీకుఁ దెల్పితి తరియింప లోకమెల్ల.

క. అని వచియించిన శంకరుఁ, కని పార్వతి యెంతవినిన కనదు మనంబే
మిని తృప్తి లవము, శ్రీరా,ముని కథ తరువాత ఎట్లొ ? మొనకొని చెపుమా.

వ. అనుటయు శంకరుండిట్లు మృదుమధుర భాషాబంధురుండై వచియింపం దొడంగె.

గద్యము

ఇది బాలభారతీ వరప్రసాదలబ్ధ కవితా ధౌరేయ పండిత చిలుకూరి శ్రీరామశాస్త్రి
నామధేయ ప్రణీత శ్రీమదాంధ్రానంద రామాయణాంతర్గత
సారకాండస్థ సుందరకాండము

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# ఆనంద రామాయణము



## యుద్ధ కాండము

### ప్రథమ సర్గము

ఆంజనేయుఁడు లంక నభివర్ణించుట




రామచంద్రుఁ డంతట, మారుతిని సవిస్తరముగ మాకేర్పడ లంకా రూప వర్ణనం బొక, తూరి యొనర్పుమ! యటన్న తోడరి యతఁడనున్.

వ. దేవా! అవధరింపుమని భక్తి వినయ వినమిత గాత్రుండై ఇట్లు చెప్ప దొడంగె.

గీ. దేవ నగర విఖ్యాతి సందీపితంబు, స్వర్ణ గోపురాట్టాలక భాసితంబు
వివిధ పుష్పోపవన భవ్య విలసితంబు, లంక వర్ణింప మానవులకు తరంబె.

గీ. తేటనీటి కందకముల తేజరిలుచు, మంచి బావులు పురి మధ్యమధ్యఁ దనర
అమల మణికాంతి చిత్రగృహంబు లొప్ప, వెలయు నాత్రికూటాద్రిపై చెలఁగు లంక

సీ. పశ్చిమ ద్వారంబు పఱగ రక్షింతురు, మత్తేభ యూథాధి పతు లసురులు!
ఉత్తర ద్వారంబు నొగిఁగాతు రాశ్వికు, లర్బుదంబులుగ పదాతు లొప్ప!
తూరుపు ద్వారము తొడరి కాపాడుదు, రుత్తర ద్వారమందున్న సంఖ్య!
దక్షిణ ద్వారంబు నక్షీణ సంఖ్యల, రథికులు రక్షింతు రధిక శ్రద్ధ!

గీ. మధ్య కక్ష్యల చతురంగ బలము తనరు, నందఱును చాల మేటి శస్త్రాస్త్రధరులు
ఆ యి యెడ గుప్త దుర్గ మార్గావళులును, ఘన శతఘ్నుల నొప్పు లంకాపురమ్ము.

ఆ. ఇట్టి లంకఁజొచ్చి యీ రామదాసుఁడు, రామనామ జప పరాక్రమమున
చేసినట్టిదెల్ల చెప్పట స్వోత్కర్ష, మనక విందు రేని మనవిచేతు.

శా. లకం గాల్చితి, రావణున్ బలములో లక్షించి పాల్భాగమున్
శంకా తంకములేకఁ జంపితిని, నాశంబొప్పఁ గావించితిన్
లంకా దుర్గమ మార్గజాలముల, నుల్లాసంబు సంధిల్ల నే
నింకన్ ఘోరశతఘ్నులన్ చెఱచితిన్ నిర్ధూమధామంబుగన్,

క. స్వామీ! మీరిక౯ జనుచో, నామెయి లంకాపురంబు నత్యంతంబు౯
పామర నిలయం బగుట శి,ఖామయమై దగ్ధమౌ నఖండ ప్రభల౯

సీ. పశ్చిమంబున నొక్క పరలంకయును సువే,లాద్రియొక్కటి యుత్తరాగ్రమందు
దక్షిణంబున నేకతను నికుంభిలయును, యోగినీ వటవృక్ష మొక్కటియును
పూర్వంబునందున పౌలుపాలు లఘులంక,తప్ప తక్కినవెల్ల దగ్ధమయ్యె!
స్వర్ణ సుప్రాకార సర్వస్వముం గూల్చి, రమ్యమైన త్రికూట రత్నశిఖరి

గీ. శోభితంబైన లంక సరాభవంబు, నంది మోమున నలుపైన యట్లుకాగ
విన్నయై నామమాత్రంబు వెలయుచున్న,దింక పదుఁడు సత్వరము లంకేశుఁ దునుమ.

ఆ. లవణ సాగరంబు నవలీలదాటి యా,రావణేంద్రు జంపి రమణి సీత
చెరలఁబుచ్చిగాని చెందదు హృదయంబు, శాంతి, లెండు! లెండు! సత్వరంబ.

గీ. అనిన మారుతి మాటల కనుమతించి, శ్రీరఘూత్తముఁడపుడు సుగ్రీవుఁజూచి
నేడె విజయ ముహూర్తంబు జాడతోఁచె, సైనికుల కిమ్ముపుడ సమాజ్ఞాపనంబు.

## శ్రీరాముఁడు వానర సైన్యములతో లంకకు ప్రయాణమగుట

గీ. ఆశ్వయుజ శుక్ల శ్రవణంబు సంము దశమి, నేను బాగుగానున్నది, నిశ్చయముగ
జైత్ర యాత్రా ప్రయాణ సమాజ్ఞాపనంబు, సకల పరివారములకును సలుపుమయ్య!

క. మన గమ్యస్థానంబు ల,వణసాగర, మీా కపీంద్ర వర్గములెల్ల౯
మన సేనలకు౯ ముందును, వెనుక నుండి ప్రోనవలయు విక్రమలీల౯.

సీ. నలుఁడన్న వాఁడు కావలె మున్ను మొనకాఁడు, నీలుఁడు వెనువెన్క నిలువవలయు!
నాకిరు కెలఁకుల జోక జాగ్రత సుషే,ణుండును జాంబవంతుండు వలయు!
గజుఁడు గవాక్షుండు గవయుఁడు మైందుఁడు, వీరు విదిక్కుల వెలయవలయు!
ఇట్లు వానరసేన నెల్లఁ గాపాడుచు, ద్వివిదాదు లొగి బయల్దేరవలయు!

ఆ. నేను వెడలు దాంజనేయునిపై నంగ,దుని పయిని సుమిత్ర తనయుఁ డొప్పు
సైన్యమధ్యమందు సఖుఁడ! సుగ్రీవుఁడా! మమ్ము కూడి యుండవలయు సుమ్ము!

మ. అని యాజ్ఞాపనచేసి రాముఁడు, సుమిత్రానందసంవర్ధనుం
డును సుగ్రీవుఁడు తోడ రా వెడలె, నిండుం ధైర్యముం బూని ద
క్షిణదిక్కై; కపులెల్ల భూభృత్కృతు లక్ష్మీశైక సంభీకర
త్వ నిరూఢంబుగ, లోకమెల్లఁ గదల౯, దర్పంబు సంధిల్లగ౯.

• కపులు క్షణకాలమైనను నిలుపులేక, కరులఁ బోలి మహాసత్త్వకాయు లగుచు
కామరూపులై కడఁగిరి కదనమునకు, అంతటను శుభశకునంబు లపుడు దోప!

గీ. సహ్యామలయాది గిరులను సంక్రమించి, క్రమముగా వారు లవణ సాగరము చేరి
రాఘవాజ్ఞచే నిసుకపై రాణమీఱ; సన్నివేశంబు చేసిరి జయమెసంగ.

వ. అపుడు వారల నెల్లర సముద్రము దాటించుటకు నాలోచింపుచున్నయెడ.

### రావణుఁడు హనుమంతుని పరాక్రమమును తలంచి భయఁపడుట

ఉ. అచ్చట లంక నంజని సుతాగ్రణి చేసినయట్టి కృత్యముం
జెచ్చెరఁ గాంచి, యోచనము సల్పి, దశాననుఁ డట్టె ఖిన్నుఁడై;
వచ్చి యొకండె క్షుద్రుఁడగు వానరుఁ డక్కట! లంక కెంతయుఁన్
చిచ్చుఁ దవిల్చి, నెంత పని చేసె కటా! ఇక నేది? దిక్కగున్.

మ. వన భంగంబు నొనర్చి, సీతఁగనె, శోభాయంబుగా నొప్పు లం
కను కాల్చెన్; మడిపెన్ మరెందఱినొ? వీరన్ నా కుమారుం గటా
ఘనుఁ జంపెన్, ఒకటంచు నెట్లు తెలుపంగాఁగల్గుదున్; వాఁడు చే
యని దుర్మార్గము లేదె! ఎట్టులు ప్రహస్తా! యంచు ఖేదాత్ముఁడై.

గీ. ఇటు ప్రహస్తాది మంత్రుల నెల్లరఁ గని, మిగుల భయపడి పల్క ప్రవీణు లగుచు
రావణుని మంత్రు లెల్లరు రయము మీఱ, నిట్టులని రొప్ప నా రాక్షసేశ్వరునకు.

గీ. జంతువుల లోన నల్పమా జంతువైన, క్రోఁతియని మే ముపేక్షించు చేతఁగాక!
లేకపోయిన వాని నిందాకె యమ పు,రంపు ప్రాతకాపుగ చేతు మంపు మిపుడ.

క. మానితమగు నీ యాజ్ఞం, బూనితిమా! పదియునాల్గు భువనంబులలో
పూనిక నిక దుర్మర్కట, హీనముగా సేయమే? యహీనప్రజ్ఞన్.

మ. అని ధైర్యంబులు పల్క, రద్ది విని వ్రేగై కుంభకర్ణుండు, కూ
డని కార్యం బొనరించి తన్న! యిది జాడ్యంబొ సుమా! రాక్షసా
ళిని మాపన్, ధరణీ సుతాహరణ మీలీలన్ పౌనర్వంగ నె
వ్వని యాలోచన వింటి? వైనపని కిడ్డా? చింతలున్ వంతలున్.

వ. అయినను భయంబులేదు. రావణా!

క. నను నాజ్ఞాపన సేయుఁడు, చని రాముని లక్ష్మణుని భృశంబుగ సుగ్రీ
వుని వాని కపుల మూకల, క్షణమున బరిమార్చి వత్తు చయ్యన నిపుడే.

వ. అన విని విభీషణుండు.

చ. అనితర రీతిఁ బల్క తన యన్నను, ధైర్యముతోడ విన్న రా
వణు, సభలోని యద్దనుజవర్గముఁ గాంచి; వచించినంత మా
త్రన నెరవేరునా? పని విధానము యోజన లేక; శత్రు తా
ల్మిని మనతాల్మి చూచుకొనమేని ప్రమాదము కల్గకుండునే?

క. తెలివిగలవాఁడు తనదగు, బలమును నెదురైనవాని బలము నెఱిఁగి యా
వల సామదాన భేద,మ్ముల దండోపాయమునను పొదలుట యొప్పున్.

క. ఒక కోఁతివచ్చి మొన్నన, సకలమ్మున్ పాడుచేసి చనె, మన సైన్య
ప్రకరముల మాపి; యతి కాయ కుమారుని చంపి, యొక్కఁ డాహవమందున్.

క. మది సంతోషింపఁగ దు,ర్మదమున వచియించినట్టి రాక్షసు లెల్లన్
కదనమున రేవు శత్రుల, కెదురై పోఁజాలరని యెఱుఁగఁగ వలయున్.

గీ. గాత్ర సంతోషమునకు రాక్షసులు పల్కు, పల్కులకు మోసపోయిన భావ్యమగునె?
ఆంజనేయునివంటి వీరాధి వీరు, లెంద రున్నారొ? శత్రులయందు కనుఁడు.

ఉ. రాముఁడు ఘోర శాత్రవ విరాముఁడు యుద్ధమునందు నొక్కఁడే
భీమ పరాక్రమమ్మున ప్రవీణత కంచు రథాలవారి దు
ర్ధామ పరాక్రమక్రములఁ దాకి జయింపఁడె? ద్రుంపఁడే? బల
శ్రీ మహనీయతా గరిమఁ చింత యొనర్పక యుంట భావ్యమే?

సీ. ఈ కుంభకర్ణులు నీ మేఘనాదులు, నీ నికుంభులును తా మెందఱైన?
ఈ యతికాయులు నీ మహోదరులును, నీ రాక్షసానీక మెందఱైన!
ఈ యింద్రజిత్తులు నీ చతురంగము, లీ యతిరథులు తా మెందఱైన!
ఈ భీకరాననులీ కామ రూపులు, నీ మాయ రక్కసు లెందఱైన!

గీ. రాముని పురస్కరించుక రణమునందు, గడియసేపైన నిల్వఁగాఁ గల్గుదురని
నీవు ధృతిఁగొని యుద్ధమే కావలెనని, తలఁతువే! నంతకన్నను తప్పు కలదె?

వ. అన్నా! యథార్థంబు నీహృదయంబున యోజించుకొని.

శా. సీతాదేవిని తస్కరించి యిపుడే శ్రీరామచంద్రావనీ
నేతం గూరిచి, తప్పు సైపుమని సాన్నిధ్యంబుఁ గల్పింతువే
నాతం డాహవచండభానుఁడయినన్ ఆపన్న సంరక్షకుం
డేతన్మాత్రము చేయు మప్ప్రభుఁడు నిన్నే పార రక్షించెడిన్.

గీ. లేని యెడ కాలరుద్రుఁడు లేచివచ్చి, నిన్ను కాపాడఁదలప పోనీడు రాముఁ
డేల? రిత్త విచారము ల్చాలనూన; సీతనిచ్చి రాముని మ్రొక్కి సేమమొదవు.

క. అని హితమితోచితోక్తుల, ననుజునికి విభీషణుండు నాదర మొప్పన్
వినిచిన నప్పలుకులు హిత,మును కూర్పక పెల్లు కోపమును సమకూర్చెన్.

శా. అత్యంతంబుగ మండి రావణుఁడు క్రూరా! వైరిపక్షావలం
బీ! త్యాజ్యుండవు నీవు, నిన్ను ననుజాప్తిన్ చూడఁగాఁబోల దే

సత్యాలాపినటంచు దుర్మదమునన్ శత్రుస్వరూపుండవై
అత్యంతంబును నాదు మేల్దలప వీ వావంతయున్ దుర్మతీ!

గీ. నీవు తమ్ముఁడవై పుట్టినావు కాని, శత్రుఁడవు చుమ్ము! తెలిసెను చాల నొకట
రెంట నిక లెమ్ము నాప్రోల నుంటివేని, నీకు తగు శాస్తిచేతు ఛీ! ఛీ! కళంక!

గీ. మఱి యొకం డిట్లు నాప్రోల పలికి యింక, ప్రాణములతోడ నిలచునే? పాపకర్మ!
నీవు నా సోదరుండ వైనావు కాన, బ్రదికి పోతివి ఛీ! నీదు బ్రదుకు బ్రదుకె?

గీ. రాక్షసకులాధమా! అని రావణుండు, తూలనాడ విభీషణుం డోలి తనదు
మంత్రు లాప్తుల నల్వుర మగిడి కూడి, రామసన్నిధానము కోరి రమణ వెడలె!

## విభీషణ శరణాగతి – విభీషణునికి లంకారాజ్య పట్టాభిషేకము

మ. రఘునాథుండు కృపాకరుండయి యఖర్వంబైన ప్రేమంబునన్
అఘరాశిం దుదముట్టఁజేసి, కపు లత్యంతానుమానంబుచే
త ఘనంబా నొక పట్టుపట్టినను, యాథార్థ్యంబు చితించి, శ్రీ
రఘు వంశీయుల శీలమేర్పడ, కనద్రక్షోవిభుం బ్రోచెతాన్.

క. కరుణించె రాఘవుఁడు భా,స్కర వంశీయుల యశంబు సార్థకముగ నే
రరి తమ్ముని శరణాగతు, పరిరక్షణచేతు రిట్టి పద్ధతి గలదే?

గీ. ఆంజనేయునిచే నముద్రావసథము, నం దిసుకచేత లంక నాయత్తపఱచి
యవ్విభీషణునకును పట్టాభిషేక,మునుఁ బొనర్చెంచె వానరులును చెలంగ.

వ. అట్లొనర్చించి శ్రీరాముఁడు విభీషణుం గనుంగొని చిఱునవ్వొలయ నాతని కిట్లనియె.

గీ. నేను రావణు నిర్జించి నీకు లంక, నిచ్చుదాక నీ లంక నీకిచ్చినాఁడ!
ఇయ్యది ప్రసిద్ధమగుత! నహీన ఫణితి, నాంజనేయుని కృతమాట నాదరమున.

మ. హనుమల్లంక సముద్రతీరమున నవ్యంబై సతీ! నేటికిం
గన నొప్పారు విచిత్రమై; జగతి భక్తవ్రాతముల్ పోయి ద
క్షిణ దిగ్యాత్ర నొనర్చుచో, శరధి నీక్షింపంగ నీ లంక యిం
పును గూర్చున్, ప్రతిభా విభాసియయి, సంపూర్ణ ప్రభావమ్మునన్.

వ. అప్పుడు కడుంగడు యోజించి.

గీ. శ్రీరఘూత్తముఁజేరి సుగ్రీవుఁ డనియె, నో రఘూత్తమ! లంకను ధారవోసి
నార లీ విభీషణునకు కోరి రావ,ణాసురుఁడె శరణముఁజెంద నతని కేది?

మ. అను సుగ్రీవునిఁగాంచి రాముఁ డను; నేలా? మీకు సందేహముల్
ఘన లంకాపురి వీని కిచ్చితిని; శంకంబొంద మీకేల? రా

వణుఁడే నా శరణంబుఁ గోరిన లసత్ప్రిజ్ఞామతిన్ నా యమో
ఘ్యనె దత్తంబొనరించువాఁడ! కులమున్ ధర్మంబు ధన్యంబుగన్.

మ. అని యీ రీతిని రామచంద్రుఁ డనివార్యంబైన ధైర్యంబు, ధ
ర్మ నిరూఢింగని, పూని పల్కిన, జగత్కళ్యాణుఁడౌ రామచం
ద్రుని కళ్యాణ గుణామృతంబు మదికెంతో సంతసం బీయ, భ
క్తిని చేమోడ్చిరి వానరోత్తములు; సంతృప్తానుమానాత్ములై.

వ. మఱియు వా రెల్లరు న్విభీషణునితో మనసువిప్పి సంచరించుచున్నంత.

## రావణుఁడు సుగ్రీవునితో చేసిన సంధానము చెడిపోవుట

గీ. రావణుఁడు శుకు నొకని సుగ్రీవు కడకు, రాయబారమ్ము పంపె కఱంబు మీఱ
నాతఁ డా కపిరాజును నాకసమున, నుండి కాంచి యిట్లను తన గుండె లదుర.

గీ. రావణుని రాయబారిని! రయముమీఱ, నొక్క సందేశముం దెచ్చియుంటి నీకు
వానరేశ్వర! విశ్వాసపరత వినుము! శ్రద్ధమెయి రావణుం డిదమిద్ధమనియె.

ఉ. శ్రీరఘురాము భార్యను హరించితి నేను నిజంబెకాని; దు
ర్వైరము నీకు నాకు తగవా? కపిరాజ! యశంబుమీఱ దు
ర్వార పరాక్రమంబున దురం బొనరించిన నేరు గెల్తురో?
యేరు జయింపరో? యెఱుఁగ నేరితరంబు? తలంపు కూరిమిన్.

గీ. మాకు మీకును బాల్యాది మైత్రియుంట, ఇంతమాత్రపు పనికి నీ వితరులకు స
హాయమొనరింపఁతగునె? మీ యన్న మాకు, పరమ మిత్రుండు నీవది యెఱుఁగవొక్కొ?

ద్వి. అని పల్క వానరు లా శుకుఁబట్టి, ఘనముగా సంకెళ్ళ కాల్చేయిఁ గట్టి
శ్రీరామ సన్నిధిఁ జేర్చి రాతనిని, శ్రీరాముఁ డచట సుగ్రీవాంజనేయ
వీర కపీంద్రుల వేడుక సభను, ధీర విభీషణస్థితిఁ గూరుచుండె
అనుజు లక్ష్మణుఁ గాంచి యనియె నివ్విధిని, అనితరైకాంత దివ్యావాహితమున.

వ. అంత సముద్రఘోషం బతి తరంబైయున్న.

గీ. రామభద్రుఁడు విసివిన క్రమము తోప, వామహస్తాన వారించె వారిధి రొద
పార్వతీ! ఇప్పటికిఁగూడ పఱగ నచట, సంద్రఘోషము లేదు నిశ్చయము! చుమ్ము!

గీ. కడవరాని యీ వారిధిఁ గడుచుటెట్లు? లంక చేరినఁగద! దైత్యు పొంకమడఁప
అంతులేని సాగరుఁడు రవ్వంతయేని, మనకు సాయము సేయఁడే మాన్యబుద్ధి!

మ. అనుచున్ దర్భశయానుఁడై రఘువరుం డత్యంత చింతా భర
మ్మున ప్రాయోపనివేశమున్ సలిపి, సొంపుబాసి, ఔరా! సమా

ద్రుని కేం తాగడ మయ్యె! మూఁడు దినముల్ ప్రోద్యత్క్షమాబుద్ధి ప్రా
ర్థనఁ గావించిన సుప్రసన్నుఁ డవఁడే? దారేనియుం జూపఁడే.

ఆ. కపుల కొంతనుందిఁ గట్టుకవచ్చె నీ,నరుని లెక్కయేమి? దరిశనంబు
చేయ నేను బోదునే? యని తలఁచె కా,బోలు నింక సైపఁబోల దితని.

గీ. లక్ష్మణా! తెమ్ము! ధనువిక లక్ష్యమేమి?, ఈ సముద్రుంను శోషింప నీక్షణమున
చేసి, చెల్లాచెదరు గాఁగఁ, జేసి ఇపుడ, కపుల నిశ్శంక నడపింతు కడలియందు.

శరణాగతుఁడైన సముద్రుని శ్రీరాముఁ డనుగ్రహించుట

క. అని యాగ్రహించి వేగమ, ధనువుం గొని బాణమును యథావిధిగాఁ గై
కొనినంత వార్ధి గజ్జన, వణఁకిపోయి కలకఁబారి పరిమిత మయ్యెన్.

క. దిక్కులు చీఁకటిఁ గ్రమ్మెన్, నెక్కొను మత్స్యంబులెల్ల నెఱి తపియించెన్
గ్రక్కున భూమి కదలె స,మ్యక్కోపముతోడ రాముఁడటు చలియింపన్.

గీ. అపుడు సాగరరాజు దివ్యమగు రూప,ధారియై వచ్చె, మించు రత్నములు తెచ్చి
రామునకు కానుకనిచ్చి దీర్ఘముగ సాఁగి,మ్రొక్కి దీనుఁడై ప్రార్థించె నుకుఁదక్కి

క. రామా! నీ దర్శన శో,భా మాన్యుఁడ నగుట పొంగిపడితినిఁ గానీ
పామరత గర్వమతినై, యీమెయిఁ పొంగుటయ కాదు; యేనార్తుండన్.

క. కరుణింపుమయ్య! కరుణా, భరణా! అభయం బొసంగుమా! లంక కిదే
తెరువిత్తు! నీదు భక్తుఁడ! మఱిమఱి దాసుఁడ! క్షమింపుమా! తప్పయ్యెన్.

మ. అని ప్రార్థించిన, నాదు బాణ మెపుడున్ వ్యర్థంబు కారాదు! యెం
దున వైతున్ వచియింపుమన్న కని, పాథోరాశి యన్, ఉత్తరం
బున నద్దే! ద్రుమకల్ప; మందుఁగల రంభోజాక్షు! పాపాత్ము; లం
దున నీ బాణము వైవగాఁ దగు నన్న్, తోన్ రాముఁ డట్లేసినన్.

గీ. బాణము ప్రయోగముంజేయ పఱఁగి యద్ది, యా ప్రదేశము నిర్మూలమైన వెనుక
మగుడి శ్రీరాముపొదిఁ జేరి మాన్యమయ్యె! రామచంద్రుఁడు మిపుల హర్షమువహింప.

ఆ. అపుడు సాగరుఁడు ప్రియంబున రఘునాథ! నీదు నాన కడ్డులేదు కాని
మీరు వారిధిని ప్రవీణతఁ దాటఁగా, నొక్క యుక్తి కలదు ఊహసేయు.

ఉ. ఈ నలనామకుం డగు కపీంద్రుఁడు పుత్రుఁడు విశ్వకర్మకున్;
వీని పరాక్రమం బసదు! వీనికి ప్రజ్ఞ యొకంపు కల్గు, నెం
తేనియు వీఁడువైవ శిలలెప్పుడు మున్గవు నీటిలోన, రా
మా! నలునిన్ లగించి యిట వారధిఁగట్టి తరించి పొం డికన్.

క. అనిన శ్రీరాముఁడు వార్ధినిఁ గని నలుఁడేయ శిలలు తేలు టదేలా?
అని ప్రశ్నవైవ సాగరుఁ, డను భక్తిని రామునకు నిజార్థము తెలియన్.

క. ఈతఁడు బాల్యంబున వి,ఖ్యాతుండగు నొక్క మౌని అతి నైష్ఠికుఁడ
య్యాతని సాల గ్రామము, లాతురతంబొంద నీరమందున వైచెన్.

ఆ. కోఁతి చేష్టకోలఁది నీతండు వాటిని, నీటఁ బాఱవైచె పాటవమున
బ్రాహ్మణుండు వీని పాఱవైచిన శిల, మునుఁగకుండుఁగాత! మనియె నీట.

క. అది యిపుడు వరముగానై, నది మీ యెడఁ గాన వీని నలునివలన నో
ప్పిదముగ సేతువుఁ గట్టుడు, విదితమ్ముగ శిలలచేత విశ్రుత కీర్తిన్.

వ. అని విన్నవించి సరిత్పతి యంతర్ధానమ్మునందె పిదప.

ఉ. శ్రీరఘురాముఁ డంత నట సేతువు బంధన కుద్యమించి సాం
పార నలుం గనుంగొని సమాజ్ఞ నొసంగె, తదీయ కార్య వి
స్తార మవిఘ్న పూర్తి వెలుచన్ గలుగన్ పొరి విఘ్ననాయకుం
జేరి ప్రతిష్ఠచేసి మదిఁ జెందిన తొందఱ కందలింపగన్.

మ. నవపాషాణములన్ నవగ్రహ సమర్చా సిద్ధికై నిల్ప జే
సె వెసన్ అన్నలుచేత; నంతట ప్రతిష్ఠింపన్ శుభోదర్క మౌ
శివలింగమ్ముల వాయుపుత్రు ననిపెన్ శ్రీవారణాసీ పతిన్
శివుఁ బ్రార్థించి రయంబుమీఱ నవితే శీఘ్రోస్ముహూర్తంబునన్.

వ. ఒక ముహూర్తంబులోననే ఉఱికి పోయి, నీవు కాశీశు వలన ప్రభావయుతము
లైన రెండు లింగములఁ దెమ్మట్లుఁ గాక, యున్న కాల మతిక్రమించు న్నిజముగ.

హనుమంతుఁడు శివలింగములఁ దెచ్చుటకై కాశికి వెడలుట

వ. పొమ్మనిన, వాయుసుతుఁడు క్షణమ్ము లోన, వారణాసికి వచ్చె పార్వతి! యతండు
వచ్చి నాకు నమస్కార మచ్చుగా నొ,నర్చి రామకార్యము చెప్పె! నర్మరీతి.

చ. అదివిని నేను సంతసిలి, యంజని సూతికి రెండు లింగముల్
సదమలరీతి నప్పుడ యొసంగి కపీ! బహుకాలమయ్యె! యా
మ్య దిశకు వత్తునంచు పరమాదర బుద్ధి నగస్త్యమౌని కిం
పొదవ వచించి; రాముని సముక్తిని నేడిదె వత్తు తప్పకన్.

వ. అని వచియింప.

చ. అది విని పావమాని ఎపు? డమ్మునినాథునితోడ నేల? యా
మ్య దిశకు వత్తుమంచు తమరంటిరి? నాకెఱిఁగింపుఁడన్న, చె
ప్పెద! విను మంచు పూర్వకథ పెంపెసలాఱఁగ నిట్లు చెప్పినా
నది విను మీవు! నేడు, జగదంబ! పవిత్ర చరిత్ర మిమ్ములన్.

## వింధ్యుని గర్వభంగమునకై అగస్త్యుని దక్షిణ దిగ్గమనము

సీ. ఒకనాడు నారదుండు డొయ్యన నర్మదా, నదిలోన భక్తి సుస్నాతుఁడగుచు
ఎల్లఱకెల్ల యభీష్టంబు లిచ్చు నోం,కారేశ్వరునికి నింపార మ్రొక్కి!
సంసార సంతాప సంహారకంబైన, రేవానదీ తటిం బ్రీతిచెలఁగి
స్థావర జంగమ స్వారూప్యముల వసుం,ధరకున్నతంపు సౌందర్య మిడెడి

గీ. కీర్తిమతి వింధ్యరాజు వీక్షింప నతఁడు, భక్తి నెదురేగి సత్కార భావమొప్ప
తనదు మందిరమునకు రమ్మనుచు పిలచి, తీసికొని పోవనేగి యాతిథ్యముఁగొని.

గీ. మివుల సుఖమునఁగడు విశ్రమించు టెఱిఁగి, వింధ్యరాజు వినీతుఁడై విన్నవించె
నో మునీంద్ర! నీపదధూళి యొలయుకతన, నాదు పాపపుంజములు ప్రణాశమయ్యె!

గీ. నీదుదర్శన మాపదోన్మీలనంబు! నీదు స్పర్శన మజ్ఞాన నిష్క్రమణము!
నీదు వాగమృతంబు పునీత! మఱయు, నేడు సుదినంబు! మీ సుధాస్నేహాకలన.

వ. మఱియు.

శా. నా పుణ్యంబు ఫలించె, నా కులములోనన్ మాన్యతం గంటి, దే
వా! పుణ్యాత్ముల రాక రిత్తయగునే? భవ్యప్రభావంబునన్
నే పాల్గొంటి, నటంచుఁ బల్క; మునియున్ నిట్టూర్చె! నద్దానికై
యా పెన్గొండలగండ వింధ్యుఁడను, నయ్యా! యేల నిట్టూర్పుటల్.

క. నాకెంత సంతసంబో, మీకంతటి దుఃఖమున్న విధ మేర్పడె మీ
రీ కరణిని నిట్టూర్పఁగ, నేకారణ? మేల? వంతయేర్పడె? మీకున్.

క. మీవంత కేమి కారణ;మో! వల్కఁడు నిముష మాత్రమున నది పాతున్
నావంటి శిష్యుఁ డుండం,గా వందురనేల? మీకు; కాల్కడఁబంపై.

చ. వెనుకటివారు మేరువును పెద్దగ బిల్తురు కాని, నన్ను పో
లునె? ధరణీధరత్వమున; లుబ్ధుఁడు కాడె? హిమాచలుండు, గా
రిని గన నామె శంకరు వరించుటఁ జేసియె పెద్ద కాని, తాఁ
గనునెటు రాజనామము! ప్రగల్భముగాక! మునీంద్రచంద్రమా!

వ. ఇక నమ్మేరుపర్వతమో!

క. బంగారు నిండి యున్నను, చెంగట రత్నంబు లున్న, ఛీ! మేరువయా?
ఖంగారు! దేవ నిలయుం,బుం గాగా నేమి? భూమి మోయునె నాతో.

ఉ. అన్యములైన పర్వత సహస్రము లున్నవి భూమియందు, సా
మాన్యమె! పెద్దలైన బుధ మాన్యత నందుట నాకుఁబోలె, స
మ్మాన్య చరిత్ర! మీహృదయ మధ్యగ దుఃఖ చరిత్రఁ దెల్పినన్
ధన్యుఁడనై యొనర్తు; నది తప్పక దీర్తు; ముదంబుఁ గూర్తుఁగా.

సీ. ఉదయశైలము కేవల దయా ప్రపాత్రము!, మందేహ శైలము మందబుద్ధి!
నిషధ పర్వత మెన్న నిజము నిరోషధి!, అస్తాద్రికన్న తేజాప్తిసున్న!
నీలాద్రి పర్వత నియతి నల్లని బండ!, మందర మన్ననో మందదృష్టి!
మలయ ధరమ్ము పాములపుట్ట! యగుగాదె? రైవత మెపుడు నిర్ధనము! సతము?

గీ. హేమకూట త్రికూటముల్ హెచ్చె కాని, ఎందునకు సాటిరావు మహీతలమున!
క్రౌంచ కిష్కింధ సహ్యాద్రి ఘన శిఖరులు, భూమి భారము నాతోడ మ్రోయఁగలవె?

క. నాసాటి భూధరము దే,వా! సర్వ జగంబులందుఁ బలుకం బడునే
మీ సంకోచం బిక నే,దో? సయ్యనఁ దెలుపుఁ డిపుడ! తోడ్తోఁ దీర్థుఁ.

క. అని విఱ్ఱవీగి యను విం,ధ్యుని మాటల వినిన నారదుండు మనమునఁ
గనె వీఁడు గర్వమదమును, కనుఁగొందుఁ గర్వభంగ కారణ మెఁందుఁ.

గీ. శిఖర దర్శనమాత్రనే శ్రేయములిడి, ముక్తినిచ్చెడు శ్రీశైలమును మొదలగు
శ్రేష్ఠపర్వతముల మహచ్ఛ్రీ నెఱుంగ, కేల? వాగు నీ రీతి వింధ్యేశుఁడనుచు.

వ. మఱియు మనంబున నమ్మునీంద్రుం డిట్లు తలపోసె.

చ. మహిమ నడంచు, తోడి తనవారలఁ జుల్కనసేయు, వైరముల్
బహుళముసేయు, నిద్ది దలపందగు నియ్యది కూడదన్న మా
టహహా! నసింపజేయు, పరమార్థము డుల్చు, నిజంబు గర్వ మే
ఇహము పరంబు బాపు, నది యెంతటి వారలకైన దుఃఖమా.

వ. అని యవ్వింధ్యుం గనుంగొని యిట్లనియె.

గీ. గిరులగూర్చి నీ విప్పుడు గరిమ మీఱ, సల్పినట్టి భాషణము నిశ్చయమ! కాని
నిన్నుఁగూర్చి మేరువు చాల విన్న భావ, మొందుచున్నది కాన నిట్టూర్చినాఁడ!

క. మా కేమి చింతలుండును, మీకుఁ గలుగు సౌఖ్య దుఃఖ మిశ్రణముల నా
లోకింపఁగ మా కేర్పడుఁ, గాక! మాకు చింతకలదె? కనుఁగొన వింధ్యా.

క. నీ వింత సంబరంపడ, నా వడువున నతఁడు నిన్ను నవలీలగ చూ
చే వార్త నీకుఁ దెలుపుటె, నా వంటికి సంకటము వినా! వేరున్నే?

క. అని పల్కి నీకు మేలగు, నని యాశీర్వచన మిడి విహాయసమార్గ
మ్మున నేగె; నంత వింధ్యుం,డును దుఃఖము రోష మెసఁగుచుఁ గ్రుద్ధుండై.

సీ. ఈ మేరునగమున కింత గొప్పతనంబ, దెబ్బంగిఁ గలిగెనో? యెఱిఁగి కొందు!
గ్రహములతోడ నక్షత్రాది గణముతో, సూర్యుండు తనచుట్టు చుట్టివచ్చు
నిత్యం బటంచు వినిశ్చయించియె యగుఁ, గాబోలు! యికఁ జూతు నా బలంబు
కనుఁగొనుఁగాత! మేరునగంబు పో! యని, గగనంబు పొడవున తెగ నెదుగుచు

ఆ. పెరిఁగి పెరిఁగి సూర్యవర మార్గమునకు ని,రోధ మొనరఁగల్గ బ్రువ్వఁబెరిఁగి
స్వస్థచిత్తమూని సంపూర్ణ సుఖముండె, మేరువునకు కినిసి భూరి వింధ్య.

వ. ఇట్లప్పర్వతంబు రెండువేల రెండువందల రెండుయోజనముల పర్యంతంబు పొడిగి
యుండ రవి కిరణవ్యాప్తి లేక.

సీ. పశ్చిమ దక్షిణ పార్శ్వ ్వగుల్ నిద్రా వి,ముద్రితులై బేలుపోయి రెల్ల!
పూర్వోత్తరంబులఁ బొలుపారు వారలు, సంతాప తప్తులై సన్నగిలిరి!
కాల నిర్ణయములు కానరాకుండుటచే, హవ్య కవ్యములెల్ల నస్తమించె!
యజ్ఞ యాగాదుల యాలోచనములె లేవమ్యో! దేవతలు రిక్తాశు లగుచు;

గీ. బ్రహ్మ వచనంబు నెఱిఁగి యప్పర్వ తేశు, గురు నగస్త్యుని కాశికాపురినివాసు
సతత శివపూజనారతు సన్నుతించి, కాళ్ళ వ్రేళ్ళఁ బడుచు దిక్కు గమ్మటన్న.

వ. నమ్మునీంద్రుండు

గీ. విడువ జాలక కాశీశు విశ్వనాథు, నతఁడు చింతా కులుండయి యడరుచున్న
నతనిఁగాంచి విపన్న దేవతలఁ గాంచి, కరుణ మొదఁగ్రాల నంటె! నగస్త్య తోడ.

ఉ. ఓ మునిచంద్ర! నీవరిగి యుక్తిగ నాతని సౌమ్యుఁజేసి త
త్సీమనె యుండు; మేనును వసింపఁగ తద్దిశఁ జేరువాఁడ శ్రీ
రాముని పిల్వునా; అవసరంబుగ: నాదు వియోగముండ దీ
బాము తొలంగి లోకములు పల్మరు నిన్ను నుతింతు రెంతయున్.

మ. అని పుత్తెంచితి, నయ్యగస్త్య మునియున్ హర్షంబునన్ పోయె, పా
వన చారిత్రుఁడు సద్గురుం డతఁడు లోపాముద్రతోఁ గూడ, వ
చ్చెను ధన్యుండ నటంచు వింధ్యగిరి, విస్తీర్ణంబుగా సాఁగి మ్రొ
క్కి నమస్కారము చేసె నమ్మునికి, దిగ్వీథుల్ కళల్వొందగన్.

వ. ఇట్లతండు సాఁగిమ్రొక్కిన.

గీ. ఓయి ప్రియశిష్య! మే మిప్పుడొక్క పనిగ, దక్షిణపు దిశఁ జనుచుంటి మీాక్షణంబ!
తిరిగి వచ్చునంతకు నీవు తిరము గాఁగ, నిటులనే యుండు మేము జనితిమి! యిపుడ.

ఆ. మేము మగుడి వచ్చి, యీామెయి ననుటకు, కారణంబుఁ దెల్పఁగలము కాని
యాజ్ఞ మీాఱెదవా? ప్రియంబగు శిష్యుండ, వింతకన్న మిన్న లెవరు? నాకు.

క. నీవంటి శిష్యవర్గము, లేవారికి కలరు? మివుల నిద్ధ చరిత్రుల్!
నావంటి వారె ధన్యులు, శ్రీవిలసిత మత్సమాజ్ఞ చెల్లింతు గదా!

ఆ. అనుచు మౌని దండకాటవికిం జేరి, నాదు రాక కెదురు బ్రోదిఁ గాంచు
చున్నవాఁడు మౌనిసన్నుతిఁ బడయుఁగా, వేగ వత్తునంటి విమలచరిత!

క. పండ్రెండేండ్లకు నొకపరి, తీండ్రించి నగప్రభుంపు దివ్యగురుండౌ
తండ్రి! చను దెంచు వాఁడని, వేండ్రముగాఁజూచి మఱి భువిన్ పడియుండున్.

గీ. ఇప్పటికి నాతని విధంబు తప్పదయ్యె, మాని రాఁడాతఁ డా స్థితి మానలేడు
ఆమునీంద్రుని కోఱకు శ్రీరాము నాజ్ఞ, వచ్చుచున్నాను పదవయ్య వాయుపుత్ర!

వ. అప్పటి నుండియున్ మఱల.

గీ. అరుణ కిరణ ప్రచారంబు లవధరించె, లోకమంతయు సుఖమొంది వ్యాకులంబు
బాసె, నని చెప్పి మారుతిఁ బనిచి నాఁడ, పార్వతీ! యీ కథను విన భద్రమగును.

మ. త్వరగన్ మారుతి రెండు లింగముల మోదంబొప్ప చేఁబూని, యం
బరవీథిన్ గరువంబుమీఱ వెడలెన్ పక్షీంద్రు చందాన; నా
డ! రఘుశ్రేష్ఠుఁడు వానరోత్తముల తోడన్, దాటిపోనుండె చె
చ్చెర నేనన్న ముహూర్త, మింతకును విచ్చేనోపఁ డాతం డొగిన్.

గీ. ఒక్క క్షణమేని తడయుట యొప్పదిపుడు, తథ్యమైన ముహూర్తంబు తప్పిపోవు
కావునన్ సైకతమున లింగంబుచేసి, నేప్రతిష్ఠింతునని చేసె నియమనిష్ఠ.

గీ. మునివరులు పరివేష్టింప మోదమలఱ, సలిపె సైకతలింగ సంస్థాపనమ్ము!
కౌస్థుభమ్మును స్మరియించి కంఠమందు, దాల్చి తద్భవ విభవ సంతాన మొప్ప.

క. ఇచ్ఛా మాత్ర వినిర్మిత, స్వచ్ఛోద్భవ ధనకనక ప్రశస్త పరికర
ప్రచ్ఛన్న మణి వికాస స,ముచ్ఛోభితముగ ప్రతిష్ఠమున్ సలిపె త్రుటిన్.

గీ. మణి సముద్భూతమైన సమస్త వస్తు, సంతతులతోడ మునులను సత్కరించి
ఇష్ట మృష్టాన్న తృప్తుల నెలమిచేసి, వారి యశీర్వచనము లవ్వారి వడసె.

శా. ఆమౌనీంద్రులు రాము మన్ననల కత్యంతంబు సంతృప్తులై
రామున్ సద్గుణ జాలమున్ వినయ విస్రంభంబులం దల్చుచున్
వే మార్గంబులఁ బట్టి పోవునెడ వ్యాప్తిన్ గాంచి యువ్వాయుజుం
డో మౌన్యోత్తములార! యెచ్చటివి? మీ యుద్వేల సత్కారముల్.

మ. అని ప్రశ్నించిన, వారు రాముఁడు మహాఖ్యాతిన్ సముద్రంబు బం
ధనఁ గావించుచు సేతుమూలమున విస్తారంపు సత్కార రా
జిని తృప్తించి శివప్రతిష్ఠ సలిపెన్ శ్రీ మీఱ, మేమమ్మహా
త్ముని నిష్ఠే విడి వచ్చువారమని యుద్యోగించి వాక్కిచ్చినన్.

ఉ. వీర కపీంద్రుఁ డుగ్రుఁడయి, వెంగలినైతిని; తీవ్ర వేగ వి
స్ఫారజవంబునన్ పరవశంబునుఁజెంది, శివున్ వరాణసిం
జేరి, కడున్ శ్రమం బిటులఁజెంది గడించితి రెండు లింగముల్
వీరిడిఁగాక! రాముఁడు ప్రవీణుఁడె? యిట్టుల సేయ నా యెడన్.

మ. నను వంచించె! నిజంబు! రాఘవుఁడు; వ్యర్థంబయ్యె నా కష్ట మీ
తని కే మాత్రము తోపదాయె? నని హార్దంబైన కోపంబునుం
గని, యాకాశమునుండి భూమికి సముగ్ర క్రోధుఁడై దుమ్కి నే
లను తన్నెన్, తన రెండు పాదములతో తచ్ఛిన్నము ల్గల్గగన్.

గీ. ఇట్లు వచ్చిన కపివీరుఁ డింపుఁగనక, రాముని౦జూచి యిపుడెకా! రామ! నీదు
రమణివార్తఁదెచ్చితి!లంక రాక్షసులమ, హావ్యాగ్రముఖములనుండి ఆహూతుఁడఁ గాక.

శా. ఆ మేలైన దలంప వైతివి కదా! అన్యాయముం జేయ నే
లా? మేలౌ ననుఁ బంపకుండిననె, చాల్చా లైచ్చితిన్ రెండు నిం
డా మాన్యంబగు శంభులింగము లికెట్టా! యంచు గర్వోద్ధతిన్
రాముంగూర్చి వచింప, నిట్లనియె శ్రీరాముండు గంభీరుఁడై.

గీ. కపికులోత్తమ! నీదు వాక్యము యథార్థ, మింతయున్ సందియంబు లే దిందులోన
మీఱిన ముహూర్త మది పనిమీద వడునె? అని ప్రతిష్ఠించినాఁడ నియ్యది తడయక.

శా. ఏనం జింతిల నేల? నీ విపుడు ముఖ్యంబొప్పగా యెంతో దూ
రానం గల్గిన వానిఁ దెచ్చితి, యథార్థం బేము మన్నింతు, మి
ద్దానిన్ సైకత లింగముం బెఱికి, మీదన్ వీని సంస్థాపనన్
పూనన్ జెల్లు నటన్న, సంతసము సొంపుం గూర్ప నక్కోఁతియున్.

గీ. అటులె యని యాంజనేయుఁ డత్యంత మోద,మానసుండయి సైకతానూన లింగ
మునకు తన తోకచుట్టి బిఱ్ఱున బిగించి, లాగఁగాఁజొచ్చె తన మేటి లావు మెఱయ.

మ. పలుమారూఁచి, బిగించిలాగి నను, భాస్వల్లింగ మొక్కింతయున్
చలనంబుం గనదయ్యె! మొండితనముం జాలా వెసంబూని బి
ట్టలుకన్ మారుతి లాఁగ, వాలము సునాయాసంబుగా తున్కలై
పెలుచన్ గూలె నతండు మూర్ఛిలి; కపుల్ భీతిల్లి వేమూఁగఁగన్.

చ. తదుపరి నాంజనేయుఁడు హిత ప్రకరంబులు సేదఁ దేర్ప, మే
ల్కని దవుల, రాముఁజేరి మివులన్ అపరాధిని నేను మీ యెడన్
బ్రదుకుసటుల్ పొనర్చినను బాముల వెట్టి హరించినన్ దయా
సదన! త్వదీయభార, మనిశంబు భజింతు మిమున్ హృదిస్థలిన్.

వ. అని నమస్కరించి గర్వంబు సర్వం బుడిఁగిన.

సీ. క్షమియించి రాఘవేశ్వరుఁ డాదరమ్ముమీఱ, కపికులోత్తమ! యింత కమల నేల?
ఇది సికతాలింగ మిద్దాని కుత్తరం,బున నీదు విశ్వనాథుని ప్రతిష్ఠ
సేయు మాతనిఁగొల్చియే యీ మదీయ ప్ర,తిష్ఠిత లింగంబు నిష్ఠ మీఱ
భక్తులు కొల్తు రీ పద్ధతి తప్పిన,వారల పూజ నిష్ఫలము చుమ్ము!

గీ. అనుచు మారుతికిచ్చె నయ్యాలఘు వరము, దాన వాయుసుతుండు సంతసమునంది
విశ్వనాథ లింగమును పవిత్ర లీల, ధీధితులు మీఱ నతఁడు ప్రతిష్ఠచేసె.

వ. అంత నంజనీసుతుం గనుంగొని శ్రీరాముం డిట్టులనియె.

గీ. నా కొఱకు నీవుతెచ్చిన శ్రీకరమగు, లింగమును పూజనమ్ములు లేకయుండ
విశ్వనాథాలయముననే విడువు మద్ది, ముందొకట నేను దాని నింపుగ గ్రహింతు.

గీ. దానినింగూడ నేనె సంస్థాపనమ్ము, సేతుకాలాంతరమ్మున సేమ మొదవ
నన్న శ్రీరామునాజ్ఞ నయ్యంజనీ సు, తుండు స్థాపించె విశ్వనాథుని ముదమున.

గీ. రాముని యనుజ్ఞ నంజనీప్రభవుఁ డచట, తోఁక తెగి పదములు భువిలోకి దిగఁగ
ఇప్పటికిఁ గూడ దర్శన మిచ్చుచుండు, భక్తజనులకు శాంభవీ! పవన సుతుఁడు!

ఉ. అచ్చట నిప్పుడుం జెలగు నంజనిసంభవు తీర్థముల్ సము
ద్యచ్చతురంబుగా రఘుకులాంబుధిచంద్రుని రామతీర్థముల్
పొచ్చెముఁబోని లక్ష్మణ సముత్కట తీర్థము నందనంద త
త్సచ్చరితార్థ లందఱి యథార్థ విలాసము లున్న వింతకున్.

గీ. సేతు మాధవుం డనఁబడి శ్రీరఘూత్త, ముం డిపుడుకూడ కన్పట్టు మోక్షదుఁడయి
వాయుజుని తోఁక యొరవడి వలన గల్గు, గుర్తు లిపుడు సైకత లింగమూర్తిఁ గలవు

ఉ. అంతట రామచంద్రుఁ డనిలాత్మజు వాలము సంస్పృశింపగా
శాంతి వహించి తచ్ఛ్రమము, చయ్యన వాలమ దెప్పటట్లు కా
నెంతయొ? శ్రీరఘూత్తము నహీననిజప్రతిభాప్రభావముం
జింతయొనర్చి నాడుగ భజించె, నచంచల చిత్తవృత్తుఁడై.

గీ. పార్వతీ! నేను పిమ్మట పరమమైన, సైకతపు లింగమున నుండి సంభవించి
రామునకు శివలింగ విస్రంభమాణ, మహిమ నిట్లు వచించితి విహిత రీతి.

## శివుఁడు శ్రీరామునికి లింగోత్పత్తిని వివరించుట

సీ. ఒకనాడు నేను భిక్షుకుఁడనై సప్తర్షి, యాశ్రమమ్ముల ప్రక్క కగ్రజన్మ
వేషుండనై యేగ విధివశమ్మున వారి, భార్యలు కడు మోహ పరవశలయి
భర్తలు మొదలుగా వారించినను వెంటఁ, బడి చనుదెంచిరి; పట్టరాని
కోపమ్ముచేత వా రీ పురుషుం డెవం, డనియు విచారింప కాతురమున

గీ. మిమ్ము మోహింపఁ జేసిన యమ్మనుజుని, లింగమది భువిఁ బడునని పొంగివచ్చు
కోప మాపంగలేక నెక్కుడగు పట్టు, దలను శపియించి రమ్మునీశులు కడంగి.

శా. అంత న్నా నిజలింగ మూడిపడె నాద్యంతంబు భూమిస్థలిన్
అంతర్ధానము నందితేను; మునిపత్న్యనీకముల్ సిగ్గునన్

చింతాక్రాంత మనస్కులై చేని రొగిన్ స్వీయాశ్రమ ప్రాభవ
ప్రాంతంబుల్ గుఱియించి; యంతట విపర్యాసంబు దీపింపగన్.

వ. మదీయ లింగంబు నభోతిక్రమణంబై వృద్ధిం బొందసాగె, నద్దిగని పంకజసంభవుం డద్దానిం గుఱించి మహాదేవుండగు శంకరునికి నాకు నివేదింప, దానిం బెరుఁగకుండ పడద్రోయ నాత్రిశూలం బిచ్చితి. అపు డతండు స్వామీ! అది నావలనం గాఁదగినది గాదు. తామె యొనర్పం దగుదురని ననుం బ్రార్థింప నే నద్దానిం బ్రవిమలలీల పండ్రెండు భాగంబులు కావించితి. నాటినుండియె పండ్రెండు జ్యోతిర్లింగము లుద్భవించె నవియె, ఓంకారలింగము, సోమనాథలింగము, త్ర్యంబకలింగము, మల్లికార్జున లింగము, నాగేశలింగము, వైద్యనాథలింగము, విశ్వేశ్వరలింగము, కేదారేశ్వర లింగము, మహాకాళేశ్వరలింగము, భీమేశ్వరలింగము, ఘుసృణేశ్వరలింగము, గంధ మాదనలింగంబులను నామంబుల నర్చ్యావతారంబులై బఱఁగె.

## శివరామాగస్త్య సమావేశము - రామేశ్వరమహిమ

సీ. ఆ గంధమాదనం బనియెడు లింగంబు, మేరు నగమునకు చేరువయయి
యీశాన్య దిగ్భాగ మెవరికిఁ గనరాని, యొకపున చిరకాలముండె నంత
ప్రళయ పాతమ్ముచే పరగ నమ్మేరువు, గంధమాదనలింగ గరిమతోడ
నిచ్చట వడియె! నియ్యది నీదు సైకత, లింగంబునకు సమీపాంగమగుచు

గీ. నలరు నీశాన్య దిగ్భాగమందు కలదు!, దీని నిందాక నెవ్వరుం దెలియ రిపుఘ్న!
కపులతోఁగూడి నీవె సౌఖ్యమ్ముమీఱ, ప్రథమ సందర్శనముచేసి వఱలినావు.

క. నీవిచ్చట సైకతమున్, శ్రీవిలసితముగ ప్రతిష్ఠ చేసితి కనుకన్
కావించు శుభము భక్తుల, కే వెఱవుననైన నసుఖ మొనయదు భూమిన్.

సీ. ఈ గంధమాదనం బెంత తేజాప్తిమై, నున్నదో? యంతగా నొందుగాత!
నీవు ప్రతిష్ఠముఁ గావించినట్టి యీ, రామేశలింగము ప్రాభవముగ
పండ్రెండ్రవదియగు భవ్య జ్యోతిర్లింగ, మని నీదు రామేశుఁ గణుతిసేతు
రిక మీఁదఁగూడ మహిన్ పూజనాదులు, దీనికే జరుగు ననూనముగను

గీ. రామచంద్ర! నీ మాటపై శ్రీమహితుఁడు, శ్రీ అగస్త్యునికోర్కి కాశిని త్యజించి
నే డిచటికి వచ్చితిని సన్నియ మనిష్ఠ, నింపుమీఱ నీ రామలింగేశు చేర.

గీ. ఎవఁడు ప్రణమించు రామలింగేశుభక్తి, వాఁడు బ్రహ్మహత్యాది పాపముల వాయు
నాదు మణికర్ణికాసుతీర్థమ్ముఁ దెచ్చి, నన్ను భక్తులు పూజించు టెన్న ఘనము.

వ. అంతకుమించిన సర్వఫల ప్రదంబగు కార్యంబు గలదే?

క. అని చెప్పగ నో పార్వతి! విని శ్రీరాముఁడు మహా ప్రవిమల ముదమునన్
తన యాజ్ఞగాఁగ నిట్టుల, ననిమెన్ మహిమా ప్రమేయ మగు పలుకులతోన్.

సీ. సేతు బంధమ్మున చెలఁగి స్నానముచేసి, రామేశ్వరేశు దర్శనముచేసి
నియమముతోడ వినిశ్చయమ్మొనరించి, సేతువ యిసుకను సేకరించి
బరిణెయం దిడుకొని వారణాసికిఁ జని, దాని త్రివేణిలోఁ దనర విడచి
గంగోదకముఁ దెచ్చి కడఁగి యీ రామేశు, నభిషేక మొనరించునట్టి ధన్యు

గీ. లెల్ల తమ పాపభారము నీ సముద్రు,నకు సమర్పించి నా తావునకును కర్మ
బంధముక్తులై వత్తు రవ్వారిగాఁగ, దీన సంశయం బిసుమంతయేని లేదు.

వ. అని శ్రీరాముఁ డనేక దివ్యాంశంబుల నుగ్గడించు నంత నచటి కగస్త్యమహర్షి అరు దెంచి నాకు నమస్కరించి శ్రీరాముని వలనఁ వందింపంబడి యిట్లనియె.

మ. చిర కాలాగతమైన మామనవి యో శ్రీరామ! నీ ప్రార్థన
స్ఫురణన్ నేటికి పండె; నేడు కడు సంపూర్ణ ప్రమోదంబునుం
బొరసెన్ చిత్తము; విశ్వనాథు తరమే పూర్వంపు జన్మంబులం
గరమార్జించిన పుణ్య సంపదల గాకన్, యీడ వీక్షించుటల్.

వ. అని వేవిధంబులం బొగడి రామచంద్రా! నే నొక లింగంబు నిచటం బ్రతిష్ఠింతునని శ్రీరామేశలింగమునకు నాగ్నేయంబున నొక లింగముం బ్రతిష్ఠించె. పిమ్మట నా లింగముం బూజించి విశ్వనాథుని రామేశుని సంస్తుతించి పురాతనంబగు గంధ మాదనముం దర్శించి న న్ననేక విధంబుల భక్తిసేసి యగస్త్యమునీంద్రుండు తన నిజాశ్రమంబునకుం జేరె. సేతువునందు రామేశుని కొకనికే దివ్యాలయంబు గలదు. ఆగ్నేయమున నగస్త్యలింగమును ఈశాన్యమున గంధమాదనము నిప్పటికిం గలవు. కాని ముల్లోకములం బ్రసిద్ధుండు రామేశ్వరుండె సుమా! అనినం దరువాతి వృత్తాంతం బెటులయ్యె? నని పరమాదరాభిముఖయైన శాంకరి ప్రశ్నింప సదాశివుం డిట్టులనియె.

ఉ. అంతట రామచంద్ర విభునాజ్ఞ నలుం డొగి సేతుబంధనం
బెంతయొ చాకచక్యమున నేర్పడసేయఁ గడంగ, గర్వితా
స్వాంతుఁడుఁగా నెఱింగి రఘువల్లభుఁ డొప్పుగ చూచుచున్నచో
చింతిలి యన్నలుం డిటు వచించు మనంబున ఖిన్నభావుఁడై.

గీ. అలల రాపిడిచేత రా ళ్లవిసి నిలువ,కున్నవో! రామచంద్ర! నా యొప్పిద మగు
నేర[illegible]కొఱగామి దోచె; యేనేర్పు మెఱయ! సేతు నిర్మాణమగు నిక సెప్పరయ్య.

చ. అని తన గర్వభంగ మయినట్లు వచించిన, యన్నలుం గనుం
గొని రఘురాముఁ డిట్లను; నకుంఠిత భక్తిని నీవు రామ యం
చని లిఖియించి చేర్పుము రయంబున, రా లతుకున్ శ్రమంబులే
కనె, శరధిన్ క్షణంబున సుఖంబుగ బంధన సేయగల్గు దా

## శ్రీరామ నామమహిచే నలుఁడు సేతువు నిర్మించుట

క. అని పలికిన నలుఁ డట్లొ,య్యనఁ జేసి సవిస్మితాత్ముఁడయి కడు భక్తిం
గని సేతువు బంధింపం,గనె నతి త్వరితమున శోభ కడలుకొనంగన్.

సీ. మొదటి దినమ్మున పదునాలు గామడల్, మరునా డిరువది యామడలు మూఁడ
వ దినంబునను నిరువది యొక్క యామడల్, నాలవనాడు సంతసము మీఱ
ఇరువదిరెండు పెంపెసగు నామడలును, ఐదవనాడు సమ్మోద మొదవ
మిగిలిన దెల్ల నిర్మించె నైదామడల్, వెడలుపుగాగ పర్విన విశేష

గీ. రాము నవ్యాజభక్తి విస్రంభమాణ, మోద పులకాంకురుండయి బ్రోది నలుఁడు!
సంభ్రమున రాలు దేలుట! సకల కపులు, యోజనశతాబ్ధి దాటుట!యనుఁ జెలంగె.

గీ. రామ మహిమంబు కాక సంభ్రంబదేడ! శిలలు దేలుటదేడనో? సేతు బంధ
నం బదేడనో? కపులు మోదంబుమీఱ, దుర్గమంబైన లంకను ద్రొక్కుటేడ?

వ. అపుడు.

ఉ. అంజనిసూతి రాఘవుని, నంగదుఁడోలి సుమిత్ర సూతినిన్,
రంజిల మూపులంగొని, కరంబు ముదంబున ముందువోవ, తో
డం జని రక్కపీంద్రులు కడంగి రవంబులు మిన్నుముట్ట, నో
జం జయభేరి మ్రోయుగతి సర్వ కపీంద్రులు వాయువేగులై.

వ. చని తృటిమాత్రంబునన్ సముద్రం బతిక్రమించి.

## శ్రీరాముఁడు లంకకు వెడలి శుకుని విడచుట

సీ. అపుడు రాముఁడు సువేలాద్రిపై కెక్కి లం,కను దాని వైభవంబును గనుఁగొనె
సంఖ్యకు మీఱిన సర్వ కపీంద్రులు, వెనుక ముందుల తన్ను వెంబడింప
లతల వృక్షముల విలాసంబుగానున్న, యా సువేలాద్రి దివ్యవిభవమును
చిత్ర ధ్వజములు విచిత్ర సౌధములు సు,వర్ణ సుప్రాకార భాసితమయి

గీ. తోరణంబులు కల్గి నిస్తుల శతఘ్ని, తతపరిఖ తత సర్వాయుధములు వెలయు
లంకఁ గనె; మేడపైనెక్కి శంకతోప, కపుల వీక్షించు నా దశకంధరుఁ గనె.

క. కని శుకనాసుని విడిపిం,చెను రాఘవుఁ డతఁడు దైత్యుఁజేరి మివుల భ
క్తిని రామచంద్రు నెక్కుడు, వినుతించి వచించు! దైత్య విభునకు కడఁకన్.

గీ. రామునకు సీత నర్పించి రామపాద, కమలములఁబడి బ్రదుకుము క్రమ్రలీల!
నటులఁ గాకున్నచో సంశయంబు కలదె? నీవు రాముచేఁబడి నీల్గు టఱయ.

వ. అని యుపదేశింప రావణుండు కోపావేశపారవశ్యుండై శుకునిం ధిక్కరించి దూతలచే
వాని నావలకు నెట్టించి (శ్రీ)రామునిన్ నిరీక్షింపం దొడంగె.

క. మునుపు శుకుడొక్క సద్బ్రాహ్మణుఁ డాతని భార్యలీల నసురుఁ డొకఁడగ
స్త్యునికి పలలాశనం బిడఁ, గని యాతఁడు శాప మిచ్చెఁ గడఁగి యిటువలెన్.

వ. హే ! గృహమేధీ !

గీ. నీవు రాక్షసుఁడవు గమ్ము ! నిష్ఠురముగ, నీ సతి యసహ్యాకరమైన నీతిమాలి
నట్టి పనిచేసె నని పల్క నతనివలన, దైన్యముగ వేడఁబడి యథార్థంబు నెఱిఁగి.

వ. అమ్మునీంద్రుం డిట్లనియె.

క. ఇది దైత్యు మాయ పొంటెన్, గదిసె, భయం బుడుగు, మేల? గాసిల; నీ వో
ప్పిదముగ నెప్పుడు రాముని, పదభక్తిని రావణునకుఁ బలుకుదు వపుడే.

గీ. నీవు నిజరూపమందుదు; వావిరిలఁగ, నం చొగి విశాపమిచ్చె వాఁ డపుడు పూర్వ
రూపముం బొందె; వజ్రదంష్ట్రుండు రక్క,సుండు! మునిని మోసముచేసె సుండతండు.

గీ. బ్రహ్మవిత్తు వశిష్ఠుఁడు పరగ యజ్ఞ,మొకటి కావింప దేవతా నికరమెల్ల
తృప్తిని హవిస్సులం గొన దితి తనూజు,లెల్లఁ గని విరోధంబున నేవఁగొనిరి.

వ. అందువలన నిప్పని నతం డొనరించె నని వచింప, తరువాతి వృత్తాంతం బెటులయ్యె
ననిన నప్పార్వతి కప్పరమశివుం డిట్లనియె.

## అంగద రాయబారము

సీ. ఆ సువేలాద్రి యందట రామచంద్రుఁడు, కపులతో యోచించి నిపుణరీతి
శత్రువు వద్దికి సందేశ సూచన,కై యంగదుని బంప నాతఁ డొప్పు
రామాజ్ఞనంది, యా రావణు సభఁజొచ్చి, స్థిరబుద్ధితోడ నిశ్చింత మీఱ
తన వాలమును పీఠమునుగాఁగ సంధించి, ఠీవిగా కూర్చుండి చేవఁబలికె;

గీ. నీకు హితము వచింపగా నేను వచ్చి,నాఁడరా ! రావణా ! మూఁడు జాడనెఱిఁగి
నీవు వర్తింతువేని నిర్నిద్రరీతి, సౌఖ్యమగు వినరా ! దైత్య ! సరసబుద్ధి !

క. శ్రీరాముని నిక్కముగా, నారాయణుఁడని యెఱింగి నయముగ సీతా
శ్రీరమణిని కానుకయిడి, ఆ రాముని శరణుఁజొచ్చుమా ! శుభలీలన్.

ఆ. పారితోషికము లవారిగాఁ గైకొని, సీతదెచ్చి భక్తి శ్రీరఘూత్త
మునకుమ్రొక్కి యిచ్చి ముదముమై లంకాధి,పత్యమూని యిహము పరముఁగనుమ !

సీ. రాఘవ ద్వేషంబు రావణా ! వదలుము !, రాఘవుభక్తి దుర్గాంత ముక్తి !
జ్ఞాను లెవ్వాని పద శరణం బనెడు నావ, నాశ్రయించుటనె భవాంబుధి నొగి
నవలీల తరియింతు, రా రామచంద్రుని, మానవుం డనియెడు మాట నిడక
నామాట విని, వంశ నాశనంబును చేసి,కొనకుమా ! సుఖవృత్తి మను

గీ. రావణా! నన్ను బ్రతిపక్షి భావమూని, నాదు పలుకులు విపరీత మేదఁ దలఁచి
అన్యథా చెడిపోవుట యట్టిమాని, బ్రదుకుమా! కల్గి నీ యిహపరము లసుర!

క. అని వివిధ రీతులన్ రా,వణునిం గూఱిచి పవిత్ర భావమ్మున చె
ప్పిన పల్కులెల్ల వానికి, వినగ నసహ్యంబు తోఁచి వీఱిడి యగుచున్.

ఉ. ఆదశకంఠుఁ డుగ్రుఁడయి యంగదు వాక్యము లేవగించి, యా
రా! దడిపింతురా! కపివరా! నను నీవెఱుఁగంగ నేర్తువే;
నాదు పరాక్రమంబు? కరుణన్ క్షమియించినఁగాక! దేవతా
స్వేదకణంపు వెల్లువలు చెల్లవె? లోకములెల్ల నాకునై.

సీ. ఎవనిచే దేవతా నివహముల్ నిర్జింప,బడి గుండెలవియ పర్విడునో? భీతి!
ఎవనిచే కైలాస మెత్తఁగాఁబడి యాట,లాడింపఁబడెనో? చెండన్నరీతి!
ఎవనిచే లోకత్రయీ జయశ్రీ వని,తా జన్మ మఖిల సార్థకమొ? ప్రీతి!
ఎవనిచే విక్రమాహీన పరాక్రమ, క్రముల భ్రమించు సంగ్రామనీతి!

గీ ప్రథితలోక విద్రావణ రావణ ప్ర,తాప వహ్నికి నిలుచునే దగ్ధమై క్ష
ణమ్ములో భస్మమగుఁగాక! నరుని బలము, వానరుల బలమెంత నా బలము పొంత!

చ. క్షణమున రామ లక్ష్మణుల జంపుదు; నంజని పుత్రు, వాలియ
య్యనుజు నడంతు వ్రేల్మిడి, నయంబుగ లీలగ నవ్విభీషణుం
దునుముదు, నొక్క పెట్టున; సుదుర్లభమంచు చెలంగి మీ మనం
బునఁ దలపోయు వానర సమూహము గ్రింగెదనొక్క ముద్దగన్.

గీ. చూతు విప్పుడె వానరా! చోద్యమొప్ప, నా బలపరాక్రమంబుల నవ్యలీల
అనుచు నార్భాట మొనరింప నంగదుండు, యించుకయుఁ జలింపక వాని కిట్లులనియె.

ద్వి. నీ పౌరుషంబది నే నెఱుంగనిదె? వాపోయుదేల? దుర్భర వీరు పోల్కి?
తల్లి పుట్టిల్లు విస్తార వైభవము, చెల్లునే? మేనమామల్ల ముం దనగ?
బలిపాశముల కుట్టుబడె ధీరుఁడెవఁడు? చలియించె శివపాద సంస్పర్శ నెవఁడు?
కార్త వీర్యార్జును కన్న పుత్రులకు, నర్తన మృగమయి నటియించె నెవఁడు?
యింతఁ బల్కఁగ నేల? నేమొ? చెప్పెదవు! మంత నంబున నిన్ను మాయయ్య పట్టి
నామంచమునఁగట్ట నా బాల్యమందు, నా మల మూత్రాల నానిన దెవఁడు?
అని యిట్టు లంగదుఁ డనెడు వాగ్జాల, జనిత వేదనమునఁ జాలఁగా డిందు
పడి రావణుఁడు బిట్టువగచి లోలోన, తడయక గంభీరతన్ బల్కెనిట్లు.

ఉ. వీనిని మూతిపై నడఁచి వేగమ బంపుఁడు! నా సమక్షమం
దూనిన డాంభికంబా? యన నొప్పుచు ప్రేలెడు నేమొ! యేమొ! యం

చూని వచింప, వారలు నియుక్త నిశాచర నాయకాజ్ఞులై
వానరవీరు నస్త్రములవైచి, చలంబున ద్రొబ్బ జూచినన్.

సీ. అంగదుఁ డవ్వారి నందఱ తోఁకతోఁ, పడమొత్తి, రావణు వడిగఁ బట్టి
చెంపలు వాయించి, చేతుల పదముల, తోఁకతో బిగియించి తొడరికట్టి
మువ్వూరు లూఁచి తుద్రమ్ముగా భువిఁగొట్టి, కంగారు దోఁప రాక్షసులఁ పట్టి
జయ! శబ్దమెసగ ప్రాసాదంబు తలనొప్పు, వాఁడయి శ్రీరామ భద్రుఁజుట్టి

గీ. నిలచె! నయ్యంగదుని జూచి పలికె రామ,భద్రుఁడేమిది! యే లీల భయములేక
తెచ్చినావు ప్రాసాదము; తెలియవో? వి,భీషణునికి ఈ లంక అర్పితముకాదె?

చ. అది విని యంగదుండు చకితాంతరుఁడై తన నెత్తిపైన యు
న్నది యిదియంచు కాంచి, రఘునాథ! ఎఱుంగ శిరంబుపైన న
య్యది కలదంచు; యిప్పుడ రయంబున దీనిని లంకయందు చే
ర్చెద! నను సైపుమంచు విసరెన్; అది స్వస్థలమందునం బడన్.

వ. అపు డంగదుండు శ్రీరామభద్రునికి నమస్కరించి తాను లంకయం దొనర్చిన పనుల
నెల్ల సవిస్తరంబుగ వినిపించిన శ్రీరామచంద్రుం డలరి మివుల మన్నించె నంత.

గీ. రాముఁడు వినోదగరిమ దుర్ధర ధనస్సు,నం దొక సముత్తమాస్త్రంబు పొందుపఱచి
లీలగా లంకపై నేయఁ జాలఁగా ర,యంబున న్నదిపోయి శౌర్యంబు మీఱ.

ఉ. రావణు నూరు ఛత్రములు, రమ్య కిరీట దశంబు, నుగ్గు ను
గ్గై వసుధాస్థలిం బడ, రయంబున నేయఁగ; కేకవెట్టి సు
గ్రీవుఁడు, నంగదుండు వివరింప నెఱింగి ధరాతనూజనున్
రావణుఁ డింక తెచ్చి రఘురాముని కీయఁ డటంచు క్రుద్ధుఁడై.

## సుగ్రీవుఁడు రావణు కిరీటము తెచ్చుట

చ. గగనమునందు నుండి వడిగా నట లంకకుఁ జేరి, మేడపై
కెగసి, కిరీట ఛత్ర సువిహీనుని, దుఃఖితు, రాక్షసాన్వితున్
దగఁగని రావణాసురు; నెదన్ తన ముష్టికొలంది గ్రుద్ది, యొ
ప్పుగ నతనిన్ నిరాసనుని బొంపిపోవఁగ చేసె నిమ్ములన్.

ఉ. ఆ కపిరాక్షసేశ్వరుల కయ్యెడ కయ్యము పెల్లురేఁగె, బా
హాకలనంబు విస్ఫుట కరాంఘ్రి హృదూరురుఘాతపాతమై
వీఁక కపీంద్రు పోటులకు వేసరి, గాత్రము బ్రద్దలైన, న
వ్వేఁకరమున్ సహించి పరువెత్తెను దైత్యుడు, మోము వాంచ

క. రావణ కిరీటమును సు,గ్రీవుఁడు శ్రీరాము కడకు ప్రియమునఁ దెచ్చెన్
రావణునకు తనకైన మ,హా వైరము విన్నవించె నంతన్ లీలన్.

శా. శ్రీరాముం డతి సాదరంబునను సుగ్రీవున్ దృఢాలింగనా
ప్రారంభంబుల సత్కరించి యను ; నోరా ! తమ్ముఁడా యేల ? నీ
వా రక్షోవిభు వీటి కేగితివి ? నీ వావంత చింతింపకే ;
క్రూరాత్ముల్ నిను వారు కూల్చునెడ నాకున్ సీత యింకేటికిన్.

గీ. ఇట్టి సాహసం బెప్పట్లు చెట్టగాదె ?, మిత్రమా ! యని యప్పద్మమిత్ర వంశ
వర్ధనుఁడు ! రామచంద్రుఁడు ! పలికె నెలమి, నిట్టి మైత్రి లోకంబుల నెందుఁ గలదె !

వ. అంత వానర వీరులు భేరీ మృదంగాది వాద్యంబులు బోరుకొలుప లంకాద్వార చతుష్టయము ముట్టడింప నుత్సాహ తరంగితాంత రంగులై యుప్పొంగుచుండి రదిగని రావణుఁ కిరీటంబు సేనాపతియగు నంగదున కొసంగి.

గీ. అంగదుని దక్షిణ ద్వారమందు నిలువ, అనిలసుతు పశ్చిమ ద్వారమందు నిలువ
అన్నలుని నిల్వ ప్రాగ్ద్వారమందు నుత్త,రంపు వాకిట సుసేణుని నిల్వబంపె నృపతి.

క. తమ తమ సైన్యంబులతో, నమలిన విక్రమములొప్ప నాయితులై యు
ద్ధము సేయ రామభద్రుఁడు, క్రమమున నాజ్ఞాపనంబు కపుల కొసర్చెన్.

క, వారందఱు వానరు లా, శ్రీరాముని కెఱఁగి ప్రీతి చెలఁగగ సైన్యా
వారములఁ గూడి లంకా, ద్వారములను ముట్టడించి తత్పర మతులై.

క. యుద్ధమును సేయఁగడు స,న్నద్ధులరై యుండి రంత నానావిధులన్
క్రుద్ధత సుగ్రీవునిచే, నుద్ధతి చెడి రావణుండు నొక్కెడఁ గడఁకన్.

గీ. అంతి పురిఁ గూరుచుండి దురంతమైన, అల్ల సుగ్రీవు బలమున కచ్చెరువును
భీతిఁగని చింతతోడ విభిన్న ధైర్య, మానసుండయి యోచనామగ్నుఁ డయ్యె.

## రావణునికి మాల్యవంతుని సదుపదేశము

సీ. అతని మాతామహులైన మాలి సుమాలి, మాల్యవంతులు ప్రేమ మసలుకొనఁగ
తమ రావణుని విషయమున యోచనచేసి, యాతని హితమె సంప్రీతిఁ గోరు
వారలుఁ గావున చేరి కర్తవ్యంబు, నుపదేశ మొనరించు టుచిత మనుచు
అందు మూఁడవ చిన్నయగు మాల్యవంతుని, బంపఁగా నాతండు సొంపుమీఱ

గీ. సాదరంబున వచ్చి సమాదరుఁడయి, వీరుఁడగు రావణుని తోడ చేరి యిట్లు
హితము నుపదేశ మొనరింప మితముగాఁగ, బల్కు, పలుకుల ప్రేమము పుల్కరింప.

సీ. రావణా ! దౌహిత్ర ! ధీవర ! విన్నవయ్య ! నా యభిప్రాయము నయము ! హితము !
అటుపయి నీయిష్టమైనట్లు చేయుము, తెలిసి నంతకు చెప్పవలయు నందు !

శ్రీరాము పత్నియౌ సీత యీ లంకలో, కాల్పెట్టు టాదిగా కానుపించె
మిపుల నుత్పాతముల్ భీతి ప్రదమ్ములు ! నాశన హేతు ప్రకాశితములు !

గీ. గార్ధభములు గర్జించె మేఘముల పోల్కి ! మిపులనెత్తురు కురిపించె మేఘమాల !
భిన్నములు చెందె దేవతా విగ్రహములు ! ఏమని వచింతు దుశ్చర్యలేను, కొడుక !

సీ. కాళికాదేవి చక్కట నిల్చి తెల్లని, కోఱలఁజూపించె కోపదృష్టి !
అట్టహాసము చేసి బిట్టు రోదనచేసి, కదలెను దైవ విగ్రహము లకట !
ఆవు లీనెను గార్దభాకృతి పిల్లల, తారసిల్లెను సర్పతతులు గరుడు !
నెలుకలు పోరాడె చెలరేఁగి పిల్లితో, ముంగిసం దరిమె పాములె యొకటయి !

గీ. కృష్ణపింగళ వర్ణ ప్రకృతి వహించి, దారుణ భయంకరుండయి క్రూరుఁడగుచు
ధూర్త కాలుఁ డింటింటను తొంగిచూచె, ఎన్ని చెప్పుదురా ! తండ్రి ! హేయగతుల !

క. కుల రక్షణంబు సేయఁగ, తలపెట్టుము ! శాంతిచేసి; తక్షణమే అ
య్యాలివేణి సీత నిమ్మా ! చల ముడిగి రఘూత్తమునకు సంపద పొదలన్.

ఉ. సీతను సత్కరించి, వడి శ్రీరఘురామునికిన్ ధనాళితో
ప్రీతి నొసంగినన్, గలుగు విశ్రుతకీర్తి, సుఖంబు; లింక వే
ఱే తలపెట్టకే తలపు లీడ్య మహావిభవుండ వీవు, ని
ర్భీతిని స్వర్గతుల్యమగు వీటిని యేలుము; కన్నువిందుగన్.

చ. అని హితమొప్ప తాత యనునట్టి వచః పరిణద్ధ కోప వ
ర్ధనుఁడగు రావణుండు వికృతంబగు మోమునఁజూచి వాని కి
ట్లను ; కడుమంచిమాట ! ఒరుఁడైన సహింతునె ? ఇట్లు బల్క; చా
లును మరియాదగాఁ జనుము ! లుబ్ధుఁడ ! వృద్ధుఁడ ! పెక్కులేటికిన్.

గీ. బాంధవుఁడవును ముదుసలివాఁడ వౌట, బ్రదికిపోతివి కాకున్న బ్రతుకఁగలఁడె ?
నాదు మ్రోల నీరీతిగా వాదులాడి, రుద్రుఁడైనను కాలాగ్ని రుద్రుఁడైన.

క. అని ధూర్తు లాడినంతన, విని యాతఁడు, ఏలవచ్చి వీనివలన ని
ట్లనఁబడితి ననుచు చింతిలి, తన యింటికిఁ జనియె విధి యథాతథ మనుచున్.

ఉ. అప్పుడు రావణుండు సభ కాదటవచ్చి సధైర్య బుద్ధియై
చొప్పడు సైన్యరాజములఁజూచి, చలంబున నాల్గు ద్వారముల్
తప్పక కావఁగావలయు ! దద్దయు మీక జయంబుఁ గల్గు, నా
చెప్పిన చొప్పుఁ దప్పక ప్రసిద్ధిగ మీఱలు సంచరించినన్.

సీ. తూర్పు వాకిటనుండు ధూమ్రాక్షుఁ డుగ్రుఁడై, పడమట వజ్రదంష్ట్రుఁడు ;
దక్షిణంబున నరాంతకుఁడుండి కాపాడు, ఉత్తరంబునను మహా

సైన్యవర్గముఁగూడి చాతురి మీఱగా, యుద్ధముచేసి ప్రసిద్ధి గడుఱ
జయమంది నాచేత జయ బిరుదంబులు, సన్మానజాలము చాల పొంద
గీ. వలయు ననుచు నాజ్ఞాపించి వారివారి, సైన్యములతోడ నందఱ సత్కరించి
వస్త్రమాల్యాభరణముల; వరుసమీఱ, యుద్ధమున కంపె రావణుఁ డుద్ధతుఁడయి.
క. ఆ నలువురు రావణునకు, ఘూని నమస్కారములిడి పొలుపాఱంగా
సైనికులఁగూడి రణమును, బూని యొనర్పంగఁ జనిరి ప్రోద్ధతి మెఱయన్.
గీ. రామ రావణ సైన్యముల్ రమణమీఱ, చెలగి యన్యోన్య జయకాంక్ష లెలమిఁగల్గ
జయ మహానాదముల తోడ సమ్ముఖులయి, తారసిల్లిరి రెండు సంద్రముల భాతి.

# ద్వితీయ సర్గము

గీ. వినుము పార్వతీ! పిమ్మట వితత బలులు, విపులకాయులు రక్కసుల్ విచ్చలవిడి
క్రోధ సంక్రాంతులై వాటు గుదియ కత్తి, మొదలుగాఁగల ఆయుధములను బట్టి.
సీ. ద్వారమ్ములందు యథా నియమమ్ముగా, నిలిచి పోరాడగా తలఁచి ముమ్మొ
నల వాలు, గండ్రగొడ్డలి, యమ్ము, నీటె, లో,హపు ముండ్లకర్రగా నైనయట్టి
ఆయుధంబుల బట్టి అతి పరాక్రమ వృత్తి, వానర సైన్యమవ్వారి గాఁగఁ
జంప దొడంగిరి జయశాలులైన వా,నరులు చెట్లును రాళ్లు గరిమమీఱ
గీ. కొండరాళ్లను పిడికిళ్లు కొమరుమిగులు, చేతిపెళ్లె ఆయుధముల రీతిగాఁగ
గుభగుభ ధ్వానములతోడ క్రూరులైన, రాక్షసుల జంప సాఁగిరి రణములోన.
ఉ. దిక్కులు మ్రోయగా, కరులు తేరులు గుఱ్ఱములెక్కి మూకలై
రక్కసులున్ కపుల్ గడు పరస్పర యుద్ధము సేయుచుండగా
లెక్కకు మిక్కుటంబుగఁ జలించెను సైన్యము లుక్కుదక్కి, యే
చక్కినిగన్న పీనుగల సందడి మీఱె ధరాతలంబునన్.
వ. అంత.
సీ. నలుఁడు ధూమ్రాక్షుని బొలియించె నుగ్రుడై, వజ్రదంష్ట్రుని జంపె వాయుజుండు
అంగదుఁ డంపె నరాంతకు యమపురి, కా సుషేణుఁడు కూల్చె నాహవమున
నమ్మహోదరుని, మొత్తమ్మున నాల్గవ,పాలు రాక్షసులు ప్రాణాలు దక్క
లంకకై పరువెత్తి శంకా నిమగ్నులై, చత్తుమన్న భయంబు చాలఁ గనిరి
గీ. అంగదాదులు నలువురు పొంగి పొరలు, మోదమున జయ నాదముల్ పాడుకొనఁగ
తత మహావాద్యయుత మహోత్సవముతోడ, రాము సన్నిధిఁ,జేరి ప్రణామము లిడ!

ఉ. అప్పుడు మేఘనాదుఁడు రయంబున రాక్షస సైన్య మెంతయున్
తెప్పున జచ్చెనంచు గుఱితించి, చలంబు బలంబు మీఱఁగా
నప్పుడు బాణమేసి, రఘుసత్తము వానర సోదరాన్వితున్
ముప్పున ముంచె; నద్దిగని పొల్పుగ రాముఁడు ధీర చిత్తుఁడై.

క. గరుడుని స్మరింపగా న,య్యురగాస్త్రము వీడె, నంత నుత్తమశర వి
త్తరరే! తదింద్రజిత్తుఁడు, మఱలన్ బ్రహ్మాస్త్రమేసి ప్రముదితుఁ డయ్యెన్.

క. కనఁబడఁడు కంటి కించుక, ఘన బాణములన్ వెడల్చి గగనంబెల్లన్
చినుకుల విధమున, నజువర,మున దక్కగ నొకని కిటులఁ బోలునె యెందున్.

గీ. అపుడు రాముఁడు బ్రహ్మాస్త్ర విపులశక్తి, గారవించుచు నూరక కూరుచుండె
కొంతసేపంత మూర్ఛిలి వంతదోప, నేల బడియున్న కపిసైన్య నివహముఁ గని.

క. ధను విమ్ము లక్ష్మణా! యీ,క్షణమున వధియింతు రాక్షస ప్రకరమ్మున్
గన నిమ్ము! భస్మముగ, న,న్నను విని హరిజిత్తు పాఱె నాయన కడకున్.

మ. తన చెంతం గనిపించుచున్ కమలజాదత్త ప్రభావంబులన్
చనిపోకున్న విభీషణా నిలసుతుల్ సందృష్టులౌచో, రయం
బున శ్రీరాముఁడు జాంబవంతుఁ డొగి తెల్పున్ యేది యే నొక్క సా
ధన, మీ వానరులెల్ల లేచుటకు; నాతం డెట్లుఁ గానుండెనో?

వ. వేగమ పోయి కన్గొనుండన తక్షణంబ వారు చని మూర్ఛితుఁడైన భల్లూకపతిం.

ఉ. జూచి మహాత్మ! రాముఁడు, యశోవిభవున్ నినుజేరి సైన్యముల్
లేచు విధంబు యోచన మలేఖ్యతఁ జేయు మటంచుఁ బల్కె నాఁ
డీ చతురత్వ మింకొకఁ డదెట్టుల బొందఁగ నేర్చునయ్య! నీ
యోచన దెల్పి, మమ్ముల నియుక్తుల సేయుము రాముఁ జేరఁగన్.

గీ. అని వచించిన వారలఁగని కనుఁగవ, మూసియే జాంబవంతుండు మొనసి పల్కె
ఆంజనేయుఁడు కల్గఁగా నద్ది యెంత,పాటిపని దీనికై చింతపాటు తగునె?

వ. అనిన విని విభీషణుం డిట్లనియె, జాంబవంత!

గీ. అంగదాదుల విడచి యి య్యాంజనేయు, ప్రజ్ఞఁ గొనియాడి తీవు కరంబటన్న
ఆ పరాక్రమశాలి అయ్యనిలసుతుఁడు, రుద్రు నవతారమని మీ రెఱుంగుఁ డనియె!

క. తన శక్తి బాగడు పలుకుల, విని భల్లూకేశ్వరుని ప్రవీణతను, నయ
మ్మున మ్రొక్కి, యేల? పిలిచితి,నను వాయుజునన్న, నతఁడు నవ్వుచుఁబలికెన్.

గీ. అనిల సుత! నీవు క్షీరాబ్ధి కరిగి యిపుడ, ద్రోణపర్వతమును వేగ తోడితెమ్ము!
అనుచు ఆజ్ఞాపనముచేయ నాంజనేయుఁ, డపుడ వెడలె ద్రోణాద్రిదే నతి రయమున.

మ. అది గంధర్వులచేత దాఁచబడె, నయ్యద్రిఁ గనుంగొ తలం
పుదయంబైన యతండు, కామగవి దాపుంజేరి తచ్ఛేదముం
బొదువంగావలె నేత్రయుగ్మమున, కష్టంగాని తద్దర్శనం
బొదవం జాలదటం చెఱింగి హనుమానుద్యత్ ప్రతాపాఢ్యుఁడై.

ఆ. అవ్విధంబుగాను అయ్యద్రి పెకలించి, పుష్పమునకువోలె పొసఁగ నెత్తి
చయ్యనంగ రామచంద్రుని సాన్నిధ్య,మునన యుంచి మ్రొక్కె వినయగరిమ.

సీ. ఆ కొండలోఁబుట్టి నట్టి తీవలయొక్క, గంధామృతంపు నాఘ్రాణ గరిమ
రాక్షసుల్ బ్రదుకుట యక్షేమకరమని, రాక్షస శవముల రయముమీఱి
గరుడ విభీషణుల్ గని రాముని యనుజ్ఞ, క్షణములోఁ ద్రోసిరి సాగరమున
అపుడు భిషక్పతియైన సుషేణుండు, అ కొండమూలిక లఱుఁగఁదీసి

గీ. ఎల్ల కపులను బ్రతికించె నేపుమీఱ, అంత నచటి మర్కట వర్గ మంత లేచి
మిక్కిలిగ విజృంభించెను మించుశక్తి, పర్వతాకార దేహముల్ పర్వ మహిని.

వ. వాయుపుత్రుండు ద్రోణాచలంబు నెప్పటి యట్ల నున్నతావున నుంచివచ్చె. శ్రీరామా
దులు కుబేరుని యనుగ్రహంబున లబ్ధంబైన యంజన మాహాత్మ్యంబున యుద్ధమున
దాగినవారును స్థలాంతరంబున నున్నవారును ప్రత్యక్షంబున నున్నయటులఁ గన్పింప
సాఁగిరి. తదనంతరంబ రావణుండు తన మంత్రులైన అతినాదుఁడు, ప్రహస్తుఁడు
మహానాదుఁడు, నికుంభుఁడు, దేవాంతక నరాంతకులు, సారణుండు మొదలుగాఁగల
వీరులం బంప.

గీ. వారు వెవ్వేరు సైన్యము ల్వారుసమీఱ, వెంబడింపగ వచ్చి బలంబుఁ గదుర
కపులతో యుద్ధముంజేసి కడగి యంగ, దాది వీరులతోడి నిహతులయి రొగి.

ఉ. వారల జంపి వానరు లవారిత విక్రములై, మహోర్భటిం
ధీరత నిల్వ, రావణుఁడు తెంపరి కుంభనికుంభులన్ రణో
దారుల బంప వారలు యథావిధి యుద్ధముఁజేసి జాంబవ
ద్ధీరుని యంగదున్ భుజతతిం బడి స్వర్గముఁ జేరి రిమ్ములన్.

చ. అదివిని రావణుండు తన యాత్మజుఁడౌ అతికాయుఁ బంప స
మ్మదమున లక్ష్మణుం డతని మూర్ధము లంకబడన్ వధించె, న
య్యది కని క్రుద్ధుడై తన హితావళి పౌరులఁ గూడివచ్చి య
భ్యుదిత మహాగ్నికీలలు మహోగ్రత కన్నులఁ గ్రక్క నుగ్రుఁడై.

గీ. ముందుజూచి విభీషణుఁ బొంది తీవ్ర,మైన కోపంబు నపుడు శక్త్యాయుధమును
అతనిపైని బ్రయోగింప నద్ది కాంచి, లక్ష్మణుం డడ్డు వచ్చెను సూక్ష్మ బుద్ధి.

క. తన మూపున సఖుని విభీ,షణునిఁ బంధించుకొని ప్రశంసాయుతుఁడై
అని సేయుచు శక్త్యాయుధ,మున హృదయము వ్రయ్యలై ప్రమూర్ఛంబడియెన్.

క. ఆ లక్ష్మణుఁ దనయూరికి, లీలం గొంపోవ వచ్చి లేపగ నోపం
జాలక నిటునటుఁ గనుచో, నాలోపల నాంజనేయు డదికని పెలుచన్.

ఆ. రావణాసురుని యురంబున నొక గ్రుద్దు, గ్రుద్ది రాముననుజుఁ గొంచు పోయె
రావణుండు చాల రక్తంబు గ్రక్కుచు, కొంత తడవునకు రవంత తేఱె.

గీ. రథముపై నెక్కి హనుమంతు రయము మీఱ, తీవ్రబాణంబులం గొట్టి తివురుటెఱిఁగి
రామచంద్రుఁడు క్రుద్ధుఁడై రమ్యఫణితి, తీవ్ర బాణంబులన్ కసిదీర దీసి!

ఆ. రావణుని రథాశ్వరథవితానచ్ఛత్ర, రాజిఁగూల్చి మివుల యోజ నతని
స్పర్థతో కిరీట మర్ధ చంద్ర ప్రయో,గమున గూల్చె భూతలమున బడఁగ.

గీ. సారథిని జంపి హృదయము శకలములుగ, బాణమున గొట్ట రక్కసి వ్యాకులుఁడయి
చూచుచుండగ రాముఁడుఁజూచి పల్కె, ధర్మబుద్ధి ప్రకాశింప తత్పరతను.

ఆ. ఇపుడు లంక కేగి యించుక శ్రమవాసి, రేపు రమ్ము! మఱలఁ జూపువాఁడ
నా ప్రతాప మనిన సుప్రసిద్ధుని రాముఁ, జూచి వాఁడు సిగ్గు దోఁచ నంత.

వ. తల వంచినవాఁడై లంకకు న్వెడలె, నంత శ్రీరాముఁడు మూర్ఛ నొందియున్న లక్ష్మణుంజేరి ఎలుగెత్తి దుఃఖించుచు.

గీ. బంధుగుల దేశ దేశాలఁ బడయవచ్చు!, భార్యలం దేశ దేశాలఁ బడయవచ్చు!
అట్టి దేశాలలోనఁ జేపట్టనగునె! సాదరుల భ్రాతలన్ నిజ సోదరులను.

గీ. అంజనీపుత్ర! నీవు ద్రోణాద్రి తెచ్చి, సోదరుని బ్రతికింపుమా! సురచిరముగ
యీ కపీశ్వరులెల్ల అహీన బలులు, మూర్ఛనున్నారు! బ్రోవుమా! మోదమొదవ.

క. అని యాజ్ఞాపించిన నం,జని సూనుఁడు వెడలె నపుడె చయ్యన నది రా
వణుఁ డెఱిఁగి విఘ్నమొన రిం,ప నహంకృతి కాలనేమిఁ బంపె నహితుఁడై.

ఆ. రక్కసుండు వెడలి రయమున హిమశైల, పరిసరముల యందు గరిమమీఱ
ఒక తపోవనంబు నొయ్యన గల్పించి, తబిసి వేషమూని తవిలియుండె.

గీ. ఆంజనేయుఁడు వోవుచు నాశ్రమంబుఁ, గాంచి దాహోపశాంతి గావించుకొనఁగ
అందులోన బ్రవేశింప నతఁడు సంత,సించి యొక జలపాత్రఁ జూపించె నెలమి.

ఆ. నాకు తృప్తి దీనితో కాదటంచు వ,చింప కపటమూని చెప్పెనిట్లు
చేరువుననె కలదు చెఱువొండు దానిలో, కనులు మూసి ద్రావఁ గల్గు జలము.

ఉ. దానను నీకు తృప్తియగు, దాహము శాంతిలు, నాంజనేయ! నే
జ్ఞానపు దృష్టిఁ జూచితి నిజంబుగ, లక్ష్మణమూర్తి మూర్ఛతో

నూనె విముక్తి, యైనను గనుంగొను మేనొక మంత్రమిత్తు, న
ద్దాని మహత్తు చేత విదితంబగు పర్వత మేడ నున్నదో?

గీ. దాచినారు గంధర్వులు దాని నీవు, తీసికొనిపోదు విదె శ్రమం దీర్చుకొమ్ము!
లక్ష్మణుండు మూర్ఛం దెలిసె సలక్షణముగ, ఇంక తొందఱ పడియెద వేలనయ్య!

గీ. కపుల బ్రతికించు కొందువుగాని నీవు, నేను కాదనంగాని విజ్ఞానమతివి
నిన్నుగన నాకు దయంకల్గె క్రన్ననంగ, నేదందీరి యావలబొమ్ము! మోద మలఱ.

గీ. అనుచు ప్రేమాస్పదునివోలె నతండుబల్క, అట్టెజని యాంజనేయుండు హ్రదముంజేరి
కనులమూసి నీటిని ద్రావ గడంగ నపుడె, మొసలియొక్కటి యాతని మొనసి పట్టె.

ఆ. దానినోటిం బట్టి పూని మారుతి చీల్చె, నద్ది చచ్చి వెలిఁగె నంతరిక్ష
మందు దివ్యరూప మంది వందించి యిట్లనియె నాంజనేయుంగని ముదమున.

సీ. మునుపు నేనొక్కట ముని కాశ కల్పించి, భంగంబు చేసితి, సంగమంబు
నివ్వలేదను క్రుధ నివ్వటిల్లగ నతం,డీ శాపమిచ్చె నాకిద్ధ చరిత!
పాదాల పైంబడి బ్రతిమాలినంతట, మారుతీ! నీచేత మగిడి నేను
నా యథారూపమున్ నలి గాంతునని ముని, ధాన్యమాలిని నేను ధన్యచరిత!

ఆ. మునిగ వేని నీవు గనినావొ ఆతండు, రావణుండు బనుప రక్కసుండు
నిజము వచ్చె! కాలనేమి ఆతని పేరు, వాని జంపి కార్యమూని చేనుమ!

క. అనిచెప్పి పోవ నట్లే, యని యంజని సూతి కపట యతింగాంచి వడిన్
తనముష్టి ఘాతమున గొను, గొను మిదె! గురుదక్షిణ యని గ్రుద్దెన్ బెలుచన్.

సీ. ఆగ్రుద్దుతో వాండు యాక్కురు మనుచు నెత్తురుం గ్రక్కుకొనుచు మృత్యుముఖముంగనె
ననిల సుతుండు క్షీరనిధికిం జనివేగ, గంధర్వ వీరుల కదనం గూల్చి
ద్రోణపర్వతమును తోడ్తోనం గొని నభో,మార్గంబునన్ వచ్చు మధ్యమందు
దారిలో భరతు డస్త్రప్రయోగంబున, చేతిలో గిరిని గూల్చెను ధరణికి

గీ. ఆంజనేయుంపు భరతుని నమరంగాంచి, రాముండని భ్రమియించి శ్రీరామచంద్ర!
రావణుని కోడి వచ్చితివా? వెఱంగొని, అకటకట! యెంతపని యనుచు కపివరుండు.

గీ. పలుకుటను విని భరతుండు బాణ మొకటి, వేగ సంధించి వేసెను వీం డెవండో?
రాక్షసుండు గానోపునం చాక్షణమున, రాత్రి తింకను యెంతయో రాజిలెనని.

క. దానిం జూచి కపీంద్రుండు, మానసమున నితండు రామ మనుజాధిపుం డై
ల్లొ నని పూని వచించెను, నే నా శ్రీరామ దూత! నిలువుమటన్నన్.

చ. విని భరతుం డనున్ భళి! కపిప్రవరా! చెలువొందు దండకా
వనమున రాముం డాతనికి బంటువు నీ వెట్లుహైతి? నీకు రా

మునకును నేస్త మెట్టులొదవ్వున్? వచియింపుమటన్న! వేడ్క పా
వని వచియించె రాముని శుభ ప్రతిపాద్యము! సచ్చరిత్రమున్.

క. అది విని భరతుఁడు తోడ్తో, సదముల బాణప్రయుక్త సద్గిరి నిడిసన్
ముదమున నొక గంతున సొం,పొదవగ కపివీరుఁ డపుడ యుండెన్ లంకన్.

వ. ఇట్లరుదెంచి దాని లతానీక ప్రభావంబున సుమిత్రానందన కపి వ్రాతంబుల పునరా యాత గతప్రాణవాతులం గావించి శ్రీరామునికి భరతుని వృత్తాంతంబు విన్నవించె.

గీ. మరల నా పర్వతమును రమ్యంబుగా య,థాస్థలంబున నిడి సుమిత్రా ప్రసూతి
బ్రతికె నని చెప్పి వేగమ భరతునకు క్ష,ణంబునన్ జేరె లంకకు సంబరమున.

గీ. భరతుఁ డచట నయోధ్యకు ప్రతిభగల్గు, నెల్ల సామంతరాజుల నేపుమీఱ
పిలువనంపి శ్రీరాముఁడు కలన రావ,ణుని వధింప మీఱలు సాయమొనరుచుడనె.

క. ఆ కథ అటులుండగ నిట, రాకాసులనెల్లఁ జేర్చి రావణుఁ డనియెన్
ప్రాకట సభాముఖంబున, నేకతమున భటులఁజూచి యింపుఁ దలిర్పన్.

ఆ. మీరు త్వఱగనేగి మిత్రులైనట్టి పా,తాళవాసులైన దైత్యపతుల
అతుల శీఘ్రవృత్తి నైరావణునిని మై,రావణునిని తెండు రయము మీఱ.

గీ. యుద్ధ వృత్తాంతమెల్ల సముద్ధరించి, చెప్పి తోడ్తెండు వారు నాచేతఁ గల్గ
నరులకై యింతగా నేను వెఱవ నేల? వారి మాయలఁ గెలువగా నేఱి తరము?

ఆ. అనుచు చెప్పి పంప చేని వారు వారికి, తెల్ప వేడ్కమీఱ తేజమొప్ప
విహ్వలాంతరంగ విభవులై లంకలో,నున్న పగిది వచ్చి చెన్నుమీఱ.

ఆ. రామలక్ష్మణులను రాత్రి నే హరియింప, నాత్మఁదలఁచి వార లాంజనేయు
తోకతోడ నైన ప్రాకారముం దాటి, కపుల బహుళ సేనఁ గాంచి యంత.

క. మించిన యుద్ధాయాస స,మంచితులై వివశులై శ్రమల్ తొలగంగా
కొంచెము నిద్రించెడి అ,ప్పంచాస్త్ర సమాన రూపభవ్యులఁ గనిరా.

గీ. కాంచి రామ లక్ష్మణుల తత్క్షణమునందె, కదలకుండగ వారలు చెదరకుండ
శిలకు శిల యెత్తి పాతాళ తలమునకును, స్వీయ మందిరమునకు వేంచేసి రపుడు.

సీ. అంతలో సేనలో నాంజనేయుఁడు రామ, లక్ష్మణుల్ లేనట్టి లక్షణంబు
నెఱిఁగి వారలఁ జూడ నరయ నూహించుచు, లంక దక్షిణమున నుంకువయగు
శ్రీ నికుంభిల మార్గ రీతినిం జనుచున్న, పారువ మొంతు గర్భంబుఁదాల్చి
తన పతింగాంచి నాథా! నాకు నరమాంస,మం దాసక్తై నెట్ల?న్న; నదియు

గీ. నీకు నరమాంస మేనిత్తు నేఁడె అగు,మెట్ల? ఇరువురు దైత్యు లియ్యింతకు మును
రామలక్ష్మణులను దేవరకు బలినిడ, చేర్చిరి గద పాతాళము చింతయేల?

క. దేవి యెదుట వారల నెట్లో వధియింతురు సఖీ! పలుచ నామాంసం
  బే వెఱవున నైనను నే, గావింతును విందునీకు కామిని! తేపే.

వ. అని యార్చుచుండ.

ఉ. మారుతి దానినిఁ విని, శుభమ్మని యొక్క క్షణంబునందె వి
  స్తార జవంబునఁ జని, రసాతలముఁ సుమహా తలంబునుఁ
  దా రయమొప్ప దాటి, ఖల దానవ మందిరమందునఁ సుమి
  త్రా రమణీ సుతుండు నల రాముఁడు నున్న ప్రదేశముం గనెఁ.

క. కని తద్గృహాంతరాళం,బునకుం జనుచుండ, వాని మొనసి పడెఁ బో
  రన మకరధ్వజుఁ డనువాఁ, డనుపమ బల శోభితుఁడు రయం బడ్డముగఁ.

చ. ఎవఁడవు నీవు? వచ్చితిట కెందులకో? మఱి యేడకేగెదో?
  అవిరళమౌ స్వతంత్రతయు నబ్బెను నీ కెటులయ్య? ఇయ్యెడం
  దవిలి వసించువారు కను దాకరొ? అంతటి పగ్గె గల్గునో?
  ప్రవిమల తేజుఁడైన మకరధ్వజు కావలి నీ వెఱుంగవో?

మ. అని ప్రశ్నించిన వాని గాంచి కపి, అయ్యా! కోపమా? రామ దూ
  తను! మా రాముని లక్ష్మణుం బొదివి రాత్రం బందె దైత్యాధముల్
  కొని యిచ్చోటికి తెచ్చినా రటులుగాఁ గొంపోవఁగా వారలఁ
  గనఁగా వచ్చితి, నీ వెఱుంగు నెడలం గాదే? సహాయం పడఁ.

క. అని యడిగిన మకరధ్వజుఁ,డను నీపని జూతు పిదప; నచ్చట మా తం
  డ్రిని నీ వెఱుఁగుదువే? యం,జనిసూనుఁ డతండు మనునె? సౌఖ్యము వొదలఁ.

మ. అనినఁ మారుతి వింతదోప నను; నౌరా! వింతలౌ! నీదు భా
  షణముల్? పెండ్లము లేనివాని కగునే? సంతానపుం గోష్ఠి! క్రొ
  త్తను, నాతోడ పరాచకంబులకు నిద్దా! వేళ? నేనిప్డు వ
  చ్చిన కార్యంబున కడ్డుకాకుము; నన్నుఁ జింతింపు నీయబ్బగఁ.

సీ. వాయు పుత్రుండనేనె; యెవ్వరనుకొంటి, విట్టిమాటలు నీ తలఁబుట్టె నేడు
  కనివిని యెరుంగ నిందాక కాంతపొందు, ననుదు, నే నిజబ్రహ్మచారినిఁ గదయ్య!!!

గీ. అనిన హర్షము తలమునకలై యతండు, చాఁగి సాష్టాంగముగ నమస్కారము లిడి
  అయ్య! నేడుకదా! ధన్యుఁడైతి తండ్రి! నాదు జన్మంబు నెఱిఁగింతు నాన్న! వినుము!

సీ. మునుపు లంకనుకాల్చి కని తృప్తి; వాలము, చల్లార్చునపు డీవు సంభ్రమించు
  ఆ పొగ క్రమ్మిన యట్టి గొంతును శుద్ధిఁ,జేయగా నుమిసిన చెలఁగి యొక్క
  మొసలి భక్షించె నింపెసలార నద్భుత, ముచ్చిష్ట మదిగర్భ మొంది నన్ను
  గాంచె తండ్రీ! నిను గంటి ధన్యతఁగంటి, నన్న; నాతని కూర్మి నరసి యాంజ

గీ. సేయఁ డాదరణము చేసె నిశ్చయముగ ! నపుడు మకరధ్వజుం డాప్తుడైన కతన
తండ్రి వచ్చినపని దీర్పఁదగు నుపాయ, మొండు వచియింప నూహించుచుండి యనియె!

క. రాముని లక్ష్మణునిన్ శ్రీ, కామాక్షీ దేవికి బలిగా నర్పింపన్
ఆ మైరావణు లపు,డే మతిదలచిరి వినిశ్చయించిరి కూడన్.

ఉ. లంకకు బోవునాడె యకళంక మతిన్ తమదేవిఁ జేరియో
శాంకరి! మేము పోవుఁపని సత్ఫలమందఁగ జేయుదేని, ని
శ్శంకగ మానవద్వయముఁ జంపి భవత్సముఖంబునందు నీ
కింకరు లర్పణంబిడి సుఖింతురు ! నీబలిగా మహేశ్వరీ !

వ. అని యివ్విధంబున రామలక్ష్మణులం దెచ్చిరి.

క. కావున తండ్రీ ! నీ వా, దేవాలయమందు డాఁగి దేవత వెనుకన్
శ్రీ విలసిల్ల వసించి స్వ,భావ దనుజులైనవారి బరిమార్పఁదగున్.

క. అని యచ్చటి సందర్భము,లను దెలిపిన వాయుజుండు లలిఁ జని దేవీ
ఘన విగ్రహామునకున్ వెను,కన డాఁగిన రాక్షసులు సకాలంబునకున్.

క. పూజింపవచ్చి ద్వారము,లో జేరిన దేవి యనిన రూపున కపి య
వ్యాజఁ బలికె పుణ్యజన స,మాజము బెగడొంది చూడ మహిత చకితులై.

శా. సంతోషించితి ! మీ ప్రతాపములకున్; సంతోషముం బొందితిన్
స్వాంతంబందున మీరు నాకు బలిగా సద్భక్తితో నీయగా
చింతం జేయుచు నున్న మానవుల వీక్షింపన్; భవత్పూజలన్
సంతోషించితి, నేటి పూజ విధమున్ సాంగంబు విన్పించెదన్.

గీ. నేడు నాకు మహా పర్వనిర్వహణము, నేటి పూజాదికముల మన్నింతు మివుల !
పాయసాపూపములు పిండివంటకములు, రాసి బోయుఁడు నా మ్రోల రమణమీఱ.

క. గర్భాలయంబు నిండన్, నిర్భయముగ నన్నరాసి నింపుఁ డిపుడు నే
గర్భము నిండన్ తిను సం,దర్భమ్మున్న తెండు నరుల తాంబూలముగన్.

చ. నరుల నలంకరింపుఁడు! క్షణంబును జాగొనరింపకుండ; న
న్నరమరలేక మందిరమునన్ జొరకే కడు పూజసేయుఁడీ !
గరిమను నన్నరాసినిడి గ్రక్కున ద్వారము మూసియుంచుఁడీ !
నరులను వెన్కబంపుఁ డటనన్ గనరా దితరుల్ నిజమ్ముగన్.

శా. ఏ నైవేద్యము లారగించునెడ నన్నెవ్వాఁడు వీక్షించునో
వానిన్ గ్రుడ్డి నొనర్తు; వాని నపుడే ప్రాణంబులం బాపుదున్

నా నైవేద్యపువేళలో నితరు లుండన్ రాదు నా సన్నిధిం
గానన్ జాగ్రతమీఱ పూజ సలుపంగా జెల్లు నీ నా డోగిన్.

ఆ. నాకు చేయిచూపి నవ్యాన్నపానముల్, నిత్య విధిగ పొట్టనింపుకొనుచు
మీరు సేయునట్లు మెలగఁగా చెల్లదు, నేడు తిందు భోజ్య నిచయమెల్ల!

వ. అని పల్కినన్ వా రెల్లరు తమ దేవత నేడు నిశ్చయంబుగ ప్రసన్నురాలైనదని తరంగిత హృదయాంతరంగులై యుబ్బి తబ్బిబ్బులై పూజా విధానంబు కొండొక రీతిన్ వచించిన భయభక్తి సంభ్రమంబులు ముమ్మడిఁగొన.

గీ. ద్వారముల మూసి దేవీ గవాక్షములకు, బయట నిలుచుండి పూజించి, పాయసంబు
కడవలం బోసి, పక్వాన్నమిడి మహోచ్చ, రాసులుగ నింపి రా మందిరంబు నెల్ల,

సీ, పంచామృతము క్రుమ్మరించిరి కడవల, కోట్లకొలందిగా కొఱఁతలేక!
కోట్యంతరములుగా కొలిచిరి ఫలముల, దేవికినై పరితృప్తిఁ గొల్ప!
భక్ష్యంబులను సమర్పణముఁ జేసిరి సుపా,నీయంబులిడిరి నిర్ణిద్ర భక్తి!
భోజ్యంబు లిడిరి సంపూర్ణ సమర్థత,తోప దేవీభక్తి తొంగలింప!

గీ. వాటి నన్నిటి భక్షించి వానరేంద్రుఁ, డిట్టుల వచించు, మీరు నేడిట్టి స్వల్ప
మైన నైవేద్య మిత్తురే? మానవులను, స్వీకరించుట కివి చాలవే! యటన్న.

కం. ఆ దైత్యులు కడు విస్మితు,లై దూతలచేత యిండ్ల యందున్న సమ
స్తోదనములఁ దెప్పించిన, నా దేవియు తృప్తినంది యానందించెన్.

సీ. అప్పము ల్కారవయ్యె నవ్వీట పిల్లల, కారంభమయ్యె కొట్లాట! వారి
కంతట మైరావ ణైరావణులు వన్య, పుష్పాభరణముల పొల్పుమీఱ!
రామ లక్ష్మణుల నలంకార మొనరించి, ధనువు బాణముల నంతంతఁగూర్చి
శ్రీదేవి యాజ్ఞ నర్పించిరి వారి; గ,ర్భాలయంబున నున్న ఆంజనేయుఁ

ఆ. డా ప్రభువులఁ గాంచి యానంద విహ్వలుం,డై విశేషభక్తి యలముకొనఁగ
మ్రొక్కి లేచి ద్వారముం బాసి యుగ్రుడై, రక్కసుల నదల్చె నుక్కుమీఱి.

ఉ. అంతట రామలక్ష్మణులు నాలయమున్విడి బైటవచ్చి దు
ర్దాంత పరాక్రమంబున, నరాతుల సైన్యము శత్రువర్గమున్
న్నంతకుఁజేర్చి, రక్కసుల నన్నను తమ్ముని గూడ బాణ వి
క్రాంతిని గూల్చి, రైన సుకరంబుగ వారు సజీవులై మనన్.

గీ. మరల చంపిరి వీరలు, మరల బ్రతికి,నారు వారలు, ఇవ్విధి నూరుమార్లు
వారు చంపుట వీరలు బ్రతుకుటయును, గలిగె వారికి మృత్యువు కలుగదయ్యె.

క. అందఱు నత్యాశ్చర్యము, నందిరి అపు డాంజనేయుఁ డదె యెఱుఁగుటకై
సందుల గొందుల దిరిగెను, సందేహమ్మెన్ గలుగు ననుచు జన వాక్యమునన్.

గీ. ఒక రహస్యస్థలంబునం దున్న ఒక్క, నాగకన్యక చక్కగా రాగతాళ
భావ మేర్పడ గీతంబు పాడఁ దొడఁగె, రామ నామస్మరణ రీతి ప్రస్ఫుటింప.

క. అది విని హనుమంతుఁడు స,మ్ముదముం గని యామెఁజేరి మ్రొక్కి మదంబా!
యిది వింతదోచె! నిచ్చట, మది రాముని గొల్చు ఉత్తమ స్త్రీ యున్నే ?

గీ. రాక్షసులకు నిలయంబగు నీక్షితిని వి,చిత్ర మిప్పుడ! గాంచితి చెప్పుమమ్మ!
ఎవ్వతెవు ? నీవు ; నీ పేరదేమి తల్లి! నీదు వృత్తాంతమును వినఁగాఁ దలంతు.

గీ. అనిన నేనొక్క నాగకన్యకను నన్ను, ఈ దురాత్ములన్నయు దమ్ముఁ డిచ్చటికిని
తెచ్చి బలవంతముం జేతు రిచ్చవచ్చి,నట్లు నాపేరు చంద్రసేనండ్రు తండ్రి!

ఆ. అనిన నామెఁగాంచి యైరావణుఁ మహి,రావణుని వధించె రామచంద్రుఁ
డొక్క నూరు మారు లక్కట! వారలు, మరల బ్రదుకుచున్నవారు తల్లి!

సీ. అంబ! ఇందలి రహస్యం బెఱుంగఁగ నేను, తిరుగుచు నున్నాఁడ భ్రమ్మరినయి
వాని బందుగులందు వాని వృత్తాంతము, చెప్పుకొందు రటంచు చింతజేసి!
అనిన నమ్మారుతి కనియె నక్కాంత ఓ, హనుమంత! నీవు రామునికి నన్ను
పెండ్లి యాడంగ నొప్పింతువయేని వా,రలు చచ్చునట్టి మార్గము వచింతు!

గీ. ననిన వాయుజుఁ డతివ! రాముని మహా భ,రమ్మునకు నీదు మంచము బ్రదుకునేని
అట్టులే నీదు పతియగునట్టు సేతు,ననిన నక్కాంత యొప్పి యిట్లనియెఁ బ్రీతి.

చ. మునుపొక సారి తుమ్మెదల మూకను, బాలురు జేరి ముండ్ల నుం
జొనిపి వధింపఁగాఁ గడగుచో, నిజసోదరు లిద్దఱుఁ మనం
బున దయఁదాల్చి, వానిచెఱ పుచ్చిరి; అయ్యవి మెచ్చి మీారు మ
మ్మును బ్రదికించినారలు మిముఁ బ్రదికింతుము మేము చావునఁ.

క. అని అవి వీరి శయన తల,మున వాసముచేసి యమృతమును దెచ్చి స్ప్రృశిం
చును వీరి రక్తబిందువు,లను, వారలు బ్రదుకుదురు; కొలఁదులే ? యళులుఁ.

గీ. కోట్లకొలఁదిగ వృద్ధియై కొమరు మిగులు,చున్న వా తుమ్మెదలు వాటి నొగి వధింపు
మన్న, మారుతి వాటిని గ్రన్ననంగ, నొక్క పెట్టున జంపె నందొక్క భ్రమరి.

గీ. శరణుఁ జొచ్చిన మారుతి కరుణఁజేసి, దాని రక్షించి నీవు సత్వరమ పోయి
నాగకన్యక చంద్రసేన దగు మంచే,మును గజముదిన్న వెలగ చొప్పున నొనర్పు.

క. అని యాజ్ఞసేయ నటు చే,సెను తుమ్మెద, అంత నచట శ్రీరాముఁడు వా
రిని సంహారించె నిరువుర, మన మకరధ్వజున కపుఁడు పట్టముఁ గట్టెఁ.

క. వచ్చినపని యైపోయిన, దిచ్చోటుననుండి వెడలి యేగుదమనగా
వచ్చి హనుమంతుఁ డనియెఁ, అచ్చో శ్రీరాము మ్రోల నంజలి యగుచుఁ.

గీ. కలదు చిత్ర విచిత్రమై వెలయువార్త!, నాగకన్యను చంద్రసేనను నసురులు
తెచ్చి చెఱఁబెట్టినార లత్తెరవ సాయ,మునసె జయమయ్యె! మనకు కావున మహాత్మ!

క. దానికి దర్శనమిడి యా,పైనన్ పయనమయి పోఁవ బాగనినన్ మే
ధానిధి శ్రీరాముఁడు వని, తా నిలయముఁ జేరఁ జనియె తమ్మునితోడన్.

గీ. నాగకన్యక చంద్రసేన కడుభక్తి, అర్ఘ్యపాద్యాది పూజల నాచరించి
వారలను తన శయ్యపై కూరుచుండఁ, గోరినన్ రాముఁడా శయ్యఁ గూరుచుండె.

క. మంచము తుత్తునియలుగాన్, సంచలిత మనస్క యగుచు చంద్రముఖి విచా
రించి హనుమంతు వచనము,నెంచి మనోభీష్ట సిద్ధి యేర్పడ దనుచున్.

ఉ. దీనత తోప రాము వినుతించిన, రాముఁడు దానిఁజూచి యో
మానిని! నీ తలంపు తరమా? యిపుడొందగ; ద్వాపరమ్మునన్
నేను యదూద్వహుండయి జనింతును, మూఁడవజన్మ నీకగున్
గాన భవత్ప్రదిష్ట మది కాగల దప్పుడటంచు పల్కెనన్.

గీ. రామచంద్ర! మూఁడవజన్మ రావలయునె? నే నపుడుకాని మీ ప్రేమ నూనలేనె?
సరియె! రెండవ జన్మలో జననమంద,వలయు నెచ్చోట? నెవరికి? భవ్యమూర్తి!

మ. నిను నే పెండిలియాడి నీ కృపకు సాన్నిధ్యంబునుం జెందఁ జా
లని జన్మంబుల నెన్ని తాల్చినను కళ్యాణాత్మ! కన్యాత్వ మే
నను జెందున్; వరియింప జాల నితరున్, నా కట్టి యేర్పాటు గ
ల్గిన నే పుట్టుదు నన్న; సంతసిలి యోలిన్ రామచంద్రుం డనున్.

గీ. ధన్య! నీ వొక బ్రాహ్మణ కన్యవౌదు, వేల? పరితాపమంద! ని న్నేలువాఁడ
నాదు కృష్ణావతారమునన్ అటన్న, వెంటనే ఆమె అగ్ని ప్రవేశమయ్యె.

గీ. ఆపె మరుజన్మమందు కన్యాకుమారి, యయ్యె! శ్రీరామ చంద్రుని నాంజనేయుఁ
డును సుమిత్రా సుతుని వాని తనయుఁడైన, యట్టి మకరధ్వజుఁడును మహామోదమున.

క. తమ తమ భుజములపై మో,దము మొప్పిరిఁగొనఁగఁ గొనుచు ధన్యత తోఁపన్
సదమల లంకాపురిలో, పదముంచిరి నిముషమాత్ర పరమోత్సుకులై.

గీ. ఎవని యుదరంబునన్ సర్వభువనములు ప్ర,వర్థమానంబులై యుండు సార్థకముగ!
అట్టి శ్రీరామచంద్రుని ఆంజనేయ, మూర్తి దక్కగ భరియించు మూర్తి కలఁడె?

గీ. ఎవఁడు బ్రహ్మాండమును తలనెత్తి మోచు, ఆదిశేషావతారుఁ డే? యనఘమూర్తి!
అట్టి లక్ష్మణు మోవగా నాంజనేయు, తనయునకుఁ గాక నింకెరి తరము గౌరి!

క. ఆ వారలఁ గనుగొని సు,గ్రీవాదులు ముదము వొదల శ్రీకరముగ సం
భావించి కౌఁగలించి ప్ర,భావయుతుని నాంజనేయు మన్నించి రొగిన్.

సీ. శ్రీరామమూర్తి సుగ్రీవాదులకు సర్వ,వృత్తాంతములఁ దెల్పె వేడ్క పొదల
వారలు మక్కువమీఱ శ్రద్ధాళులై, విని సంతసించి రా వివరములను;
అచ్చటనో? రావణాసురుం డొక సభ, గావించి తనదు ఐరావణుండు
మైరావణుండును మడసినారని విని, కడు భయాక్రాంతుఁడై క్రన్ననంగ

గీ. తనదు మంత్రుల పరివారమును కనుఁగొని, మొగము వెలవెలబోవ సమ్మూఢమతి వెత
చూచినన్ లేని చూడ్కితో చూచుచుండి, ఇట్టులనె మాట తడబడ నెట్టుకొనుచు.

సీ. బ్రహ్మదేవుఁడు మున్ను బలుకఁడా మృత్యువు, నాకు శ్రీరాముఁ డన్నట్టి పలుకు!
అది నిజమాయె! నారాయణుండే భూమి, నవతరించెను మానవాకృతిఁ గొని!
అందు సంశయము రవ్వంత యేనియు లేదు, సంహరియించు దాశరథి నన్ను!
అంతేల? దీక్షితుఁడై నేను చంపగా, చచ్చిన అనరణ్య సార్వభౌముఁ

గీ. డేమి వచియించె? పరమాత్ముఁ డినకులమ్ము,నందు జన్మించి నిను జంపు ననుచు శాప
మిచ్చి స్వర్గంబునకు జనఁడే? తదీయ, సమయ మిదె వచ్చె! నింక నా చావు నిజము!

ఉ. రాముఁడు వచ్చెనింక రణరంగము నందున జంపునన్ను, మీ
రేమనువారు? పల్కరదియేల? అటే యొకవేళ కానిచో
ఏ మనుజుల్ జయించి వధియింతురు? నాదగు మేనమామలన్
నే మన నిద్ది నిక్కము; గణింపుఁడు నన్ను మృతుండు పోల్కగన్.

గీ. కావునన్ త్వరగా కుంభకర్ణు లేపి, మీరు నావద్దికిం దెండు! మించివచ్చె
నిపుడు తడయుటచెల్లదా నెవఁడు నన్ను, ప్రోవఁగలవాఁడెహా త్రయీభువనములను.

గీ. అని విచారించుచుండ మీ యట్టి వార,లింత పనికయి చింతింప నేల? ననుచు
మంత్రులప్పుడె భటుల నిమంత్రణంబు, చేసి రా కుంభకర్ణుని చెలఁగి లేప.

సీ. ఆ రాక్షసులు పోయి ఆ కుంభకర్ణుని, ఉచ్ఛ్వాస నిశ్వాస మూఁపియూఁప
గుహలనుబోలు ముక్కుల మార్గముల నుద,రంబును జేరి నయంబుమీఱ
మఱల వచ్చుచు నిట్లు గరిమచే యొకప్రక్క, కొదిగి యెట్లో? వాని పొదివి పాద
తలములఁ దన్నుచు శిలలచే మోదుచు, చెట్లచే కొట్టుచు చేవమిగుల

గీ. గుఱ్ఱముల నొంటెలను నేనుగులను త్రోలి, వాని ద్రొక్కించి యంతకున్ వశముకాని
నిద్రనుండిన నాతని నిక్కవముగ, కట్టెలన్ వైచి పెనుమంటఁ బెట్టిరపుఁడు.

శా. ఆ పెన్మంట కొకింత సంచలితుఁడై యక్కుంభకర్ణుం డొగిన్
కోపంబుంగొని, నల్లి కుట్టినగతిన్ కొంచెంబుగా పొర్లి; ని
ద్రా పూర్తిం గననందుచే; మఱల నిద్రంబోవ నుంకింప; వా
రాపె న్రక్కసిపైన కట్టెలిడి ఘోరంబైన నిప్పుంచిరన్.

మ. మరలం గల్గిన నిద్రభంగమునకై మధ్యందిన శ్రీ ప్రభా
కరు చాయన్ తెగమండి లేచి, మునుపే కల్పించియున్నటి సూ
కరముల్ దున్నలు లెక్కలేకఁ దిని, వీకన్ నూతులేనింటి నీ
రు రహిన్ వట్టుగఁ ద్రావి, తూలుచు వడిన్ క్రోధాయమానాత్ముఁడై.

చ. ఎవఁడుర నన్ను లేపినది ? ఎందులకో ? ఇసుమంత గుర్తు మీ
కవునె ? యటన్న; నొక్కఁడు మహాప్రభు ! రావణు నాజ్ఞచేత లే
ప వలసె నన్న, నాతఁడు శభా ! పిపు డే పనిగల్గె వాని ? కీ
అవిరళ నిద్రలేప ! నని, అన్న సభాస్థలిఁ జేరె నంతటన్.

గీ. రావణుఁడును తమ్మునితోడ రామువైర, మును వచించి సమాచారముల నెఱుంగఁ
జేసి నంతట నిట్టూర్చి చెప్పె నిటుల, రావణునితోడ కుంభకర్ణ ప్రభుండు !

శా. అన్నా ! రావణ ! నీకు నే విషయమం దాలోచనన్ చెప్ప లే
కున్నన్, నే నొకమాట చెప్పెదను, ఈ యుద్యోగమున్ మాని సీ
త న్నీ వర్పణచేసి రాము నిజమిత్రత్వంబు నర్థింపు; శ్రీ
మన్నారాయణు డంట ! ఆతఁ డిదెపో ! మర్యాద ఇప్పట్టునన్.

ఉ. ము న్నొకసారి నారదుఁ డమూల్యములౌ విషయంబులన్ వచిం
చె న్నిజమన్న ! రాముఁడన శ్రీహరి ! రావణ కుంభకర్ణులన్
సన్నకసన్న యుద్ధమునఁ జంపఁగఁబుట్టె నటంచుఁ దెల్పె ; కా
నన్నిను నేను వేడెదఁ ! జనన్ శరణార్థిగ రాముపాలికిన్.

శా. నేను న్వత్తు నతండు దుష్టమతులన్ నిర్జించునే కాని రా
మా ! నన్నోము ! మటన్న! నెంతటి యపస్మారున్ ఖలుం బ్రోచువాఁ
డా ! నీ మాటకు లోటుకల్గ దిపు డన్నా ! సీతఁ దెప్పింపుమా
నానామిత్ర సుపుత్ర బాంధవ సుధన్యత్వంబు ప్రాపించెడిన్.

మ. అని తమ్ముండు వచించు పల్కులకు స్వాహాదేవియం దాజ్యముం
చిన మాడ్కిన్ కడుమండి యిట్లనియె; చీచీ ! యెట్టిమాట ల్వినం
గనె ! నీ నోట ? కటా ! కటా ! అకట ! వాక్చాతుర్యమున్ భీరువృ
త్తి నినున్ బొందె ! భయంబు నందితివ ? కాదేన్ నిద్రయే చాలదా ?

శా. నిద్రా ముద్రితమైన నీ మొగమదే నిర్వాహముం జేయు ? ని
క్షుద్రాతుల్ జనియించినా రనుజులై, శోకంబు కాకేమి ? ని
ర్ణిద్రాక్షుద్ర పరాక్రమ క్రములు కారే ? రక్కసుల్ ! మూఢుఁడా !
నిద్రంబొమ్మిక పోయి పందవగుచున్ నిర్భాగ్య దామోదరా!

ఆ. అని నిరాకరింప విని కుంభకర్ణుండు, అన్న కెఱఁగి యిట్టులున్నె ? అన్న !
నీకు హితముఁగోరి కాకింతగా చెప్ప, వాఁడ నొక్కొ ? ఎదిరివాఁడ నొక్కొ ?

క. నీ యాజ్ఞయైన నిప్పుడ, పోయి మహాహవమునందు పోటెఁగొందును సై
న్యాయితమగు నరివర్గము, లో ! యని బెగ్గిలగ నిప్పుడో సోదర్యా !

మ. అని ప్రాసాదముదాటి యుద్ధమును సేయన్ వచ్చు నక్కుంభక
ర్ణుని వేకాంచి కపుల్ భయాతురత నెంతో వేగమే రామచం
ద్రుని పాదాశ్రయులైరి అంత ఘటకర్ణున్ జూచి తోడ్తో విభీ
షణుఁ డత్యంతము భక్తి మ్రొక్కఁ గని పెల్చన్ విస్మయావిష్టుఁడై.

గీ. కుంభకర్ణుఁడు బల్కె నెక్కుడగు ప్రేమ, తమ్ముఁడ! విభీషణా! యీ రణమ్ము నందు
శత్రువుల మధ్య నున్నావు! శాత్రవులు జ,యించి నిను బందిఁజేసిరా ? యేమటన్న !

గీ. అన్న ! నే నన్నతోడ న య్యవనిజాత, రామున కొసంగి కాంచుమా ! క్షేమమంటి
హితముఁ జెప్పిన నన్ను మహీతలమున, బడ నెడమ కాలఁదన్నె! కోపమ్ముఁగదుర !

క. అనరాని మాటలనె అది, విని నేనీ రాముసేవ విధిగా కొని యిం
దునె యున్నవాఁడ నన నా,తని గనుఁగొని కుంభకర్ణ దనుజుం డనియెన్.

గీ. మంచిపని చేసినావు! క్షేమంబు నీకు, కలుఁగుఁగావుత! పొమ్ము! శీఘ్రమ్ము గాఁగ!
నా యెదుట నీవు నిలువకు, నాకు యుద్ధ,మందు పరకీయులని స్వీయులని తెలియదు.

గీ. ఎదుట వచ్చిన వారిని చదును సేయు,టొకటెకా ! నే నెఱుంగుదు ప్రకటితముగ
నన్నచో నవ్విభీషణుం డప్పుడచని, నిల్చె శ్రీరామచంద్రు సాన్నిధ్యమంద.

గీ. కరపదమ్ముల నలుపుచు కపికులమ్ము, నందునన్ సంచరించుచు నపుడు కుంభ
కర్ణుఁడు త్రిశూలముం గొని క్రన్ననంగ, పొడిచి సుగ్రీవునిన్ గొనిపోవఁ దొడఁగె.

శా. ఆ సుగ్రీవుఁడుఁ ద్రోవఁదప్పిరిలి ధైర్యస్ఫూర్తితో రాక్షసున్
మీసాలం బెకలించి, ముక్కు చెవులున్ మేలొప్పగాఁ గోసి, యు
ల్లాసంబొప్పఁగ సింహనాదము నతుల్యస్ఫూర్తి గావించుచున్
కౌసల్యాసుతు సన్నిధానమున సౌఖ్యంబేదఁగా వ్రాలినన్.

ఉ. ఆతఁడు నూరివారు పరిహాసము సేయగ వెండియున్ క్రుధో
పేత మనస్కుఁడై మఱలి భీకర యుద్ధముసేయ, యుద్ధ భూ
మీ తలమందుఁ జేరఁగని మించిన తీక్ష్ణ మహాశుగంబు భూ
జాత విభుండు వైచెను, దిశల్ మఱి మ్రోయఁగ వాఁడు నార్చుచున్.

గీ. వృక్షముల పర్వతమ్ముల విసరివైచె, రామచంద్రునిపై అంత రఘువరుండు
ధయముఖీఱ వాయవ్యాస్త్ర మయుతశక్తి, వైచి తరు శిలావళి గొట్టివైచెఁ గడఁక.

క. ఆయుధములచే రాముఁడు, ఆ యసురుని చేతులన్ విహాయసమార్గ
   శ్రీయుతలుగ చేసిన వాఁ, డా యాకృతితోడ వచ్చె నార్చుచు మిపులన్.

గీ. రాముని సమీపమునకయి రా దలంప, నాతెమా అర్ధచంద్ర బాణమునఁగొట్టి
   వాని పాదద్వయముఁ ద్రుంప వాఁడు ఘోర, నాదముం జేయుచున్ నేలమీదఁ బడియె.

గీ. కరపదమ్ములుఁ దెగ కుంభకర్ణుఁ డపుడు, బాడబముఖుంబువలె మోముపఱగ దెఱచి
   కూత బెట్టుచువచ్చి నెక్కొనుచు చంద్రు, రాహుఁగతి మ్రింగవచ్చె శ్రీరామచంద్రు.

గీ. నిశిత బాణముల్ మోమున నింప వాఁడు, మిక్కిలి భయంకరుండయి మిపుల పెద్ద
   కేకవేయఁగా రాముఁడు వీక నతని, గొప్పదగు పరాక్రమమునకున్ హసించె.

గీ. నవ్వి సర్వోత్తమంబయి నవ్యసూర్యు, నట్లు వెలుగొందు నైంద్రాస్త్ర మవిరళముగఁ
   గొని ప్రయోగింప కుంభకర్ణుని శిరంబు, తుత్తునియలయ్యె! దేవ దుందుభులు మ్రోఁగె!

క. పూవుల వానలు కురిసెన్, దేవతలెల్లరు నొగిన్ స్తుతించిరి! పిలుచన్;
   దైవలలాముని రాముని, శ్రీ విలసిల్లన్ విశేషరీతులతోడన్.

సీ. పినతండ్రి పడిపోయెనని విని మిపుల చిం, తాక్రాంతుడై తండ్రి నపుడు డాసి
   పిలుచ సమాధానములు చెప్పి మేఘనాఁ, దుఁడు నికుంభిల కేగి తోన యోగి
   నీ వృక్ష మూలస్థ నిస్తుల గుహాయందు, రక్తపుష్పంబులు, రక్త వస్త్ర
   ముపధానముగ రథం బొక్కండు, దివ్యాస్త్ర, ములును, జయమ్మును మొనసికోరి

గీ. ఆభిచారక మంత్రాళి యాగ మొకటి, చేయ నారంభముం జేసె జెట్టియగుచు
   చుట్టునుం దుర్గమంబులై బిట్టుచెడని, యేడు ప్రాకారములఁ బూన్చి వాఁడుఁ గడఁక.

క. జల వాయు సర్ప వ్యాఘ్రా, నల కంటక రాక్షసాది నానావిధ సం
   కుల ప్రాకారంబులలో, చెలఁగి యుండి వాఁడు పూజసేయం దొడఁగెన్.

ఆ. హోమ కుండమునకు నొగి తలక్రిందుగా, పైన కృష్ణసర్ప మూనకట్టి
   రక్త పుష్పములును రక్త చందనమును, తా నలంకరించి తవిలె పూజఁ.

సీ. రక్తాక్షతలును యెఱ్ఱని పూలు గురిగింజ, లావాలు మినుములు నారికెలును
   రక్త చందనము చెఱకు చంద్ర మామిడి, మాదీఫలములును మోదుగలును
   మాంసమున్ మరి జీడిమామిడి జిల్లేడు, వేప నల్లుమ్మెత్త వెలయు నిమ్మ
   ఉత్తరేణియు రేగు నుత్పలాదులును బం, ధూకము పాముల తుత్తునుకలు

గీ. తల పునుకలును కప్పలు తాటిపండ్లు, నరములును వెండ్రుకలును దంతములు చర్మ
   ములును మొదలుగా వస్తుల మొనసి తెచ్చి, ఎనసి హోమంబుఁ గావించె నింద్రజిత్తు.

గీ. వివిధ వన మృగామిషము నివేదనమిడి, మంత్ర యంత్ర తంత్రమ్ముల మహిమ నంది
   హోమమునుం జేయుచుండ ఘహోగ్రమైన, యట్టి ధూమముఁగని రావణానుజుండు,

శా. స్వామీ! దుష్టుఁడు మేఘనాదుఁడు మహా సత్త్వంబు సాధించు, నా
హోమంబుల్ పొనరించి, కాంచు మదిగో! హోమంపు ధూమంబు! వా
డీ మిథ్యావ్రత పూర్తిఁ జేసి మనెనా? యీరేడు లోకంబులన్
అ మేఘధ్వనునిం జయింప గలరే? ఆరాధులౌ వీరులున్.

క. ఇప్పటికే ఆతనితో, ముప్పున్నది, పోర వాని మ్రోల నెవండున్
తెప్పున నిలువం జాలఁడు, తప్పక మీ లక్ష్మణుండు దక్క మహాత్మా.

మ. అది యెట్లన్న, విభీషణుం డనియె! నిద్రాహార శూన్యంబుగా
పదిరెండేం డ్లెవడుండు వాఁడె కదన ప్రారంభుఁడై మేఘ నా
దు దరిన్ నిల్వఁగ నోపు నట్టిఁడుగదా! దుర్జేయుఁడౌ నీతఁ డ
య్యది నే గన్గొనినాఁడ, రక్కసుల మాయల్ పెక్కులౌనే కదా!

మ. అనినన్ రాముఁడు లక్ష్మణా! నిజమ? నిద్రాహారము ల్మాని మ
మ్మును సేవించితివా? భరింపఁదరమా? పుణ్యాత్మ! నీసేయు సే
వను నీమేటి ఋణంబుఁ దీర్పఁగలనా? భవ్యాత్మ! తమ్ముండ వ
న్నను నిన్నే గణియింపగా వలదె! జన్మాలెన్ని ప్రాప్తించినన్.

గీ. కాని లక్ష్మణా! వనవాస కాలమందు, నీవు మాకిడు వనఫలనికరములను
మేము తృప్తిగా భక్షించినాము కాని, నీవు తినినది లేనిదిం దెలియమయ్యె!

గీ. నాదు తమ్ముఁడ! నేనొక్కనాఁడు నీకు, వన్యకదళీఫలమ్ములఁ పఱగనిచ్చి
నట్లు జ్ఞాపకమయ్యెడి నార! అన్న, లక్ష్మణుఁడు మ్రొక్కి యప్పుడ రాముమ్రోల.

చ. తనతోడ చీరి లక్ష్మణుఁడు, తత్క్షణమే రఘురాముఁ డిచ్చియుం
డిన కదళీఫలమ్ముల కడింది నయమ్మున దీసియిచ్చె! నం
తన తన తమ్ముఁ డివ్వ్రతము తప్పక పాలన జేసినాఁడటం
చని తర దుర్లభంబయిన ఆదర బుద్ధిని గాంచె లక్ష్మణున్.

గీ. అప్పుడు విభీషణుండను, నట్టివాఁడె, గాక ఆతనితో పోరఁగాఁ గలండె?
అదియునుంగాక ఆతని కజునిశాప, మీ విధానని యున్న దికేల తడయ!

గీ. అనుచు రామాజ్ఞనంది యయ్యసురపతియు, కపిమహాసైన్యముం గొని కపికులాధి
వీరుఁడగు నాంజనేయుని వెంట తీసికొని సుమిత్రాత్మజుని తీసికొని రయమున.

క. చని హోమస్థానం బెన,సిన యట్టి నికుంభిలను విశేష శ్రద్ధన్
కనుపింపఁ జేసినన్ ల,క్ష్మణుఁ డంగదునెక్కి మివుల క్షాత్రము తోఁపన్.

శా. ఆగ్నేయాస్త్రము చేత కంటక ఘన వ్యాకీర్ణమా పట్టులన్
భగ్నంబుం బొనరించి, దారుణములౌ భవ్యాస్త్ర జాలంబునన్

నగ్నత్వంబున పార రాక్షసుల కిన్కన్ ద్రోలి, సౌమిత్రి తీ
క్ష్ణాగ్నిస్ఫూర్తి వెలింగె, విక్రమ పరిశ్రాంతిన్ కడుం దీప్తుఁడై.

గీ. గారుడాస్త్రంబునన్ ఉరగముల చెండె!, పర్వతాస్త్రంబునన్ వ్యాఘ్రపంక్తిఁ గెడపె!
వారుణాస్త్రోపహతి నగ్ని దూరపఱచె!, జలము దూలించె వాయ్వాస్త్ర సంహతులను!

గీ. అంజనీ వరపుత్రుఁ డయ్యానిలవేగ,మును మహాశక్తిఁ పీల్చి వారణ మొనర్చె!
ఇవ్విధమున ప్రాకారంబు లేమఁ గడచి, చూచినను ఇంద్రజిత్తు డచ్చోటలేడు.

క. కోటల ధ్వంసముఁ జేసిన, పాటవమున నేమి పాటువడినను శత్రో
త్పాటనము నాచరింపగ, వాటము కాదయ్యె ననుచు వాయుజుఁ డలుకన్.

గీ. కటము లదరంగ యోగినీ వటము నిపుడ, పెఱికి వైచెద నంచు నవ్వారకపీంద్రుఁ
డందు కాయత్తపడుచుండ నవ్వటంబు, నందు నున్న యోగిని చూపె నసురు గుహను.

గీ. ఆ గుహాద్వారమున పెట్టి నట్టి ఘోర, శిలను హనుమంతుఁ డొక తన్నువలనఁ గూల్చి
లోనికేగి రక్కసుఁడు పెల్లుగ భయంప,డంగ నార్చిన నాతఁడ డావుడి పడి.

గీ. హోమమును వీడి వేగ మహోగ్ర కోప, వివశుఁడై రథమెక్కి తా వెలికి వచ్చి
తవిలి చేసెను ఘోరయుద్ధము సుమిత్ర, సూతితో లోకములు చూచి భీతిలంగ.

## లక్ష్మణుఁ డింద్రజిత్తును వధించుట

గీ. శస్త్రములచేత మఱియు నస్త్రములచేత, వాక్శరములచే మఱియును పర్వతముల
చేత మేఘనాదుఁడు సుమిత్రా తనూజు,తోడ దారుణయుద్ధంబు తొడరి చేసె.

ఉ. అప్పుడు లక్ష్మణుండు, నఖిలాస్త్ర తతిన్ క్షణమాత్ర మంద, నే
ర్పొప్పగ దైత్యపుత్రుని, ప్రయోగపు నైపుణి ప్రస్ఫుటింపగా
ముప్పొనరించివైచె; రథమున్ ధ్వజమున్ ధనువున్ తురంగముల్
తెప్పున గూల్చె, సారథి వధించె నొగిన్ కవచంబు దుల్చినన్.

ఆ. మేఘనాదుఁడంత మేటి ధనుస్సు నిం,కొకటి బూని నిలిచి ప్రకటితముగ
వేలకొలది బాణ జాలంబు లక్ష్మణు, పైన గురిసి మింటి పైని కెగసె.

క. ఆ బాణ పరంపరచే, ప్రాబల్యంబైన గొప్ప పాటొంది సుమి
త్రాభవుని కవచమది నుగ్గై భూమిం బడియె నద్దికాంచి యతండున్.

ఆ. ఆగ్రహించి బాణ మటుల సంధించి య,య్యింద్రజిత్తు బాణ మొనసినట్టి
హస్తరాజమును విహాయసమార్గంబు, నందు నెగిరి పోవ నపుడు ద్రుంచె.

ఉ. అయ్యది వానియింటబడె, నప్పుడు వాఁడొక గొప్ప శూలమున్
చయ్యన వామహస్తమున సంగ్రహణం బొనరించి లక్ష్మణున్
అయ్యము పాలికిం బనుప, నాయితముం బొనరింప నుగ్రుఁడై
అయ్యసురాధమున్ ఎడమ హస్తము రావణు సన్నిధిం బడన్,

శా. ఛేదించెన్ అపుడెంతొ ? అచ్చెరువు తోచెన్ ; మేఘనాదుండు మి
ధ్యాదర్పంబున మొండి పట్టుగ సుమిత్రా నందనున్ మ్రింగగా
నాదంబుం బొనరించుచున్ దరియ! ధ్యానంబందు శ్రీరామునిన్
మోదంబొప్ప ధరించి మొక్కి శరముం బొల్పార సంధించినన్.

క. ఆ దివ్యమంగళ శరము, ఛేదించెన్ కుండలములచే నొప్పు ఘనో
న్నాదుని మస్తకమున్ తో,డ్తో దేవత లెల్ల నతని తోడరి నుతింపన్.

క. మఱియున్ హారతులెత్తిరి, కురిపించిరి పూలవాన కొసరి సుమిత్రా
వరనందనుండు శంఖము, దొరకొని యొత్తెన్ ప్రచండ దోర్బల మొప్పన్.

శా. ఆ నాదంబును విన్న సీత, త్రిజటన్ అత్తావుకుం బంపి, అ
ద్దానిన్ లక్ష్మణు శంఖనాదమని మోదంబొప్పగా విన్నదై
వీను ల్పండువుగాగ పొంగుచును, పృధ్వీజాత తా నెంతయో
ఆనందంబును బొందె, కష్టముల పాయన్ చేరు వైనం బెదన్.

ఆ. అంత నాంజనేయుఁ డా మేఘనాదుని, శిరము శ్రీరఘు ప్రవరుఁడు చూడ
వలయునంచు చేర్చె వడి సుమిత్రా సుప్ర,మోద వర్ధనుండు మోద మలర.

ఉ. అంగదు మీదనెక్కి కపులందఱు జై నినదంబు సేయ ! న
న్నం గన వాద్యఘోషము ఘనంబుగ మ్రోయ ! విభీషణుండు వే
డ్కం గని మెచ్చె, వచ్చి కడకన్ రఘురాముని మ్రొక్కె ; రాముఁ డా
లింగనముం బొనర్చి, మొనలేని ముదంబును బొంది మెచ్చినన్.

ఉ. అచ్చట రావణుండు ప్రళయంబుగఁ దోఁప, తనూజు హస్తముం
జెచ్చెరఁ జూచి, పుత్రవధ సెప్పగ రాక్షసమూక ; అక్కటా !
చచ్చితివా ! కుమార ! యని చాలగ మూర్ఛిలి లేచి, కోపమున్
హెచ్చగ, కత్తిఁ బూని యిపుడే వధియించెద సీతనం చొగిన్.

గీ. పోవ నుద్యుక్తుఁడై యుండ, బుద్ధిమంతుఁ,డగు సుపార్శ్వుఁడన్ మంత్రి, ఖడ్గము ధరించి
నట్టి రావణు హస్తంబు నపుడు పట్టి, తేట మాటల నాతండు తెలియఁ బలికె.

ఉ. కోపము వచ్చి నాసికముఁ గోసిన వచ్చునె ? కోరినప్పుడున్ ;
కోపము తాపకారణము, కోపమె శత్రు, వదెల్ల వారికిన్
కోపము పాపమౌ ; తడువుకోక త్వరన్ వహియించితేని య
క్కోప ఫలం బదెట్టుల యకో ? యని యోచన సేయవల్వదే ?

శా. మాతోడం జని, రాము యుద్ధమున సంహారంబుఁ గావించి నీ
చేతం బొప్పగ క్షేమమందఁ దగదే ? సీతాసతిం గూడి ; యా

రీతిం జంపిన స్త్రీ వధంబగుట, నీ హృత్సంస్థితంబైన సీ
తా తన్వీగ్రహణంబునన్ చెడుట కాదా? సుంత యోచింపుమా!

క. అని నీతి సమ్మతంబుగ, వినిచెన్, రావణుఁడు విని సవిస్తరముగ యో
చనచేసి, కాని పను లవి, యని మిన్నకయుండె విధియ యవిలంఘ్య మగున్.

**సులోచనకు సహగమనముచే వైకుంఠ ప్రాప్తి**

క. దారుణ శూలాలంకృత, భూరివిభూషితము! నిజవిభుని హస్తమ్ముం
జేరి సులోచన గని, త, త్పౌరుషము స్మరించి దుఃఖ పరవశయగుచున్.

శా. హామన్నాథ! బహుప్రతాపజిత దేవానీక సంసేవిత
శ్రీమద్దేవసనాథ! రూపజిత గౌరీనాథ వైరీ! వియ
త్సీమా నిర్భర పాదచారి! యిక వీక్షింపంగ నౌనే, భవ
త్ప్రేమాలోకనపంక్తి, నీ సహజసుశ్రీగాత్ర సౌందర్యమున్.

క. అని యివ్విధమున దుఃఖం,బును బొంది యనేక విధుల బోరన శోకాం
బునిధిన్ మున్గుచు నుండిన, తనపతి హస్తంబు భూమిఁదగ నిటు వ్రాసెన్.

శా. దుఃఖంపం బనిలేదు నామృతికి, సంతోషంబు నే నొందితిన్;
నిఃఖేదంబు వహింపు మీవు నిదె తన్వీ! చెందగా వచ్చునే?
స్వఃఖేలాసుఖ మన్యమౌ మృతిని; శేషస్వామిచేఁ జచ్చి సౌ
ఖ్యఃఖేలాత్ముఁడనైతి, చింతిలకు! ముక్తత్వంబు నే నొందితిన్.

సీ. శ్రీరాము సన్నిధిఁజేరి నమస్కార, మొనరిచి నా మూర్ధమును నడుగుము!
రాముఁడు జగదభిరాముఁడు కావున, ఆతఁడిచ్చును నిరభ్యంతరముగ!
దానితో నాదుహస్తము తోడ నగ్ని ప్ర,వేశము గావించి వేగరమ్ము!
నే నొందు సౌఖ్యంబు నీవొందఁగల వప్డు, నీకు నా కెడఁబాటు లేకయుండు!

గీ. ననుచు వ్రాసిన యాసులోచన ముదాశ్రు,వులు కపోలములం బడ పులకలొదవ!
చదివి సందేశమున కెంతొ సంతసించి, దుఃఖ ముడిగి యానందము తోడ వెడలి.

క. పుట్టిడు పసుపుం గుంకుమ, బిట్టుగ ధరియించి మించి పెండ్లికి జనుచు
న్నట్టుల సాలంకృతయై, నిట్టలమగు నాథు కూర్మినిన్ మది నిడుచున్.

గీ. అత్త మామలకడ నపు డాజ్ఞనంది, పల్లకీ నెక్కి శ్రీరాము పాదపద్మ
ముల సుసాన్నిధ్యమునకయి మొనసియేగ, నద్ది కాంచి యాశ్చర్యము నంది కపులు.

గీ. రావణుండిదె వెఱచి శ్రీరాము సన్ని,ధానమున కంపె భూమి జాతనని మివుల
మోద సంలగ్నమానసమూర్తు లగుచు, దర్శన కుతూహలమున మొత్తముగ జేరి.

గీ. పల్లకిం జుట్టుముట్టి యప్పల్లకి గొని,వచ్చినట్టి వాహకులు ఆ వచ్చినట్టి
యాపె యగు సులోచన యని యనిన తిరిగి, రామ సాన్నిధ్యమునకు బిరాన జనిరి.

మ. తలతో మ్రొక్కి సులోచనాసతియు సీతానాథునిన్, నాథునిం
దల యిప్పింపుఁ డటంచు వేడిన, దయార్ద్రస్వాంతుఁడై యిట్లనున్
నెలతా ! నీపతినిన్ సజీవునిగ కాంక్షింతేని కావింతు, ని
ష్ఫలలోనం బడనేల ? సౌఖ్యముల సొంపు బెంపునుం బొందుమా.

ఆ. అని యనుగ్రహింప విని సులోచన, తండ్రి !, మోక్షమూలమైన లక్ష్మణ ప్ర
యుక్త మరణమెట్టులో క్కో ? యింక బ్రుబట, బ్రదుకువాంఛ నాదు పతికి లేదు.

శా. నాకున్ ఇంతకుమించి యేమి వలయున్ నానాథు నాజ్ఞాస్థితిన్
వైకుంఠంబు లభించునంచు, మిము లం బ్రార్థింప శ్రీరాముఁడున్
ఆ కాంతామణి బుద్ధి కౌశలతకై యానందముం బొంది, సు
శ్రీకాంతిన్ వెలుఁగొందు మేఘునినదున్ శీర్షంబు నిప్పించినన్.

ఆ. మఱి నమస్కరించి మందహాసోజ్జ్వల,మైన పతిశిరంబు నందుకొని ర
యంబుమీఁఅ పతి కరంబును దెప్పించి, చితిని డాసి మిముల చెన్ను మీఱ.

గీ. ఆ సులోచన నందనోద్యానమున వి,హారమున కేగు శచిభాతి యమలమతిని
భర్త పదపద్మముల చిత్త పద్మమందుఁ, బట్టి యగ్నిప్రవేశమై పతినిఁ జేరె.

గీ. ఆ సులోచన దివ్య దేహంబు నూని, యెగసి ఆకాశవీథిని యేగుచున్న
గాంచి భూజనములు సంతసించి జయ జ,యధ్వనులు సేయసాగగా నంత నచట !

క. ఆ రావణుండు హిత పరి,వారంబులఁగూడి, మరల భండనమునకున్
జేరి సుతు మరణమున పె,ల్లె రాజిన కోపవహ్ని నతి తీక్ష్ణుండై.

గీ. కపి కులాంతంబుఁ జేతు నిక్కముగ నేను, రామలక్ష్మణులను సంగరంబునందు
చించి చెండాడుదు నటంచు చెలఁగి ఘోర, యుద్ధముం జేసె రావణుం డుద్ధతిమెయి.

క. వచ్చిన రాక్షసులెల్లరు, విచ్చలవిడి రామభద్రవిభుబాణహతిన్
జచ్చిరి నొచ్చిరి విచ్చిరి, చెచ్చెర నవ్వీరు మహిమఁ జెప్పందరమే !

గీ. రామబాణ వేగమ్మున రావణుండు, యెగిరి లంకలోఁ బడి యిక నెత్తెఱఁగున
నైన శ్రీరామచంద్రు నాహవమునందు, గెల్చుట యబద్ధమని పరికించి మించి.

## రావణుడు సీతకు రాముని మాయా శిరస్సుం జూపుట

ఆ. మయునిచేత కృత్రిమంబైన రాము శి,రంబొకండు కల్పితం బొనర్చి
చూపి సీత కవుడు శోకంబు కల్పింపఁ,జొచ్చె రావణుం డశోకవనికి.

ఉ. అంతకు మున్నె సీతకు మయాసురకల్పిత రామశీర్షమున్
చెంతకుదెచ్చి రావణుఁడు చింతిలకమ్మ ! ధరిత్రిజాత ! యం

చెంతఁగొ రహస్యవృత్తి వచియించియ యేగె విరించి ; రావణుం
డంతట రామశీర్ష మతివా ! కనుఁగొమ్మిదె యంచు చూఁపుచున్.

గీ. ఇంకనైనను నన్ను భజింపరాదె? యెవ్వనికి నయి నీవింక యిట్టి ఘోర
మైన వ్రతమును పూని ప్రాయమ్ము వృధ యొనర్చుకొందువు? ప్రియునిగ నన్ గ్రహిం

గీ. ఇది వఱకె నేను చెప్పలేదే ధరిత్రీతనయ ! రాముఁడు నరుఁడు నన్ దాకఁగలఁ
డేలు కొమ్మని, సందియ మింక నేల ? రాముని శిరంబిదే ! కావరావె ! నన్ను.

క. అని కర్ణ కఠోరమ్ముగ, వినిపించిన రావణునికి పృథివీసుత యి
ట్లను తృణమువైచి యడ్డము,గను ; నున్మత్తప్రలాప ! కల్మషచిత్తా !

గీ. శ్రీరఘూద్వహు శరములచేత కత్తిరింపబడి రణతలమున సొంపుఁబాసి
పడిన నీ శిరముల శీఘ్రపడియె దేల ! దుర్మతీ ! కాంతు త్వరితమే దుర్మదాంధ !

క. అని యిట్లు పొడుపు మాటల, ఘనలజ్జాక్రాంతచిత్తకల్మషుఁడై యం
తన తన నగరికి వచ్చెన్, తనగతి తలపోసి పోసి తాలిమిఁదప్పన్.

శా. శ్రీరామాజ్ఞను కోఁతులెల్ల గుములై చేదోయినిన్ నెత్తిపై
పూరిం బుల్లలఁ బూని, రావణు పురంబుం బెట్టి ముట్టించి రా
ఘోరంబైన మహాగ్ని కయ్యసురులున్ కోలాహలో పేతులై
ఆ రక్షోవిభుఁజేరి మ్రొక్కి కడు హా ! హా ! కారము ల్సల్పగన్.

శా. మేఘాస్త్రంబును రావణుండు కడు తామ్రాభూతఘోరాక్షుఁడై
శ్లాఘా పాత్రముగా నిగిడ్చిన, తృటిన్ జల్లారె నయ్యగ్ని, అ
ప్పాఘోరంబును దాటి రక్కసుఁ డికెట్లో? జంపఁగా నీ కపి
శ్రీ ఘోషంబులతోడి రాము నని, పిల్చెన్ శుక్రునిన్ గ్రన్ననన్.

ఉ. శుక్రుని మాటపైని రణ శూరతఁ గల్గును, శత్రుపక్షముల్
విక్రములయ్యు, యుద్ధ పృథివీస్థలి నిల్వఁగనోప, వెంతొ ని
ర్వక్ర పరాక్ర మబ్బునని, వారక ఘోర రహస్యవృత్తి శి
క్షా క్రమ మొప్ప, హోమమును సల్పఁగఁబూనె; మహాగ్రదీక్షఁ

## రావణ యాగ విఘ్నము

గీ. మౌనియై యొంటియై పరమమగు శ్రద్ధ, లంకఁ గల్గు వాకిండ్ల నెల్లను పొదము
మూసి, కావలిగాండ్ల నిమ్ముల నమర్చి, హోమ మొనరించు నతఁడు మహాగ్ర

ఉ, నెత్తుట తానమాడి, సరవిన్ తలపుత్తెల దండఁ దాల్చి, రే
కెత్తిని బత్తి నొక్క శవమెక్కి చెలంగుచు, నంప పాళులన్

మొత్తముగాఁగ పేర్చి, కొనముట్టగ చాలినయట్లు బాలురఁ
మిత్తికి పెట్టి, వారల సమీపము నంతున చేర్చి యుగ్రుఁడై.

గీ. బాల శిరముల హోమం బవారితముగ, సలుపు చుండిన, నపుడు విస్తారమైన
హోమ ధూమ మాకాశంబు బ్రామినంత, నది యెఱింగి విభీషణుం డనియె నిట్లు.

క. రామునితో స్వామీ! యీ, హోమము ముగిసిన నతం డహో! అజయుండౌ
ఈమెయి నెట్లైనను తత్, హోమము కాకుండ భంగ మొనరింపవలెఁ.

గీ. కానిచో వాని గూల్చుట కష్టమౌను', గోటితో పోవుదానికి గొడ్డలియును
చాలని విధంబుఁగల్గు, నీ లీల వీని, చేయనిచ్చిన హోమంబు, చేటుకాదె?

క. అని చెప్పిన శ్రీరఘునం,దనుఁ డప్పుడు వానరులను తత్క్షణ మాజ్ఞా
పనముం జేసిన, నక్కపు,లును ప్రాకారంబు దాటి లోనికిఁ జనియుఁ.

గీ. అతఁడు హోమము సేయు గుహా ప్రదేశ,మేదో? తెలియక ద్రిమ్మరు చాదటను త
టస్థమైన రాక్షసుల నడంచి రరి భ,యంకరులయి వారికి యమ కింకరులయి!

క. ఆనాడు పవలు రాతిరి, పూనిక కపులెల్ల వెతకి పొందరయిరి! యే
స్థానమున రావణుఁడు ని,ష్ఠా నియమాత్ముఁడయి హోమ సంస్థితిఁ గనెనో?

గీ. తెల్లవారి విభీషణుదేవి పీరిఁ,గాంచి వచ్చిన పనిని గుర్తించి, సాయ
పడఁ దలఁచి రావణుండున్న పట్టుఁజూపె, సంజ్ఞతోడుత నయ్యాది సరిగ యెఱిఁగి.

క. అంగదుఁడు తద్గుహాముఖ,ముంగని య మ్మౌతఱాయి ముత్తునియలుగా
గం గదిసి తన్ని, లోని క,రుంగుచు రావణునియొక్క గ్రుద్దుం గ్రుద్దెఁ.

గీ. వానరులు వృక్షజాలముఁ పర్వతములు, శిలలతోడుత పడ మొత్తి చెలగినను స
హించునేకాని సుంతఁ జలించఁడయ్యె!, రావణుండు హోమాత్తస్థిర ప్రవృత్తి.

ఆ. ఎన్ని యెన్నిగతుల హింసించినఁ భరి,యించు హోమమును ముగించు తలపుఁ
గొన్న వానిఁగాంచి గొబ్బున నంగదుఁ, డొక్క తలపు దోప నుక్కుమిఖిలి.

క. దుందుడు కొప్పగ జని యా, మందోదరి కొప్పువట్టి మహి వడగా నా
క్రందనము సేయ నీడ్చెఁ, గ్రందుగ చీఱయును రవిక కడు పీడ్వడఁగఁ.

క. విలపించుచు వచ్చిన నిజ, లలనం గని రావణుండు లలి తాలిమి తో
డ లవంబుండం జాలక, నిలిచెఁ వారల వధించు నియతిఁ గడంకఁ.

ఉ. ఎప్పుడు హోమ విఘ్నమది యేర్పడెనో? అది కాంచి యక్కపుల్
చప్పున రామచంద్రు నిజసన్నిధిఁ జేరిరి, ఒక్క ద్రుంకునఁ;
అప్పుడు రావణాసురుని యంగన భర్తను జూచి యిట్లనుఁ
ముప్పు ఘటిల్లెగా! యిపుడు, మూర్ఖతకుఁ ఫలమో! యటన్నటుల్.

ఉ. ఎన్నివిధాల చెప్పిన నొకింతయు వీనులఁ బెట్టవైతి, వి
ట్లున్నత వైభవాస్పదుఁడ, నూర్జిత బాహుపరాక్రముండ, వ
న్నన్న! సపుత్ర మిత్రముగ నావహుతి కా తలపడ్డవాఁడ, వి
ట్లున్నె? తలంప మూర్ఖత! మహోజ్జ్వలబుద్ధి నశించిపోయెనే!
ఉ. ఎక్కడి సీత? మోహమది యెక్కడ? యెవ్వరిఁ బోలు చెప్పుమా?
పెక్కురు నీదు భార్యల, విభీత మృగేక్షణలన్; విధాత నీ
కిక్కరణిన్ విధించె మృతి, యింతియె కారణమౌనుగాక! నీ
విక్కృతమందు నుంతయు గడించితివే? సుఖ మో మనోహరా!
క. నాథా! యిప్పటికేన్ నా, బోధన్ వినుదేని బ్రతికిపోదువు, లేదా?
గాథా సహస్రమేటికి, ఆ ధన్వికి రామమూర్తి కావహుతి కావే!
గీ. రామునికి సీతనిచ్చి నీ రాజ్యమెల్ల, తమ్ముఁడు విభీషణునకు దత్తంబొనర్చి
సుఖముగా నీవు నేన్ తపస్సును పొనర్చి, మోక్షమంద బోదము వనమ్మునకు నాథ
ఉ. చచ్చిరి భూరి విక్రమ యశఃపరిపూర్ణులు పుత్రులెల్లనుం
జచ్చెను కుంభకర్ణుఁడు నిజమ్మగు వీరుఁడు, నీ బలంబులుం
జచ్చె, యికేటి నీ జయము! చావె నిజం, బికనైన రామునిం
బొచ్చెములేకఁ గొల్వ, నినుఁ బ్రోచు నతండు, నిజంబు వల్లభా!

రావణుడు శ్రీరామునిచే తన మరణము శుభప్రదమనుట

క. అని ప్రార్థింపగ రావణుఁ, డను తన సతిఁగాంచి, మోక్షమందగ నీ చె
ప్పిన మార్గము చుట్టుకదా! విను నా మార్గంబె సూటి విధ! మింక సతీ!
క. శ్రీరాముండే శ్రీమన్నారాయణుఁడనియు సీత నలినజ యనియున్
శ్రీరామునిచే మరణం, బారయ ముక్తి యని యెఱఁగనా? ప్రాణసతీ!
క. శ్రీరామునిచే మరణము, కోరియె ధరణీతనూజఁ గొని వచ్చితి మున్;
శ్రీరామునిచేఁ జచ్చిన, భూరి భవ విముక్తిఁ బొంది పొందుదు పరమున్.
క. నే పరమపదవి బొందిన, యాపై నా క్రియలఁ జేసి యైనంతట నిం
తీ! పరమొందగ నీవున్, నా పజ్జకు రమ్మ! అగ్గినంబడి సుదతీ!
సీ. అని యుపదేశించి యసురాధిపతియు సుస్నాతుఁడై రథమెక్కి ఆతురతను
త్వరగా వెడలెను యుద్ధముసేయ రాజ మందిరముదాటి నడే యెదిరె వితంతు
వందులకే చింతగుంద కిరీటంబు, వసుధాస్థలిం బడె, వంతఁగాంచు
చునె యుద్ధభూమికి జని, తీక్ష్ణ శరములఁ, గురిపించె దిక్కులు పఱచినిండ
ఆ. కపులు చూచుచుండ కల్పించి సీతను, ఖడ్గమునను కోసె కంఠ మురల!
దాని జూచి కపులు తల్లడ మందుచు, శ్రీ రఘూత్తమునకుఁ జెప్పి రిట్లు.

క. రామా! ఇదె ఘోరముగా, శ్రీమచ్ఛీతామతల్లి శిరఁబట్టి కపి
స్తోమములెల్లం జూడఁగ, నామెయి కంఠంబు ద్రుంచె నన్యాయముగన్.

క. ఆ రావణాసురుని కసి, దీరఁగ ముక్కలుగ నఱికి తేగల మైనన్
నీ రమణీమణి సీతన్, ఏ రీతిని దేఁగలమె? అహీన ప్రజ్ఞన్.

క. ఎంతపని చేసె నీతడు, సంతప్తులమైతిమి కపి సంతతి దీనన్
చింతించి మీకుఁ దెల్పుట, యెంతో ముఖ్యం బటంచు నెంచితి మార్యా!

క. మీయాజ్ఞ యెట్టులైనన్, ఆ యనువునఁ జనెదు వారమయ్యా! సీతా
శ్రేయమె! మనయుద్ధము చే,సే యుద్దేశంబు గాదె? శ్రీరఘురామా!

చ. అని బహుళార్తిఁ బల్కు కపులందఱు, రాముని జుట్టి యుండఁగా
వనజజుఁ డిట్లు బల్కెను; అబద్ధము! అయ్యది మాయసీత! సీ
తను బరిమార్చుచో, మును పె దానవ కాంతల కాజ్ఞయిచ్చి యుం
డును; అది మాయ! యన్న వినుచున్ కపులందఱు నుత్సహించుచున్.

గీ. తాము కాంచిన దెల్ల మిథ్యయని కపులు, తెలిసికొని మిన్నుముట్టి విచ్చలవిడి నెగు
రుచు జనిరి యుద్ధభూమి, కింద్రుఁడు పనుపగ, ఇంద్రుని రథంబు శ్రీరామచంద్రుఁ జేరె.

## రామ రావణ యుద్ధము

క. మాతలి, వజ్రధ్వజమును, శ్వేతచ్ఛత్రంబుతోడ చెలగు రథము, భూ
మీతనయాపతి సన్నిధి, దోతెంచె! మహాస్త్రశస్త్రధుర్వహ మగుచున్.

శా. దివ్యాశ్వంబులు పూన్చినట్టి రథమున్, దేవేంద్రుఁ డంపించె యు
ద్ధ వ్యాపారమునందు సాయమగుచున్, తత్సారథిన్ నేను, నే
డవ్యాజంబగు భక్తిఁగొల్తు నిను రామా! యంచు నమ్మాతలీ
దివ్యానూన వచస్సులన్ విని ప్రమోదించెన్ రఘుస్వామియున్.

ఉ. ఆ రథమెక్కి రాముఁడు మహాహవముం బొనరింపసాగె! వి
స్తార కఠోర శస్త్ర శతధా ప్రవిభిన్న మహోగ్ర రాక్షస
క్రూర గభీర వక్త్ర పరిరుద్ధిత భూప్రాధ మధ్య పద్మినీ
స్ఫార మహోగ్రమై రణ మపార భయంకర మయ్యె; నయ్యెడన్.

క. ఆగ్నేయాస్త్రము రావణు, డగ్నిప్రభ లెగయ వైవ, నదిగని రాముం
డాగ్నేయాస్త్రము చేతనె, యగ్నిప్రభ లడఁచెఁగడు మహావేగమునన్.

శా. సర్వాస్త్ర ప్రబల ప్రయోగ గరిమా సంహార చాతుర్యతా
దోర్వీర్యాన్విత సుప్రకాశ దరి సందోహాకులాభీల దు

గ్గర్వారంభ మహాప్రతాప ఘన శ్రీరామావనీనాథ దో
ర్గ్మాశ్వీతాంకృతులొప్పె దిక్తటములన్ మార్మ్రోయుచున్ భీమమై.

శా. ఏ యస్త్రంబుల రాము రావణుఁడు దా నేపారగా నేయునో?
ఆ యస్త్రంబుల చేతనే యసుర భీమాస్త్రాళి ఖండించి, ఆ
గ్నేయాస్త్రంబుగ దైవతాస్త్రమును నిర్ణిద్రప్రతాపాఢ్యుఁడై
వేయాస్త్రములన్ విభిన్నముగ సంప్రీతాత్ముఁడై యేసినన్.

ఆ. వేసివేసి విసివి వేసారి వాఁడు నాగాస్త్ర మేసె, గారుడాస్త్రమున ర
ఘూత్తముండు దాని నుత్తది కావించె, దాని గాంచి మరల దానవపతి.

క. ఆగ్నేయాస్త్రం బేసిన, భగ్న మనోరథుని జేసె పర్జన్యాస్త్రో
ద్విగ్నముగ రావణుని, హెూమాగ్ని ప్రభ వెలుఁగు రాముఁ డాహవజయుఁడై.

వ, ఇవ్విధంబున శ్రీరాముఁ డాఖండల ప్రతాపోద్దండ చండ మార్తాండుండై యున్న
నస్త్ర శస్త్రంబులు విఫలంబులని నిరాశం జేసికొని రావణుండు.

సీ. ఆ ఘోర రణరంగ మందు శ్రీరాముఁడు, దండి రక్కసులను జెండుచున్న
వేల సంఖ్యలొ మదపు టేనుంగులు, లక్ష గుఱ్ఱము లవ లక్షణముగ
శత కార్థ సుశ్యందనంబులు శత,కోటి సైన్యంబులు కూలియెపుడు
శనంబొ? కబంధ నర్తనం బపుడగు, ఇటువంటివి కబంధ నటనములవి
టి యెప్పుడు కల్గునొకో! అపుడు ర,ఘూద్వహుని భవ్యకోదండ మొనర కింకి
ధ్వని యొనర్చు; నట్టి ధ్వని ప్రకరము, జరిగె నిరువది మార్లొక్క జాములోన.

మ. ఇది శ్రీరామ పరాక్రమ ప్రకట నాహీన ప్రభావంబు ను
మ్మిది వర్ణింప సహస్రసమ్ముఖ మహాహీంద్రంబునుం జాల దో
మదిరాక్షీ! విను మిద్ది గాంచుటకు ద్యోమార్గంబునన్ నిండి యా
త్రిదశుల్ భవ్య విమానయాయులయి భక్తింజూచి రాశ్చర్యులై.

నూరారు విమానంబుల,పై రాజిలి కిన్నరులును వరగంధర్వో
దారులు యక్షులు సిద్ధులు, శ్రీరామ పరాక్రమంబుఁ జెప్పికొని రటన్.

ఉ. ఆధ్వని జూచి రావణుఁ డహంకృతితో కడు క్రుద్ధుఁడౌచు వ
జ్రధ్వజ భేదమున్ సలిపె, సయ్యన రాముఁడు దానిగాంచి ది
వ్యధ్వజమందునన్ నిలువ వాయుకుమారుని కాజ్ఞసేయ, తా
శధ్వజమందు నిల్చె ననిలప్రభవుం డతికాంతిమంతుఁడై.

కలుమఱచి రావణుఁడుమహోగ్రకోప,మూర్తియై యాంజనేయునిమూర్తిధ్వజము
దునన్ గాంచి యాతఁడే నాకు చిచ్చు,పెట్టె నాతఁడటంచు సంభీముఁడగుచు.

ఉ. తొమ్మిది యుగ్రబాణముల తోడుత తద్ధ్వజ ఛత్ర పాళి, గు
ర్రమ్ముల సారథిన్ ధనువు వ్రయ్యలు చేసెను, మారుతాత్మజుం
డమ్మెయి దిమ్మవట్టి వడె నవ్వసుధాస్థలి, మాతలి ప్రభా
వమ్మున నెట్లొ? తెప్పిరిలి, తక్షణమే హనుమంతుఁ డుగ్రుఁడై.

క. శ్రీరామ చంద్రుఁ గని యో,ధీరాగ్రణి! దివ్య రథము తేకువ తెలిసెన్
నే రథమయ్యెద నీకు మ,హారాజా! ద్రుంపు రావణాసురు ననినన్.

గీ. వాయుపుత్రుని భుజములపైన నెక్కి, దారుణంబైన ఘోర యుద్ధం బొనర్చె
రామచంద్రుండు; అది గని రావణుండు, మరల ఆంజనేయుని గాంచి మండిపడుచు.

క. తన పరిఘాయుధమున నం,జని సూనుని యెదను గ్రుద్దె, సాగ్రహమతియై;
అనిలాత్మజుండు నవ్వ్రే,టున భువిఁ బడి మూర్ఛతో కడుంగడు డస్సెన్.

ఉ. అంతట రామమూర్తి పవనాత్మజుఁ డియ్యెడ డస్సినాఁ డటం
చంతరమం దెఱింగి యఖిలాత్మకుఁ డా రాఘువీరుఁ డప్డు ర
వ్వంతయు నాలసింపక రయంబున దివ్య రథంబుఁ గూర్చి హృ
చ్చింతన చేసినంత, దరిసెన్ రథ మంబరవీధి నుండియున్.

గీ. శైబ్య సుగ్రీవ మేఘ పుష్పక వలాహ,కములు పవన జవంబులఁ గ్రాల దారు
కుండు సారథ్యమూన తార్క్ష్యుండు ధ్వజము,నం బ్రకాశింప రథము ప్రత్యక్షమయ్యె.

ఆ. శస్త్ర పరికరంబు శార్ఙ్గ పద్మ గదాది, ఛత్ర చామరాది సంయుతంబు
రథముఁ జూచి మ్రొక్కి రాముఁడు సుప్రద,క్షిణము జేసి యెక్కి చేవమీఱ.

మ. తన శార్ఙ్గంబు ధరించి తీక్ష్ణమగు శస్త్రవ్రాతముల్వైచి రా
వణు రథ్యంబులునుఱ్ రథంబు పెలుచఱ్ ధ్వంసంబుఁ గావించె, నం
తన వాఁ డింకొక తేరు నెక్కి గరిమం దార్కొన్న, శ్రీరాముఁ డా
తని వక్త్రంబులు కత్తిరించె పదియుం ధైర్యం బవార్యంబుగన్.

ఆ. నిశిత విశిఖ నిహతి నిర్జరుల్ హర్షింప, రావణాసురుని శిరంబులెల్ల
శ్రీశు చేతిచావు చిత్త తోషముఁ గూర్ప,ననగ రాము పదములందుఁ బడియె.

క. నోరు తెఱచుకొని వచ్చెడు, నారావణు తలలఁ జూచి అవి మ్రింగుటకై
చేరుచునున్నవొ? యను వెఱ,మీఱగ నన రఘువరుండు మిక్కిలి మొత్తెఱ్.

క. ఆ వింత చూచుటకు సొం,పై విలసిల్లెఱ్ మఱింత యాశ్చర్యం! బా
రావణు తలలిటు పడినఱ్, రావణుఁడు యథాప్రకార రాజితుఁ డయ్యెఱ్.

చ. అది గని రాముఁ డొయ్యన మహాస్త్రము పూని దురాత్మ రావణుం
గదిసి తలల్దెగఱ్ నఱుకగా శిరముల్ మఱి మొల్చె; నిట్టులే

పదులును నూర్లు వేలు తెగి పడ్డ తలల్ వసుధాతలంబు నిం
డె దివిని బాసి తారలు పడెన్ ధర నన్నటు లొప్పు దీధితిన్.

గీ. భూమిపైనుండి చూచు కపులకును దివి, నిలచి చూచెడు దేవతానీకమునకు
వింతతోచె! రావణుతల ల్వేలు వేలు, మొలచుటలు పోవుటలు గాంచ మోదమొదవె.

గీ. అప్పుడు విభీషణుండు మా యన్న నాభి, తలమున్ కుండలాకృతి కలదు సుధ! మ
హాత్మ! అది కలదాక మా యన్నకు మృతి, లేదని వచింపగా యెనలేని ప్రజ్ఞ.

శా. వాయవ్యాస్త్రముచేత నాభిగత దివ్య(శ్రీ) సుధన్ శోషిలం
జేయంగా, నసురేశ్వరుండు తనకున్ జేట్పాటు నిక్కం బటం
చాయుర్దాయము తీఱెయున్, భుజబలం బత్యంతమున్ జూపుచున్
చేయున్ ఘోరరణంబు రాముఁడును నిశ్చేష్టాత్ముఁడై చూడఁగన్.

గీ. అమృత దూరుఁడైన యా రావణుని తల,లును కరావళులును ఘన శరముల
త్రుంచ రాముఁ, డపుడు ధూర్తుఁడై ఒకతల, రెండు చేతులే ధరించి మించి.

గీ. మఱి ప్రబల యుద్ధముంజేసె మగిడి రావ,ణాసురుఁడు! ఘోరముగ నప్పు డాహావస్థ
లంబు పెన్ వీన్గు పెంటలై లయ సమయ మ,హా భయంకరమై యుండె నా క్షణంబు.

చ. ఒక త్రుటిలోన రంగతల మొప్పె విభిన్న శిరః కరోరు పా
ద కవచ ఖడ్గ శస్త్ర బహుధా పరిచూర్ణిత కుండల ప్రభా
చకిత కిరీట రత్న విలసత్పరిమండిత దిగ్దిగంత కాం
తి కలితమై యనన్య భయదీపితమై కడు ఘోరరూపమై.

క. అంతట బ్రహ్మాస్త్రంబు దు,రంత నితాంత ప్రతాప మద్భుతముగ (శ్రీ)
కాంతుండు రాముఁ డేసె హృ,దంతరవిచ్ఛిత్తి రావణాసురుఁ డోఱఁగన్.

శా. ఆ బ్రహ్మాస్త్రము రావణాసురుని సంహారంబు గావించుచున్
సుబ్రహ్మణ్యు నగణ్యపుణ్యు నతి ధన్యున్ భవ్య తూణీర మం
దబ్రంబొప్పఁగఁ జేరియుండె, కృతకృత్య స్ఫూర్తి దీపింప; నా
పై బ్రహ్మాది సురల్ జయధ్వనులు సేయన్ దుందుభుల్ మ్రోయఁగన్.

మ. కురిసెన్ పూవులు, దేవవాద్యముల సంఘోషంబులున్ దిక్కులన్
మొరసెన్, అప్సర భామినీ నటన సమ్మోదంబు లంతంతటం
దరిసెన్, లోకములెల్ల నిండుగను గంధర్వాంగనా గానముల్
మెఱసెన్, దేవతలెల్ల రాముని సుసంప్రీతాత్ములై మ్రొక్కఁగన్.

క. అప్పుడు మందోదరి ముద,మొప్పగ సహగమనమున మహోత్సుకమతియై
చప్పున వైకుంఠంబున, జొప్పడె రావణునితోఁడ సురుచిరలీలన్.

మ. పిదపన్ రాముడటన్ విభీషణునిచే వెవ్వేరుగా రావణున్
తదపత్యంబుల, కుంభకర్ణునియు, తత్తత్కార్య కాండంబులన్
విదితంబొప్ప నొనర్పఁజేసి, యటఁ బంపెన్ లక్ష్మణున్ తోన స
భ్యుదయం బొప్ప విభీషణున్ నిలుప నుద్యోగించి తల్లంకకున్.

క. లంకా పట్టణమునకున్, పొంకముగ విభీషణుని ప్రభువుఁజేసి మరు
ల్లంకన్ హనుమల్లక్షిత, లంకన్ విడిపించె రామరాజేంద్రుఁ డొగిన్.

క. ఆలస్యము లేకుండ వి,శాలాక్షియుఁ, ధన్య, సీత సన్నిధికిన్ భూ
పాలాగ్రణి పంపెన్ నయ,శాలి విభీషణునితోడ జేన హనుమంతున్.

క. అంతట వారలు సీతా,కాంత గలుగు నయ్యశోక కాంతారము నం
దెంతో? ముదమందగా వృ,త్తాంతంబులు సీత కెఱుఁగ నటు వచియింపన్.

౯. ఆ వృత్తాంతం బెటులయ్యెనని కుతూహలాయత్తచిత్తయైన యమ్మత్తకాశిని పార్వతి యొత్తి ప్రశ్నింప, నుత్తమోత్త మోపన్యాస వేత్తయైన కృత్తివాసుండు తరువాతి వృత్తాంతం బిత్తెఱం గని వచియింపం దొడంగె.

## తృతీయ సర్గము

శా. సుగ్రీవాదులు వానరోత్తము లొగిన్ సుస్నాతయై వేడ్క ది
వ్యగ్రైవేయక తారహారములతో వస్త్రాళితో భూషితం
బై గ్రాలన్ వసుధాకుమారమణిఁ పల్యంకంబునన్ రామచం
ద్రాగ్రం బందున నిల్పి రింపెసగు వాద్యంబుల్ కడున్ మ్రోయఁగన్.

గీ. భటులు పరివేష్టితులయి గొల్వఁగను శ్రావ్య,మైన కంఠము లెత్తి వేశ్యా నికరము
పాడ నాడఁగా శ్రీరాము జాడగాఁగ, జానకీదేవి డిగ్గ నయ్యాన మపుడు.

### సీతాదేవి అగ్నిప్రవేశము

శా. ఆ సీతాసతి కాల్నడన్ మగని పాదాబ్జంబులన్ సోక నెం
తే సాష్టాంగము సేసి, లజ్జఁ పతి సాన్నిధ్యంబునన్ నిల్వఁగా
ఓసీ! నీ దగు యిచ్ఛవచ్చినటు లెట్లో పోదగున్, వైరి సీ
మా సంవాసివి! బ్రహ్మ చెప్పినను నిన్ మన్నింపరా దియ్యెడన్.

మ. అని శ్రీరాముఁడు ధిక్కరింప కపులున్ హా! హా! రవోన్మాదులై
మన మీ విన్నవి రాముఁ వాక్యములె? ఇమ్మాడ్కిన్ రఘుస్వామియే
అనెనా? అట్లగుచో రణస్థలిని అన్యాయంబుగా రాక్షసా
ళిని మారొక్కఁ బనియేమి? రామునకు గర్వం బిచ్చి యం చార్చినన్.

క. ఆ శ్రీరాముని వచనము, తా శ్రుతిపుటములను బడిన తత్క్షణమే దుః
ఖాశ్రువుల రాల్చుచుఁ దం,డ్రీ ! శ్రీమల్లక్ష్మణా! వడిఁ జితినిమ్మా !

వ. లక్ష్మణా! క్షమియింపుము. మున్నె నిన్ను నేనెన్నో విధంబులఁ దూలనాడితి, నది సైరించి నాయందు కరుణ కలదేని నేనింక భువిం బ్రదుకనొల్ల, నా కగ్ని సంస్కారంబునకన్న శిక్ష లేదని ప్రతిబంధించిన విధిలేక లక్ష్మణస్వామియుం దుఃఖార్తుండై తల్లీ ! నీ కష్టంబు లింకం గట్టెక్కవయ్యెనే !

చ. అని చితిఁ జేర్చ, స్నాతయయి, యగ్నిని గూర్చి ప్రదక్షిణించి, నా
మనమున వాక్కునన్ బనుల మాన్యుని రాముని దక్క నన్యులన్
గనితినయేని భూమి కెడగా యిపుడే దహియింపుమయ్య ! పా
వన ! ఘన వీతిహోత్ర ! సురవందిత ! యం చొగి యగ్నిఁ జొచ్చినన్.

క. లవమైన గాల దగ్ని, వి,భవమొప్పగ నిట్టులను; ప్రభావయుతము, నా
భవ మిప్పుడు శ్రీరామా! అవనీసుత సీతఁ బోలు అతివలు కలరే?

గీ. నీ సతి పవిత్రురాలు! సందేహ ముడిగి, చేకొనుము రామచంద్ర ! నే జెప్పినాఁడ
నని వచించిన యంత, దేవాళి యెల్ల, బాసచేసి రిందులకయి బాహులెత్తి.

క. అప్పటికిని శ్రీరాముఁడు, మెప్పొందని యట్లె నిల్వ, మింటన్ విభవం
బుప్పతిల దశరథుఁడు సొం,పొప్పన్ సీతా సతీత్వ మొయ్యన జెప్పెన్.

గీ. అపుడు పరిశుద్ధురాలని యవనిజాతఁ, మరల స్వీకారముం జేసె గరిమతోడ
రామచంద్రుఁడు, మున్ను అరణ్యమందు, అగ్నినుంచిన రాజసి యైన సీతఁ.

## సీతా త్రిగుణాకారైక్యము

మ. అపు డాలింగన మాచరించి తొడపై నత్యంతమా ప్రేమ భూ
మిపుఁ డా రాముఁడు చేర్చె సీత నతి సంప్రీతాత్ముఁడై యాపెయున్
విపినంబందున సత్వరాజస తమోవృత్తుల్ పృథగ్రీతు లొ
ప్పి పుడేకాకృతినంది శోభిలెఁ గడున్ హ్రీయుక్తయై యర్మిలిన్.

క. తరువాత దేవతలచే, పరివేష్టితుఁడైన రామభద్రుఁడు నింద్రుం
గురిఁచి యాజ్ఞ గావించెన్, కురిసె నతం డమృతవృష్టి కోఁతిగములపై.

క. మృతినందిన మర్కట తతి, బ్రతికెన్ సంప్రీతి వొదల రాముని కంద
ద్భుత మది యేమన? పృథ్వీ,పతి రాముం డొక్క కోఁతివాఁ డేడి యనెన్.

## కపు లమృతవృష్టిచే బ్రతుక పోయిన కోఁతిని శ్రీరాముఁ డెఱుఁగుట

ఆ. ఇంతమంది కపులనెట్లు శ్రీరాముఁడు, కానరాని కోఁతివాని నొకని
ఎలమి గుర్తుఁగొనియె? నితడు సర్వాత్మకుం, డట్లు గాక గలఁడె? అది యెఱుంగ.

శా. ఆ సంప్రశ్నము విన్న కోతిగము లత్యాశ్చర్య సంలగ్నులై
కాసంతేనియు లేని వానరు నొగిఁ గన్గో నసామర్థ్యులై
గాసింబొందిన, వాయుపుత్త్రుఁడు సమగ్రంబైన సంయోజనన్
మేసెన్ వానిని కుంభకర్ణుఁడని చెప్పెన్ భక్తితో నమ్రుఁడై.

ఉ. ఆ కపి యొక్క గోరయిన నా హవరంగమునందుఁ దక్కినన్,
అ కపి జీవము కల్గనెడి, నాతని రోమమొ ? యెమ్మొ ? యేదియున్
లేకునికిన్ అతండు కనలే దుసురుల్, మహనీయ ! రాక్షసా
నీక శవాళి సాగరము నింపితి మిందుకుగాదె ? భూవరా !

క. అని విన్నవింప రాముం,డను నట్లా ? ఐనన య్యో ! యముఁ డిప్పుడ ద
ర్శన మిడుఁగా కనినంత శ,మనుఁ డచ్చో దోఁచె కపులు ప్రాన్పడి చూడన్.

క. వచ్చిన యముఁడు భయము పొర,పొచ్చెము లేనట్టి భక్తిఁబొదల మహాత్మా !
వచ్చితి ! తమయాజ్ఞా మతి, చెచ్చెర నాజ్ఞాపనంబు సేయుమటన్నన్.

చ. అనఘుఁడు రాముఁ డిట్లనియె ! నాహవ మందున నా సహాయులై
వనచర వీరులెల్ల మరువం దగనట్టి మహెూపకారముం
బొనరిచి, రందు నొక్క కపి వోయె ! హతుండయి, కుంభకర్ణునిం
ఘనహతి, వానిగూర్చిన నికన్ మది తృప్తిని గందు సూర్యజా !

క. అన శ్రీరాముని సన్నిధి, గన, నాతని నపుడె యముఁడు క్రమ్మఱ తెప్పిం
చెను, దేవత లారాముని, గని పూవుల వాన గురిసి కనిరి ముదమ్మున్.

క. వానిం గాంచుచు రాముం, డానందము నొంది పిదప ననె మాతలితో
పోనిమ్ము! నీ రథంబున్, మానితముగ నింద్రు స్వర్గ మందిరమునకున్.

క. అని పోవుట కాజ్ఞాపిం,చిన మాతలి మ్రొక్కి వడిగ శ్రీరాముని, నిం
ద్రుని నగరంబున కేగెన్, ఘనరథహయముల నదల్చి కడు ముద మొదవన్.

వ. అటు పిమ్మట విభీషణుఁడు శ్రీరాముని మంగళస్నానంబు లాచరింప వలసినదిగా
సవినయంబున బ్రార్థించె నపుడు.

గీ. ఎంత ప్రార్థించినఁ రాముఁ డెలమిమీఱ, భరతుని స్మరించి కాదని గరిమమీఱ
పుష్పక విమానమున నెక్కి పోదలంచి, అంద అధిరోహణ మొనర్ప నాజ్ఞ చేసె.

సీ. ఆ పుష్పకమున రామాజ్ఞ శ్రీరథమును, దారకుండును కపి భూరిబలము
మకరధ్వజుండును మఱి విభీషణుఁడును, అందఱు నెక్కి రత్యంత భక్తి!
ఎందఱం దెక్కిన నింకొక్కనికి తక్కి, అందు తావుండు నత్యంతముగను
అది గాంచే నమరులు ఆకాశగమనులై, తమ విమానంబులఁ దరలి రపుడు

గీ. దశరథుండును రాముని తగు విధముల, వీడ్కొని విమానమున స్వర్గవీథిఁ జేరె!
రఘుపతియు సీతఁగూడి విరాజమానుఁ,డయ్యె రోహిణీపతి చంద్రికాభముగను.

విభీషణుఁడు శ్రీరామ మహిమా సంకోచమున ప్రశ్నించుట

చ. అపుడు విభీషణుండు, విజయంబున తేజలుచుర్ మహా ముదం
బు పొదలగా కుబేర వరపుష్పక మందున నున్న రామునిర్;
విపులయశోభిరాముఁ గని, వేడుక నీదగు చర్యలెన్న నే
రుపు కలదే? భవన్మహిమ రుద్రుడెఱుంగడు! మాదృశాళికిర్.

శా. సీతత్త్వంబు నెఱుంగనైతి గద! తండ్రీ! నేను కించిజ్ఞుఁడర్
పాతాళంబున నాడు నిన్ను గరిమం బంధించి కొంపోవు స్వే
చ్ఛాతంత్రజ్ఞుల మాదు మాతులుల పజ్జన్మాని నావేల? ఇ
చ్ఛేతల్ యేమయిపోయె? నాడు; మహిమల్ శ్రీశౌర్యముల్ రాఘవా?

ఉ. ఇంత పరాక్రమంబుగల ఈవు మహాత్మ! భవత్బలంబు శా
సంతయుఁ జూపవైతివి! నిజంబుగ వారు క్షమింపరాని వి
భ్రాంతిని మాకుఁ గూర్చిరి, ధరారమణా! అటులైన వారి దు
ర్దాంత పరాక్రమంబున దురంబున గూల్చవు? ముందె! చిత్రమా?

మ. ఇది యాశ్చర్యముగాఁగ దోచె నన నెంతేనిర్ రఘుస్వామి, యిం
పొదవర్ కొంచెము నవ్వి, యిట్లనియె! ఏదో? నీవు నా విక్రమం
బు దరిర్ శంకనుబూని పృచ్ఛయిడి తిప్పుర్ నీదు సందేహమ్ముం
దుది గావింతు నటంచుఁ బల్కెనిటులర్ దూరాభి సంధాయియై!

సీ. తృణము చేబూని మంత్రించి కాకాసురు, భీభత్సు మొనరించి విడువలేదె?
తప్పిన గురి సముద్రము దాట మారీచు, శతయోజన ప్రాప్తు సలుపలేదె?
పదునాల్గువేల శుంభద్కాంశ్య రథికుల, నొకఁడనై వధియించి యుండలేదె?
ఘోరవిరాధుని కొమరొప్పఁగూల్చి క,బంధుని బంధించి పంపలేదె!

గీ. వీర లందరి కంటె నవ్వారు ఘనులె?, ఆ పనిని వీడినాడ నే నంజనీ ప్ర
సూతి కెలమిని, నిజభక్త సులభవశత!, ఇందలి రహస్యమిద్ది గ్రహింతువేని.

చ. అని వచియింపగా హనుమ, అప్పుడ శ్రీరఘురామమూర్తి పా
వన పద సన్నిధిర్ నిలిచి, వాంచి శిరంబు, విభీషణా! లవం
బును అనుమాన మిందు తలపోయఁగ కూడదు; అట్లు కానిచో
మునుపటి నాదు గర్వము సమూలముగా నసియింపఁ బ్రోవడే.

క. సైకత లింగము పెరుకఁగ, దోకం ద్రెంచుకొను నన్ను దుర్మతిగా కుం
డా కాచిన ఘనుఁ డెవ్వఁడు, నీకన్ శ్రీరాము మహిమ వింతయ కాదే?

క. తన దాసుఁడైన నా కీ,ర్తిని వృద్ధి నొనర్పఁ జేసె శ్రీరాముఁడు, మ
న్మనమున, వర్ణింపగ కొం,కను శ్రీరామాజ్ఞ యెంత కఠినంబైనన్.

క. అనిన విభీషణుఁ డయ్యది, విని మ్రొక్కి, విశేష,భక్తి విహ్వల మతియై
మనమున ననేక విధముల, వనరుహనాభుని మహత్వ వార్ధిం దేలెన్.

వ. అంతట.

## త్రిజటా వరప్రదానము

సీ. సీతయు పలుమారు శ్రీరామచంద్రుని, ప్రార్థింప నామె తృప్తగ నొనర్ప
త్రిజటకు వరములం బ్రియముతోడ నొసంగె, ఆమె సహాయంబు నభినుతించె!
త్రిజటా! వినుము! దరిత్రిని చైత్ర వైశాఖ, కార్తికములను మాఘమ్మునందు
పుణ్యాత్ములెల్ల నింపుగ తొలి మూణ్ణాళ్లు, నీ ప్రీతికొఱకు నిర్ణీతమతిని

ఆ. ఎఱిఁగి స్నానదాన పరతంత్రు లగుదురు,గాత! దాన ఫలము గలుగుగాత!
నీకు నీ ధరిత్రి నిలుచునందాక శా,శ్వత యశంబు వృద్ధి వఱలుఁగాత!

క. ఎవరట్లు పూర్ణిమకు వెను,క! వినుము త్రిజటా! స్మరించి క్రమముగ నీపే
రవిరళ శ్రద్ధన్ జేయరో ?, ప్రవిమల స్నానాదికముల భక్తిపొదలఁగన్.

క. వారల నెల పుణ్యమ్మును, జేరుత! నీ కింక నేను చెప్పెద వినుమా!
కూరిమి నింకొక వర మిది,గో! రమ్యము! దీనినిత్తుఁ గొనుమని పలికెన్.

శా. కోపావేశమునన్, గృహం బశుచిగా గొంచున్, ఎవండైననున్
దా పిత్రాదుల హవ్య కవ్యముల తృప్త స్వాంతులం జేయఁగా
నేపారన్ పడఁతీ! తదీయ ఫలమెంతె బొందు మీ వెంతయున్
ఆ పిత్రాదుల కట్టి యాఫలము సుంతైనన్ వెసన్ జెందునే?

ఉ. స్నానములేక కాళ్లడిగి సల్పిన పూజలు, నూవుగింజలే
లేనిది తర్పణంబులు, లలిన్ గడు దక్షిణలేని శ్రాద్ధముల్
వాని ఫలంబు నీక యగు, వర్ధిలు మొమ్మని; ఇట్టి మేటి యీ
రాని వరంబు లిచ్చె రఘురాముఁడు! భవ్య వచోభిరాముఁడై.

వ. అంతట శ్రీరామచంద్రుండు త్రిజటా సరమా విభీషణ సుగ్రీవ మకరధ్వజుల వెంట
గైకొని విమానంబున నరుదెంచుచు సీత కివ్విధంబున కౌతుకంబు లెల్లం జూపుచు
నిట్లనియె.

శా. కాంతా! చూచితె లంక, ఇద్ది రణరంగం, బిద్దియే సేతు సం
ప్రాంతం, బియ్యది సేతుబంధనము, తీర్థంబౌ సుమీ! నీకునై
యెంతో పూన్కిని దీనిగట్టి, హితులన్ యీ వానరానీకమున్
యెంతో యిక్కటులం దవిల్చితిని, యెంతే మెచ్చినన్ జాలునే?

క. అని వారందఱికిని ముద,మును గూర్పఁగఁ బలికి యపుడు, ముఖ్యముగ విభీ
షణు మాటమీద పుష్పక,మును దిగి వారధిని వింటి మొనతోఁ బొడిచెన్.

సీ. సేతువు బడమొత్తె శ్రీరాముఁ డందుచే, నద్ది ధనుష్కోటి యనగ బఱఁగె!
అత్తీర్థ మందుచే నయ్యె ముక్తిప్రదం, బచ్చట కోదండ మవధరించి
కోదండపాణియన్ కొమరొప్పు పేరుతో, శ్రీరాముఁ డిప్పుడున్ సేవలొసగు!
అంతలో సంపాతి యచ్చటి కరుదేర, రాముఁడాతనిని గౌరవము మీఱ

గీ. చూచి యాలింగనముచేసి సురుచిరముగ, నీవు నీ తమ్ముపేర నెంతేని శ్రద్ధ
నొక్క తీర్థంబుఁ గల్పింపు మొయ్యనవన, ఆతఁడు జటాయు తీర్థంబు నపుడుకూర్చె!

క. ఆసేతుభంగ భూమిని, భాసిల్లుచు నేటికిని ప్రభావయుతంబై
శ్రీ సంపద్ప్రదమై సం,తోసం బిడుచున్ జటాయు తోయమువొలుచున్.

శా. ఆ సంపాతియు రాము నాజ్ఞఁగొని, సమ్యక్సంతసంబొప్ప శో
భా సంపన్నము పుష్పకంబునను చెల్వం బొప్పగా నెక్కినన్
శ్రీ సీతా సతికిన్ కుతూహలముతో ప్రేమావిలాసంబునన్
ఆ సందర్భమునందు జూపెను విహారానన్య దేశంబులన్.

## సీతకు అయోధ్య మార్గమున కౌతుకముల దర్శింపఁ జేయుట

సీ. రామేశ్వరమ్మున రామేశ్వరుని గౌరి, నారాధనము చేసి, యచోటుఁ బాసి
ప్రియ! గాంచు మిచటనే పృథు సముద్రము దాటు, నాలోచనలఁ జేసి యలసినాము!
ఇదిగో! ఇచ్చోటనే ఏను దర్భల శయ్య, ప్రాయోపవేశంబు పండినాఁడ!
ఇవి నవగ్రహముల కివి నవపాషాణ,ములు నిల్పినాఁడ నిమ్ముల మృగాక్షి!

గీ. ఇచట నా యాజ్ఞపైని యహీన భయము,నొంది జలనిధి మిన్నకయున్న వాఁడు
అనుచు నీరీతి తెల్పుచు నర్ధక్షణము,లోన కిష్కింధ వచ్చి రెంతేని వడిని.

క. వానర పత్నులనెల్ల వి,మానంబున నిల్వజేసి మగిడి రయమునన్
పూనిక నేగుచు సతియుం, గానగ వెవ్వేర చూపె కమ్రస్థలముల్.

సీ. ఇదె ప్రవర్షణగిరి! ఇది ఋష్యమూకము!, పంపా సరోవరం! బింపుగులుకు!
భీమరథీ! కృష్ణవేణీ! నదుల్గాంచు, మదిమె! గోదావరీ నది! శుభాంగి!
అదె పంచవటి! అగస్త్యాశ్రమం బయ్యదే!, అది సుతీక్ష్ణుని పవిత్రాశ్రమంబు!
అత్రి తపోవన! మయ్యదె! కంటివా?, చిత్రకూటంబు! విచిత్రమిద్ది!

గీ. ఇది యమున! ఇయ్యదియె గంగ! ఇదియకాదె? అమలుడైన భరద్వాజు నాశ్రమంబు
అనుచు చెప్పుచు చూపుచు నతి ముదమున, సీతతో రామచంద్రుఁడు చేతమలర.

గీ. (శ్రీ) భరద్వాజమౌని ప్రార్థింప [illegible], యాశ్రమంబున డిగి యెల్లరమిత తృప్తి
నంది రా ఋషి మన్ననలంది చెలఁగె, రాముఁ డప్పుడు జగదభిరాముఁడగుచు.

క. పదునాలుగు వత్సరములు, తుదిగాఁగా మాఘసిత చతుర్థిని మౌని
ప్రద భూస్వర్గ సుఖం బిం,పొదవం గొని రాముఁ డొప్పె నుజ్వల మతియై.

గీ. సపరివార సమేతుఁడై సమ్ముదంబు, నందె! (శ్రీ)రామచంద్రుఁడ య్యదనెఱింగి
వాయు పుత్రుని చీరి సత్వరము నీవు, భరతునకు నాదు రాక చెప్పగదవయ్య!

చ. అరుగు మయోధ్యకుఁ గడు రయింబున, పోవుచు శృంగి బేరస
త్పురమున, గాంచుమా! గుహుని; పొల్పగు మాదగువార్త దెల్పుమా!
త్వరితము సేయుమా! యనిన వాయు కుమారుఁడు పోయి తెల్పఁగా
బిఱబిఱ వచ్చె నగ్గుహుఁడు పేర్మిని రాముని దర్శనార్థమై.

శా. ఆలస్యంబు రవంత లేకఁ జనినఁ అయ్యాంజనీసంభవుం;
డాలోనే చితిఁబేర్చి పౌరజను లాహా! కారముల్ సేయఁ గాఁ
గూలఁ సిద్ధముఁ గొన్నయట్టి భరతుఁ, శ్శోభాసమాకీర్ణ ని
ర్వేలాభీల కఠోరదుఃఖ యుతులఁ వేగాంచె నల్లంతటఁ.

వ. అప్పుడు భరతుఁడు శత్రుఘ్నునితో నిట్లనుచుండె.

## భరతుని అగ్నిప్రవేశము

సీ. రాలేదు నేఁడు (శ్రీ)రామలక్ష్మణు లట, రావణాసురు చేత రణమునందు
నిర్జింపబడి యుంద్రు! నిఖిలదేశాధీశు, లందఱు లంకలో నాహవంబు
నందు సహాయార్థ మరుగగా రప్పించి,నాఁడ! సూర్యాస్తమానమ్ము ముందె
అగ్నిలోన ప్రవేశ మయ్యెద! నీవు రా,జులతోడ నాలంకఁజొచ్చి కలన

గీ. రావణుని జంపి సీత చెఱను సడల్చి, మఱియు (శ్రీ)రామ భరత లక్ష్మణులమైన
మాకు ముప్వుఱకును ఊర్ధ్వపారలౌకి,క క్రియల నిర్వహింపుదుగాక! అనుజ!

క. అనిచెప్పి అగ్ని హోత్రం,బునకు ప్రదక్షిణ మొనర్ప, ముమ్మారముగ జే
రిన యూరి వారు రాజులు, జనములు స్వస్త్రీలు స్త్రీలు సచివోత్తములుఁ.

గీ. తమ్ముఁడైన శత్రుఘ్నుఁడు తాత తండ్రి, వరుసలుగఁ గొల్చునట్టి సేవక జనములు
భరతు జుట్టి దుఃఖార్తులై పలువిధముల, బోరుమని యేడ్వసాగి రద్భుత రవమున!

సీ. భరతుండు వారినందఱ సమాధాన ప,రచుచు దానముల ధర్మములఁ జేసి
(శ్రీ)రామ లక్ష్మణ సీతలం ధ్యానించి, తల్లులకెలమి వందన మొనర్చి!
మునులకు గురువులకును మ్రొక్కి! యుత్తర,దిక్కుగా నిల్చి, యెంతేని భక్తి!
సాయంతనమున నస్తంగత సూర్య బిం,బము చూచునప్పుడ గుములు కట్టి

గీ. యున్న జనములలో ధ్వని మిన్నుముట్టె! అట్టి వేళకు సరిగ నయ్యాకసమున
నుండియమృతంబుఁగురియించునోజహానుమ! మృదుమధురవాక్యములఁబల్కెమించుభక్తి!

సీ. వీరుఁడా! అగ్నిప్రవేశంబు మానుము! శ్రీరాముఁ డిదె వచ్చె! సీతతోడ!
లక్ష్మణుతోడ! సలక్షణంబుగ భరద్వాజాశ్రమమునకు వచ్చినాఁడు!
నిజముగా నే రేపె! నీవు వానర పరివేష్టితు రాము ప్రవీణుఁ గాంచి
నిండు ముదముఁగొందు; నిన్ను జూడఁగ కుతూహల చిత్తుఁడయ్యె! రామావనీశుఁ

గీ. డనెడు వచనామృతముఁ గురియంగ నందు, తడిసి భరతుండు సంతుష్టిఁ దగ నమస్క
రించె! నగ్నికి; తరువాత ప్రేమమీఱ, వాయుజుని గౌఁగిలించె నవ్వారి గాఁగ!

మ. జను లానంద నిమగ్నులైరి, కడు విస్తారంబుగా రామ ల
క్ష్మణ సీతా కపికోటి వృత్తముల, కీశశ్రీ యుపన్యాస ధో
రణి పెన్మోదపు మున్కలన్నిడుచునున్, ప్రత్యక్ష రామాత్ములై;
ఎన లేనట్టి సుఖంబు నందె భరతుం డెంతో ప్రజావేష్టుఁడై.

గీ. సర్వ వృత్తాంతముల సవిస్తారముగ ప్రశస్తరీతిని బల్కె! తత్సభను మఱి మ
రుత్సుతుం డయ్యెడ కడు నేరుపున గొప్ప పండితుం డౌట! విను మతుల్ పండిపోవ!

సీ. భరతుఁ డానందాశ్రు భరితుఁడై యది విని, మంగళ భవ్య సంభారములను
తోరణాదుల నయోధ్యా రాజవీధుల, క్రమ్మఱఁగా నలంకార పఱచి!
ఊటివారలతోఁడ నూరేగి తనమీద, శ్రీరామ పాదుక ల్చెలఁగఁదాల్చి!
పట్టపేనుఁగును సంపద గుల్కఁగా పురస్కారించుకొని గడున్ జోరుకొల్ప

గీ. సకల వాద్యంబులున్, ప్రజాసమితితోడ, మాఘ సిత పంచమిని సూర్యమండల ప్ర
సూతినే దక్షిణమున నిస్తులముగాఁగ, పుష్పకముఁ గాంచె భరతుండు పొలుపుమీఱ!

క. దూరమునుండియె భరతుఁడు, శ్రీరాముని మ్రొక్కి దఱికి జేరుచు సాక్షాత్
గౌరవ సాష్టాంగ నమస్కారముఁ గావించి నిలచె సమ్ముద మొదవన్.

## శ్రీరాముఁడు విశ్వరూపముతో నందరి నాలింగనాదులచే తృప్తి సేయుట

గీ. అపుడు శ్రీరామభద్రాత్ముఁడన్ని రూపులై భరతునిని బంధుల నందఱిని స
మానముగ నేకరీతిని మన్ననంబు చేసె నా! విశ్వరూప దర్శిత్వ మొప్ప!

సీ. కైరవమిత్రు చకోరంబుల విధాన, కమలముల్ సూర్యునిగాంచు పగిది
పేదకు ప్రాప్తించు పెన్నిధి పెంపున, గంగఁపిపాసువు గాంచినట్లు
ఆకంటి కబ్బు రసాన్నంబు పోలిక, చీఁకుకు కనులు వచ్చిన విధాన
చచ్చి బ్రతికినట్లు సకల వృక్షముల వసంతాగమము రీతి నింతయనెడి

గీ. అంతులేనట్టి ఆనంద మనుభవించి, రపుడు స్వజనులు పౌరులు నవనిజాతఁ
రామచంద్రులఁగాంచి యాక్రమము చూచి, తీఱవలెఁగాని చెప్పిన దీఱదెందు.

సీ. శ్రీరాముఁడును బాష్పపూరిత నయనుఁడై, భరతు నమాధాన పఱచి పిదప
తన తల్లులకు నరుంధతి వశిష్ఠులకును, కడు భక్తితో నమస్కార ములిడి
తరువాత తిన్నగా తన యయోధ్యం గాంచ, దీక్షా విసర్జనాదిక మొనర్చి
మంగళాభ్యంగన మహిత వైభవముల, మాంగల్య వస్తు సమ్మానితుఁడయి
గీ. తమ్ములుం దా రలంకారతతిఁ జెలంగి, యెల్లవారలుఁ గైసేసి యెచటఁగాంచి
నను జగన్మోహనమ్మగ గనుచు వాద్య, ములు, వెడలె నింటికిఁ రామమూర్తి కడఁగి.

## శ్రీరామాదుల అయోధ్యా ప్రవేశము

శా. నంది గ్రామమునన్ అయోధ్య యొకఁడై నట్లున్నవే గాని, వే
రందామన్నను వీలులే దపుడు, బ్రహ్మాండంబు భవ్య ప్రజా
బృందంబున్ ప్రసవించెనో? యనగ! నెవ్వారిం గనుంగొన్న, నిం
పొందన్ పూచిన మ్రాకులట్ల కనుసొంపుం గూర్చి రప్పట్టునన్.

క. మణి దీపములను రామా, మణు లెత్తిరి! రఘుకుల ప్రభామణికి ప్రజా
గణ ముల్లసిల్ల, తారా, గణములు గనవచ్చినట్లుగా భువినిండన్.

సీ. అంత సీతాసతి అత్తలకును నరుం, ధతి వశిష్ఠులకు వృద్ధ జనములకు
పరమపూజ్యులు నగు బ్రాహ్మణోత్తములకు, క్రమము మీఱఁగ నమస్కారము లిడ!
మాతులు లెల్లరు సీత నాలింగించి, మంగళాభ్యంగన మహితఁ జేసి
మంగళ వాద్యముల్ మహిమీఱ మ్రోయఁగా, వస్త్రాద్య లంకృతుల్ వఱలఁ జేసి
గీ. ఎన్నినాళ్ళకు కన్నుల కిట్టి వైభ, వంబు సంప్రాప్తమయ్యె! నిక్కంబు గాఁగ!
కండ్లు పోయినవమ్మ! మాయిండ్లు అడవు, లయ్యె! యిన్నాళ్ళనిరి! ప్రజ లందఱపుడు.
గీ. సత్కరించిరి సీతకు సరసమతిని, అత్తలును పౌరనారులు ననుపమాన
మైన యాదర మొదవంగ నమల మంగ, ళ ప్రధాన వస్తువులఁ సలక్షణముగ!

కం. అప్పుడు భరతుఁడు భక్తియు, ముప్పరిగా పాదుకలను పూజించి ముదం
బొప్పగ రాముని పదముల, కొప్పించెన్ ధన్యుఁడగుచు నుత్సుకమతియై.

మ. మఱియున్ చాల విధేయుఁడై పలికె, సమ్యగ్రీతి నన్నా! మహా
భరమై నాపయి మీర లుంచిన యనల్పం బైన యీ రాజ్యపుం
భరమున్ మీరలు వెండియుం గొనుఁడు! శ్రీ భండారముల్ సైన్యముల్
గరిసెల్ గుమ్ములు వృద్ధి! యేలుకొని సౌఖ్య శ్రీల మమ్మోమ్ముమా!

గీ. జగమునకు నీవ భర్తవు! మగిడి నేను, ఏలుమని పల్కుటిది భ్రాంతియే గదయ్య!
రేయి బవలును నీ వాగి రెప్పవేయ,కుండ మము బ్రోవకున్న మాయండ యెవరు?

క. అని ప్రార్థించిన భరతుని,గని సంతసమంది భరతఘనదత్త లస
న్మణి భూషణముల వస్త్రా,లిని దాల్చి రఘూద్వహుం డలేఖ్య మనీషన్.

ఆ. సీతతోడ గూడి శ్రీరామచంద్రుండు, దివ్యవస్త్ర రాజిఁ దేజరిలుచు
రథముమీద నెక్కి విధి చోదితమ్ముగ, పురిఁ బ్రవేశమయ్యె! పుణ్యమొప్ప.

క. సంగీత నర్తనంబులు, రంగారగ శ్రోత్రనేత్ర రమ్యముగాఁగా
మంగళ వాద్యంబు లెసం,గం గడు వేడ్కన్ అయోధ్యఁ గని రింపెసగన్.

గీ. పురపురంధ్రులు పెల్లుగ పూలవాన, మేడలందుండి కురిసిరి మించువేడ్క!
వివిధబలుల నీరాజన వితతిఁ గూర్చి,రంత సీతకు నంతఃపురాజ్ఞయయ్యె!

శా. శ్రీరాముండు కుబేరపుష్పకమునున్ ప్రేమార్ద్ర దృష్టిన్ శుభం
బారం గాంచి వచించు; పుష్పకమ! సంపన్న ప్రభాశాలి వీ
ధౌరంధర్యతతో కుబేరుని నిరంతం బీవు సేవింపుమా!
నా రమ్యాభి నుతుల్ వచింపుమ! యటన్నన్ పుష్పకంబుం జనెన్.

## శ్రీరామ పట్టాభిషేకము

సీ. అంత శ్రీరాముఁ డత్యంత వైభవ మొప్ప, కపులతోడను మహా విపులసైన్య
బంధుమిత్రామాత్యపౌరజనాళితో, సరస సభాప్రవేశంబుఁ జేసి
వైభవమేపార వరకపీంద్రులకు ని,వాసస్థలంబు లేర్పాటు చేసి
సుందర నిఖిల వస్తులవారికిం గూర్చు, నేర్పాటొనర్చి మహీవరుండు

గీ. కులగురుండైన యవ్వశిష్ఠులు వచింప, రాజ్య పట్టాభిషేక విస్రంభమాణ
మునకు నెల్లర నాయాయి పనుల కనిపి, సరసమతి యొప్పె! శ్రీరామచంద్రమూర్తి!

సీ. హనుమదాదులు సమస్త నదీనద సముద్ర,మంగళ జలములన్ సంగ్రహింప!
దిగ్గేశ నృపతులు దివ్యమహా వాద్య,ములతోడ తగు కప్పములను తేర!
చతురంగ బలములు సతతంబును పరాకు,లేక కెలంకుల మూకగొనగ!
దేవరాజర్షులు దివ్య పవిత్రాక్ష,తలబూని వేదబుక్కులు వచింప!

గీ. భరత లక్ష్మణ శత్రుఘ్న పరివృతుండు! వామపార్శ్వ సీతా సతీవరయుతుండు!
అంజనీ పుత్ర సేవితుం డగుచు నొప్పె! రమ్యమూర్తి! శ్రీపట్టాభి రామమూర్తి!

శా. శ్వేతచ్ఛత్రముఁ బూని లక్ష్మణుఁడు వెన్వెన్కన్ బ్రవర్తింపఁగా
ప్రీతిన్ చామర హస్తులై భరతుఁడున్ శ్రీ మీఱ శత్రుఘ్నుఁడున్

చేతోమోదముమీఱ పార్శ్వముల స్వస్తి శ్రద్ధ సేవింపఁగా
సీతా సేవితుఁడైన రాముఁగనిరా క్షేమంబులో టబ్రమే ?

క. శ్రీరామ దివ్యపాదుక, లారాధించుచును హనుమ అప్రాకృత సా
ఖ్యారామ సీమనేలు కృ,పారాజితుఁడైన రాముపదముల యందున్.

క. బలులగు నాసుగ్రీవా,దులు వాయవ్యాదులగు చతుష్కోణములన్
నిలిచి రఘురామచంద్రుని, గొలువఁగ కొలువుండె శ్రీరఘు ప్రవరుఁడటన్.

సీ. జలపాత్రముంబూని సరస సుగ్రీవుఁడు, వాయవ్యమందు శుభముగ నుండ !
తాంబూల భవ్య పాత్రము బూనిన విభీష,ణుండు నీశాన్యమందుండి కొలువ !
వస్త్రకోశము జాంబవంతుఁ డూని వహించి, నైఋతీ దిశను ధన్యత వహింప !
ద్రవ్యకోశముఁ దాల్చి తగనంగదుండు నా,గ్నేయ భాగమున సన్నిహిత మొంద !

గీ. రామ కరుణా కటాక్షపాత్రత వహించి, నిలువ ! దివ్య మంగళరత్న నివహ మొప్ప
నాణ్యమైనట్టి సింహాసనమున నొప్పె ! రత్నకంబళవర్తి ! శ్రీరామమూర్తి !

సీ. సంపాతి సౌమిత్రి సామీప్యమున నుండె ! గుహుఁ డుండె భరతునిఁగూడి ప్రక్క !
గరుడుండు శత్రుఘ్ను కడనుండె ! సుగ్రీవు, కడ చిత్రరథుఁడు పొంకముగ నిలచె !
విజయుండు నలరె నెమ్మిని విభీషణు పొంత ! నంగదు కడ నమాత్యపతి యుండె !
దారకుడుండె మందర జాంబవంతుని, సన్నిధియందు సంస్కార మొప్ప !

గీ. పలు తెఱంగుల దివ్య మంగళములైన, శుభ పదార్థ జాలంబులు శోభిలంగ
తత్సభా స్థానమునకు సౌందర్య మొసఁగె, సరస పథవర్తి ! శ్రీరామ చంద్రమూర్తి !

సీ. నేనును నాతోడ నిఖిల దేవతలును, శ్రీరామ పట్టాభిషేకమునకు
పార్వతీ ! యేగితి మున్వోస్థలిని గల్గు, పర్వతంబులు వృక్షపంక్తి వచ్చె !
గంధర్వ కిన్నర ఘన యక్షగణములు, తన్మాహాత్మవపు సందర్శనంబు
నభిలషించుచు వచ్చి రపు డింద్రుఁడు వచింప, వాయుదేవుండు సువర్ణ రత్న

గీ. మణిఖచిత దివ్యహారంబు మాన్యుఁడైన, రామచంద్రుని కర్పించె ! ప్రేమమీఱ
భక్తితో నింద్రుఁ డర్పించె ! భవ్య రత్న,హారమును రామునకును స్వయంబుగాను !

గీ. దేవ గంధర్వు లపుడు స్తుతించి రామ,చంద్రుఁ బాడిరి, దేవ వేశ్యానికరము
లాడి, రట దేవదుందుభుల్ గాడమ్రోసె, గగనమునుండి పువ్వులుఁ గడఁగి కురిసె.

గీ. అపుడు భరతుఁడు నన్ను సభాంతరమున, పూజగావింప మిక్కిలి పొంగి నేను
చెలగు శ్రీరాము పట్టాభిషేక సమయ,మందు శ్రీరాము స్తుతి చేసి తిందువదన !

వ. అది యెట్లన్న.

### శంకర కృత శ్రీరామాష్టకము

క. పరమ పవిత్రా! వానర, వరమిత్రా! శ్రీకళత్ర! వారిదగాత్రా!
కరుణాఢ్య! కంజనేత్రా! నిరతము శ్రీరామచంద్ర! నిన్ను భజింతున్.

క. పరిహృత భూభారా! సం, సరణాలంకార! నిగమ సంచార! సుఖా
కర! నిర్వికార! ధార్మిక!, నిరతము శ్రీ రామచంద్ర నిన్ను! భజింతున్.

క. శరదిందుహాస! లక్ష్మీ, విలాస! లంకా వినాశ! విశ్వమయా! భూ
సురవాస! భువనదీపక!, నిరతము శ్రీరామచంద్ర! నిన్ను భజింతున్.

క. సురలోకపాల! వాగ్విజి, తరసాల! నికృత్త సప్తతాలా! నక్తం
చరకాల! సుర సుమార్చిత!, నిరతము శ్రీరామచంద్ర! నిన్ను భజింతున్.

క. కరివరయానా! సురవర, నిరంత వేదాంతగాన! నిఖిల సమానా!
అరివర్గ హరణ! గుణనిధి!, నిరతము శ్రీరామచంద్ర! నిన్ను భజింతున్.

క. పర రణధీర! రఘూత్తమ! నరవరలీలా! గభీరనాదా! విశ్వై
కరస! జిత సర్వవాదా! నిరతము శ్రీరామచంద్ర! నిన్ను భజింతున్.

క. దురితాత్మ శిక్షకా! స,త్పరిరక్షక! వాగతీత! పరమామేయా!
సురుచిర పుణ్యశ్లోకా! నిరతము శ్రీరామచంద్ర! నిన్ను భజింతున్.

క. నినుగూర్చి నేను చెప్పిన, వినుత శ్రీరామచంద్ర విమలాష్టకమున్
వినువారు చదువువారును, కనుగొందురు వారభీష్ట కార్యము లార్యా!

క. అని యీరీతిని నుతియిం,చి నయంబుగ నిలచినంత శిరిగులుకఁగ తా
వినువీధి విమానంబున, నునికిచేసి దశరథుండు నుత్సుక మతియై.

### శ్రీరామ పట్టాభిషేకమును దశరథుఁడు స్వర్గమునుండి కాంచుట

గీ. సూర్య సమకాంతితో వెలుగుచును, దశర,థుండు దివినుండి, సకల బంధువులు మంత్రు
లాప్త పరివారములతోడ నధిక వైభ,వంబుతో రత్న సింహాసనంబు పైని.

శా. ఆసీనుండయి భవ్య తేజమున దివ్యత్తేజుఁడౌ రామునిన్
శ్రీసాక్షాత్పరమాత్ము ధన్యమతియై శ్రేష్ఠస్థితిన్ గాంచి తే
జోఽసామాన్యములైన వాక్యముల నాహ్లాదంబుమై సంస్తుతి
శ్రీ సంధిల్లఁగ నిట్లనున్ ముదముమై; జీవంబు ధన్యంబుగన్.

ఉ. శూర శిరోమణీ! సుగుణశోభిత! నీ విట రాజ్య పట్టముం
జేరి యలంకరించి, ప్రభచే వెలుఁగొందగ నిన్ను జూఁచి, యెం
తో రమణీయమై పరమ తోషదమై హృదయంబు నిండె; నే
భూరి కృతార్థతం గనితి! భూరమ సార్థకమయ్యె! నియ్యెడన్.

ఉ. పావనమయ్యె! నా కులము; పావనమయ్యె! మదీయ రాజ్యముᳯ;
పావనమయ్యె! భూరి ఖల భారము బాసి ధరిత్రి యెల్ల; సౌ
ఖ్యావహమయ్యె దేవతల కందఱికిᳯ; కడు ధన్యురాలు గా
దే! యిల సద్భవజ్జనని, తేకువ నిన్గనె పట్ట భద్రునిᳯ.

ఉ. ఇట్లు విశేష వాక్యముల నెంతయు తృప్తివహించి ధన్యుఁడై
నట్లుగ, నాకసంబున మహామతియై వెలుఁగొందు రాజు, మి
ర్మిట్లగు వాని తేజమును, మించిన సద్హృదయంబుం గాంచి, చ
ప్పట్లను జేనినాదములఁ బల్మరు మ్రొక్కిరి సభ్యులెల్లరుᳯ.

గీ. తొలుత దశరథుᳯ రామచంద్రుండు మ్రొక్కె! వరుసతోడుత కౌసల్య, వరసుమిత్ర,
పిదప కైకేయి, యూరిలో పిన్న పెద్ద,లెల్ల మ్రొక్కిరి; సంతస ముల్లసిల్ల.

గీ. భరత లక్ష్మణ శత్రుఘ్న వరసుమంత్రి,శేఖరులును విమానస్థుఁ జేతులెత్తి
మ్రొక్కి రననేల? దశరథు మ్రోల మొక్క, నట్టివార లా సభ లేరు! అద్రి తనయ!

శా. ఆ రాజంద ఱు వేరువేరుగ విశేషాశీస్సులం జేసి, అం
దే రాజిల్లెడి దేవతానికర మెంతే సంతసిల్లᳯ, నమ
స్కారంబుల్ రచియించి, క్షేమముల వేడ్కᳯ పృచ్ఛ కావించి, యా
శ్రీరామావనినాథు పూజఁగొని చేరెᳯ దేవతా భూమికిᳯ.

చ. అపుడు సమస్త దేవతలు అబ్బురమొప్పగ రాము మన్ననల్
విపులముగాఁగఁ గైకొని, ప్రవీణుని రాముని వీడి రెంతయో
కృప దళుకొత్త దీవనలొగిᳯ పొనరింపుచు, వారివారి వి
ష్టపములజేర; నంతట యశస్కరుఁడా రఘురామచంద్రుఁడుᳯ.

శ్రీరాముఁ డందఱ బహూకరించుట

ఆ. బ్రాహ్మణోత్తములకు బంగారమును గోవులను సంఖ్య లిచ్చె ననుపమముగ!
సకల వృక్షములును సఫలంబు లప్పుడు, సస్యవృద్ధి ధరణిఁ జక్క నొప్పె!

సీ. అర్కప్రభారత్నహారంబు సుగ్రీవునకు భక్తవత్సలుం డొకటి యిచ్చె!
శ్రేష్ఠావతంసంబు శ్రీరాముఁ డపుడు వి,భీషణునకు నిచ్చె ప్రియము మీఱ!
శస్త్రమౌ బాహుభూషణ మిచ్చె రఘుపతి, అంగదునకు ప్రేమ తొంగలింప!
కోటిచంద్రప్రభ కొమరొప్పు రత్నహా,రం బిచ్చె సీతకు రామమూర్తి!

గీ. ఆమె అద్దివ్యమౌ రత్నహార మపుడ, అంజనీసూనున కొసంగె నద్భుతముగ!
అద్దిగాంచి సభాస్థులందఱపుడు, హర్షపులకిత గాత్రులై యతనిఁ గాంచి.

## హనుమంతునకు రత్నహారమును సీత బహూకరించుట

ఉ. అంజని పుత్ర! ధన్యుఁడవు! అద్దిర! నీ దగు జన్మసార్థకం
బంజని గర్భమయ్యెను కృతార్థము! సీత స్వయంబుగాఁగ శ్రీ
రంజిల ప్రేమతోడుతను రాముఁ డొసంగిన హారమిచ్చె! మె
చ్చంజను నీదు సేవల! ప్రశంసకుఁ బాత్రుఁడవయ్య! పావనీ!

మ. అని జే! జే! నినదంబు లొప్పగ కపుల్, అయ్యంజనీ పుత్రునిం
గని స్తోత్రించిరి! వాయుపుత్రుఁడును వేడ్కన్ సీతచే నీయబ
డ్డ నవీనోజ్జ్వల హారమున్ కరమునిండా బూని దూరంబుగాఁ
జని కూర్చుండి యొకొక్క రత్నమును నంజం జొచ్చె నాశ్చర్యుఁడై.

క. ఒక్కొక రత్నము నోటం, జిక్కగఁగొను, చప్పరించి చేదను నటులం
బక్కన పగులం గొరుకును, పుక్కిటఁగొని యుమియుటయు నపుడ సేయంగన్.

మ. సభికుల్ గాంచి యిదేమి? వీనికి మనశ్చాంచల్యమే కల్గెనో?
సభయం దయ్యెనో? దృష్టదోషము! లసత్సన్మాన మొప్పన్, రవి
ప్రభ రాజిల్లెడి రత్నహార మొసఁగన్ ప్రఖ్యాతిగా సీత! యి
ట్లు భయంబేది, యితండు భిన్నముగ పాడుం జేయునా? కొంకకన్.

వ. అని యెల్లవార లనుచుండ.

చ. అది గని సీత క్రుద్ధయయి, యాతని దగ్గర జేరఁ బిల్చి, యే
మిది పవనాత్మజా! నను మహిన్ బ్రతికించిన బంటవౌట, స
మ్ముద మొదవన్, మదీశ్వరుఁడు ముచ్చటగా పరితోషమీయ, నీ
కది కద! ఇచ్చితిన్; యిటుల నాగముచేసితివేల? చెప్పుమా.

మ. ఇది నీ కంఠమునం దనారతము తండ్రీ! యుండు నంచున్ మహా
ముద మొప్పారఁగ నేను నీ కొసఁగ, సంపూర్ణాంబుగా దానినిన్
దుది గావించితి, వొక్కటే క్షణమునన్; దుష్టాత్ముఁడం చందునా?
ఎద నున్మాదముగా తలంతున? కడున్ హేయంబు నీ చైదమా.

శా. ఏలా? ఇట్లొనరించినావు! తలపన్ హ్రీశాలి వీ వన్న, నా
కేలా? తల్లిరో! రామనామ రసతా హీనంబు హారంబు! నా
కేలా? రత్నపు పేరిరాళ్లు! జగమం దే నెన్నఁడున్ రామ నా
మాలాప ప్రవిహీన వస్తుతతి, నెయ్యంబొప్పఁ దాల్పంగదా!

మ. అని ధీరుండయి బల్కు మారుతిని, సత్యంబైన యప్పల్కులన్
విని, ఏరా! హనుమంత! నీ తనువు పృథ్వీ వాయుతేజాగ్ని తీ

ర్థ నిజాకాశ మయంబెగాక, అది శ్రీరామ ప్రభా పూర్ణమే?
యని దానిన్ ధరియించినావె? పడవేయన్ రాదె! దొడవ్వులన్.

చ. అని వచియింప, మారుతి, మహాజననీ! అది యట్లె కానిచో
క్షణ మయినన్ ధరింపను; నిజమ్మన! నెమ్ములు ప్రేవులున్ ప్రతి
క్షణమును రామనామజప సంస్మరణాత్తములా? యటన్న; నా
జనని! కనం దలంపు పెలుచన్ గలదే? యిదె కాంచుమం చొగిన్.

క. ఆ మారుతాత్మజుం డపు,డేమియు సందేహపడక హృదయము కరముల్
బ్రామి పగులంగఁ జీరిన,రాముఁడు లక్ష్మణుఁడు సీత రహిఁదోఁచిరటన్.

శా. ఎమ్ముల్ ప్రేవులు రోమ రోమములు నెందే! విన్నచో? రామ నా
మమ్మే వ్రాసె; పవిత్రనామమె లిఖింపం బడ్డ దెందేఁ గనన్
ఇమ్మై యొప్ప మనంబునిండి, విలసత్త్వేమాభమా విగ్రహా
లమ్మారుత్సుతు మేను రామ మయమై, యత్యద్భుతో పేతమై.

శా. శ్రీరాముంపు డాత్మభక్తుని లసచ్ఛ్రీభక్తి మాహాత్మ్యమున్
ఆ రామామణి సీత కేర్పడ, ననన్య ప్రీతిసంధిల్లఁగా
శ్రీరంజిల్లఁగఁ దెల్పి, యా హనుమ శారీరాకృతిన్ ఎప్పట
ట్లై రాజిల్లఁగ స్వీయహస్తమున రాయన్, సంభృతోల్లాసియై.

క. వినయ విధేయత లొప్పఁగ, వినమిత గాత్రుఁడును బద్ధ విమలాంజలుఁడై
తన స్వామిముందు నిలచిన, ఘనముదమున రాముఁడనియె కనికర మొదవన్.

శా. నాభక్తుం డెద నన్నుఁగా కితరమున్ నాతన్వి! దాఁగోరునే?
ఓ భద్రాంగి! తదీయచిత్త మెపుడున్ యోజించు నాసేవలన్
ఆ భక్తున్ సకలంబు నే నగదు; నన్నా భక్తుఁడే చెందు, మి
థ్యా భావంబుల వారికే దిహపరం బజ్ఞాతపత్రేక్షణా!

చ. అని హనుమంతుఁ జూచి తనయా! ఇక వేడుము! నే ప్రసన్నతం
గనితిని! నీదుభక్తికి; జగంబున దుర్లభమేది? నీకు; నీ
మనమునఁగల్గు కోర్కి సులభంబని కష్టమటంచుఁ జూడ కి
త్తును! నిజభక్తుఁడొందు పరితోషము కన్నను ఎక్కుడున్నదే?

ఆ. అని యనుగ్రహించె! నందులకై మారు,తాత్మజుండు సంతసాంతరంగుఁ
డగుచు రామమూర్తి మొగదల మ్రొక్కి ఇట్లనియె! వినయవినమితాంగుడగుచు.

సీ. కదళి ఖర్జూరాదిఁ ఫలరసంబులకంటె, ఆరయ నీనామ మధిక రుచిర!
నవరస పరమాన్న నవనీతములకంటె, ఆరయ నీనామ మధిక రుచిర!

పనస జంబూ ద్రాక్ష ఫల రసంబులకంటె, అరయ నీనామ మధిక రుచిర!
పుత్ర మిత్ర కళత్ర భోగ భాగ్యముకంటె, అరయ నీనామ మధిక రుచిర!

గీ. రామ శ్రీరామ జయరామ రామరామ!, అనుచు నీనామ జపమునే ననవరతము
భక్తి తోడుతఁ గావింప భుక్తి వలదు, ముక్తి వలదయ్య! శ్రీరామమూర్తి! నాకు.

సీ. జగతిపై నీనామ సంస్మరణంబెకా, భుక్తి ముక్తు లొసంగి ప్రోచుచున్న
జగతిపై నీనామ సంస్మరణంబెకా, ఇహ పరంబు లొసంగి యేలుచున్న
జగతిపై నీనామ సంస్మరణంబెకా, సంసార భంధముల్ సడలజేయు
జగతిపై నీనామ సంస్మరణంబెకా, ఆపత్తులెల్ల సంహారణజేయు!

గీ. అట్టి నీనామ భజనంబె అహరహంబు, అనవరతమును వాంఛింతునయ్య రామ!
రామ శ్రీరామ జయరామ రామరామ, రామ రఘురామ జానకీరామ రామ!

శా. నీ నామంబు స్మరించుటం గనదు తృప్తిన్ స్వాంత మోరామ! వి
జ్ఞానానందమయ స్వరూప! వరదా! జన్మాదులుం గల్గ, నీ
ధ్యానంబందు కొఱంత కల్గు, పరముం గాంక్షింప తద్భంగ భీ
తే నన్నేచ, సదా నినున్ స్మరణ మిట్లే సేయఁగా నీయవే!

సీ. నీనామ జపమతి నివసింతు భూమిపై, ఆచంద్రతారార్క మనవరతము!
నీనామ జపమతి నివసింతు భూమిపై, నీనామ మీభువి నిలుచువఱకు!
నీనామ జపమతి నివసింతు భూమిపై, నీ చరిత్రలుపల్కు నిలయములను!
నీనామ జపమతి నివసింతు భూమిపై, నీకథల్ వినుచునిన్ నిష్ఠదలచి!

గీ. ఎచట నీ కథల్ వినబడు నచటి కేను, అన్ని చోటుల కేఁగఁగా నాజ్ఞయిమ్ము
అరయ నట్టి మనోవేగ మమర నిమ్ము, అట్టిదైన జీవన్ముక్తి నభిలషింతు.

క. అని వరములఁ బ్రార్థించిన, విని అంజనిసూతి! ముక్తి వెలసెన్ నీకున్
నిను కలచ నేరవే బంధనములు దంధనము లిక సుధామయ హృదయా!

సీ. నీ యిచ్ఛవచ్చిన ట్లీ యిలాతలమున, వసియించుమా! నీవు పవనతనయ!
ప్రళయ కాలంబున ప్రవిమలముగ నీకు, సాయుజ్యముక్తి నిశ్చయము హనుమ!
నిన్ స్మరించెడి వారి నిర్మల హృదయంబు, నాకు నివాసమౌ నో కుమార!
నిను గొల్చువారికి నిర్మల శ్రీరామ, భక్తి ప్రపత్తులు వఱలుగాత!

గీ. నీకు నాకు నభేదమై నెగడుఁగాత! నన్ను జేరంగ భక్తులు క్రన్ననంగ
నిన్ను దగ్గఱబాట చేకొన్నరీతిఁ, గొల్చి తరియింత్రుగాత! నిక్కువము గాఁగ!!!

ఆ. అని వరంబులిచ్చి నంతట జనకాత్మజాత యిట్టులనియె సరసమతిని
అన్న! నీ యెడన్ ప్రసన్నురాలను నేను, వరములిత్తుఁ బ్రీతి వఱలె నాకు.

శా. నా యాజ్ఞన్ హనుమంత నిన్ను జనముల్ నానా ప్రకారంబులన్
శ్రేయంబుల్ లభియింపఁగొల్తు రిక సుశ్రీ విగ్రహాప్తిన్ సదా
ధ్యేయ క్షేత్రములందు, తీర్థములలో, దేవాలయ క్షోణినిన్,
ఆ యా పట్టణమందు, పల్లెల, ననన్య ప్రీతి సంధిల్లగన్.

క. తోటల కోటల పేటల, చోటుల దీర్ఘాటవులను, శుభదాశ్వద్థో
త్కోటుల తటాక తీరో,ద్యాటికలన్ నిన్ను నిల్ప వరలు ! పవనజా !

ఉ. ఎవ్వరు నిన్ను శ్రద్ధఁగొని యిప్పుడు నేను వచించు తావులన్
మవ్వపు భక్తినిల్పి, పరమంబగు బుద్ధిని పూజసేతురో
అవ్వరభక్తులన్ శుభములందును, భూత పిశాచ బాధలున్
దవ్వగు; విఘ్నము ల్దొలగు; తప్పక గల్గును ముక్తి చేరువై !

శా. నీ నామస్మరణంబుచేత నరులన్ ప్రేతంబులున్ భూతముల్
నానా రుగ్మతలెల్ల దూరమగుతన్, నారీమణుల్ కొల్చుచో
సూనుల్గల్గఁగ భాగ్య భోగ మొదవున్, సొంపొప్ప నీ సేవచే
జ్ఞానంబున్ మఱి రామభక్తి యొదవున్ సమ్యగ్విధిన్ మారుతీ !

ఆ. అనుచు వరములిచ్చె ! నటుపిమ్మట నయోధ్య,వచ్చియున్నయట్టి వానరులకు
తక్కువారలకును తత రత్నములను ఆ,భరణములను ప్రీతి వఱలఁజేసి.

ఉ. వస్త్రములు లిచ్చి కొందఱిని, వాహనపాళి నొసంగి కొందఱిన్
శాస్త్రవిధిన్ సమర్చనము సల్పి, రఘూద్వహుఁ డప్డు భవ్య మో
దాస్త్ర పరంపరల్ నిగుడ, తత్పరతన్ గడుఁ గారవించె, భా
స్వ త్త్రివిధాప్తులన్ సుఖుల సల్పెను, దాసుల బంధు మిత్రులన్.

క. సంపాతిని, మకరధ్వజు, నింపుగ గుహు, నిఖిల రాజ నివహంబును మ
న్నింపన్ వారలు మోదపు, ముంపులఁ దగఁ దేలియాడి ముమ్మర మతులై.

వ. ఉండునెడ.

ఉ. అందఱితోడ రాముఁడు మహా ముదమొప్పగ భోజనంబు సే
యం దగు పంక్తిసేయ, పరమాదరులై జనులుండ, శ్రీమరు
న్నందనుఁ డా రఘూద్వహు ఘనంబుగఁ జేరి, తదీయ పాత్రలో
నం దనరారు పాయసము నవ్యరుచిం దినిసాఁగె నిచ్ఛమై.

క. అదికని కపులందఱు తమ, యదనుల విడి వచ్చివచ్చి యప్పాయసమున్
చెదఱంగఁ గొట్టి కొండొక, గదిసి తినఁగ జొచ్చి రమిత కాంక్షఁ దలిర్పన్.

శా. రామోచ్ఛిష్టము దక్కె ! దక్కె ! ననుచున్ రమ్యాత్ములై వార లెం
తో మోదంబున, నెంత మంచిపని వేతోచెన్ మరున్నందనా !

ప్రాముఖ్యం బిదె! యంచు నంజనిసుతున్ మన్నించి, సుగ్రీవుఁడున్
శ్రీమంతుండగు విభీషణుండును కపిశ్రేష్ఠుల్ లసత్తోషులై.

క. ఈ తీరగు కోలాహల, మాతతముగఁ జరుగుచుండ నది గని పెలుచన్
సీతారాముల తోడుత, ప్రీతిం గనుచుండి రంత ప్రేమముఁ గదురన్.

క. నానా వినోదములతో, నానావిధములగు హాస్య నాదంబులతో
పూనిక నక్కపిపీరులు, మానితముగ రామునకును మక్కువ వొడమన్.

చ. అతనికి సంతసం బొదవ, నయ్యెడ కొన్ని దినంబులుండి, ని
ర్జిత బహు దానవుండును, విరించిముఖ స్తవనీయుఁడున్, దివ
స్పతి సముఁడైన రాఘవుని సన్నిధి రోజు లొగిన్ క్షణమ్ములై
కుతుకమునన్ జెలంగిరి; అంకురిత దోర్విభవాభి రాములై.

శా. అంతన్ చేతనమైన పుష్పకము దీవ్యద్వేగమే జానకీ
కాంతున్ సన్నిధివ్రాలి మ్రొక్కియను; శ్రీకాంతా! కుబేరుండు నీ
చెంతనే నన్ను సపర్యలన్ సలుపఁ బంచెన్ రామ! నిక్కంబునన్
జింతింపంగ త్వదీయ స్వత్వము నన్ శ్రీరామచంద్రుం డనున్.

ఆ. నా యధీనవెట్లు? నీ యధిపతి కుబేరుండు గద! యటన్న, దండిజేడ!
రావణుండు గెలిచి రక్తి నన్నుంగొనె, వాని గెల్చితీవు పూని రామ!

క. కావున నా కధిపతి విక, నీవేకద! యిట్లుతెల్పి నిరబుతి పంపెన్
సేవింతు నిన్ను రాఘవ! భావంబున భక్తినిల్పి పరమదయాళూ!

క. నీవు మరల వైకుంఠం, బావాసముగాగ నరుగు నంతకు నిన్నున్
సేవింతు భక్తి మెయి నో, దేవా! నన్నుం గటాక్ష దృష్టిం గనుమా!

వ. అని యిట్లు ప్రార్థించి.

చ. నిలచినఁ జూచి రాఘవుఁడు నిర్భర సమ్ముదమంది, మైనచో
కొలుచుచు నాదు డెందమునకున్ ముదమి; మ్మిపుడేగి నాదు బం
ధుల కపులన్ విభీషణుని తోడ్కొనిపోయి, సగౌరవంబుగా
చెలువుగ వారితావులకు జేర్చి, రయంబున వచ్చియుండుమా!

క. అనినంతన పుష్పక మి,మ్మున వారలఁజేర్చి వచ్చి, ముఖ్యద్వార
మ్మున గాచియుండె, నంతట, జనవరుఁ డేలెన్ ధరన్ ప్రశస్తము గాఁగన్.

సీ. లంకాపురం బకళం కంబుగా నేలె, నవ్విభీషణుఁడు ధర్మాభిరతిని!
పాతాళమేలె శుంభ ద్వైభవంబున, మకరధ్వజుండు ధర్మ ప్రవృత్తి!
కిష్కింధలోన సుగ్రీవుండు తన రాజ్య,మేలె కపీశ్వరులెల్ల మెచ్చ!
శృంగబేర పుర మ్మభంగురముగ నేలె, గుహుండు సత్కార్య ధూర్వహుండు నగుచు

గీ. తనదు యౌవరాజ్యమునను సంపాతిని, గరుడుఁడుంచె ధర్మ కర్మలీల!
వాయుజుఁడు హిమాద్రి వర తపోనిష్ఠా గ,రిష్ఠుఁడగుచు నేగె శిష్టమతిని.

ఆ. అపు డపుడు విభీషణాదులు శ్రీరామ, దర్శనాభిలాషఁ దవిలి వచ్చి
ఉండి కొన్నినాళ్ల యోధ్యలో సంతుష్టి, నొందుచుందు రెంతొ పొందుమీఱి.

క. రాకల పోకలచే సు,శ్రీకర సౌఖ్యములఁ దేలి చెల్వొందిరి అ
ప్రాకృత సుస్నేహంబున, మేకొని సుగ్రీవుఁ డాది మేల్కాపు లెల్లన్.

సీ, అందఱి యందు మహా ప్రీతిగా రామ,చంద్రుఁ డేలెన్ స్వరాజ్యంబు ప్రీతి!
వలదన్న వినక శుంభత్సలాకృతి భర,తుని యౌవరాజ్యమందునను నిల్పె!
లక్ష్మణమూర్తి విలక్షభక్తిని, కంటికి రెప్పయై కాచు రాము!
శత్రుఘ్నుఁ డెట్టుల సౌమిత్రి రాముని, గొల్చునో? అట్టులఁ గొల్చు భరతు!

గీ. తలచినంతన మేన పుల్కలు జనించు, భూమిపై అంతకున్ మున్ను పుట్టలేదు!
ఆపయిని యింతవఱకు లే రట్టి ఘనులు, రామ లక్ష్మణ భరత శత్రుఘ్నవరులు!!

ఉ. పూర్వము గాధిసూనుని యపూర్వపు యజ్ఞము పూర్తిసేయగా
పార్వతి! వచ్చి తా ప్రతినవట్టిన భవ్యరణంపు యజ్ఞమున్
ఉర్వర పూర్తిచేసె నిపు డుజ్జ్వలమూర్తి! రఘూద్వహుం; డొరుల్
నిర్వహణం బొనర్పఁగను నేర్తురె? దీని నవిఘ్న పూర్తిగన్.

క. ఆ రణయజ్ఞము నే నిట, గౌరీ! వర్ణింతుఁ గనుము కమ్రఫణితినిన్
శ్రీరామచంద్రు లీలలు, ధారుణి బహుధా విచిత్ర తరములు కావే?

## శ్రీరాముఁ డొనరించిన రణయజ్ఞ వర్ణనము

ద్వి. ఆ యుద్ధరంగమే యజ్ఞకుండంబు! వేదవిధియె పరువెత్తకయుంట!
రణకర్మమే యగు బ్రహ్మ సద్మంబు! వివిధాస్త్రనాదముల్ వేదనాదములు!
స్రుక్స్రువమార్జన సూవె సానపని! ఇలబడు బాణములే పరిస్తరణ!
మురుతర ధైర్యమే పరిసమూహనము! యజ్ఞేశ్వరుండు కాలాగ్ని! భవాని!
బాణస్రువంబుల బఱపి యెక్కుడుగ, మాంసాహుతియెచూ సమర్పణ! మతివ!
రక్తధారయె వసోర్ధార! లతాంగి! అగు ప్రణవ రవము హాహారవమ్మ!
అమలాస్త్ర కాంతులే యాగాగ్ని రుచులు! ఘర్మప్రవాహమే ఘన ధూమ్ర మంబ!
పృషదాజ్య సేచనంబే వీరవరుల, చేతి యస్త్రము లూడి క్షితిని వెలుగుట!
జ్ఞానజీవబలి విశాలాక్షి! యచట, దీపబలి ప్రదాతృ ప్రయోజనము!
పరుగిడువారలే బలిదీపహరులు! బలిభక్షణపు దోషపరతచే వారి
శరయ ముక్తి హుళక్కి యయ్యె శర్వాణి! తలల పూర్ణాహుతి దనరెనో సాధ్వి!

తత సవ్యగమనమే తగు ప్రదక్షిణము! నిజపద దానమే నిఖిల దక్షిణలు!
బ్రహ్మాభిషేకమే బహు దేవవృష్టి! శ్రేయాప్తియే జయస్థితిని చేకొంట!
యెలమి గోత్రానందమే యామృడాని! స్థావర జంగమ సంతుష్టి అఱయ!
విప్ర సంతుష్టి తస్వి! భూతతృప్తి! ఇట్లు శ్రీరాముఁ డహీన విక్రముఁడు
పవర యజ్ఞంబు సుబాహునితోడ, కౌశిక యాగరక్షణ మిషఁజేసె
నవి రెండు సమముగా నప్పుడ నడచె! ముని యజ్ఞమప్పుడే ముగియించి వైచె!
రాముఁడాపడు సుమ్ము! రణయజ్ఞమింతి! మరల నా కాలాగ్ని మఱి తృప్తినొంద
పుడమినే పాత్రగా పొలుపున దలచి, తద్విరాధు ఘనరక్తమున ప్రోక్షించి
చిత్రాహుతులు ముక్కు చెవులు శూర్పనఖ, విచ్చి; త్రిశిరుడును నిల ఖరదూష,
ణులును మారీచుండు నల కబంధుడును, గల పంచప్రాణాహుతుల ముందయిచ్చె!
శిఖబంధమోక్షణ జేయగా వలసి, సంసృతి బంధంబు శబరికి బాపె!
నేత్రజలస్పర్శ హేతువు గాఁగ, వాలిరక్తం బిచ్చె వనజాయతాక్షి!
లంకాదహనమె యార్ఘ్య! హవిః ప్రపాక, మా కుంభకర్ణుఁడే యన్నోదనమ్ము!
ఎలమి పక్వాన్నమే యింద్రజిత్తగజ! రాక్షసుల్ కూరలు రమణీయమైన
శాల్యాన్నమే యయ్యె! సారణుం డబల! వర ప్రహస్తుని మేనువడియమ్ము గాగ
అల్ల నికుంభుని అప్పడంబుగను, కుంభాసురుని యుప్పు కొమరొప్ప జేసి
కాల నేమిని జేయ ఘనపాయసముగ, అతికాయ రాక్షసుం డయె పంచదార!
ఐరావణుండె నెయ్యం బైనపాలు, మైరావణుడు నెయ్యి! మఱి రణయజ్ఞ
పరిసమాప్తిని నిడ బరగు దధ్యోదనమె రావణుఁడు రాముఁ డమర రాక్షసుల
నందఱఁ జంపి యయ్యసురుల సర్వ, భోజ్యవస్తులఁజేసి పుడమి పాత్రమున
నింపి, కాలాగ్నికి నెఱి నివేదించె, గోళ్ళముకల వీడుకొల్పుట యయ్యె!
యుచ్ఛిష్ట బలిత్యాగమో విమలాంగి, అప్పు డక్కాలాగ్ని యపుడొందె తృప్తి!
అంత రఘుపతి రణాధ్వరం బపుడు, విడచి యయోధ్య ప్రవేశించి రాజ్య
పట్టాభిషేకంబు పఱగ నందుటయె, అవభృథ స్నానమో యమలాయతాక్షి!

గీ. ఇవ్విధమ్మున శ్రీరాముఁ డెల్లలోక,ములకు నిష్కామయోగమ్ము వలనఁ గలుగు
మంగళంబుల నెరుఁగఁగ మహిత రీతి, యజ్ఞము న్వడె ఫలముతో నౌననంగ!

వ. తదనంతరంబ సాధ్వీ!

సీ. ఔర! సాక్షాత్పరమాత్మయు నిర్వికా,రుఁడు నిర్మలుఁడు నయి నిత్యము గడు
పరమ స్వానందానుభవము నందుండెడు, శ్రీరామచంద్రుఁడు సరి చెలంగ
కర్తృత్వ రహితుఁడై కడు నొప్పియును సర్వకార్య సమాధ్యక్ష గరిమనొంది
లోకాళికెల్ల శుశ్లోకుఁడై యుపదేశ,మమర గృహస్థాశ్రమమున నుండి

గీ. ఎంతొ ధర్మంబుగా చరియించుచుండె, ఎల్లలోకంబు లందుల నీడులేని
వైభవమున రాజిలుచుండె వసుధలోన, రామరాజ్యంబు సాటి దుర్ధర మనంగ.

క. రాముఁడు రాజ్యంబేలం,గా ముండలు పెండ్లియాడికాని యురగ బా
ధామయ బాధలఁ గుందెడు, కామనుజులు కాని లేరు, గర్వాంధులున్.

క. ఔరస పుత్రుల నెట్లో, ఆ రీతిఁ బ్రజలఁ బెంచె నతి ప్రేమమునన్
శ్రీరఘుపతి సీతయు పరి,వారంబులుఁ గొల్వ శుభ విభవముల తోడన్.

శా. శ్రీ సాకేతము రాజధానిగ, ధరిత్రీజాతతో కూడి తే
జో సంపన్నములైన యా దినములన్ శుద్ధాత్ముఁడౌ రాముఁ డెం
తో సంతోషము మీఱ నేలె,ననుజుల్ తోడై చరింపంగ సే
వా సంతుష్టిని మాతృదేవతలు భవ్యాశీస్సులం దేల్పఁగన్.

గీ. దేవి! నీకిట్లు నాచేత దేవదేవుఁ,డైన రాముని యుద్ధ దివ్యకథ చెప్పఁ
బడియె! నిదివిను వారల భవవికార, బంధనములు వో విజయసంప్రాప్తిగల్గు.

గద్యము

ఇది శ్రీ బాలభారతీ వరప్రసాదలబ్ధ కవితా ధౌరేయ
పండిత చిలుకూరి శ్రీరామశాస్త్రి నామధేయ
ప్రణీత శ్రీమదాంధ్రానంద
రామాయణాంతర్గత
సారకాండస్థ
యుద్ధకాండము

# ఆనంద రామాయణము



## ఉత్తర కాండము

### ప్రథమ సర్గము



శ్రీరాముని దర్శింపం, గోరి ఋషీశ్వరులతోడఁగూడి యగస్త్యుం
డా రాముఁ గాంచి గురు స,త్కారంబుల నంది కడు సుఖాసీనుండై.

మ. మునులుం దానును కౌతుకంబులను రాముం డేర్పడం, జెప్పఁ గో
రిన విన్పించి, రఘూద్వహుం గుఱించి యో శ్రీరామ! శూరాగ్రణీ!
కనుదే? సేమము! శత్రువర్గములువో! కైసేయుదే? భాగ్య శో
భనముల్, మేఘ నినాద నిర్జిత మహాభాగ్యంబు నీకేర్పడన్.

గీ. అని ప్రశంస నొనర్ప మహాత్మ! మీర,లేల? రావణాదుల పేరు లీలవిడచి
మేఘనాదు ప్రశంసించి మించినార,లనిన రామునికి యగస్త్యముని వచించె.

గీ. మేఘనాదుని జన్మ మమోఘమయ్యా! వాని సకల వృత్తాంతము నేను మీకు
మిపుల సంక్షేపముగ చెప్పెద వినుమయ్య! రామ! రాక్షస భీమ! శ్రీరామ! రామ!

#### అగస్త్యుఁడు శ్రీరామునకు ఇంద్రజిత్తు పరాక్రమమిష రాక్షసుల పూర్ణచరిత్రఁ దెలుపుట

క. మును కృతయుగమున విధి నం,దనుఁడు పులస్త్యుండు ధర్మ తత్పరమతియై
తృణబిందు పుత్రి వలనం, గనియె విశ్రవస్సుఁడనెడి ఘనముని చంద్రున్.

గీ. వేదనిధి! యనఁదగిన యా విశ్రవస్సు, శ్రీ భరద్వాజ పుత్రికా శ్రేష్ఠమందు
వైశ్రవణుఁ గనె నాతండు బ్రహ్మవలన, పుష్పకంబు ధనేశతంబొందెఁ గడక.

క. ఆ వైశ్రవణుఁడు జనకుని, సేవింపం బుష్పకమున జేరి యనియె; తం
డ్రీ! వరము లిచ్చె కానీ, తావరముం జూపఁడయ్యె ధాత యటన్నన్.

క. విని విశ్రవస్సు నాయన!, ఘన లంకాపురము విశ్వకర్మ కృతము ది
వ్య నగర మున్నది సాగర,మున సాలంకార మగుచు పుత్రా! దానిన్.

ఉ. వెన్నుని బారికిన్ వెఱచి, వీర పరాక్రములయ్యు తండ్రి! అం
దున్నటువంటి దానవు లధోగతులైరి! రసాతలానికిన్

నిన్నటనుండఁ బల్కఁడు, ననిందిత సౌఖ్యము లొందఁగల్గి నం
దున్న, నటం చనుగ్రహము తొంగిలియింప వచించెఁ బ్రీతుఁడై.

గీ. శంకలేక వైశ్రవణుఁడు లంకఁ జేరె, తండ్రి యిష్టము మీఁద మోదమున నుండె
నంత నొక్కప్పుడు సుమాలియను దనుజుఁడు, పుష్పకముపై కుబేరు నింపుగ గనుఁగొని.

వ. తన నెయ్యపుం గూతుఁ గనుంగొని యిట్లనియె.

ఉ. కైకసి! నీవు విశ్రవసుఁ గల్వఁగఁ బొమ్ము! కుబేర తుల్యులౌ
రాకొమరుల్ జనింతు, రిది రాక్షసవంశ హితంబు పొమ్మనన్;
కైకసి విశ్రవస్సుఁ గని కాలను నేలనుఁ గీటుచున్ అస
హ్యాకృతి సంధ్యవేళ యెదురై నిలిచెన్ గడు లజ్జఁ బాయుచున్.

గీ. అతఁడు నీ వెవ్వతె? వటంచు నడుగ నాపె, మీరె తెలిసి కొందురుగాత! మీదుశక్తి
ననిన నాతఁడు నంతయుఁ గని తపఃప్రభావమున మానినికి నిట్లు పల్కెనంత.

గీ. నీ యభీష్టంబు నెఱిఁగితి! నీవు పుత్రకాంక్షమెయి వచ్చినా వసత్కాలమందు
క్రూర రాక్షసు లిర్వురు కొడుకు లగుదు, రనిన కైకసి యనె నిట్లతని గనుఁగొని.

క. మహదాశ్రయంబునకు దానహహా! ఫలితం బిదెట్టు లయ్యెడి? ననిన్
బహుబుద్ధిశాలి కడపటి, ముహూర్తమున బుట్టు నీకు మూఁడవ సుతుఁడై.

వ. అని యనుగ్రహించె.

సీ. కైకసి యంతట కాలక్రమంబున, పుత్రు లిర్వురఁ గాంచె భూరిబలుల
రావణ కుంభకర్ణ కునామధేయుల, నంతట వరుసగా నవలఁగాంచె
క్రౌంచి శూర్పనఖ నుర్వరను కుంభీనస, యను ముగ్వు రాడువారిని నటుపయి
రహి విభీషణుని నారవ వానిగాఁగనె, నీతఁడు తక్క తత్పూతులెల్ల

గీ. హింసకులు క్రూరులును మహా హీంద్రసములు, ఘోరములటన్న వెఱువనివార లిందు
ఆడ మొగ భేదములు వారియందు లేవు, విమల విజ్ఞానఖని! యవ్విభీషణుండు!

క. కైకసి లింగము దెమ్మన, గా కైలాసమ్ము వచ్చెఁగద! రావణుఁడా
రాకాసివాఁడు గడుసరి, గాకేమి? గడింది తెగువ! కడు సాహసుఁడౌ!

వ. శంకరుండు పార్వతి కిట్లు తెల్ప నిట్లని వింటి రామా!

ఉ. వాఁడు ననుం బ్రసన్నుని కృపాపరుసేయ, స్వకీయమౌ శిరం
బూడగ దీసి, మేని కెడబుచ్చి, పదంబుల బూన్చి ప్రేవులన్
జోడొనరించి తీగలుగఁ జొన్పి, కరాంగుళులెల్ల మెట్లుగా
పాడెను షడ్జమ స్వర మపారముగా తనమేని వీణలోన్.

క. ఆ గంధర్వ విచిత్ర మ,హాగానము చెవుల వడిన యతఁడెందులకీ
ఆగమనంబు నొనర్చెనో ? ఈ గానము నేలచేసెనేమొ? యటంచున్.

ఆ. వాని నెఱుఁగ నందివాహనుఁ బుతికొల్పి, ఆత్మలింగ మీయ దభవుఁడనుచు
చెప్పిపంప వినక చేసె నిట్లే పది,సారు లంత నేను సంతసించి.

గీ. అపుడు వానికి నే నిచ్చి తతివ! శిరము, లొక్కపది; తక్కు కథ నీకు చెక్కు చెదర
కుండ జ్ఞాపక మున్నదే కోమలాంగి! ఇంత సాహసి యా యసురేంద్రుఁ డనగ !

ఆ. ఇట్టులుండ నొకట నిట్టలపెగ్గె పు,ష్పకమునన్ కుబేర వర్యుఁగాంచి
చెలువుమీఱ కైకసీ దేవి సుతులను, గాంచి యిట్టులనియె కటము లదుర!

ఆ. సవతియన్నఁ జూచి చావంగరాదె? సి,గ్గేల లేదు? మీకు! నేలబ్రదికె?
పౌరుషంబులేదె! పరికింప మీరలీ, బ్రదుకు బ్రదుకు టేమి? ఫల మటన్న!

సీ. తల్లి మాటలకు నుత్తమమైన గోకర్ణ, సుక్షేత్రముంజేరి సురుచిరముగ
పదివేల యేండ్లు తప్పక చేసి ముగియించె, ఘోర తపంబును కుంభకర్ణుఁ
డతుల ధరాత్ముఁడన్ ఖ్యాతి నందు విభీష,ణుం డైదు వేలయేం; డ్లొండలోన
కాలిదౌ బొట్టనవ్రేలిపై తప మాచ,రించె రావణుఁడు నభ్యంచితముగ

గీ. దివ్య వర్ష సహస్రముల్ తెంపులేక, తపమొకాక ఒక్కొక తలఁ దరిగి వ్రేల్చి
యిట్లు తొమ్మిది తలలయి మెలమి పదవ,తలనుగూడ వ్రేల్చఁగను ప్రత్యక్షమగుచు.

క. ధర్మాత్ముఁడైన బ్రహ్మ వి,నిర్మల మానసముతోడ నిలచిన, తోషం
బర్మిలి తలమున్కలుఁగా, పేర్మిన్ రావణుఁడు మ్రొక్కి వినుతించి యనున్.

గీ. పద్మసంభవ! వాగీశ! భద్రమూర్తి! నిగమరాసి! జగత్స్రష్ట! నిర్మలాత్మ!
పాహి పాహి దయానిధి! పరమపురష! బ్రోవవే! నన్నటన్న, నింపుగ నజుండు.

వ. నీ ఇష్టమైన వరంబుల వేడుమన.

గీ. యక్షరాక్షస నాగ దేవాదులేని, హరిహరాదులేన్ చివరకు గరుఁడుఁ డాది
పక్షిగణములేన్ బోర నవధ్యతను న,నుగ్రహింపవే దేవ! ధన్యుండనగుదు!

క. నరవానర సంఘంబుల, వెఱపించుక లేదు నాకు వేదనిధీ! నీ
యరుదగు కృప కల్మిని ని,ర్భరుఁడ నజేయుండ దుర్ధర ప్రతిభుండన్.

క. అని యడిగిన యాక్రమమును, విని యట్టులె యగునటంచు విధి పల్కన నా
తని తమ్ముండైన విభీ,షణుఁడు చిరంజీవితయును సాత్త్విక మడిగెన్.

ఆ. అదియు వల్లె యంచు నజుఁడన్న నా కుంభ,కర్ణుఁ డింద్రపదవి కాంక్ష సేసి
భారతీప్రభావ పరతను నిద్ర ప,దవిని వేడుకొన్న దాని నిచ్చె!

క. అరునెలలు నిద్రించును, ఆరునెలల కొక్కతూరి యన్నము దిను న
ట్లీ రీతి వరములిచ్చి య, పార రయమునన్ స్వధామ పరతం జనియెన్.

ఉ. రక్కసు లుక్కుమీఱి తనరారి మహత్తర విక్రమాఢ్యులై
మిక్కిలి సంచరింప, తమ మేను రసాతలమందు డాఁచి యే
దిక్కునులేక నేఁడు నతి దీనులునైన సుమాలి యాదిగా
రక్కసి దుష్టమూర్ఖ నికరంబులు వెల్వడి నిర్భయాత్మతన్.

క. తన మంత్రులు తెల్ప కుబేరుని లంకాపురమునుండి రూపడఁచి పలా
యన మొనరింపించి ముద,మ్మున నేలంబూనె లంక ముమ్మరపు రతిన్.

చ. అతిశయుఁడైన వైశ్రవణుఁ డప్పుడు తండ్రి ననుజ్ఞ వేఁడి, య
ద్భుతమతియై, మహేశ్వరుని పూజలు సల్పి, శివానుకూల యో
గ్యతఁగని, విశ్వకర్మ పరికల్పితమౌ నలకాపురంబునన్
కుతుకము మీఱనుండె, నవకుంఠ దిగీశ పదంబు నేలుచున్.

సీ. అటుపయి నా రావణాసురుఁ డిచ్చె శూర్పణఖ విద్యుజ్జిహ్వుఁడను నతనికి
దండకారణ్యంబు దానికి రాజ్యార్హ, వస్తు సమ్మాన సత్ప్రీతి నొసఁగె
బహుకాలమునకు తత్పతి గతజీవిగా, తన పినతల్లికి తనయులైన
ఖరదూషణులను త్రిశిరుని సాహాయ్యంబు,గా నిచ్చె చెల్లెలి పైని కూర్మిఁ

గీ. ఇచ్చె నెంతేని వైభవ మచ్చుపడఁగ, తనకు గొప్పతనంబు పోవునని తనదు
చెల్లియలను పరాక్రమ శీలురకును, తనకు సరివారి కిచ్చె సంతసము వొదల.

గీ. మధువనము కట్నముగ నిచ్చి మధుదనుజుని,కిచ్చె కుంభీనసను ముదమొలమిఁగొంచు
క్రౌంచియను చెల్లి నిచ్చెను ఖడ్గజిహ్వు,నకును పరలంక నిచ్చి కట్నముగ నెలమి.

గీ. ఎన్న వైరోచనునికి దౌహిత్రియగు ప్ర,సిద్ధురాలి వృత్రజ్వాలఁ చేసె పెండ్లి
కుంభకర్ణాసురునకు నెక్కుడగు శ్రద్ధ, కీర్తియు ప్రతిష్ఠ దిక్కుల కెలననిండ !

ఆ. సరమ పెండ్లి చేసె శైలూషసుతను గం,ధర్వయువతి చిన్నతమ్ముఁడౌ వి
భీషణునకు సత్వభూషణునకు బంధు, పోషణునకు దుష్టదూషణునకు.

ఉ. ఆదట కొంతకాలమున కయ్యెడ రావణు పత్నియైన మం
దోదరి గర్భవాసమున నుజ్జ్వల ఘోర పయోధరోన్మహా
నాదములొప్పఁ బుట్టెను ఘనంబగు తేజమువాఁడు విక్రమ
శ్రీదనరార ! లోకులు నశేషముగాఁ దను మేఘనాదుఁడన్.

శా. నిద్రా ముద్రితుఁడై గుహాంతరమునన్ నిర్భీకుఁడై యొప్పె ని
ర్ణిద్ర ప్రక్రియ కుంభకర్ణుఁడు కడున్ నిర్ధామ ధామంబుగన్

క్షుద్రుండై పడి, రావణాసురుఁడు నెచ్చోఁ జూఁచినన్ వాఁడమై
యుద్రేకంబున బట్టి కొట్టి ఋషులన్ యోషాపహృ ద్వేషియై.

గీ. దేవతలయు గంధర్వుల తీటఁ బాపె, కిన్నరులను నాగులను జంకించి చంపె
వారివారి పత్నులఁ గడు మేఱమీఱి, అపహరించె లోకములు హా! హా! యనంగ!

గీ. అద్ది విని కుబేరుం డిది బుద్ధిగాదు, మనకనుచు దూతలం బంప విని కుపిత మ
తిని యలక జేరి యాతని తీటఁ బాపి, పుష్పకమ్మును హరియించి పోవుచుండె.

గీ. అట్టి సమయంబునందె నయ్యసుర కండ్ల, కగుపడియె రంభ, అది తన యన్నయౌ కు
బేరు సుతుఁడు నలకూబరుఁ డారయంగ, పిల్వఁగా వచ్చుచుండె నా పెనుఁగడంగి.

ఆ. కడు బలాత్కరించి విడువక పెక్కు నాళ్లనుభవించి పుచ్చె! నది కుబేరు
పుత్రుఁ జేరి తన చరిత్రఁ జెప్పిన నాతఁ, డగ్గి యగుచు నిట్టు లానతిచ్చె.

క. ఇది మొదలు రావణుం డే, మదిరాక్షిని గాని బలిమి మారొ్కనునేనిన్
పదిపదులు పదులుగా తల, చిదికి చచ్చుగాత! యని వచించెన్ బెలుచన్.

గీ. చారులు వచింప నసురుఁ డీ సంగతి విని, అది మొదలు కామమోహితయైన తప్ప
ఎట్టి కాంతను తాకఁడాఁ చెట్టతప్పె, భవనముల పదునాల్గింటి యువతులకును.

గీ. శమనుని జయించె! మఱియు యుద్ధమున వరుణుఁ, గీటడంచె నింద్రునిపయికి జనెనపుడ
యింద్రుఁడాతని బంధించి యేపడంచె, అది యెఱిఁగి మేఘనాదుఁ డహంకరించి.

సీ. అమరావతికి నేగి యలఘు యుద్ధ మొనర్చి, దేవేంద్రు దాకి తత్తేజ ముడిపి
బలముగా బంధించి చలమున తన తండ్రి, రావణు చెఱఁబాపి ఠీవి మెఱయ
ఇంద్రుని తోడుత నేతెంచె తన నిజ, నగరంబునకు పౌరులు గరువింప
కోరిన వరము లవ్వారి బ్రహ్మ యొసంగి, యింద్రుని విడిపించె నింద్రజిత్తుఁ

గీ. డనెడి పేరు జగంబున గనె ప్రసిద్ధి, రామ! రావణుకన్న పరాక్రమమున
మేటియౌ మేఘనాదుఁ డమ్మేటి మగలఁ, గెల్చితివను ప్రశంసంబు పొల్చుఁగాదె?

క. అని పల్కిన నాంగీరస, మునిగాంచి రఘుప్రవరుఁడు మునిచంద్రమ! యిం
కను రావణు దుశ్చర్యలు, వినవలతుం జెప్పు డనిన విని ముని యనియెన్.

## రావణుని దుశ్చేష్టలు

క. విజయుఁడగు రావణుం డి, ట్లు జయంబుం బొంది సర్వలోకంబుల నె
ల్ల జయించి దిక్పతులఁగూ, డ జయించుచుఁ గెల్వఁగా మృడానీపతినిన్.

శా. కైలాసంబున కేగిఁ తద్భుజయుగాగ్రంబందునన్ దాని, ని
శ్వేలా శీలత నిల్పియూఁచె, నట సంభీతాత్మయై గౌరి త

త్స్మారిన్ భవ్య కపాల మాలిఁగని హెచ్చుం భీతి సంధిల్లఁగా
నాలింగించిన, శంకరుం డలిగి ఉద్యద్వేగమే లీలమై.

మ. ఇది రక్షోవిభు కార్యమం చెఱిఁగి యప్డే వామ పాదంబునన్
గదియింపన్, గిరిపీడి పారఁ దలపంగా రాక హస్తంబులం
దదుమంగాఁబడి చూర్ణితంబులగుడున్ ఆ రావణుం డప్డు బి
ట్టదరన్ చేతుల తీటబాయ చెడి హా! హా! కారముల్సేయుచున్.

క. అక్కడ నందీశ్వరుఁడు త, ళుక్కున రావణునిజూచి లోలో నగుచున్
ఇక్కపిచేష్టల ఫల మిదె!, ఇక్కపులే నీకు నాశ హేతువు లగుతన్.

మ. అనుచున్ శాపమొసంగె, నంతట శివుం డత్యంత భోళా విభుం
డును నల్పంబగు తుష్టివాఁడగుట నింతుం జాలినిం బొంది వా
నిని వీడ్కొల్పె, నతండు నంతకును బుద్ధిన్ దెచ్చుకో కట్లు పో
యెను, తా హైహయ పట్టణంబునకు సిగ్గేమాత్రముం బొందకన్.

గీ. అచట కార్తవీర్యార్జునుఁ డా సమయము,నందు నర్మదా నదిని పూర్ణేందు ముఖులు
తాను జలఖేలనంబు లెంతే నొనర్ప, నేగినట్టుల విని రాక్షసేశ్వరుండు.

ఆ. వెతుకబోయి వారి వెఱ వెఱుంగక వేళ,యగుట దేవపూజ నపుడు సేయ
ప్రియము మీఱఁ జేరె, రేవా నదీతీర, భూమిఁ గూరుచుండి పొలుపుమీఱ!

వ. కార్తవీర్యార్జునుండు వేడుక మెయి వాని నేడ్పింపఁ దలంచి.

గీ. నిజభుజ సహస్రములచేత నీరములను, కట్టగా, నీర మెదురెక్కి కడఁగి పూజ
సేయు రావణుఁ దేలించె! చెనటి! వాడు, పూజమాని యర్జునుపైకి పోయి పెలుచ.

క. యుద్ధంబును పొనరించిన, క్రుద్ధత హైహయుఁడు వాని గొంతుక బిగియన్
న్నుద్ధతిని గట్ట చావుకు, సిద్ధంబై రావణుండు చెడె నబలుండై.

గీ. మ్రాకుటేనుగు నాడించు మాడ్కివాని, కట్టి తనకొడుకున కిచ్చెఁ గరితలెల్ల
చూఁచి యాశ్చర్యపడ వాని సోయగమున, కిట్లనేక కాలంబుండె కట్లఁబడుచు.

క. ఈ లీల కొంత కాలము. చాలగ నగచొట్లుపడి భృశంబు చెడి తుదిన్
మేలొంది విడువఁబడియెన్, పులస్త్యుండు వచ్చి వాని పో విడిపించెన్.

ఉ. అంతకు నూరకుండక మహాకపిరాజగు వాలి పట్టణ
ప్రాంతముఁజేరి తద్ధను నపార రణంబున నోటపుచ్చఁగా
చింతయొనర్ప, నాతఁ డొగి సేయఁగ తానము సప్తసాగర
ప్రాంతములందు నుండెనను పల్కుల తా విని నిశ్చయాత్ముఁడై.

క. ఇదె మంచిసమయమగు బెట్టిదమగు భక్తిన్ కపీశుఁ డేడ్తెర సంధ్యా
స్పద చిత్తుఁడై నెడన్ దవి, లెద వెన్కగఁ జేరి వాని లీలన్ జెనకన్.

క. అని రావణుఁడు వెడలి ధ్యానని మగ్నుండైన వాలి నడుమ వెనుక ప్ర
క్కను జేరి చంకలను స,య్యాన చేతులవెట్టి పట్ట నత్యంతంబున్.

శా. అట్టే బిట్టుగఁ బట్టి, వాలి ఘన బాహాశక్తి సామర్థ్యముల్
ఇట్టానంచు నెఱుంగనైతినని యందే చిక్కె, నవ్వాలి దా
నెట్టెట్లు సముద్రముల్ తిరిగ నే యే వేళలం దట్టులే
బిట్టుం జేష్టలమాని రావణుఁడు నిర్భిన్నాంగుఁడై యుండగన్.

గీ. నాలుగు సముద్రముల ముంచి వాలి రావణాసురుని దెచ్చె కిష్కింధ కా సమయము
నందు నంగదుఁ డెదురురా; నతని యెత్తి, ముద్దుఁగొనబోవ రావణు డుద్ద విడిని.

గీ. ఊడిపడె రాక్షసుఁడు చంకనుండి భువికి, వాలి చూపించె, తన పరివారమునకు
పదితలల పుర్వటంచు రావణుని; సుతుని, తొట్టెపై తలక్రిందుగాఁ గట్ట నపుడు.

క. చిరకాల మిట్టు లంగదు, వర మూత్రంబునకు తడిసి వందురుచుండన్
కరము కనికరమునన్ కపివరుఁ డాతని కేగ నాజ్ఞ వాఱక యిచ్చెన్.

గీ. ఆది మొదలు వాలితో సఖ్యమనుచు తిరుగు, రావణుం డంతఁ బోక దుర్వార ుల
పుష్పకం బెక్కి పాతాళభూమిఁ జొచ్చి, సంచరించె యథేచ్ఛమై సంభ్రమమున.

ఉ. చూచి యనేక వీరులను చొప్పడ వారలతోడఁ బోరి, ర
త్న్యాచితమా ప్రకాశమున నున్న బలీంద్రు పురంబు నింపుమైఁ
జూచి, తదీయ తేజమున సుంతయుఁ బోవని పుష్పకంబునుం
డాఁచి యొకండె కాల్నడ దడాబిడ రాజగృహంబుఁ జేరుచున్.

గీ. వామనుం డగు నిను బలి ద్వారమంది,రమున గని భవ్యకోటి సూర్యప్రకాశు
భర్మపీతాంబరుని చతుర్బాహు శంఖ, చక్ర శోభితు లక్ష్మీ ప్రశస్తవక్షు.

గీ. ద్వారపాలన దక్షుని తా వచించు! నిచట యే రాజు గలఁడు నా కెఱుఁగఁ దగునె!
అన్న, నీతని కేమి యీయంగవలయు, ప్రతివచన మంచు మూకీస్వభావ గరిమ.

క. నీ వూరకున్న చెవిటిగ, రావణుఁ డూహించి మందిరమ్మున ప్రవేశం
బై, వనితాసహితు మహా, శ్రీ విభవుం జ్యూతరతు పొటిం బలిఁ గాంచెన్.

గీ. చూచి కడు వినోదించు తచ్ఛ్రీ చరిత్రు, సంపదం జూచి మిపుల విస్మయము నందు
చున్ననంతలో బలి యక్షమున్న చోటుఁ, బాసి పడి కొంతదూరమై పఱగియున్న.

ఆ. ముదల నిలచియున్న మదమత్తు రావణుఁ, గాంచి తేమ్మనంగఁ గడఁగి వాఁడు
దాని చెంత కరిఁగి దానిని చక్కఁగా, కదలనెత్తె! కాని కదలదయ్యె!

వ. ఆశ్చర్యాంతరంగ తరంగిత మానసుండై.

చ. ఇరువదిచేతులం గదిసి యెట్టులొ యెత్తి, తదీయ మత్సమున్
గరిమను వ్రేళ్లపై పడ సగానన వీడెను భారమైన! నె
త్తురు వరదై కడుంగడు పృథు ప్రతిఘాతము గాఁగ, రోదనం
బిరువుగఁ జేసె రావణుఁడు హెచ్చగు కంఠనినాద మేర్పడన్.

గీ. నవ్వి బలిచక్రవర్తి యందవ్వలివల, సంచరించు దాసికలఁ దెప్పించె పాచి
కను, వెడలగొట్టుఁ డీమగతనములేని, పదితలల వేష మీతని పఱగ నిపుడ!

క. అని యాజ్ఞాపించిన నా,తని దూతల చేతఁ జిక్కి తడయక యెన్నో
దినములు ఉచ్ఛిష్టమ్ముల, దినుచేన్ అట నుండె రోషధీ యెటఁ జనెనో?

క. అప్పు డితని యుద్యోగము, చెప్పిన నవ్వెదవా! రామ! చెడి యాతఁడు నే
రొప్పగ గుఱ్ఱపు లద్దెల, నెప్పటి కప్పటికి యెత్తుటలుగా నుండెన్.

క. ఇటులుండి యొకట నీ చెం,గటికి వచ్చి యేడ్చి చెప్పఁగా సత్కృప నీ
పటు పాదాంగుష్టంబున, నటనుండియె యెగుఱఁదన్నితయ్య మహాత్మా!

గీ. అందులకె వాఁడు పరితోషమంది చాల, కాలమునకు లంకకుఁ జేరి గర్వముడిగి
ఇది తనకు చచ్చి పుట్టిన ముదమొసఁగె,నని మనియె! కొంత తడవు లంకను ముకుంద!

ఉ. ఇట్టి మహాబలుం డతడ! ఇంచుకయైనను సిగ్గులేకయే
జెట్టి విధాన పుష్పకము చెచ్చెర నెక్కి జగత్త్రయంబు చే
పట్టగ నిత్యముం దిరుగు, బాహుబలంబున మిన్నయైన వా
ర్గట్టఁగఁ గొట్టఁగన్ గను వగం గనుచున్; గరువించు మూర్ఖుఁడై.

శా. నీ పూర్వుం డనరణ్యుఁ డొక్కపరి తా నిష్ఠాత్ముఁడై యజ్ఞ దీ
క్షాపూర్ణుండయి యుండగాఁ జేని మహా సంగ్రామమం దాతనిన్
కోపోద్రిక్తుని జేయఁగా నతఁడు నీకుం గల్గు నా వంశజుం
డై పుట్టొందు రఘూద్వహుల్ వలన చా వత్యంతమున్ రావణా.

క. నా వ్రతము పాడుచేసితి, తీవ్రతర విచారమయ్యె! తేకువమైనే
నీ వ్రత హోమంబుననే, తీవ్రతపడి చత్తు నను చు ధీరత్వమునన్.

మ. అని శాపంబు నొసంగి ప్రాణముల బాయన్; దుర్మదుండైన రా
వణుఁ డంతంత సనత్కుమారుఁ గని దేవా! దేవతానీకమం
దున శ్రేష్ఠుం డెవరన్న! విష్ణుఁ డనుచున్ తోరంబుగా వానిచే
తను చావొందిన రాక్షసుల్ గనుమరే? దైవార వైకుంఠమున్.

క. నాకుం దెల్పుమటన్నన్, శ్రీకరుఁ డా విష్ణుమూర్తిచేఁ జచ్చిన న
స్తోకముగ పరమ పదవి శు,భాకరముగఁ గలుఁగు దుర్లభం బది యనినన్.

క. నే నాతనిచేఁ జావం,గా నిచ్ఛం బూనినాఁడఁ గావున నటు నే
దే నొక్క యుపాయంబున్, మౌనీంద్ర! వచింపుమన్న మగిడి యతఁ డనున్.

క. త్రేతాయుగమున హరి సా,కేతంబున బుట్టు! వానికిన్ ద్వేషము నీ
వాతతముగ సాధింపుము! ప్రీతిన్ ధన్యుండవవుదు వేగం బనినన్.

క. అది వినియె రావణుఁడు స,మ్మదమున జానకి హరించి ముదితను వనమం
ద దనర నిల్పెన్ తల్లిగ, సదయా! నీ చేతఁ జచ్చె సత్పదమందెన్.

వ. ఇది యటులుండ నా రావణాసురుఁడు.

సీ. ఒకనాడు నారదు నొయ్యన గన్గొని, పూజించి యిట్లను పుణ్యమూర్తి!
సెలవిమ్ము! నాతోడ చెలఁగి యుద్ధము సేయఁ,గల మహాబలుఁ లెందుఁగలరొ? వేడ్క
కడు బలిష్ఠులతోడఁగాని యుద్ధముసేయ! నీకు ముల్లోకము లాకరములు
నీ వెఱింగిన యట్లు లా వెఱింగినవారు, మూఁడు లోకంబుల మొనసిలేరు

గీ. తెల్పుమన్న, నారదుఁ డెదనిల్పి చూఁచి, రావణా! వీరమతి వీవు కావలెనని
నన్ను నింతగా ప్రశ్నించుచున్న వాఁడ, వగుటఁ దెల్పెద! వినుము! రహస్య మొటి.

గీ. విష్ణుపూజా పరాయణుల్ వేనవేలు, కలరుకాని వారలలోన ఘనులు విష్ణు
మూర్తిచే చచ్చినట్టి సంపూర్ణ ధనులు, కల సితద్వీపమున కీవు చెలఁగి పొమ్ము!

ఉ. వారు మహా పరాక్రములు! వారిని దేవతలేని, రాక్ష సో
దారులెకాని, గెల్చెడి ప్రతాపము నందగలేరు; వారు వి
స్తార సమృద్ధకాయులు, లసత్పరిపూర్ణ సుఖప్రమోదు, ల
ద్ధీరులఁ దాకఁబొమ్ము! కసితీఱఁగ యుద్ధముచేయ రావణా!

క. అని చెప్పిపోవగా నది, విని రావణుఁ డంత సైన్యవృతుఁ డగుచున్ చ
య్యన పుష్పకమున యుద్ధం, బొనరింపఁగ నేగె తన్మహోలాచ్ఛ స్థలికిన్.

సీ. గర్వించి పోవులేకాని యక్కాంతికి, పుష్పకం బొక్కింత పోవకున్న!
నా విమానము వీడి రావణాసురుఁ డప్పు, డొంటరిగా ద్వీప మొయ్యఁజేరి
పోవుచు నుండగా, పూదోటలో పూల,గోయ నేగెడు నొక్క సుందరదన
వీని సూత్మ్యాకృతి వింత దశాస్యముల్, కని వినోదంబును గొని కరమున

ఆ. ఓరి చెప్పుమింక నొయ్యన నిన్నెవ్వఁ,డంపె నిచ్చటికి భయంబుఁదక్కి
ఎచట నుండి వచ్చి తీవెవ్వఁడ వటంచు, పలుకరించె వింత తొలుకరింప.

శా. ఇంకన్ గొందఱు కాంత లచ్చటికి నెంతేనిన్ వినోదాప్తి, న
ల్వంకల్ బొఱ్ఱఁగ వాని రావణుని చెంపల్ వైచుచున్, సుంతయున్
జంకుం గొంకునులేక, పాదముల హస్తంబందునం బట్టి వాఁ
డింకా ఉక్కిరిబిక్కిరౌ నటుల నెన్నే రీతులం ద్రిప్పుచున్.

క. బంతుల నాడు విధంబున, వంతుల వేసికొని వారు వాని పదములన్
వింతగఁ బట్టి విసరుచున్, సంతసముగ నాడి రొక్క జామునకు పయిన్.

ఆ. అప్పు డొక తె విసరి నంతట చేజారి, నేల బడియెఁ బిట్టుతూలి మఱల
ఎటులొ వచ్చి పడియె నెట పరలంక న,మేధ్య దుష్టమైన మేఱయందు.

ఆ. అంత రావణుం డహహ ! విష్ణువునకు కో,పంబు వచ్చు తెఱఁగు పన్నవలయు
చేరువాఁడ నెటులొ ? సిత మహాద్వీపంబు, విష్ణు నిహతి నను ప్రవృత్తి దనరి.

క. వనమున సీతను హరియిం,చెను, లక్ష్మి ! యటంచు నామె చేవ యెఱుంగన్
గనె ముక్తి నీకతమ్మున, మనె నింకన్ రామచంద్రమా ! యని పలుకన్.

ఉ. నావుడు రామచంద్రుఁడు వినమ్రత మ్రొక్కి, యగస్త్య ! వాలి సు
గ్రీవుల జన్మముం దెలియ కేవలమెను కుతూహలుండ న
య్యా ! వరణీయ జన్ముల మహోత్త చరిత్రము శ్రీ రవీంద్ర సం
భావు లటంచు వింటిని; తపః పరిశోభిత ! విందుఁ దెల్పవే.

## వానర వీర చరిత్రము

క. అని ప్రశ్న చేయగా న,మ్ముని యిట్టని తెల్పె సర్వమున్ ! విను ! రామా !
మును సత్యలోకమున సభ, ననువుగ మునులెల్లఁ గొల్వ నజుఁ డున్నంతన్.

శా. ఉన్నట్లుండి సుఖోప విష్టుఁడగు న య్యోగీంద్ర సంసేవ్యునిం
గన్నుల్ భవ్య ముదాశ్రుపూరములు గాఁగన్ వాని చేబూని భూ
మి న్నాతండు వడంగఁ జల్లె నపు డావిర్భావముంబొందె, ను
ద్యన్నేత్రుం డొక వానరుం డతని నొయ్యం గాంచి యవ్వేధయున్.

శా. వానిం జూచి నిరంతరం బిచటనే వాసంబుఁ గావింపుమా !
నీ నామంబు నెరుంగుమా ! విరజుడంటిన్ ఋక్షుఁడా ! యన్నచో
తా నేర్పొప్ప నటన్ వసించె బహుళోద్య ద్వత్సరంబుల్ ఫల
శ్రీ నీరాశన తత్పరత్వమున జేరెన్ మందరాద్రీంద్రమున్.

గీ. అందు ఫల మూలములకయి యటు పరిభ్ర,మించుచు మణిశిలల నిర్మింపఁ బడి సు
ధోపమానోదకమున నిస్తులమునగు స,రస్సుఁ గని సంతసమున కరంబుఁ దనరి.

క. దానన్ నీరము గ్రోలఁగఁ,బూనెన్ సోపానపంక్తి పొల్పెసగగ ను
ద్ధానముఁ గావించి కనెన్, ఆ నీరంబులను తన మహత్తర ఛాయన్.

గీ. చూఁచి తనఛాయనే మఱి చూఁచి యది మ,ఱొక్క వానర మను భ్రమ నొయ్య నీర
మందుఱికి కపిఁగానక నందు నుండి, వెడలి తా నొక కాంతయై వెలుఁగు నొంది.

క. ఉన్నంత నా పెనుం గని, క్రన్నన నింద్రుండు మోహకలితాంగుండై
యన్నలినాక్షిం డాయక, మున్నే వీర్యస్ఖలనము మొనసె కడంకన్.

శా. ఆ వీర్యంబు తదీయ వాలమున భవ్యంబై పడన్ బుట్టె నెం
తో వీరుం డగు వాలి! యింద్ర సమ సద్యో విక్రమస్ఫూర్తి చే;
ఆ వామాక్షినిఁగాంచి యా రవియు నొయ్యన్ తత్సతిన్ మెచ్చి, త
ద్గ్రీవం బందున రేతసంచ్యుతిని సుగ్రీవుండుఁ బుట్టెన్ హరీ!

క. ఆ సుందరి అయ్యిరువుర, భాసురమా ప్రేమ నెత్తి పరిపరి విధులన్
భాసిల్ల పెంచె, నొక్కట, వాసిగ మగవానరముగ మాఱె మహాత్మా!

శా. ఆ వృత్తాంత మెఱింగి బ్రహ్మ అతిప్రేమావృత్తి కిష్కింధకున్
జేవన్ వానిని రాజుఁ జేసెను, కపిశ్రేష్ఠుండు కొన్నాళ్ళపైఁ
చావన్ వాలియె యేలె, నా పయి కథన్ సర్వజ్ఞ! నేఁ జెప్పనే
లా? విన్నావుకదా! రవిప్రభవు వల్లన్ రామచంద్రప్రభూ!

చ. అనిన నగస్త్యుఁ గాంచి యనఘా! రవిపుత్రుని యన్న వెళ్లఁగొ
ట్టిన యపుడాతనిన్ గదిసి జెప్పరమా బహు వీర్యవంతుఁ డ
య్యనిల సుతుండుఁ గల్గ నవురా? అతఁ డట్టి విషాదవృత్తిమై
మనఁ బని యేమి కల్గె? గరిమన్ వచియింపు, మునీంద్ర! యన్నచోన్.

శా. మానీంద్రుండను రామభద్ర! వినుమా! మాద్యత్ప్రభావుండు వి
జ్ఞానస్థానము! నీదు భక్తుఁడగు శశ్వత్కీర్తి శరత్న ప్రభా
శ్రీ నైర్మల్య కథా ప్రసంగ మది భాసిల్లున్ మహాచిత్రమై
జ్ఞానద్యోతకమై మహా సుజన శశ్వత్ స్తోత్ర పాత్రంబునై!

ఉ. అంజనిపర్వతంబున మహాకపి కేసరి నామకుండు రా
జం జరియించుచుండు నతి సంస్తుతిపాత్రుఁ డతండు, వానికిన్
అంజనియున్ బిడాలముఖి యంచు సతీద్వయ మున్న, దందు న
య్యంజని కైకయీ చ్యుత మహత్తర పాయస పిండమున్ దినెన్.

ఆ. గ్రద్ద తెచ్చినట్టి ఘన సుధా తుల్యమా, పాయసంబుఁ దిన్న పడఁతి యామె
సవతియైన పిల్లి చాయ మోము వెలంది, గలసి యొకట నచట మెలఁగుచున్న.

క. సతియగు కేసరియు తపో,రతి నుండిన విరహమున కరంబు జెలఁగుచున్
కుతుకమున వనవిహారణ, స్థితి విచ్చలవిడిగఁ దిరుగు చెయిదమునందున్.

ఉ. గాలికి వారి వస్త్రములు గ్రక్కున పైకెగురంగ గాంచి య
గ్గాలియు నైఋతుండును బ్రకల్పిత కామ వికారులై వడిం
దూలి తదీయ కాంతల కుతూహలముల్ పరిపూర్ణమందగా
కేలి విలాసముల్ సలిపి క్రీడల సల్పగ గర్భధారులై.

గీ. అంజనీగర్భమున మారుతాత్మజుండు, అతివ మూర్ఖాలముఖికి మహా పిశాచి
జననమందిరి, మారుతి చైత్రశుక్ల, పూర్ణిమన ముహూర్తంబున బుట్టెనంట్రు.

ఉ. ఆ పవమాన నందనుఁ డహంకృతి మీఱఁగ బాల్యచేష్టలం
జూపుచు నొక్కనా డెగిరి సూర్యుని పండని బట్ట నెంచుచున్
తేపకు తేపకున్ దివికి తేజము మీఱగ గంతు గంతునన్
బాపురె! వేయి యామడల వంతున నేగుచు డాఁసె నారవిన్.

గీ. నాడమావాస్య! యౌను, పెన్గ్రహణమగుట, రాహువు గ్రసించుటకుఁ జేరె రవిసమీప
మందునున్న కపీంద్రుని మహితమౌ ప,రాక్రమముఁ జూచి భీరుఁడై రమణమీఱ.

ఉ. ఇంద్రుని వద్దికేగుచు, మహేంద్రుఁడ! నిన్నిపుడే గ్రసింతు! దే
వేంద్రుఁడవై యిదేమిటికి? యిట్టుల నీ నియమంబు నీవె ని
స్తంద్రత దప్పియిత్తెఱఁగు సల్పితి? విఘ్నము; ఇట్టు లున్నె? యీ
తంద్రత యింతమట్టుకు యథార్థము చూడఁగ లేదు వాసవా!

ఆ. రాహు కేతువులకు రవి బింబమును గ్రసిం,చుట విధించి వెండి చోద్యమయ్యె!
చేట తవుడువెట్టి చెలగి కుక్కల వేట, చూఁడదలఁచినావె? సొంపుగదుర!

ఆ. ఇన్నినాళ్లనుండి యే నెన్నె డెఱుఁగను, గ్రహణ విఘ్న మిపుడు కల్గె నెట్లు?
రాహు కేతువుల తిరస్కార మొనరింపఁ,గల బలమ్ము కోఁతిఁగంటి నేడు.

చ. అని యదలింపగా విని రయంబున నింద్రుఁడు వెల్ల యేన్గుపై
వెనుకొని వేల్పులెల్ల జన వేగమ సూర్యునిఁజేరి; సూర్యునిం
దినఁగ దలంచు కోఁతిఁగని తెప్పున వజ్రమహాయుధంబునన్
హనువు దెగంగ గొట్టె! నపు డా కపి నేల పయింబడెన్ వడిన్.

గీ. వజ్రఘాతంబువలన రవ్వంతయేని, కపి హనువు భిన్నమవదు! కొంచెపు బలమగు
దెబ్బతగిలినదై మూర్ఛఁ దెచ్చెఁగాక! ఒండొకం డిట్టులాగునే ఉర్విపైని.

గీ. అందులకె హనుమంతుఁ డన్నాహ్వయంబు, ఆంజనేయున కొదవె! అయ్యతఁడు భూమి
పయిఁబడుటఁగాంచి వాయువు పట్టరాని, కోపమంది స్తంభించుకఁ గూరుచుండె.

గీ. ఆంజనేయుని లాలించి యతనికిని ము,దంబు మీఱఁగ తా సమాధాన పఱచి
ఛలన రహితుఁడై కోపమ్ము కలననుండె!, వాయుదేవుండు లోక విపత్కరముగ.

క. హనుమంతుని వలె లోకపు, జనులెల్లరు నేలఁగూలి చయ్యన నిశ్చే
ష్టనుఁగుంద మూఁడు లోకము,లును పీనుగుపెంట లయ్యె లుప్త విభవమై.

సీ. కళ కాంతిలేదు స్వర్గము నందుగూడ హా!, హా! కారములు పుట్టె నపుడు బ్రహ్మ
దేవుఁ డింద్రునిపిల్చి ధిక్కార మొనరించి, వాయు సన్నిధికినై వచ్చి యతని
వందించి, మిత్రమా! వాయుదేవా! యప,రాధమే చేసె నింద్ర బ్రువుఁడు
క్షమియింపు మతని, నీక్షణమున నీపుత్త్రు, వరముల ననముగాఁ బరఁగనేతు

గీ. ననుచు ప్రార్థింప మునుపటి య ట్లనిలుఁడు, చలనుఁడయ్యె లోకంబులు సంతసించె!
బ్రతికె జీవజాలంబెల్ల ప్రస్తుతించె, బ్రహ్మదేవుండు నతని శుభంబుమీఱ.

వ. మఱియు నవ్వాయు సూనుంగని యసమానప్రీతిం గమలజుండు.

ఉ. నీ వమరుండ వయ్యెదవు! నీ నిజ దేహము వజ్రతుల్యమా!
నీవు చెలంగి విష్ణునకు నిర్మల భక్తుఁడ వౌదువన్న! సం
సేవ యొనర్తు వాతనికి, చెప్పఁగనేల? నినుం భజింతు రీ
దేవత లందఱున్ బలెనె; ధీవర! వాయుకుమార చంద్రమా!

క. అని యిట్లమోఘ వరముల, దనిపి వాయుసుతుని వాని తండ్రిని, దానుం
జనె సత్యలోకమునకున్, జనె నప్పుడు రాహువు రవిచాయకు మ్రింగన్.

గీ. అనిన శ్రీరామచంద్రుఁ డిట్లనియె! మౌని, చంద్రుఁ గనుఁగొని ఓ మునిస్వామి రాహు
వునకు కేతువునకు నింద్రుఁ డొనర నెట్టు,లిచ్చె రవిఁ శశిఁ వినఁగ నా కిచ్చ గలదు!

క. ఆసంగతి సవిస్తరము,గా సంయమి! దెలుపు మనిన, కడఁగి వికాసో
ద్భాసురుఁడగు నా విద్వ,ద్భాసురుఁ డిటులన్ వచించు పొలుపెసలారన్.

ఆ. దేవ దానవులు మధింప పాలసముద్ర,మును సుధావతరణము గలిగెకద!
దాని రాక్షసులకుఁ దప్పింపగా హరి, మోహినీ స్వరూపమును ధరించె.

శా. ఆ సౌందర్య విమోహితాత్ములయి దైత్యానీక మమ్మోహినిన్
వేసమ్ముం గని తన్మయత్వమున వెవ్వేరాచు, దేవాళి కెం
తో సంతోషము మీఱ, వారలకె తోడ్తోఁ బోయునంచున్ సుధన్
కాసంతైన చలింపకన్ నిలుచు నక్కాంతా లలామంబునున్.

మ. ఇదిగో! వచ్చితి! వచ్చితంచు దనుజానీకంబుకై చూచి, హె
చ్చు దయా ధర్మముఁగల్గు నట్లు నటియించున్ గాని, దేవాళికే
అది సంపూర్ణముచేయుచున్నదని, యొయ్యన్ రాహుకేతుగ్రహా
లదితీ సూనులలోన జేరి యమృతం బవ్వారునున్ ద్రావినన్.

మ. అమరత్వంబు లభించె! వారలకు, వారైనారుగా ద్వ్యాగ్రహా
పము లవ్వారలు దేవతా నివహముం భక్షింపరా, చంద్రున

ర్యము, దేవేంద్రుఁడు చూపె వారలకు నాహారంబుగా, వారు దు
ర్దమ కాంతిఁ నసియింపరంచు మఱలఁ దర్పింతురం చూహతోఁ.

క. ధార్మికులగు నీలోకులు, కర్మలకుఁ గారకులగు ఘన రవి శశులఁ
పేర్మిని పీడా ముక్తుల, ధర్మములఁ దానములను దవిలి యొనర్పఁ.

శా. దానఁ వారలుముక్తులై మొదటి కన్నఁ సంప్రకాశాత్ములై
(శ్రీ)నిర్వ్యాజ శుభప్రదాభిరతి నుర్విఁ వెల్గుచున్నారహో
(శ్రీ)నారాయణ! మారుతీ మహిమముఁ జెప్పంగ నాచేత నౌ
నే? నానేర్చు కొలందిగాక! అతఁడంతే యింపు సొంపారుచుఁ.

గీ. బలపరాక్రమ వంతుఁడై పరగి యతఁడు, మునులు ఋషులను బాధింపమొదలువెట్టె
నపుడు వారలు కోపముం గృపచెలంగ, నీపరాక్రమ మెఱుఁగకనీవు మనుమ!

చ. ఇతరులు నీపరాక్రమ మహీన మటంచు వచింపఁగాని నీ
వితతబలంబు నీకు కనుపింపక పోయెడుగాత! మంచు వా
రతనికి శాపమిచ్చి, రటులంతట వారల బాధమానె; న
ట్టి తరిని సూర్యపుత్రుకడ డెప్పరమాతన శౌర్యమంతయుఁ.

గీ. మఱచియుండెను, కపులు దుస్తరసముద్ర, లంఘనము కాదటంచు తలంచి యపుడు
ప్రాణముల వాయఁ బండిన వారిఁగాంచి, జాంబవంతుండదను గని సంతసమున.

గీ. పొగడె హనుమంతుఁ డాతఁడు పోయి తృటిని, నూరుయోజనముల వార్ధిమీఱదాటి
సీతఁ గనివచ్చి నీకూర్మిఁ జెందె రామ! అందుచే నాతఁ డెరుఁగఁ డీ యంశములను.

క. రామా! నీ వడుగుటచే, ప్రాముఖ్యములైన దనుజవర్గము యొక్కఁ
(శ్రీ) మర్కట కథనంబులు, నీమెయి వచియించినాఁడ! నిద్ధ చరిత్రా!

శా. మాయామానుష విగ్రహుండవు మహాత్మా! నీవునఁ బెద్దగా
సేయంగాక త్రికాల వేదివి! జగచ్ఛ్రేయార్థమై పుట్టినా
వీ యర్కాన్వయమందుఁ గాకఁ గలదే? యెన్నంగ జన్మంబు నీ
కీ యర్థంబులు క్రొత్తలే? యెఱుఁగఁగా నీరేడు లోకంబులఁ.

క, సాక్షాత్పరమేశ్వరుఁడవు, రాక్షసులను జంపి సాధు రక్షణ సేయఁ
మోక్షాధికారి పుట్టితి; వీక్షితి సర్వజ్ఞుఁడవు మహేశుఁడ అనఘా!

క. సాక్షివి! త్రికాలముల ని,ష్పాక్షివి! నీ కనిన యెట్టిపని లే దఱయఁ
సాక్షాత్కరింతు భక్తుల, రక్షింపఁ దుర్మదులఁ గరంబు హరింపఁ.

క. లోకైక పూజ్యుఁడవు న,స్తోక పరాక్రమ విభాసితుండవు ధరణిఁ
(శ్రీ) కౌసల్యా సుతుఁడవు,గా కన్పట్టితివి! మమ్ముఁ గాచుట కొఱకై.

క. అని యిట్టు లగస్త్యునిచే, వినుతుండై రామచంద్రవిభుఁడు మునీంద్రున్
మనమెఱియ మన్ననంబుల, ఘన సంతుష్టుని పొనర్చి క్రమ్మఱఁ బంపెన్.

శా. శుద్ధబ్రహ్మ పరాత్పరుం డయిన యీశుం డా రమానాథుఁ డ
త్యోద్ధత్యంబున రాజ్యమేలె, తత సోదర్యాభిరాముండునై
బద్ధుండైన మనుష్యుపోలె, యువతీ బంధు ప్రజా ధుర్యుఁడై
సిద్ధంబైన సుఖంబులన్ గనుచు సుశ్రీసద్యశోపేతుఁడై.

క. తాను ననాసక్తుండై, జానకితోఁ గూడియుండె సక్తుఁడపోలెన్
మానితుఁడై మంత్రులునున్, నానా సామంతు లొగి వినమ్రతఁ గొలువన్.

క. హనుమంతుఁడు సేవింపన్, అనుజులు కనుసన్నలన్ మహాభయభక్తుల్
పెనఁగొనఁగఁ గొల్వ, పౌరులు, ననవరతము మెచ్చ రాముఁ డవనిన్ యేలెన్.

సీ. రఘురామచంద్రుఁడు రాజ్య మేలుచునుండ, నుర్వియుర్వరయయి యొప్పియుండె!
సఫలంబు లఖిల వృక్షంబు లెయ్యెడలను, ధర్మవర్తనులు మోదమున జనులు !
పతిభక్తి రతులెల్ల పడఁతులు పుత్రశోకము నెఱుఁగ రయోధ్యయందు వార !
లేక పత్నీవ్రతం బేక శరంబును, నేక వాక్యంబనియెడు యశమున !

గీ. రామచంద్రుఁడు పాలించె రాజ్య మనుప, మానచాతుర్యమున సుధామాన్యగరిమ
ఒక్క పదొకొండువేల యేండ్లొప్పు మీఱఁ, రామచంద్రుఁడు జగదభి రాముఁడగుచు.

సీ. సపరివారముగ పుష్పకముపై రాముఁడు, సీతా సమేతుఁడై క్షితి జనములు
బంధువులం గూడి బహు తీర్థయాత్రల, సల్పె భక్తియు శ్రద్ధ సంతరింప
నతఁ డమానుషుఁడయ్యు నర్థిమానుష కృత్యములు నెన్నిటినో చూపు చలముమీఱ
లోకు లెఱుంగ నొక్కో కోట్లకొలఁదిగ, శివసుప్రతిష్ఠలఁ జేసి చెలఁగె

గీ. బహుళ దక్షిణ లిచ్చుచు బహుతరాశ్వ, మేధముల నెన్నొ ? గ్రతువుల మివులచేసె !
రామరాజ్యం బనఁగనేలె రమ్యరీతి, రామచంద్రుఁడు జగదభిరాముఁ డగుచు.

సీ. పురుషులున్ మోహంబుపుట్ట చక్కదనంబు,కల రామచంద్రుఁడు కలువకంతి
కానంద విగ్రహుండై దివ్యభోగాళి, తాను సంతస మిడె జానకికిని
ధర్మాత్ముఁడును లసద్ధర్మజ్ఞుఁడును నగు, రాముఁడేలెన్ ధర్మరాజ్యరమను
సర్వలోకముల నిశ్చయముగ పరిశుద్ధి, సల్పంగ స్థాపించె సచ్చరిత్ర !

గీ. త్రేతయందున రాజ్య మర్థిని నొనర్చె, నంతకున్ మున్ను నాపైని నంత ధర్మ
మూర్తులు జనింపరను కీర్తి ముమ్మరముగ, రామచంద్రుఁడు జగదభిరాముఁడగుచు.

సీ. అగు సనాతన గృహస్థాశ్రమ ధర్మంబు, సరిసమగ్రముగ నాచరణ చేసె
శ్రీరామచంద్రుఁడు సీతయు వినయమున్, ప్రేమానువర్త నేంద్రియ వినిగ్ర

హంబుల లజ్జయు ననువొప్పు భావము, నెఱిఁగి భర్తృ మనోగతేష్టసిద్ధి
భక్తి రంజిలఁజేసి పరగ సంసారము, నంసార మనిపించె జానకమ్మ !

గీ. ఇట్టి భవ్య చరిత్రులు నిద్ధమూర్తు, లింకఁగలుగరు మునుపు లేరెందునైన
ననఁగ వర్తిలినారు భూమిని ముదమున, జానకీ రామచంద్రులు సాధురీతి!

గీ. పార్వతీ ! నీదు ప్రశ్న సాఫల్యముగను, రామరాజ్యోత్తర చరిత్ర రమ్యరీతి
చెప్పినాఁడ ! నీ భవ్య విచిత్ర ధన్య,చరితమును విన్నఁగల్గు శశ్వత్సుఖములు.

క. ఈ దివ్య చరిత్రంబున్, బ్రోదిన్ వినువారి దురితములు కడతొలఁగున్
శ్రీ దయితుని కృప వలనన్, మేదుర మంగళము లొదవు మించిన కూర్మిన్.

అ. ఇట్టి సారకాండ మెవ్వరు వింద్రో, అట్టి సజ్జనులు మహాముదంబు
సకల వాంఛితములు సంప్రాప్తముం జెంద, ధన్యులౌదు రెందు ధర్మరతిని!

క. శతకోటి చరిత కంత,ర్గతమై యానందమై ప్రకాశంబౌ అ
ద్భుత రామచరిత సారము, వితతం బీ కాండయందు వివరింపఁబడెన్.

గద్యము

ఇది శ్రీ బాలభారతీ వరప్రసాదలబ్ధ కవితా ధౌరేయ
పండిత చిలుకూరి శ్రీరామశాస్త్రి నామధేయ
ప్రణీత శ్రీమదాంధ్రానంద
రామాయణాంతర్గత
సారకాండస్థ
ఉత్తరకాండము
సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః
స్వస్తి శ్రీ సమస్త సన్మంగళాని భవన్తు.

# ఆనంద రామాయణము



## యాత్రా కాండము

### ప్రథమ సర్గము



#### పార్వతీ పరమేశ్వర సంవాదము

శ్రీమద్రామకథా సుధారసము సంప్రీతాత్మయై గ్రోలు గౌ
రీ మాన్యుంగని శంకరుండు కరుణార్ద్రీభూత చేతస్కుఁడై
రామధ్యాన పరాణుఁడనగునన్ రామాయణ శ్రీ కథా
ప్రాముఖ్యంబులఁ దెల్ప వేడు టది నా భాగ్యంబు కాదే సతీ!

ఉ. రాముఁడు తల్లి! తండ్రి! రఘురాముఁడు నా యిలవేల్పు! జానకీ
రాముఁడు తోడు! నీడ! జయరాముఁడు చుట్టము! నాప్తమిత్రమున్;
రాముఁడు నాకు రక్షణ! నిరంతరముం జపియింతు రామునిన్!
రాముఁడె నాదులోకమని రంజిలుదున్ నిరతంబు పార్వతీ!

క. అని బ్రహ్మానందంబున, మునుకలుగాఁ బలుకు పతికి మ్రొక్కి మహాత్మా!
వినిన నీవచనమునవె, వినవలె శ్రీరామ కథ సవిస్తర లీలన్.

శా. నీకంటెన్ మహనీయవక్త కలఁడే? నిర్వాణ నాథుండు నా
థా! కౌసల్య తనూజుఁ డాతని చరిత్ర ల్వీనులన్ సోకినన్
గాకేమా? పరుసంబుతో నినుము బంగారంబు గాకుండునే?
ఆ కళ్యాణ కథల్వినంగ హృదయం బత్యంతముం గోరెడిన్.

సీ. పుణ్యప్రదమ్ము శంభో! సారకాండము, నీవు విన్పింపఁగ న్వింటిఁ గంటి
అవిశానందంబు, నత్యంత శుభముల, మంటి, మానసము ముమ్మరపు సౌఖ్య
నిలయమై తోఁచె, నెంతేసమర్థుండవు, సర్వముం జెప్పఁగా చాలువాఁడ
వతి కుతూహల చిత్తుఁడవు, నిన్ను నడిగెద!, శ్రీరామ కథ సవిస్తారముగను

గీ. అశ్వమేధాదికము సల్పె నంటివీవు, ఆ మహాత్ముని రాముని అనుజవరుల
సంతతిని, వారి పెండ్లిండ్ల సరణి, రామ, రాజ్యరీతి వచింపుమా! రమ్యఫణితి.

క. రాముని సర్వవిశేషము, లీమెయి వివరింపుమన్న; నింతీ ! నీకా
రాము కథా విస్తారముఁ, బ్రేముడి వచియింతు విను మభీష్టము నిండన్.

క. నీ సంప్రశ్నము మంచిది, భాసుర కల్యాణకరము ! పార్వతి! దానిన్
కాసంతేనియు వీడక, నాసతి ! వచియింతు ! తొల్లి నాకుభవుఁగతిన్.

చ. అని వచియింపఁగా పరమహర్ష సమేత! లసత్ ప్రభూత ! నా
థుని గని, నాకుసంభవుఁడు తొల్లి వచించిన రీతి నంటి వా
తని వచనంబు రామకథ తత్పరతన్ వచియింపుమన్న, న
య్యనుపమ రూపశాలియగు నా సతిఁ గాంచి శివుండు నిట్లనున్.

క. శతకోటి విస్తరంబై, స్తుతిపాత్రంబై విచిత్ర శోభితమై య
ద్భుతమై యేకైకాక్షర, స్మృతి సంచ్యుత పాపమై యభీష్ట ప్రదమై.

క. రఘువరు చారిత్రము పుణ్యా ఘనుండౌ నాకుజాతు నభివిరచితమై
యఘహరమై సుఖభరమై, అఘటనఘటనాసమర్థమై యలరారున్.

## వాల్మీకి శోకము శ్లోకమగుట

క. ఆ వృత్తాంతముఁ దెల్పెద, దేవి! తమసా మహానదీ స్నానము శి
ష్యావృతుఁడై తా చేయంగా వాల్మీకి ముని జనె నొకానొక నాడున్.

ఆ. పోయి యటుల యోగిపుంగవుం డా నదీ,తీరమందు తగిన దూరమందు
తన కమండలంబు నునిచి శౌచాచార,ములను దీర్చి స్నానమునకుఁ గడఁగి.

గీ. దర్భలం దాల్చి తన పాణితలము నందు, నీటిలోపలఁ దిగుచు నదాటుగాఁగ !
జంట కొంగలలో తన వెంటఁగూడి, నట్టి మొగకొంగ నొకబోయ కొట్టఁగాంచె.

సీ. తన జంటబాసి మింటను విషాదమున వి,యోగంబును సహింప నోపలేక
అకట ! శోకాక్రాంతయై కడు దుఃఖంబు,చే నేడ్చు క్రౌంచిని మాని కాంచి
ధర్మాత్ముఁడైన యుత్తమయోగి వాల్మీకి, కరుణామయుండయి కనలి యనియె!
*మా నిషాదుండ ! కామ విమోహితంబగు, క్రౌంచ మిథునములఁ గడఁగి యొకటిఁ

గీ. ఏల చంపితో? అందుల కెన్నొయేండ్లు, పొందుమావు రా ప్రతిష్ఠ ! పోపోయటంచు !
పలికి యాత్మాను సంధాన పరతనుండి, ముని మునిఁగె చింతలోన నెమ్మనముఁ గునియ.

గీ. అహాహా ! శోకార్తమైన యయ్యండజంబుఁ,గాంచి యావేశమున నేను కడఁగి పల్కి-
నట్టి పలుకుల పొంకంబు అనుపమంబు ! విను మటంచు భారద్వాజ మునికి ననియె.

---

*మా నిషాద ప్రతిష్ఠాంత్వ । మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్ క్రౌంచ మిథు నా దేక । మవధీః కామమోహితమ్.

గీ. శిష్య ! సమపాదములచే విశిష్టమగుచు, అక్షరముల సమానమై యలరినట్టి
నాదు పలుకు వీణాగాన లయ విహితము !, శోక సంభూత మిదియ సుశ్లోకమయ్యె.

క. అని మాటిమాటికిని తా, వినిపించె నదే పదముల విస్పష్టముగా
విని శిష్యులెల్ల దానిం, బనిగా వల్లించి రెంతొ పరమ ముదమునన్.

గీ. ఏమి యీ సంఘటన మిది యెట్లుకల్గె!, ఏమి పల్కితి! నావేశ మెలమిఁ గల్గ;
పలికితినిఁ గాక ! మున్నిట్లు పలుకఁ బడెనె?, దీన నేదియో పరమార్థ మానుఁగాక!

క. అని యాలోచనముల నెన్కొని సేయుచు, సంతసమునఁ గొనకొని స్నాన
మ్మునుఁజేసి, తదర్థము నే, మనమునఁ దలపోసి యాశ్రమంబున్ జేరెన్.

శా. భారద్వాజుఁడు పూర్ణమా కలశముం బాగొప్పఁగా బట్టి, సొం
పారన్ శ్లోకము నన్వయించుచు, యశః ప్రాచుర్యమా దాని వి
స్తారంబున్ గురియించియే తలచుచున్ సంతోష ముప్పొంగఁగా
చేరెన్ సద్గురు నాశ్రయించి, కడు నాశీః కామియై భక్తిమై.

## బ్రహ్మ వాల్మీకాశ్రమమునకు వచ్చుట

క. తన పుణ్యాశ్రమమును శిష్యునితోడఁ బ్రవేశమొంది యొప్పెడు వాల్మీ
కుని గడు సుఖోపవిష్టుం, గన నచటికి బ్రహ్మవచ్చెఁ గ్రమ్మర లీలన్.

గీ. విస్మయంబంది వాల్మీకి వేగలేచి, మివుల భక్తియు శ్రద్ధ తమిన్ వెలుంగ
దేవదేవుఁడౌ బ్రహ్మ కాతిథ్య మిచ్చె! అర్ఘ్యపాద్యాసనాదుల నాదరించి !

శా. అంతన్ బ్రహ్మవచింప, నాసనమునం దాసీనుఁడై మౌని, వి
భ్రాంతింగొల్పు తదీయ క్రౌంచమిథున వ్యాపారమున్, వ్యాధునిన్
శాంతింబాసి శపించినట్టి విధమున్, సమ్యగ్విధిం తద్వచో
త్యంత ప్రస్ఫుట ఫక్కిమన్, తగ నుపన్యాసంబుఁ గావించినన్.

క. ఓయీ ! వాల్మీకీ! అది, నాయిచ్ఛన్ గల్గె నీకు నవ్య కవిత్వ
శ్రీయని యెఱుంగు మది కా, దా యర్థము దాని వివరమది యెఱిగింతున్.

క. శ్రీరామ చరిత్రంబును, నారదముని వలన విని ఘనంబుగ వ్రాయం
గారవమున ఛందో సంస్కారంబది కల్గె నీకు కావున వినుమా !

గీ. మానిషాదుఁడనంగ నమ్మాధవుండు ! క్రౌంచశబ్దంబు రావణ గరిమఁ గాంచు !
వాని సంహారమునను శాశ్వత సమములు, సుప్రతిష్ఠను కనుమని చూ ! వివరము !

మ. అని రామాయణ మూలకందమగు దివ్యంబై మహాభాగ్యమై
ఘన మత్యద్భుత సంవిధానమగు శ్లోకంబున్, తదీయార్థమున్

మనమేదన్ వినిపింపగా విని, భరద్వాజుండు వాల్మీకియుం
గని రింతింతనరాని హర్షమును, యోగ్యంబైన యుచ్చస్థితిన్.

గీ. అంత నవ్వుచు బ్రహ్మ యిటని వచించె ! ఆదిమ కవిత్వమగు నీ మహా వచస్సు !
శోకమని యెంచేవలదు సుశ్లోకమద్ది ! దాని రీతిని రామ కథను వచించు !

క. శ్రీరాముఁడు ధర్మాత్ముఁడు, ధీరుఁడు గుణవంతుఁడును సుధీమంతుండున్
ఆ రామ కథా విధమిక, నేరుపుగాఁ దోచు నీదు నేత్రంబులకున్.

ఉ. కావున నాయనుజ్ఞఁగొని కావ్యమునున్ రచియింపుమయ్య ! సం
భావిత సచ్చరిత్రుఁడు ప్రభావయుతుండు రఘూత్తముండు లో
కావన దీక్షఁబుట్టి పరమార్థము ధర్మమునంద నిల్చి, దీ
క్షావిధి వేదచోదిత యశంబునుఁ గూర్చి ప్రసిద్ధి నొందెడిన్.

క. కావ్యంబున నీ వాక్యం, బవ్యయము ! యథార్థ మగుత ! అటుపయి నది శ్రో
తవ్యంబై యెన్నగ మంతవ్యంబా రవి శశి గిరి తారక మగుచున్.

ఉ. నీ కథ ఎంతదాక ధరణిన్ మనునంతకు నీవు ఊర్ధ్వపున్
లోకములం జరింతువు, సుక్లృప్తముగా రఘురాము సత్కథన్
నీ కెటిఁగింతు నంచు, రమణీయ విధిన్ వినిపించె దేవతా
వాకులచేత, నద్ది విని వారని సమ్ముదమందె మౌనియున్.

గీ. అంత వాల్మీకి యర్చల నంది యజుఁడు, అందె అపుడె అతర్ధానమయ్యె ! నంత
మానిషాద శ్లోకార్థము మది దలచుచు, మౌనియును శిష్యులును శుభమహిమ గనిరి.

క. తరువాత నాకు నంభవుఁడు రచించెన్ నారదుఁడు గడుంగడు శ్రద్ధా
గరిమన్ వినిపించిన మేదురకథ నాధారముగ సుదుర్లభ లీలన్.

మ. పరమోదార సువృత్త పూరితము, శుంభత్సత్పదాత్మోన్మనో
హర సుశ్లోక విభాసురంబయిన దివ్య శ్రామ చారిత్రమున్
విరచించెన్ ముని, నూరుకోట్లుగ జగద్విఖ్యాతిగా దానినిం
గరిమన్ విన్చెద! నీకు సంగ్రహముగాఁగా బేరుపో కుండఁగన్.

* * * *

# తృతీయ సర్గము

## * ఆనందరామాయణకర్త శ్రీ సమర్థరామదాస స్వామి

సీ. శతకోటి పద్యవిస్తార రామాయణ, సంక్షిప్త కథనంబు సారసాక్షి
నీ ప్రశ్నమునకు నే నిశ్చయించితి సరియైన ఆనందరామాయణంబు
శ్రీరామదాసుని శ్రేష్ఠ కవిత్వంబు, ప్రత్యుత్తరంబు ప్రభావయుతము
రామకథా యథార్థరహస్య శోభిత, మానందదంబు రోచ్యంబుఁ గాన

గీ. దాని వినిపింతు వినుము మోదంబుమీఱ, భవ్య రామాయణ కథా ప్రపంచమందు
అరఁగొరలు కొంకుటొంకు లేనట్టులగు న,టన్న నాశ్చర్యచకితయై యనియె! గిరిజ!

క. ఆ రామదాసుఁ డెవ్వఁడు, శ్రీరామ చరిత్ర మతనిచే చెప్పబడం
గారణమే మది మన కే, తీరున ప్రామాణ్యమా ? యథాతథమనుచున్.

గీ. ఆర్షమైన రామాయణ మవనియందు, మానవుం డొక్కఁడు రచించు మాత్రఁ దాని
నీవుఁ గొప్పగాఁ జేసి మన్నించునంత, మహిమ నది యెట్లు కాంచు సుమ్మా! యటన్న!

శా. గౌరీ! ఆతఁడు మారుతాంశజుఁడు శంకంబొంద నీకేల? మ్లే
చ్ఛారణ్య ప్రతిభా దవానలుఁడు నా జన్మించితింగా శివా
జీ రాజేంద్రుండనై, తదీయ గురుతన్ జెన్నొందితి మ్లేచ్ఛ సం
హారంబుం బొనరించి, హైందవ మతాభ్యాధిక్యముం జాటితిన్.

ఆ. ఆ సమర్థ రామదాసాఖ్య విరచిత, మద్భుతార్థవంత మతిపవిత్ర
మద్ది యమ్మహాత్ముఁ డా నాకు సంభవు, కృప వచించె నగజ! కేవలముగ !

క. ఆ లెక్క చేత నతడు వి,శాలాక్షీ! మద్గురుండు! సకల సుగుణ వి
ద్యా లక్షణ మహిమా భా,గ్యాల వాలుఁడౌ మహాత్ముఁడనఁగా వలెనే.

క. ఆతని చరిత్ర మెన్నగ, నాతరమా! నీతరంబ! నలినదళాక్షీ!
ఖ్యాతుం డాతని బొగడుట, శ్రీతరణిన్ దివటిఁజూపి చెప్పుట కాదే?

ఉ. ఆతఁ డనేక గ్రంథముల నర్మిలిఁ జెప్పెఁ బ్రశస్త రీతిగా
నాతత హైందవ ప్రజల నార్తుల నిర్భయులం బొనర్చె, యీ

---

* సారకాండము మొదటి పీఠికలోని ౫, ౬, ౭, ౮, ౯ పుటలు రామాయణము శతకోటి ప్రవిస్తరమను ఘట్టమును ఇక్కడ చదువుకొనేది. అందు ముల్లోకములవారును రామాయణమునకై కలహించుట, శివప్రార్థనచే విష్ణుమూర్తి రామాయణము నందఱికి పంచిపెట్టుట, వాల్మీకి రామాయణమే సర్వశాస్త్ర పురాణములకు మూలము, భగవంతుడు బ్రహ్మకుపదేశించిన భాగవత మూల శ్లోకచతుష్టయము, ఆదిరామాయణము ఖిలముకాగా అనేక రామాయణము లేర్పడుటలు కలవు. అది తృతీయ సర్గము.

ఖ్యాతికినై జనించె జననావధిగా జగ ముద్ధరించుటే
ప్రీతిగనెంచి, నన్ను నిలఁబెట్టి యతం డొనరించె సర్వముౝ.

చ. అని బహుళంబుగా పలుకు నప్పతిఁ జూచి యొహెూ! సమర్థుఁడే?
యనువుగ నాకసంభవు సదాజ్ఞనుగాంచి సమస్తలోక పా
వనమగు నూరుకోట్లయి ప్రవర్తిలు రామకథా ప్రపంచముౝ
జనులు తరింపఁజెప్పెనె? నిజంబుగ దాని నెఱుంగఁ జెప్పుఁడా!

ఉ. ఆమహిమా విశాలి కృత మందున మారుతి; త్రేతయందు దే
వా! మహనీయుఁడైన పవనాత్మజుఁడయ్యెను; ద్వాపరంబునన్
భీముఁడుగా జనించె; కలివేళలయందు సమర్థ రామదా
సై మనెనంచు నే నెఱుఁగనా? అతఁడా? కృతికర్త దీనికిౝ.

క. అటులైన నాథ! అది వి,స్ఫుట నానామృదు మధుర రసోవాసమ్మౌ
పటుతర తవవాగ్ఝరిలో, చటుల తరంబుగ నొనర్తు స్నానమ్ము లొగిన్.

వ. అని కుతూహలయగు శాంభవికి శంభుం డిట్లు వచింపం దొడంగె.

శ్రీ సమర్థ రామదాసస్వామిని శిష్యుఁడు విష్ణుదాసు ప్రశ్నించుట

ఆ. (శ్రీ) సమర్థుఁగాంచి శిష్యుండు వచియించు, సారకాండమును ప్రశస్త రీతి
వింటి! మీదు కృపనుగంటి సమ్మోదమ్ము! నింక వినఁగవలయు నిచ్ఛకలదు.

ఆ. రామరాజ్యమంచు ప్రఖ్యాతియేకాని, దాని వివరమును మహానుభావ!
తెలుపకున్న మదికి తృప్తి యెట్లు జనించు?, కృపవహించి తెలుపు పృథులతేజ!

ఆ. పదునొకండు వేల వత్సరా లేలె! (శ్రీ), రామచంద్రుఁ డఖిల రాజ్యమంటి
వా తెఱంగు సౌఖ్యమర్థి సీతారాము, లెనయు విధముఁ దెల్పు డనిన గురుఁడు.

శా. శిష్యా! రాముని రాజ్యవైభవమునుౝ, సీతామనోహారి వై
శేష్య క్రీడల, వారి సంతతిని, నిశ్శేషంబుగా రాఘవుౝ
పోష్యంబౌ జనులెల్ల ముక్తిఁ గొనుటల్, పొల్పారఁగా నీకు ని
ర్దూష్యంబైన విధంబునౝ వినుతు! నిర్దుష్ట ప్రతాపోన్నతుల్.

శా. ఆ వాల్మీకి మహర్షి సత్కృపను, లోకానీకము ల్వాకి సం
భావింపన్ మనయందు లేని కథలన్, భావించి వర్ణింతు శం
కా విన్యాసము కల్గకుండఁగ, లసత్కల్యాణ సౌభాగ్య శో
భా వృత్తంబుగ శిష్యుఁడా! వినుమ! శుంభత్ రామ చారిత్రముౝ.

ఉ. రావణు సంహరించి తన రాజ్యము నేల రఘూత్తముండు, సం
భావితమౌ అయోధ్యన, విపత్తులు చౌర్యము లీతి బాధలున్

లేవప మృత్యువుల్ కఱవులేమి భయంబును చింత లేములున్
లేవు దరిద్ర బాధలును లేవట రోగములున్ కృతఘ్నతల్.

ఆ. బిచ్చగాండ్రు లేరు పేదలు దుష్టులు, పాపరతులు మూర్ఖపాళి లేరు
క్రూరులున్ కృతఘ్న కోపనులట లేరు, రామరాజ్యమున ధరాతలమున.

క. నయ భయ వినయాన్విత యగు, ప్రియురాలు ధరాతనూజ ప్రేమయు లజ్జా
హ్వాయ భూషణములఁ జెలఁగుచు, ప్రియునిఁ దరిఁజేరి పల్కె పెంపెసలారన్.

శా. మన్నాథా! రఘునాథ! ఆజ్ఞ, యగుచో మద్వాంఛ యొక్కింత మీ
కు న్నేనిప్డు వచించుదాన, నది నాకుంబోచె శ్రేయం బటం
చు న్నిర్వ్యాజ సుఖంబటంచు మఱి నిస్తుల్య స్వధర్మం బటం
చె న్నే రీతుల మీరు మన్ననము సేయింపుండు! ప్రార్థించెదన్.

సీతాదేవి గంగాదేవికి మ్రొక్కు చెల్లించవలెనని విజ్ఞప్తి చేయుట

ఉ. అందులకై రఘుప్రవరుఁ డాదర మొప్ప సరోజనేత్రి! ఆ
నందనిధాన! నీ మనసునన్ గల కోరికఁ దెల్పు మన్న! నా
నందమునొంది జానకి మనం బెఱియంగ వచించు నిట్లు, ని
ష్యంద మరంద సుందర వచఃపరిణద్ధ మనోహరాంగియై.

శా. స్వామీ! మీరలు మున్నుపోరె? జనకాజ్ఞన్ దండకాఖ్యాటవీ
సీమాభూమిఁ గుఱించి, లక్ష్మణుఁడు నేన్ జెన్నొంది వెన్నంటఁగా
ఆ మధ్యంబున శృంగబేరపురి చెంతన్ గంగనున్ దాటుచో
నే మున్ మ్రొక్కితి నా భగీరథికి నెంతే తృప్తిఁ గావింపఁగన్.

వ. అదెట్లనిన.

శా. నాతోడన్ రఘునాథ! మీరలును నున్నారప్డు; నేనంటినో
మాతా! విష్ణుపద ప్రభూత! కరుణన్ మన్నింపు విఖ్యాత! మే
మీ తిర్యగ్ఘనుజ ప్రకీర్ణవన భూమీవాసముం జేసి సా
కేతంబున్ సుఖవృత్తిఁ జేరితిమ? శక్తిన్ భక్తి పూజింతుమే.

క. నానావిధ బల్యుపహారానూన పదార్థముల కరంబు సుతృప్తం
గా నిన్ను జేతు నంటిని, దానిం దీర్పంగ కోరుదాన! మహాత్మా!

క. విరహార్తి మనల కొఱకై, భరతాదులు వేగపడిన వచ్చితి, మదియున్
మరచితిమి! ఇప్పుడైనన్, గరిమం గావింపఁ దగదె? కడుమోదమునన్.

శా. ఆ సంకల్పము పూర్తిగా జేరుప నుద్యన్మిత్ర బంధు ప్రజా
ళీ సంపన్నముగాఁగ మాతులుల నోలిం గూడి పోదాము! ఈ

నా సంకల్ప మనల్పమా కరుణ కూర్పన్ జెల్లు, డెందంబునన్
దాసిన్ నా దొకయాజ్ఞగా తలచి చింతన్ చేయం గాదో పతీ!!!

క. మీ యాజ్ఞలకుం బద్ధను! నాయను సంకల్ప మవని నాస్తియగుటచే
నా యాజ్ఞ భావ మనగా,నే యుండదు! మీదయన్ గణింతు నిరతమున్.

వ. అని మృధు మధురంబుగా వేడుకొనిన.

ఉ. అంతట రామచంద్రుఁడు మహాముద మంది, ధరిత్రిజాత! నీ
వింత వినమ్ర భావము వహించి వచింపగనేల? నీ వచో
క్రాంతము నాదుస్వాంత, మెఱుఁగంగను, గంగనుగూర్చి మ్రొక్కుట
య్యింతి యనుగ్రహంబె మన కీ ఫలితంబు ననుగ్రహించుతన్.

క. గంగా దర్శన మెట జరు,గంగా కాంక్షింతువో? ప్రకాశముగ నెఱుం
గంగా వచియించుము! వే,గం ; గావింతము ప్రయాణ కమ్ర జతనమ్ముల్.

శా. రేపే బాగుగ నున్నవేళను ధరిత్రీపుత్రి! యీవేళ నా
జ్ఞాపింతున్ నెఱవేర్ప మార్గముల, స్వేచ్ఛన్ బోవఁగా వీలుగా
నీ పల్కుల్వినినాఁడ! మ్రొక్కు నెడలన్, వేయా పనిం దీర్ప నా
క్షేపం బింతయుఁ దెల్పరా దెట కెఱింగింపంగదే! పోవఁగన్.

ఉ. అనుటయు సంతసించి, వసుధాత్మజ పల్కు వినమ్ర మూర్తియై
వినయ విధేయ యాచు, సరవిన్ సరయూనది గంగతోడ పా
వనముగ సంగమించిన శుభ స్తలమందున పూజచేసి, గం
గను నుపహారముల్ ముదముగా నిడి తృప్తనొనర్త మన్నచో.

శా. అంగీకార మొనర్చి, లక్ష్మణుని డాయం బిల్చి, ఓ లక్ష్మణా!
గంగా పూజ లొనర్ప రేపు సరయూ గంగానదీ సంగమం
బుంగాఁ బొల్చిన పుణ్యతీర్థమున, బెంపున్సొంపు దీపింప మ్రొ
క్కుం గాన్క ప్రకరాళి దీర్పఁదలచెన్ క్షోణీజ! యట్లౌటచే.

ఆ. సకల బంధుమిత్ర సపరివారంబుగా, సౌఖ్యముగ ప్రయాణ సరణి వలయు
వలయు నన్నపానముల నివేశస్థాన,ముల వసతుల వెల్లఁ గలుగునట్లు!

మ. అని యాజ్ఞాపన సేయఁగా, నతఁడు సాష్టాంగ బుఁగా మ్రొక్కి, వే
చని మంత్రుల్ సుభటుల్ జెలంగు సభ నాజ్ఞన్ దెల్పి, మీయాజ్ఞ చొ
ప్పున నాయత్తము! సర్వమంచు భటునిం బొల్పార శ్రీరామచం
ద్రునితో విన్నపముం బొనర్పఁ బనిచెన్ తోషంబ శేషంబుగన్.

శా. గ్రామం బందునఁ జాటఁబంపె ఘన యాత్రా యత్నమున్ లక్ష్మణుం
డా మాన్యున్ వచనంబుఁ గైకొని సుయోగ్యాలంకృతుల్ వేత్రముల్

ప్రాముఖ్యమ్మగఁ బూని వీథుల లసత్ప్రఖ్యాతిగా జానకీ
రాముండెల్లి సమిత్ర బంధుఁడయి యాత్రల్ సేయఁగా నేగెడిన్.

క. రాదలఁచి నట్టివారలు, రాదగునని వినిచి రంత! రమ్యాత్మకులై
బ్రోది నటుల సలిపి యది ని, వేదించిరి లక్ష్మణునకు వినయ వినతులై.

సీ. అవల సభాసీనుఁడగు లక్ష్మణుం డను, చరులచేఁ బిల్పించె సమరసముగ
వడ్రంగులను జాతిపని వాండ్ర నిటు కవాం, డ్రను కమ్మరులను చర్మంపు పనుల
వాండ్రను కుడ్య నిర్వహణ ప్రవీణుల, బేరగాండ్రను కాష్ఠ వితతిఁగూర్చి
తెచ్చి యిచ్చెడువారి, తెలిగుడ్డల గుడార, ముల వేయువారిని జలముఁ దెచ్చు

గీ. వారినిన్ రజ్జుకుద్దాల ధారకులను, సర్వకర్మ ప్రవీణుల సరిగఁ బిలచి
అందఱను భూషణాంబరాద్యనుపమాన, మానితులఁ జేసి యిట్లని నానయిడుచు!

## శ్రీరాముల తీర్థయాత్రా ప్రయాణ సన్నాహము

క. సీతారాముల వారికి, ప్రీతిగ యాత్రాపయనము రేపెయగున్ మీ
రాతత శ్రద్ధన్ పూర్తిగఁ, జేతురుఁగావుత! పథంబు సిద్ధముగాఁగన్.

సీ. మార్గంబు సమముగా మలచి యాపై యిసు, కయు ధూళి లేకుండఁ గనఁగవలయు!
మిట్ట పల్లంబుల నెట్టన లేకుండఁ, జేసి సమంబుగాఁ జేయవలయు!
మార్గ నిరోధ పర్వత వృక్షములను ఛే, దించి భేదించి సర్దించవలయు!
త్రోవలలోనున్న బావుల చెఱువుల, శోధించి చక్కఁగా చూడవలయు!

గీ. లేనిచో క్రొత్తవాటిఁ గల్పింపవలయు! నిర్జల వనంబులందెల్ల నీర మమర
వలయు సర్వసమృద్ధి వస్తులఁ జెలంగు, వస్తు భాండారముల నుంప వలయు విధిగ!

సీ. ఆరామడల కొక్క భూరి సేనా నివే, శస్థానమును సృష్టి సలుపవలయు
పట గృహంబులు మంచి పానశాలలు నాకు, టిండ్లును మఱి పెంకుటిండ్లు వలయు
సౌకర్య గృహములు చక్కగా నిర్మించి, సర్వవస్తుల జేతపరుపవలయు
పలు వినోదముగ భిత్తులమీద చిత్రంబు, లను వ్రాయునట్లు సల్పంగవలయు

గీ. అంతటను కల్పితములైన యట్టి పుష్ప, వాటికలు బహుళానంద పేటికలుగ
నుంచవలయు పూవులచెట్లు మంచిమంచి, తోట్లలో నుంపవలయును త్రోవవెంట!

క. సేనా నివాసములలో, మానుగ గజఘోటకముల మందిరములు; నిం
పైన పశుగ్రాసంబులు, మీనేర్పులు మెఱయ దనర మెలగన్ వలయున్.

సీ. అచ్చటచ్చటఁ గూర్పనగు గాయనస్థాన, ములు మార్గముల పరిమళ జలములు
చల్లంగఁబడవలె! యెల్లంగడుల వీథు, లును మంచి శృంగార మనువుమీఱ

శోభిల్లవలె! మహాప్రాభవంబుగ రథ, గజతురగంబులు కమ్రరీతి
ఘంటారవంబుల, ఘన వస్త్రముల నలంకారంబుమీఱ చెన్నారవలయు

గీ. బంటు లేనుగు ల్బండ్లు నాయుధ నికరము, పరిఘ బాణ శతఘ్ను లుగ్రాణములను
కార్ముకంబులతో నింపి క్రమ్మఱంగ, సిద్ధమొనరింప వలయు సన్నద్ధముగను.

ఆ. గరుడ కోవిదార ఘనబాణ మారుతి, ధ్వజవితానముల రథంబులందు
నాల్గు ప్రక్కలం దొనర్ప నమర్పుఁడు, పరమ తేజమందు బ్రస్ఫుటింప!

గీ. స్వర్ణ రత్నంబు లొలయ పచ్చగ చెలంగు, ధవళ దివ్యాతపత్రంబుఁ దనరునట్టి
గొప్పఅంబారి వేయించి కొమరు మివుల, దివ్య గజమును రామమూర్తికి నిలుపుఁడు!

సీ. బంగారు సరిగచే సింగారమొనరించి, సీతా మహాదేవి ప్రీతికొఱకు
కరిణీమణిని యలంకారంబు కావించి, వైడూర్య మౌక్తిక స్వర్ణ విద్రు
మ విరాజితంబగు నవనీలవర్ణ పీఠము దానిపై నుంచి క్రమముమీఱ
పూర్ణ కుంభము నుంచి పుష్పోపహారముల్, తోరణంబుల నెల్ల దారులందు

గీ. కడు నలంకార మొనరించి విడువవలయు, వారకామినీ నృత్యము ల్వారలవలయు
వందిమాగధస్తుతులు దివ్య పరిమళ స,మస్త వస్తులు రథము లమర నిలుపుఁడు.

గీ. ఈ క్రమంబునఁ బొనరింప నెలమి నేర్పుఁ, గలుగు వార లాయా వస్తువులను కూర్చు
కొని వెడలుఁ డిప్డె ఇందున నెనసి రవ్వ,యంతమైన నశ్రద్ధ చేయంగరాదు!

శా. రామానందము, జానకీ హృదయ హర్షంబున్ మది న్నిల్పి, నే
నేమేన్ చెప్పుటయందు తప్పినను, మీరే యోచనల్సేసి యా
త్రా మర్యాదల లోటుఁ గల్గనటు, లుద్యత్ప్రీతిఁ గావింపుఁ డీ
మీమీ నేర్పులు కన్పడన్ విభుఁడు మిమ్మే మిమ్మె మెచ్చాడఁగన్.

గీ. అనుచు సౌమిత్రి యాజ్ఞపై యఖిలజనులు, తమతమకు విహితంబులౌ క్రమములొప్ప
జాగరూకతమై పను ల్సలుపుచుండ్రి, రామనామ మాహాత్మ్య రిరంసఁగల్గి.

ఆ. ఆజ్ఞవెట్టి లక్ష్మణావనీ పతి మంత్రు, లెలమిఁగొలువఁ జనియె లీల తన ని
వాసమునకు సాంధ్య వరకృత్యములఁ దీర్చ, పరమ హర్షమున శుభప్రదముగ!

సీ. సుందరంబై తగు మందిరంబందున, రత్నవిలాస పర్యంకమందు
పూలపానుపున కాంతాలింగితాంగుఁడై, బంగారు తెరలలో రంగుమీఱి
అడుగడుగున నుండి గడఁగి దాసీజనుల్, వింజామరల్పూని విసరుచుండ
శ్రీరామచంద్రుఁడు శృంగార స్వారాజ్య, మనుభవించుచునుండె నమరవిభవ

గీ. శోభితుండయి సుఖనిద్ర సొంపుమీఱె, సకల సేవకజనములు సంభ్రమమున
తెల్లవారెడులోపుగా తీర్థయాత్ర, లలితమార్గంబులెల్ల నలంకరింప.

# చతుర్థసర్గము

## శ్రీరాములవారు వైభవోపేతముగ తీర్థయాత్ర వెడలుట

ఉ. అంతట తెల్లవారక రయంబున మేల్కని సీతతోడ, శు
ద్ధాంతమునిండ మంగళ మహాధ్వను లుల్లసిలన్, మృదూక్తి న
త్యంతము వందిమాగధు లహా! జనియింప నుతింపుచుండ! దై
త్యాంతకుఁడైన రాముఁడు ముదంబున నిర్వృత నిత్యకృత్యుఁడై.

శా. విప్రోత్తంసుల పూజసల్పి, గురునిం బిల్పించి, సాష్టాంగ ని
ష్ఠా ప్రామాణ్యము తోఁప మ్రొక్కిడి, పురస్కారంబుఁ గావించి, దే
వా! ప్రార్థింతు, ముహూర్త మొక్కటిడి: దివ్యతీర్థయాత్రా విధిన్
శ్రీ ప్రామాణ్యముగా లభించు నటు లాశీర్వాదమున్ జేయుఁడీ.

మ. అని ప్రశ్నింప వశిష్ఠమౌని, తన శిష్యశ్రేష్ఠునిం జూచి, మా
నిని మా జానకి కోర్కె రాఘవుఁడు మన్నించెన్ వియద్గంగయున్
ఘనమౌ శ్రీ సరయూనదుల్ కలయు యోగ్యంబైన యచ్చోట, మ్రొ
క్కను చెల్లింతురు! చూచిచెప్పుము వడిన్ క్షుణ్ణంబుగా నన్నచోన్.

శా. పంచాంగంబును విప్పి యాతఁడను, నో పద్మాక్ష! యోరామ! యో
చించన్ నేడె ముహూర్త మున్నది, మహాశ్రేష్ఠంబుగా; దాని లె
క్కించన్ జాలునెవండు? పుష్యమి గదా! కేవింపగానేల? యి
ప్పించున్ సత్వర కార్య దిగ్విజయమున్; బ్రీతిం బ్రయాణించినన్.

ఆ. పుష్యమీ ప్రయాణపున్ మేల్మి వర్ణింప, యోగలగ్న చంద్రయోగినీ ఫ
లంబు గురుఫలంబులన్ యెట్టులున్నను, సర్వకార్యసిద్ధి సల్పుఁగాదె.

ఉ. కావున పూర్వ యామమున కండు ప్రయాణము సీతతోడ, నా
దైవము నాన! యన్న, వసుధాపతి చూచె వశిష్ఠు వంక న
ద్దేవ మునీంద్రుఁడున్ తడయుదే? యిక రాఘవ! పోవనన్న న
ద్దైవలలాముఁడైన రఘు ధన్యుఁడు లక్ష్మణుఁ గాంచి యిట్లనున్.

గీ. నవ మహా వాద్యములను సేనా సమూహ,ము లొగి సన్నాహముం గొన మొదటిసారి
భేరి భాంకారములతోడ బోరు కొలుప, సత్వరం బాజ్ఞ యిమ్మ! తత్క్షణమ! అనుజ!

చ. అనుటయు లక్ష్మణుం డటులె యాజ్ఞ నొనర్పగ, మంగళ ధ్వనుల్
గొనియె నభంబుదాక! నట కూర్మి వశిష్ఠుడు విప్రపుంగవుల్
పెనఁగొన, నాందిశ్రాద్ధము గవీష్మృత యుక్తముగాఁగ రాఘవుం
డొనరిచె, విఘ్నరాజ ప్రముఖోత్తమ దైవత పాళి పూజలన్.

ఉ. అంతట రామచంద్రుఁడు మహాముదమంది వశిష్ఠు బ్రాహ్మణో
త్తంత వరిష్ఠుఁ గన్గొని, కృపామతులొచు నరుంధతీ సతీ
స్వాంత మనోహరా! తమ రవశ్యము పత్ని సమేతులై కడుఁ
సంతసమొప్ప రావలయు జాహ్నవి పూజల మమ్ముఁ దీర్పగన్.

శా. మీ యధ్యక్షత చేతఁగాక! యగునే మేలెందునన్ సద్గురూ!!
నాయగ్నిన్ గొని బ్రాహ్మణోత్తములురా నానా లసద్వేద సం
ధాయిత్వంబున బ్రొద్దు పుచ్చుచును మాతాసోదరా నీక పౌ
రా యుర్వృద్ధిగ యాత్ర సార్థకముగా రా మిమ్ముఁ బ్రార్థించెదన్.

క. అని యీ రీతిఁ గురుని ప్రార్థన గావించి ముదమున నతని సమ్మతి నిన్
గొని సీతఁగాంచి యే వాహనమున జన నిచ్చ తెల్పుమా? యని పల్కన్.

క. తమ యిష్టమైన కరిణీ, ప్రముదితనన నట్ల యపుడు రాజీవాక్షుం
డమల శ్రద్ధన్ లక్ష్మణు, క్రమగతి నేర్పరచె కరణి గై సేయింపన్.

ఉ. తల్లులకున్ సతీమణికి, తమ్ముల భార్యలకున్, ముదంబు సం
ధిల్ల గురున్ సతీమణికి, విప్రుల భార్యలకున్, స్వబాంధవ
ప్రోల్లసి తాతివా వళికి, పొల్పుగ వస్త్రములిచ్చి వేడ్క త
ద్వల్లభులన్ సువస్త్రతతి వారక మన్ననజేసి యంతటన్.

గీ. తమ్ములుం దాను నూత్న వస్త్రములఁదాల్చి, పెద్దలకు మ్రొక్కి సతులు సంప్రీతి మ్రొక్క
నాజ్ఞ ఇడి, శస్త్రములఁబూని యల్ల మంత్రి, వర్గములతోడుతన్ సభా భవనమందు.

గీ. లక్ష్మణా! నవ వాద్యము ల్మ్రగిడి మ్రోయు, గాత! సేనావళులు వచ్చుగాత! యనిన
అట్లె దూతల కాజ్ఞయైనంత నట్ల, వారొనర్చిరి! తరువాత శ్రీరఘుపతి.

సీ. ఊరి రక్షణకయి యుంపుము మంత్రుల, భరతుఁడు ముందుగాఁ బఱగవలయు!
శత్రుఘ్నుఁ డందఱుం జన వెన్కగా నుండు, నావెంబడిన్ నీవు నడువవలయు!
తరువాత సీత, సీతకువెన్క నూర్మిళ, ఆవెన్క మాండవి యామె వెనుక
శ్రుతకీర్తి యీరీతి సొంపొప్పుగా నేగ, తల్లులు పౌరులు తక్కుజనులు

గీ. బ్రాహ్మణోత్తములున్ గురువర్యులెల్ల, పైని పుష్పక యానులై పఱగవలయు!
అందఱిని వారివారి దివ్యాసనములఁ, జేర్చిరమ్ము! గజంబెక్క చెలువుమీఱ.

క. అని చెప్పగ నతఁ డట్లే, యని యందఱ సర్వసిద్ధు లౌనట్లుగ చే
సి నవీనకాంతి మీఱఁగఁ, గని శ్రీరాముని సమీపగామి యగుటయున్.

గీ. రాముఁడు సుమంత్రు నూత్నవస్త్ర ప్రశోభి, తునినొనర్చి యయోధ్యనంతను గనుఁగొన
నొప్పగించితి నని వాని కొప్పగించి, అట్టి సుముహూర్తమున రాముఁ డనుజవర్యు.

గీ. హస్తలాఘవమునను సింహాసనంబు, నుండియున్ లేచి భద్రవేదండమునకు
సప్రదక్షిణ పూర్వక స్వాస్థ్యమున క, రేణు దంతసోపానాళి శ్రీఁ జెలంగ !

మ. అధిరోహించి యలంకరించె, ననుజుం డప్డెక్కె శుండాల, మ
ప్యధికంబై దివినుండి దుందుభులు దీవ్యధ్వానముల్ సల్పె, న
త్యధికోత్సాహముమీఱ, దూతలట యంత్రంబుల్ మహా శబ్ద సం
ప్రథితౌత్సుక్యము లీన, వాద్యము లవార్యంబై కడున్ మ్రోగగన్.

గీ. రథ గజ తురంగములఁ జాల నధివసించి, వాద్యగాండ్రు మ్రోయించిరి వాద్యములను
వేదఘోషలఁ జేసిరి విప్రవరులు, పౌరజను లెల్ల జయములు పలికిరంత !

గీ. రత్నదండ నిర్మితమయి రాజిలెడు మ, యూరపింఛ శోభితమయి యొప్పు చామ
రమును గైసేసి విజయుండు రమణమీఱ, వీచుచుండెను శ్రీరఘువీరునకును.

గీ. వెనుక వాలవ్య జనములు వీచుచుండ, రమ్యకలశ ముక్తాహార రాజితమగు
రత్నదండ శ్వేతచ్ఛత్ర రాజమొకఁడు, పట్టి శ్రీరామచంద్రుని పజ్జ నిలిచి.

గీ. వారి వారి యానంబుల వరుస నెక్కి, రిటు యథోక్త క్రమంబుగా నెల్లవారుఁ
గొలుచు చుండఁగ వెడలె నిస్తుల విభవము, వెల్లివిరియంగ శ్రీరామవిభుఁడుఁ గడక.

గీ. గగనమున పుష్పకము తిన్నఁగాఁ జెలంగ, పుర పురంధ్రులుఁ గురిసిరి పూలవాన
ఇరుఁ గెలంకుల వారలు గరిమమీఱ, చేతులంజేర్చి మ్రొక్కిరి శ్రీవిభునకు !

సీ. ఆ సన్నివేశంబు అలరులబంతి శో,భిలునట్లు దోఁచె కన్నుల ఫలముగ
శ్రీరామచంద్రుఁడున్ వారి ప్రణామంబు, లాదరించుచును సామోదమునను
రాజ్యవైభవము విరాజిల్ల తిన్నఁగా, దారినే పోవుచోఁ దవిలి వెంట
నటు లేనుగులమీద చటుల వీణాగాన,ముల సల్ప నారంభముంబొనర్ప

గీ. నంగడుల వీధులను పురోద్యానములను, ధూర్త వారాంగనా చిత్రనర్తనముల
సుస్వరాఖిలవాద్య నిస్తుల వినోద,ములను జూఁచుచు వెడలె రాముఁడు ముదమున !

క. చతురంగ పరివృతుండై, కుతుకముతో జని జని రఘుకుంజరుఁ డెలమిన్
స్తుతనీయమా నయోధ్యా, స్థితిఁగూర్చిన సన్నివేశ సీమం గనియెన్.

## శ్రీరాముఁడు దారిలో నచ్చటచ్చట విశ్రమించుట

సీ. సేనాకృతము వందనానుగృహీతుఁడై, సముచిత వృత్తి లక్ష్మణుని హస్త
లాఘవంబున దిగి రాజేంద్రమౌళి భ,ద్రగజంబునుండి విస్తార వైభ
వోపేత వసన గృహంబు ప్రవేశించి, ఆసీనుఁడయ్యె సింహాసనమున
సవిభవముగ రామచంద్రుఁ డచ్చటనుండ, సీతాదులెల్లరు చెలువు మెఱయ

గీ. వసన గృహములయందు వైభవము మీఱ, చేరి సంతోషవృత్తి వసించియున్న
రామచంద్రుఁడు లక్ష్మణస్వామిఁ గాంచి, ఇట్టు లాజ్ఞాపన మొనర్చెఁ బిట్టు ఠీవి.

ఉ. అంతట నన్నిదిక్కుల రయంబున క్రోసెడు దూరమందు దు
ర్దాంత భటావళీశత శతంబుల నుంపుమ! అష్ట దిక్కులం
దంతయు నశ్వపుం దళము నామడ దూరమునం దమర్చు, మి
క్కెంతయు రక్షణార్థము రహిన్ నిలుపందగు త్రోవ నేగుచోన్.

క. అని అన్న ఆజ్ఞసేయఁగ, ననుపమభక్తిన్ క్షణమున యాజ్ఞాపన చే
సెను సైన్యపతి కతం డట్లనె సైన్యము నెల్ల చేర్చె నా క్షణమందే.

ఉ. రాముడు మిత్రవర్గమును బ్రాహ్మణ బృందముఁ గూడి, ఆజ్యశ్రా
ద్ధామల శేషయుక్తముగ నన్నము పానము లాహరించి, సం
ప్రేమమెలర్ప, విప్రులకు వీడియపాళి సదక్షిణంబుగా
నామెయు నిచ్చి, సింహవిభ వాసనమందు వసించి సౌఖ్యుఁడై.

గీ. వేదశాస్త్రార్థములను ప్రవీణుఁ డగుచు, పండితులతో విచారణ నుండి, కొంత
ప్రొద్దుపుచ్చి, సల్లాప విస్ఫూర్తి కొంత,సేపు సద్గోష్ఠి నుండి రాజీవముఖుఁడు.

గీ. సాయం సంధ్యానుష్ఠా, నాయత్తుండై శుభాగ్ని నర్చించి సునృ
త్తాయత గీతాదుల ని,ద్రా యుతుఁడై సీతఁగూడి రహి సుఖముండెన్.

సీ. మరల మూడవనాడు మహితాత్ముఁడా రఘు,స్వామి యథాపూర్వ నీమమొప్ప
సకల వైభవముతో నకళంకముగ ప్రయా,ణముచేసె సంతోష మమర నంత
నొకనాడు కొన్ని చోట్లొక రెండు మూఁడు, రాత్రులు దారిలోపల నిలచి కొనుచు
సీతకు మార్గ విఖ్యాత వినోదాళిఁ, చూపుచు నొకనెల సొంపుమీఱ

గీ. ప్రముదమున ప్రయాణముచేసి వచ్చుచున్ సు,జీర్ణ మగు ముద్గ లాశ్రమ స్థితిని గాంచి
ఆశ్రమముజేరి నంతట అది యెఱింగి, నూతనాశ్రమవాసి సంప్రీతుఁడు ముని.

### శ్రీరాములవారు ముద్గలాశ్రమము ప్రవేశించుట

ఉ. గంగకు దక్షిణా పథముగాఁ జనుదెంచిన ముద్గలున్ ఋషీ
శుం గని రామచంద్రుఁడు విశుద్ధిగ మ్రొక్కి సమాదరించి, పూ
జం గయిసేసి, వస్త్ర గృహ సంస్థితి సౌఖ్యమె? మీకు! మీర లి
ట్భంగిగ నాశ్రమంబు నెడఁ బాయుట లేటికిఁ గల్గె సంయమీ!

మ. అని పృచ్ఛించిన ముద్గలుండు విను, రామా! నేను ధన్యుండ నై
తిని! నీదర్శన మబ్బె! కష్టము నివృత్తించెన్, మునున్ నీవు నా
వనమందున్న మహౌషధాళి భరత ప్రాణావనార్థంబు గై
కొనినా వప్పుడు నిన్ను గాంచితిని! గైకొంటిన్ శుభవ్యాప్తులన్.

శా. గంగాతీరముఁ గాదు కాక, సరయూ కమ్రాపగా తీరమై
నం గా దీ వన,మిందు నెందఱో మునీంద్రశ్రేష్ఠు లాత్మాన్వవా
ప్తిం గన్నా రొకనేన కాదు! ఉదకంబే యిమ్యోర్దజ దుర్లభం
బుంగా నుంపుట, పాసిపోవలసె; నీ పుణ్యాశ్రమంబున్ ప్రభూ!

క. అని పలికిన శ్రీరాముఁడు, విని మీ కీచోట నేమి వెలయించిన శో
భనమై సుఖవసతి యగున్, వినఁజెప్పుం డనిన ముని సవిస్మయ మతియై.

క. గంగా సరయూనదు లిట, సంగమ మగునేని రామచంద్రా! యిచ్చో
టం గడఁగి యుందు మని దె,ల్పంగా రాఘవుఁడు మగిడి పరమ ముని కనున్.

క. పుణ్యాత్మా! సరయూనది, గణ్యత అదియేమి? గంగ గణియింతుము స
త్పుణ్యనది యంచు నొగి ప్రా,పీణ్యత సరయువున నేమి? వెలయుం జెపుమా!

## ముద్గలుఁడు శ్రీరామునకు సరయూత్పత్తి నెఱింగించుట

మ. సరయూ భవ్యచరిత్రమున్ వినగ నాసక్తుండ నో సన్మునీ
శ్వర! యన్నన్, అతఁ డిట్లు తెల్పఁదొడఁగెన్ స్వామీ! రఘుశ్రేష! స
చ్చరితంబే వినగోరితీ విపుడు, నిస్సందేహరీతిన్ ప్రజల్
సరయూత్పత్తి నెఱుంగు నట్లుగ జగత్సంస్తూయమానంబుగన్.

సీ. మును శంఖుఁడామ్నాయములు దొంగిలించి మ,హాబ్దిలో డాఁగియుండ, మీన
మూర్తివై వాని నున్మాలించి, వేదంబు,లెత్తి విరించికి నిచ్చి, పూర్వ
రూపంబుతోడ స్వర్లోకంబునందు నా,నందాశ్రువులుగ! నానంద పడిన
నీయశ్రువులు రాలె నిజ సత్ప్రభావంబు, నను హిమాలయమున ఘనతరముగ!

గీ. అవియె పుణ్యజలముల మహానది యయి! త్రుటిఁ బ్రవేశించె బిందు సరోవరమున
మానస సరస్సుఁ జేరె రామా! తదీయ, పుణ్యనది యంత కొన్నాళ్లు పోవఁబోవ!

క. నీ వంశీయుఁడు కాదే?, వైవస్వతమను వయోధ్య వసియించి సుహృ
ద్భావమున నొక్క యజ్ఞము, దేవా! సేయంగదలచి ధృతి యొప్పారన్.

మ. గురువుం గూరిచి స్వామి! యజ్ఞమున నేఁ గూర్తుజ గదా! తృప్తి, భా
స్వర దేవావళికెల్ల నంచు వచియింపజ, యజ్ఞమే చేయుచో
దురితంబుల్ కడద్రోయు, పుణ్యనది నిందుం డేఁదగున్ తీర్థమే
కలవోచో నికయజ్ఞ మెట్టులగు? విష్ణు వ్రాత పాతంబుగజ.

క. అని చెప్పఁగ నాగుర్వా,జ్ఞను విని వైవస్వతుండు ఘనమగు ధనువుం
గొని జ్యానాదముఁ గావిం,చి, నయంబున బాణ మొకఁడు శీఘ్రము వైవన్.

క. అది పోయి మానసంబును, ద్రిదిలించి విడంగఁదీసి ప్రియముగ పుణ్యా
స్పదమగు నదిగా నొనరిఁచి, యదన నయోధ్యా పురీ ప్రయాణము చేసెన్.

మ. శర మార్గంబుగ దా నయోధ్యకు ప్రశస్త ప్రస్ఫుట దీప్తిమై
గురిగా వచ్చి ప్రవాహమై పడమటన్ గుప్తంబుగా నొప్పు సా
గరముం జేరి పవిత్రమై యెసఁగుటన్, గల్గెన్ సరః శ్రోతమై
శరయూ భాస్వరయూ నదీపదముల శ్రాంతంబులన్ కీర్తిమై.

క. తరువాత భగీరథుఁ డా,దరమున నీ పాదమం దుదయమగు గంగా
వర వాహిని భూమికి చె,చ్చెర రప్పించెన్ పితరులు చెన్నువహింపన్.

మ. కపిలాచార్యుని కోపవహ్ని చెడి, దగ్ధప్రాయులై సాగరుల్
ప్రపలాపింపగ వారి స్వర్గమున కంపన్ గొప్ప పట్టొప్పఁగా
తపముం జేసి భగీరథుండు శివునిన్ ధ్యానించి సంతుష్టుఁ జే
సి, పరిశ్రాంతిని గంగఁదెచ్చి సరయుం జేర్చెన్ ప్రవాహంబునన్.

క. శివ వరమహిమన్ కలిలో, భవహరమగు గంగ యొప్పు ప్రఖ్యాతముగన్
శివ కరమగు సరయువు పు,ట్టువు గంగన్ గలసి కడుఁగడుం ధన్యమయెన్.

క. నీపాద సముద్భూత మ,హా పావని గంగ, సరయు వది నీ నేత్ర
(శ్రీ) పుణ్యాపః ప్రభవము, భూపలలామా! రఘుప్రభూ! వినుమయ్యా!

క. నీ మహిమ వలెనె సరయున,దీ మహిమయు వర్ణనంబు ధృతి సేయఁగలం
డో మహితాత్మ! యెవం డ,య్యా మహితాత్ముండు దుర్లభాత్ముం డరయన్.

క. నీవడిగిన యీ విషయము, పావనతర! రామచంద్ర! భాషించితి నీ
చారుతర సత్కృపా వి,స్తార లసత్పాత్రులము సుధామయ హృదయా!

మ. అని వేతీరుల సంస్తుతింప విని యాహ్లాదంబుమై లక్ష్మణుం
గని (శ్రీ)రాముఁడు లక్ష్మణా! ఇదియె యాజ్ఞాపించు చున్నాఁడ, గ్ర
క్కున బాణమ్మును వేయుమా! సరయువుం క్రొంగ్రొత్తగా నిమ్మునీం
ద్రుని దివ్యాశ్రమ సన్నిధానమునకుం దోడ్తెమ్ము శీఘ్రమ్ముగన్.

వ. అని యాజ్ఞాపింప.

క. రామాజ్ఞ లక్ష్మణుండు ధ,రామరు నాశ్రమము కడకు నన్నదిఁ దెచ్చెన్
(శ్రీ) మహిత సరయు చీలి సు,ధామయ గంగన్ గలసె యథావిధి గాఁగన్.

ఆ. దాని గాంచి రామ ధరణీశుఁ డిట్లను, ఛిద్రమయ్యె! సరయు దద్రి నామ
నగర మిచటఁ గల్గి నెగడుఁ గావుత మది, బదరికన్న ప్రతిభ గదురుగాఁత!

క. మునినాథ! ఇమ్మహాస్థల,మున మీరు వసించుటయు సముజ్వల తేజం
బును బొందు నీప్రదేశం,బున సంతసమంది రచటి యజ్ఞనులెల్లన్.

ఉ. సీతను గాంచి రాముఁడు విచిత్రముఁ గాంచితె జానకీ! లస
త్ఖ్యాతి మదీయ నామక మహాస్త్రము వైవ సుమిత్ర సూతి, ప్ర
స్ఖ్యాత పవిత్ర పుణ్య సరయూనది శాఖయొకండు వచ్చి సం
ప్రీతినిఁగూర్ప మానికి, గరీయసి గంగను జేరెఁ బ్రేల్మిడిన్.

సీ. నీవు మున్నడిగిన ట్లొ వృద్ధ సరయు గం,గా సంగమంబునఁ గడఁగి నీవు
నారీమణులఁ గూడి నాతల్లులంగూడి, గురువులఁగూడి సంబరము మీఱ
పుష్పకారూఢవైపోయి యచ్చట గంగ, నారాధనముచేసి గారవమున
ఈ నవీనంబగు మాని సన్నిధి నున్న, సరయు గంగా భవ్య సంగమమున

ఆ. నన్నుఁగూడి పూజ లెన్నికతోఁ జేతు, గాని వేగరమ్మ! మానితముగ
నన్న సీత అత్తలెన్న పూజోచిత, వస్తువుల గ్రహించి వనిత లొప్ప!

వ. పుష్పక విమానంబెక్కె! అయ్యది క్షణమాత్రంబున వృద్ధ సరయూ గంగా సంగమ మంగళ స్థానంబున నిలచె.

# పంచమ సర్గము

## సీత వృద్ధ సరయూ గంగా సంగమంబు నారాధించుట

గీ. గంగకన్ మ్రొక్కి జానకి ఘన పురోహి,తులు వచింపగ ఫలదానములు నదీమ
తల్లి కర్పించి స్నానము తగ నొనర్చి, సంగమ స్థలపూజల సల్పెఁ గడక.

గీ. దివ్య పక్వాన్నములు బలుల్ దివ్యవస్త్ర, దివ్య గంధాదులను బహు దీప్తములగు
ముత్యపుం బేరులను జగమ్ములు నుతింప, గంగఁ బూజించెఁ గుఱి యెసఁగంగ సీత!

క. ఆవల అరుంధతీముఖ, సువాసినుల పూజచేసి సుమనః ప్రియయై
వావిరి వశిష్ఠుఁ డాది మ,హావిప్రుల తృప్తి చేసి అన్నాదులతోన్.

గీ. బ్రాహ్మణులకును ముత్తైదువలకు పుష్ప,గంధ తాంబూల హేమ దక్షిణల నిచ్చి
ఆభరణముల నిచ్చి మహత్తరముగ, తృప్తినొనరించె దేవి యథేష్టముగను!

గీ. తాను నుపహారమును సముత్సాహ లీల, సీత అంగీకరించి యా శ్రీరఘూత్త
మునకునై తగ నుపవాసమును వహించి, వచ్చెను విమాన మెక్కి శ్రీవరుని కడకు!

## సీతారాములు నవీన గంగా సరయూ సంగమ పూజాదికము నొనర్చుట

గీ. ఇట్లు సంతోషముగ వచ్చి యెలమిఁగనిన, సీతఁ గూడి వశిష్ఠాది శిష్ట జనులఁ
గూడి తల్లులఁ గూడి యెక్కుడగు శ్రద్ధ, నవ్య సంగమస్థల పూజనం బొనర్చె!

క. గంగాసరయూ వార్ధిక, సంగమమున యందు సీత సల్పిన పూజా
భంగిమమునకు శతాధిక, మంగళకర మహితముగ సమారాధించెన్.

క. గో గజ రథ తురగాది మ,హా గంభీరార్థ దాన యమకంబుగ ది
వ్యాగరు కర్పూరామల, శ్రీగంధ సమేతముగ పౌరిన్ విస్తరిలెన్.

క. పూజించి వేలకొలఁదిగ, భోజన భాజనములన్ విభుతఁ గొల్చి భట
భ్రాజితుఁడై పరివార వి,రాజితముగఁ గుడిచి యచట రాజిలుచుండెన్.

సీ. సింహాసనమున నాసీనుఁడై యచ్చట, లక్ష్మణుతోడ నిట్లనియెఁ బ్రీతి
తమ్ముఁడా! ఇచ్చట తొమ్మిది రాత్రులు, నివసించుటకు నేను నిశ్చయించి
నాడ! యీ యెల్లలో నా శాసనము మీఱ, యతి బ్రహ్మచారి గృహస్థుఁడేని
వనప్రస్థుఁడేని యెవ్వఁడుఁగాని ఈ బాటఁ, జనిన నా చేతను సత్కరింపఁ

ఆ. బడక పోవరాదు వడినట్టు లెవ్వాఁడు, పోవు వానిబట్టి తేవలయును
నన్నుఁ జూడకుండ నడచెనా? నాయాజ్ఞ, మీఱపయింగలదు! సుమీ! నిజంబు!

## చ్యవనముని శ్రీరాముని దర్శింపఁగా కీకటదేశము పుణ్యప్రద మగుట

క. అని చండశాసనంబును, పొనరించెన్, చ్యవనముని విభుని రాముని జూ
డను వచ్చి తాను నివసిం,చిన కీకటదేశ విధము చెప్పెఁ గరిమమై.

శా. నాపుణ్యాశ్రమభూమి మాగధ భటుల్ నానా విధోప ద్రవ
వ్యాపారంబుల బాధవెట్టెదరు క్రొవ్వారంగ, నవ్వారి దు
ష్టా పాయంబుల నుండి బ్రోవఁగదె దేవా! రామచంద్రా! ధరి
త్రీపాలుండవు నీవుఁ గల్గ నిటు ధాత్రీదేవతా బాధలా?

క. అని చెప్పఁగ నామాటల, విని రాముఁడు ధనువు పూని విపులపుఠంకా
ర నినాద మొప్ప బాణ,మ్మును వైవ! నఖండ గరిమమున నద్దానన్.

. ఆ మునినాథు పుణ్యాశ్రమంబున కెల్ల, నంచుకట్టిన యట్టులయ్యె రేఖ
ఆ రేఖ దుష్టుల కవిధి! దాట నశక్య, మచ్చోట రామ రేఖా హ్వయమున
పట్టణం బేర్పడె! నట్టులే అందొక, నది యేర్పడియె! చ్యవనమునిఁ వరుస
రఘుపతిఁజూచి శ్రీరామ! నా కీటక, దేశంబు క్షేత్ర మెత్తెరగున నగు

ఆ. దుష్టులుంట నింద్య దూషిత భూమియై, వరలుచున్న దిమ్మ! వర మటన్న
గయ యటన్న పుణ్యగంబగు క్షేత్రంబు, "పునహానది"యు దీన బొదలు ననియె.

క. నీ యాశ్రమము పవిత్రం,బై యొప్పు! మునీంద్రచంద్ర! యగు రాజ వనా
ఖ్యాయకమై పుణ్యకరం,బై యెల్లప్పుడు శుభప్ర దామేయంబై.

చ. అని ముని మాన్యుఁ జేసె! చ్యవనర్షియు తృప్తి వహించి, యాశ్రమం
బున కరిగెఁ, రఘుప్రవరు పూజ్య మహత్తర సత్రముం గడు
న్విని బహుసంఖ్య బ్రాహ్మణులు, వేలకువేలు యతీశ్వరు ల్భుజిం
పను, కడు మన్నన ల్వడయు, పల్మరు వచ్చుచు నుండి రిష్టులై.

## కుంభోదరుఁడను బ్రాహ్మణుఁడు వచ్చి శ్రీరామ సత్కారమును నిరాకరించుట

సీ. ఇటులుండ నొకనాడు చటుల కుంభోదరుఁడను ముని యొకఁడు యాత్రార్థి యగుచు
గంగా త్రివేణి సంగముల మునిగి సరయు గంగ సంగమ రంగములను
వృద్ధనూతన నామ కేద్ధ పవిత్ర స్థలముల మున్గగవచ్చి, క్రమముమీఱ
మున్గి సేవించి, రాముని భటస్తోమ మా, బాటల నిల్చి విస్పష్టముగను

ఆ. వచ్చి పోవువారి హెచ్చగు ప్రియమున, నాదరించుటలు మహత్తరముగ
గాంచి మంచి పూన్కి నెంచి మానసమున, నిట్టులనుచు వారి నెలమి నడిగె.

ఆ. ఎవని యాజ్ఞమీద నిచ్చట నున్నారు? పెద్ద తెల్లనౌ కపిధ్వజములు!
తనరు నల్లకోవిదార ధ్వజమ్ములు; ఎందువలన నిచట నుందు రీరు?

ఆ. ఈ పతాకములును ఈ జయనాదము, లాకుపచ్చ ఖగ పతాకములును
పీతవర్ణ బాణపృథుల ధ్వజంబులు, ఏ ప్రభూత్తమునివి? ఏమిటి కథ?

క. అని అడుగఁగ ఆదూతలు, విను స్వామి! అయోధ్యనేలు విభుఁడగు శ్రీరా
ముని దూతల మా ప్రభుఁడిందున యాత్రార్థంబు వచ్చె దోర్విభవమునన్.

సీ. అన్నసత్రము పెట్టుచున్నాఁ డహోరాత్రములు లేదనక తైర్థికులకునెల్ల
వచ్చినవారికి విచ్చలవిడిగాఁగ, ఇచ్చట శ్రీరాముఁ డింపుమీఱ
ఆకలిగొన్నచో అన్నంబు సుఖముగా, తిని నీరుఁ ద్రావి ప్రీతిని గొనుండు
ఏ మందరము బాట నేగెడువారల, కిది తెల్పు తృప్తుల నెలమి సేయ

గీ. వలయు, తొమ్మిది దినములు వరుస జరుగు, ననెడు భటులను గాంచి ప్రార్థనము లాల
కించి మరుమాటలేక కంపించిపోవుచున్న శ్రీరామ దూతలుఁ గ్రన్ననంగ.

క. ఆ ముని మార్గ నిరోధము,గా మిక్కిలి యాదరమునఁ గడక నిలచి స్వా
మీ! మీర లేల మరలితి, రేమీ! భోజనముచేసి యేగఁగరాదా?

ఆ. ఆగ్రహింపవలదు! అలసినట్లున్నారు, సేదదీరి యేగుఁ డాదరమున
ఇట్లుగాక మీర లేగిన మా స్వామి, యాజ్ఞమీఱినట్టు లవుదు మేము!

క. అని ప్రార్థించిన భటులం,గని కుంభోదరుఁడు నవ్వి! కటకట! విధి సూ
నుని రావణాసురుని జంపిన రాముని కూడు కుడువఁ బేలనె? చెపుఁడా!

గీ. బ్రహ్మహత్యఁ గావించె నే ప్రభుఁడు యాత్ర, లేని సేయఁడు యజ్ఞాదులేని సేయఁ
డట్టివాని యన్నముఁ గొనునట్టి వాఁడ, నే ? పదుండు శ్రీరాముని నే నడుగుదు !

క. అను మునివచనములను విని, ఘన శాపభయమ్ముచేత గడగడ వడకుం
గొని శ్రీరాముని సన్నిధిఁ, గని మ్రొక్కి మునీంద్రు పలుకు క్రమమెఱిఁగింపన్.

శా. శ్రీరాముండు మునీంద్రు నాశయము నిశ్శ్రేయంబుగా నాత్మలో
గారాబంబుగ తా నెఱింగి, స్మితుఁడై గంభీర వాఙ్నైపుణిన్
పౌరోహిత్యులు మంత్రులుం గొలువ సంభావ్యంబు నాతత్సభన్
శ్రీ రాజిల్లు మునీంద్రు వాక్యముల నిర్ణీత ప్రకారంబుగన్.

ఆ. మొట్టమొదట తీర్థముల నెల్ల మున్గి యజ్ఞము లొనర్చి కాని సత్రములను
సత్క్రియలును చెలఁగి సల్పంగరాదని, చెప్ప వినుచు నవ్వశిష్ఠమౌని.

క. కుంభోదరముని మతి దిక్కుంభినులన్ నీదు కీర్తి గురుతరమై యా
రంభంబులందుఁ గడు విస్రంభంబై యగుట కయ్యో! రామ మహీశా !

సీ. యాత్ర లింతట ముగియంగ నయోధ్యా ప్రయాణంబు చేతువో ? యని తలంచి
ఆయాయి దేశములం దన్నిచోటుల, నరులకు నీదర్శనంబుఁ గలుఁగ
అంతట రామతీర్థావళులుంగల్గి, నరుల యఘమ్ముల పరిహరింప
దేశములెల్ల గతి ప్రదంబులగు రామేశ్వర స్థానంబు లేర్పడంగ

గీ. భావమున మౌనిచేసిన భవ్య ఫణితి, రామ ! నీవు గుర్తించి యీ భూమి సర్వ
యాత్రలంజేసి యజ్ఞాళి నాచరింప, పూనుటది బుధ సమ్మత మౌనుకాదె !

క. అని ప్రస్తుతింప వేగమ, జని మంత్రుల దూతలను ససంభ్రమముగ వే
జని సాకేతమున సుమంత్రిని గని వివరింపఁ బంపిరి ముదంబు మెయిన్.

గీ. సంగతులను సుమంత్రుండు చక్కగా నెఱింగి బండ్లు ఒంటెలును నేనుంగుగములు
గుఱ్ఱములపై ధన కనకకోటి వస్త్ర, సర్వ సామగ్రులం బంపె సముచితముగ !

శ్రీరాముఁడు పుష్పకమును సంభావించి తీర్థయాత్ర వెడలుట

క. శ్రీరాముఁడు పుష్పకముం, దొరపు దయఁజూచి నీవు దుర్ధర తేజో
ధారివి, యిపుడు మదీయ విహారములకు తగిన శక్తి నంది నడువుమా !

ఉ. నీ బలముండు నంతకు వినిర్మల శ్రద్ధ రథాశ్వ వారణో
ష్ట్రాబలమున్ ధరింపుము నిజస్ఫుర దద్భుత గర్భకోశ మం
దీ బలమంతయున్ ధృతివహించి విశాలముగాఁ జరించి తే
జో బలదర్పమై నెగడి సుస్థితి నుండ నెసంగు మాప్తతన్.

ఆ. సర్వ భారములను చక్కఁగా వహియింప, ఎప్పుడెట్లు వలయునెల్ల గతుల
సూక్ష్మ విస్తృతాకృతి క్షమంబుగ నుండు,మనుచు వర మొసంగ గనుచునదియు.

క. పది యామడ వైశాల్యముఁ, గుదురుగ రెండామడలు నగుటయును సౌఖ్యా
భ్యుదయముగ నందు నంగడు, లొందవె! నూరు వీధులందు నుజ్జ్వల తనులై.

గీ. నూర్ల కొలఁది సువర్ణ రత్నోపల ప్ర,పూర్ణ మార్గంబులును వేల పుణ్య సౌధ
జాలమును దివ్య బహుకలశముల గములుఁ, దనర నాపుష్పకమున సంతసముఁగదుర!

గీ. ముత్తియమ్ముల కిటికీలు ముద్దులొలుకు, నద్దముల వాకిళులు జల యంత్రములును
బహుగ పక్షుల కల కలధ్వనులు మంజు,లంబులగు పుష్పవృక్షముల్ లతలుఁదనరె.

ఉ. రాత్రుల చిత్రచిత్రముగ రమ్య రుచు ల్వెలుగన్ మణిప్రభా
పాత్రలు దీపమాలికల భంగి వెలుంగగ భవ్యగోపుర
స్తోత్ర నభశ్చరద్యుతుల దూతలు ముంగల, స్యందనంబులున్
గోత్ర సమాన దిగ్గజ సఖుల్ తురగోష్ట్రము లొప్పె బారులై.

సీ. మూఁడవ శ్రేణి నిమ్ముల ధాన్యరాసులు, నాల్గవ పంక్తి వంట పనిముట్లు
ఐదవ పంక్తి విఖ్యాత శతఘ్నులు, ఆరవపంక్తి సర్వాయుధములు
రాజవాహనము లరయ సప్తపంక్తి ను,గ్రాణరాజోపయోగము లెనిమిది
సర్వసాధారణ సర్వ సౌఖ్యంబులు, గల్గు పట్టణముల గల్గు సుఖము

గీ. గల్గి సుమనోహరంబుఁగా వెల్గె పుష్ప,కంబు ఐరావతీ నగరంబు వోలె
చూపరులకు నాశ్చర్యమై తేపతేప, చూచు వేడుక కల్గ సౌఖ్యోచితముగ.

సీ. ఆ పుష్పకంబున నంగడివీధులు, దాస దాసీజన స్థావరములు
నట గాయకులకును విటపముల్ గణికా ని,వాసంబు లాపయి వరుసమీఱ
వీర పదాతు లా వెనుక ఆశ్వికదళం,బులు గజయోధులు చెలువు మివిలి
రథికులు పిమ్మట రాజభాగ్యాధి కా,రులు దూతలును నల్లె పొలుపెసంగి

గీ. మిత్ర పుత్ర కళత్ర సమ్మిళిత మంత్ర,లాధికారులు రామ సౌహార్ద్ర పరులు
పౌర పరివారములు నిల్చి భక్తిగొల్వ, జానకీ రాముఁ డొప్పె తేజమ్ముమీఱ.

క. ఇరువది భోజనశాలలు, నరయ నైదు పాకశాల లాపై స్త్రీలం
దరు భోజనమ్ముసేయఁగ, బరఁగు శాల లందు పది విభవముగ నుండెన్.

సీ. దివ్య మందిరము లతిథి బంధువులకు త,ల్లులకు తదుపరి విమల మహాత్త
ర ప్రభోచితము సుఖప్రదంబగు రామ,చంద్రుఁ డుండు సభ యొసంగె నందు
శ్రీరామ చంద్రుని సింహాసనంబున్న, మందిరమ్మునకు పిమ్మటగ చెలఁగె
క్రీడా విహార సుస్థిర మహాస్థానంబు, స్త్రీ మిత్రశాలయు స్త్రీ జనముల

ఆ. సభల కేడు దివ్యశాలలు పిమ్మట, పదియు రెండు నచట బఱఁగె చిత్ర
శాల, లైదువలకు శాలలు, పుష్పవనములు నైదు నంద అమరియుండె.

క. ఘటికాయంత్రపుశాలయొ,కటి కౌతుకశాల వ్యాఘ్ర గవయాదుల సం
ఘటితంబైనది యా పి,మ్మట రాముని యజ్ఞశాల మహితం బఱయన్.

సీ. దేవతార్చనశాల కావల విప్రర్చ,నాశాల విద్యార్థులకు నిలయము
అవుల యతీంద్రుల ఆవాసములు వాద్య,శాలలు జలయంత్ర శాలలును వి
నోద సద్యో జలామోద శాలలు తడి, బట్టలునెండించే బడెడు శాల
లట్లు సమస్త భవ్యాహీన సౌకర్య,ములు గల నూరు శాలలుఁ దలిర్ప

గీ. సేవకులు తత్స్థలమ్ము లుచితములుగ నొ,నర్ప నదికని రాముఁ డహర్పతి తొలి
కొండ నధిరోహణ మొనర్చుచుండు రీతి, పుష్పకం బెక్కె రాముడు గీష్పతియన.

సీ. వాద్యంబు లెల్లను వాయింప బడగ నా,ట్యము లెల్ల జరుగు చుండంగ ధ్వజము
లును పతాకములు నెమ్మిలి చలింపగను దిక్కులు ప్రకాశించునట్టుల వెలుంగు
రామ ధ్వజాంకిత శ్రీమహిమాన్విత, దేదీప్యమాన సుస్థిర విమాన
రాజంబు వాయు శరస్ఫుట వేగమై, గగన భాగంబెల్లఁ గప్పియెగయ

గీ. కిణకిణ నినాదములతోడ కిర్రుగంట, లొలసి మ్రోగి వినోదముఁ గలుఁగఁజేయ
తూర్పునుండి పశ్చిమముగ నేర్పుమీఱ, ఆ ప్రయాగాభిముఖముగ నపుడు వెడలె.

గీ. అట్లు వచియించు రామదాసాఖ్య గురుని, శిష్యుఁడగు విష్ణుదాసుండు శిరముపైని
యంజలి ఘటించి కథకు నభ్యంతరమని, తలపక వినంగవలయు నాదగు మనవిని.

## శ్రీరామ ధ్వజ రథాది చిహ్న నిరూపణము

క. నాలుగు ధ్వజముల చెప్పితి, రేలా ? శ్రీరామ పృథు మహీశ్వరునకు భూ
పాలుర కెవ్వరి కేనియు, నాలుగు ధ్వజములు గలుఁగ వినంబడదు కదా!

సీ. ఎట్టి భూపాలురకేనియు ధ్వజమొక్కఁ,డై యుండునని తెలియంగఁ బడును
ఈ రహస్యంబు నేనెఱుఁగంగ వచ్చునే? నిమ్ముల సెలవీయ మిమ్ము వేడు
చున్నవాఁడ నటన్న, విన్న శ్రీ రామదా, సిటుల వచించు విస్ఫుటముగాఁగ
చిన్న తనంబున శ్రీరఘు రాముండు, తండ్రి రథము కోవిదార ధ్వజము

ఆ. నెక్కియుంట దాని నొక్కటి ధరియించె, మనుజలీల రాముఁ డనియు పేరు
మఱియు సారథిగ సుమంత్రుఁ డుండెడివాడు, అందుచేత ఒకటి అయ్యె నద్ది.

గీ. బాల్యమున నుండి పితృధ్వజ లౌల్యముననను, ధవళ వర్ణమౌ నా కోవిదారధ్వజము
విడువక ధరించు నా రాఘవుఁడు తదీయ, పితృమహాభక్తి యెదను దీపింపుచుండ,

సీ. బాణధ్వజాంకితప్రభ రథమందున, నెక్కి వనంబున నొక్క బాణ
మేసి తాటకిఁ ద్రుంచివేసిన యప్పుడు, బాణధ్వజుండయి పఱఁగె మఱియు
అప్పటి నామమై యొప్పె శ్రీరామ త్ర్య,క్షరి చిత్రరథుఁడను సారథియును
నీల పతాకపై నిర్మల బాణంబు, శోభిల్లు ధ్వజమతి సుందరముగ

గీ. దానిపైఁ గల కూరిమిఁ దనర మాని, యాజ్ఞ ప్రప్రథమంబున నసుర సంహా
రణము గావించునట్టి కారణముచేత, దాని ధరియించు రాముఁ డుదగ్రవృత్తి.

గీ. రణమునను రావణుండు వజ్రధ్వజమును, త్రుంపగా నాంజనేయు, శత్రుంజయుని ప
తాకపైఁ దాల్చె రాఘవేంద్ర! యనుపేర, రాముఁ డప్పుడు పరఁగె సురలుఁ బొగడఁగ!

గీ. విజయుఁడప్పటి సారథి విశ్రుతముగ, ఆకుపచ్చ పతాకపై ఆంజనేయుఁ
డొప్పఁగ కపిధ్వజంబయియొప్పెఁ దాని,యందు ప్రీతుఁడై దాని నయముగఁ దాల్చు.

క. మాతలి మూర్ఛితుఁడగు నా,యాతఁడె తన రథము నెక్కి నప్పుడు గరుడుం
డాతేరి పయిని ధ్వజమున, భూతేశుని నామమున ప్రభుఁడు విలసిల్లెన్.

వ. పసుపువన్నె పతాకపై గరుడచిహ్నం బొప్పు! నిట్లు శ్రీరామచంద్ర స్వామికి అనేక ధ్వజ పతాక రథ నామంబులు రాజిల్లుచుండునని వివరింప, సంతోషాంతరంగుండై విష్ణుదాసుం డవ్వాలి కథావృత్తాంతంబు వినిపింపు మన శ్రీరామదాసుం డిట్లనియె.

# షష్ఠమ సర్గము

## శ్రీరాముఁడు ప్రయాగక్షేత్ర యాత్రనొనర్చుట

సీ. తరువాత శ్రీరామ ధరణినాథుఁడు కొంత, పశ్చిమ దిక్కుగా పఱగవచ్చి
అట ప్రయాగక్షేత్ర మారసి కోసెడు, దూరముననె సీతతోడుతన్ వి
మానంబు దిగి కాలిమార్గంబునే తిన్న, తిన్నగాను త్రివేణిఁ గ్రన్నఁజేరి
నారికేళపు వాయనము సమర్పించి సా,లంకృత సీతా విలాస వేణి

గీ. నాల్గు వ్రేళ్లంత కత్తిరింతను త్రివేణి, సంగమమున సమర్పించి సాదరమున
సోదరులతోడ వపనముల్ సొంపుమీఱ, చేసికొని యుపవాసంబు చేసి కడక.

క. రెండవనాడు యథావిధి, దండి గలుగు తీర్థ శ్రాద్ధ తర్పణములచే
పిండముల చేత పితరు ల,ఖండతృప్తి నెసఁగఁ జేసి క్రమము రహింపన్.

ఆ. మాఘమాసమెల్ల మఱి అచ్చట వసించి, అష్టతీర్థములకు నరిగి అఖిల
దానధర్మముల నుదారంబుగాఁ జేసి, అక్షయ వటమును సమర్చ చేసి!

గీ. ప్రళయ కాలంబున నిజ నిద్రానికేత,నంబయిన యక్షయ వటంబునింబుమీాఱ
లక్ష్మణుని సీతతోడ సలక్షణముగ, పూజఁగావించి పిదప నింపుగ నెసంగ.

సీ. దివ్య వస్త్రాభరణావ్యయ విధుల త్రి,వేణిని పూజించి వివిధగతుల
కాంస్య కుంభంబుల గంగను నింపి వి,మానంబునందు సుస్థానమందు
స్థాపించునట్టు లాజ్ఞాపనం బొనరించి, తీర్థవాసులను పదింబదిగ పు
రోహితులను సముత్సాహులుఁ గాఁగ పూ,జించి వందించి విశిష్టరీతి

ఆ. వారి యాజ్ఞనంది వరుస నందఱితోడ, పుష్పకంబునెక్కి పోయె గగన
మార్గమందు నట విమానము వింధ్యాద్రిఁ, జేర వింధ్యదుర్గ జేరఁగడఁగి.

## శ్రీరాములు వింధ్యావాసిని దుర్గ నారాధించుట

క. స్నానమ్ము చేసి తీర్థవి,ధి నాచరించియు, యథావిధిని ధర్మములన్
దానమ్ములఁ జేసియు దే,విని దివ్యవస్త్ర మణి నవీన గరిమలన్.

శా. ఆరాధించి, పురోహితావళికి నత్యంతంబుగా సత్కృతుల్
గారా మొప్పఁ బొనర్చి, వారల యనుజ్ఞన్ సీతతోఁగూడి యెం
తే రాజిల్లుచు పుష్పకంబునను తృప్తిన్ పెంపుసొంపేది కా
శీరమ్యాద్భుత పుణ్యరాశిఁ గనఁగా చిత్తంబు మోసెత్తఁగన్.

క. అనుకొనెడు నంతలో కా,శిని జేరె విమాన మపుడు చెలగుచు కాశీ
శు నివాసులెల్ల పుష్పక,మును గని తర్కించిరిట్లు ముమ్మర మతులై.

సీ. అది పర్వతమున దవాగ్నిగా కొందఱు,కొందఱు సూర్యుఁడిగుటయె యనుచు
నారదు గొప్ప వీణారవ మని కొంద, ఱాంజనేయుండు ద్రోణాద్రి యనుచు
స్వర్గము విడిపడు చంద్రుఁడంచును, కాదు, స్వర్ణాద్రి వచ్చెడు సరణి యనుచు
గరుడుఁ డేమో ! నని గగనాద్రియని కొంద, ఱాగ్నేయ దివ్యాస్త్ర మనుచు కొంద

గీ. ఱాదిశేషుఁడు రత్న ఫణాళిఁ దనర, వచ్చుచున్నాఁడు భూమికి బహుళ తేజ
మొప్ప నని కొంద ఱీరీతి గొప్పగాను, పుష్పకముఁ జూచి భ్రాంతులై పోవసాగి.

## శ్రీరాములు కాశీయాత్ర చేయుట

క. భువిపై దిగినంతట పు,ష్ప విమానముఁగా నెఱింగి బహుళాశ్చర్యో
త్సవ శోభితముఖులై వా,రవిరళ కోలాహలముల నటుజేసి రొగిన్.

క. శ్రీరాముఁడు యాత్రార్థము,గా రాఁగా వృషభ మెక్కి గణములతో పూ
జా రమ్యోపాయనములఁ, గౌరీపతి శివుఁ డొనర్చె ఘనస్వాగతమున్.

క. కాశీవాసుల రెల్లరు, కాశీశుని బలసి కడు ప్రకాశింపగ వి
శ్వేశు గురుఁడైన రాము స,కాశమునకు వచ్చిరపు డకల్మషమతులై.

సీ. తన కెదురై వచ్చు ఘనుకుంతి విఘ్నేశు, భవ్యు విశ్వేశ్వరస్వామిఁ గాంచి
శిరసాభి వందన శ్రీఁదలిర్చి భవుచే, నాలింగిత శరీరుఁడై రఘుప్ర
వరుఁడు శివార్చిత వర్ణనీయోపాయ,నము లెల్ల స్వీకరణం బొనర్చి
దివ్య వస్త్రాలంకృతి ప్రముదితుఁ జేయ, శంకరారాధనా సమ్ముదంబుఁ

గీ. గాంచి శ్రీరామచంద్రుఁ డభ్యంచితముగ, శివుఁడు రాముని కెంగేలు చేతఁబూని
కాశికా నగరమున ప్రవేశపెట్ట, మొదట మణికర్ణికా ఘట్టమునకుఁ జనియె.

గీ. వాహనంబుల నెల్లను వదలి కాలి, నడక సీతా సమేతుఁడై కడఁగి చక్ర
పుష్కరిణి శ్రీఫలంబుల పుష్కలముగ, నర్పణముఁ జేసిరట ఈశ్వరార్పణముగ.

ఉ. చేలముతోడ స్నానములఁ జేసి, క్రమంబుగ నిత్యయాత్ర ను
ద్వేలముగాఁ బొనర్చి, నియతిన్ ఉపవాసము చేసి, యొక్కనా
డోలిని తీర్థ శ్రాద్ధముల నొప్పుగ నాచరణం బొనర్చి, యా
త్రా లలిత క్రమంబుల యథావిధి సల్పె తదేక దీక్షతోన్.

సీ. అంతర్గృహపు యాత్ర నాపై మహాయాత్ర, మానసయాత్రల మఱి మఱియును
ద్వియుత చత్వారింశ దివ్యలింగ సుయాత్ర, అష్ట సల్లింగ యాత్రాపయినిని
గరిను నేబదియారు గణపతి యాత్రయు, అష్టభైరవ చతుష్షష్టి యోగి
నీ యాత్రలు నవదేవీయాత్ర అష్ట ది,క్పాలక యాత్రయు గ్రహనవకపు

గీ. యాత్ర క్షేత్ర ప్రదక్షిణ యాత్ర పంచ, క్రోశయాత్రయున్ పదియునాల్గు ఘనయాత్ర
లను సవిస్తరముగ మహాజనులఁ గూడి, సీతఁగూడి కావించె నా శ్రీరఘుపతి.

శా. వాయవ్యంబున నెల్లలోన, వరుణావాః తీరమం దొప్పుగా
శ్రీయుం జెల్వెసగంగ లింగము ప్రతిష్ఠించెన్ స్వనామాంకితం
బై యొప్పారఁగ, గంగయందున స్వకీయాఖ్యాచ్ఛ తీర్థంబు సొం
పై యుండన్ జగమెన్న నేర్పఱిచె! దివ్యద్భక్తి శోభిల్లఁగన్.

శా. సీతారాములు యాత్ర వచ్చిరని కాశీపట్టమందుండగా
ప్రీతిన్ విన్న హనూమ యచ్చటికి కూర్మిన్ వచ్చి సంప్రీతుఁడై
సీతారాములకున్ బ్రణామము లొనర్చెన్ భక్తి గంగాజల
స్నాతుండై ఒక ఘట్టమున్ శిలలతోడన్ నిర్మితిం జేయగన్.

మ. హనుమద్ఘట్ట మటంచు నేటికిని విఖ్యాతంబు సూ! శిష్య! రా
ముని ఘట్టంబును ఖ్యాతిమై నెగడు, సొంపుం బెంపుమై జానకీ
వనితారత్నయుతాభి రాముఁడు రఘుస్వామి ప్రసిద్ధంబుగా
గను కార్తీకమునందు పంచ ఘన గంగా స్నానముం జేసె తాన్.

ఆ. సకల ధర్మనిరతి సంవత్సరం బిట్లు, రామచంద్రమూర్తి రమ్యరీతి
కాశిపట్టణమున కాపురంబుంజేసె, తీర్థవాసు లొగి కృతార్థులుగను.

సీ. వెవ్వేఱుగ సువర్ణ విమల రత్నాదుల, ధనవస్త్ర దివ్యభూషణ తతులను
అశ్వ గో సంతతి సమల రాజితహేమ, పాత్రల నమృతాన్నపాయసముల
గవ్య ధాన్యాది సకలవిధ పాయస, దానంబులను సుగంధయుత పుష్ప
గంధ తాంబూల శృంగారమేసుర శుభాలంకార వస్తువులను సతల్ప

గీ. దివ్య పర్యంక దర్పణ దీపతతుల, గృహములను వాహనంబుల నహరహమ్ము
ఇచ్చి సంతుష్టుల నొనర్చె నెలమి తీర్థ,వాసులను రఘుపతి పట్నవాసు లలర.

క. ఉత్తమ నానావ్రతముల, మొత్తముగా నాచరించి ముమ్మరముగ స
ద్విత్తంబుల భోజనతతి, మొత్తముగా తృప్తిదీర్చె మును పురజనులన్.

వ. మఱియు యతులకు కౌపీన పాదుకావస్త్ర దండ కమండలంబుల మృగచర్మాదులను భిక్షాది సత్కారంబులచేతను సంతృప్తులం బొనర్చె. మఱియు వారికి మఠంబులను నిర్మాణించియు, విద్యార్థులం గూర్చి, పీఠంబుల మంచకంబుల కల్పించి మించె. వివిధౌషధంబులచే రోగులకు సదారోగ్య సౌఖ్యంబుల నిచ్చుటకై సద్వైద్యులను నియమించి, వారికి సమృద్ధి జీవనంబులను కల్పించె. పట్టణంబునం దచ్చటచ్చట పుస్తక భండారంబులను, అందు పుస్తక లేఖకులను, వారికిఁ దగు వసతులఁ గల్పించె. దివ్యాన్నదానంబులచే వర్ణులను సత్కరించునట్టి యన్నసత్రంబులను స్థాపించె. గ్రీష్మ కాలమున చలువ పందిళ్లు, శీతకాలమున కుంపట్లు, అఖిల జనులకు సుఖప్రదంబుగ నుండునట్లు నిర్ణయించె. వర్షాకాలోచితముగ ఛత్రంబుల నిప్పించె. వస్త్రాదుల నొసంగె. దేవాలయంబులలో ననేకంబులుగ నృత్యగీత వాద్యాదులు విశేష విశేష నివేదనాదులు జరుగున ట్లేర్పరించె. విద్యార్థులు రాత్రివేళ తమ పాఠముల బోధం బొనర్చుకొన దీపికా వితతు లేర్పరించె. మఱియు శిథిలంబులగు దేవాలయంబులు జీర్ణోద్ధారం బొనర్చి యలంకరించె, నెట్లనిన సున్నములు కొట్టించి, చిత్రపటముల వ్రాయించి, ముగ్గులు వెట్టించి, హారతుల నెత్తించి, ధూపములు వేయించి, కర్పూర ముల వెలిఁగించి, దీపారాధనలు చేయించి, పంచామృత స్నానాదుల నా యా దేవతల నభిషేకించి పుష్పార్చనంబుల నిట్లనేక సత్కారంబులు చేయించె. సర్వకాలముల యందు ననవరతము.

గీ. శంఖభేరీ మృదంగాది సకలదివ్య, వాద్యములు మ్రోయునట్లు శివాలయముల
దివ్య నైవేద్యములు జపాదికము, హోమ, బలి విధానాదికము జరుపఁగ నొనర్చె.

గీ. స్తోత్ర పఠనంబు లెప్పు డస్తోకరీతి, జరుఁగ, నామస్మరణము పొసఁగఁగ, నృత్య
ములు జరుఁగఁగ, ప్రదక్షిణములుఁ జెలంగు, నట్లుగా, ఏర్పరించె నిరంతరముగ.

మ. ఒక యేడిట్టు లనాథులన్ సకలదీ నోపాధులం బ్రోచుచున్
సకలాత్ముండగు వారు విశ్వనాథుని సమర్చా రీతులం గొల్చుచున్
ప్రకట ప్రాభవ బ్రహ్మచర్య నియమ ప్రఖ్యాతుఁడై తీర్థ వా
స కనద్దివ్య వ్రతంబు పూని నెరవేర్చన్ జాలె దివ్యాతుఁడై.

క. పలుమారు విశ్వనాథుని, పలుమరు కాలభైరవుని పలుమరు ఢుంఢి
స్థలు రాజగణపతిని పలు, పలుగ నన్నపూర్ణ దండపాణిఁ దలచుచున్.

గీ. దర్శనముసేయు, మఱిమఱి దర్శనంబు, సేయు, ప్రణుతించు మరలంగసేయు ప్రణుతి
ఎంత జూచిన తనివి యొక్కింత తీఱ, దాతనికి సాంబశివ దర్శితాత్మునకును.

ఆ. ఎట్టకేల కెట్లొ? యెలమిమై శ్రీవిశ్వ,నాథు నన్నపూర్ణ నవ్యనుజ్ఞ
నంది రామ భద్రుఁడా పుష్ప కారూఢుఁ,డై గయోన్ముఖుండునై దనర్చి!

సుక్షేత్రముల చూచుచు శ్రీరాములు మఱల గయకు వచ్చుట

శా. గంగా దక్షిణ తీర తీరముననే కర్మ ప్రణాశోత్కటో
త్తుంగా భంగ తరంగ గంగఁ గనుచున్ తోడ్తోడ నేగెన్, గయా
రంగద్దివ్య పవిత్ర క్షేత్ర చ్యవనర్ష ప్రస్ఫుట స్థాన సం
స్థం గళ్యాణ శుభాశ్రమంబును, నిమేష ద్విత్రి కాలంబునన్.

గీ. వచ్చి స్నానముచేసి చ్యవనమునికిని, మ్రొక్కి యచట రాఘవ తీర్థమును సృజించి
రామలింగేశ్వరుని నిల్పి రమణమీఱ, స్వీయ శరకృతరేఖ నాశ్రితులకెల్ల.

క. చూపించి కాశికాపురి, రూపించిన యంతకన్న రూఢిని మించం
గా పెంపు దానధర్మ క,లాపంబులఁజేసి శశికళా భాసితుఁడై.

ఆ. ఎచ్చ టెచ్చటికి శుభేచ్ఛ సీతారాము, లేగుదురొ? నదీమహిత స్థలముల
కచ్చటచ్చటను మహా తీర్థములు విశే,షముగఁ కల్గుచుండె విమలములయి.

క. ఆ క్షేత్ర తీర్థ సంఖ్యల, లక్షించి గణింప శేషు లావసదా సం
వీక్షింప నందు నారు మ,హాక్షేత్రములై యెసంగు నత్యంతంబున్.

గీ. రామ లక్ష్మణ భరత తీర్థములు సీత, శాత్రవ ఘ్నాంజనేయ శశ్వత్సు తీర్థ
ములు ప్రకాశించు నేతీర్థములను గనిన, దీని వేర్వేరు వచియింప తేపతేప.

క. గంగయును శోణభద్రా, సంగమమున స్నానమాడి సరవిని మూణ్ణా
ళ్లం గడపి యచట గండకి, గంగా సంగమము జూడగా నేగి రటన్.

సీ. ఒక తీర్థమున మూఁడు నొక తీర్థమున నైదు,నొక తీర్థమున నేడు ప్రకట రాత్రు
లొక కొన్ని తావుల నొప్పుమీఱఁగ పది, పేను రాత్రులు పది యెన్మిది నిశ

లొకట నేకోవింశతి కనద్దినమ్ములు, సుస్వతంత్రుఁడు కాన సొంపుమీఱ
ఒకచోట మూణ్ణెల లొకచోట నారు మా,సము లెందు నెల్లెట్లు సంభవంబొ?

గీ. అట్టులట్టులు సౌఖ్యంబు లుట్టిపడగ, దాన ధర్మాచరణ యథాతథము గాఁగ
నాచరించుచు త్రిజగములునద్భుతముగ,సంస్తుతి యొనర్ప యాత్రలు సల్పె ప్రభుఁడు!

సీ. గండకీ సంగమ తన్మోతలంబుల స్నాన,మాచరించి పవిత్రుఁడై చరించి
పశుపతీశ్వరుని నేపాల దేశమ్మున, నారాధన మొనర్చి హరిహరు లొక
చక్కన యున్న యుచ్చక్షేత్రమున కేగి, సర్వ తీర్థంబుల సఫల పఱచి
మరల గంగాతీర మార్గంబునను దక్షి,ణాభి ముఖుండయి యరిగి అరిగి

గీ. అచట వైకుంఠ నగరము నరసి యవల, పోయి యచట జరాసంధ పురముఁజూఁచి
చక్క వైకుంఠి నదిలోన స్నాన మాచ,రించి గయ పట్టణము సమీపించె నపుడు.

క. ఆ పిమ్మట శ్రీఫల్గు న,దీ పూర్వదిశాతటిఁ సుదీర్ఘ స్థలమం
దేపున తన పుష్పకమా, దాఁపున విడియించి సౌఖ్యదముగ నెఱుఁగుచుఁ.

గీ. విష్ణు పాదము వద్దకు వెడలివచ్చి, వందనం బాచరించి యమంద భక్తి
మఱలగ విమానముం జేరి గరిమ రాత్రి, గడపి ప్రొద్దుటలేచి శీఘ్రమ్ము మీఱ.

గీ. బ్రాహ్మణులతోడ రాముఁడు ఫల్గునదికి, స్నానమునకేగె నంతలో సఖులతోడ
సీత ఫల్గునదీస్థలిజేరి స్నాన, మాచరించి ముత్తైదువు లాప్తులగుచు.

దశరథుఁడు సీత ఇచ్చిన సికతా పిండములచే సంతృప్తుఁ డగుట

ఆ. తన్ను చుట్టుముట్ట తప్పక పూజించి, యిసుక దిబ్బమీద యింపుమీఱ
కూరుచుండియుండి గౌరిని పూజింప, ఇసుకముద్ద లైదు నెలమిఁచేసె.

ఆ. ఇట్టు లైదు ముద్దలెత్తి దుర్గాదేవిఁ, చేయుచుండె నంత చేయియొకటి
భూమినుండి పుట్టి పుట్టు తడవుగ ము,ద్దల గ్రహించుచుండె తనరి యపుడు.

గీ. ఇసుక ముద్దల గైకొని యిటుల నేల,లోన దాగెడి హస్తవిధాన చతుర
మఱియ జానకి మిగుల నాదరముతోడ, ఇచ్చె నష్టోత్తర శతంబు లిసుక కడుల.

క. యిచ్చిన సికతా పిండము, లచ్చెఱువుగ మాయమైన నత్యాశ్చర్యం
బెచ్చుగ గౌరిని మనసున, నచ్చముగా పూజచేసి యటు వోవుటయుఁ.

మ. పిదపఁ రాముఁడు పంచతీర్థములలో ప్రీతాత్ముఁడై మున్గి, సొం
పొదవన్ ప్రేతనగంబునెక్కి, పితృతృప్త్యుద్యుక్తుఁడై పిండ దా
నద ధర్మంబును సేయఁబూని, తన పేరఁ ముద్రికఁ వ్రేల నుం
డిన దానిఁ దొలగించి, దక్షిణదిశ న్వీక్షించుచుఁ వ్రేల్మిడిఁ.

క. కూర్చుండి ముహురేఖలఁ, గూర్చన్ లిఖియించె, నేఁడుఁగూడ కనంగా
నేర్చన్, తీర్థ దిదృక్షుం, బేర్చిన నెవ్వాఁడు కాని ప్రియ మాఱంగన్.

గీ. అతఁడు పిమ్మట దర్భల నందు పఱచి, నువ్వులుం దేనె నెయ్యి యనూనముగ మె
సంగు పిండి పిండముల నొసంగ సవ్య,హస్తమున పిండమెత్తి పిత్రార్థి యగుచు.

గీ. ఎంతచూచిన భూమిపై నేలొ ? కాని, తండ్రి హస్తంబు కనఁబడదాయె! నపుడు
అచటి బ్రాహ్మణుల్ విహ్వలితాంతరంగు,లై యిటులఁ బల్కి-రా రాము నట్టె కాంచి.

క. ఈ పిండదాన సమయము,లో పితరులు ఎల్ల ఆకును పితృహస్తంబున్
జాఁపి కొనుట వాడుకయై, యేపుగనున్ నీ.పితరుఁడ దేలో తడసెన్.

క. కారణ మనూహ్య మనినన్, శ్రీరాముఁడు చకితుఁడై పొరింబొరి దానిం
గూరిచి యోచించుచు సా,మీరీ! లక్ష్మణ! యెఱుంగుమీ! యీ వింతన్.

ఉ. చిన్నఁడవైన బుద్ధి వికసించుట యందున పెద్ద వీవు, నా
యన్న! యెఱుంగుదే ? యిటుల నొటకు కారణమన్న, రామ! ముం
దెన్నగ గారపిండముల నిచ్చుతఱిన్ వని గౌతమీతటిన్
తిన్నగ చూచినారము పితృ ప్రవిభాసిత దివ్యహస్తమున్.

గీ. గారకాయల పిండముల్ గైకొనంగ, కానుపించిన హస్త మిక్కడ మహాత్మ!
ఏల కనుపింపదో ? నాకు నెసఁగె చిత్త, విభ్రమంబని సౌమిత్రి వివశుఁడయ్యె!

క. ఈ విషయంబున సీతా,దేవిన్ ప్రశ్నింప కొంత తేటపడునొ ? యే
మో! విషయం బతి గహనం,బై విలసిల్లునని వికల భావత ననియెన్.

చ. అది విని సీత! భీతహృదయాంబుజయై రఘునాథ! నేడు తా
నొదవె మహాపరాధము! మయోదితమై, క్షమియింపు డంచు; నె
మ్మదిగని యాపె, పొద్దుటి క్రమంబు నెఱుంగఁగఁ దెల్పఁ దెల్పినన్
మదిని యెఱింగి రాముఁడు ప్రమాణ మెఱింగిన సాక్ష్యు లేరనన్.

మ. అది నా తండ్రి కరంబెయై నెగడు! నట్లైయుండినన్, లోక మొ
ప్పదు! సాక్ష్యంబు వచించు వారలెఱిఁగింపంగాని; కాబట్టి యే
రిది నిక్కంబని సాక్ష్య మిత్తు రన, స్వామీ! చూత వృక్షంబు క
న్నది, యాహస్తమటన్న! దానిని యెఱుంగం బల్కఁగాఁగోరినన్.

క. యెఱుఁగ నటంచున్ మామిడి, బరువడిని అబద్ధమాడ పాపిష్ఠీ! నీ
వెఱుఁగవె ? నీ కడుపున బడు, పురుగు లని శపించె సీత! పొగ రడఁగంగన్.

ఆ. అల్గి భూమిపుత్రి పల్కునదీ! తల్లి! సాక్ష్యమనిన నదియు స్వామి యెదుట
యెఱుఁగ నన్ననోసి యెఱుఁగవా ? నీ వథో,గతి జరించు మనుచు కసరిత్తె.

గీ. తీర్థవాసు లీసంగతి తెలియుదురని, చెప్పినన్ రఘురామునిచేత నెట్టి
కష్టమో! యని వారెఱుంగమని పల్క, సీత కనలి యెఱింగియు చెప్పరకట!

క. అని తీర్థ వాసులను మీ, కెనయదు గావుతను తృప్తి యెంత యిడిన, మీ
రనవరతము ధనలుబ్ధత, ననయము తిరుగుచుండుఁడని యవనిజ తిట్టెన్.

క. పిల్లి యొకటి కలదన నా, పిల్లియు సాక్ష్యంబు చెప్ప పిఱిదికి జన పో
పిల్లీ! నీ తోక దగులు, వల్ల పాపచయముగను నవశ్యముగ జనుల్.

గీ. తోకముందుఁ బెట్టుక నీవు తొడరి కూరు,చుండి చూచియు యెరుగనే నొండటంచు
సత్యదూరముగాఁ బల్కు సర్వ పాప, జీవి! నీ దల్ప పాపంబుఁ జెందకున్నె?

క. అని యీ గోవును చూచెం, జనుఁ దీనిం బ్రశ్నసేయ సందేహము వా
యు ననిన గోవున్ నేదెలి,య ననగ నీముఖముచూడ నఘమని పలికెన్.

గీ. ఇటుల శపియించి యశ్వత్థవృక్ష మెఱుఁగు,నన నదియు యెఱుఁగ ననిపల్కిన గనలున
ఎపుడు నీపత్రములు చలియించుచుండు,నని శపించె సీతాదేవి కనలి కనలి.

క. చివరకు విసివి సతీమణి, రవి లోకఁపు కన్ను! అఱుగ రాదే? యన, స్వ
చ్ఛవి రవి యిట్లను నీపిత, యవిరళ తృప్తిం గనియె! మహా మహితాత్మా!

మ. అని యాదార్ఢ్య మెఱుంగఁ బల్కిన, వియద్యానంబునన్ వచ్చి సూ
ర్య నిభంబైన ప్రకాశ మొప్పఁగ దశస్యందుండు! శ్రీరామచం
ద్రుని యాలింగనముం బొనర్చి యిపుడెంతో మోదముం బొంది నాఁ
డను, నన్నుద్ధరణం బొనర్చితివి వేడ్కన్ తృప్తుఁడన్ రాఘవా!

. దుస్తరంబగు నరకమందు పడకుండ, ఉద్ధరించితి రాఘవా! ఒప్పమీఱ
జానకిదేవి యిచ్చిన సైకతంపు, పిండదానము చేత తృప్తి పడినాఁడ!

ఆ. అయిన లోక శిక్షణార్థమై గయయందు, శ్రాద్ధ మాచరించు రామ! అనిన
రాముఁ డిట్టులను ప్రభామహితా! పితా! ఏల తొందరించి తింతలోన.

ఆ. ఇసుక పిండముల గ్రహించితివా? తండ్రి! ఇంత ఆత్రవడితి రేల? ననిన!
అన్ని విఘ్నములె గయాశ్రాద్ధమున కగు, ఇందువలన త్వర వహించినాఁడ!

క. అని చెప్పి దశరథుఁడు రా,మునిచే నీయబడు కవ్యమును గూడ గ్రహిం
చినవాఁడ యగుచు నాకస,మునను విమానమున నేగె ముదిత హృదయుఁడై.

## శ్రీరాముఁడు గయావాసము చేసి రామగయ నేర్పరచుట

క. ఆ తదుపరి శ్రీరాముఁడు, ప్రేతగిరిని పిండదాన రీతి జరుపుచున్
ప్రేతశిలన్ కాకబలిన్, చేతోమోదమున వైచి చెలఁగి యటుపయిన్.

వ. ధర్మారణ్యమునకు వెడలి, తిలాజ్య పాయస శర్కరాన్విత పిష్టపిండంబుల వేర్వేరుగా నిచ్చి, వటశ్రాద్ధముం బెట్టి, అష్టతీర్థముల నాచరించి, యథా విధిగా త్రిస్థలంబున సంధ్యల నాచరించి, అనేకంబులగు దానంబుల నొసంగి, అత్యంత విభవముతోడ గదాధర స్వామి నారాధించి, సకీటకంబగు చూతవృక్షమును నీళ్లలో ముంచె. ఒక మునీంద్రుండు కుశాగ్రంబులను కుంభంబును చేతంబూని మామిడిచెట్టుక్రింద నీళ్లను ధరించె. మామడిచెట్టుం దడిసె. పితృవులు తృప్తి నందిరి. ఇట్లొకపని రెండు ప్రయోజనంబుల నిచ్చుట ప్రసిద్ధంబయ్యె. పిమ్మట శ్రీరాముండు విమానము నెక్కించుట మొదలుగా గల సత్కారములచే విష్ణుపాదమును పూజన మొనర్చె. ఇట్లు మూడుమాసములు గయయందు నివసించి, అఖిల ప్రజానీకంబుల సంతుష్టాంతరంగుల నొనర్చి, విమానం బెక్కి తూర్పుదిక్కై వెడలె. ఫల్గు నదీతీరమున విమానము నిలచినచోటు రామ గయ యనుపేరం బ్రసిద్ధి వహించె. అచ్చట రామేశ్వరుండును రామతీర్థమును పరమ పావనంబులై యొప్పు. శ్రీరాముండు ఫల్గునదీ గంగా సంగమంబునకు వెడలెంగాన గయకు వెనుక ఫల్గు వాకశే ప్రసిద్ధంబై యున్నది. అది మహానదిగా నున్నది.

సీ. పరమ పవిత్రమై పరంగు జాహ్నవి గంగ, యుత్తరవాహిని యున్నచోట
ముద్గలాశ్రమము సొంపుగ నూత్నమై యున్న, దివ్యస్థలంపు దిదృక్షం దవిలి
శ్రీరామచంద్రుం డాశ్రిత పారిజాతమై, యచటికి వచ్చె న య్యాస్థలమున
జానకీదేవి తేజంబెల్ల భూమియం, దెటిగి యొసంగె, తా నెఱింగి రాముం

గీ. డచట జానకీ తీర్థంబు నమర నిల్పె, రామచంద్రుండు నిజ సోదర ప్రకల్పి
తంబులగు తీర్థములకన్న తత్స్థలమున, జానకీ తీర్థమే గొప్పయా ననియనె.

శా. అంతన్ రాముం డనంత పుష్పక విమానారూఢుండై, వే పరి
క్రాంతిన్, ఉత్తర వాహినీ యభిదమా స్థానంబునుం జేరి, అ
త్యంత శ్రద్ధగ గంగం గొల్చి, నది మధ్యంబందునన్ కొండపై
కంతుం గెల్చిన బిల్వనాథుని సమగ్ర ప్రీతి పూజించుచున్.

గీ. వైద్యనాథేశ్వరుం గొల్చి వచ్చుచును న,నేక దివ్యస్థలంబుల జోకమీఱ
చూచుచును గంగనుండి వచ్చు సితనదిని, గ్రుంకి యటనుండియును సముద్రునిని జేరె.

క. నూరామడలు ప్రయాగకు, దూరంబున గల సముద్రు దునిసి దునిసి వి
స్తార శకలముల గలయు భ,గీరథి సంగమముంగాంచి కృతకృత్యుండై.

మ. యమునా సాగర సంగమంబునను తోయంబాడి, పుణ్యంపు తీ
ర్థములన్ వేలుగ వేలుగన్ గని, సముద్ర స్నానముం జేసి, యు
త్తమమా తత్తత పూరుషోత్తముని చిత్తం బొప్పంగా మ్రొక్కి, చూ
చి, ముదంబొప్పగ, దానధర్మములు చేసెన్, భూరి భూరి స్థితిన్.

ఆ. వివిధ దేవతలను వివిధ నదీనద, ములను భక్తి మీఱఁ గలయఁ జూఁచి
ఎన్నో దేశములు సమీక్షించి గోదా సు, తటమునందు రామతటముఁ గూర్చి.

సీ. సప్త గోదావరీ సంగమంబున మహా,దధి స్నానమొనరించి దక్షిణముగ
వచ్చుచు, నచట పూర్వపు దేశ రాజుల, వలన మిక్కిలిగ పూజల గ్రహించి
వారిలో యాత్ర లవారి సేయగ కుతూ,హలులైన వారలఁ గలుపు కొనుచు
పుష్పకమందు సంపూర్ణమా వసతుల, వారికి సేయించి వరుస మీఱ

గీ. దక్షిణపు దిక్కునందలి దైవతీర్థ,ముల విలోకింప నిశ్చయమునఁ గడంగి
మత్స్య తీర్థముదాటి విమల మహాన,దీమ తల్లిని కృష్ణవేణీమ తల్లి.

# సప్తమ సర్గము

## శ్రీరాముఁడు శ్రీశైలాది క్షేత్రములఁ జూచుట

సీ. పూజించి యాడి, తత్పుణ్య స్థలంబుల, సేవించి శ్రీ నారసింహుఁ గొలిచి
పానకాలాన్వయు ప్రస్తుతించుచును కృ,ష్ణా సాగరంబుల సంగమమున
స్నానంబుఁగావించి దానంబు లొనరించి, దారిలో గలుగు సుస్థలములెల్ల
చెలఁగి వీక్షించుచు శ్రీశైల పర్వతం,బున నీల గంగలో మునిగి, మల్లి

గీ. కార్జున స్వామిఁ గొల్చి తియ్యంబుగాఁగ, శిఖర వీక్షణ మాత్ర నశించి పాత
కములు జన్మరాహిత్యంబుఁ గలుగునట్టి, స్వామి శిఖరంబుఁగని శిరసానతించి.

గీ. కలిత శిఖరేశ్వరుని యా శిఖరమునందు, బ్రహ్మకుండంబు నందు శుభంబు మీఱ
మజ్జనం బాడి పిదప భీమవర కుండ,మున జలకమాడి యట్టులేపునఁ గడంగి.

ఆ. మఱి నివృత్తి సంగమంబున తుంగభ,ద్రనది సంగమమున దనర మునిఁగి
శ్రీ వెలయునదీ సరోవరంబున భవ,నాశనిని కెఱంగి స్నానమాడి.

సీ. శ్రీయహోబిల నారసింహు నారాధించి, స్తంభ ప్రదక్షిణారంభు డగుచు
పుష్పగిరికినేగి పొలుపుమీఱఁగ పినా,కిని మున్గి పుణ్యస్థల నివహముల
దర్శించుచును మహత్తర లింగములను పూ,జించుచుఁ గడు సంతసించుచుండి
పంపా సరోవర సంపదఁ గీర్తించి, కిష్కింధలోన సుగ్రీవుఁడాది

గీ. వానరావళి సత్కృతు ల్వారుసఁ గాంచి, అచేట నందఱి పుష్పకమందు నిల్పి
తత ప్రవర్షణ గిరిలోని తన గుహను వి,నోదముగఁ జూప సీత సమ్మోద మందె.

గీ. రెండవది యైన యా భీమ కుండమందు, స్నాన మొనరించుచు కుమారసామి గాంచి
కనక గిరిలోని శంభుదేవుని నమస్కరించుచు నగస్త్యకుండ ముదంచితముగ.

గీ. కాంచి స్నానపానము లాచరించి యందు, నందుగల తీర్థములనాడి యాడి వీర
భద్రు దర్శించి వేంకటప్పని నగంబుఁ, గాంచి వందించి యప్పుష్పకస్థులెల్ల.

సీ. తృప్తి పట్టణవాసు తెలిసి గోవిందరాజును మ్రొక్కి, కపిలధారను మునింగి
తీర్థశ్రాద్ధాదులఁ దీరిచి పిమ్మట, శేషాచలేంద్రుని సేవఁ జేసి
పుష్కర తీర్థాన పుష్కల స్నానాదు, లొనరించి పంచతీర్థిని మునింగి
స్వర్ణముఖీ తీర శంకరు కాళహస్తీశ్వరు దివ్యాభిషేకములను

ఆ. మిపుల భక్తిఁగొల్చి మించి నారాయణ, కాలకంఠ ప్రియము కంచి కరిగి
సర్వ తీర్థములను స్నానంబుఁ గావించి, ఉత్సహించి స్వజను లొప్పికొల్వ.

శా. ఏకామ్రేశ్వరు నెన్నియో విధులచే నేకాగ్రవృత్తిన్, సప
త్నీకుండై యభిషేక తృప్తుని పౌనర్చెన్, పూల పూజించె నెం
తే కామాక్షిఁ మహాముదంబుఁ గన, నీ తీరొప్పగా ఉత్సవా
నీకంబు ల్పొనరించి, యొక్కనెల నిల్చెన్ రాము డక్కంచిలోన్.

క. వేగవతీ స్నానమ్మును, భోగమ్ముల వరదరాజుఁ పూజించుచు ముం
దేగుటయె మఱచె రఘుపతి, త్యాగం బేర్పడఁగ నట వ్యయం బొనరించెన్.

సీ. పక్షి తీర్థమునకు పరగంగ నేగి పూషవిధాత్రువను పక్షిజంటఁ సత్క
రించి, తనన్వెంబడించు సీతాదేవితోడ పుష్పకమున తొడరి యేగి
క్షీరనదీ స్నాతుఁడై రయంబున త్రివిక్రమమూర్తి మ్రొక్కి సక్రమము గాఁగ
స్మరణ మాత్రమున మోక్షము లభించెడి యరుణాచలంబున పూజ లాచరించి

గీ. ద్యుమణి ముక్తానదీ తీర మొనరఁ జెలఁగు, వృద్ధ పర్వతాధీశుని శ్రద్ధఁగొల్చి
పొసఁగ తటపాలనమునకు పోయి తత్ర్ప, దేశ పరమేశు పూజించె దృఢపుభక్తి.

వ. శ్రీముష్ణంబున యజ్ఞవరాహమూర్తి నారాధించి, దర్శనమాత్రమున ముక్తిప్రదం
బగు శేషలిఖిత తాండవాకృతి యగు చిదంబరమున కేతెంచి, కావేరీ స్నానం బాచ
రించి, అటుపై సింహక్షేత్రంబున కరిగి, బ్రహ్మపురేశ్వరు నర్చించి, వైజనాథుని
ప్రణమించి, శ్వేతారణ్యమునకు వెడలి, శంఖ ముఖ్యాలో మునింగి, ఛాయావనముం
జూచి, గౌరీ మయూరమునకు వెడలి, వేదారణ్యముదాటి, మధ్యార్జునేశ్వరు వందించి,
వృద్ధకావేరీ స్నానముఁ జేసి, కుంభఘోణముం జూచి, శ్రీనివాసుని దర్శించి, మంగళ
బృందావనంబున సారనాథునిని, శ్రీవాంఛమున ప్రయాగ మాధవునిని దర్శించి,
అభ్రశిరఃస్థలంబునకు వెడలి, కమలాలయంబున త్యాగేశ్వరు నారాధించి, గయా
తీర్థంబున మునింగి, దక్షిణ ద్వారకలో శ్రీ గోవిందుని నారాధించి.

## శ్రీరాముఁడు సేతు యాత్రఁ జేసివచ్చుట

సీ. అవల జేపాల పురాధిపు నభయదే,శ్వరుఁజూచి పూర్వము స్వప్రతిష్ఠి
తుండగు విఘ్నేశ్వరుండు సుష్టుగనుంట, ఆప్తమిత్రులకు నొయ్యనఁగఁ జూపి
అందఱితోఁగూడి యారాధనముసల్పి, నలి నవపాషాణముల భజించి
స్నానముల్చేసి యచ్చటనున్న విమల దే,వీ పట్టణమునకు వెడలి యచటి
గీ. విమల వేతాల దివ్యతీర్థముల మునిఁగి, పావన సముద్రజలముల బహుళ సంత
సమున జలకంబులాడి విస్తారభక్తి, భైరవుని తీర్థమున స్నానపటిమ నూని.
క. తమ యేకాంతస్థలమును, విమానమున జేరి దిగి ప్రవీణత సర్వుల్
ప్రముదంబుగ పద్మాస్థలి, విమల రామలక్ష్మణాగ్ని పృథు కుండములన్.
క. మేటిగ మునుఁగుటయు ధను,ష్కోటిన్ దగ స్నానమాడి సొంపలరంగా
వాటిలిన తొంటి కథలుం, జటాయు తీర్థమున కేగ జ్ఞప్తికి వచ్చెన్.
క. నాటి కథ లప్పటప్పట, వాటిలిన ప్రసిద్ధ చిత్రవర్తనలం దా
నోటన్ వచింప రాముఁడు, గాటమయిన శ్రద్ధ వినిరి కనులు చెమర్పన్.
మ. ఇటులన్ పౌరుల మిత్రులన్ స్వజనులన్ హేరాళమా నాప్తతం
జటులా మేయ ప్రమోద మానసులుఁగా సల్లాపముల్ సేయు, చ
చ్చట భాసిల్లెడు గంధమాదనము నోజన్ జేరి, మున్ముందు వి
స్ఫుట శ్రీ మారుతి సుప్రతిష్ఠిత లసన్మూర్తి స్ఫురల్లింగమున్.
గీ. విశ్వనాథాభిధంబగు విమల లింగ,మును యాథావిధి పూజించి వెనుక రాఘ
వేశ్వర ప్రతిష్ఠితంబు రామేశ్వరంబ,నం బరగు లింగమును పూజనం బొనర్చి.
సీ. గంగాభి షేకంబు గావించి గాజు కు,ప్పెలు దనుష్కోటి లోపలనె విడచి
కోటి తీర్థంబను కూపము నిర్మించి, పాప ప్రణాశన పటిమఁదైన
స్వేత మాధవుఁజూఁచి వివిధ దానాదిక,ముల సల్పి చట నొక నెలవసించి
వాహనారూఢ దేవతలకు దివ్యోత్స,వంబులఁ గావించి వరుస మీఱ
గీ. క్షేత్ర పాపము పరిహరించెడి తలంపు, నూని, కోటి తీర్థంబున స్నానమాడి
ద్వార గణపతికిన్ మ్రొక్కి, తాము మరల, తోయధిన్ తేలియాడి నిస్తుల నియతిని.
గీ. పుష్పకము నెక్కి యాకసంబునన పోయి, దర్భశయనమునకు వచ్చి తనరుచున్న
కలిత నిక్షేపికా జలమ్ములను దోగి, తామ్ర పర్ణియు నట సముద్రముఁ గలియఁగ.

## శ్రీరాముఁడు కన్యాకుమారికి వరముల నిచ్చుట

సీ. ఆ సంగమంబున నవగాహ మొనరించి, దానధర్మముల నుదార రీతి
సల్పి, తత్తీర వాసము సల్పి స్కంధ మూ,ర్తిని గొల్చి తామ్ర పర్ణినదీప్ర

తీరంబునం గల్గు దేవతాస్థలములు, పుణ్య స్థలమ్ము లింపుగఁ గనుఁగొని
నవనవ వేంకట నాథుల వందించి, తోతాద్రి జేరి రస్తోక రీతి

గీ. చేత పుష్పమాలికఁ దాల్చి చెలుగుచును స,ముద్ర తీరంబునను రామభద్రుఁ డెపుడు
వచ్చునో? యని వేఁచెడి వనితయైన, యట్టి కన్యాకుమారి నప్పట్టున గని.

మ. వరమున్ వేడుమటన్న, నవ్వనిత దేవా! ముందు నాచేయు ని
మ్మొర యాలింపుము! నేను నొక్క మునికిం బుత్రిన్; సుసేంద్రుండు న
న్వరియించెన్, జనకుండు నాతనికె ఈయన్ నిశ్చయించెన్; పౌరిం
బౌరి పిల్పించెను; వాఁడు పెండ్లికయి యింపుం బెంపు సొంపారగన్.

గీ. వచ్చె నామడ దాక; నీ వచ్చు టెఱిఁగి, నామనమ్మున నిన్నె మన్నన వరించి
యున్నదాన! నా యుద్ధంతము విన్నవాఁడు, రాకయున్ దన నెలవుకు పోక నిలచె.

క. రాలేఁడు వీడి నన్నుం, బోలేఁడు జనకుడు తల్లి పొనరించిన బం
డాలము సముద్రమున కో,పాలయుఁడై పాఱవైచె నటుచూడు హరీ!

ఆ. అలలచేత వచ్చి యవి కనుంబడుచున్న, విపుడు ధన్యనైతి! నింకమీద
దాసిగాఁగ నన్ను దగఁగొను రామా! య,టన్న గాంచి రాముఁ డనియె నిట్లు.

క. ఒ కౌమారీ! వినుమా!, నాకీ జన్మంబు నందున్ గలదు కదా
ఏక సుపత్నీ వ్రతమిట, నా కృష్ణావతారమున నన్ను గొలువుమా.

చ. అని వరమిచ్చె! రామ వచనానుసరంబుగ నంతదాక భా
మిని తప మాచరించె, పెరిమెన్ తనదైన తపోబలంబుచే
తను, తనుబాసి జాంబవతి తానయి పొల్పెసఁగెన్, భృశంబు కృ
ష్ణుని భజియించె, ముఖ్యతరుణుల్ యెనమండ్రుగు రందు నొక్కతై.

## శ్రీరాముని పశ్చిమ దక్షిణక్షేత్ర దర్శనము

వ. శిష్యా! అటుపైఁ జరిగిన వృత్తాంతంబు వినుము.

గీ. ఆపె వివరించినట్టుల నా సుసేంద్ర, మునకుఁ జని యా పయోష్ణిలో మునిఁగి తామ్ర
పర్ణి తీరంబునన్ శేష పన్నగమున, సుఖముగా యోగ నిద్రావశుని ముకుందు.

వ. వరలక్ష్మీ గరుడ సేవితుండగు ఆర్యానంతమూర్తి నారాధించెం; దానిని వేఱొక
పశ్చిమ వాహిని యగు తామ్రపర్ణిగా నెఱుంగుము.

క. అంతట శ్రీరఘురాముఁ డ,నంత శయనమునకు వచ్చి స్నానమ్ముల న
త్యంత ముదమ్మున జేసిరి, కాంతమ్మున పద్మ శంఖ ఘనతీర్థములన్,

గీ. మత్స్యనది యందునున్ సల్పి మజ్జనముల, ఘన విమానంబునన్ బోయి కాంచిరంత
తగు సరోవర మొక్కటి దానిపేరు, ధర్మము నధర్మ సమ్మిశ్రితమ్ము చూవె.

ఆ. దాన తానమాడి తత సముద్ర ప్రాంత, మగు జనార్దనమున హరిని గొలిచి
లోక శిక్షకై విలోకింపఁడయ్యె నా, డ మళయాళమునను డాసికూడ.

క. దాని గనబోక కృతమా, లానది ఘృతమాల నదిని లక్షించి కృత
స్నానుండై సింధునదిం, బూనికను గజేంద్రమోక్షపుం స్థలముఁ గనెన్.

సీ. అది తామ్రపర్ణి మహానదీ తీరంబ, గుట నందు స్నానాది చటులకృత్య
ముల నాచరించి ఇమ్ముగ్నలను మైరాళ తీ, ర్థమును సేవించి చంద్రసుత గిరికి
వెడలి యచ్చటనుండి విశ్వనాథునిని ద, క్షిణకాశియందు దర్శించి మించి
చంపకారణ్య దుస్తర చిత్ర గంగా జ, లమ్ములఁ దోగి ముదమ్ము మీఱ

గీ. హరిహరులఁ గొల్చి యాపై మధురకువచ్చి, వేగవతి స్నానమాడి దేవి మీనాక్షి
సుందరేశ్వరులకు మ్రొక్కి సూడిద లిడి, ద్రవిడగిరి వెంకటపతి మొత్తముగఁ గొల్చి.

గీ. ఉభయ కావేరి మధ్యన యొప్పుమీఱు, రంగనాథుని గొల్చి కరంబు మీఱ
స్వీయ గృహదేతార్చా విభీషణ ప్ర, దత్త వృత్తాంతమును సీత కెఱిఁగించి.

గీ. మివుల మివులంగ బూజించి మించి యెలమి, మాతృభూతేశు జంబుకేశ్వరులఁ గొల్చి
తిరిగి రంగనాథులను వందించి పిదప, పఱఁగ అవినాశి కేతెంచి భక్తిగరిమ!

సీ. శ్రీరంగ పట్నముఁ జేరి హైమవతిలో, స్నానంబుఁ జేసి యచ్చటఁ గలట్టి
అమల సాలగ్రామ విమలార్చన మొనర్చి, రామనాథ మను పురంబుఁ జూచి
తరువాతను కుమార ధారలోన దిగి సు, బ్రహ్మణ్యస్వామి నారాధనంబు
సల్పి యుడిపి కృష్ణు సమ్యగర్చనచేసి, శృంగాభ్రమంబున తుంగ తీర

గీ. మందునన్ శృంగగిరిలో నమందభక్తి, శారదకు మ్రొక్కి నాపయిఁ జని ముదమున
కుంభకాశికి వెడలి నిక్కువపు భక్తి, పొదల కోటేశ్వరమునకు పోయి కడఁక.

సీ. అభవు సేవించి మూకాంబిక కెఱఁగి ముం, డేశ ధారేశ గౌరీశ్వరులను
గుణవతేశ్వరుని చరణములఁ గొల్చి స, ర్జేశ్వరు నత్యంత సేవఁ జేసి
గోకర్ణ విభుని సుధాకల్పముగ వేడి, హరిహరేశ్వర దేవు నర్థి మ్రొక్కి
సుమహాబలేశ్వరు సోయగం బీక్షించి, బహుళ తీర్థంబుల పఱఁగ మునిఁగి

గీ. పరశురాము మహేంద్రాఖ్య గిరిని జూచి, మ్రొక్కి భీమేశ్వరమునకుం బోయి పోయి
ధామ బలమూర్తి సేవించి తత్పరతను, క్రమత కొల్లాపురము మీదిగాఁగ నేగి.

క. కరవీర పురమునకు జని, కరమరుదగు కృష్ణవేణి ఘన సంగమ మం
దిరవుగ స్నానముచేసి అ, మర నికరము ప్రస్తుతింప మఱి మఱిఁ జనుచున్.

మ. లలిమీఱంగ విమానమందున గదా లక్ష్మీశ్వరంబేగి, యం
దుల నొప్పారు ఘటప్రభానదము నందున్ స్నానముల్సేసి, ఇ

మ్మూల పుణ్యస్థలముల్ చెలంగగ ముదంబుంగూర్ప, మల్లారి సు
స్థలవాసుఁ శివుఁగొల్చి, వే విధములన్ ధన్యాత్ములై ప్రేల్మిడిన్.

గీ. పాండురంగని గని చంద్రభాగలో మునింగి భీమానదీ భవ్య సంగమమున
కరిగి చందర్లఁ గని ప్రేమ పురముఁ జూచి, యచటి మార్తాండ శంకరు నభినుతించి

మ. నల దుర్గన్ కనువిందు గాఁగఁ గనుచున్, నానా విధార్చాసము
జ్జ్వలఁ గావించి భజించి, యుత్సవము లుత్సాహంబుగాఁ గూర్చి యా
తులజా భవ్యపురీ నివాసిని గడున్ స్తోత్రంబులం దన్పి, ని
ర్మల భక్తిన్ భజియించె నంబిక నొగిన్, మాణిక్య నామ్నామణిన్.

క. అంబాపురంబులోని వ,రాంబను యోగీశ్వరిని మహామహిమాఢ్యన్
బింబాధరన్ వరానన, కంబుకంఠి సారసాక్షిఁ గాంచి యవ్వుదలన్.

గీ. వైద్య నాథుని వందించి వంజరా స,ముద్ర సంగమ శరతీర్థముల మునింగి
వచ్చి నాగేశుఁ దిలకించి వావిరిలఁగ, లలిని దివ్యాభిషేకంబులన్ యజించి!

క. తన పేర నొక్క పురమును, ఘన గోదాతీరమున ప్రకాశిలగ నయం
బున నేర్పరించె వసతులు, కనువిం దొనరింప సకల కళ్యాణములన్.

సీ. అబ్జక క్షేత్రంబునందు స్నానము చేసి, యచటి త్రివిక్రము నభినుతించి
గోదావరీనదీ కూలంబు నందొక్క, రామపురంబు నేర్పరచి తఱచి
అంబికన్ చండిక నర్చించి యాత్మతీ,ర్థ స్నానమున కనంతరము పోయి
ఘనత విజ్ఞానేశ్వరుని గొల్చి శ్రీమహా,లక్ష్మి విలోకించి సూక్ష్మబుద్ధి

ఆ. బడబ సంగమునకు వెడలి ప్రతిష్ఠాన, పురముఁ గాంచి మైలపూర్వ సంగ
మమున మునిఁగి భక్తిమహితంబుగా శివ, నంద సంగమమున స్నానమాడి!

క. నరసింహుని గడుశ్రద్ధన్, పరిపూజించి తనపేర పరమ ప్రసిద్ధ
స్థిర తీర్థముఁగల ప్రవరా, వర సంగమమునకు వచ్చె వారని భక్తిన్.

క. శ్రీరాముఁడు సిద్ధేశ్వరు, నారాధన మాచరించి యభిమతముగ సు
క్షీర మధు శర్కరాయుత, నారికేళ తీర్థమునన యభిషేకించెన్.

క. నూపుర నివాస పురములు,గా పుణ్య స్థలములను సుఖమ్ముగఁ గనుచున్
శ్రీపుణ్య స్తంభము గో,దాపుణ్య నదీతటమున స్థాపించి వెసన్.

వ. కద్రూవినతా సంగమంబులకు జనస్థానంబునకు క్రమముగావచ్చి, త్ర్యంబక క్షేత్రముం జేరె.

గీ. దక్షిణపు దిక్కు రాజులందఱును గూడి, చేరి పూజింప మహితుఁడై శ్రీ రఘు ప్ర
భుండు వారిచ్చు కానుక ల్గొంచు వేడ్క,నందికొని చని వారలయందుఁ గడఁగి.

గీ. యాత్రలకు వారిఁగూడి ప్రయాణమైన, వారి నందఱ తనవెంట వరుసమీఱ
పుష్పకమున నెక్కించుకపోయె నిట్లు, దక్షిణపు యాత్రల ముగించె తగినరీతి.

క. అని రామదాసు పల్కిన, విని శిష్యుండైన యట్టి విష్ణుదాసు మిం
చిన భక్తి సద్గురూ! మీ, యనుగ్రహము మీఱ రామ యాత్రల వింటిన్.

శా. ఇంకన్ తక్కిన యాత్రలే పగిదిగా నిద్ధ ప్రజోపేతుఁడై
సంకల్పించి చరించి కాంచి యెసఁగెన్, సర్వప్రదేశంబులన్
శంకాతంకములేక దానములు శశ్వద్రీతి తీర్థంబులన్
పొంకంబొప్పఁ బొనర్చె? తద్విధములన్ పొల్పార వాక్రువ్వరే!

వ. అని ప్రశ్నించిన రామదాస సద్గురుం డిట్లనిచెప్పం దొడంగె!

# అష్టమ సర్గము

## రామదాసస్వామి విష్ణుదాసుని సందేహము నివర్తించుట

క. వినుచున్న విష్ణుదాసుఁడు, వినయముతో గురుని మ్రొక్కి విమల హృదయుఁడై
మనమున నొక సందేహముఁ, గనినాఁడ నివారణంబుఁ గావింపఁగదే.

ఆ. సజ్జనులు సతంబు సాధువులును దయా,స్వాంతు లగుట శిష్య సమితియందుఁ
గలుగుచుండునట్టి ఘనతర సందేహ, పరిహారణముసేతు రరిమురిగను.

సీ. యానాధిరూఢులై యాత్రలు సేయుట, శ్రేష్ఠంబు కాదని శిష్యతతికి
సద్గురూత్తమ! మీరు చాటి చెప్పితి రొక,సారి శ్రీరాముఁడు సకలజనుల
పుష్పకారూఢుఁడై పోవుచున్నాఁడేల?, అన రామదాసుఁ డిట్లను ముదమున
ఛత్ర చామర విరాజ ద్రాజరాజు కాల్నడకల నెచటికిం గడఁగరాదు

ఆ. మండలాధిపతి యొకండిష్టపడిన పో,వచ్చు కాలినడకవల్ల యాత్ర!
దేవునకును భూపతికి పెండ్లిలోపల, వరునకును మఠాధిపతికి తగదు.

క. కనుకన్ శ్రీరాముని యెడ,లను సందేహింపఁ జనదు జననాయకు నా
జ్ఞను వానివెనుకఁ జను వా,రును వెడలుట తప్పుఁగామి రూఢము శిష్యా.

క. జగదీశ్వరుండు రాముఁడు, నిగమాగమ వేద్యుఁడును వినిర్మల ధర్మ
ప్రగతి యసామాన్యస్థితి, నెగడింప జగాన నెవరు నేరరు శిష్యా!

క. పశ్చిమ దిగ్యాత్రాకథ, నిశ్చయింతు! నీదు శంక నెగ్గెనె? యన ఇం
దాశ్చర్యమేమి కలదు? త,పశ్చర్యా నిరతు లీరు! బ్రతుకునె? శంకల్.

## శ్రీరాముఁడు పశ్చిమ తీర్థయాత్ర చేయుచు వచ్చి పుష్కరము చేరుట

సీ. సూర్యుండు వచ్చినన్ జూపట్టునే యంధ,కారము గురువర్య! మీరుఁ దెల్ప
గురుతర శంకాత్త గిరులొక్క మొగిఁ గూలె, తరువాత కథ! యన్న గురుఁడు పల్కె
త్ర్యంబకమున నుండి రాముఁడు వెడలఁ దొ,డంగినన్ సీతాలతాంగి కోర్కె
నప్పర్వతంబున నొప్పుగా మూఁడు రాత్రములుండి పిదప సప్తశృంగ గిరి

ఆ. వెడలి యందునుండి విమలుఁ డగస్త్యాశ్ర,మమునకున్ సుతీక్ష్ణు మహితమైన
యాశ్రమంబుఁ జేరి యైలాపురముఁ జూచి, ఘనతరముగ ముదము పెనగొనంగ!

క. ఘృష్టేశ్వరుఁ బూజించి న,నష్టైశ్వర్యంబు లొదవు నని వాడుక వి
స్పష్టంబుగాన తత్ శివు, సాష్టాంగము గాఁగ మ్రొక్కి సంపన్నుండై.

మ. శివతీర్థంబున స్నానమాడి శుచియై, శ్రీరమ్యమై యొప్పు దే
వ వరేణ్యంబను పర్వతంబుఁ గని, దివ్యక్షేత్రమై యొప్పు న
ట్టివి,విర్జా మొదలైన యట్టి స్థలముల్ డీకొన్న భక్తిన్ మహా
సవిశేషంబగు శ్రద్ధఁ గన్గొని భజించన్ సాగె దేవిన్ గడున్.

శా. మాతా పట్టణదేవి వైభవ మసామాన్యంబుగాఁ జూచి, తా
సీతాదేవినిఁ గూడి రాఘవుఁడు దర్శించెన్ నృసింహున్ గడున్
ప్రీతాత్ముండయి దేవవాట నగరిన్ పెంపార సొంపార,సు
స్నాతుండయ్యె పయోష్ణి తాపినది జన్మస్థానమం దొప్పుగన్.

సీ. తనపేర నొక పర్వతం బేర్పరించి రే,వానదీ తీర్థాన స్నానమాడి
ఓంకార మందున నోంకారనాథు నా,రాధించి పశ్చిమ రమ్యములగు
వివిధ పుణ్యస్థలు లవలోకనమొనర్చి, తాపి సంగమమున తానమాడి
మహినది యందు నర్మద సంగమంబున, నవగాహ మొనరించి యవుల కేగి

గీ. అచ్చటి ప్రభాస తీర్థముఁ జొచ్చి పంచ, సంఖ్యలు సరస్వతీ దివ్యసంగమ స్థ
లమ్ములమునింగి సౌరాష్ట్ర మిమ్ములఁగని, చెలఁగి శ్రీ సోమనాథు దర్శించి మించి.

క. సాభ్రమతీ నదిలో దిగి, శుభ్రముగా స్నానమాడి సుందరతరముల్
విభ్రమ జనకంబులును న,దభ్రములగు పెక్కు పెక్కు స్థలములఁ గనుచున్.

క. శంఖోద్ధారమునకుఁ జని, శంఖ చంక్ర ధారి విష్ణుఁ చాగి వినతులన్
పుంఖాను పుంఖములుగా, ప్రేంఖధ్వను లెసగఁ గొల్చి పెంపుఁదలర్పన్.

మ. పిదపన్ రాముఁడు గోమతీనదిని సంప్రీతాత్ముఁడై స్నాన మా
డి దధీయ స్థలికిన్ సమీపమయి సృష్టిన్ గల్గు సప్తోత్తమా.

స్పద క్షేత్రంబుల నొప్పు ద్వారవతి మోక్షద్వారమా! యన్న నొ
ప్పు దలిర్పన్ గనిచొచ్చి, తీర్థవిధుల్ గా పూజించె పిత్రావళిన్.

ఆ. దానధర్మముల ననూనంబుగాఁ జేసి, పశ్చిమమున ఁగల్గు ప్రభువులెల్ల
తన్నుఁగొల్వ మెచ్చి తగ వారినందఱ, పుష్కరమునఁ జేర్చె పుష్పకమున.

ఉ. వారల నందఱన్ బిలచి వారని శ్రద్ధ సరస్వతీ తట
స్ఫార పవిత్రపుం స్థలు లపారముగా పరిశీల నంబునం
జేరి నతించి, యందట వసించు దయామయు భక్తవత్సలున్
శ్రీరమణీయు కేశవుభజించి యజించి యజేయ తేజుఁడై.

గీ. సర్వ నృపసమావృతుఁడయి సంతసించి, ప్రతిదినము కోట్లకొలదిగ బ్రాహ్మణులకు
అన్నపానీయముల చేత నహరహంబు, తృప్తిఁగావించుచుండ సువ్యాప్తిమీఱ.

శ్రీరామ పుష్పకమున వినోద చర్యాదికము

క. అప్పుష్పకము అయోధ్యం, జొప్పడు వారలను పూర్వజుల దక్షిణమం
దొప్పెడి రాజుల పడమటి, యప్పురిభువుల వారివారి నారయఁగొనుచుర్.

క. సైన్యంబులు పరివారము, లన్యులు వీరనగ నేల? నందఱ స్వజనం
బన్యజనంబని యెంచక, మాన్యంబగు శ్రద్ధమీఱ మన్నించుటయుర్.

సీ. ఎల్లరున్ శ్రీరామునిల్లు తామతిథులు, గాఁగ సంభావించి కడఁగు చుండ
వంట వేరేలే దెవరికిని తృణకాష్ఠ, జల చింతలేదు ఆకలి యనునది
చాలదే?యను చింత చాలమందికిఁ గల్గె, తత్తత్పదార్థ సంతర్పణముల
నందఱు నచ్చట మందు మాత్రము జీర్ణ, మగుటకు ప్రార్థింతు రనవరతము

గీ. నిరత వాద్యధ్వనులచేత నిద్రలేదు, అభినయ క్రీడ గీతా భయాకులాత్మ
లఖిల వారాంగనలు నహరహము రత్న, దీపకాంతులు వెల్గు రాత్రిం దివములు.

క. పగలును రాత్రి విమాన మ,రుగగా నాటంకమునుఁ నెరుంగరు రవ మొ
ప్పుగ చెవుల ననవరత మిం,పుగనాద బ్రహ్మపదవి పొలుపెసలారున్.

సీ. సస్వర వేదఘోషము వారనారుల, వేణు వీణాగాన విమలరవము
లాభరణ ధ్వను లఖిలవాద్యధ్వను, లావాహనముల ఘంటావళిధ్వని
వీరుల రావము ల్వెలయఁగహరి కీర్త,న స్వరంబులు రామ నామ జపము
పారాయణంబులు వందిమాగధ జన, జయనాదములు శిశుశ్రావ్య రోద

గీ. నధ్వనులు గోమహిష్యాది నవ్యదోహ, నధ్వనులు నారదాది వీణాధ్వనులును
రాణ సన్నాదములును యంత్ర ఘటికా ని,నాదముల నొప్పె పుష్పక నాదమహహ!

క. వివిధ కృత్య నారీనర, వివిధధ్వను లిటులు సెలఁగ విను వీధిని నా
ద విలాస బ్రహ్మము సు,శ్రవణ విలాసంబగుచుఁ గరంచె మనములన్.

క. వేకువ జామునను విమా,నా కలకల నాదమది వినం బడఁగా తా
మాకర్ణించిన పుష్కర, లోకంబిటులం దలంచె లోలోన గడున్.

సీ. కొండతేమిది మహానంది ఘంటాధ్వని, వినవచ్చు చున్నదో? వినుడటంచు
ఇంద్రుఁ డెచ్చటికో తానేగి దివముఁ జేర, వెడలుచున్నాఁడకో? వినుడటంచు
గగన గానంబది కడగి రంభాదులు, విచ్చేయు చున్నారొ? వినుడటంచు
గంధర్వులు విమానగతి సంచరింతురు, వివరంబుగా మీరు వినుడటంచు

గీ. మేఘ గర్జ మైరావత బృంహితంబు, ప్రళయరహిత సాగర ఘోష పవనతనయ!
హాళహాళి! గారుడనినాదపాళి! నాగ,కన్యకల గానమని వితర్కములుఁ గనిరి.

చ. అనుకొనినంతసేపు గన కందఱు శ్రీ రఘురాము పుష్పకం
బును గని మోదమంది, పరిపూర్ణ మనఃకమలంబు విప్పనం
దిన, యటు మోము దమ్ములును దృక్కులు విప్పి వచింపగా, నుపా
యనములనంది ప్రేమమున నా జయరాముని గాంచి రందఱున్.

సీ. తమ జన్మసాఫల్యతను బొందెనని పుష్క,ర నివాసులెల్ల కరంబు మెచ్చ!
సంతుష్టుఁడై రామచంద్రుండు బ్రాహ్మణో,త్తములకు వందించి తగ చెలంగ!
వరుసనే తత్తీర్థవాసులతో పుష్క,రమునకు నేగి సక్రమము మీఱ!
తీర్థశ్రాద్ధముల యథార్థ క్రమంబున, పితరులకెల్ల సంప్రీతిఁ గూర్చి

ఆ. కాశిపట్టణమున కన్న కోటింతలు, దానధర్మముల ననూనముగ నొ
నర్చె! నన్నవస్త్ర నవ్య దివ్యాభర,ణాను లేపనము లనంతములుగ.

క. సీతయు ముత్తైదువులకు, ప్రీతిన్ సకలార్థముల పొరింబొరి యొసఁగెన్
ఖ్యాతంబగు నా పుష్కర, చేతం బలరంగ సంతసిల్లి జనంబుల్.

క. ఉత్తర యాత్రార్థముగ ర,ఘూత్తముఁ డా తీర్థవాసకోత్తమ్ముల ప్ర
త్యుత్తర మనుజ్ఞలం గొని, చిత్తము రంజిల ప్రయాణ సిద్ధుం డయ్యెన్.

క. ఇది పశ్చిమ దిగ్యాత్రా, స్పదమగు కథ విష్ణుదాస! కమనీయ ముద
ప్రదమగు నుత్తర యాత్రా, గదిత వివిధ విషయ శ్రోతృకతఁ గయికొమ్మా!

## నవమ సర్గము

### శ్రీరాముఁడు హిమాలయమున బదరికాశ్రమాదుల చూచుట

సీ. తరువాత రాముఁ డుత్తర దిశాభిముఖము,గా నేగి పుణ్యస్థలీ నిచయము
దర్శించుచును పర్వత ప్రసిద్ధములగు, తీర్థంబులకు వచ్చి దివ్యమైన

జ్వాలాముఖికిఁ బోయి సకల క్షేత్రంబుల, దర్శించుచును కడు తప్తమైన
శ్రీ మణికర్ణికం జేరెను; కరతోయ, నదిని వేడుకను స్నానం బొనర్చె

గీ. అన్నదిని దాటి యేగుట లెన్న దోష, మనుచు వినియుంట ముందుకుఁ జనరటన్న
విని మహాత్మ! తద్దోష మేమని యడిగిన, శిష్యునికి రామదాసు తా చెప్పెనిట్లు.

సీ. కర్మతో యానది కరముచే స్పృశియింప, దోషంబుగా చెప్పుదురు ఘటికులు
కర తోయ నామక వరనదిం దాటుట, దోషంబుగా చెప్పుదురు ఘటికులు
గండకీనది పొసగఁగ బాహు తరణంబు, దోషంబుగా చెప్పుదురు ఘటికులు
తాను చేసినయట్టి ధర్మము చెప్పుకో, దోషంబుగా చెప్పుదురు ఘటికులు

గీ. అందుచే వెనుదిరిగి ప్రయాగ వచ్చి, అలకయను నదీ తీరమునందు నొప్పు
తృటిని దర్శనమాత్ర ముక్తి ప్రదమగు, బదరి నరనారాయణ పదములఁ గని.

శా. నానాధాతు విచిత్ర చిత్రితము, గంధర్వాది సేవ్యంబు, వి
జ్ఞానస్థాన మహాపథంబుఁ గని మెచ్చన్వచ్చు కేదార నా
థానుగ్రాహకతం బరంగి దురిత ధ్వాంతాపహారంబు గం
గా నద్యా సరయూ జనుస్థల మనఃకాసార సందర్శియై.

సీ. ఎచ్చోట విహరించు నెలమిమై రాజహం,సాళి కనక కమ లాన్నలీల!
ఎచ్చోటిని సమాశ్రయించి దేవతలు గం,ధర్వ కిన్నరులు నిత్యము చరింత్రు!
ఎచ్చోటి అచ్చర మచ్చెకంటుల తోడ, దేవతల్ క్రీడలఁ దేలియుంద్రు!
ఎచ్చోట హంసలు నిచ్చలు ముక్తాప్ర,భక్షణం బున తృప్తి బఱఁగియుండు!

గీ. అట్టి మానస దివ్య సరాంబువుల ని, మజ్జనం బాచరించి రామయ్యతండ్రి!
బిందు భవ్య సరోవరంబందు మున్గి, దాన ధర్మాది సత్కర్మతతిఁ దలిర్చె.

ఉ. మేరు సభా ప్రభావితతి మించి చెలంగిన యట్టి ఫుల్లితాం
భోరుహ గర్భసంభవుని పూజ్య సభం దిలకించి, సీతయుం
జేరి నమస్కరింప, నతిజేసిరి రాఘవరామసంయుత
శ్రీ రమణీయ పుష్పకముఁ జెన్నలరారెడి సభ్యులెల్లరున్.

గీ. పుష్పకము దిగి భక్తి నంబుజ భవుండు, కలసి దేవేంద్రుతో నమస్కార వితతు
లిడెడు బ్రహ్మదేవుని సమాలింగితాంగు,జేసి వారి నందఱ బ్రశంసించెఁ గడఁక.

## శ్రీరాముఁడు కైలాసమున రుద్రునిచే సత్కరింపబడుట

సీ. బ్రహ్మదేవుండు శ్రీరాముని మిపుల స,త్కారాళి పూజించి తనివిసనక
కామధేనువును కాన్కగ నిచ్చె రఘుపతి, యద్దాని పుష్పకంబందు నిల్పె
బ్రహ్మాది దేవత ల్భజియింప రాముఁడు, కైలాసమున కేగ శాంతు సేయ
వచ్చు శ్రీరామునిఁ జెచ్చెర తిలకించి, పార్వతితో వృషభంబు నెక్కి

క. వివిధ కృత్య నారీనర, వివిధధ్వను లిటులు సెలఁగ విను వీధిని నా
ద విలాస బ్రహ్మము సు,శ్రవణ విలాసంబగుచుఁ గరంచె మనములన్.

క. వేకువ జామునను విమా,నా కలకల నాదమది వినం బడఁగా తా
మాకర్ణించిన పుష్కర, లోకంబిటులం దలంచె లోలోన గడున్.

సీ. కొండ తేమిది మహానంది ఘంటాధ్వని, వినవచ్చు చున్నదో? వినుడటంచు
ఇంద్రుఁ డెచ్చటికో తానేగి దివముఁ జేర, వెడలుచున్నాఁడకో! వినుడటంచు
గగన గానంబది కడగి రంభాదులు, విచ్చేయు చున్నారొ? వినుడటంచు
గంధర్వులు విమానగతి సంచరింతురు, వివరంబుగా మీరు వినుడటంచు

గీ. మేఘ గర్జ మైరావత బృంహితంబు, ప్రళయరహిత సాగర ఘోష పవనతనయ!
హాళహాళి! గారుడనినాదపాళి! నాగ,కన్యకల గానమని వితర్కములుఁ గనిరి.

చ. అనుకొనినంతసేపు గన కందఱు శ్రీ రఘురాము పుష్పకం
బును గని మోదమంది, పరిపూర్ణ మనఃకమలంబు విప్పనం
దిన, యటు మోము దమ్ములును దృక్కులు విప్పి వచింపగా, నుపా
యనములనంది ప్రేమమున నా జయరాముని గాంచి రందఱున్.

సీ. తమ జన్మసాఫల్యతను బొందెనని పుష్క,ర నివాసులెల్ల కరంబు మెచ్చ!
సంతుష్టుఁడై రామచంద్రుండు బ్రాహ్మణో,త్తములకు వందించి తగ చెలంగ!
వరుసనే తత్తీర్థవాసులతో పుష్క,రమునకు నేగి సక్రమము మీఱ!
తీర్థశ్రాద్ధముల యథార్థ క్రమంబున, పితరులకెల్ల సంప్రీతిఁ గూర్చి

ఆ. కాశిపట్టణమున కన్న కోటింతలు, దానధర్మముల ననూనముగ నొ
నర్చె! నన్నవస్త్ర నవ్య దివ్యాభర,ణాను లేపనము లనంతములుగ.

క. సీతయు ముత్తైదువులకు, ప్రీతిన్ సకలార్థముల బొరింబొరి యొసఁగెన్
ఖ్యాతంబగు నా పుష్కర, చేతం బలరంగ సంతసిల్లి జనంబుల్.

క. ఉత్తర యాత్రార్థముగ ర,ఘూత్తముఁ డా తీర్థవాసకోత్తమ్ముల ప్ర
త్యుత్తర మనుజ్ఞలం గొని, చిత్తము రంజిల ప్రయాణ సిద్ధుం డయ్యెన్.

క. ఇది పశ్చిమ దిగ్యాత్రా, స్పదమగు కథ విష్ణుదాస! కమనీయ ముద
ప్రదమగు నుత్తర యాత్రా, గదిత వివిధ విషయ శ్రోతృకతఁ గయికొమ్మా!

## నవమ సర్గము

### శ్రీరాముఁడు హిమాలయమున బదరికాశ్రమాదుల చూచుట

సీ. తరువాత రాముఁ డుత్తర దిశాభిముఖము,గా నేగి పుణ్యస్థలీ నిచయము
దర్శించుచును పర్వత ప్రసిద్ధములగు, తీర్థంబులకు వచ్చి దివ్యమైన

జ్వాలాముఖికిఁ బోయి సకల క్షేత్రంబుల, దర్శించుచును కడు తప్తమైన
శ్రీ మణికర్ణికం జేరెను; కరతోయ, నదిని వేడుకను స్నానం బొనర్చె

గీ. అన్నదిని దాటి యేగుట లెన్న దోష, మనుచు వినియుంట ముందుకుఁ జనరటన్న
విని మహాత్మ! తద్దోష మేమని యడిగిన, శిష్యునికి రామదాసు తా చెప్పెనిట్లు.

సీ. కర్మతో యానది కరముచే స్పృశియింప, దోషంబుగా చెప్పుదురు ఘటికులు
కర తోయ నామక వరనదిం దాటుట, దోషంబుగా చెప్పుదురు ఘటికులు
గండకీనది పొసగఁగ బాహు తరణంబు, దోషంబుగా చెప్పుదురు ఘటికులు
తాను చేసినయట్టి ధర్మము చెప్పుకో, దోషంబుగా చెప్పుదురు ఘటికులు

గీ. అందుచే వెనుదిరిగి ప్రయాగ వచ్చి, అలకయను నదీ తీరమునందు నొప్పు
తృటిని దర్శనమాత్ర ముక్తి ప్రదమగు, బదరి నరనారాయణ పదములఁ గని.

శా. నానాధాతు విచిత్ర చిత్రితము, గంధర్వాది సేవ్యంబు, వి
జ్ఞానస్థాన మహాపథంబుఁ గని మెచ్చన్వచ్చు కేదార నా
థానుగ్రాహకతం బరంగి దురిత ధ్వాంతాపహారంబు గం
గా నద్యా సరయూ జనుస్థల మనఃకాసార సందర్శియై.

సీ. ఎచ్చోట విహరించు నెలమిమై రాజహం,సాళి కనక కమ లాన్నలీల!
ఎచ్చోటిని సమాశ్రయించి దేవతలు గం,ధర్వ కిన్నరులు నిత్యము చరింత్రు!
ఎచ్చోటి అచ్చర మచ్చెకంటుల తోడ, దేవతల్ క్రీడలఁ దేలియుంద్రు!
ఎచ్చోట హంసలు నిచ్చలు ముక్తాప్ర,భక్షణం బున తృప్తి బఱఁగియుండు!

గీ. అట్టి మానస దివ్య సరాంబువుల ని, మజ్జనం బాచరించి రామయ్యతండ్రి!
బిందు భవ్య సరోవరంబందు మున్గి, దాన ధర్మాది సత్కర్మతతిఁ దలిర్చె.

ఉ. మేరు సభా ప్రభావితతి మించి చెలంగిన యట్టి ఫుల్లితాం
భోరుహ గర్భసంభవుని పూజ్య సభం దిలకించి, సీతయుం
జేరి నమస్కరింప, నతిజేసిరి రాఘవరామసంయుత
శ్రీ రమణీయ పుష్పకముఁ జెన్నలరారెడి సభ్యులెల్లరుణ్.

గీ. పుష్పకము దిగి భక్తి నంబుజ భవుండు, కలసి దేవేంద్రుతో నమస్కార వితతు
లిడెను బ్రహ్మదేవుని సమాలింగితాంగు,జేసి వారి నందఱ బ్రశంసించెఁ గడఁక.

## శ్రీరాముఁడు కైలాసమున రుద్రునిచే సత్కరింపబడుట

సీ. బ్రహ్మదేవుండు శ్రీరాముని మిపుల స,త్కారాళి పూజించి తనివిసనక
కామధేనువును కాన్కగ నిచ్చె రఘుపతి, యద్దాని పుష్పకంబందు నిల్పె
బ్రహ్మాది దేవత ల్భజియింప రాముఁడు, కైలాసమున కేగ కాంక్షసేయ
వచ్చు శ్రీరామునిఁ జెచ్చెర తిలకించి, పార్వతితో వృషభంబు నెక్కి

గీ. ఎదురుగా వచ్చె నా పరమేశ్వరుండు, శివునిజూచి శ్రీరాముఁడు శీఘ్రముగ వి
మానముం డిగ్గి మ్రొక్క నమ్మహితుఁడుఁగడు, ప్రీతినాలింగన మొనర్చె శ్రీరఘుపతి.
గీ. పార్వతియు సీత కౌఁగిలిఁబట్టి కోటి, సూర్య సమకాంతి భూషణాస్తోక వస్త్ర
తతుల సత్కార మొనరించె ధన్యమాన,సాబ్జయై తాను తరియించినట్టు లెంచి.
సీ. కమ్మ లందియలును కడియముల్ తలతొడవు,వులు నొడి నూలు నింపులఁ దనర్చు
సూర్యచంద్రులను నిస్తుల హారములను పా,పటబొట్టు మొదలగు భవ్య రత్న
శోభితాలంకార శోభితఁ గావించె, సవిభవంబుగ సదా శివుఁడు రాము
నర్చించి రామచంద్రా! భవన్నాభీ క,మలమందు బ్రహ్మ నిర్మాణమయ్యె
గీ. అవ్విధి వలన యుద్భవంబైన నేను, రోదనముచేయుటను గాదె! రుద్రుఁడనిరి
నీకు మనుమఁడ! నీ యాజ్ఞ నిర్వహింతు, నఖిల సంహారకార్య మిట్లధికరింతే?
మ. అనినన్ రాముఁడు శ్రీమహేశ్వర! రణంబం దొప్పగా రావణున్
హననంబుం బొనరించుటన్ వెడలితిన్ యాత్రార్థినై పాప నా
శనమున్ పుష్యమునొంద, నిన్ను గనుటన్ సంతృప్తి కల్గెన్ మఱిం
దును నా కంటవు పాపముల్, సుకృత మస్తోకంబు నే నొందితిన్.
క. ధన్యుఁడను సాంబశివ! నే, ధన్యుఁడ కైలాసవాస! తావక కృప సా
మాన్యమె? నీ దయచేతన్, మాన్యుఁడ! మానవులలోన మహితుఁడ! నైతిన్.
క. అని పల్క రామచంద్రుం,గని సాంబశివుండు పల్కె ఘనతలు చాలున్
నను బెద్దసేయుటలు నీ, మనుమని నీకిట్టి ముద్దు! మర్యాదగదా.
ఆ. దుష్ట శిక్షణమును శిష్ట రక్షణమును, సేయ నవతరించి చెలఁగు నీకు
రావణుని వధింప బ్రహ్మహత్యా మహా,పాతకంబు కల్గు హేతు వెద్ది?
క భక్తుల రక్షించునటుల, రక్తిన్ ధూర్తుల వధించి రమణీయంబౌ
ముక్తినిడు వాఁడ వకటా!, సక్తి కలదె? నీకు కార్యసరణిన్ రామా!
క. క్రీడింతు విట్లు జగమున, వేడిన దేవతల భక్తవితతి యభీష్ట
క్రీడామతివై నీకున్, లేఁడు శత్రుఁడనగ మిత్ర లేశము! రామా!
ఆ. లోక శిక్షణమున కీకరణిన్ నటిం,తువు మహాత్మ! యాత్ర దొట్టి మమ్ము
చేసితివి కృతార్థ సిద్ధుల మము; సీత, తోడ సుఖివిఁగమ్మ! తోయజాక్ష!
క. ఈవిధిని శంకరుఁడు నా,నావిధములచే స్తుతించి నానా రాజ
శ్రీ విభవ ఛత్రచామర, భావిత సింహాసనాది బహుమతు లిడిమెన్.
వ. కిరీటాది దివ్యాభరణంములను, మంచకాది రాజోప చారోచిత పదార్థంబులను, దివ్యా
భరణంబుల నొసంగి, మెడయందు చింతామణిం గట్టి శ్రీరామునిం బ్రయాణము
చేయించి పంపె, నపుడు సీతాదేవి నవ్వుచు నిట్లనియె.

## శ్రీరాముఁడు హరిద్వారా ద్యుత్తర తీర్థయాత్రల సేయుట

ఆ. నీకు చింతామణి నాకు కామగవియు, కమలభవుఁడు భవుఁడుఁ గడఁగి యిచ్చు
పారితోషకములు మీరె కైకొందురా?, ఒకటి నాది మీవులు నొకటి మీది.

సీ. అన నపారానందమున దేలుచును రాము,ఁడు విమానమెక్కె నిండుముద మొప్ప
సకల జనంబులు జతఁగూడి రఘుపతి, శంకరు సాష్టాంగ సరణి మ్రొక్కె
యజ్ఞంబులిక సల్పు నాస్థ యున్నదని బ్ర,హ్మాను భవు నింద్రు రమ్మని వచించి
చనియె గంగాతీరమున హరిద్వారంబు,నకు కురక్షేత్రంబునకును వెడలి

గీ. ఇంద్ర ప్రస్థము మధువన మీక్షణంబు, సల్పి, బృందావనముఁ జొచ్చి, చక్కఁగోకు
లమ్ముఁగాంచి, శ్రీగోవర్ధనమ్ము పర్వ,తంబుఁ జూచి, క్షిప్రాతీర తలముఁజేరె.

గీ. పుణ్యాదంబా నవంతికాపురముఁ జూచి, యందునున్న మహాకాళు నభినుతించి
యచటి తీర్థంబులందెల్ల నాడి కూడి, సంతతానంద విహ్వాల స్వాంతుఁడయ్యె.

గీ. వారణ క్షేత్రముం జూచి వారుణమను, కూప మీక్షించి, నైమిశ శ్రీపవిత్ర
పుణ్యము నగణ్యమైన యరణ్యముఁ గని, గోమతీ తీర్థమజ్జనం బామెయిఁగని.

క. పౌరాణిక సత్తముఁ డగు, ధీరుని సూతుని మహామతిఁ శౌనక వి
స్తారుల మానుల ఘన స,త్కారంబుల పూజచేసి ధన్యుండగుచున్.

గీ. బ్రహ్మ వైవర్త సరసీ శుభ ప్రదాంబు,వులఁ గడున్ భక్తిశ్రద్ధల జలకమాడి
భవ్య తమసానదీ స్నానపరత నంది, సౌఖ్యముగ నయోధ్యా ప్రదేశంబుఁ గనిరి.

## శ్రీరాముఁడు సమస్త పరివారములను ప్రజలను తృప్తులం జేయుట

క. విజయప్రదముగ వచ్చెడి, నిజ జననాయకుని రాముని గనుచు సుమం
త్రి జయధ్వజ తోరణ స,త్స్రజ మాలా శోభితముగ సల్పె నయోధ్యన్.

సీ. రాజమార్గంబుల రమణీయ చందన, రసలిప్తములుగ పొల్పెసగఁ గూర్చె!
పుష్ప వికీర్ణమై పొల్పెసలారంగ, బలిదీపముల నల్లడల నమర్చె!
సకల సేనావృత సమలంకృతంబైన, పట్టపేనుగు ముందుఁ బెట్టుకొనియె!
పుష్పకస్థితుఁడగు పురుషోత్తముని దశ,రథరాము స్వాగతవిధి భజింప

గీ. నడచి, సాష్టాంగ దండ ప్రణామముం బొ,నర్చి కానుక లర్పింప న్యాయరీతి
నతని నాలింగనముసేసి యతులితమగు, తృప్తిఁ దేలెను రామమూర్తి బహుళముగ.

క. మంగళవాద్య రవంబు లె,సంగగ వేశ్యానికరము సమరసములతో
సంగీత నృత్యముల గూ,ర్పంగా బ్రాహ్మణుల వేదపాఠము లెసఁగన్.

క. సరయూనదిలో నిత్య, స్ఫురదురు కర్మార్థము మును పొలుపారఁగ నే
ర్పరచిన స్వనామ వర తీ,ర్థరాజమున స్నానమాడి రమణీయముగన్.

చ. గురుఁడు వశిష్ఠమౌని పలుకుంగొని యొక్క యుపోష్యముండి, య
మ్మరుసటినా ఁడొనర్చి దధి మన్నుఖ శ్రాద్ధ, మనేక దాన ధ
ర్మరతిఁ జరించి, మూఁడవ సమంబగు నాఁడు విమానమెక్కి, సుం
దరతరమైన పట్టణమతంద్రతఁజేరె జగంబు మెచ్చఁగన్.

శా. ప్రాకారంబు నతిక్రమించి, వివిధ ప్రాచీన దేవాలయ
ప్రాకారాద్భుత గోపుర ప్రకర శోభాయంబు, సౌవర్ణ ర
త్నాకలోజ్వలరాజిత ప్రథిత హర్మ్యానీక సౌగంధిక
వ్యాకీర్ణంబు, కనుంగొనె న్విభుఁ డయోధ్యాపట్టణం బర్మిలిన్.

గీ. రాజితాట్టాలకోపేత రామణీయ,కంబు, తన రాజధాని పొంకంబు మీఱఁ
గాంచి యానంద పడుచుండఁ గాంచె రాజ,కీయ దివ్య సభామఖామేయ దీప్తి !

క. రాజ సభాద్వారమున వి,రాజిలఁగ విమానము దిగి రంజిల్లుచు వి
భ్రాజిత సుమంత్ర పత్నీ, తూజితదధ్యన్నబలి నియోజిత విధులై.

సీ. కంచు పాత్రములలో నించిన దధ్యన్న, బలులను జలఘటంబులను తైల
ఘటముల సీతఁ రాఘవుల నివాళించి, చుట్టి దూరమ్ముగా చూఱవిడిచి
అభ్యంగన స్నాన మాచరించి పిదప, రామ మందిరమున కామెయిఁ జని
చింతామణీ విరాజితుఁడగు రాముఁడు, పుష్పకంబు దిగి తమ్ములను నాగ

గీ. రికులరాజులఁ గైకొని సకల బంధు,మిత్ర పరివారములుఁగూడ మేలుఁజెంది
తన సభాభవనంబున దర్పమొందె, సరసపథవర్తి ! శ్రీరామచంద్రమూర్తి !

గీ. జానకీదేవియును కామధేనువుఁగొని, దివ్యరత్న సమాలం కృతిని వెలుంగు
స్వీయ మంతః పురము ప్రవేశించె నంత,యాత్ర లన్నియు పూర్తియైనందు కలరి.

సీ. శ్రీరామచంద్రుఁడు చెలువొప్పఁగా కామ,ధేను సంభూత మాదివ్య నవ్య
ఘృత పక్వ పరమాన్నతతులచే షడ్ర సో,పేత భోజనములచేతఁ జెలఁగి
బ్రాహ్మణోత్తమ సమరాధనఁ జేసి యా, చండాల పర్యంత జనులకెల్ల
తృప్తిఁగావించి తృప్తిని దాను భుజియించి, పుష్పకంబున రాజ పుంగవులకు

గీ. చెలఁగు సుఖనిద్ర చెందెడు స్థలమొనర్చి, ఐదురోజులు తనయొద్ద నందఱిని ని
వాసముగ నుంచి భూషణ వసనవితతి,వారి నమ్మాన మొనరించి వారిఁజూచి.

శా. నా యజ్ఞాశ్వముఁజూచి దాని వెనుకన్ నా వచ్చువా రందఱిన్
నా యాజ్ఞం గొని మీఱు లందఱు ససైన్య శ్రీ పరివారులై
నా యజ్ఞంబులఁ జూడరావలయు ! ధన్యంబయ్యె ! నా జన్మ మీ
రీ యాత్రావళిఁగూడి నిక్కము ! కృతార్థీ భూతునిం జేయుటన్.

క. అని పల్క వారు రామా,జ్ఞను శిరసునఁ దాల్చి వారి జనపథములకున్
జనిరి కాని కిష్కింధా, ఘనవాసులతోడఁ బల్కెఁ గరిమన్ విభుఁడున్.

సీ. మిమ్ములనశ్వమేధమ్ము సమాప్తమ్ము,గాఁగ పంపింతు నో కపికులాగ్ర
జన్మ! సుగ్రీవ! యట సరసోక్తి కలరి వా,రెల్ల శ్రీరాముని యుల్ల మలర
వారికి చూపిన వసతుల లోపల, విడియించి యుండిరి విశదమతిని
పిదప శ్రీరాముఁడు ప్రియమొప్ప నిట్లను, నా రాజ్యమున్నంత కేరుఁగాని
గీ. పథికులు అయోధ్యయందు నెప్పటికిఁ గాని, నా నియామకమగు భోజన ప్రదత్త
సత్రములఁగాక వేరు భోజనము సేయఁ, జన దనుచు సాటఁబంపె! పట్టణమునెల్ల.
క. తమతమ గృహస్థధర్మం, బమలముగా నడపుకొనెడి పట్టణవాసుల్
తమతమ వంటలలో నొ,ప్పమరగ భుజియింపవచ్చు నటుఁగాకున్నన్.
గీ. నాదు నిర్బంధము వలదు నర్మిలిని య,థా సుఖంబుగ జనులెల్ల ధర్మబుద్ధి
నుంపుదురుఁ గాత! మన,లక్ష్మణుండు భేరి,మ్రోతతో చాటఁబంపె సమ్మోద మొదవ.
ఆ. ఇట్టులూరి వారహీన ధర్మోపేతు,లై తలిర్ప రాముఁడవని యేలె
సీతతోడ సుఖ సమేతుఁడై వర్తిల్లె, పెక్కు వత్సరములు ప్రీతిమీఱ.
ఉ. ఎప్పు డయోధ్యయం దెచట నేపుగఁ గాంచిన వేదఘోషమే!
ఎప్పు డయోధ్యయం దెచట నేపుగఁ గాంచిన నృత్య గీతమే!
ఎప్పు డయోధ్యయం దెచట నేపుగ గాంచ పురాణ గోష్ఠియే!
ఎప్పు డయోధ్యయం దెచట నేపుగ శ్రీహరి కీర్తనమ్ములే!
సీ. సాకేత మట్టుల సానందమై యొప్పె, శిష్య! శ్రీరాముని శ్రేష్ఠమైన
ఉత్తర యాత్రతో మొత్తంపు యాత్రా చ,రిత్రమ్ము తెల్పితి శ్రీఁదలిర్ప
ఇట్టి యాత్రా కాండ మెవ్వాఁడు భక్తితో, వినుచుండునో వాఁడు విమల యాత్ర
లెల్ల చేసిన ఫలమెల్ల నందెడిని స,మస్త పాపంబుల నిస్తరించు
ఆ. యాత్ర కాండవిన్న పాత్రులు సర్వతీ,ర్థముల స్నానఫలము విమలక్షేత్ర
దర్శనంపు ఫలము దవిలియుండుదురు శ్రీ,రాము కరుణఁ గలిగి రంజిలుదురు.
క. ధనకాముకులు ధనమ్మును, తనరంగా పుత్రకామ తత్పరులు సుతా
ప్తిని బొందువార లౌదురు, ఘన పాపాత్ములును ముక్తిఁగందు రమలులై.
ఆ. నిత్య కర్మలెల్ల నిర్వహించి యెవండు, భక్తిఁ దీనినెల్ల పఠనసేయు
వాని కోర్కులెల్ల వరుస శ్రీరాముఁడ,ను గ్రహించు దురిత నిగ్రహమున.
క. ఎవఁడీ యాత్రా కాండము, శ్రవణముఁ గావించు భక్తి, జన్మాంతర పా
ప విముక్తిఁ గాంచు సద్గతి, నవిరళ సుఖ మనుభవించు నంతము నందున్.

గద్యము

ఇది బాలభారతీ వరప్రసాదలబ్ధ కవితా ధౌరేయ పండిత చిలుకూరి శ్రీరామశాస్త్రి
నామధేయ ప్రణీత శ్రీమదాంధ్రానంద రామాయణాంతర్గత
యాత్రాకాండము.

# ఆనంద రామాయణము



## యాగ కాండము

### ప్రథమ సర్గము



కరముగ యాత్రలసల్పి చేరి,యవల,నొక్క శుభముహూర్తమున సొంపెక్క రామ
చంద్రమూర్తి వశిష్ఠు నిస్తంద్ర భక్తి, మ్రొక్కి ఇట్లను నిజ సభాముఖమునందు.

క. కుంభోదరు నుడి యాత్రా,రంభుఁడనై సర్వ యాత్రలన్ సల్పి శుభా
రంభుండనైతి యాగా,రంభుఁడ నయ్యెద మహర్షి రమ్యాజ్ఞ మెయిన్.

గీ. వాజి మేధంబుసేయ కావలసినట్టి, సకల సామగ్రి లక్ష్మణస్వామి కూర్చు!
తెలుపుఁ డతనికి శుభము నిస్తులమునైన, యట్టి సుముహూర్తమఱసి మహర్షివర్య!

వ. అని వచించిన.

క. శ్రీరాము వచనమును విని, భూరి శుభముహూర్తమును ప్రభుని సన్నిధి ని
ర్ధారించి లక్ష్మణుఁడు వినఁగా రమ్యోక్తుల గురుండు కడఁగి యిటు లనున్.

వశిష్ఠుఁడు యజ్ఞోపకరములను లక్ష్మణునికి చెప్పుట

సీ. నేటి కేడవనాఁడు నిర్ణయించిరి సుమా! దైవజ్ఞు లశ్వమేధం బొనర్ప
రమణీయ శుభముహూర్తము! శ్రీరఘూత్తము, నాజ్ఞ తత్సిద్ధికై యజ్ఞ నిర్వ
హణమున కగు సమస్తార్థంబులును రామ, తీర్థ ప్రదేశ సందీప్తము లగుఁ
గాత! మున్ను హలాళిచేత ప్రదేశము, పది క్రోసులున్ దున్నఁబడునుఁగాత!

గీ. ఇట్లు పరిశోధన మొనర్చి ఇసుకలేని, స్థలము సమమొనరించి యంతట నఖండ
మంటపమ్మును మొదట నిర్మాణపఱచి, దానిని అలంకరింపంగఁ దగు కుమార!

క. ఆ మంటపమం దెల్లెడ, మామిడి నేరేడు లేత మండలతో పు
ష్పామల హారంబులతో, నామెయి కదళీతరుల మనం బలరారన్.

క. చక్కఁగ నలంకరింపుఁడు, ఎక్కడ కనుఁగొన్న ఫలములే కానఁబడన్
పెక్కగు తిన్నెలు మన ఋత్విక్కులు కూర్చుండ నందు వెలయింపఁదగున్.

ఉ. మృణ్మయ హేమకుండముల మీదను గోముఖమున్ రచించి, హై
రణ్మయ యజ్ఞపాత్రములు రమ్యములై వెలయన్ వలెన్, సుహో

రిణ్మయ చర్మశోభిత ధరిత్రి తలంబు, మునీంద్రపాళి శి
ష్యోణ్మణు లుల్లసిల్లఁ దగి యుండవలెన్ కమనీయ దృశ్యమై.

క. ఉపధాతు చూర్ణములను క,లిపి స్వస్తిక శంఖ చక్ర రేఖాష్టదళ
ప్రపదములగు ముగ్గుల ను,ట్టిపడన్ రమణీయకతఁగడిఁదిఁ గూర్పవలెన్.

సీ. యాజ్ఞికమా భూమియం దంతటను పుష్ప,ములు చల్లగాఁ బడవలయు వత్స!
శ్రేష్ఠ సువర్ణ నిర్మిత భవ్యముక్తాద్య,లంకృత స్తంభా లలర వలయును!
కుండ మధ్యమున నుద్దండాశ్వ దేవతా,కము సర్వతోభద్ర మమరవలయు;
వరుణ యాగములోని వాటికి వలెనె పూ,రియు పెంకుటిండ్లు వలయు నెసంగి;

గీ. పర్ణశాలలు నటనటఁ బరఁగవలయు!, పాకశాల భోజనశాల వస్త్రశాల
స్త్రీల శాల లుగ్రాణముల్ ఋషులశాల, నృప సభాదుల వేగ చిత్రింపవలయు.

సీ. రాజయోగ్యములగు రమణీయ తూలికా, తల్పంబులును, మహాత్తమములైన
రత్నకంబళములు రాజిల్లవలెఁ గొప్ప, అన్నోపకరణము లందవలయు
పానపాత్రంబులు పక్వ ఫలాదులు, పరిమళ సద్వస్తు పరికరములు
నలుగు పిండ్లూరగాయలు నవ్యవ్యంజన,ములును వింజామరములు మొదలుగ

గీ. గాజు కుప్పెలునన్ పానకములు వలయు! నృప సభార్హ వస్తువులు సన్నిహిత పరుప
వలయు! జలయంత్రములు, పూల మట్టితొట్ల, ధూపద్రవ్యాదు లుంచగా నేపుమీఱ.

క. సాలంకృతాప్సరయుత, స్త్రీలున్, శుభవాద్యములును, ఋషి సభలందున్
మేలు సమిత్కుశ దండా,భీల బహిర్వాస ముఖ వివిధ వస్తువులున్.

గీ. దంతశుద్ధి కాష్ఠంబు లనంతములుగ, గైరికాది ముఖ విశుద్ధికర పరికర
వితతి కౌపీన వల్కల వితతి పూజ,కై వలయునట్టి సామగ్రి కావలయును.

సీ. స్త్రీ శాలలందు విచిత్ర పూజాద్రవ్య,ములు పాత్రములును సుపుష్కలముగ
సౌభాగ్యకర వస్తుసమితి, పుష్పములు గం,ధమ్ములు పసుపు కుంకమ్ము లలర
వలయు, వాయనములు కల పెట్టెలును, కాటు,కలు సారములు, భరణులను నిండి
యాభరణంబులు, శోభిల్లు చీరెలు, రవికలు మఱి శుభద్రవ్యములును

గీ. మిక్కుటంబుగ నుంచుట మేలు వేగ, రామ ముద్రాంకితమ్ములై రాజిలు శుభ
పత్రికలు దేశదేశాల మిత్రతతికి, బాంధవులకును ఘనులకుం బంపవలయు!

వ. జనక కోసల కేకయ మాగధ దేశాధీశులకు నీ శుభోదంతమున్ వ్రాసి తెలుప
వలయు మఱియు.

క. నల్లని చెవులున్ మిక్కిలి, నల్లని తోకయును మఱియు నల్లనికాళ్లున్
తెల్లని గుఱ్ఱము శుభము వ,హిల్లఁగ సమలంకరించి యెలయింపవలెన్.

గీ. చామరాద్యుపచార విస్రంభమాణ,ముగ సమాదరణము మీఱ మొనసియుండ
స్వర్ణ శృంఖలములఁ బూన్చి సరవి తోడ, ఫాల పట్టిక వ్రాయింపవలయు నిట్లు.

ఉ. "కోసల రాజు రాఘవుని గుఱ్ఱము వెల్వడె నశ్వమేధ యా
గానకుఁ సంప్ర దక్షిణముగా భువియెల్లఁ దిరుంగు, దీని నే
రే సరి శక్తిఁ గల్గిన మహీపతి పట్టగవచ్చు! కానిచో
తా సబలంబు కప్పమునుఁ దాలిచి రాఁదగు నాయయోధ్యకున్".

క. అనుచు స్ఫుటాక్షరములచే, కనక పట్టికను లిఖించి క్రమ్మఱ నశ్వ
మ్మునకు ముఖమందు సంస్థాపన మొనరిచి యజ్ఞమంటపము చేర్పవలెన్.

క. నీవును శత్రుఘ్నునితో, కావలయున్ సిద్ధ మిట్లుగా భుజశక్తిన్
భూవలయ మెల్లఁ దిరుగుచు, రావలయున్ గుఱ్ఱముఁ గొని రాఘవు కడకున్.

వ. ససైన్యంబుగ వెడలునది. సుమంత్రితో రథారూఢుఁడై సకల పుణ్యనదుల దివ్య
జలంబులను కుంభబుల నింపికొని, నానా పుణ్యస్థలంబు లందలి దివ్యమృత్తికం గొనితే
శత్రుఘ్ను నియమింపుము. చిత్ర ధ్వజ పతాకాదులచే నయోధ్యన్ శృంగారింపుము.

క. దేవాలయ సౌధంబుల,లో వెల్లలవైచి, గుడులలోనన్ చిత్ర
శ్రీ వెలయు శాలలన్ సం,భావింపఁగ వలయు రత్నపటు దీపములన్.

శా. పూజాద్రవ్యము సిద్ధమై నెగడుతన్, పౌల్వారు వాద్యాళి వి
భ్రాజద్రీతి నభంగుర ప్రతిభ రారాజిల్లఁగా నొప్పు, నీ
రాజశ్రేష్ఠ పథంబులెల్ల శుచిమద్రమ్యాకృతిం బొల్చి, సం
రాజ చ్చందన తోయసిక్తతనులై ప్రత్యూహ మొప్పందగున్.

సీ. వివిధ సౌధంబుల వివిధ చిత్రంబులు, వ్రాయించి సొంపునం బఱప వలయు
నవరత్న నిర్మిత నవ్యహారంబుల, ఫలము లలంకరింపంగ వలయు
నయన మనోహర నవకంబుతో సమ,స్త స్థలంబుల నింపు సలుప వలయు
సర్వ వేత్తవును నిశ్చల బుద్ధిచాతుర్య,మతివి! నేఁ దెల్పక మఱచినవియు

గీ. తోఁచినట్టుగ నీకు యథోచితముగ, కడు యథా విభవంబు గాఁగా నొనర్చి
రామచంద్రునితో మాట రాకయుండ, నల్పుమని బల్కె సౌమిత్రి సవినయమున.

క. గుర్వాజ్ఞ నూతఁగాఁ గొని, సర్వంబును నిర్వహించె సదమల రీతిన్
నూర్వంతు లధికముగను సు,పర్వులు మెచ్చుకొని కడు శభా సని పల్కన్.

* * *

# ద్వితీయ సర్గము

## శ్రీరాముఁ డశ్వమేధయజ్ఞ మంటపమున ప్రవేశించుట

ఉ. అంతట రామచంద్రుఁడు ధరాత్మజతో సుముహూర్తమందు న
త్యంత మలంకరించుకొని, యంజనముం ధరియించి, తూర్యము
ల్వింతగ మ్రోయ, బ్రాహ్మణుల వేద నినాదము లుప్పతిల్ల, రా
ట్సంతతి కొల్వ ! యజ్ఞవిలస త్శుభ వేది నలంకరించుచోఁ.

క. పుర నారీ గాయనములు, పురజన జయ నిస్వనములు పొలుపెసఁగఁ సుం
దర చిత్రాసనములపై, పరఁగి రరుంధతి వశిష్ఠ వర పరివృతులై.

క. నవనీతా ద్యభ్యంగన, వివిధ స్నానంబు లెలమి విలసిల్లిన రా
మ విదేహాత్మజ లానందవిరాజితులై చెలంగి తద్దయు వేడ్కన్.

చ. గురు గురుభార్యలఁ సరియగుఁ సరిగంచుల పట్టుబట్టలం
గరిమను సత్కరించి, ఎసఁగఁ తమ తల్లుల, నత్తమామలఁ ;
బరువడి బంధుజాలమును, మంత్రుల, నూరఁగలట్టి వారినిఁ;
నరపతులఁ వినూతన కనద్వసనాదులఁ గట్ట నిచ్చుచున్.

ఆ. సకల వర్ణులకును చండాలురకును సేవకుల కెల్ల నూత్న వస్త్రజాల
సమితి యిచ్చి, అపుడు సంతోష మొప్ప రత్నాంబరముల రాముఁ దాల్చిరెలమి.

ఉ. కెంపులు ముత్తియంబులు లగించి యెడన్నెడ నీల రత్నము
ల్నింపిన బంగరుఁ సరిగ నెక్కొనుచీర యొసంగి సీతకుఁ
సంపదలం దనర్చు విలసన్మృదు పుష్పలతా విచిత్రితం
బింపగు పచ్చపట్టువుల నెంతయుఁ దాల్చి రఘుప్రవీరుఁడుఁ.

సీ. నీలమేఘచ్ఛాయ డీలు సేయఁగఁ జాలు, నిజ శరీరంబున నిగనిగ మని
పెరిమెమైఁ జెన్నారు పీతాంబరముఁ గట్టి, పైన ధరించి యింపైపె స్ఫురింప!
రత్నద్వయ విరాజ రమణీయ వక్షుఁడై, కటక కుండల దీప్తిఁ గడలుకొనఁగ
హార కేయూరాద్యుదా రాభరణ సువిస్తార శృంగార విహారుఁ డగుచు

గీ. సద్గురూత్తము నాజ్ఞ యశంబు పొదల, ముత్తయిదువులు ముత్యాల ముగ్గు లిడిన
స్వస్తికముపయి శ్రీరామచంద్రమూర్తిఁ, గూరుచుండ నొనర్చి మక్కువ చెలంగ.

క. ముత్తైదువులం గూడి మహత్తర దివ్యాభరణ విహారి యగుచు భూ
భృత్తనయ జానకీసతి, పొత్తున గూర్చుండసల్పి పొల్పెసఁగంగఁ.

మ. మునులంగూడి వశిష్ఠుడుఁ, గణపతిం బూజింపగాఁజేసి, నె
మ్మిని పుణ్యాహము, నాంది పూజయును, సంప్రీతిఁ యజింపించి, యొ

య్యన చెల్వొంద నవగ్రహమ్ముల నొగిన్, ధ్యానించి పూజింప జే
సి, నిరూపించెను యజ్ఞదీక్ష! విధివ త్సిద్ధాంత బద్ధంబుగన్.

మ. ధ్వజ మారోపణమున్ యథావిధిగ విద్వల్లోకముల్ మెచ్చ, భూ
ప్రజ లానంద తరంగితాద్భుత హృదాబ్జాతాత్ములై చూడ, ఋ
త్విజులన్ షోడశ సంఖ్యలన్ వరణ ముద్వేలంబుగా నేయఁ జే
సి, జయంబున్ యశముం గలుంగఁగ శుభాశీర్వాద మిప్పించుచున్.

శా. తా నధ్వర్యుఁడు, బ్రహ్మ బ్రహ్మయును, హోతా! గాధిసూనుండు, వి
జ్ఞానోద్గాత! అహల్యా పుత్రుఁడు శతానందుండు, సాక్షా ద్యముం
డే నైర్మల్య మెసంగఁగా శమితయయ్యెన్, సత్ ఋషి శ్రేష్ఠులే
జానొ ఋత్విజులైరి, రామునకు యజ్ఞంబందు సామాన్యమే?

సీ. కశ్యపాదిక ఋషిగణము ఋత్విక్కులై, బరఁగిన తదుపరి వందలాది
సంవరింపఁగఁబడి సకల మహర్షులు, అగ్నికుండమం దమర నిల్పి
తవిలి యా వెంట పాత్రాసాదన మొనర్చి, సర్వలక్షణముల బర్వియున్న
అశ్వంబు పూజించి అవని సవ్యంబుగా, చుట్టి వచ్చుటకునై చూర విడిచి

గీ. దాని సంరక్షణమునకై దర్ప మొప్ప, నయుత సైన్యంబు వెంటరా నన్న యాజ్ఞఁ
బోయె శత్రుఘ్నుఁడు సుమంత్రి పోవ వెంట, బ్రాహ్మణులతో వశిష్ఠుఁడుంబఱగియుండ.

మ. సరయూతీరపు యజ్ఞవాటికను, విశ్రాంతిన్ మునిశ్రేష్ఠు లా
దర మొప్పార వచింప, మంగళ చరిత్రంబు ల్వినున్ రాముఁ, డె
ల్లర కానందముఁగూర్చు, దర్భలనుఁ దాల్చన్ లేడి చర్మంబుపైఁ
బరగన్ భూపతి కోటి, సూర్యనిభుఁడై భాసించె గుర్వాజ్ఞపై.

క. గురు సన్నిధిలో నిత్యము, బరగుఁ గడు యథోచిత ప్రవర్తనమతియై
వర కమలహారధరుఁడై, గరిమన్ దీక్షా విధాన కార్యపరుండై.

క. జానకి సద్వస్త్రములన్, మానక ధరియించి స్త్రీ సమాజము కొలువన్
పూని తన భర్త సన్నిధి, నూని చరించున్ కరం బనూన శ్రద్ధన్.

క. తమ్ముల కాంత లలంకా,రమ్ములఁ గావించుకొని నిరంతర శ్రద్ధన్
ముమ్మరపు భక్తిఁ గొలుతు ర,హమ్ములు రాత్రులును జానకమ్మన్ రామున్.

సీ. మంగళ వాద్యము ల్మహితంబులై యొప్ప, నృత్యగీతంబులు నెగడుచుండ!
రామాశ్వమేధము రయ మొప్పగా విని, రాని వారెవరు లేరైరి ప్రజలు!
ఋషి సంతతుల నెవరేనియు బీరువోకుండ నచ్చోటనే యుండి రెలమి!
సర్వ మానవులును చందన లిప్తాంగు, లెల్లరు దివ్యాన్న హృష్టపుష్టు!

గీ. లెందు జూచిన నానంద తుందిలులు, మ,హాత్మవోత్సాహ వంతు,లత్యుదితభక్తి
భావ భరితులు, శ్రీరామ భజన తత్పరులు, సమస్త విధముల తృప్తులుఁ జెలంగ.

కశ్యపాత్రి భరద్వాజ విశ్వామిత్ర గౌతమ మార్కండేయ మృకండ చ్యవన ముద్గలాసిత పరశురామ దేవల వ్యాస నారాయణ క్రతు విభాండక నారద గాలవాది మహర్షి శ్రేష్ఠులును, శివదాస భానుదాస హరిదాసాది మహా తపస్వులును, శివవర్మ రుద్రవర్మ శివశర్మాదులగు మునీంద్రులును, ఏకశృంగ సప్తశృంగ త్రిశృంగులును తిలభాండ భృగు భార్గవ గుగ్గు ధౌమ్య కణ్వాదులును, ఏకపాద త్రిపాద ఊర్ధ్వబాహు ఊర్ధ్వపాద ఊర్ధ్వాక్ష ఊర్ధ్వాస్య ముఖ తపోనిరతులును, త్రిశిర వృద్ధగౌతమ పర్ణాద చంద్ర సంజ్ఞ ఋష్యశృంగ మతంగ జాబాల్యగస్త్య దధీచి శౌనక సూత సుతీక్ష్ణ లోమశ వాల్మీకి వేదనిధి దూర్వాసాది మహనీయులును, ఇతర మునీంద్రులను, కళత్ర పుత్రచ్ఛాత్ర సమేతంబుగ వచ్చిరి.

క. కొందఱు పర్ణాహారులు, కొందఱు వాయు భక్షులును కొందరు భిక్షుల్
కొంద అయాచ్ఞా వ్రతులును, కొందఱు జలపాన పరులుఁగూడి రచటికిన్.

సీ. కొందఱు మౌనంబుఁగొని యున్నవారలు, కొందఱాహారమే కొననివారు
కొందఱు దర్భాగ్ర బిందుపాయులు, పర, దత్తాశనులుగ కొందఱుఁ గలారు
కొందఱు వల్కలాంగులు, మఱి కొందఱు, కావి గుడ్డల నెప్డుఁ గట్టువారు
కొందఱు చర్మము ల్గూర్చి కట్టెడువారు, కిసలయ వస్త్రులై మెసఁగువారు

గీ. అంబరాంబరధరులు దిగంబరులును, ధూమ్రపాయులు పంచాగ్ని దొట్టిసాధ
నాపరులు కొందఱు విరాగ తాపసులు వ,నములఁగల వారటకు వచ్చినారు శిష్య!

క. ఈరీతి ప్రతి దినంబును, శ్రీరాముని యజ్ఞమును పొరింబొరి చూడన్
జేరుచునుండిరి భక్తిన్, వారల పూజించి రచటి వారలు మిగులన్.

సీ. వారి నందఱి రఘువరుఁడు ప్రత్యుద్ధాన, ఆసనా ద్యుపచార భాసురులుగ
మధుపర్క సాదర మధుర సత్కారాది, విధుల జాగ్రతగ ప్రవీణుఁ డగుచు
పూజించుచుండు నింపుగ యజ్ఞవాటమునన్ కామధేనువు నవ్య దివ్య
వస్త్రాభరణ సువర్ణ శృంగాదుల, నర్చించి యిట్టుల ప్రార్థనంబు

గీ. సల్పు! నోహో! జగన్మాత! సత్య కామ,ధేను దేవీ! ప్రసన్నవై నే నొనర్చు
యజ్ఞమున నిష్ట మృష్టాన్న మనఁగనేల? కోరువారల కిమ్మొల్ల కోరికలను.

గీ. అనుచు ప్రణమించి పట్టువస్త్రాళిఁ బరచి, దానిపై నిల్పె, నా కామధేను మాత!
నటుల నిల్పిన దాది నిప్పటులనుండు,నో యెఱుంగకె మృష్టాన్నమారొ నచట!

గీ. కామధేను చింతామణుల్గల్గె నెచట, నచట దుర్లభమైన దిం కెచటఁగల్గు?
జానకీదేవి వడ్డించు పూని కంకణ ధ్వనులు కర్ణములకు నానంద మిడఁగ.

## శ్రీరాముని వితరణౌదార్య సంతర్పణారాధనము

వ. తదుపరి శ్రీరామచంద్ర ప్రభుండు.

శా. తండ్రీ! లక్ష్మణ! యజ్ఞవాటికలకే తన్మాత్రుఁ డెవ్వాఁడు కా
నిం డ్రాజూచి, ముదంబుమైఁ బిలచి యెన్నే రీతులన్ సత్కృతుల్
బండ్రింపందగుఁగాని, సుంతయును కోపం బొప్ప దెప్పట్టునన్
తీండ్రింపం దగదయ్యా! నన్నడుగు టర్థిం జూడ కెప్పట్టునన్.

క. భటులెల్ల సాదరమ్మున, నిటుల వచ్చువారినెల్ల నేర్పడ భక్తి
స్ఫుటభాషణములఁ గొల్చుచు, చటుల సేవనముల తృప్తి సమకూర్పవలెన్.

మ. ఎవ రే వస్తువుఁ గోరినన్ సరవిమై నీయందగున్ లక్ష్మణా!
ప్రవిభక్తంబుగ నాయనుజ్ఞకయి రారా దెప్పుడున్, నాయను
జ్ఞ వినంగాఁదగు! నాయయోధ్యనయినన్ నా జానకీదేవినేన్
సవిమర్శంబుగ కోర నీయఁదగు కోశంబేని స్వార్థేనువేన్.

క. ఇచ్చెడు పట్టునఁ దగపొర, పొచ్చెంబులుకూడ వెందుఁబోవు పదార్థం?
బిచ్చినకొలదియు హెచ్చు, వచ్చున్, చలమున జలంబు వరుస దివిచినన్.

క. నాయాజ్ఞ భంగపఱచిన, నాయాదలఁ దీసినట్టు లగు సుమ్మా! యి
ట్లే యెడలనైన నిది మదిఁ, బాయక వర్తింపవలయు బహువిధములన్.

క. అను నిట్టి రామశాసన,మును తల ధరియించి నిరతమును వచ్చిన వా
రిని సర్వవిధములం బూ,జనము సల్పుచున్ యథోక్తసరణి నొనర్చెన్.

# తృతీయ సర్గము

## పూర్వ దిగ్యాత్రలో శ్రీరాముని యజ్ఞాశ్వమునకు గంగ దారియిచ్చుట

గీ. పిమ్మట మహాత్ముఁడైన యప్పృథివిజాని, విడిచిపెట్టిన యశ్వ మెక్కుడు రయమున
పూర్వ దేశంబునకు నేగు పొలుపుమీఱఁ, జేరె గంగానదీ భవ్య తీరమునకు.

క. శ్రీరాముని నిజమహిమా, కారణ శత్రుఘ్ను సన్నికటతన్ గంగా
తీరమున నొక్క యద్భుత, మారయఁబడె వింతకద! రమాధవు చర్యల్.

సీ. ఆ గుఱ్ఱ మటుల బ్రహ్మావర్త దేశ గం,గా తీరమును జేరఁగా చెలంగి
గంగ ఉత్తుంగ తరంగ మాలికల ను,ప్పొంగ నావలు పడిపోయె నందు
మివుల కాల మతిక్రమించె ప్రయాణము, మొదటనే ఇటు విఘ్నమున మునింగె
ప్రథమ కబళమ్మున పడినది మక్షిక,మిక నేటి భోజనం బకట! యనుచు

గీ. చెలగి శత్రుఘ్నుఁ డెక్కుడు చింతఁదవిలి, రాముని యనుగ్రహంబె మమ్మోము ననుచు
రథము డిగ్గి గంగానదీ రమ్య సమ్ముఖమున జగమెల్ల విన నిట్లుగా వచించె.

శా. గంగా! పుణ్యవతీ! తరంగ కలితా! కాల్రొమ్మొక్కుచున్నాఁడ! మ
మ్మొం గాపాడుము! మా మొఱల్వినుము! రాముం డాత్తసత్యవ్రతో
త్తుంగ ఖ్యాతి జరించునేని, యిపుడిందున్ మాకు మార్గంబుఁ గూ
ర్పంగా నీ వనుకూలవై నెగడుమా! భాగీరథీ! స్వర్ణదీ!

క. మాతండ్రి రామచంద్రుఁ డధీత సకల శాస్త్ర గుణనిధి యగున యేనిన్
మాతల్లి సీత మిక్కిలి, పాతివ్రత్య నిధియేని పాయ నొసగుమా!

గీ. అగ్రజుని తండ్రిరీతి నే నరసి భక్తి, సేతునేనియు, త్రికరణ ప్రీతిగా భ
జింతునేని శ్రీరాముని సుంతయేని, అడ్డు పడకుండుఁగాత! సురాపగ యనె!

క. అనినంతనె యా జాహ్నవి, తనవేగం బెల్లడించి, తనకడుపుం జూ
పిన క్షణ మాత్రంబున కాలి నడకతో సైన్యమెల్ల లీలన్ దాటెన్.

క. ప్రజ్ఞా విలాసియగు న, య్యజ్ఞాశ్వము తృటిని నొక్క యడుగున దాటెన్
సుజ్ఞానిన్ శత్రుఘ్ను కృతజ్ఞతలం బొంది గంగ ధన్యంబయ్యెన్.

క. శత్రుఘ్నుండు సుమంత్రి పవిత్రంబై రామచంద్ర విభుని వలన సు
క్షేత్రంబా కీటక సద్ధాత్రిం జేగిరి సమస్త ధరణిఁదిరుగుచున్.

క. శ్రీరాములకుం జయ సీ, తారాములకుం జయ యని తారాపథమున్
ధారుణి మార్మ్రోయగను మహారావము లెసఁగ సైన్య మల్లన జనినన్.

ఉ. అంబరమున్ సముద్రము గుహానికరంబును దిక్కులున్ నినా
దంబులకున్ ప్రతిధ్వను లుదంచిత వృత్తినెసంగ, శ్యామక
ర్ణంబగు యాజ్ఞికాశ్వము కరంబుఁ గనుంగొని మాగధ ప్రదే
శంబున తత్ప్రదేశపతి, సైన్యనికాయముఁగూడి ధీరుఁడై.

క. తన పట్టపేన్గుపై నెట్టన వచ్చి ముదంబు చొప్పడన్ గుఱ్ఱము మో
మున వ్రేలు లేఖనుం గనుఁగొని సాదరమునను మ్రొక్కి గుఱ్ఱమ్మునకున్.

శా. తోడన్ పూజలొనర్చి, పిమ్మటను శత్రుఘ్నున్ పరామర్శతో
జోడించెన్ తన హస్త యుగ్మమును, నిస్తుల్యంబు భండారమున్
నేడే యర్పణచేసి నాఁడ! నని, మన్నీలన్ నిజాంతః పుర
క్రీడా భూష పురోహితప్రజలఁ బంపెన్ యజ్ఞముం జూడఁగన్.

గీ. తాను సైన్యంబులం గూడి తనరు యజ్ఞహయ చరణములఁ గనిపట్టి యప్రమత్త
తను చెలఁగుచు శత్రుఘ్నాజ్ఞలను తలను ధరించుచును వచ్చుచుండె నుదంచితముగ,

క. ఈరీతి సర్వదిక్కుల, లో రాజులు రాజులెల్ల లోఁబడి యొకరుఁ
(శ్రీ)రామాశ్వము బట్టరు, తారు విధేయులయి సర్వధర్మంబులకున్.

## యజ్ఞాశ్వము దక్షిణ దిగ్యాత్ర సేయుట

మ. అది యింద్రాదులచేతఁ గాని పని ; యిట్లశ్వంబు వంగాంగ పూ
ర్వదిశా దేశములన్ క్రమించుచు, సముద్ర ప్రాంతముం జొచ్చి, పూ
ర్వదిశం దాటుచు, దక్షిణాభిముఖమై రాఁజొచ్చె, గోదావరీ
నదినిం గ్రమ్మఱి, ఆంధ్ర ద్రావిడములన్ దాటెన్ తృటిన్ చోళమున్.

శా. సేతు ప్రాంతముఁ జేరె నన్నయెడ, కాంచీమండలంబెల్ల నుం
జేతోమోద మెసంగ దాటె ననుచుం జెప్పంగ నేలా ? కవే
రీతీరావని నెప్పుడో కడచె, నీ రీతిన్ తృణప్రాయమా
రీతిన్ దిగ్విజయంబుఁగాంచిరి ధరిత్రీ మండలంబెల్లనున్.

## యజ్ఞాశ్వము పశ్చిమ దిగ్యాత్ర సేయుట

క. నిశ్చింతతోడ నిట్టుల, పశ్చిమాభిముఖత తామ్ర పర్ణినది న
త్యాశ్చర్యమ్ముగ దాటిరి, నిశ్చాపముఖ ప్రయాణ నిపుణాధ్వరులై.

వ. ద్వాదశ కేరళదేశంబుల నతిక్రమించి, గోకర్ణంబునకు వచ్చి, కృష్ణాతీర ప్రదేశంబులఁ జూచుచు, కర్ణాటదేశము నతిక్రమించి, కొంకణదేశముం దాటి, ఆయా దేశపు రాజులతోడ, భీమానదీప్రదేశంబు లీక్షించుచు, మహారాష్ట్రంబున కేతెంచి, గౌతమీా నదినిదాటి, విదర్భంజూచి, యాభీరమండలముం జేరి, మాలవమునకు వచ్చి, పుణ్యా యగు మహానదిం దాటి, సాభ్రమతిన్ లంఘించి, ఘూర్జరదేశము నతిక్రమించి,

## యజ్ఞాశ్వ ముత్తర దిగ్యాత్ర సేయుట

ప్రభాసమునకువచ్చి, ఉత్తర దిఙ్ముఖుండై, యానర్త సౌవీర మరుధన్వ సారస్వత మత్స్య మాధుర శూరసేన పాంచాల కురుక్షేత్ర కురు జాంగల కేకయ దేశంబుల క్రమముగా నతిక్రమించి కాశ్మీరంబునకు వచ్చె నా యశ్వము.

గీ. భిల్ల శక గౌడదేశములెల్ల దాటి, యవనతామ్ర దేశమ్ముల నవఘళించి
పెక్కు దేశమ్ములం దెల్ల నుక్కుమీఱి, వచ్చుచుండె మహావేగవంతమగుచు.

క. కరతోయానది దాటుట, కరము దోషమని యెఱుంగు ఘనవీరులు త
త్పరిసర తీరస్థలి బోయిరట హరిద్వారమున కహీన రయమునన్.

శా. ఆ యజ్ఞాశ్వము గంగ తీరమున నొయ్యన్ జేరి, హైమాద్రి ప్రాం
తీయామూల్య సమ ప్రదేశముల నెంతే వేగమే దాటి, యిం

పౌ యార్యావని నెల్ల చూచి, మిథిలా యాత్రాత్ముఁడై, కాశికిం
తై యేతెంచి త్రివేణి మీఁదుగను నంతర్వేదికిన్ వేగమై.

గీ. శృంగబేర పురమ్మును జేరి, తమస,దాటి, నైమిశారణ్యంబుఁ దవిలి చని, త
రించి గోమతీనదిని, లంఘించి బ్రహ్మా, వర్త సరసును, కోసల ప్రతిభ నెగడి.

గీ. ఆరుమాసంబు లందె విహార సరణి, భూమి యందెల్లఁ దిరిగి విభుత నెసంగి
చక్కని పరీక్ష శత్రుఘ్న చారు రాజ, మౌళి రాజుల కిడి, గెల్చి మగిడి వచ్చె.

శా. సాకేతంబును రాజధాని గని యజ్ఞ ప్రస్ఫురత్శాలయం
దా కల్పోజ్జ్వల వేదఘోషమును, నృత్యామేయ సంగీత ము
ఖ్యా కర్ణాత్త సుపర్వమై యెసఁగు బ్రహ్మానందముం బొందె, నా
రాకన్ దూరమునుండియే యెఱిఁగి శ్రీరామ ప్రభుం డిమ్ములన్.

సీ. పట్టపేనుగు ముందుబెట్టుక సైన్య వై,భవ మొప్ప వాద్యముల్ పఱఁగి మ్రోయ
నృత్య గీతము వేదనినదముల్ చెలఁగ న,య్యజ్ఞాశ్వమును పూజ నాచరించి
సత్కార పూర్వక ముత్కంఠఁ దోడితే, లక్ష్మణుఁ బంప విలక్షణముగ
పరమ వైభవమున బహుళరాజ సమూహ,ములు చుట్టుముట్టి రాజిలు హయంబు

గీ. యజ్ఞమంట పాహ్వానము నాచరించె, తురగ దర్శన తన్మహోత్సుకత నచట
వర్ణనము సేయ నెవ్వారి వశముఁ శిష్య! విపుల సద్గుణ సువిలాస! విష్ణుదాస!

## శ్రీరామాశ్వమేధమున జన సమ్మర్దనము

గీ. అ య్యయోధ్యాపురికి పది యామడలుగ, అఖిల దేశాధిపతులైన యవనివిభులు
సైన్యముల తోడ నఖిల పుష్పముల నిలుచు, తుమ్మెదల వోలె నెల్లెడఁ గ్రమ్మియుండ్రి.

క. తమ తమ మును బంపిన పు,త్రమిత్ర సత్కళత్రముల దగఁ గలియుఁటకై
నెమకుచు నుండిరి తమ సై,న్యములన్ దేశీయులన్ గనన్ శ్రద్ధమెయిన్.

సీ. తమతమ వారి కొందఱు మరునాడును, రెండు మూణ్ణాళ్లకు దండియా ప్ర
యత్నంబునన్ కలియఁగ సాగి రొక కొంద, ఱైదారు రోజుల కైనఁ గాని
దొఱకుట మిక్కిలి దుస్సాధ్యమై యొప్పె, పక్షము మాసముఁ బట్టె కొంద
ఱకు, కొంద ఱెన్నినాళ్లకును వియోగంబు, తప్పక తిరుగుట లొప్పఁ గాంచి

గీ. సాదరమ్మున లక్ష్మణు, సోదరా! మ,హా జనులలోన సమ్మర్ద మధికమౌట
ఒక్క యేర్పాటు చేయఁగా నొప్పునయ్య!, బంధు వస్తు వాహనములు సంధిలంగ.

మ. తమసా తీరమునందు నొక్క విపుల స్థానంబునన్ శాల వే
గమ నిర్మాణ మొనర్పఁగా వలయు, నీ గంభీర సమ్మర్దన

భ్రమ చీకాకయినట్టి వారల మఱే వస్త్వాళినేఁ వాహన
క్రమ సందోహమునేఁ తదీయ స్థలమారఁ జేర్పఁ డెప్పట్టునన్.

క. చాటింపఁ బంపుఁ డెవ్వా,రోటు! తమ్ముఁ దప్పిపోయిరో? వారల నె
ప్పాటను తమసా తీరో,ద్ఘాటిత శాలం గనఁ దగఁ జనములకున్.

క. సైన్యముల కాజ్ఞయిమ్మా!, అన్య వస్తు వాహనముల నచటికిఁ జేర్పన్
కన్యల, బాలుర, శిశువుల, మాన్యరీతిఁ జూడఁ దెలుపుమా! కడు శ్రద్ధన్.

ఆ. అన్న యట్లు సేయుమన్న దా నన్న యా,జ్ఞ న్నయమున శిరమున న్నిడుకొన
యెల్ల దేశ ప్రజల యుల్లము రంజిల్లె, పిల్లఁ జెల్లఁ జేరి ప్రియముఁ గనిరి.

క. ఎవఁడైన దేని నే వ,స్తువు నైనను విడచి పోవఁ తోడరి జనులలో
నెవరైన తమస తీరం,బవు శాలం జేర్పుదురు మహత్తర రీతిన్.

క. ఎచ్చోట నెవ్వరెయ్యది, విచ్చల విడి పారవైచి వెనుకన్ మఱిదా
మిచ్చోటఁ గాంచఁగల్గిరి, హెచ్చుగు నమ్మకముగా నహీన ప్రజ్ఞన్.

క. ఒకరిమాట మఱి యొకరికి, ప్రకటంబుగ వినుటఁ గల్గరానిది యయ్యెన్
సకల మహాదేశస్థులు, గకిబికిఁ జరియించి రొప్పుగా నయ్యెడలన్.

వ. మఱియు నచ్చటికి వచ్చిన రాజులెల్లరును గుడారంబులయందు యథా సుఖంబుగ నిలచి రిట్లు మహా వైభవోపేతంబుగ జరుగు నయ్యశ్వమేధ యాగంబున.

# చతుర్థ సర్గము

## శ్రీరామాశ్వమేధమునకు సపరివారముగా శంకరుఁ డేతెంచుట

క. ఋత్విక్కు లెల్లరుం గడు, సాత్త్వికులై స్వచ్ఛములును సస్వరములుఁగా
తత్త్వం బెఱింగి మంత్ర మ,హత్త్వం బేర్పడ పఠింతు రత్యంతంబున్.

ఉ. ఇంద్రుని యజ్ఞమండలి యహీన సదస్యులవోలె ఋత్విగుల్
సాంద్రమణి ప్రశోభిత లసద్వసన ప్రతిభా విభాసులై
యుండ్రు, రఘూత్తమున్ సవనమొప్పెను, తారకలెల్ల గూడ గా
చంద్రుఁడనూన కాంతుల నెసంగు నభంబునకున్ సమానమై.

క. దేవతలం బరివృతుఁడగు, దేవేంద్రుని గూడి దేవదేవుడు శివుఁడిం
పౌ వృషభ వాహనాఢ్యుం,డై వచ్చెం బార్వతీ సహాయుండగుచున్.

మ. సగణుండై తన యజ్ఞవాటికకు సాక్షాచ్ఛంకరుం డేగు దెం
చ, గజ శ్రేష్ఠ మలంకరించుకొని విశ్వన్నాథునిన్ లక్ష్మణం

బుగ సౌమిత్రిని గూడి, చామర ధ్వజస్ఫూర్తిన్ మహాస్వాగతం
బుగ శ్రీరాముఁ డెదుర్కొనెన్, విధిగ సంపూజించె భక్త్యాత్ముఁడై.

గీ. నృత్య గీత వాద్యములతో నేర్పు మీఱ, శంకరుని యజ్ఞవాటికా స్థలికిఁ దోడి
తెచ్చి, సంతోష మెద పొంగ తియ్యముగ న,శేష పరిచర్యలం దృప్తుఁ జేసి కడఁక.

గీ. పార్వతీ పరమేశుల భద్రపీఠ, మందు కూర్చుండఁ జేసి రామావనిపతి
సీతరత్న పాత్రమ్మున పూతజలము, పోయ, కడిగె చరణమ్ముల శ్రీకరముగ!

క. తన చేతులతో బట్టి శి,వుని పాదోదకము శిరము పొదల ధరింపన్
గని దేవతానికర మొ,ప్పె ననిమిషత సార్థకముగ పెంపుఁ దలిర్పన్.

ఉ. కొందఱు రామచంద్రు, మఱి కొందఱు జానకి భాగ్యమెన్నుచున్
గొందఱు పుల్కరింప, మఱి కొందఱు మేను లెఱుంగకుండ, నా
నంద మహా ప్రవాహముల నర్మిలి నోలలనాడి, రింక నుం
గొందఱు చిత్రపుం బ్రతిమకున్ సములైరి; అచేతనమ్ముగన్.

గీ. పార్వతీ పరమేశుల సర్వదేవ, తావళిన్ లక్ష్మణుఁడును సీతయు వెనుకొన
క్రమముగా పూజచేసి శ్రీరాచంద్ర,మూర్తి పరిపరి విధముల మ్రొక్కి యనియె!

గీ. లోకశంకర! శంకరా! శ్రీకర! భవ! నీదు దర్శన భాగ్యంబు నేఁడు కల్గ
ధన్యుఁడను! సీతతోడుత ధన్యమయ్యె! నాదు జన్మంబు వంశము నా మఖంబు!

చ. అన విని చంద్రశేఖరుఁ డహంబు రవంతయు లేక నవ్వుచున్
మనమున తుష్టుఁడై యను; రమారమణా! మహనీయ! నీదు మా
యను గనఁ గొంటి; నాభి కమలాంతరమం దుదయించె బ్రహ్మ, నా
తనికి మరీచి మున్నగు సుధామయ మూర్తులుఁ బుట్టిరో కదా!

క. సప్తఋషులు నీ మనుమలు, గుప్తంబె? మరీచి కన్నకొడుకు గదా! ని
ర్లిప్తుఁడు కశ్యపుఁ డాతని, కాప్తుఁడు సూర్యుండు పుత్రుఁడై జన్మించెన్.

ఆ. చిత్ర మిదియె! నీ ప్రపౌత్రుఁడు సూర్యుండు, వంశకర్త! నీకు వాస్తవముగ!
అట్టి వంశమందు నవతారమెత్తితి,వయ్య! దుష్ట శిక్షణార్థముగను!

ఆ. నీ స్వకీయ మాయ నెక్కొని దేవకా,ర్యంబుఁ దీర్ప భూమి నవతరించి
తీర్థయాత్ర యజ్ఞ మర్థి లోకులను శి,క్షింపఁ జేతు విదె భజింతు! రామ!

క. ఇదియెల్ల నీ వినోదము, కద! నీకిది క్రీడయగు ముఖాముఖిగానే
నిదె! మ్రొక్కుచుంటి నే నెఱుఁ,గుదు! నిన్ను పరాత్పరున్ సగుణు, నిర్గుణునిన్.

క. అని పలికిన పరమేశ్వరుఁ, గని తత్సభ నున్నయట్టి ఘనులెల్లరు దే
వ నివహ మెల్లరునున్ ము,క్కున వ్రేలిడికొనిరి మెచ్చుకొని రా రామున్.

క. నవ్వుచు సీతారాములు, మవ్వముగా నీశ్వరుని సమక్షంబున తా
నివ్వటిలు యజ్ఞకుండము, నవ్వలఁగల గురు వశిష్ఠు నాజ్ఞాపరులై.

ఉ. కుండ సమీపమందునను కూర్చొని, రంతట నగ్ని హోత్రము
ల్మండె వెలుంగుతోడ, పెరిమంబున కిన్నర యక్ష సిద్ధులున్
దండిగ నప్సరోజనముఁ దక్కు జగంబుల వారు, జంగమో
ద్దండ మహాస్వరూపములఁ దాలిచి వచ్చిరి సాగరాద్రులున్.

శా. లోకాధీశులు దిక్పతి ప్రకరముల్ దోతెంచి, రింపార వా
పీ కూప ప్రముఖ ప్రభూజములునున్, వెవ్వేఱ చైతన్యతన్
సాకారంబుగ మానవాకృతులతో సాకేత రాడ్యజ్ఞ శో
భా కల్యాణ దిదృక్షమాణ హృదయాబ్జ శ్రీకులై వచ్చినన్.

క. మకర ధ్వజుండు గుహుఁడును, నకళంకముగన్ విభీషణ స్వామియు నొ
ద్దిక సంపాతియు వచ్చి కృతకృత్యతం బఱఁగి రొగి కృతజ్ఞాపరులై.

మ. కపులెల్లన్ తన వద్దనే నిలువఁగా, గంభీర విజ్ఞాన దో
ర్విపుల ప్రజ్ఞ జపంబు ధ్యానమును హృద్వీధిన్ విహరించుచున్
నిపుణుండై తగు నాంజనేయుఁడు దగద్విఖ్యాతుఁడై రామచం
ద్ర పదారాధన తత్పరత్వమున నేత్రంబుల్ నిమీలించుచున్.

చ. త్రికరణ శుద్ధిగా స్థిరమతిన్ రఘురామునినే భజించు న
మ్మకమగు బంటు! మారుతిని, మాటికి మాటికి నిట్టిదట్టి యిం
చుక పనిపాటులం బనుపఁ జూడఁడు! తన్మహనీయ గౌరవ
ప్రకటత కాత్మసౌఖ్య మవిరామముగాఁగొన రామభద్రుఁడున్.

కుంభోదరుఁడు వచ్చి శ్రీరామునితో సంభాషించుట

గీ. అంత నచటికి కుంభోదరాఖ్యుఁడైన, మానిసత్తముఁ డేతెంచె భానుమండ
ల ప్రభాభాసియై దిక్కులను వెలుంగఁ, జేయుచున్ కాని తన్మునిశ్రేష్ఠుఁ జూచి.

శా. సీమాచారులు మిక్కుటంబగు మనశ్చింతా భయ భ్రాంతులై
ఎమీ! ఈమహనీయుఁడే! అకట! తా నేతెంచి శ్రీరాము, మత్
స్వామిన్ పాపపరీతుగా, నతనిచే దత్త ప్రసాదంబు చే
కో మర్యాదకు లోపమౌ ననుచు వాక్కుల్చెన్, మహాక్రుద్ధుఁడై.

చ. అనుటయ కాక, వేళచెడి యాకలిఁ గల్గియు, రాము సత్రమం
దున భుజియింపకేఁ జనియె; తోడనె భూపతి చేరఁబోయి చె
ప్పిన విని నవ్వి యూరకొనె; పేర్మిని నప్పుడె యాత్రలెల్ల నే
యను, మఱి యాగముల్ సలుపునట్టి శ్రమం గొనె రిత్తరిత్తకే.

మ. ఇపు డింకేమి వచించి యజ్ఞమును తా నేరీతి నాక్షేపణల్
విపరీతంబులు పుట్టఁజేయునొ? కదే! వీనిన్ నివారించుచో
నిపు డా రామునిచేత మెట్టు లగునో? నీమించె నెవ్వారినేన్
విపులం బాదరణంపు స్వాగతముచే విచ్చేయఁగా జూడఁగన్.

క. యాత్రలఁ దిరుగుటయేన్ విపు,లాత్రంబున యజ్ఞహాయము నంతట నొకటన్
ధాత్రీతలంబుఁ ద్రిప్పి య,శ్వాత్రవ మొనరించుటయును సామాన్యములే?

క. శ్రమ మెంత? వ్రయమ దెంత? గ,రిమ నాక్షేపణము సేత రిత్తనగున్ ఇ
ట్టి మనుష్యుల నిజముగ దూ,రమునం దుంచుటయె మేలురా! యనుకొనుచున్.

ఉ. మాని నివారణంబు గరిమం బొనరింపగఁ జాలకన్, ధరా
జానినిఁ జేరవచ్చి, యవిచారకరంబుగ, నెట్టి వట్టి వా
క్యైక్యన వచించునో? యని మహా రయమొప్పఁగ యజ్ఞశాలఁ గా
లూని మహాత్ము! రాఘవుని నుత్తమబుద్ధి సుమిత్ర పట్టెనిన్.

మ. కని యెవ్వాని వచస్సు కారణముగాఁగా యజ్ఞ యాత్రాసము
ద్ఘన దుర్దాంత ప్రయాస సంభవిలెనో! దైవారు నెవ్వాని వా
క్కున నెల్లప్పుడు నిష్ఠురోక్తులె కనుంగోఁగల్గు చున్నామొ? అ
మ్మౌని కుంభోదరుఁ డద్దె వచ్చె! సవనమ్మున్ జూడ నే మాజ్ఞయో?

క. అని మొఱ వెట్టిన యమ్మా,టను విని తద్దర్శనముఁ గడఁగి సేయఁగ నం
దునఁ గల్గు నెల్లజను లా,య్యనలేచిరి! బెదరినట్టులై వేగమునన్.

శా. సీతారాములు ఋత్విగుల్ భయమునన్ జేడ్పాటు నేమాత్రమున్
చేతం బందున నొంద కా భటులనున్ జే సన్నలన్ బంపి సం
ప్రీతిన్ గాంచిరి; పొట్టిమేను జడలున్ పెద్దైన యబ్బొజ్జయున్
చేతుల్ కొంచెము, నల్లనౌ చెవులతో చెన్నారు కుంభోదరున్.

క. పెద్దతల పచ్చకండ్లున్, మొద్దులైన కాళ్లు మొగము మోటుగ గడ్డం
బుద్దవిడి యెసఁగ వచ్చెం, దద్దయుఁ గని జనములెల్ల దద్దరిలంగన్.

వ. కౌపీన పాదుకాలంకృతుఁడై నారబట్టలం దొడిగి, మిక్కిలి వయస్సులేని యమ్మౌని చూచువారి కాశ్చర్యంబుఁ గల్పించె. వెనుకటి యితని సంభాషణమ్ము నెల్లరు స్మరించి యుం దేమగునో? యని నివ్వెఱఁగంది చూడసాఁగి రప్పుడు, శ్రీరాముఁడు.

క. తానెవచ్చి సాష్టాంగము,గా నమస్కృతింబొనర్చి కర లాఘవ స
మ్మానితు నొనర్చి, కనకమ,నూన పీఠముననుఁ గూరుచుండ నొనర్చెన్.

ఉ. దండ కమండలంబులు ముదంబున సత్వరుఁడై మహర్షి భూ
మండలమం దమర్చి, పరమంబగు భక్తియు శ్రద్ధతోప, రా
ముంపు వెలుంగున న్నిలువ, మూర్ధ్నము భూమికిఁ దాకునట్లుగా
దండమనన్ ప్రణామ మిడ, దబ్బున తాపసి నెత్తి యర్మిలిన్.

శా. గాఢాలింగన మాచరించి సుమతీ! కళ్యాణమే? నీకు, నా
రూఢిన్ నా కొగి బ్రహ్మహత్య యొదవెన్ ద్రుంపం గటా! రావణున్
మూఢాత్ముండను పాపకర్ముఁడను తా మో! సన్మునీంద్రాళిలో
ప్రౌఢుల్, నే నెటు? వందనీయుఁడ! నహో! బ్రహ్మణ్యు లీ రౌదురే?

క. అని వాక్సరములచే పొడిచిన కుంభోదరుఁడుఁ జూచి శ్రీ రఘురామున్
వినయ వినమిత సిరస్కుండును లజ్జాన్వితుఁడునై కడుం గ్రుంగి యనున్.

సీ. రామ! రామ! మహాబాహు! రమ్యమూర్తి! నాపయిం గోపపడకు మహాపరాధ
మున్న, నా యెడ క్షమియింపు మన్న! నాదు, స్వప్రయోజనమునకునై స్వామి! తెగడ!

ఉ. నేను, పరోపకారమును, నీకు మహత్తర కీర్తి, కల్గున
ట్లూని యెఱింగియే గరిమ నుగ్గడియించితి నీదు దోషముల్!
దాననె లోకు లందఱు ముదంబున నిన్నని, రెల్ల తీర్థముల్
మానిత వైభవాస్పద మమంద మహామహిమాఢ్యలై తగెన్.

ఉ. మీ రిడు నన్నసత్రమున మించిన సంఖ్య మునీంద్ర పాళితోఁ
జేరి భుజింతు నేనును, విశేషత యాత్రలు యజ్ఞముల్ మహో
దారములైన దానములు ధర్మము లొప్పఁగ నీకుఁ గల్గునే?
నేరుపుమీఱ మ్రొక్కి తవణించి యజించి యయోధ్యఁ జేరినన్.

సీ. సకల దేశంబుల సకల తీర్థంబుల, సకల క్షేత్రంబుల సకల జనులు
సకలాశ్రమంబుల సకల వనంబుల, సకల నదీతీర సకల జనులు
సకల పర్వతముల సకల గ్రామంబుల, సకల యాత్రలలోని సకల జనులు
నీదర్శనముఁజేసి నిర్మలానంద దోః,ర్విభవులై కారణ ప్రభవ కీర్తి

గీ. నాకు కల్గుటచేత యీ లోకమెల్ల, ఔర! కుంభోదరు ననుగ్రహంబు కల్మి
తలవని తలంపుగా రామ దర్శనంబు, సీతతోడుతఁ గల్గెనక ఖ్యాతిఁగంటి.

సీ. ఇంద్రియ భోగమం దిచ్ఛ కల్గిన లోకు,లెటు నిన్ను దర్శించు పటిమఁ గంద్రు
ఈషణత్రయముల నిబ్బందిపడు లోకు,లెటు నిన్ను దర్శించు పటిమఁ గంద్రు
అవతార పురుషుఁడవని యెఱుంగని లోకు,లెటు నిన్ను దర్శించు పటిమఁ గంద్రు
అఘటన ఘటనా మహత్తు తెల్యని లోకు,లెటు నిన్ను దర్శించు పటిమఁ గంద్రు

గీ. ఘోర కుంభోదరు ననుగ్రహంబు కల్మి, సంతసించుచు నున్నారు సకల జనులు
ధన్యుఁడను రామచంద్ర! నే ధన్యుఁడైతి, నీదు దోషాభి వర్ణన నియతిఁ జేసి.

క. నా యుపకారము జనులకు, పాయక శుభదాయకము ప్రభామహితంబై
ఆయుః ప్రదమై శాశ్వత, శ్రేయో దాయకమునై వసుంధర నొప్పెన్.

సీ. ఎచ్చోటఁ గనుఁగొన్న ముచ్చటగా రామ,లింగ ప్రతిష్ఠా ప్రసంగమయ్యె!
ఎచ్చోటఁ గనుఁగొన్న నెల్ల తీర్థంబుల, రామ తీర్థములు కరంబుఁగల్గె?
ఎచ్చోటఁ గనుఁగొన్న నెలమి పుష్పక యాత్ర, కాశ్చర్య పడెడు భాగ్యము లభించె!
ఎచ్చోటఁ గనుఁగొన్న హెచ్చగు నీ దాన,ధర్మ ముల్గొను మహత్వం బెలర్చె!

ఆ. ఎంతవరకు భూమినెలమి తీర్థక్షేత్ర,ములు రహించి కీర్తి మొనసియుండు
నంతవరకు నన్ను నెంతురు శ్రీరఘు, రామచంద్ర! సుగుణ రాజచంద్ర!

క. ఇదికాక, లోకశిక్షణ, మొదవెన్, దోషంబులేకె! యొప్పుగ రాముం
డుఁ దిరిగె యాత్రలు; దోషముఁ, గదిసి తిరుఁగవలదె? మనకుఁగానంచుభువిన్.

క. దోషంబులేని రాముఁడె, దోషములను బాపికొనఁగ తొందఱ పడియెన్
దోషములఁ బాపికొనఁగా, దోషులమై యాత్రసేయ తొందఱ వలదే!

క. అని లోకులు తరియింపన్, మనమున నూహించి, నిన్ను మహిమాన్వితుఁ గాఁ
గనుఁగొనియె నంటి; నీవున్, గనుఁగొంటివి నామనంబు కళ్యాణనిధీ!

శా. పూర్ణ బ్రహ్మ పరాత్పరుండవు! జగత్పూజ్యుండ! వాద్యుండవై
యర్ణోరాశిని బాలుఁడౌచు వట పత్రాంతర్గత జ్యోతివై
నిర్ణీతంబు యుగాంత కాలమున రక్తిన్ క్రీడఁ గావించునిన్
వర్ణింపన్ నిగమంబు చాల దన నావల్లన్ గనన్ గల్గునే?

గీ. నీటిపైనుండు తామర నీటినంట,కుండు తెఱఁగున పాపంబు లొండుఁగలవె?
నిన్ను బాధించునవి రామ! నన్నుతాంగ,దోషములునిన్నుఁదలచినఁ దొలఁగుఁగాదె?

క. సృష్టి స్థితి సంహారము, లిష్టముగా బొమముడిన్ గ్రహించి యొసఁగు నీ
కిష్టానిష్టము లున్నవె? కష్టాత్ముఁడ నిన్ను దూరఁ గల్గుదునె! హరీ!

గీ. గోడపై పెక్కు చిత్రము ల్గూడ వ్రాసి, తోడనే వ్రాసి నాతఁడే తుడిచివైవ
గోడకేమి కొఱంత! యీ గోడితరుల,కేమిపని? అని చేయున దేమి! రామ!

గీ. నీకు దోష మారోపించుటే కలుఁగునె? సూర్యుపై ధూళి విసరు నా సొంపువోలె!
నిన్ను దూషించు నెపమున నిన్ను నేను, సంస్తుతి యొనర్చినాఁడ! విశ్వప్రకాశ!

గీ. అమృతభాండంబు నే రీతి నంటినను య,థార్థముగ మృత్యు వపగతంబైన రీతి
దూషణ నెపంబుచే పల్కు భూషణమున, కర్హమైతిని లోకుల కమలతేజ!

గీ. బ్రహ్మ విష్ణు శివాత్మక! బ్రహ్మమూర్తి!, తీర్థయాత్రలు మేము నీ తృప్తికొఱకు
నిన్నుఁ దెలిసి పొందంగ నీ మన్ననములు, చేయుదుము రామ! నీ వవి చేయు టేమి!

సీ. సర్వతీర్థములలో సర్వోత్తమంబగు, గంగ నీ కుడికాలఁ గల్గెఁగాదె?
నీ పద రజలేశ నియతి యహల్య దో,షాళిఁ ద్రోఁచి పవిత్ర యయ్యెఁగాదె?
నీ నామ జపమతి నిఖిలేశుఁ డీశ్వరుం, డెల్ల దేవతలకు నీశుఁడయ్యె!
నీవు త్రొక్కిన భూమి నిర్మల క్షేత్రమై, లోకులను పవిత్రులుగఁ బొనర్చె!

గీ. రామ శ్రీరామ రఘురామ రామరామ! రామ జయరామ శ్రీరామ రామరామ!
రామ గుణధామ బలభీమ రామరామ! రమ్యగుణసాంద్ర! దశరథ రామచంద్ర!

వ. ఇవ్విధంబున.

క. వివిధములుగ కుంభోదరుఁ, డవిరళముగ రామచంద్రు నభినుతిఁ జేసెన్
సవివరముగ నష్టోత్తర, ప్రవిమల నామములఁ బలికి ప్రముదిత మతియై.

వ. అంత జను లత్యంతాశ్చర్య నిమగ్న మానసులైరి.

# పంచమ సర్గము

## కుంభోదర మునికృత శ్రీరామ స్తుతి

వ. ఇట్లు శ్రద్ధమెయి న్విను విష్ణుదాసుండు గురువరుండగు రామదాసున కెఱంగి యిట్లనియె.

క. ఏ యష్టోత్తర శతనుతిఁ, జేయుట శ్రీరాముఁ డెలమిఁ జెందెఁ, ముదముం
బాయక ప్రసన్నుఁడై ముని, రాయ సుకృతిఁజేసె నది త్వరగఁ దెలుపఁగదే.

వ. అనిన విని రామదాసుం డిట్లనియె. చక్కఁగ ప్రశ్నించితివి. నీ ప్రశ్న లోకోపకార కరంబు శ్రద్ధ మెయి న్వినుము.

క. సర్వమయుఁడు సర్వజ్ఞుఁడు, సర్వేశ్వరుఁడైన చక్రి సత్కృప మెయినీ
సర్వభూత వితతికి హృ,త్పర్వముఁ గావింప నిల నుదయ మయ్యెఁగదా!

క. సాకారుండై తాను ని,రాకారుండయ్యు సజ్జనావన దీక్షా
ప్రాకట్యము మెఱయంగా, లోకంబున బుట్టు తానలోలుం డగుచున్.

క. శ్రీరామ పరబ్రహ్మము,దారత సర్వోపయోగ తాత్పర్యమునన్
క్రూరాత్ముల దండించి వి,హారం బొనరించు భూమియం దధికుండై.

చ. ఎపుడెపు డీజగంబున కహీనభయం బొనఁగూడి వచ్చునో
అపుడపుడే జగంబున నయంబుగ దుష్టుల భీతి మాన్పఁగా

నపరిమితానురాగమున నందు జనించి యనేక దివ్య రూ
ప పరతతోడ శిష్టజన పాలన దుష్టహతంబు సేయఁడే.

గీ. మత్స్య కూర్మ వరాహాది మహిత రూప, ధారియై, లోకములకు నాధారుఁడగుచు
సాధు సజ్జన బాధానిరోధనంబుఁ, జేసి కాపాడుటే శ్రీనివాసుని పని.

మ. అజుఁడయ్యుఁన్ జనియించు, నిర్గుణుఁడునై యత్యంతముఁన్ సద్గుణ
వ్రజుఁడై, భూత మహోపకార పరతం బ్రాపించు, క్షీరాబ్ధి యం
దజ రుద్రాదుల కాదిమూలమయి నీరంధ్ర ప్రభారాశియై
భజనీయుండయి యొప్పు రాముఁడు పరబ్రహ్మ స్వరూపుం డగున్.

గీ ఆదిశేషుఁడే లక్ష్మణుఁడయ్యె శంఖ,మవతరించెను భరతుఁడై, యయ్యె చక్ర
మఱియ శత్రుఘ్నుఁడై లక్ష్మియయ్యె సీత, దేవతలె వానరశ్రేష్ఠులై వెలసిరి.

శా. శ్రీనారాయణుఁడే యథార్థముగ నా శ్రీరాముఁడై పుట్టుటన్
ధ్యానాకర్ణన మాత్ర రామ పద మత్యానంద సంధాయియై
జ్ఞాన ద్యోతకమై శుభప్రదమునై సర్వాఘ సంత్రాసమై
జానొందున్ పఠనంబు పాఠనమున్ సర్వోత్తమంబై భువిన్.

గీ. నామ సంకీర్తనంబు కన్నను దలంప, కలియుగంబున సన్ముక్తి కలుఁగ దెందు
రామ! రామ! రామా! యని నియమముగ ప,ఠించువారి యఘము నిస్తరించుటసదె!

క. రామాష్టోత్తర శత స,న్నామ స్తోత్రంబుఁ బల్కినన్ విన్నను ని
ర్ధామ ధూమ మగు భవ జని,తామయ దుష్పాపరాశి యపగతమగుచున్.

వ. వినుము! యథోక్త విధంబుగా సంకల్పాంగ న్యాస కరన్యాసంబు లాచరించి.

శా. మందారాకృతి పుణ్యధామ! విలసన్మా భవ్య వక్షస్థలా!
కుందేందవరవర్ణ! కోమలపదా! కోదండ దీక్షాగురూ!
ఛందోవర్ణిత సర్వ సద్గుణనిధీ! సౌందర్య ముద్రామణీ!
వందేహం రఘునందనా! సురపతీ! స్వామిన్ జగద్రక్షకా!

వ. అని ధ్యానించి.

## శ్రీరామచంద్రాష్టోత్తర శతనామావళి

నామావళి మొదట "ఓం" చివర "నమః" కలిపి చదువుకొనేది.

ఓం సహస్రశీర్‌ష్ణేనమః
సహస్రాక్షాయ
సహస్రహస్తాయ
సహస్రచరణాయ

ఓం జీమూత వర్ణాయనమః
విశ్వతోముఖాయ
అచ్యుతాయ
శేషశాయినే

ఓం హిరణ్యగర్భాయనమః
పంచభూతాత్మనే (౧౦)
మూలప్రకృతయే
దేవానాం హితకారిణే

ఓం సర్వలోకేశాయ నమః
సర్వదుఃఖ నిషూదనాయ
శంఖచక్ర గదాపద్మ జటాముకుటధారిణే
భర్గాయ
తత్త్వాయ
జ్యోతిషాం జ్యోతిషే
వాసుదేవాయ
దశరథాత్మజాయ (౨౦)
రాజేంద్రాయ
సర్వ సంపత్ప్రదాయ
కారుణ్యరూపాయ
కైకేయీ ప్రియకారిణే
దాంతాయ
శాంతాయ
విశ్వామిత్ర ప్రియాయ
యజ్ఞేశాయ
క్రతుపాలకాయ
కేశవాయ (౩౦)
నాథాయ
శార్‌ఙ్గిణే
రామభద్రాయ
నారాయణాయ
రామచంద్రాయ
మాధవాయ
గోవిందాయ
పరమాత్మనే
విష్ణుస్వరూపాయ
రఘునాథాయ (౪౦)
అనాథనాథాయ
మధుసూదనాయ
త్రివిక్రమాయ
సీతాయాఃపతయే

ఓం వామనాయ నమః
రాఘవాయ
శ్రీధరాయ
జానకీ వల్లభాయ
హృషీకేశాయ
కందర్పాయ (౫౦)
పద్మనాభాయ
కౌసల్యాహర్ష కారిణే
రాజీవనయనాయ
లక్ష్మణాగ్రజాయ
కాకుస్థాయ
దామోదరాయ
విభీషణ పరిత్రాత్రే
సంకర్షణాయ
వాసుదేవాయ
శంకర ప్రియాయ (౬౦)
ప్రద్యుమ్నాయ
అనిరుద్ధాయ
సదసద్భక్తిరూపాయ
పురుషోత్తమాయ
అధోక్షజాయ
సప్తతాలహరాయ
ఖరదూషణసంహర్త్రే
శ్రీ నృసింహాయ
అచ్యుతాయ
సేతుబంధకాయ (౭౦)
జనార్దనాయ
హనుమదాశ్రయాయ
ఉపేంద్రచంద్రవంద్యాయ
మారీచమథనాయ
వాలిప్రహారణాయ
సుగ్రీవ రాజ్యదాయ
జామదగ్న్యమహాదర్పహరాయ

ఓం హరయే నమః
కృష్ణాయ
భరతాగ్రజాయ (౮౦)
పితృభక్తాయ
శత్రుఘ్నపూర్వజాయ
అయోధ్యాధిపతయే
శత్రుఘ్నసేవితాయ
నిత్యాయ
సత్యాయ
బుద్ధ్యాది జ్ఞానరూపిణే
అద్వైత బ్రహ్మరూపాయ
జ్ఞానగమ్యాయ
పూర్ణాయ (౯౦)
రమ్యాయ
మానాథాయ
చిదాత్మనే
అయోధ్యేశాయ
శ్రేష్ఠాయ
చిన్మాత్రాయ
పరమాత్మనే
అహల్యోద్ధారణాయ
చాపభంగినే
సీతారామాయ (౧౦౦)
సేవ్యాయ
స్తుత్యాయ
పరమేష్ఠినే
బాణహస్తాయ
కోదండధారిణే
కబంధహంత్రే
వాలిహంత్రే
దశగ్రీవ ప్రాణసంహార కారిణే (౧౦౮)

తత్సత్ శ్రీరామార్పణమ

## ఫలశ్రుతి

క. ఎంతకు నష్టోత్తర శత, సంతత దివ్యస్తుతియె పొసంగదు జనులం
దంతవఱకె పాపభయం,బంతక భయ మంతవఱకె యజ్ఞానంబుల్.

సీ. అశ్రద్ధతోడుతనైన శ్రీరామ నా,మము పఠించినను మోక్షము లభించు
వీనుల విందుగా విన్న స్మరించిన, దురిత జాలంబుల పరిహరించు
ఒకమాఱు చదివిన నుజ్జ్వల దుష్ప్రీతి, గ్రహదోష దుఃఖంబు కడఁ ద్రోలంగు
దీని కీర్తించిన మానవశ్రేష్ఠుల, నాపత్తు లెన్నడు నంటరావు

గీ. సకల వేద పురాణ శాస్త్రంబు లొకట, రామనామ కీర్తన పుణ్యరాశి నొకట
నుంచి తులఁదూప నామంబె మించి తూగె, ననగ శ్రీరామనామం బనంగ నసదె ?

గీ. పుత్రకాములు గంద్రు సత్పుత్రచయము, అర్థకాములు గంద్రు సర్వార్థచయము
కామ కాములు గంద్రు సత్కామచయము, తెలిసి యష్టోత్తర శతస్తుతిని బొనర్ప!

గీ. మోక్షకాములు గంద్రు సన్మోక్ష పదము, భక్తికాములు గంద్రు సద్భక్తిపఱత
ఎద్ది కోరినవారల కద్ది కల్లు, తెలిసి యష్టోత్తర శత స్తుతిని బొనర్ప!

క. కుంభోదరుం డొనర్చిన, శుంభత్ స్తోత్రంబు నీకు సుగమంబు శుభా,
రంభంబుగ వినుపించి తొ,గిం భూప్రజ లిది బఠించి కృతకృత్యులుగన్.

# షష్ఠమ సర్గము

## అశ్వమేధముచే పరమేశ్వరు నారాధించుట

వ. శ్రీరామచంద్ర ప్రభుండు.

గీ. రమ్య పీఠంబునందు స్థిర ప్రవృత్తి, నుండ కుంభోదరుండు ఉద్దండు లైన
ఋత్విగులు శ్యామకర్ణమై యెసగుయజ్ఞ,హయముఁ గట్టి యూపస్తంభమందుఁ గడఁగి.

గీ. శమితచేత యథావిధిన్ జక్కఁదాని, యంగములను వెవ్వేఱుగా నధిక శ్రద్ధ
మీఱ నభిమంత్ర మొనరించి వేఱుపఱచి,ఆజ్యమునముంచి హోమంబు నాచరించి.

గీ. పాయసము గోఘృతంబును పఱగ తేనె, యందు ముంచి పిష్టంబు నమందగరిమ
తిలలు గరిక సమిత్తులు తేజరిలఁగ, నగ్ని నారాధన మొనర్చి రమిత భక్తి.

శా. పైనన్ వ్రేలెడి గోముఖంబువలనన్, బంగారు చాయన్ ప్రభా
నూనంబై వెలుఁగొందు గోఘృతము, ముందున్ వెన్కఁగాకుండ ధా
రా నిర్వాహకమై తగన్, సవన పర్యంతంబు కారంగ, సం
ధానంబుం బొనరించి రింపుగ రసోద్ధారన్ సమంత్రంబుగన్.

మ. గగనంబెల్లెడ హోమ ధూమము మహార్కచ్ఛన్నమై పర్వ, నిం
పగు వాసంతపు చైత్ర శుక్లమున బొల్పావాజి మేధంబు శ్రీ
భగవంతుండగు వాసుదేవుని ముదప్రాప్త్యోద యార్థంబు సొం
పుగ నారాధన మాచరించిరి విధిస్ఫూర్తిం గడున్ శ్రద్ధమై.

గీ. అగ్నిహోత్రాది శుభ లక్షణాత్తమైన, ప్రకృతి వికృతి యజ్ఞంబులు భాసిలంగ
ద్రవ్య విజ్ఞాన సత్క్రియాధ్యక్షుండైన, ఈశ్వరుని గొల్చి రచ్చట నెలమి మివుల.

యజ్ఞ దినచర్యా వర్ణనము

ఉ. ప్రొద్దునలేచి యింద్రు నజు రుద్రు సురాదుల సీతతోడుతన్
దద్దయు మ్రొక్కి, మానుల ముదంబున వందన మాచరించి, పె
న్నిద్దపు భక్తి తల్లుల ననేక విధంబుల ప్రాంజలించి, పెం
పొద్దిక కామధేను మణి నుజ్జ్వల శ్రద్ధ నమస్కరించుచున్.

గీ. యజ్ఞ వాటిక నున్న యయ్యజ్ఞ పురుషుఁ, జేరి సాష్టాంగ మెఱఁగి విచ్చేయు రామ
తీర్థమున స్నానమాడ ప్రతి దినమును య,థా విధిగ రామచంద్రుఁ డత్యంత నియతి.

క. నిత్యాహ్నికమ్ములై తగు, కృత్యంబుల నిర్వహించి శ్రీ సాంబశివున్
స్తుత్యంఘ్రుల కభిషేకం, బత్యంత శ్రద్ధఁ జేయు నవనిజ తోడన్.

ఆ. కామధేను శమ్య కల్పితానుపమోప, హారముల సుతృప్తులై రహింప
ఋత్విజులను సత్కరించి సద్గురు సన్ని,ధానముఁగను సావధానముగను.

ఉ. అందఱు ఋత్విగుల్ మునులు నందఱు దేవతలున్ మహీశులున్
తొందఱ తెల్లవారఁగనె తోయములన్ గొని స్నాన కృత్యముల్
జెందుచు యజ్ఞశాలను వసింతురు భక్తి భయమ్ము లొప్పగన్
సందడి మీఱ నంద ఉపచార పరంపర తుష్టహృష్టులై.

సీ. కామధేనూద్భవ కమ్రవస్తువుల స,త్కారించు గడు సుమిత్రా ప్రసూతి
జానకి యాజ్ఞలపూని యూర్మిళ మాండ,వీ శ్రుతకీర్తులు విందులిడుదు
రెంతో పరిమళా క్రాంత హవిర్ద్రవ్య,ములు వేల్తురొగి ఋత్విజులు చెలంగి
యాహరింతురు పురోడాశంబులను ధరే,జా రామచంద్రుల సరసనుండి

గీ. దేవతలు హవిర్భాగముల్ తిందు రచట, వచ్చి ప్రత్యక్షముగ, సర్వవాద్య వితతి
వేద ఘోషము లెడలేక బాదుకొనును, శ్రీధరునిఁ దగు శుభదాశ్వమేధమునను.

ఉ. మంగళ యజ్ఞకుండమును మధ్య మనోహరమై రహింప, వా
రాంగన నృత్యము ల్చెలగ, నందఱు దేవతలున్ సువాసినుల్
సంగతి యక్షకిన్నరులు క్షత్రియులున్ పెరవారలున్ మహో
త్తుంగ తరంగ మాలికలఁ దోచు సముద్రముఁగాఁ దనర్చెడిన్.

క. మధ్యాహ్నము బుత్విజులున్, మాధ్యాహ్నిక కృత్యముల సమస్తముఁ దీర్పన్
సాధ్యమయినంత కును సర,యూధ్యేయ నదీ స్థలీప్రయుక్తి సఫలులై.

సీ. పఱఁగ యాజ్ఞిక మంటపమునకు వచ్చి క,నక పీఠమున గూర్చొనంగ నీశ్వ
రాది దేవతలు మున్యాదులు దివ్యాస,నంబులనుండి యుపొ్పంగ భరత
శత్రుఘ్నులం గూడి సమముగ బంగరు,పాత్రల లక్ష్మణుం డాత్రమునను
ఆసాదనము సేయ నవనిజ యూర్మిళ, మాండవీ శ్రుతకీర్తి మంత్రిపత్ని

గీ. మిత్ర పత్నులు మొదలుగా మివుల వేన,వేల కొలఁదిగ కామ గవిప్రదత్త
దివ్య పక్వాన్నములను తృప్తిఁ గన వడ్డ,నములు సేయంగ మునులు నానందపడుచు.

గీ. సీత మొదలుగ నచ్చటి స్త్రీజనములు, తగఁగ నూపుర కింకిణీ ధ్వనులు సెలఁగ
రామునాజ్ఞ యథేచ్ఛాభి రామలగుచు, సేయుదురు వడ్డనలు అఱసేయకెపుడు !

గీ. భోజనమున సంకోచింపఁ బోలదండి!, కావలసినది యడుగుఁడీ! కమ్రరీతి
ఇష్టపడనిది పరిహరియింపఁ దగును ! తృప్తిని యథా సుఖముగ వర్తింపరండి !

క. కోరిన వారలకెల్లం, గోరిన పక్వాన్నముల నకుంఠిత రీతిం
ధార తెగకుండ నేతిం, బోరన వడ్డింపుఁడని ప్రభుఁడు గడుఁ బలుకన్.

గీ. ఇంక కొంచెము వడ్డింతు మెలమి ననుచు, వడ్డనము సేయువారలు, వద్దువద్ద
టంచుఁ బల్కెడి తినువారి మించు పల్కు, లెల్లెడల వినవచ్చు నందెచట వినిన.

క. నడుమ నడుమ శ్రీరాముఁడు, కడఁగి స్వామి! కొంచెముగ సగంబుగ భిడియం
పడకయు మఱి తొందఱయుం, బడక తినుండని కనుఁగొను పలువిధములుఁగన్.

క. వ్యజనంబులచే విసరఁగ, భుజియింతురు! వేడినీళ్లఁ బోవగ జిడ్డుం
గఱ బిజులులేక హస్తాం, బుజములు కడిగికొని పాదములు కడిగి వెసన్.

శా. తాంబూలంబుల నంది, రామఘన ముద్రల్ ముద్రితంబైన స్వ
ర్ణంబున్ దక్షిణలంది, నిర్ణయపు విశ్రామస్థలం బందు కొం
చెంబున్ విశ్రమణంబునుం బొఱసి, స్వేస్వేకార్య జాలంబు తూ
ర్ణం బేమాత్రములేక వర్తిలుదు రార్య ప్రాభవోపేతులై.

ఉ. క్షత్రియ వైశ్యశూద్రులును సమ్మతితో భుజియింతు రాపయిన్
రాత్రియు నిట్టులే జరుగు, రమ్యములౌ దగు స్త్రీల శాలలం
దాత్రములేక సక్రమ విధాప్తి నొగిం జరియింతు రెవ్వఁడున్
సత్రమునందు యజ్ఞమున జక్క నతృప్తులులేరు లేరటన్.

క. జనపదమువారు పౌరులు, తనసేవకులున్ భుజించి తనియుట శ్రీరా
ముని లెక్కలోనికిన్ వ,చ్చిన పిదపయె తాభుజించు చెల్వాలరారన్.

క. ఆకలి వినబడ దచ్చట, చేకొని యెవ్వానికిని నిషేధములే ద
ప్ర్వాకట దివ్యాధ్వరమున, శ్రీకరలీలన్ వహించు శ్రేష్ఠ పథంబుల్.

చ. ప్రతిదినమున్ మహాధ్వర ధరన్ భుజియించెడు బ్రాహ్మణాది సు
ప్రతిభు లసంఖ్యులౌదురు, ప్రపంచ రజం బుదకంపు బిందువుల్
ప్రతిన నభోస్థలమ్మున విరాజిలు తారలు లెక్క పెట్టుచే
అతి సులభంబు ; యజ్ఞపు జనావళి తేలదు లెక్క యెక్కుడై.

క. రామునితో సోదరులున్, రాముని కార్యమున భక్తిరాజిలు బాంధ
వ్యామాత్యులవలె సీతా, భామినితోఁ గుడుతురాత్త బాంధవు లనుజుల్.

ఉ. అత్తలు మంత్రి పత్నులు మహత్తరరీతిఁ జెలంగ స్వస్థ మా
చిత్తములం జెలంగఁగ భుజింతురు నాల్గవ జామునందునన్
నృత్తము గీతవాద్యములు నిర్మల పుణ్యకథా ప్రసంగముల్
మొత్తములై యెసంగ నహముల్ చను యజ్ఞవిధాన మందునన్.

క. అందఱు సాయం సంధ్యా, వందనముల నాచరించి వదలక అగ్నిన్
బొందుగ సల్పుచుఁ గడు రా,త్రిం దివములుఁ గడుపుదురు హరికథల వినుచున్.

గీ. రాత్రి రెండుజాముల దాక రమణ నిట్లు, సల్పియందఱు నిద్రావశంబు వలనఁ
గల్గు నానంద మంది వేగ గడు వేగ, నామ కీర్తనతో లేతు రామెయిఁ గడు.

ఆ. సీతతోడ నిట్లు శ్రీరామచంద్రుండు, బ్రహ్మచర్య దీక్షఁ బఱఁగి యేక
శయ్య నిద్రఁజెందు, స్వానంద నిద్రావ,శమున నన్న, గురువుఁ జక్కఁగాంచి.

గీ. శిష్యుఁడౌ విష్ణుదాసుఁడు చెలగి ప్రశ్న,చేసె, సద్గురూ ! యజ్ఞదీక్షా సమయము
నందు తగునకో ? యేకశయ్యం దనరుట, దంపతులకన్న శ్రీరామదాసుఁ డనియె.

ఆ. ఆజ్ఞ సేయకుంట యవనీపతికి శిక్ష !, వినతి సేయకుంట విప్రశిక్ష !
వేరు శయ్యసేత నారీమణికి శిక్ష !, శస్త్రరహిత వధ నిజంబుఁగనిన ! ! !

క. కావున సీతాసమేతుఁ,డై వేఱుగఁ గాకయుండి యవిరళదీక్షా
భావమున బ్రహ్మచర్యా, సేవనమున నేకశయ్యఁ జెలఁగున్ శిష్యా !

మ. ఇది సామాన్యులకున్ సుసాధ్యమగునే ? ఇంద్రాది దేవాళికిన్
మది స్వాధీనము కాక పెక్కుగతులన్ మర్యాదలం బాసి శా
ప దవాగ్నిం బడి మ్రగ్గి, రట్లయిన నేపట్టున్ ధృతిం దూలకం
దుదిఁ గాంచున్ ప్రతి దీక్షలో రఘుకులేంద్రుం డగ్ర కక్ష్యంబునన్.

క. ఇదియే తక్కిన వారికి, సదయాత్ముఁడు రామునకు భృశంబగు భేదం
బుదితం బిట్టుల దినచ,ర్యఁ దనరు శ్రీరాము నాశ్వికాధ్వరమందున్.

# సప్తమ సర్గము

## విష్ణుధ్వజారోహణ మహిమాభివర్ణనము

సీ. సోమరసము పిండు సుత్యాహముల యాజ,కుల సదస్యులను పూజ్యులను రామ
చంద్రుఁడు సముచిత సత్కార మొనరించె, నధ్వర మంటపమందు భక్తి
రాజిల నెల్లరు రాజులు చైత్రశు,ద్ధ ప్రతిపత్తి యథావిధి గను
ధ్వజములన్ స్థాపించిఁ దనరి రటన్న గు,రుని గాంచి శిష్యుఁ డిట్లనియె శ్రద్ధ

గీ. సద్గురూ! యజ్ఞమంటపస్థలిని రాజు,లేల ? స్థాపించిరి ధ్వజమ్ము లేమి? ఫలము
వారలకు తద్విధానము వారకను స,విస్తరంబుగ నంతయు వినఁగ వలతు.

మ. అని ప్రార్థించిన రామదాసుఁడు సమాహ్లాదంబుగా నీవు చే
సిన ప్రశ్నంబు ప్రశంసనీయము కదా! చెప్పందొరంకొంటి దీ
నిని శ్రద్ధన్ వినుమన్న! ఇయ్యది కదున్ నిర్నిద్రపుంభక్తి చే
సిన నత్యంత ఫలప్రదంబు వ్రతమున్ సిద్ధాంత మెప్పట్టునన్.

క. లోకోపకారకంబగు, శ్రీకరమగు దాని నిపుడు చెప్పెద తగ నీ
వాకర్ణింపుము కనక ప,రాకు విష్ణుదాస! శిష్య! రమణీయముగన్.

చ. నృపులట యజ్ఞవాటమున నిల్పిరి! కాకను విష్ణు శంకరా
ధిపుల శుభాలయంబుల విధిప్రతిపాదితరీతి శుక్లప
క్షపు ప్రతిపత్తినిన్ కడఁగి చైత్రమునన్ ప్రతి వత్సరమ్మునన్
నిపుణత నల్పుటొప్పు శివునిన్ గుడిలో శివరాత్రిశ్రేష్ఠమా.

## విష్ణుధ్వజారోహణ వ్రతవిధానము

గీ. చైత్రశుక్లాష్టమిని దేవి సన్నిధాన,మందు ముఖ్యంబు ; కాదేని మంచిదిగ గ
ణింత్రు నవమియు దశమియు నిర్ణయింత్రు, కార్తికపు శుక్ల ప్రతిపత్తు కడకు శుభము.

సీ. శ్రీరామ సంతోష కారణంబును పవి,త్రంబును దురితాపహంబునైన
సద్ధ్వజారోహణ సంజ్ఞితంబగు వ్రత,మును నిరూపింతు సమ్మోదము తోడ
విష్ణు మందిరమున వెలయించు నెవ్వఁడు,ధ్వజ మాతనిన్ విధాతయె భజించు
ఇతరు లనంగ నింకెంతటి వారలు!, అట్టి ఫలంబు సామాన్యమగునె?

గీ. బ్రాహ్మణుఁడు కుటుంబికి వేయి బారువలు హి,రణ్య మిచ్చిన ఫలమును, రమణమీఱ
లింగపూజా ఫలంబును, గంగయందు, స్నాన ఫలమును, తులసిపూజా ఫలంబు.

క. సర్వవిధ పాపహరణ మ,పూర్వము బ్రహ్మాది దివిజపూజిత మగుటన్
నిర్వహణ చేయఁ దగినది, సర్వులకున్ విధి యగున్ ధ్వజవ్రత మనఘా!

ఆ. సుప్రభాతమునను శుచియయి స్నానాది, నిత్యకర్మములను నియతిఁ దీర్చి
విష్ణుమూర్తి నిట్లు విమలుఁడై యారాధ, నంబు సల్పవలె క్రమంబు మీఱ!

క. స్వస్తి వాచనంబులతో, వస్త్రాలంకృతములై ధృవములై నిడుపై
నిస్తుల్యములగు రెండు ధ్వజ స్తంభంబులను పూజ సల్పఁగ వలయున్.

శా. నాందీ శ్రాద్ధము మున్నొనర్చి, నియతిన్ నానావిధ బ్రాహ్మణా
స్పంద ప్రోక్షణ మాచరింపవలయున్, మంత్రాళి, గాయత్రిచే
సౌందర్యంబుగ, నప్పతాకములపై సామీరినిన్ వైనతే
యుం దాత్పర్య మెలర్ప వ్రాయవలయున్, యోగ్యస్ఫురద్దీప్తిమై.

ఉ. ధాతృ విధాతృ దేవతల తప్పక ద్వాకలశంబు లందునన్
పీత శుభాక్షతంబులను పిమ్మట దూర్వలతోడ ముఖ్యమా
న్వేత సుమంబులన్ గడువిశేషముగా యజియించి, పిమ్మటన్
చేత మెలర్ప నగ్నిని భజింపవలెన్ ఘృతపాయసంబులన్.

వ. గోచర్మ మాత్ర స్థండిలము పఱచి, దానియందు స్వగృహ్యోక్త విధానముగా హోమము చేయవలయు. అందష్టోత్తర శతఘృతాహుతులు, మొదట పురుష సూక్తముచే "విష్ణోర్నుకేన" మంత్రముచే హోమముచేసి, పిదప వైనతేయునికి స్వాహాకారముతోడ నెనిమిది యాహుతులను, మారుతికి నట్లే యెనిమిది యాహుతులను, హోమమొనర్చి, "సోమోధేనుం" అను మంత్రముచే హోమము చేయవలెను. భక్తితోనచట సౌర మంత్రంబులను శాంతి సూక్తములను జపించవలయు.

క. శ్రీవిష్ణు సన్నిధిన్ శుచి,యై వెలయుచు జాగరణముమై నుండవలెన్
ఈ విధమున నవరాత్రులు, వోవగ పూజించి భక్తివాదలన్ నియతిన్.

శా. దేవద్వారమునందునో? శిఖర మందేనో? దృఢస్థాన మం
దావిష్కార మొనర్చి శ్రీహరిని పూజారాధ నాద్యర్చలన్
నైవేద్యాదులఁ గొల్వఁగా వలయు శైవాగారమందైనన్
దేవీ యాలయమందు తత్తదుచితోక్తిం బూజఁగావింపనౌ.

క. నందీ భృంగీ విగ్రహ, సందోహము శివుని ధ్వజవిషయమున దేవీ
సందర్భంబున సింహం,బుం దప్పక వ్యాఘ్రముం బ్రభుత వ్రాయఁదగున్.

క. శ్రీ విష్ణు సన్నిధానము,లో విత్తమునం దొకింత లోభపడక యి
ట్లావిష్కరించి ధ్వజములఁ, గావించి ప్రదక్షిణంబుఁ గడకొని భక్తిన్.

శ్లో॥ నమస్తే పుండరీకాక్ష నమస్తే విశ్వభావన
నమస్తేస్తు హృషీకేశ మహాపురుష పూర్వజ ౧

శ్లో॥ యేనేదమఖిలంజాతం యస్మిన్సర్వం ప్రతిష్ఠితం
లయమేష్యతి యత్రైతత్ తం ప్రసన్నోస్మి మాధవం ౨

నజానంతి పరందేవం సర్వే బ్రహ్మాదయ స్సురాః
ధ్యాయంతియోగినోయం వై తం వందే జ్ఞానరూపిణం ౩

అంతరిక్షంతు వన్నాభి ర్ద్యౌర్మూర్ధాయస్య చైవహి
పాదాచ్చాభూచ్చవై పృథ్వీ తం వందే విశ్వరూపిణం ౪

యస్యశ్రోత్రాదిశ స్సర్వా యచ్చక్షుర్దిన కృచ్ఛశీ
ఋక్సామయజుషోయేన తం వందేబ్రహ్మరూపిణం ౫

యన్ముఖాద్బ్రాహ్మణాజాతా యద్బాహ్వోరభవన్నృపాః
వైశ్యాయ స్యోరుతోజాతాః పద్భ్యాం శూద్రస్త్వజాయత ౬

మనసశ్చంద్రమాజాతో దినేశశ్చక్షుష స్తథా
ప్రాణేభ్యః పవనోజాతో ముఖాదగ్నిరజాయత ౭

పాపసందాహ మాత్రేణ వదంతి పురుషంతుయం
స్వభావ విమలం శుద్ధం నిర్వికారం నిరంజనం ౮

క్షీరాబ్ధిశాయినం దేవ మనంత మపరాజితం
సద్భక్త వత్సలం విష్ణుం భక్తిగమ్యం నమామ్యహం ౯

పృథివ్యాదీని భూతాని తన్మాత్రాణీంద్రియాణిచ
సుసూక్ష్మాణిచయేనాస న్తం వందే సర్వతోముఖం ౧౦

యద్బ్రహ్మపరమంధామ సర్వలోకోత్తమోత్తమం
నిర్గుణం పరమం సూక్ష్మం ప్రణతోస్మి పునఃపునః ౧౧

నిర్వికారమజం శుద్ధం సర్వతోవహ్ని మీశ్వరం
యమామనంతి యోగీంద్రా స్సర్వకారణకారణం ౧౨

ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః
త్రీన్లోకాన్ వ్యాప్య భూతాత్మా భుఙ్క్తే విశ్వభుగవ్యయః
నిర్గుణః పరమానంద స్సమే విష్ణుః ప్రసీదతు ౧౩

హృదయస్థోపి దూరస్థో మాయయామోహితాత్మనాం
జ్ఞానినాం సర్వధర్మస్తు సమే విష్ణుః ప్రసీదతు ౧౪

చతుర్భిశ్చచతుర్భిశ్చ ద్వాభ్యాం పంచభిరేవచ
హూయతేచ పునర్ద్వాభ్యాం సమే విష్ణుః ప్రసీదతు

శ్లో॥ జగద్ధితార్థం యోదేహ మదధల్లీలయాహరిః
యమర్చయంతి విబుధా స్సమే విష్ణుః ప్రసీదతు
జ్ఞానినాం కర్మిణాంచైవ తథా భక్తిమతాం నృణాం
గతిదాతా విశ్వభుగ్య స్సమే విష్ణుః ప్రసీదతు
యమామనంతి వైసంత స్సచ్చిదానంద విగ్రహం
నిర్గుణంచ గుణాధారం సమే విష్ణుః ప్రసీదతు
పరేశః పరమానందః పరాత్పర పరః ప్రభుః
చిద్రూపశ్చ పరిజ్ఞేయ స్సమే విష్ణుః ప్రసీదతు.

వ. ఇట్లు స్తోత్రం బొనర్పవలె.

క. ఎవఁ డీ స్తోత్రంబు పఠించు వాఁడు సకల దురితములకుఁ జొప్పడ కుండుర్
అవలన్ వైష్ణవలోక, ప్రవణుండగు సంశయింప రాదెవ్వరికిన్.

ఉ. దీని బఠించి బ్రాహ్మణులఁ దేవుని వోలె భజించి, పిమ్మటం
బూని పురోహితుం గొలిచి, పొల్పెస లారఁగ దక్షిణల్ దగం
గా నిడి తాంబులంబు లొసగన్వలె, పిమ్మట పుత్ర మిత్రులుం
గానగు వారితోఁగలసి కైకొనఁగావలె పార్వణంబునున్.

క. సత్య వ్రతుఁడై యెవ్వం, డత్యంత శ్రద్ధఁ దీని నాచరణము నా
ద్ధత్యమునఁ జేయు నతనికి, ప్రత్యక్షంబౌను విష్ణుభగవంతుఁ డొగిన్.

సీ. ధ్వజముననున్న వస్త్రం బెంతవఱకు గాలికి మిక్కుటముగఁ జలించుచుండు
నంతకు నాతని కఘములంటవు పాపియైనను వాని నఘాళి తొలఁగు
సూర్యుండు తోఁచిన సురుఁగు నయ్యంధకారావళి విధమున నన్ని యెడల
ధ్వజ మెన్నిదినములు తగ విష్ణుమందిర,మందుండు నన్ని యుగాంతరములు

గీ. విష్ణు సన్నిధినుండు నివ్విధపు దైవ,కార్యముం జూచి మోదించు ఘనుఁడు వంద
నం బొనర్చెడివాఁడు పాపంబు బాయు, నప్పతాకము వీచి యఘాళి విద్రుచు.

గీ. రాజులెల్లరు తొమ్మిది రాత్రు లిట్లు, పూజఁగావించి, రంతటి పుణ్య మొదవ
కున్న, శక్తులుఁ గానివారున్న, నొక్క, దినమునందైన చేయఁగాఁ దివురు ఫలము.

ఆ. యజ్ఞమునకు మున్నె యజ్ఞశాలన్ రఘూత్తముఁడు ధ్వజము నిల్పెఁ దగనెఱింగి
రాజు లటులొనర్చి రాజిలి రొగి పుణ్య,రాజిలోడుతన్ విరాజితులయి.

## శివాలయ ధ్వజారోపణ కాలము

క. శివరాత్రినాడు వారలు, శివసన్నిధిలో ధ్వజాళి శ్రేష్ఠంబుగ ని
ల్పి విరాజిలి రట శంకరు, శివుని యనుగ్రహము కల్గి శిరివహియింపన్,

గీ. ఈ ధ్వజారోహణ చరిత్ర మెలమి చదువు,వారు స్తోత్రంబు చదివెడివారు వినెడి
వారు తప్పక గాంత్రు మనోరథములు, విమల గుణ సముజ్వల భాస! విష్ణుదాస!

# అష్టమ సర్గము

## శ్రీరామాశ్వమేధమున అవబృథము

ఆ. చైత్రశుక్ల నవమి జన్మదినోత్సవ, దినమునందు రామజనవిభుని వ
శిష్ఠమౌని యాగశిష్ట ఫలావాప్తి, కొఱకు నవ బృంథంబుఁ జరుపుఁ డనియె.

ఆ. ఎండ లింక నతిశయించు ననుచు భీతి,వలన త్వఱ నహించు వర వశిష్ఠ
మౌని మాటమీద పూని శ్రీరాముఁడు, లక్ష్మణునికి నిట్టులన్ వచించె.

గీ. అవబృథ స్నానమునకు నుత్సవము తోడ, నిజము! వెడలంగ వలయు నిర్ణీతవేళ
దాటకుండఁగ, రామ తీర్థంబునకు జ,నంగ నేర్పాటు వేగ నొనర్పుమన్న.

శా. ఆజ్ఞాపించెను రాణివాసములు సైన్యంబుల్ తగన్ రాజులన్
యజ్ఞప్రాంగణభూమి సర్వము సమాయత్తంబుగా నిల్వ స
ర్వజ్ఞుండైన రఘూత్తముల్ మిగులఁ గూర్పన్, సర్వ వాద్యంబులన్
ప్రజ్ఞాచక్షుఁడు లక్ష్మణుండు చెలువారన్ మ్రోయఁగాఁ జేయుచున్.

క. స్వీయ రథ తురఁగ సుపదా,తి యాన వాహనాదికము తెఱవులు మివులం
బ్రియమార సిద్ధపఱిచెన్, ప్రయాణంబు రామతీర్థ పర్యంతమునన్!

గీ. ఉష్ట్ర గజములు సిద్ధమై యుండునట్లు, మార్గ మంతయు ధ్వజములు మహితమౌ ప
తాకములతోడ నలరార తత విచిత్ర,హార శోభితమై యుండు నటు లొనర్చె.

గీ. చందన రసాన మార్గంబు చల్లఁబడియె!, చెఱకు గడల నంటులు పూలచెట్లతోట్లు
మివుల శృంగారముగను నిర్మింపఁజేసె, పట్టు చీరల బఱపించె పథమునెల్ల.

క. పూ లెల్లడఁ జల్లిరి స,ర్వాలంకృతి యయ్యె! నృత్య వాద్యంబులతో
నాలవాలమై యెసఁగె మ,హా లక్షణ యుక్తమై మహత్తర శోభన్.

సీ. ఋత్విక్కు లొగి గమనేష్టిని చక్కగాఁ, గావింప నెఱిఁగిన యా వశిష్ఠుఁ
డధ్వర రథమున నగ్నిహోత్రము యజ్ఞ,పాత్రముల్ స్థాపించి భద్రపఱచి
జానకీరాము లాసీనులై యొప్పఁగా, నెల్ల ఋత్విజులుఁ దారెక్క పిదప
నెల్లెడలందు మునీంద్రుల వేదఘో,షమ్ములు పిక్కటి ల్లమ్మహిత ప

గీ. థమ్మునన్ సాశ్వ యజ్ఞరథమ్ము వెడలె, వందిజన వందితుండయి వచ్చుచున్న
జానకీరామ దర్శనమాన మాన,సాంబుజాతులై రెల్లజనంబు లచట!

సీ. తిన్నతిన్నఁగ వచ్చుచున్న సీతారాము,లున్న రథమునకు మున్నుఁగాఁగ
ధ్వజ శుభాలం కృతగజములు నడచె చ,తుర్విధ వాద్యముల్, తురఁగములను
నారూఢులై మ్రోయువారు నవ్వల వెండి, బంగారు బెత్తాలఁ బట్టు రాజ
దూతలు సాలంకృతులుఁగా వెడల, వారి, వెనుక వారాంగనా వితతియాడ

గీ. దేవ గంధర్వులున్ ముందు తేజరిలఁగ, ఋత్విగగ్నిహోత్రంబుల నెలమిఁగూడి
ఎంతొ వైభవ మెసగ నత్యంత లీల, నొప్పు శ్రీరామునిం జూడ నొప్పుగాదె?

మ. వెనుకన్ క్షత్రియ కామినీ గణము లావెన్కన్ మహారాజులుం
ఘన వాద్యంబులతో గజాదులును సంఘం బొప్పగాఁగూడి శ
స్త్ర నికాయంబుల తేజరిల్లు బహుళోష్ట్రంబుల్ రథానీకముల్
జన, తక్కుంగల వారుఁగూడ; నలరెన్ సమ్మర్ద మొక్కుమ్మడిన్.

గీ. అమ్మహోత్సవ వైభవం బభినుతింప, శక్యమే? యేరికైనను సకల మాని
పత్నులున్ రాజపత్నులుఁ బఱఁగ పూల, వాన గురిసి రా యజ్ఞ దంపతుల పైన.

సీ. వందిమాగధుల రవంబులు గంధర్వ, గానరవంబులుఁ గడలు కొనఁగ!
సస్వర వేదగానస్వనంబులు నవ, వాద్య స్వనంబులు నాణెమెసఁగ!
దారిలో వేడుకం దగఁ జూడవచ్చిన, వారి కోలాహల ధ్వనులు చెలఁగ!
శ్రీరామ జయము! సీతారామ జయ! మని, పల్కునెల్లఱ గొప్ప పల్కు లలర!

గీ. నింగి ముట్టిన యాధ్వనిం బొంగి పొరలె, ప్రేక్షకోత్సవ దర్శనా పేక్ష, వారి
భూరి సమ్మర్దనమ్ము నివారణంబు, సేయు భటపాళి సందడి చెలఁగె మిగిలి.

గీ. త్రోసికొని త్రొక్కుకొనివచ్చి దోర్బలమున, తమ్ము దర్శింప నెంచు మొత్తమ్ముజనుల
కోర్కి నెఱిఁగి వాజుల పడఁగొట్టి యుత్స,వమున సమ్మర్ద ముడుప తీవ్రత వహించు.

ఆ. రాజ భటుల హస్తరాజిత వేత్ర చా,లనముఁ గాంచి వేగ లక్ష్మణా! ని
వారణంబు చేయుమా! రాజభటుల పు,ష్పకము నెక్కఁ బల్కు ప్రజల కెలమి.

క. సంతోషముగా వారలు, సుంతయు కలహంబులేక సొంపుఁదలిర్పం
గాంతురు గాక! మహోత్సవ, మింత కస్తి వీరు బొందనేల? నటంచున్.

చ. పలికిన, లక్ష్మణుం డటులఁ బల్కిన, ప్రేక్షకపాళి పుష్పక
స్థలి నిలచెం దృటిన్; జరుగ సాగిన సందడి లేశమాత్రముం
గలుఁగక పోవ, పుష్పక ముఖంబున నుండి నభోముఖంబుగన్
జెలు వలరార! రాఘవుని సీతను వైభవ మల్లఁ గాంచుచున్.

క. ఓహోహో! మాజన్మము, లూహాతీతముగ సఫల మొందెగదే! నే
డాహా! కనువిందు మహో,త్సాహము! నానందమయ్యె! దర్శనమయ్యెన్.

సీ. మామనోరథము శ్రీరామచంద్రుని యను,గ్రహమున గద! సార్థకత వహించె!
ఆ రామచంద్రుఁడే ఆరయకున్న భ,టాళి దెబ్బలె కాక ఫలము కలదె!
ఇంత చక్కగ దర్శనేచ్ఛ కల్గిన మన,కెట్లుత్సవముఁ గాంచ నెసఁగు నకట!
ఆకాశవీధి విహరించు పుష్పక, మాటను పూరిపుల్లైన విడక

గీ. మొదటి నుండియు తుదిదాక యెదఁ జెలంగ,హాయిగా! వేడుకం గంటి మనుచు రామ
చంద్రుఁ బొగడని వారును సంబరమున, జేరి మ్రొక్కని వారట లేరు లేరు!

క. ఈరీతి వారలెల్లరు, ధారాళముగా చెలంగు తత్త్వముఁగని యా
నారీమణు లెల్లరు సీ,తా రామామణికి మ్రొక్కి తత్పరమతులై.

శా. తల్లీ! జానకి! స్త్రీజనంబులు సముత్సాహంబు శోభిల్లను
ద్యల్లీలన్ గనఁగా మహోత్సవము నుత్సాహంబుతో నుండియుం
కల్లోలంబు సమర్థమై యెసఁగుటం, గానంగ రాదయ్యె! మ
మ్మెల్లన్ పుష్పకమెక్క నాజ్ఞయిడి యెంతే ధన్యలన్ సేయవే!

మ. అని ప్రార్థింపఁగ రామచంద్రుఁగని ఔనా? లక్ష్మణుండింత మా
త్ర నిదానంబు నెఱుంగఁడా? అటులఁగాదా? మీర లాజ్ఞాపనం
బున లోపం బొనరించిరా? అబల లింపుంబెంపు శోభిల్ల ద
ర్శన కాంక్షా వితథ ప్రయాసలయి యార్యా! వేచి యున్నా రనన్.

గీ. స్త్రీలనెల్ల పుష్పకమున స్త్రీల శాల, యందున ప్రవేశమొనరింపు మన్న, యన్న
యాజ్ఞకు నమస్కరించి య య్యతివలను ని,మేషమున జేర్చె దివికి నశేషముగను.

ఉ. వారలు పుష్పకంబున నవారిత లీలఁ జరించి పుష్పముల్
వారక రామరామ జయ! వాలి విమర్దన రామరామ! శృం
గార గుణాభిరామ! జనకామిత కల్పక రామ! యంచొకే
తీరున వర్షపాతముగ దిమ్మరియించి రనేక భంగులన్.

క. అది కాంచి పూరుషులునున్, పదెపదె శ్రీరామ రామ! పాపవిరామా!
సదయాభిరామ! యనుచున్, ముదమున భజియించి పుష్పములఁ జల్లిరటన్.

శా. వీణా వేణు మృదంగ కాహళ ధ్వనుల్ వెవ్వేఱుగా మ్రోయ; వి
న్నాణెంబైన సువాసినీ జనిత గానంబుల్ నినాదింపఁగా
నేణీలోచనలైన వారవనితా హేలార్ద్ర గీతారవ
శ్రేణుల్ నృత్యములొప్ప, నుత్సవము నిస్సీమప్రభన్ వెల్గినన్.

గీ. రాజ విభవంబు తోడుత రాజవరులు, స్వర్ణరత్న విరాజ భూషణము లొలయ
ధ్వజ పతాక గజాశ్వ రథప్రశోభి,తముగ యజమాని వెంటరాఁదగి యెసఁగిరి.

క. ఈ భారము మ్రోయఁగ లేక భూమి కంపించె మానిగణ శోభిత మం
త్రాభాషణముల నాదము, శోభావంతమయి యొప్పె సుందరలీలన్.

గీ. దేవ గంధర్వ యక్ష పితృలు సుమవృష్టి వర్షముల తుష్టిఁ గనుచుండ, వస్త్ర గంధ
పుష్ప భూషణాలంకృత పురుష స్త్రీ జనములు గంధోదకములు చాలన మొనర్ప.

ఆ. పసుపు కుంకుమములు పఱఁగ గోరోచనాదికము తైలములును సకలమైన
రసములాది బహు సరస వస్తువులు పరస్పరము చల్లుకొనిరి సరసమొప్ప.

ఆ. హాస్యమునకు నిట్టు లభిషేకములు చేసికొనిరి! ఒకరికొకరు ఘనతరముగ
లేపనమ్ము చేసి రోపికలం బరీక్షించురీతి మది వహించె ముదము.

ఆ. ఇట్టు జరుగుచుండునట్టి వేడుకల వీక్షించుచున్ రథం బుదంచితముగ
సరయు తీరమునను పరఁగు శ్రీరామ తీర్థమున సీతఁగూడి తాను దిగి.

క. ఋత్విగ్గనపరివృతుఁడై, సాత్వికుఁడు జలేష్టికర్మ సలిపి యటుపయిన్
ఋత్విగులు పలుకు మంత్రవిధి త్వత తత్కర్మసమితి ధృతిసల్పె నొగిన్.

వ. అమ్మంత్రంబులు "పత్నీసంయాజావభృథ్యా"దులు. తదుపరి.

క. యజమాన పురస్సరులై, సుజనులు మునులున్ సమస్త సుక్షేత్రజ తీ
ర్థజ జలములు శత్రుఘ్నుఁడు, విజయముతో తెచ్చినవి సవిస్తర మతులై.

సీ. వేదమంత్రంబుల వేత్త్వోఱ యుచ్చరించుచు నభిషేకించుచునుఁ జెలంగి
రా జానకీరామ రాజేంద్రులకు దివ్యమంగళ తీర్థముల్ మహితరీతి
సరయూ నదీతీర వరమున దేవదుందుభులు మనుష్య దుందుభులు మ్రోగ
దేవ మానవులును పూవుల వానలఁ, గురిసిరి మనుజులందరును స్నాన

గీ. మాచరించిరి పాప దురాచరణులు, కూడ నవబృథ స్నానములాడి పాప
ముక్తులై భగవద్భక్త భక్తులై తరించి రయ్యెడలను ప్రకాశించి రెలమి.

సీ. అపుడు శ్రీ రఘుపతి అచ్ఛిద్రమా వెలి, పట్టువస్త్రంబులఁ గట్టి దివ్య
కంకణ కేయూర కనకకుండల సుముక్తాహార శోభిత దేహుఁడగుచు
హృదయంబునందు సంపద లీను చింతామణియు కంఠమందు మణి ప్రభువగు
కౌస్తుభ రత్నంబుఁ గదిసి ప్రకాశింప, కోటి సూర్య ద్యుతి కొమరు మిగిలి

గీ. దివ్య రత్నపీఠంబునం దవ్యయముగ, సికతమయమైన స్థలమున సీతతోడ
ఋత్విజులతోడ తాను పరివృతుఁడగుచుఁ, జక్కగ వెలింగె! శ్రీరామచంద్రమూర్తి!

శా. స్నానాలంకృత ఋత్విజాదులకు శ్రేష్ఠ ప్రస్ఫుటాలంకృతా
నానాశోత్తమ గో హిరణ్య ధరణీ నూత్నాంబరా భూషణో

ద్దానంబుల్ ఘన దక్షిణాకముగ విస్తారంబుగా నిచ్చి, వి
జ్ఞాన శ్రీదుఁడు సద్గురుండగు వశిష్ఠర్షిన్ ప్రపూజించుచున్.

క. ఏమిచ్చిన గురు ఋణముం, దీమంబున దీర్చఁగలము? దేవా! మీ కీ
కామ గవి నిచ్చుకోఁగా, నీ మెయిఁ దలచితిని తృప్తి నెలయింపఁగ దే!

మ. అని సాలంకృతమైన కామగవి నొయ్యన్ దేఱఁ బంపింపఁగా
మునినాథుండు రఘూత్తమా! కలదు మమ్ముం బ్రోవఁగా నందినీ
ఘన ధేనూద్భవమైన సంతతి! కడంకన్ యేల? నీ కామధే
న్వును దెప్పింతు! వనంగ మీ యభిమతంబున్ దెల్పుఁడీ సద్గురూ!

శా. మీ కెద్దాన ముదంబుఁ గల్గునో? భువిన్ మీ కేది కాంక్షింతురో?
లోకంబు ల్పదునాల్గు చూరఁగొనియేన్ లోభంబు కించిత్తు నేన్
గాకుండన్ మనసార తెచ్చి యొసగంగా శిష్యుఁ డున్నాఁడు! స్వా
మీ! కోరుండనఁగా, వశిష్ఠముని గంభీరాత్ముఁడై యిట్లనున్.

క. సాలంకృతముగ సీతా, లోలాక్షి నొసంగుదేని లోభింప కదే
చాలున్ నా తృప్తికి లో,కాలెల్ల నొసంగితేని గాంచను తృప్తిన్.

ఆ. కామధేనువేని కల్పవృక్షంబేని, దేవమణియు నేని తృప్తినిడవు
వేయుమాటలేల? యీయం దలఁతువేని, సీత నిమ్ము! కడమ రోతు సుమ్ము!

క. అని పల్కిన మునిమాటలు, విని జనులందఱును మోము వెలవెలబాఱన్
గనిరి భయభ్రాంతులు హా!, యని కొంద ఱిదేటి కోర్కియని విభ్రములై!

క. ఏమన్నా! యీ తబిసి కి,దేమీ! చాదస్తమా! యిదేటి కుతుక మి
ట్లే మనుజులైన మునులేం, గామింతురె! భార్య నిట్లుఁ గాఁగలదె? భువిన్.

క. కాదీ ముని నేడిట్లు వి,నోదించుచు నున్నవాఁడు నూ రనుఁడు నిజా
మోదము కాదు! పరీక్షా, వాదము కావలయు ననుచు వచియించి రటన్.

ఉ. రాముని ధైర్యముం దెలియ, రాముని గొప్ప ఉదార బుద్ధి నీ
భూమి బ్రసిద్ధమై నెగడఁ బొల్పెసలార వచించెఁగాక! నీ
భూమిజఁ గోరునే? ముని; యభూతము! కల్పన! మంచు, నిప్డు డీ
రాముఁ డికేమి? పల్కునో? తిరంబుగ వింద మటంచు కొందఱున్!

మ. తమలో తామిటు చెప్పుకోఁ దొడఁగి రంతన్ రామచంద్రుండు న
వ్వు ముఖం బొప్పఁగ యేమియుం జెదరకన్ భూజాత కన్సైగచే
కొమ రొప్పన్ తను డాసి నిల్వ, ఇదిగో! కొం డిచ్చుచున్నాఁడ! మీ
ధు ముదంబే యభిలాషణీయమని ముందుం ద్రోచె నజ్జానకిన్.

శా. సీతా వామకరంబు చేగొని తపస్వీ! సీతఁ గైకొమ్మిదే
సీతా దానము చేయుచుంటి! నిపుడే, స్త్రీదాన మంత్రంబు నా
చేతన్ బల్కఁగ సేయుమీ! యని వచించెన్ ! మానియుం గొంకుటెం
కేతన్మాత్రము నొందకే కొనియె నయ్యేణాక్షి! లక్ష్మీ సమన్.

క. అప్పుడు స్థావర జంగమ, మి ప్పుడమి చలించె! మెల్ల రిది యేమనుచున్
తప్పక దిగ్భ్రమ నందిరి, ఒప్పదు స్మృతి యెవ్వరికిని యొడలున శిష్యా!

క. చిత్ర ప్రతిమలె యైరి వి,చిత్రము! చిత్రమున నిట్టి చిత్రముఁగలదే?
ధాత్రిని మునుఁ గనుఁగొంటిమె?, చిత్రము లిప్పుడె జనించె చెచ్చెర ననుచున్.

క. విచ్చలవిడి! అత్యద్భుత!, మచ్చెరువు! జగాన నిట్టి యన్యాయములా?
చెచ్చెర బుట్టుట! యని జను, లెచ్చటఁ జూచినను పల్కుటే వినఁబడియెన్.

ఉ. సీతను జూచి యామెయి వశిష్ఠుఁడు, బాలిక! నిన్నొసంగె ని
ద్దాత! లసత్ర్పపూత చరితా! ఇక నా వెనుకన్ వసింపుమా!
కూతురు వోలె జూతు! జనకున్ ననుఁగా తలపోయు మన్న, భూ
జాత వినమ్రయై ముని వశంవదయై వెమక న్వసించినన్.

క. చింతాక్రాంత స్వాంత దు,రంత దుఃఖ వివశయయ్యె నవనిజ దుఃఖం
బింతయుఁ దోపఁగ నీక మ,ఱింత స్థిమిత దృష్టి సన్నిహితయై యున్నన్.

క. రాముఁడు గురువుం గని యో,స్వామీ! ఈ కామధేను సహితముగా నీ
భామిని మీ కిచ్చితిఁ గొను,డీ! ముం దిది యీమె కీ బడెన్ నాచేతన్.

క. అదిఁగాక నేను మీ కి,య్యది దాన మొసంగఁ దలఁచి యట్టి ప్రయత్నా
స్పద చిత్తవృత్తిఁ గంటిన్, మదినొక్కటి తలఁచి మాన మర్యాదయచే?

క. అని పల్కుచుండ జానకి, తన మనముం బట్టలేక తన కండ్లను వ
చ్చిన నీళ్ళఁ దుడిచి పులకం,బునుఁబొందె శరీరమెల్ల పొంగ వివశయై.

క. రాముని దృఢ ప్రార్థనముం, ధీమహితత్త్వమును దలఁచి దిగ్భ్రమగా శ్రీ
రామ! రఘువంశ తిలకా!, నీ మహితోదార లీల నిరుపమముఁ గదా!

శా. ఆయుష్మంతుఁడవై చరింపుము! మహాత్మా! తృప్తిఁ జెన్నొందితిన్
నీ యౌదార్యము ధైర్యముం దెలియఁ గొంటిన్ జానకిన్, నేను నీ
కీయంగా! కయికొమ్ము! వే అనకు మీ! యీ సీతతో తూచి నా
కీయన్ స్వర్ణము; దత్తముం గొనిన య ట్లేమాత్రముం గాదుసూ.

క. నా మాటమీద సీతా,భామన్ గైకొమ్ము! ఒక్క పలుకు వినుము! నీ
భామ నయోధ్యాపురి చిం,తామణి పుష్పకము నీయఁదగ దెవ్వరికిన్.

ఉ. కౌస్తుభరత్నమున్ మఱియు కామగవిన్ మఱి నీదు రాజ్యమున్
నిస్తుల దాతవయ్యు నియతిన్ గొని తక్కిన వేమియిచ్చినన్
స్వస్తి! మయోదితం బయిన సప్తకమున్ విడకున్న, నీకు శ్రీ
రస్తు! చిరాయురస్తు! శుభమస్తు! శుభోజ్జయమస్తు! రాఘవా!!!

ఉ ఇచ్చెడు పట్టునన్ యెముక, యింతయు నీ కరమందు లేదు, యే
మిచ్చిన నిత్తువీవు; నటు లిచ్చిన లోపము కాదు కాని, నీ
మెచ్చు ప్రభుత్వమందు మెరమెచ్చుల వారి ప్రభుత్వ మొప్పునా?
ఇచ్చిన నొట్టుసుమ్ము! గురుఁ డెందుల కిట్లనునో? గ్రహింపుమా!

గీ. అని నిరూపింప గుర్వాజ్ఞఁగొని తదీయ, పాదపద్మంబులకు మ్రొక్కి మోదమలఱ
సీతయెత్తు బంగారము చేత గురుని, తృప్తుఁ గావించి జానకీదేవిఁ గొనియె.

ఉ. నవ్వు మొగంబు తోడుత ఘనంబగు భూషణముల్ తొలంచి, తా
మవ్వపుభక్తి సద్గురుని మానితభక్తి నమస్కరించి, యా
జవ్వని సీత రాముని వశంవద యైనతఱిన్ మహాధ్వనుల్
నివ్వటిలెన్, సురాంగనలు నెక్కొన జేసిరి 'జే'నినాదముల్!

ఉ. పూలవానలఁ గుఱిసిరి భూనభోంత,రాళములు నిండ దుందుభీ రావములు పొ
నర్చి రెంతయు భక్తి దనర్చి రపుడు, మిగుల సంతస పడిరి! స్వామియును సీత.

క. జనులెల్లరు సంతుష్టాం,బు నిధిన్ మున్గిరి! చెలంగి భూపుత్రిక రా
ముని గన్గొనఁ దలచియు ల,జ్జను వొందున్ దలఁచుకొని లసద్దానమ్మున్.

క. దివ్యాలంకారంబుల, నవ్యయలీలన్ ధరించి యా రాముని క
ర్తవ్య మెఱిఁగి జానకి వా,స్తవ్యపు శ్రద్ధన్ నతించి తత్పార్శ్వమునన్.

క. ఆనందతుందిలయయ్యె, దానంబు లనేకములు ముదంబుగ సల్పెన్
మానితులఁ బేర్చి కడు స,మ్మానంబులఁ దృప్తిగా సమారాధించెన్.

క. జ్ఞాతుల రాజుల మిత్రుల, చేతోమోదంబుగా భజించి పొలిచె! సా
కేతాధిపతి యమేయ, ఖ్యాతుండై యాకసమున ఖరకిరణు క్రియన్.

క. అంగీలున్ తలపాగలు, సంగతముగ పుష్పహార చయములు రత్నా
భంగుర కుండల నికర మొ,సంగిరి హారముల పురుషసంతతి కెల్లన్.

క. కచమేచక ముఖ సంపద,లచలములై యొప్ప భూషణాళి యిడిరి స్త్రీ
నిచయమునకెల్ల నచ్చట, నచలానందాంబుధీ విహారిణులగుచున్.

గీ. కనక మేఖలములు ఘన దివ్యతాటంక,ములు చెలంగ భామినులు వెలుంగ
మెఱుపుఁ దీవలెల్ల మేదినీతలమున, తిరుఁగ వచ్చె ననఁగ తేజరిలిరి.

# న వ మ స ర్గ ము

## అయోధ్య సరయూ రామతీర్థ మహిమాభి వర్ణనము

క. అవబృథ సుస్నాతుండగు, నవనీపతి రామచంద్రు నవలోకన చే
సి విరించి ప్రముఖులతో, శివుడుఁ గూడి యిట్టులను విశిష్టతతోఁ బన్.

శా. వేదోక్తంబుగ సంస్తుతించి యనఘా! విఖ్యాతమై నీవు నీ
సోదర్యావనిజాళితో నవబృథ స్నానంబుఁ గావించుటన్
మోదంబొప్పఁగఁ జూచి ధన్యతను సంపూర్ణంబుఁగాఁ జెంది నా
మో! దేవా! ఇది పుణ్యకాలముగ సొంపుంగాంచు నెల్లప్పుడున్.

శా. ప్రత్యబ్దంబున నిట్టి కాలమున తీర్థస్వామియా నియ్యెడన్
ప్రత్యేకం బగుచున్ విశేష ఫలముల్ ప్రాప్తింపఁగా నిమ్ము! నీ
వత్యంతంబగునట్టి దివ్య వరముల్, ధ్యానించి ని న్నీతటిన్
ధృత్యారాధన తత్పరత్వమున నర్థిన్ గొల్చు నవ్వారికిన్.

ఉ. నీవు ప్రతిష్ఠ సల్పిన అనేకములై తగు లింగ పూజలన్
నీ వొనరించినట్టి యవనిం గల తీర్థములందు చైత్రమా
సావసరంబునన్ సలుపు స్నానము దాన మనేక పుణ్య సం
భావితమై మహత్త రఘుభంజక మయ్యెడుఁగాత! నీ కృపన్

క. నదులందు సరయువును బెట్టిద మగు పట్నముల యందు డీకొనఁగ నయో
ధ్య దశాంశల నుత్తమమై, పొదలుం గావుత! ప్రశస్త పుణ్యద గహారీ!

క. అని ప్రార్థించిన రాముఁడు, విని శంకర! దేవదేవ! విను, భవదీ యా
జ్ఞను సరయు వయోధ్యల కొప్పును గావుత! శ్రేష్ఠ పుణ్యపున్ శక్తి! శివా!

శా. వైశాఖంబున కన్న కార్తికము దివ్యంబై తగున్, దానికిన్
ప్రాశస్త్యంబగు మాఘ, మంతకు నహో! రమ్య ప్రభాభాసియై
దేశం బెల్లెడ చైత్రమొందుత! ప్రశస్తిన్; పుణ్యదంబై మహా
త్మా! శంభో! మును మార్గశీర్షమువలెన్ మన్నింపగా నాద్యమై.

క. ఈ మాసంబున చేసిన, హోమము దానంబు స్నాన యోగ్యత ధ్యాన
శ్రీ మహిమ కోటిరెట్లధి,కామేయ ఫల ప్రదంబునై భాసిలుతన్.

ఉ. పుణ్యము నిచ్చు క్షేత్రము లపూర్వము, లందున ముందు ముందుగా
గణ్య మయోధ్యయై నెగడఁగాబడు! తక్కిన చోట్లకన్ననుం
బుణ్యము వేయిరెట్లయి యపూర్వ ఫలప్రదమై తనర్చు, సా
ద్గుణ్యము లేని ముక్తి నొసగున్ పరమేశ్వర! నీకృపన్ శివా!

మ. సరయూ దివ్యనదీ ప్రవాహమున నీ చైత్రంబునం దొప్పుగా
వర మస్మత్కృత రామతీర్థమున నెవ్వం డాత్మ విజ్ఞాన భా
సురుఁడై స్నాన మొనర్చునో ? యతనికిన్ జో డెవ్వఁడో ; వాఁడు న
న్నరయన్ బొంది సుఖించు మామక మహాహ్లాదం బవార్యంబుగన్.

వ. మాఘస్నానము ప్రయాగయందువలెను, వైశాఖస్నానము చక్రతీర్థమందువలెను, కార్తికమున కాశీపట్టణమున పంచగంగాస్నానముంబలెను, చైత్రమాసమున నయోధ్యాపట్టణంబున రామతీర్థ స్నానము మంగళప్రదంబగుఁ గాత !

క. దేవతలయందు నభవా ! నీవాద్యుఁడవైన యట్టు లీ చైత్ర మయో
ధ్యావాసం బాద్యంబై, భావింపంబడును పుణ్యభాస్వర మగుచున్.

క. అని యామోదించిన మిం,చిన మోదంబందె నెలమి శివుఁ డది గని భ
క్తిని పార్వతి సీతం గని, జననీ ! శ్రీ హితముగాఁగ సద్వర మిమ్మా !

క. అని ప్రోత్సాహ పరుప నా, జనకపుత్రి పార్వతీ ప్రశస్త హితమునుం
గొని, యీ నా తీర్థంబున, గొనకొని చైత్రమున నేమగుద లతి భక్తిన్.

ఆ. శుద్ధ తదియ మొదలు శుద్ధ తదియదాక, సీతలాత్మక ప్రసిద్ధ గౌరి
వ్రతము పూని స్నానవ్రత మాచరింతురో?, వారి కిహపరంబుఁ గూరు గౌరి!

క. శుభకరమున్ సౌభాగ్యా,ద్యభివృద్ధికరంబునున్ మహత్తర సౌఖ్య
ప్రభవము సంతతి కరమును, నభంగుర విశేషదంబునై వర్ధిల్లున్.

ఆ. రామతీర్థమునకు వామభాగంబున, నాదు తీర్థ మెపుడుఁ బాదుకొనును
లోకమందు నా వనేక తీర్థమ్ములు, సరయు తీర్థమునకు సాటిరావు.

క. అని యిట్లు వరము నిచ్చియు, వినయం బేర్పడఁగ భర్త వెనుకఁ జరించెన్
ఘనుఁ డా వశిష్ఠు నాజ్ఞం, గొని యేగిరి యజ్ఞశాలకున్ విభవమునన్.

## శ్రీరాముఁడు యజ్ఞమంటమునకు వచ్చుట

ఉ. యజ్ఞరథంబుపైని జనకాత్మజతో రఘురామచంద్రుఁడున్
యాజ్ఞికులున్ యథావిభవులై తగఁగొల్వ వశిష్ఠుఁడున్ యథా
ప్రాజ్ఞ విశిష్ట వేదవిసర ప్రవినాదము లుల్లసిల్లఁగా
యాజ్ఞిక మంటపంబున కహా ! చేని రద్భుత సిద్ధి నెల్లరున్.

క. మంగళవాద్యధ్వనులుఁ జె,లంగగ కోలాహలంబులం బరఁగుచు ను
త్తుంగ మహోత్సవ భవ్య త,రంగమ్ముల నుదధిఫోల్కి రంజిలెడి సభన్.

మ. ఫలవస్త్రాభరణాదు లాగమవిధి ప్రఖ్యాత మంత్రాళితో
పొలుపారన్ దగు నగ్నిహోత్రమున మేల్పూర్ణాహుతిం జేసి ప్ర

జ్వలితాగ్నిఁ దగ బూజచేసి, కలయజ్ఞ ద్రవ్యపాత్రంబులన్
విలసద్రీతి విసర్జనం బొనరిచెన్ శ్రీరాముఁ డుత్కంఠతోన్.

## శ్రీరామాశ్వమేధ పరిసమాప్తి

సీ. యజ్ఞాంతమున ఋత్విగాళికి దక్షిణ, లిచ్చువాఁడై రాముఁడేపు మీఱ
తమ్ముఁడా! వీరలఁ దగ గొనిపోయి కో,శాగారమున దూత లందఱఁగని
దూరీకరించి నీ పూరకె నిలుచుండి, యెవ్వరెవ్వారు దామెంత యెంత
కైకొనియేఁగఁగాగలరో? అంతంత బం,గారముఁ గైకొనఁగా వచించి

గీ. వారి యాశ్రమంబుల కవి వాహనముల, మీఁదఁ బంపింప వలయు ప్రమాదపడక
లక్ష్మణా! యని వచియించి లక్షణముగ, తృప్తినొనరించె వారి కుత్తేజ మెసఁగ.

క. తక్కిన మునీంద్రులకు పెం,పెక్కఁగ నీచేతి నుండి యెంతో? విశేషం
బక్కజముగ నొసఁగుము స,మ్యక్కనకం బపరిమిత సమాదరణమునన్.

క. అని యాజ్ఞాపించిన తెఱఁ,గున లక్ష్మణుఁ డాచరించె! కూర్మిని వరియిం
చిన ఋగ్విజాళికిన్ భో,జనమిడి యుద్వాసనంబు సల్పెన్ దానున్.

ఆ. అమరవర్య శంకరాదుల విభవాను, సారముగను పూజసల్పి దివ్య
వస్త్ర భూషణాది వైభవములఁ దన్పి, వారి యాదరం బపారముఁ గని.

క. కొందఱికి గుఱ్ఱముల మఱి,కొందఱి కేనుఁగుల నింక కొందఱకు దగ
న్నందలము లిచ్చె నింకం, గొందఱ శస్త్రాస్త్ర వితతిఁ గూర్చెం దృప్తిన్.

ఉ. రాజుల రాణివాసముల రాజిలు నప్పరివారముం దగన్
భోజన భాజనంబుల నభూత సుపూర్వముఁ గాఁగ వెల్గు, వి
భ్రాజిత వస్తు సంతతు లపారముఁగా నిడి తృప్తిఁ జేసె, రా
రాజు రఘు ప్రవీరుఁడు కరంబు ముదంబెసఁగంగ నంతటన్.

## యజ్ఞమునకు వచ్చిన దేవోత్తమ నరోత్తములు శ్రీరాములను సత్కరించుట

గీ. అప్పు డక్కడ చేరిన యట్టి దేవ,తాళి రాజులు నధిదేవతలు సముద్ర
దేవతలు గిరిదేవతల్ తియ్యమెసఁగ, కానుక లొసంగిరా రమాకాంతునకును.

క. నాగులు ఖగదేవతులున్, మృగాధిదేవతలు గోసమితి దేవతలున్
బాగొప్పఁగ శ్రీరాముని, యాగపీఠమందు కాన్కలర్పించి రొగిన్.

గీ. అమ్మహారాజు శ్రీరాముఁ డతివతోడ, చక్కగ నలంకరింప పెంపెక్కి సోద
రాళి తను గొల్వ నపరార్క రామణీయ, మూర్తివలెను విరాజిల్లె ముదము తోడ.

సీ. చంద్రప్రభంబగు ఛత్రంబు వరుణుండు, పీఠాసనంబు కుబేరుఁ డొసఁగె!
ఇమ్ముగ తగు కిరీటమ్ము దేవేంద్రుఁడు, ధృతి చామరము వాయుదేవుఁ డొసఁగె!

ధర్మదేవత కీర్తిదము పుష్పమాలిక, యముఁడు సంయమన దండము నొసంగ!
బ్రహ్మ వేదాత్మకంబగు కవచంబును, శారద మేలైన హారమొసఁగ!
ఆ. శంకరుండు సుదశ చంద్రఖడ్గంబిచ్చె, కాళియు శతచంద్ర ఖడ్గమిచ్చె!
సోము డమృతమయ సుశోభిత తురగముల్, త్వష్టబ్రహ్మ ఘన రథం బొసంగె.

సీ. అగ్ని భట్టారకుఁ డా జగవము కార్ముకంబొప్ప రవికిరణంబు బాణ
మవని యోగమయమహాపాదుక లొసంగె, స్వర్గదేవత నిత్య స్రజసుమాల
ఖేచరుల్ నృత్య సద్గీత వస్త్రాదులు, మునులు నాశీర్వాదములు నొసఁగిరి
సంద్రుండు తనయందు జాతమౌ శంఖంబు, సింధు పర్వత నదీశ్రేష్ఠ దేవ

గీ. విసర మప్రతిహత రథవేగశక్తి, రాజు లొసఁగిరి రథగజరాజి తురఁగ
సైన్య గో వృష భోష్ట్రాది సంచయంబు, దాస దాసీ నికర మాయుధములగములు!

శ్రీ సీతారాములు యథాపూర్వకముగా రాజమందిరమును చేరి సుఖించుట

గీ. తత్త దుచితంబులైన మొత్తములు కాన్క,లర్పణ మొనర్చి రెల్లవా రర్హమతిని
ఇట్లు పూజింపఁబడి రాముఁ డెక్కె రథము ! అగ్నిఁగొని; వందిజనులు త న్నభినుతింప.

క. తక్కిన రాజాదులు తా, మెక్కిరి పుష్పకము మీద నేగి రయోధ్యా
పక్కణము వైభవము పెం,పెక్కఁగ జే! జే! నినాద మెల్లెడఁ బరఁగఁ.

సీ. మౌక్తికచ్ఛత్రము మఱి లక్ష్మణుఁడు పట్టె, తాళవృంతము భరత ప్రభుండు
చామర యుగళంబు శత్రుఘ్నుఁడు ధరించె, జలపాత్ర మాంజనేయులు వహించె
తాంబూల పాత్రిక దవిలి సుగ్రీవుఁడు, ఉమిగిన్నె నలుఁడు దా నొడిసిపట్టె
అంగద రాజు తా నద్దంబు కొనె విభీషణుఁడు చేకొనియె వస్త్రముల పెట్టె

గీ. జాంబవంతుండు ధూపపాత్రంబుఁ గొనియె!,వివిధఫలపాత్రములు మంత్రివితతి కొనిరి
పరిమళపు పాత్రలను పూజపాత్రలను ధరించి నడచిరి ప్రముఖ పరిజనులపుడు.

క. వారాంగనా పరీవృత, శ్రీరాముఁడు సీతతోడ చెలువలరారం
గా రథము నెక్కె వేడుక, విరాజిల్ల జల్లె బహు వివిధ గంధమ్ముల్.

మ. జలయంత్రాదులచే పరిమళ లసత్ సమ్మేళనానూన తై
ల లలామంబుల, చిత్రవర్ణ రచనా లావణ్య వైచిత్రి, రా
జులపై వేశ్యలపైని జల్లిన, మహా శోభాయమై యొప్పె, వా
రల వస్త్రంబు లనేక వర్ణములు మీఱున్ వాసనల్ గుప్పుచున్.

సీ. రాజ మార్గంబున రాజ మందిరమున, కరుగు శ్రీరాము దివ్యరథ మొప్పె!
వాద్యము లొప్పియగా వారాంగనల నృత్య, గాన వైభవములు కానఁబడఁగ!

వంది మాగధుల పసందులౌ సంస్తుతుల్, భూదేవ వేదనినాద మలరె!
గాయక సంతతి గానంబు లలరారె, జయ జయధ్వను లభ్యుదయము లయ్యె!
గీ. దారిలో దీపకలశ దధ్యన్న బలులు, పూర్ణ కుంభావళిం గొని పుర రమణులు
అన్నిచోటుల మంగళ హారతులిడ, రాజ మందిరముం జేరె రామమూర్తి!
గీ. రథము దిగి రామచంద్రుఁడు రమణి సీత, చేత నిజ నివాసంబున ప్రీతిమీఱ
నగ్నిని ప్రతిష్ఠ చేయించి యవల సభకు, వచ్చి దివ్య సింహాస నావసథమందు.
ఉ. రాజ కిరీట రత్నమణిరాజిత పాద సరోజుఁడై మహా
రాజు రఘూద్వహుండుఁ గడు రాజిలె, రాజ సతీలలామ వి
భ్రాజిత కేశపాశ వినిబద్ధ సుమప్రతి భానురాగ సం
పూజిత పాదపద్మయయి పొల్చె సతీమణి జానకమ్మయున్.
మ. తరువాతన్ సభలోన శంకరుఁడు స్తోత్రంబుం బొనర్చెన్, విభా
సుర వేద ప్రతిపాది తోత్తమ వచ స్తోమావళిన్ రాఘవే
శ్వరు! తత్ స్తోత్రము నెవ్వఁడేనియు ముఖస్తంబౌ నటుల్ నేర్చి యా
దర మొప్పం బఠియింప మోక్షము కరస్థంబౌ ననూనంబుగన్.
శా. శ్రీరామస్తవరాజ మంచు భువిలోఁ జెన్నారి భక్తాళికిం
గారామై యిహముం బరమ్ము తృటిలోఁ గల్పించుచున్ ముక్తిదం
బై రాజిల్లును విష్ణుదాస! అఘ సంహారంబుఁ గావించి పు
ణ్యారామంబున జేరుచున్, పఠన పాఠ్యంబై శుభం బిచ్చెడిన్.

శ్రీరామాజ్ఞచే దేవాదులు నిజనివాసంబులకు వెడలుట

సీ. శ్రీరామచంద్రుని చేత పూజింపఁగాఁ, బడి శివుఁ డమరాళి పరివృతుఁడయి
వృషభవాహనమున వేంచేసె తనదు ని, వాసమైనట్టి కైలాసమునకు
రాజ కామినులును రాజులు జానకీ, రాముల ఆజ్ఞాభిరాము లగుచు
తమ రాజ్యముల కయోధ్యను వీడి వెడలిరి, యజ్ఞవైభవ ప్రశంసా ప్రీతి కడఁగి
గీ. బ్రహ్మ తన సత్యలోక మింపారఁ జేరె, ఇంద్రుఁడుం స్వర్గలోకము నెలమిఁ జేరె
వారివారి యాశ్రమములఁ జేరి రిష్టులై మునీంద్రులు ఋత్విజు లమిత తుష్టి.
చ. అటు తరువాత రామ విభుఁ డర్మిలి ధర్మము తోడ నెట్టి లం
పటమును లేక రాజ్య పరిపాలనముం బొనరించె! జానకీ
పటుసుఖభోగ భోగియయి, భక్తిని శ్రద్ధ దశాశ్వమేధముల్
చటులత నాచరించె విలసద్గురునాజ్ఞ నతిక్రమింపకన్.
మ. తన సర్వస్వము సర్వరాజ్యమును విద్వన్మోద సంధాయిఁగా
వినయుం బొప్పఁగ యజ్ఞ దక్షిణగ నర్పించెన్ వశిష్ఠర్షి క

మ్మునియుం ధర్మ విభుత్వముఁ సలుప రాముఁ నిర్మితిం జేసె, రా
ముని యౌదార్యము! మాని వత్సలతయుఁ బొల్పార నన్యోన్యముల్.

## మంగళ వృత్తము

వాజిమేధ వరమంగళ వృత్తం,బే జనుల్ వినుదురేరు పఠింత్రో
రాజ రాజ రఘురామ కృపాప్తిం, దేజరిల్లుదురు ధృతి నవ్వారల్.

క. నీ వడిగిన శ్రీరాముని, దా వాజిమఖ ప్రముఖ మహావైభవ సం
భావిత సత్కథఁ దెలిపితి, శ్రీ విలసిల్లంగ భక్తి చెన్నలరారఁ.

సీ. ఈయాగ కాండంబు నెవ్వాఁడు ప్రొద్దున, భక్తితోఁ జత లేచి పఠన సేయు
వాని యిష్టంబులు వరుసతో సమకూరు, పుత్రార్థికి లభించు పుత్ర సుఖము
ద్రవ్యార్థి కొనఁగూడు ద్రవ్యవిశేషంబు, నశ్వమేధఫలంబుఁ బ్రాప్తమగును
హోమకాలమ్మున నొగి శ్రాద్ధ కాలము, వ్రతకాలమందు నెవ్వాఁరు భక్తి

గీ. యుక్తి జదువుదురవ్వారి హోమ శ్రాద్ధ, వ్రతము లొప్పు ఫలప్రాప్తి బహుళములుగ
అనవరత పూజలఁ జపధ్యాన సమయ,ములఁ బఠింపించినఁ ఫలములు లభించు.

గీ. దివ్య మంగళ చరితంబుఁ దెలిసి యాగ, కాండముఁ పుణ్యదంబని గట్టిపట్టు
దలను చదివిన వినిన వారల మనోర,థంబులగు రాముని యనుగ్రహంబు వలన!

### గద్యము

ఇది శ్రీ బాలభారతీ వరప్రసాదలబ్ధ కవితా ధౌరేయ
పండిత చిలుకూరి శ్రీరామశాస్త్రి నామధేయ
ప్రణీత శ్రీమదాంధ్రానంద
రామాయణాంతర్గత
యాగకాండము
సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

స్వస్తి శ్రీ సమస్త సన్మంగళాని భవన్తు.



# ఆనంద రామాయణము



## విలాస కాండము

## ప్రథమ సర్గము



### శ్రీరామదాసస్వామి శిష్యునకు శ్రీరామ స్తవరాజము నుపదేశించుట

రామ స్తవరాజమ్మున్ విపులమ్మున్ సిద్ధిప్రదంబున్ విన్
శ్రీరామ ప్రభుదాసవర్య ! గురు! కాంక్షింతున్ మహాసక్తినై
పరీ ! మాకు జగత్త్రయంబులను నా యీ రీతులన్ బెద్దగా
శ్రీరామాత్త రహస్య బోధకులు తండ్రీ ! మీరు కాకుండఁగన్.

ఆ. అనుచు ప్రార్థనంబు నతి కుతూహలతమై, సేయ రామదాస సిద్ధమాని
శిష్యుఁజూచి యిట్లు చెప్పె నీ ప్రశ్న ప్ర,శంసనీయ మిది యసంశయంబు!

క. ఏకాగ్ర చిత్తమున విను,మా ! కాకుత్స్థకులచంద్రమస్తోత్రము వి
ద్యాకల్పక మఘశోషణ, తా కేవల దావవహ్ని ధన్యం బరయన్.

సీ. అవ్యక్తమును త్రిగుణాధారమును శబ,ళంబును సచ్చేతనంబు నగుచు
నిత్యమంగళమయి నిరవయవంబయి, ముక్తి ప్రదంబయి మొనసియుండు
పరమతత్త్వంబయి పరమ శివంబయి, సురుచిరమై పరంజ్యోతియగుచు
నాదంబునన వ్యాపనము చెందుటను పర,బ్రహ్మమై దుఃఖ నివారకంబు

గీ. తారకంబన బరఁగు మంత్రంబు భువిని, చెలఁగు శ్రీరామ! యని జపించిన జనముల
బ్రహ్మహత్యాది దురిత నివారక మిది, వేదవిదు లిది యెఱిఁగి ప్రవీణులైరి !

క. శ్రీరామ రామ రామ ప,దారాధిత మతులు ఇహపరార్థధనులు వి
ద్యారాములు తాపత్రయ, దూరీకృతమతులు తత్త్వధూర్వహు లరయన్.

క. భుక్తి యిహమందు, పరమున, ముక్తి, సకల దురిత నిచయముక్తి, వ్యసన సం
సక్త జనతా దరిద్ర వి,ముక్తి నొసఁగి బ్రోచు, రామమూర్తి విమలుఁడై.

గీ. సర్వ సంపద్ప్రదాత ! విజ్ఞాన ఫలద, దివ్య మోక్షైకదాత! ధాత్రీ సుతా మ
నోహరుఁడు! భక్తజనతా మనోహరుండు!, రామచంద్రుండు! జగదభిరాముఁ డరయ!

క. ఆనందాత్మకుఁడును మో, క్షానంద ప్రదుఁడు నౌ జనార్దను మదిలో
నూని నమస్కారంబుల, ధ్యానించి రఘూత్తముని సమారంభింతున్.

సీ. రమ్యమగు నయోధ్య రత్న మంటపమున, కల్పవృక్షచ్ఛాయఁ గడఁగి యున్న
పుష్పక మందున పొలుపారు రత్న సిం,హాసనంబును ధ్యాన మమరఁ జేసి
దాని యందున నష్టదళపద్మమును రత్న, రాజితంబుగ సమగ్రముగఁ దలఁచి
అద్దాని మధ్య సహస్ర భాస్కర తేజ, ధారియై తండ్రియౌ దశరథేశు

గీ. సింహ పీఠంబునందు వసించువాని, ఇంద్ర నీలరత్నపు కాంతి నెసఁగువాని
సరస సుకుమార గాత్రు! విశాల నేత్రు! దివ్య పీతాంబర ధరుని దేవదేవు!

గీ. కోటి సూర్య ప్రభాత్త కిరీటహార, కటక కేయూర కుండల కంకణ మణి
సింజ మంజీర కటి సూత్ర శ్రీయలంకృ,తాంగు శ్రీవత్స వక్షస్థలాంతరాత్ము.

సీ. కౌస్తుభధారి ముక్తాహార శోభి చిం,తామణి యుక్త సౌందర్య రక్త
మణిమయమాలా సమాలంకృతుని దివ్య, రత్న ముద్రిక శోభి రమ్యహస్తు
కస్తూరి కర్పూర కాశ్మీర దివ్యగం,ధాలేప భవ్య దేహ ప్రశోభు
మందస్మిత ముఖారవిందు నైక్యాను సం,ధాన యోగాసక్తు నమలముక్తు

గీ. యోగ నియమక యోగ ప్రయోగనిపుణు, యోగగమ్యు నయోనిజు యోగదుని ద్వి
భుజు మహావీరు రాఘవు భూసుతా స,మేతు ధ్యానింపవలయు సంచేత మలర!

గీ. భరత లక్ష్మణ శత్రుఘ్న పరివృతుని, సు,రేంద్ర విద్యాధర వరమునీంద్ర సేవ్య
మాను, సకలకలా వంద్యమాను, నస్త్ర, శస్త్ర విద్యావిలాసు, ప్రశాంతు నమలు.

క. ఆనంద నిలయు, కౌస,ల్యానంద వివర్ధనున్, మహాసుందర ది
వ్యాననును, ధనుర్ధరున్, క,ళ్యాణ గుణగణాభిరాము, నాత్మదలంతున్.

ఆ. వెలుఁగులకు వెలుంగు విమలతేజోమూర్తి, దేవదేవు నిటు స్తుతింపుఁడనుచు
పరఁగ ధ్యాననిష్ఠ పార్వతితో పర,మేశ్వరుం డిటుల స్తుతించె రాము.

ఉ. ఎయ్యది యేకముం బరము, నెయ్యదనంత చిదాత్మకంబు, దా
నెయ్యది వ్యాపకంబు, మరియెయ్యది లోక హితంబు, సౌఖ్యముం
జెయ్యఁగ పుట్టువుం గని, భజించి, నసించినదాని వోలె, రూ
పయ్యు, నసక్తమై యెసగు నట్టి యచింత్యు భజింతు నిత్యమున్.

క. విజ్ఞానహేతు వెవ్వఁడో?, ప్రజ్ఞాన సుఖైకరూప భాసితుఁ డెవఁడో?
అజ్ఞానదూరుఁ డెవఁడో?, విజ్ఞుల కెఱుఁగ బడునట్టి విమలు భజింతున్.

క. సర్వజ్ఞు నాదికారణు, నిర్వాణ సుఖ స్వరూపు నిఖిలు నిరీశున్
ధూర్వహు నిర్వహు నిర్మలు, సర్వాత్మకు నాదిమూలు సంస్తుతిసేతున్.

ఆ. ఇంద్రియముల మనసు నెడ నిగ్రహించి క్షే, త్రజ్ఞుఁడైన జీవతత్త్వ మాత్మ
తత్త్వమని గ్రహించు తత్త్వమా యోగం బ, నుగ్రహించు వాని నే గ్రహింతు.

ఆ. అణువుకన్న నణువు నధిక వస్తువుకన్న, నధిక వస్తువగుచు నలరు నెద్ది ?
అ య్యపారశక్తియగు ప్రాణనాథుని, రామచంద్రమూర్తి నామతింతు.

ఆ. మూఁడు మూర్తులకును మూలంబెవండో? స, ర్వజ్ఞుఁడెవఁడో? దశరథాత్మజుఁడయి
ఒనర లోకజాల ముద్ధరించెడి వాఁ డె, వండో? వాఁడె ఆశ్రయుండు సుండు.

ఆ. రాజులకును రాజు రమణీయమూర్తి! కౌ, సల్య విపుల సౌఖ్యశాలి! శూలి!
ఆది గురుఁడు భర్గుఁ డతివరేణ్యుఁడు వాని, నాశ్రయింతు పరము నాదిదేవు!

క. లోకగురు లోక వంద్యుని, లోకాతీతుని ప్రశాంతు లోకస్తుత్యున్
లోకావలోకనుని నా, లోకింతు ననంతు నాద్యు లోచూపులతోన్.

క. సీతావల్లభుఁ గొల్తు న, తీతు మహాప్రభుని సత్యు దివ్యు ప్రశాంతున్
వాతాత్మజ సేవితు వి, ఖ్యాతేష్టప్రదు ప్రసిద్ధ కమలదళేక్షున్.

క. సత్యాత్ముని శ్రేష్ఠుని సం, స్తుత్య సర్వలోకపాలు సుగుణు నిర్గుణున్
సత్యున్ జానకి వల్లభు, నిత్యకామదున్ పరాత్మునిన్ ధ్యానింతున్.

ఆ. లక్ష్మణాగ్రజుని సుసూక్ష్ము దయానిధి, నంబుజాక్షునిన్ సహస్రకిరణు
శాంతు కామదుని నితాంత కృపాకరు, రాఘవు న్నుతింతు మేఘవర్ణు!

గీ. జామదగ్ని తపోమూర్తి రాము పరశు, ధారి వాక్పతి వర శూలధారి పక్షి
వాహనుని వాచ్యునిన్ చతుర్బాహు పుండ, రీక నయనున్ స్మరించెద శ్రీకరముగ.

సీ. శ్రీ శార్ఙ్గధరు రాము చిన్మయు నందవి, గ్రహు బలరాము సౌఖ్యప్రదాయు
శ్రీ వల్లభున్ విష్ణు గోవిందునిన్ కలా, నాథు నీశాను ననాది నిధను
గోపతి గోపాలు గోపరీవారు గో, పీజన మానస రాజహంసు
విమ్యుత్ప్రతీకాశు వేణునాద వినోదు, మన్మథ మన్మథు మాధవు హరి

గీ. రాము కృష్ణు జగన్మయు రమ్యమూర్తి, వాసుదేవు జగద్యోని వందితాత్ము
కామరూపు కలావంతు కామఫలదు, నాత్మ తృప్తికై తలఁతు నిరంతరంబు.

గీ. శ్రీధరుని శ్రీకరుని శ్రీశు శ్రీనివాసు, భూతపతి భూతిదుని భూరి భూమణాఢ్యు
సర్వదుఃఖ హారున్ వీరు సార్వభౌము, దుష్టదానవ మర్దనుం దొడరి తలఁతు.

క. శరణాగత వత్సలు భా, స్కరవంశ సుధాబ్ధి సోము సర్వాధారున్
గురు నప్రమేయు సుగుణా, కరు కరుణాకరు సుకర నికరు ధ్యానింతున్.

గీ. శ్రీ నృసింహు చిదానందు చింతసేతు, నిత్యు నాదిత్య మండల నిలయు పరము
సత్యు నత్యుదారుని నపమృత్యు దూరు, సత్యసంధు జితక్రోధు శరణు చేతు.

క. యజ్ఞేశు యజ్ఞ పురుషుని, యజ్ఞపాలనప్రవీణు యజ్ఞు నయజ్ఞున్
విజ్ఞాన భాస్కరుని పర, మాజ్ఞాన విదూరు ధీరు నభినందింతున్.

క. సుగ్రీవేప్సితదాయు ద,శగ్రీవహరుం బ్రశాంతు శమదమ మూర్తిన్
నిగ్రహ మనుగ్రహ యుతు స,మగ్ర భక్తి యుక్తి గొల్తు నాత్మానందున్.

క. నర వానర సురసేవితు, పరము పరాత్పరు నపార భవభయ దూరున్
గురు తారక భయవారక, పరమ దివ్యనాము రాము పరికీర్తింతున్.

చ. ప్రణవము జ్యోతిరూపకము బ్రహ్మ మనాది సుదీప్తతేజసం
బణువు మహత్తు నిశ్చిత యథార్థ స్వరూపము నిత్య మూర్తి శో
షణము కకుత్స్థవంశ మనిశంబు భృశంబు యశంబుఁ గన్న దో
మణిగణ సద్గుణ ప్రకర మాన్యము ధన్యము సంస్మరించెదన్.

గీ. ఆంజనేయప్రియుండు జనార్దనుండు, రావణాంతకుఁ డమల సుగ్రీవ వాంఛి
తార్థ ఫలదుండును విభీషణావనుండు, నైన రఘురాముఁ గొల్తు నిరంతరంబు.

చ. ప్రకృతి నియామకుండు రుచిర ప్రతిభా ప్రతిముండు, సర్వకా
రకముల కారకుండు, నమర స్తుతి పాత్రుఁడు, సత్తు చిత్తు ని
ర్వికల వినోద మోద పదవీ పరిశోభితమైన బ్రహమున్
సకల ప్రమాదము ల్దొలఁగ సంస్తుతి చేసెద రామచంద్రునిన్.

ఆ. వేద విద్వరిష్ఠు నాదికారణుని సం,సారమూలు సూర్య చంద్ర తేజ
రూపు సర్వమయు సుధాపయోధి నివాసు, మాయ బాయఁగా నమస్కరింతు.

క. సర్వాశ్రయు సర్వేశ్వరు, సర్వాంతర్యామియును త్రిసత్యుండును శ్రీ
నిర్వాణ నాథుఁగొల్చెద ! నుర్వీ విభు కేవలాత్ము నుత్తేజమునన్.

గీ. నిర్విలేపుఁడు నసముండు నిష్క్రియుండు, నాది కారణ విగ్రహుఁ డవ్యయాత్ముఁ
డవ్యయానంద రూపుఁడౌ నా పరాత్ప,రుని పరబ్రహ్మఁ గొలిచెద మనము లోన.

క. సంసారోత్తారకుఁడును, కంసారియు రవికుల ప్రకాశకుఁడును దో
ర్హింసావినోద రక్షో, ధ్వంసున్ భరతాగ్రజున్ ముదమ్మునఁ గొల్తున్.

క. భక్త పరాధీనుని స,న్ముక్తి ప్రదు నార్త రక్షణున్ సంసరణో
న్ముక్తున్ సత్యజ్ఞానా, సక్తానంద స్వరూపు సంస్మరియింతున్.

సీ. భవరోగ వైద్యుఁడు ప్రభువు లోకైక ర,క్షకుఁడు వానికి నమస్కార మిడుదు
సాధు సజ్జన హృదయాధివాసుఁడు ప్రపం,చకునకు నే నమస్కార మిడుదు
కార్యాత్ముఁడై లసత్కారణాత్ముకుఁడౌ ప్ర,సన్నునకును నమస్కార మిడుదు
కాలాత్ముఁడై క్రియాకారకుండౌ ప్రశ,స్త పరమాత్మకు నమస్కారమిడుదు

ఆ. ఊహసేయరాని యుత్తమోత్తమునకు, నాది దివ్యరూప మైన వాని
కఖిల కామితముల నందఁజేయు కామధేనువైన వాని నే నుతింతు.

క. ముల్లోకంబుల మూలము, తెల్లంబగు శుద్ధ సత్త్వ దీప్తిశోభితముఁ
నల్లని మెయికాంతియు శో,భిల్లఁ మము బ్రోచు రాముప్రీతి భజింతుఁ.

గీ. జ్ఞాననిధి! శోకమోహజరానివృత్తి, మరణ భయవారకుఁ ద్వంద్వ పరిహారణు న
గోచరాదిమధ్యాంతాత్మకుని విమలు మ,హాత్ము శ్రీరాముఁ గొల్తు ననారతంబు.

గీ. ఉపనిషత్ప్రతిపాద్యు సర్వోత్తమ ప్ర,ధాన కేవల చిదచిదాత్మ స్వరూపు
సకల సారస్వతాత్మకు జన్మరహితు, నాదిదేవునిఁ గొల్తు ననారతంబు.

క. జ్ఞానానందైకాకా,రానంత లసత్స్వరూపు నమల సమాధి
ధ్యానైక గమ్యు శ్రీహరి, ధ్యానింతు నఘప్రదూరు నానందనిధిఁ.

గీ. ప్రకృతి తత్త్వాత్మకుఁడును పురాణ పురుషుఁ,డై నిజాంశముచే నిండి తా నొకండె
నిలిచి విశ్వాత్ముఁడై ద్యుమండల విరాజ,మానుఁడౌ పరమాత్ము నమస్కరింతు.

సీ. సనకాది యోగి ముఖ్య నికాయ సద్భక్తి, వందిత పాదారవిందుఁ డెవఁడు
నిర్మల విజ్ఞాన నిత్యబ్రహ్మానంద, స్వస్వరూప జ్ఞానసహితుఁ డెవఁడు
కేవల బ్రహ్మసాక్షి పవిత్ర సర్వ ది,గ్వ్యాపిత చేతనారూపుఁ డెవఁడు
గుణత వాఙ్మనసా గోచర తేజ మ,హత్తత్త్వమూర్తి మహాత్ముఁ డెవఁడు

ఆ. బ్రహ్మ విష్ణు రుద్ర భవ్య దేవేంద్రాది, సర్వరూపుఁడై యొసంగు నెవఁడు
ఎట్టి నిన్ను విబుధు లెఱిఁగి చరింతురో?, అట్టి విభుని నిను సమాశ్రయింతు.

మ. తపసుల్ సిద్ధులు సాధ్యులుఁ ఋషులు నాత్మజ్ఞుల్ కడుఁ సజ్జనుల్
విపరీత వ్యతిరేక వాద విముఖుల్ విశ్వానుకూలుల్ మహా
నుపతేజోనిధు లా పురాణములు వేద్యుల్ ధ్యాన నిష్ఠుల్ భవ
ద్వీపులానూన మహత్త్వము ల్పొగడు చెందే నీవుఁ గానుండుటఁ.

గీ. యజ్ఞములు సంహితలు త్రికాలాష్టవసువు, లెల్లశాస్త్రమ్ములును సన్మునీశ్వలును
నది నదమ్ములు నిన శశి త్రిదివ సప్త, ద్వీపములు చరాచరము నీవేకదయ్య!

క. అంతయు నీవైయుంట నె, ఎంతురు తత్త్వజ్ఞులెల్ల యీవె విరాట్టం
చెంతయొ సమస్తమును నీ, వింతగ విజ్ఞులు గ్రహింత్రు విశ్వాతీతా!

గీ. సప్తవింశతి సంఖ్య నక్షత్రములును, రుద్రసంఖ్య యేకాదశ భద్రమూర్తు
లెవఁడో? బ్రహ్మ విష్ణీశ్వరు లెవనిరూపు, లా పరబ్రహ్మ రాముని నాత్మఁ గొలుతు.

క. సచరాచర భూత ప్రపం,చ చయమునకు తల్లి తండ్రి సఖుఁడు గురుఁడు దృ
జ్నిచయము ద్రష్టయు దృశ్యము, పచరింపగ నీవకావె? పరమాత్మ హరీ!

శా. నీవే సర్వ నియామక ప్రభుఁడవు న్నీవే జగత్కారణం
బీవే చిద్విపుల ప్రకాశ సకలం బీవే విరాడ్రూపముల్
నీవే ఉత్తమ సర్వరూపకుఁడవుల్ నీవే సమస్తంబవుల్
నీవే నాశ విహీన వృత్తి వెలుఁగన్ నిన్ నేర్తురే ? మాదృశుల్.

క. ఏ కమలాక్షుఁడు లోకా,లోకాధార ప్రయుక్త లోకపతియొ ? సూ
క్ష్మాకృతి సూక్ష్మంబుల స్థూ,లాకృతి స్థూలముల నట్టి యవ్యయుఁ గొలుతున్.

క. వాచామగోచరా! పూ,ర్వాచార సనాతన ప్రభాలంబి లస
త్ప్రాచుర్య మంగళాలయ, నీ చాతుర్యం బెఱుంగ నే నెవ్వాఁడన్.

గీ. శుద్ధ సత్త్వ తేజోరూప ! బోద్ధ! సర్వ,లోక కారణ నిర్వికారైకరూప !
సర్వరక్షక సర్వేశ శరణు శరణు ! రఘుపతీ! రామచంద్ర ! శరణు మహీంద్ర !

క. అని ఇట్లు స్తుతింపగ చ,య్యన శంకరుఁజూచి రాముఁ డత్యంత ముద
మ్మును బొంది పార్వతీపతి!, నిను మెచ్చితి వర మడుగు మనెన్ శివుఁడంతన్.

శా. స్వామీ ! నీవు ప్రసన్నవృత్తిఁ గనుటే సర్వస్వమై యుండఁగా
నేమేన్ గోరు మటందు వన్యమిక నేదీ ? యెందునేనిన్ రఘు
స్వామీ ! ధన్యతఁ గంటి !, నాదు తపముల్ సాఫల్యముం బొందె! ని
స్సీమానంద నిధానమై నెగడితిన్ శ్రీరామచంద్రప్రభూ !

క. నీ పాదంబుల భక్తియు, నీ పదభక్తులను గూడి నెగడెడి వృత్తిన్
హే పరమేశ్వర ! అద్వై,తోపదేశ విజ్ఞతను ప్రభూ ! నా కిడవే.

మ. అని ప్రార్థింప జగద్విభుండు పరమాత్మా రాముఁడీ స్తోత్రముల్
వినువారల్ పఠియించువా రిహపర ప్రీతిన్ గడుంబొంది నన్
గనుఁగో నేర్పరులై మదీయ నిజలోకం బంది, నాయందె యై
క్య నిరూఢిం గని జీవ ముక్తులయి యోగ్యస్థానముం గాంత్రు హా !

క. పరమ రహస్యము స్తోత్రో,త్కరము సనాతనము జగతి తారకమై యె
వ్వారు త్రైకాలిక భక్తిన్, స్మరియింతురో ? వారిఁ బ్రోచు సన్నిహితంబై.

క. పంచ మహా పాతకము ల,డంచి ప్రోచు త్రికరణస్ఫుట ద్వేషాఘ
ప్రాంచద్విముక్తి యగు ని,ర్వంచన మిది సత్యమిది శివా ! యని పల్కెన్.

క. కావున శిష్యా ! రాముఁడు, దేవుఁడు త్రైకాలికముగ స్థిరముగ వానిన్
వేవేగ మెఱిఁగి విజ్ఞా,నావిల సంసార తాపుఁడవునై మనుమీ !

సీ. శ్రీరామ యనుచు స్మరించుమాత్రమ్మున, వాచిక కాయిక మానసికపు
దురితంబు లన్నియుఁ దొలఁగు, సమస్త సౌ,భాగ్యంబు లొదవును పరముఁ గల్గు !

ముక్తిప్రదంబయి మొనకొను నీస్తోత్ర, ముత్తమోత్తమ మయి యొప్పుచుండు
శ్రీ పరమేశ్వరుచే చెప్పఁబడి సర్వ, దేవతలను ప్రశస్తిని వహించు

గీ. ఉదయ మధ్యాహ్న సాయంత నోదితమయి, యెవ్వఁడు పఠించు వాని యహీనదుఃఖ
పాప బాధా నివృత్తియు పరముఁ గల్గు, వినుత సద్గుణభాస! యో విష్ణుదాస!

క. ఇది సత్య మిది యథార్థం, బిది సుందర మిది శివంబు హేయావగుణా
స్పదులయ్యు దీని భక్తిం, జదివి నిర్గుణ ప్రశస్త సౌఖ్యు లగుదురా.

సీ. త్రైకాలికాబాధ్య తతశుద్ధ బుద్ధ స,త్సచ్చిదానంద విస్తార వినుత
మా పరబ్రహ్మ మా శ్రీపతి శ్రీరాముఁ, డొక్కఁడే ఘనుఁడు వేరొకఁడు లేఁడు!
కనుక నెల్లరును రాముని స్వరూపమ్మనే, యిల మననము చేయవలయు శిష్య!
ఈ సమస్త జగంబు నెందునుఁ గనుఁగొన్న, రామ స్వరూపమే రాజిలునని

గీ. అనఘ! రఘునందనుండు రాజాధిరాజు, రామచంద్ర దివ్యావతారంబు చేత
లోక రంజకుఁడైన సుశ్రీ కళత్రుఁ, డతని ధ్యానింపవలయు నిరంతరంబు.

క. నీకు చరణ కింకరుడను, నాకు శరణ మిమ్ము! రామ! నవమృదుల శుభా
లోకన కమల విరాజిత! కాకుత్స్థ కులాబ్ధి శీతకర! శ్రీరామా!

క. రామా! నీలోత్పలదళ, శ్యామా! సుగుణాభిరామ! సాకేతపు రీ
ధామా! నిస్తుల వరని! ష్కామా! నను బ్రోవువయ్య! కష్టవిరామా!

క. శాంతుఁ దాంతుఁ రఘుకుల, కాంతుఁ శ్రీకాంతు సత్సుఖస్వాంతుఁ వే
దాంత నితాంతుఁ తత వి,శ్రాంతుఁ భజియింతు నిన్ను ప్రాభవ వంతుఁ!

క. ధ్యానింతు మానిజన ఘన, మానస సరసీ విహార మాణమరాళా!
శ్రీనిత్యముక్త బుద్ధ చి,దానంద మయ స్వరూప! అతి శుద్ధాత్మా!

క. హంసుఁ దుస్సంసార, ధ్వంసున్ రమణీయ భవ్య వర రఘువంశో
త్తంసున్ భజియింపు మతి రి,రంసుఁ శ్రీవిష్ణుదాస! రమ్య విలాసా!

ఆ. శ్రవణ మాత్ర దురిత సంసారహరణంబు, స్తవన వల్లభంబు సమరసంబు
నీకు చెప్పినాఁడ లోకోప కారమై, భువి రహించుఁగాత మవిరతముగ.

క. అని రామదాసు పల్కిన, విని శిష్యుఁడు తృప్తుఁడై నవీన ముదిత హృ
ద్వనజుండై గురుపాదము,లను భక్తిఁ మ్రొక్కి తెల్పుఁడవుల నటన్నఁ.

వ. గురుం డిట్లు చెప్పం దొడంగె.

# ద్వితీయ సర్గము

## శ్రీ సీతారాముల కౌతక క్రీడాభివర్ణనము

గీ. వినిన మాత్రన సౌభాగ్యమును, లభింపఁజేయు సీతాభిరాము విశిష్ట దివ్య
మంగళ విలాస చరిత మభంగురమగు, కౌతుక క్రీడల తెలుఁగుఁ గలయ వినుమ!

సీ. కైలాసమందు శంకరుఁడు పార్వతితోడ, సుఖముగా క్రీడలఁ జొక్కినటుల
వైకుంఠమున హరి శ్రీకాంతతోఁగూడి, కేళీ విలాసముం దేలినటుల
సత్యలోకమ్మున సతి సరస్వతిఁగూడి, బ్రహ్మ యానందంబు బడసినటుల
అమరావతిని శచీవిమల సౌఖ్యంబున, దేవేంద్రుఁ డింపు నొందెడి విధమున

గీ. చంద్రునిం బోలె వెల్గు నిసర్గమును మ,నోహరంబగు దివ్య మనూపమాన
స్వర్ణ రత్న విరాజిత చారు సౌధ,ములను సీతతో హరి సౌఖ్యములఁ జెలంగు.

ఉ. బంగరు గారతోడ పొలుపంబగు రత్నశిలాళిఁ గట్టఁగా
రంగలరారు పచ్చల బరంగెడు కంభము, లింద్రనీల శో
భం గొమరారు మార్గములు, బాగగు గోడల నిల్వుటద్దముల్
సంగతి మంచి ముత్యముల చక్కని హారము లొప్పు సౌధముల్.

సీ. బంగారు సరిగెల రంగారు తెరబట్ట, లెందున కనువిందు నెసక మొసఁగ
స్ఫటిక శిలాస్తంభ సంపూర్ణ చంద్రశా,లా మందిరముల చెల్వం బెసంగ
శయ్యాగృహము తూగుటుయ్యాలలును కీర,శారికారావ భాస్వరము గాఁగ
పవలును రేయియు బహురత్నదీప దీ,వ్యత్కాంతి యంతట నవఘళింప

గీ. నెమలిపురి చామరంబులు నిర్మలంపు, తలగడలు వట్టివేరులఁ దగిన విసన
కఱ్ఱలును రత్నతాంబూల కమ్రపాత్ర, లుమియుగిన్నెలు సౌధాల నొప్పు నచట!

గీ. స్వర్ణరత్న పంజరముల సరస చిత్ర, రామకథలను పాడుచు రాజిలుచును
కీరశారికా సంతతి కేరియాడు,నట్టి మందిర మలరు విహారకేళి.

క. శ్రీరామ స్మరణముచే, కీరములున్ శారికలును కేవల ముక్తి
స్ఫార సుఖజీవనమ్ము లు,దారత నచ్చటఁ జరించు ధన్యములగుచున్.

క. ఆ పక్షులు రామకథా,లాపమ్ముల నిట్లు సేయు ననవరతము వి
ద్యాపాటవం బెఱింగిన, యా పండిత వర్గముల శుభాలాపములన్.

## శ్రీరామ స్తుతిరూప పక్షి గీతానవకము

శ్లో॥ జయతు రాఘవో జానకీయుతో । జయజ రాజరాజేశ్వరేశ్వరః
దశరథాత్మజో లక్ష్మణాగ్రజో । జయతు మాపతి స్తాటకాంతకః ౧
జయతు కౌశిక స్వాధ్వరంగతో । జయతు రక్షసాం మారకో మహాన్
జయతు గౌతమాహల్యయాస్తుతో । జయతు జానకీ తాతమానితః ౨

జయతునఃపతిశ్చాప ఖండనో । జనకజా కరాన్ముక్త మాలయా
నృపసభాంగణే కౌశికానుగః । పరమశోభితశ్చాతిహర్షితః ౩

జయతు భూమిజాంఘ్యోశ్రిస్త్రదాముదా । నిజకరోత్పలేస్థాప్య రాఘవః
కమలమస్తకేనాకరోన్నతిం । సరఘునందనః పాతునస్సుఖం ౪

జయతు భూమిజాలింగితో మహాన్ । జనమనోహరశ్చాతిశోభనః
భృగుభవార్పితం ధృత్యవైధను । ర్నిజపితు స్తదాదర్శయన్ బలం ౫

జయతు సీతయాభోగకృచ్చిరం । జయతు కైకయీ ప్రేరితోవనం
జయతు పర్వతేవాస కృచ్చిరం । జయతు యోఽత్రిణా పూజితోవనే ౬

జయతు యోవిరాధస్య పాతకృ । జ్జయతు దూషణాది ప్రమర్దనః
జయతు యోమృగం మోచయద్భువా । జ్జయతుయో కబంధం క్షణాజ్జహౌ ౭

జయతు వాలిహా సేతు కారకో । జయతు రావణాది ప్రమర్దకః
జయతు స్వంపదం ప్రాపసీతయా । జయతు మంగళస్నానకృన్ముదా ౮

జయతు వాక్యతో భూసురస్యయ । స్సకలభూతలం పర్యటన్ చిరం
జయతు యాగకృల్లోక శిక్షయా । జయతు జానకీం రంజయన్స్థితః ౯

## ఫ ల శ్రు తి

రఘువరస్యయః పక్షిభిః కృతం । నవకముత్తమంయః పఠిష్యతి
తపన నిర్గమే భక్తితత్పరో । నిజమనోర్థితం సంగమిష్యతి.

క. సూర్యాస్తమయ సమయమున, నార్యుం డెవఁడేని పక్షు లవ్యయ సంపత్
ధుర్యున్ రామున్ బాడిన, చర్యలఁ జదివినను ముక్తి సమకూడు భువిన్.

ఉ. ఇట్టి మనోహరంబులయి యింపు దలిర్చెడు మందిరంబులన్
దట్టపు కూర్మి యందముల తావును, సద్గుణరాసి భూమికిం
బుట్టువు సీతతోడ, వలపుం దలపున్ మెలపుం దలిర్ప, ని
ట్టి ట్టనరాని సౌఖ్యము లనేక దినంబులు వొంది రాముడున్.

సీ. ఒకసారి రాముఁడమ్మ కచెల్ల! సీతా ప,యోధరమ్ముల యుబ్బు కుబ్బిపోవు!
ఒకసారి బింబోష్ఠము కనుంగొనుచు చొక్కు, ఒకసారి హరిమధ్యము కని మెచ్చు!
ఒకసారి నాసికా వికసనమ్మున కెంచు, మలిసారి సోగ కన్నులకు నులుకు!
ఒకసారి పలువరుసకు సంభ్రమించు వే,రొకసారి ముఖకాంతులకుఁ గరంగు

ఆ. మృదు కపోలముల యమేయత భంగించు, బాహు లతల పొంకమూహ సేయు!
నడక తీరు పలుకునెడ నేర్పుఁగడు నమా,యకత కెలమి నవ్వు నహరహంబు!

మ. తనయం దొప్పు ననూపమాన పరమార్థంబైన సౌఖ్యంబె యెం
దును నెల్లప్పుడు నేమిటన్ గనుచు సంతోషించు; నేమాత్రమై
నను వీడ్పాటు సహింప నేరదు; రవంతఁ గానియుఁ రాము మో
మున లేదేఁ చిరునవ్వు తొట్రుపడు, న మ్ముగ్ధ ప్రియం బల్పమే?

సీ. ఏపదార్థంబుల నెట్టులఁ గావింప, తన భర్త కిష్టమో? కని యొనర్చు
ఏవస్తు జాలము నెట్టుల పతి కలం,కార మిష్టమొ? దానిఁ గని మెలంగు
ఏపను లొనరింప నెలమిమై నతఁడు సం,తోషించు నాపను ల్తొడరి సేయు
ఏమాట మాటాడ యీడుగాఁ డలరు నా, మాటలె మాటాడ మమత నందు

గీ. త్రికరణంబుల నాథుని తృప్తినొందఁ, జేయుటే తన మనసు కాప్యాయనంబు!
అట్టి త్రైలోక్య పావని చెట్టబట్టి, రామునకు మించి సుఖపడె నేమి? యొరుఁడు.

సీ. ఎచ్చోట నిలచిన నచ్చోటునకు నలం,కార మాపాదింపఁగల సెలంత!
ఏ నగ లిడు కొన్న నా నగలకు నంద, మవఘళింపఁగ జాలు నతివ మిన్న!
ఎచ్చటఁ గనుఁగొన్న నచ్చట ధన ధాన్య, గజ యానములు కల్గు కంబుకంఠి!
ఏపల్కు పల్కిన నాపల్కు ముజ్జగ,మ్ములకు నాదర్శమై నిలుచు గరిత!

గీ. సీత! సద్గుణ పూత! సుశ్రీసమేత! విమల భూజాత! ఆశ్రితావిల విఘాత!
భక్తిసముపేత! కొల్వ సం,పన్న సకల, సౌఖ్య భరితుఁడై రఘుపతి చాల నలరె!

క. ప్రీతిని శరీరములు వే,రై తనరిన హృదయ మొక్కఁడై యెల్లపుడున్
సీతారాములు సౌఖ్య వి,భూతిఁ నిర్భర విలాసపుం భావుకులై!

క. చరియించిరి వారిల స,చ్చరితము లోకములకెల్ల చక్కని పాఠం
బరమరలు లేక చెప్పిరి, ధరణి ననుసరించు వారు ధన్యులు! శిష్యా!

# తృతీయ సర్గము

## శ్రీరాముఁడు సీతకు విజ్ఞాన పేటిక నొసంగుట

చ. వినయవిధేయతాత్మయు, వివేక వినిర్మల మానసాబ్జ యా
జనకసుతామతల్లి! యొకసారి పతిం బరిచర్య తృప్తుఁగా
నొనరిచి, లజ్జ యడ్డుకొని యొయ్యన నిల్పియు, ధైర్యమూని చి
త్త నియతి రామచంద్రుఁ గని తాత్త్విక కౌతుక లగ్న మూర్తియై.

శా. మన్నాథా! మహనీయ! త్వచ్చరితముల్ మన్నించి ఋష్యాదు లు
ద్యన్నిష్ఠన్ గొనియాడుచుండుదు రదే? తాత్పర్యమో! కాని, ఉ
ద్యన్నవ్యాంబుజ పత్రనేత్ర! కడు వింతై తోఁచు నా కేలనో?
త్వన్నైర్మల్య కథా రహస్య గ్రహణ ప్రావీణ్యఁగాఁ జేయవే!

క. మానిత భవదద్భుత సం,జ్ఞానం బెటు లబ్బు నాకు, సర్వజ్ఞ! తవా
నూన కరుణా కటాక్ష, (శ్రీ) నియతిం గాక నీదు శిక్షం గాకన్.

క. అని ప్రార్థించిన సీతా, వనితామణిఁ గాంచి విభుఁడు వరమంగళమై
వినుత బుధారాధితమై, తనరు ప్రశ్న చేసినావు! తరుణీమణిరో!

ఆ. చక్కనైన ప్రశ్న సలిపితి! విజ్ఞాన,వేత్తలెల్ల తత్త్వ వేత్తలెల్ల
దేని దెలిసి తృప్తిఁ దేలియాడుదురో? నీ,వద్ది తెలియఁగోరి యడిగినావు.

క. చక్కనిది ప్రశ్నమిది! నా,యొక్క రహస్యంబు వినుమ! ఊర్జిత మతివై
నెక్కొను నేకాగ్రతమై, పెక్కుమాటలేల? నిదియ పృథు విషయమ్మా!

సీ. సచ్చిదానంద లక్షణ సాగరుండైన, పరమాత్మ నుండియే పరఁగు నిచ్ఛ
యను తరంగమ్ము చేతను నాత్మ బిందువు, శుద్ధమై వెలువడె సుందరాంగి!
అది యాత్మ; అయ్యాత్మ యవతరించెను బుద్ధి, తల్లిగర్భంబున, తండ్రి వాని
కనఁగ శుద్ధాంతఃకరణ మగు; తా నాల్గ,వస్థల విలసిల్లు; వసుధలో తు
ఆ. రీయమా యవస్థ శ్రేష్ఠము: తర్వాత, జాగ్రతయును స్వప్న సత్సుషుప్తు
లవును వానికి హృదయాకాశ మాస్థాన, సంచరణము మానస గమనమ్ము!

సీ. తరువాత దుర్వృత్తి ధ్వంసమ్ము సేయుట, కడకు మనోవేగ.ఖండనమ్ము
అట్టి యాత్మునకు మాయాయోగ ఘటనమ్ము, నెరి జన్మ సంస్కార నిగ్రహమ్ము
పిదప దుర్బుద్ధి రేపిన భవారణ్య సం,చారంబు; దంభ సంహారకమ్ము
అట పంచభూతాత్ముఁడై నిశ్చలముగ వి,శ్రాంతి నందుటయు, తదంతమునను
ఆ. కామ క్రోధ లోభ గణ జయం బాశా ని,కృంతనంబు, మోహకృత వినిగ్ర
హంబు, శుద్ధమాయ నాశ్రయింపఁగ రజో,మాయ జఠర విహ్ని మాయమౌను.
ఆ. తామసంపు మాయ తలఁగి పోవగ సుఖ, మెన్న లేదటన్న యేద్పు కల్గ
శోకభంగమగు వివేకాశ్రయంబున, భక్త్యతిశయ మద్ది పరఁగఁ జేరు.

క. అవివేకము నసియింపగ, నవనవముత్సాహ మటఁ గనంబడు నజ్ఞా
న విభేదనమునకు నుపా,య విధము సంధింపఁబడి మహా మహిమమునన్.

క. మిగులంగా త్రిగుణాశ్రయ, మగు గేహమునందు లింగ మగు నిగ్రహముల్
తగ మదమును బహుమర్దిం,చగ మాత్సర్యహంకృతులు చయ్యన జచ్చున్.

గీ. లింగదేహవియోగ మభంగురముగ, గలుఁగ మాయతో నాత్మ కైక్యత ఘటిల్లు!
కనఁగ నప్డు హృదయాకాశమునకు రాఁగ, సొరిదిఁ గల్గు నానందైక సుఖము! సకియ!

క. అటుపై మాయ వదలి వే,యుట! పిమ్మట సాత్త్వికియయి యొప్పెడుమాయన్
పటుతరముగ స్వీకృతిఁ గని, అట హృదయాకాశమును మహానందమునన్.

గీ. చక్కగా చేర్చి యప్పుడు సాగర ప్ర,వేశ దివ్యైక్యమే యాత్మ విమల ముక్తి!
అదియె! సాయుజ్యముక్తియై కుదిరియుండు, ఇదియె! దేహరామాయణ మిద్ధచరిత!

గీ. వేదశాస్త్ర సారంబును విమలమా ర,హస్యమును బ్రహ్మవిజ్ఞాన మజ్ఞతా ని
వారకంబగు నీ రత్న భూరిపేటి,కను బహూకరించితి నీకు జనక తనయ!

ఆ. నీవు నిద్రగ్రహించి నీబుద్ధిచే నొక్కి, కడు విచారణమున బడసి జ్ఞాన
సిద్ధి నందు మనిన, సీతామహాదేవి, హృదయ మందిరమున గదిసి నిలిపి.

గీ. బుద్ధి దృష్టిని పలుమారు పొల్పుమీఱ, నవ్యరీతి పర్యాలోచనం బొనర్చి
ఇద్ది యెల్లను తన క్రీడయే యటంచు, తెలిసి నవ్వుచు శ్రీరాముఁ గలయఁజూచి.

గీ. చరణ కమలంబులకు మ్రొక్కి జానకమ్మ, అద్భుతానందతుందిలయై చెలంగి
దేహమున పుల్కలొదవ నుదీర్ణ బాష్ప, కలితయై క్షణముండి యస్ఖలిత మతిని.

శా. బ్రహ్మానందనిమగ్నయాటఁ గని, శ్రీరామప్రభుం డంత సు
బ్రహ్మణ్యుం డగుటన్ సతీ! పరమ సౌభాగ్యప్రదంబైన నీ
బ్రహ్మానందము కల్గు కారణముఁ దెల్పన్ గోరినా నన్నచో
బ్రాహ్మీభూత సుఖప్రవృత్తి పరమంబా భక్తిమై సీతయున్.

ఉ. మ్రొక్కి మహాత్మ! నిర్భర ప్రమోదముఁ గంటిని; జ్ఞాన పేటికం
గ్రక్కున బుద్ధినిల్పి కనఁ గల్గితి! నీదగు సంజ్ఞ యెల్లనున్
జక్కఁగ నర్థమయ్యె! దివిషద్గణనీయ స్వభావ! దేవ! నే
నిక్క మెఱింగితిన్ నిజము! నిర్గుణమూర్తివి! నీవు రాఘవా.

ఆ. నిర్వికారమూర్తి! నీవు నా సంగతి, లోకహితము కొఱకుఁ గాక యేల?
నవతరింతువయ్య! అదినీకు క్రీడగా, కేల కష్టసుఖము, కీలుకొనును.

సీ. సంజ్ఞాన పేటికాస్తంబైన తత్వంబు, గూఢార్థ మఱయఁగా మూఢజనులు
నా నేర్చునది నిక్కమౌనో? కాదో? భవ, త్సమ్ముఖంబున శిక్షణమ్ము నొంద
నీ చరిత్రంబు, నీ యాచరణంబు వి,చారించి జనుఁడు సుజ్ఞాని యెట్లు
కాఁగల్గునో? జగత్కారణ కారణ!, అది నా యెఱింగిన ట్లంబుజాక్ష!

గీ. మీ సమక్షంబు నందు తమిన్ వచింతు, జ్ఞానసిద్ధి ప్రదంబు సంజ్ఞాక్రమంబు
దేహరామాయణార్థ సందోహ ముదిత, రమ్యగుణ దివ్యకీర్తి! శ్రీరామమూర్తి!

## శ్రీరాముని సన్నిధిని సీతాదేవి దేహరామాయణము వివరించుట

సీ. సచ్చిదానంద భాస్వత్స్వరూపుఁడు విష్ణు, సంపూర్ణుఁడే యెన్న సాగరుండు
అవ్వాని భూభార హరణాది యిచ్ఛయే, రమ్య మద్భుతమా తరంగ మగును
అందుండి వెలువడు ఆత్మాంశ బిందువే పురుషోత్తముం డనఁబరగు జీవుఁ
డాతఁడే శ్రీరాముఁ డవ్వాని జననియే, బుద్ధి కౌసల్య విశుద్ధసత్వ

గీ. మైన యంతఃకరణమే ఆ దశరథ, నాముఁడా మహారాజు ధన్యమయమూర్తి!
నాల్గవస్థలు నలువురు న్యాయముగ తు,రీ యవస్థయె శ్రీరాముఁడై యెసంగె.

గీ. జాగ్రదావస్థ లక్ష్మణస్వామి యయ్యె! భరతుఁడయ్యె స్వప్నావస్థ! మఱి సుషుప్త్య
వస్థ శత్రుఘ్నుఁ డవ్వారి పరమ స్థాన,మైన యా హృదయాకాశమ య్యయోధ్య.

గీ. అట మనోయోగ మనెడు ప్రయాణ మఱయ,కౌశికుని యాగరక్షకై కడఁగి చనుట!
మనసుదుర్వృత్తిని హరించుటయె యెఱుంగ, తాటికాసంహృతి యనంగ దగియె రామ!

క. మానసిక వేగభంగము, తాను ధనుర్భంగ మయ్యె! తతమాయా సం
ధానమె నాదు వివాహ వి,ధానము! శ్రీరామచంద్ర! తగ నూహింపన్.

క. అరయంగ నగును జన్మాం,తర సంస్కారము జయించు ధర్మం బరయన్
పరశు ధరరామ విజయము, పరమాత్మ! కుబుద్ధి కైక వరమగుఁ గాదే?

క. శ్రీరామ దండకా సం,చారంబే సంస్మృతీ లసద్వన ఘన సం
చారంబు; దంభదమనమె, విరాధ వధ, పంచవటియె విశ్రాంతి యగున్.

క. పంచవటి యనగ నిదియే, పాంచ భౌతికంబు దేహ పరమ క్షేత్రం
బంచున్ కామధ్వంసం, బెంచన్ ఖరునిన్ హరించుటే యని తలఁతున్.

గీ. దూషణున్ త్రిశిరుం జంపు ధూర్వహత్వ, మంచు దలతు, క్రోధము లోభ మెంచి ద్రుంచు
టాశ విచ్ఛిత్తి శూర్పణఖాత్త నాశి,కా సముచ్ఛేదమని యెంతు కమలనాభ!

క. మాయా మృగ నిర్మథనం,బే యగు మోహంబు దునుము టిక సాత్వికి యా
మాయను నను ధరియించితి,వే యగ్ని రజోస్వరూప మీఁగితిఁగాదా!

క. తామస మాయకు నాత్మా, రామునకు వియోగ మయ్యె! రమణీయ సుఖ
క్షేమ మహాక్లేశంబును, నా మహితంబయిన విరహమన్ వ్యథ కలిగెన్.

ఆ. శోకభంగమాను సూకబంధునిని సం,హార మంతఁ గల్గినట్టి దైన
అర్కపుత్రు నాశ్రయంబె వివేకాశ్ర,యంబుఁ గల్గె కడు సుఖంబొ? యనఁగ!

క. హనుమంతుఁడు దొఱకుట భ,క్తిని బొందుట, వాలి వధమె తెలియఁగ నవివే
క నిరోధమ్ముత్సాహం, బనఁగ విభీషణుని మైత్రి యని కన్గొంటిన్.

మ. ఉదధిన్ సేతువుఁ గట్టుచే తరణమై యొప్పారు నజ్ఞాన సం
జ్ఞ్యుదధివ్యాప్తికి, నాపయిన్ త్రిగుణ నిస్తుల్యాశ్రయంబైన గే
హ దిదృక్షంబె త్రికూట పర్వతము, నం దారూఢమా లంకయే
కద! యొప్పారెడి లింగదేహము! జగత్కల్యాణ సంధాయకా!

క. మదమును మర్దించుటయే, గద! రాఘవ! కుంభకర్ణ ఖండన మగు, స
మ్మద మత్సరహననము నీ,రద నాదుని సంహరణము రణమున రామా!

గీ. రహి నహంకృతిహరణమే రావణవధ! లింగదేహ నివృత్తియే సంగతముగ
లంక వీడుట! త్రివిధ మాయాంకనంబె, నన్ను గూడుట (శ్రీ)రామ! సన్నుతాంగ!

గీ. మఱలఁగ నయోధ్య కేఁగుట పరఁగె హృదయ, భవ్య మాకాశ గమనంబు, పరమమైన
అవ్యయానంద సౌఖ్య దివ్యానుభవమె, రాజ్య భోగంబు నందుట! రామచంద్ర!

క. తాల్మిన్ మాయను వీడుట, వాల్మీకాశ్రమము నందుఁ బాయుట నన్నున్
కల్మిన్ నను గల్గుటయే, చెల్మిన్ సాత్వికిని నన్ను చేపట్టు టగున్.

సీ. సాత్వికి యగు మాయ జత జేరియుంటయే, నాతోడ నీ ప్రయత్నంబు రామ!
హృదయాంబరంబును పిదప మహాకాశ,మున జేర్చుటయె యయోధ్యను వికుంఠ
నగరికిఁ గైకొని తగ యేగుటయ్యె! సా,గర ప్రవేశంబన నరుని రూపు
డింది (శ్రీ) సచ్చిదానంద సంజ్ఞకము (శ్రీ),విష్ణురూపంబున విస్తరిలుట!

ఆ. నరులకెల్లరకును పరమ సాయుజ్యంబు, ముక్తిఁ దెల్పి రామమూర్తి! నీవు
చేసినట్టి కర్మ చేతను లందఱి, హితము కొఱకు కాదె? ఇందిరేశ!

క. లోకులకెల్లర కొదవ వి,వేకము చూపించినావు వేషముతో న
స్తోక పరమునకు నిజముగ, నీ కెక్కడి కర్మ మఱయ నిర్గుణి కెందున్.

క. ఆత్మారాముఁడవును పర,మాత్ముఁడ! సచ్చిత్స్వరూప! ఆనందా! జీ
వాత్మావన స్వరూప! ప,రాత్మా! చూపించితయ్య! అవ్యయ లీలల్.

క. కర్మకు నతీతుఁడవునున్, నిర్మలుఁడగు నీకుఁ గలవె? నిఖిలజగములన్
కర్మాకర్మంబులునున్, ధర్మాధర్మంబు లెందు దశరథరామా!

క. అని యీ ప్రకారముగ న,న్నను గ్రహించుటకు నవ్యయంబగు తత్వం
బును నా కుపదేశించితి, వనఘా! జీవన్విముక్త నైతిని రామా!

ఆ. సంశయమ్ముతీరె సందేహ ముక్తనై, రత్నహార రూప రమ్యతత్త్వ
మాత్మకంఠమున నిరంతరమున్ ధరిం,తున్ మహాత్మ! హార ధూర్వహముగ!

ఆ. ఎవఁడు రత్నహారమవుఁగా దటంచు ధ,రించునో స్వకంఠ సంచరముగ
వాఁడు తక్షణంబె వఱలు జీవన్ముక్త, మంగళప్రదుఁడయి మాన్యయుక్తి!

క. నీచే బ్రహ్మాదులకు న,గోచరమగు నీ విషయము గొబ్బున నాకున్
గోచరముగాఁగఁ వినబడె, వీ చతురత్వంబుఁ గంటి ! నిక ధన్యఁగదే !

ఆ. సూక్ష్మమున మోక్షముగ జ్ఞానశోభిత మగు,రమ్యమగు రహస్యంబు దుర్ధరము దేహ
రామచరితామృతంబు శ్రీరామ! యెవఁడు, విను నతని పాపచయములు విడు సుఖపడు.

చ. అని వివరంబుగాఁ బలికినట్టి ధరాత్మజఁ గాఁగలించి పా
వనమును భద్రముఁ విగత పాపము నైన రహస్యముఁ కనుం
గొనితివి ! చక్కగా తెలిసికొంటివి ! సుంత కొఱంతలేదు ! దీ
నిని కడు భక్తి శ్రద్ధల ననిందుతుఁగూర్చి యెఱుంగఁ బల్కుమా !

క. శఠునకు నాస్తికునకు బల్, కఠినునకుఁ దాంభికునకుఁ గాదు తెలుప న
వ్విఠలుని సద్భక్తునకుఁ, మఠవాసికిఁ దెలుపఁదగును మహిమముతోడఁ.

ఆ. పరసతీరతునకు బ్రహ్మవిరోధికి, కల్మషస్వభావ జాల్మమతికి
క్రూరమతికి నిందదూరు వానికి మూఁఢు,నకును దెల్పఁదగదు ! సకియ యెపుడు!

గీ. కలియుగంబున వేయింటఁ గల డొకండు !, దీని తత్వంబు నెఱుఁగంగ దిటవుఁగల్గు
మానిసుఁడు సంశయములేదు ! మహి సమస్త, వేదవేదాంత సారంబు విమల మిదియ.

క. ఇదియే భక్తిని ముక్తిని, ఇదియే సర్వోత్తమముగ నిడు పరమంబా
నిదియే ఉత్తమ తత్త్వము, ఇదియే గుహ్యంబు దీని నెఱుఁగుము సీతా !

చ. అని వచియించు రాముని మహా మహిమంబుఁ దలంచి సీత నె
మ్మిని భయ భక్తులం గొలిచి మించు మహామహిమాఢ్యయై సుశో
భన మగు జీవితంబును ప్రభావము మీఱఁగ నుత్తమోత్తమ
ప్రణుత సమస్త భక్తజన పర్వముగాఁ గడపెఁ జగంబునఁ.

# చతుర్థ సర్గము

## శ్రీరాములవారిని వందిమాగధులు నిద్రలేపుట

సీ. రతిశాల వెలుపల రామచంద్రస్వామి, మేల్కొల్పగా నింక నాల్గు గడియ
లకు తెల్లవార నెల్లరు వందిమాగధ, సూతులు నటులు సంస్తుతు లొనర్ప
వచ్చి చేఱఁగ నవ వాద్యముల్మ్రోగింప, బడు నంత స్తోత్రము ల్పాడఁబడును
సుప్రభాతస్తోత్ర మప్రతిహతముగా, నవ్యక్త మధుర దివ్యధ్వనులును

గీ. పాడుదురు మంగళంబుగ భవ్యరీతి, అట్టి సుస్వర గానము లాలకించి
మొదట జానకీదేవి సొంపొదవ లేచి, భర్త పాదమ్ములకు మ్రొక్క భర్తలేచు.

## సుప్రభాత పంచకము

శ్లో॥ విఘ్నేశ్వర స్సకల విఘ్నవినాశదక్షో । దక్షాత్మజా భగవతీచ సరస్వతీచ
దృస్త్వష్టభైరవగణా నవ దివ్యదుర్గా । దేయాత్సురామనృప తేతవ సుప్రభాతం ౧
భానుశ్శశీకుజబుధా గురుశుక్రమందా । రాహుస్సకేతురుదితద్దితిరాదితేయాః
శక్రాదయః కమలభూః పురుషోత్తమేంద్రో । రుద్రః కరోతు సతతం తవసుప్రభాతం ౨
పృథ్వీజలం జ్వలనమారుత పుష్కరాణి । సప్తాద్రయోపి భువనానిచతుర్దశైవ
శైలా వనాని సరితః పరితః పవిత్రా । గంగాదయో విదధతాం తవసుప్రభాతం ౩
దిక్చక్రమేతదఖిలం ద్విరదాదిశశ్చ । నాగాస్సుపర్ణ భుజగా నగ వీరుధశ్చ
పుణ్యావిదేవ సదనానిబిలానిదివ్యా । స్వవ్యాహతం విదధతాంతవసుప్రభాతం ౪
వేదాష్షడంగసహితాః స్మృతయః పురాణం। కావ్యం సదాగమపథో మునయోపిదివ్యాః
వ్యాసాదయః పరమకారుణికాఋషీణాం । గోత్రాణివై విదధదాం తవసుప్రభాతం ౫

వ. ఇటులు పాడగా విని.

సీ. ఆ మంగళధ్వని కపుడు రాముఁడు లేచి, దేవతా మునులను భావ మలర
తలిదండ్రులను వశిష్ఠుల సరయూనది, కామధేనువును చింతామణి నిజ
మానసంబున గడు ధ్యానించు, సీతా మ,హాదేవి దుర్గ గంగాపగలను
శారదాదేవిని కూరిమి తల్లిని అత్తయా, కౌసల్య నతులభక్తి

గీ. గురుని పత్ని నరుంధతిం గొమరుమిగుల, ధ్యాన మొనరించి పరిపరి మానసమున
దలఁచి లేచి శ్రీరాము పదముల కెఱఁగి, నెలమిమై యుండు నెప్పు డగ్గలపుఁబ్రీతి.

వ. శ్రీరామచంద్రుం డప్పుడు.

క. ముఖ్యోపకరణములఁ గొని, ముఖ్య శౌచవిధుల దీర్చి మును సరయూది
వ్యాఖ్యనది రామతీర్థ మ,లేఖ్యతఁ జని స్నాన విధుల నెల్లన్ దీర్చున్.

ఆ. నిత్య కర్మములను నిర్వాహ మొనరించి, హవ్యవాహనునకు నాహుతు లిడి
దేవతార్చన మ్ముదీరతఁ గావించి, బ్రాహ్మణులకు తృప్తిపడఁగ నిచ్చు.

శా. సీతాదేవియు స్నానమున్ సలుపుచున్ శ్రీ పార్వతీదేవినిన్
చేతోమోదము మీఱ పూజనములన్ జెన్నార నర్చించి, వి
ఖ్యాతిం బెద్దలకెల్ల మ్రొక్కి, పిదపన్ కౌసల్య మున్నాదిగా
ప్రీతిన్ అత్తలకెల్ల చేమొగిచి దా శ్రీరాము వందించెడున్.

క. శ్రీరాముఁడు గురువులచే, పౌరాణిక కథల వినును భక్తియు శ్రద్ధల్
మీఱ ననుజులును జానకి, ధీరత తల్లులును హితు లుదీరతనుండన్.

క. ఏకాగ్ర మానసుండై, యీ కరిణిన్ సల్పి గురు నహీనవిధము న
స్తోకముగ పూజచేసి య,నేక విధములన్ సుపూజ్యనికరముఁ గొల్చున్.

గీ. తల్లులను బ్రాహ్మణులను విద్వల్లలితుల, వేదవిద్వరిష్ఠుల సద్వివేక నిధుల
మునుల యోగీంద్రులన్ తపోధనుల ద్విజుల, బ్రహ్మకర్మ వాదులను దైవజ్ఞ వితతి
మాంత్రికుల ధర్మవేత్తలం భక్తిఁగొల్చు.

క. మఱియు వయోవృద్ధుల నే, మఱకన్ భజియించి వంద్యమానుల కెల్లన్
మఱువక సీతాసతి యే, మఱకన్ దనవెంటరా నమస్కృతి సేయున్.

సీ. తన చెలు లలర సీతమ్మ బంగరు పళ్లె, రమున పూజాద్రవ్య మమర కామ
ధేనువు పెను సన్నిధానంబునకుఁ జని, వినతిఁ గావించి సద్వినయ మొప్ప
వివిధోపచార సద్విధులచే పూజించి, అగ్నినిర్మిత సుపక్వాన్న వితతి
పాయసాపూపాది బహుళోపహార సం, తుష్ట నొనర్చి విశిష్ట భక్తి

గీ. నిమ్ములఁ బ్రదక్షిణించి మోదమ్మమీఱ, తల్లి! యో కామధేను! నీదయ కృతార్థ
రాల! పక్వాన్నములను శ్రీరాముఁడాది, సర్వులకును సమర్పింపఁజాలు మమ్మ!

మ. అని ప్రార్థించి తదీయ కామగవి పాదాంతర్గతస్థానమం
దున సౌవర్ణ విశేషపాత్రముల నస్తోకంబుగా నుంప, వా
టిని నింపున్ బహుళాన్న భోజ్య వితతిన్ డీకొల్పి వెవ్వేర వ
డ్డనగాం డ్రెందఱఁ గొల్చినన్ తఱుఁగ కుండన్ నిండుగా నుండెడిన్.

ఉ. నూపుర నాదగర్జన మనూపమమై చెలువొంద, వడ్డనం
బేపున తోడి కోడలు లహీనముదంబున గూడి సేయఁగా
భూపలలాముఁడైన రఘుపుంగవుఁడున్ ద్విజ మంత్రిపాళితో
సోపదు స్వర్ణపాత్రముల చక్కని భోజనశాల యందునన్.

ఉ. బంగరు పీటలన్ గడు నభంగుల లీలల పట్టు బట్ట లు
ప్పొంగఁగఁగట్టి, భూపుల నపూర్వముగా ధరియించి నట్టి రా
జాంగన లెల్ల ముగ్గులిడ, చక్కదనం బలరారు చోట నిం
పుం గయిసేసి రాముఁడొగి పూలను గంధములన్ భజింపగన్.

చ. కడు నలరారి బ్రాహ్మణులు, కమ్ర నినాదము కర్ణవీధులం
బడి కమనీయమై యెసఁగ, పాదవినూపురహస్త కంక ణా
ళ్వడి వడిమ్రోయు గజ్జియలు విశ్రుత హారము లొండు నొండునుం
తడబడ, జానకీ పరివృతంబగు కాంతలు సేయ వడ్డనల్.

చ. మెఱపుల గుమ్మి, బాలరవి మించిన తళ్తళ లొప్ప, నత్తలో
దరి శుభమంగళాంగికి, పదంబుల యందలి వ్రేళ్లయందు సుం
దర మకరాత్త మత్స్య కమఠ ప్రతిమానములైన మెట్టెయల్
బరువడి మ్రోయుచుండ చెలువంబగు దివ్య నినాద మయ్యెడిన్.

క. చిరు గజ్జియలున్ ఘన నూ,పురములు గొలుసులును కడియములు మెఱయగ సుం
దరమగు చిన్నని నడుమున, బరఁగెన్ వడ్యాణ మదరిపడు గజ్జియలన్.

సీ. బంగరు సరిగ నొప్పగు పూలచే లీల, నొదవించు నదియును నొప్పు ముత్య
ముల జాలరులుఁ గూడఁ గలదియు నడకచే, ముర మురలాడుచు బరఁగు నదియు
దర్పణ శకల విధమ్మున రత్న సం,తతి శకలమ్ములఁ దనరి నదియు
దివ్య పరిమళాదిక ఘుమంఘుమ మాణ, దివ్య పీతాంబర దీప్తి మయము

గీ. పంచవర్ణ విభ్రాజితం బంచితంబు, కనక తంతు నిర్మాణము కమ్రమైన
చీర ధరియించి జానకి శ్రీరఘూత్త,మునకు వడ్డించు నుపహారముల సతంబు.

ఆ. రత్న కింకిణులును రమణీయ పధకము, లరఁటి పండ్లవంటి యాకృతిగల
యాభరణములను మహాహ్లాదకరములు, సీతకుం ధరింత్రు చెలియలెల్ల.

గీ. వివిధ రత్నవిచిత్రిత విమల స్వర్ణ, విలసితములగు గొలుసులు వివిధములగు
వజ్రశోభితాలంకృత వర్ణనీయ, హారములు ధరియించి చెన్నలరు సీత!

క. ముక్తాసరములు ప్రతిమా, యుక్తపు వరహాలదండ లుద్యద్గోధూ
మాక్తనుహారంబుల నా,సక్తిన్ ధరియించుచుండు జానకి కూర్మిన్.

గీ. కనకకుసుమమాలికలును కలిత రత్న,కీర శోభితమా మణిహారములును
స్వర్ణనిర్మితామలక భాస్వద్విచిత్ర,హారములు ధరియించును వేఱువేఱ!

క. ముత్తియములు పొగడంబులు, హత్తిన సౌవర్ణ చంపకామల కుసుమా
యత్తములగు మాలికల మ,హాత్తర శ్రద్ధం ధరించు నవనిజ శిష్యా!

ఆ. ఏడువారములును యేడువిధమ్ముల, నగలఁ బెట్టుకొనుచు తగఁ జెలంగ
ఒక్కనాటి సొమ్ము లొక్కనాటికి పోల, వ క్కుమారికా మహాత్మ్యమేమొ?

సీ. కంఠంబునందు మంగళసూత్రములును ర,త్నాలంకృతములగు తాయెతులును
గుణమణి కనకంపు కుచ్చులు ముత్తెపు, కుచ్చులు స్ఫటికంపు గుచ్ఛములును
రత్నమాణిక్య స్ఫురద్గుచ్ఛములు నటు,పిమ్మట సరిగెతో నెమ్మి చిత్ర
చిత్రితమ్మై యొప్పు శ్రీ మీఱు రవికయు, చెలువొప్ప ధరియించి నెలత మిన్న

ఆ. కీలుఁగొల్పె రత్న కేయూరములు భుజం,బులను తాయెతులను పొలుపుమీఱ
బాహుపురులు చంద్రభాస్కర తేజ వి,రాజమానములగు గాజులొప్పె.

ఉ. బంగరుగట్టి గాజులును, బాగుగ కంకణముల్ జెలంగ, ప్రే
క్షం గల వింపునింప నవరత్నపు టుంగరముల్, కరంబు శ్ర
ద్ధం గయిసేసె చంపక విధమ్మగు నాసికయందు ముక్కఱన్
సంగతరత్నమై కడు పసందుగ నొప్పు మయూరమో? యనన్.

గీ. స్వర్ణరత్నతాటంకముల్ కర్ణయుగళి, నొప్పు ముత్యాల బొగడలు కొప్పు బావి
బిలు జంపులు గొలుసులుఁ గీలుకొనఁగ, సీత సౌందర్య మెన్న నాచేత నౌనె?

క. చెవిమొదలు పాపట వఱకుఁ, దవిలి నొసటి ప్రక్కలన్ సదా వెలుగు శుభం
బవు మాణిక్య కనక హా,ర వితతి పాపట తిలకము రాజిలుచుండున్.

గీ. పాపటకు రెండు ప్రక్కల భాసిలుచును, సూర్యచంద్ర బింబాకృతుల్ శోభిలంగ
ఇంద్రనీలమణి తిలకము సాంద్రకాంతు,లీన చెలువొందు లక్ష్మి నా జానకి లలి.

క. పాపటపై రత్నమ్ములు, దాపిన ముత్యాలహార తత సౌందర్యం
బోపిన నగలుఁ గలవె? సు,స్థాపిత జగతీవలయ రసాతలములలోన్.

క. చూడామణీ విరాజిత, వ్రీడా సద్భావిత ప్రవిమల వ్రత సం
క్రీడా వినోద! జానకి, కీడుఁగలరె? ముజ్జగముల నేనియుఁ దలఁపన్.

చ. శిరమున రత్నపుష్పములుఁ జెన్నలరారఁగ బంగరుం జడన్
బరఁగెడు ముత్తెపున్ సరులు బాగగు నా జడకుప్పెలున్ సవి
స్తరముగఁ జూడ చెప్ప వితతంబగు నచ్చెలువంబు నెన్న వే
శిరములుఁగల్గు మేటియగు శేషునికిం దరమే? నిజంబుగన్.

ఆ. సహజసుందరియు యశశ్వియు సద్గుణ,మణిగణాభరణ రమా స్వకీయ
ప్రస్ఫుటావతార భాసురయగు సీత, యందమును వచింపగం దఱంబె.

క. ఎడమచేత పాత్రంబును, కుడిచేతం గరిటెఁ గొని యకుంఠిత దీక్షం
జడ నడల వడ్డనము చే,సెడు జానకిఁ గాంచి కన మిసీ! మోహినినిన్.

క. కమలముల వంటి చరణము; లమలములగు నుత్పలముల నదలించెడు హ
స్తములును పద్మమువంటి ము,ఖము పద్మదళములఁబోలు కన్నులు భళిరే!

ఆ. అమలగంధ లేపితాంగియు మంజీర, మంజులాత్తచరణ మహిత కంక
ణాది శోభి హస్తయగు జానకీదేవిఁ, గాంచి ధన్యులైరి కల జనములు.

క. గజరాజ గమన శోభిత, త్రిజగత్కళ్యాణి కాంతిదీపిత సమ్య
గ్గజలక్ష్మి సాధుశీల జ,లజ సుందరి కీడుఁగలరె? లావణ్యమునన్.

క. సురపారిజాత మాలిక, విరాజమానితశిరోజ వివిధలలిత క
స్తురి కుంకుమాంకి తాలం,కరణ గుణాభరణ నెన్నఁగాఁదర మగునే?

మ. పసుపుం గుంకుమ కజ్జలంబు ధరయింపన్ కేవలం బామె, స
ర్వ సుపర్వుల్ కనుచుండ విష్ణువును జేరం గన్న శ్రీలక్ష్మియై
దిసలన్ వెల్గఁగ జేయఁగా, వినయముం దేవావనీదేవ భ
క్తి సముల్లాసముఁ గాంచి యెల్ల రచటన్ దిగ్భ్రాంతులై రొప్పఁగన్.

# పంచమ సర్గము

## శ్రీ సీతారాముల విలాస విహారము

సీ. క్షణమాత్రమున భూమిజాని జానకి కామ, ధేను కల్పితమైన దివ్య భవ్య
పక్వాన్న మాది శుంభత్పదార్థంబులు, కనక పాత్రంబులఁ గడఁగి వడ్డ
నం బొనరించె, కోసుంబరంబులు నూరు, బిండులు గొజ్జులు వేడివేడి
నేతితో నపుడె వండిన యట్టులున్న కూ, రలు పచ్చడులు వరుగులు నటుకులు
గీ.వడియములుగుమ్మడియు నువ్వువడియములును, భక్ష్యములు లేహ్యములుచోష్యపానసీయ
మైన వస్తువుల్ బంగరు మయములైన, దొన్నెలన్ నెయ్యిపాల్ పెరుగు న్నెలంత.
గీ. ఖండ శర్కర తెల్ల చక్కెరయు నరఁటి, పండ్లు మామిడి దానిమ్మపండ్లు ద్రాక్ష
పనస మొదలైన చక్కని ఫలములను న, నేకమైన పదార్థము లేకనిష్ఠ!
క. వడ్డించి యభిఘరించిన, దొడ్డరాజు రామవిభుఁడు తోడరి మునీంద్రుల్
జిడ్డు వదలకుండఁగ సా, పడ్డ యనంతరము తములపాకులఁ దినుచున్.
సీ. ఇష్టమిత్రులతోడ నింపగు సత్కథా, సల్లాపములు సేయు నుల్లమలర!
వస్త్రము ల్దొడిగి సమస్తాయుధమ్ములఁ, గట్టి యద్దమున ముఖమ్ముఁ గాంచి!
ముత్యాల కుచ్చుల ముచ్చటగా నలం, కారంబుఁ గావింప కనక దివ్య
పల్యంకమున నెక్కి బసవీడి మంత్రి బాం, ధవ దూతలెల్ల మొత్తముగఁ గొల్వ
గీ. తల్లులకు మ్రొక్కి దీవన కుల్ల మలరి, తన సభా దివ్యమంటపమునకు వచ్చి
సింహ పీఠంబునన్ సుఖాసీనుఁడగుచు, నీతి దప్పక రాజ్యంబు నియతి నేలు.
క. చారనయనుండు విపులం, ధీర బుద్ధిమంతుఁడున్ సుధీజన మంత్రా
ధారుండై ధర్మమ్ముగ, శ్రీరాముఁడు పాలనంబు సేయు నిరతమున్.
క. తన మఱఁదుల పత్నులతో, దన చెలికత్తియలతోడ తాలిమిమై భో
జనము లొనరించి తమల, మ్మును గొని గృహమునకు చుట్టు మొనకొను వనిలో.
క. విహరింపనేగు సీతా, బహుళాలంకృతుల నెన్న బ్రహ్మకు వశమే?
యహిభూషణునకు వశమే? సహస్రఫణులున్న ఫణికి సహితము వశమే?
ఆ. అట్టులగుట షణ్ముఖావళిఁ గల కుమా, రునకు సప్తజిహ్వలను గలిగిన
అగ్నిహోత్రునకును నలవియే వర్ణింప, సీత నెన్నగను మహీతలమున.
గీ. ఉపవనంబునకున్ సీత కృపవహించి, వచ్చినది కని సేవకుల్ వరుసమీఱి
వారి యంత్రంబులన్ విప్పి బారు విడచి, రెల్లెడల జానకీసతి యుల్లమలర.
గీ. అతులమణి కాంచనమగు పర్యంకమందు, రమణ దాసీజనులు చామరములు వీవ
వృక్షశాఖలలోనుండి వేడుకలర, యంత్రజల వినోదమ్ముల నలరు సీత.

క. రాజకార్య నిర్వృతుఁడై, రాజలలాముండు రామ రాజీవాక్షుం
డోజ నిజమందిరంబున,కుం జనుదెంచుఁ సువాద్య ఘోషంబులతోఁ.

శా. ఆ కోలాహలమంతయుఁ ఉపవనం బందుండియే శ్రద్ధమై
నాకర్ణించిన జానకీరమణి విభ్రాంతిఁ వడిఁ లేచి పా
ద్యార్ఘ్యైక కరస్థమై యెదురుగా నర్చింపఁగా వచ్చినం
గాకుస్థాన్వయ దీపుఁ డందలమునుం గారాముమై డిగ్గుచుఁ.

ఉ. మన్నన లంది తమ్ములు నమాత్యులునుఁ తను జుట్టి కొల్వ న
భ్యున్నత పీఠమందుఁ గడు నొప్పగు దాసిక లుల్లసిల్లగా
సన్నకసన్నసే వ్యజనచామరచారు కరాంబుజాతలై
యున్న, మరొక్క లేమ కొనె యుమ్మినివేయు ప్రశస్తపాత్రముఁ.

క. తమ్మపడిగ నొక్కత కొన, నమ్ములపొది నొకతె ఖడ్గమది యొక్కతె వి
ల్లమ్మును మఱియొక్కతె కొని, సమ్ముఖమున నుండ రామచంద్రుం డంతఁ.

గీ. కాలినడ తనరాకకై కడఁగి వేచి,యున్న మందిరోద్యానమందున్న తన్ను
జూచి లజ్జించు జానకిం జూచి వచ్చి, కాల్గడిగి యాచమించి సుఖంబు మీఱ.

క. ఆసీనుఁడయ్యె నొక ది,వ్యాసనమున దివ్యవారి నట ద్రావి లతా
వాసమున సీతతో నొ,క్కాసనమున గూరుచుండి యనుజా! యనుచుఁ.

ఉ. భోజనశాలకుం జనుము! భూసురులన్ గురునిఁ వశిష్ఠునిఁ
రాజేనువారి నెల్లర కరంబు రయంబున వచ్చునట్టులు
న్భోజను వర్ధనంబుల ననూపమమై యొనరింప నూర్మిళా
రాజ సతీలలామ లలరఁ బొనరింపు మటన్న నాతఁడుఁ.

శా. ఆయా కార్యములఁ నియుక్తులను జేయఁ సోదరానీకముఁ
జాయా మాండవికాదులం బనిచినఁ సౌమిత్రి, శ్రీరాముఁడుఁ
జాయా సంయుతుఁడై యుపక్రమణముఁ సల్పన్ జలక్రీడ కెం
తే యానంద నిధాన సీత చెలఁగెఁ దీవ్యత్ బలోత్సాహతన్.

సీ. భుజములచే నామెఁ బొలుపార బంధించి, పలుమాఱు నీటిలోఁ బడఁగ వైచు
చటు రాగరసయుక్త జలము లంజలులతోఁ, జల్లుచు పెల్లు రంజిల్లఁజేయు
పరిమళోదక దివ్య వరతైల సౌగంధ, చూర్ణము లొండొరు ల్పొక్కి చేల్ల
పూలు వసంతముల్ పొలుపాఱ నొకరిపై, నొకరు చల్లుకొనిరి సుకమెసంగ

గీ. రాముఁ డప్పుడు కనుసన్నరమణులకు నొ,నర్ప సీతాసఖీ జనుల్ దర్పమొప్ప
నిర్మనుష్యంబుగాఁ జేసి నిలిచి రంత, ద్వారముల యందునన్ దూర దూరములను.

క. అన్యు లెవరు లేరని సా,మాన్య సంసృతీ సుఖంబు లవగాహనగా
నన్యోన్యము క్రీడించి ర,నన్య సౌఖ్యములుగ పెక్కులౌ రీతులలోన్.

సీ. కుసుమ కోమల తాడ నసమ సముత్కంఠ, ముష్టితాడనముల మురియు నొకట!
కంచుక బంధనో దంచద్విముక్తిగా, ఢాలింగనముచేసి యలరు నొకట!
కుచ కుంభ మర్దనాకుంఠ బింబాధ రో,ష్ఠాదంత పీడ నెసంగు నొకట!
అన్యోన్య వస్త్రాపహరణ కేళీహాస్య, ముదిత మానస సమున్ముగ్ధు లొకట!

గీ. స్థిత మహామాయ మంగళ దేవితోడ, సరవి పరమాత్మయగు రామచంద్రుఁ డప్పు
డతి రహస్యంబునన్ జలయంత్రములను, కృతక హ్రదములలో జలక్రీడ సల్పె.

సీ. అంత నచ్చట భోజనార్థము సమయ సూ,చన మిచ్చుటకును లక్ష్మణుఁడు వచ్చె
ద్వారపాలకు లడ్డమై రహస్యమ్మనగ, జలయంత్ర కౌతుక జలహ్రదముల
నతుల జలక్రీడలం దున్నవారు సీ,తారాము లనినచో, మీరు సూచ
నంబుగా ఇదె భోజనంబు లొనర్చు వే,ళాయెనం చెఱిఁగింపుఁ డనిన దాసి

గీ. కల నొకతె భయభీతయై కడఁగి తెరకు, వెనుక నిలుచుండి లజ్జమై వెలువరించె!
లక్ష్మణుని యాగమనమును రాముఁ డెఱిఁగి, నీరు వెల్వడి కడువేడి నీరు లాడి.

గీ. నలుగులు సుగంధ ద్రవ్యముల్ చెలఁగ స్నాన,మాడి జయలక్ష్మియగు సీతతోడఁగూడి
పట్టు పీతాంబరంబులఁ గట్టి మేలు, పూలు పరచిన త్రోవన పోయిపోయి.

ఆ. కామధేను దివ్య కల్పిత పక్వాన్న,పాళి యూర్మిళాది పడతి మిన్న
లతులభక్తి నిడిన నందఱ మునులతో, గురులతోడ తృప్తిఁ గుడుచుచుండు.

ఆ. సీత తాను చెంతఁజేరి కరమ్మున, వ్యజన మొప్ప వీచు నమృతమాన
చాటు వాక్యముల ప్రశంసింప సొపడు, రాఘవుండు ముదము రాజిలంగ.

క. సీతాకర కమలార్పిత,మా తాంబూలం బొనర్చి యంతఃపురమం
దాతత సుకథాగోష్ఠిం, జేతోమోదం బెలర్చు శ్రిత వర్గమ్మున్.

గీ. జానకి భుజించి సౌప్తికశాల జేరి, రాము నాగమనంబునకై మగిడి ని
రీక్షణం బాచరించుచు నక్షములను, లీలకై యాడుచుండు దాసీలతోడ.

## షష్ఠమ సర్గము

మ. పిదపన్ తమ్ముల దాసులన్ విడచి శ్రీపృథ్వీసుతా నాథుఁడున్
నిదురం జెందెడు మందిరంబునకు తా నిద్రంగొనం బోవఁగా
సెను రమ్యోన్ ధరణీతనూజ సొగటా లేమయ్యెనో! ఆట యె
ట్టి దిశం జేరెనో! రామచంద్రు నొడగూడెన్ స్వాగతం బిచ్చుచున్.

ఆ. హస్తలాఘవమున నతనిని గొంపోయి, తల్పమందు నిల్పి తగిన పాన
ద్రవ్య మొసఁగి దివ్యతాంబూలమును సమర్పించి వ్యజనమును ధరించి చెలులు.

మ. విసరన్ జానకితోడఁగూడి సుఖియై విశ్రాంతినిం జెంది, పెం
పెసలారంగ ముహూర్త మాత్రమున నెంతే నిద్ర మేల్కాంచి, సీ
త సముద్యన్నిజ తల్పము న్విడువ నంతన్ తాను మేల్కాంచినన్
వెస పానీయములైన దివ్యజలము ల్వొండిన్ సమర్పించుచున్.

శా. తాంబూలంబు నొసంగగా ముదితలై దాసీజను ల్వీవఁగా
సంబోధించి సతీమణీ మృదుల హస్తంబున్ వెసంబూని తా
నుం బూతోటన ద్రాక్షపందిరికి చెన్నుంగూర్చు వేదిన్ తగం
బింబోష్ఠీ సహితంబుగా సొగటముల్ ప్రీతాత్ముఁడై యాడుచున్.

క. దాసీజన పరివృతుఁడై, శ్రీసీతాయుక్తుఁడై దరిన్ పంజరమం
దాసీనమైన కీరిపి, కీ సంభాషణల సల్పు క్రీడాత్ముండై.

గీ. సీత పిలువంగవచ్చి సంప్రీతలగుచు, వారనారీజనంబులు వరుసమీఱ
షడ్జమ స్వరశోభిత సరసగీతములను బాడి నృత్యాదుల ముదముఁ గూర్ప.

క. వారికి వస్త్రాలంకృత, పారితోషముల నొసంగి పంపి సుఖము చే
కూరఁగ నుప్పరిగెన్ తా, మారూఢులునై వసించి రతి ముద మలరన్.

ఉ. మేడపయిన్ జెలంగి సరి మేలగు ముత్తెపు తోరణాలు వ్రే
లాడెడు గట్టి రత్నపు కవాటము లొప్పు గవాక్షపాళినిన్
వేడుకతోడ కట్టెదుట వ్రెలెడు నంగడి వీధివైపునం
జూడఁగసాగి రొక్కయెడ చోద్యములం గనుఁగొఁ దలంచుచున్.

సీ. సీతకు తన కుడిచేతి తర్జన్యంగుళము చేత వేడుకలను హసన్ము
ఖాంబుజాతుండయి యంగడి వీధిని, జూపుచుండగ నొక్కచోట సీత
దారిద్ర్య క్లిశ్య శరీరయై వస్త్రాద్యలంకారములు లేక చంకలోన
బిడ్డనుఁ గైకొని బిచ్చము నెత్తుచు, పోవుచునున్న విప్రుని సతీల

గీ. లామఁ గని దాసికల నంపి యామె నపుడు, నామెయిం బిలిపించి తా నాపవిత్ర
వనితఁ గనుఁగొని మన్నించి యను ననేక, మార్తితోప సీతారామమూర్తి యెదుట.

సీ. నీవేల ? యిటు దీనభావముంగని యలంకారముల్లేక విచార లీల
కనులకుఁ గనుపించు జనుల నెల్లర చేయిఁజాపి యాచింతువు జాలితోప
యెవ్వతె వీవు ? నీ కెవ్వారు పోషించు, వారలులేరె విచారమయ్యొ !
నీ వాలకముఁ జూడఁగా వనితామణి ! దాపక నిక్కంబుఁదగ వచింపు

మన్న, నవ్వనితామణి కన్నులుం జె,మర్ప సాదర భావ సంభాషణమున
కలరి కొంత విశ్రాంతి తన్నులము కొనఁగ, రాణితోడుత నిట్లను రమణి మిన్న!
తీర్థ యాత్రార్థ మేతెంచి నాపతి యింత, దనుక రాఁడయ్యె, నాతండ్రియింట
నున్న దానను తల్లి! ఎన్న నాతండు వా,ర్థక్యంబుచే స్వర్గ తలముఁ జేరె
నాసోదరు లవంతి వాసమ్ముగా గురు,కుల మందునం జదువులఁ గలారు
ఇప్పుడు పోషణ మెలమిఁజేసెడి వారు, నాకు లేరై రింక నగలు చీర
లెట్టులు ధరింతు? నమ్మరో! యింత పొట్ట, పోసుకొన యాచనంబును జేసికొందు
నాదు భర్త వచ్చెడిదాక నాకు కష్ట, మిద్ది తప్పదు! నా తల్లి వృద్ధ యనియె.

క. అని చెప్పగ నా మాటల, విని జానకి చాల వగచి వేగమ శ్రీరా
మునిఁ గాంచి యతని సాదర, ఘనభావ మెటింగి సీత కనికర మొలయన్.

ఆ. ఆమె చేతినున్న యట్టి బిడ్డను తన, చేతఁ గొనుచు సంజ్ఞచేత దాసి
కా జనములఁ గాంచ నోజ నా యమ్మకు, బిడ్డకున్ తలంటి పేర్మిమీఱ.

క. ఉష్ణోదకములఁ బోసి క, వోష్ణమైన కామధేను వొసఁగిన తృప్తా
ర్చిష్ణాన్న పానగా! వ,ర్ధిష్ణ సౌఖ్యమానసగ పొరిం బొరి సేయన్.

చ. తన నగలన్ స్వయంబుగను తాను ధరించెడు చీరరైకలన్
గనికర మొప్ప నిచ్చి కడకన్ పతిమోమును గాంచ, నాత డి
ట్లను తరుణీ మణీ! దిగులు నందకు మమ్మ! త్వదీయ భర్త వ
చ్చును త్వరలోన లక్ష్మణుని జూడుము! నీకు సహాయ మయ్యెడిన్.

చ. అని ఒక దాసి వెంట నతఁడంపగ బ్రాహ్మణి కిచ్చి పంపె ల
క్ష్మణుఁ డొక లక్ష నాణెములు స్వర్ణ దుకూలములుం బదార్థముల్
తిన గుడువన్ ధరింప నతిథి ప్రముదం బొనరింప నెన్ని నా
ళ్లనుభవముం బొనర్ప ననయంబుఁ దరుంగని దివ్య సంపదన్.

క. ఆ పాపచేత నిడియె న,పూపము లొక కొన్ని సీత, పోవుచును కృత
జ్ఞా పూర్వకముగ దీవన, లేపుననీ! వచ్చినట్టి యిబ్రాహ్మణికిన్.

మ. పసుపుం గుంకుమచేత పూజ లిడి యప్పా! యెన్నఁడే వచ్చి నీ
దు సుఖంబుల్ దెలుపం దగున్ శిశువు నుమ్మా! భద్రమం చాపె సా
ధ్వస మొప్పార రథంబుపైఁ బనుప నుద్యల్లీల నేర్పాటు సే
య సముత్సాహము మీఱ దీవనల నొయ్యం దన్పుచుం బోవఁగన్.

క. మరునాడు లక్ష్మణుఁడు సో,దరు వదినన్ మ్రొక్కునెడ ముదంబున గని సా
దర భావమొప్ప లక్ష్మణ!, దరిద్ర బాధ మనమున్నఁ దగవె! జనులకున్,

క. మన రాజ్యము మన దేశము, మన పరిపాలనముఁ గల్గు, మట్టునకున్ లే
మిని గుందువారు లేకుం,డను గాంచుట మనల పని! కడంగ వలవదే?

మ. అనినన్ రాముఁడు లక్ష్మణా! మనల పాల్యంబైన దేశంబులం
దున నెచ్చోటను లేమి కల్గఁదగ దెందున్ గల్గినన్ రాష్ట్ర పా
లనముం జేసెడివారు దండ్యులని కూడన్ చాటఁగా బంపు మె
ల్ల నృపాలావళి ముఖ్యకృత్యమని యెల్లల్ దాట సామంతులన్.

ఉ. సర్వసమృద్ధియై యెసఁగ సర్వజనంబులు తృప్తిమై మనన్
సర్వ జనాళి తత్పరత సత్కుల వృత్తుల నార్జనంబునన్
బర్వఁగ, లేమి యెట్టు? లోకపట్టున గల్గిన ద్రవ్యమిచ్చి య
క్కార్వల బాపఁగా వలయు కొండొక దృష్టి ప్రభుత్వ మెల్లగున్.

క. ఈ రీతి మహా మెళుకువ,తో రాజ్యం బేలు, తనదు దూతలు ప్రజ లే
తీరున తమతమ ధర్మ వి,హారులో? కనుఁగొంద్రు వీట నహరహమందున్.

శా. ఉద్యోగస్థులు స్వీయ కార్యములలో నుద్యుక్తులై యుందురా?
ఆద్యంతంబును స్వీయ కార్యముల నత్యాసక్తులై యుందురా?
సద్యః కర్మకలాపముల్ క్రమముగా సాగింతురా? బద్ధకం
బుద్యద్రీతి జరింప, రేపటికి జేయుం బుద్ధి సాగింతురా?

క. ఎప్పటి కప్పుడు కనుఁగొని, తప్పక దోషులను జాల దండించుచు నే
రొప్పప్పగ, రాజ్యము సేయుదు, తెప్పుడు నేమఱక నరసి యెల్లవిధములన్.

శా. సాయంకాలము నందునన్ మరల రాజ్య ప్రస్ఫుర త్కార్యతా
న్యాయాన్యాయ విచారణంబులను మంత్ర్యంగంబు నిక్కచ్చిగా
సేయంగాంచి మహార్హ కార్యములలో స్వీయంబుగా నేర్పునన్
జేయించున్ సమబుద్ధిగా చతురతా సిద్ధాంత రాద్ధాంతముల్.

శా. సాయం సంధ్యయు నగ్నిహోత్ర సుసమర్చాకృత్యము న్శంకర
శ్రీయంబా సముపాసనంబును ద్విజాశీర్వాదముల్ భోజనం
బై యంతన్ గను సత్కథా శ్రవణము మొయ్యన్ సంస్మరించున్ హరిన్
ఆ యీరీతుల జాముఱాత్రి యగుదా కత్యంత సంతుష్టుఁడై.

ఆ. భాగవతుల కథలు వారాంగనా నర్త,నంబు లుత్తములగు నగరవాస
వార్త! లటులె నటుల వరుస గాయకుల గా,నముల రాత్రి కొంత విమలరీతి.

క. గడువన్ జామున్నర ప్రొద్దడరు రత్న దీపకాంతి నత్యంతమ్మున్
గడు నిద్రాలయమునకున్, వెడలు సఖీవర్గములును వెంబడిరాఁగన్.

క. జానకి యెదురుగ వచ్చి ని,జానకు పిలచికొని పోవ చక్కని పర్యం
 కాన సరస సల్లాపా,నూన క్రీడలఁ జెలఁగి వినోద పరుండై.

సీ. ఆనంద తుంది లాత్యంత నిర్మల హృద,యార విందుఁడునై మయూరపింఛ
 వ్యజనంబులం గొని వరుస దాసీజనం,బులు వీవ నిద్రా విముద్రి తాత్మఁ
 డై యుండు నిట్టు లీచాయ ననేక వ,త్సరములు శ్రీరామచంద్ర మూర్తి
 సీతామహాదేవి సేవింప పూర్ణమ, నోరథుం డగుచు విహార లీల

 ఆ. చంద్ర శాలలందు జల యంత్రముల సమీ,పంబునందు పూల పందిరులను
 చిత్రశాలలందు చిత్ర మంచకముల, సౌఖ్యములను బొందు సంతతంబు.

గీ. స్ఫటిక కాంచన రత్న సంఘటిత శాల,లందు పుష్పకమం దూర్ధ్వ మందిరముల
 ఏకమా స్తంభ మందిరానీకములను, జానకీరాములు సుఖింత్రు సౌఖ్యములను.

# సప్తమ సర్గము

## వ్యాసుఁడు శ్రీరాముని దర్శించి సంభాషించుట

శా. చైత్రస్నానము రామదర్శనము కాంక్షుంజేసి శ్రీ వ్యాసుఁడుర్
 యాత్రార్థం బరుదెంచె నొక్కపు డయోధ్యా రాజధానీస్థలిర్
 ఛాత్రుల్మౌనులు చుట్టి ముట్టి కొలువన్; సద్యః ప్రమోదాత్ముఁడై
 ధాత్రీ వల్లభుఁడైన రాఘవుఁడు శ్రద్ధా భక్తి తాత్పర్యుఁడై.

 చ. ఎదురుగ నేగి భక్తి ప్రణుతించి, మహత్తర స్వాగతంబు మై
 గుదురు కొనంగఁ గొల్చి, మునికుంజరు నాత్మ విలాసమంది రా
 భ్యుదయు నొనర్చి, మానుల ననూపమ పీఠము లందు నిల్పి, సొం
 పొదవగ నర్ఘ్య పాద్య విధు లూర్జిత శ్రద్ధ నొనర్చి యింపుమై.

క. దివ్యాసనంబు నను వేదవ్యాసుని నిల్పి భక్తి తాత్పర్యమునన్
 దివ్యోపచారవితతిన్, నవ్య కౌతుకంబునన్ పొనర్చి కడంకన్.

గీ. కామధేను చింతామణీ కౌస్తుభ ప్ర,జన్య దివ్యార్హ సద్వస్తు సమితి సత్క
 రించి జానకీదేవి వడ్డించ దివ్య, భోజనాదుల తృప్తులై భూమిసురులు.

 క. దక్షిణ తాంబూలంబుల, సాక్షా చ్ఛ్రీరాముఁడీయ చక్కంగొని యో
 గ క్షేమము లొండొరులు వి,చక్షణముగ నెఱిఁగి తనిసి సల్లాపములన్.

 శా. సీతాదేవి వినిర్మల వ్యజనముం జేఁబూని వీవన్ మహా
 ప్రీతిన్ వ్యాసుఁడు, స్వీయమా కుశలముం బ్రేమంబునం దెల్పి, యో

సీతానాయక ! నీవు రాజవయి స్వస్తిన్ భూమినేలంగఁ గా
కేతన్మానిజనంబు తృప్తిమెయి నెందే సౌఖ్యము ల్గాంచునే ?

ఆ. ఓమహానుభావ! రామచంద్ర ప్రభో ! ఈవు పుడమి రాజ్యమేలినట్లు
మునుపు నిపుడు రేపు ముందెన్నఁడేనియు, నేలురాజు గల్గఁజాలు నొక్కొ ?

శా. నిన్నున్ నామనమందు మెత్తు నెపుడున్, నీ యేకపత్నీ వ్రతం
బన్నన్ సాధ్యమె ? రాజ జన్మలకు ; రాజ్యశ్రీ మదోపేత సం
ఛన్నశ్రీనయనాభిరాములకు ; సౌశీల్యావ్యవనోద్భూత వి
చ్ఛిన్న స్త్రీబల కామదోషులకు నో శ్రీరామచంద్రప్రభూ.

క. ఈ వ్రతము దుర్లభం బే, తీవ్రనిష్ఠ సేయునట్టి ధృతిశాలురకున్
సువ్రతుఁడీవు శ్రీరామా ! నీవ్రత నిష్ఠకు సతంబు నిను వర్ణింతున్.

క. మాతృ పితృభక్తియున్ సౌభ్రాతృత్వము నింక నేక పత్నీవ్రతమున్
నీతి నియమంబులున్ విన,యాతి నిర్మలాత్మధర్మ మన్నన్ నీవే !

క. ఒకమాట ఒక్కబాణం, బొక భార్యావ్రతము నీ కహెూ ! నైజములై
వికసించె పరిమళ మే,చకమై నీ కీర్తిసుమము జానకిరామా !

ఆ. సవతితల్లి కోర్కి సమకూర్చ నాసన్న,యౌవ్వరాజ్యపట్ట మవలఁద్రోసి
దండకాటవికి ముదంబున జనువాఁడు, నీవుతక్కఁ గల్గునే ? నరుండు.

క. శరణాగత రక్షణమున, కరుణాళుత్వమున శౌర్య ఘన ధైర్యమునన్
అరుణ కిరణాత్మ వంశా,భరణా ! ధరణిన్ గలారె ? భవ దన్యఘనుల్.

గీ. ఎన్నియని దెల్పవచ్చునో సన్నుతాంగ!, సకల సద్గుణగణమె నీ చందమున జ
నించి జగమందునన్ జనియించినట్టి, సర్వజనులకు మార్గదర్శకుఁడవైతి.

క. అని ప్రస్తుతింప రాముఁడు, విని పెద్దలు మీర లిడెడు విమలాశిష పా
వన బలము కాక వేరెద్దిని గాన బలంబు ! ప్రస్తుతింతు మునీంద్రా !

సీ. నోటవచ్చినయట్టి మాట యొక్కటియె కా,కన్యము బల్క ; వ్యర్థాప్తిఁ గనదు!
సీతను గాక యే నాతినేన్ గౌసల్యఁ,గా తలంచెదను త్రికరణములను !
సంహరింపంగ నే చాపంబుఁ దాల్తు వే,రొక చాపమెత్తు వాడుకయు లేదు !
వ్యాసమునీంద్ర ! మీ వాక్యబలంబున, నిందుకు తిరుగులే దింతవరకు

గీ. ఇంకనుం గల్గకుండుత! నెలమిమీఱి , పెద్దల యనుగ్రహంబు తప్పిచన దెవుడు
ఇట్టి ధృతి మహనీయు లైనట్టి మీ, కృపాకటాక్షంబు చేతనే పట్టువడియె.

చ. అని వచియించు రాఘవుని నారసి వ్యాసుఁడు శ్రీరఘూత్తమా !
వినుమిది ; యేకపత్నివ్రత విశ్రుత సత్ఫలితంబు చేత నీ

కు నగు ననేక కాంతల నిగూఢసుఖంబు భవాంతరంబునన్
జనసుత గోపకృష్ణ యదుజన్మము ద్వాపరమందుఁ గల్గెడిన్.

చ. పరమ రహస్య మిందె పొలుపారు, జగంబున సాభిలాషుఁడై
పఱఁగిన వాఁడు, సౌఖ్యముల పాల్పడఁబోఁడు, నిరాభిలాషియై
బఱఁగిన, సర్వ సౌఖ్యములు పైకొని వచ్చి వరించుఁ గావునం
బురుషుఁ డనాదృతిన్ విషయభోగవిరాగిగ నుంట మేలగున్.

క. ఎంతెంత దూరమన క్రో,సంతన్ క్రోసంత యనెడి సామెతయగు ధీ
మంతుఁ డెవఁడేని యైహిక,భ్రాంతిన్ గనఁ డిట్టి బుద్ధిపరతన్ రామా!

మ. అయినన్ నిర్గుణతత్త్వశాలి కనుఁ గా కన్యుల్ గనుంగొంద్రె? ని
ర్భయ సమ్యగ్వ్రత సిద్ధి; నిక్కముఁ దలంపన్ యేకపత్నీవ్రతా
హ్వాయ మాఁగాక; సహస్రయావత మనోహారి వ్రతంబౌను గా
క; యమంబున్ నియమంబుఁ గల్గని నరుల్ కామార్థదుర్వ్యాపకుల్.

క. అని వచియించిన వ్యాసుం, గని మునిగణవందనీయ! కడు చోద్యంబై
విన వేడుకయా విషయము, వినినాఁడ భవన్ముఖారవిందమున భళీ!

గీ. ఏక పత్నీవ్రతఫలం బదెట్టులగును, బహుళ పత్నీసుఖంబు? సుస్పష్టముగ నె
ఱుంగ వచియింపు మన్న, మెఱుంగుదేరు, ముఖ వికాసమునన్ వ్యాసముని వచించు.

క. మాయా మానుష విగ్రహ! నీ యెఱుఁగని ధర్మము లవనిం గలవే? అ
ట్లైయును నెఱుంగ నట్లు భ,ళీ! యుందువు మావలన తెలియఁ గోఱుటకై.

క. ఆసకు వశుఁడౌ నాతఁడు, దాసుఁడగు ప్రపంచమునకు ధర్మం బఱయన్
ఆసను జయించువానికి, దాసి యగు ప్రపంచమెల్ల తప్పక వింటే?

గీ. భ్రాంతియే కాక ఆత్మకు ప్రకృతితో ప,నేమి? అది స్వయం సంపూర్ణ భూమ సచ్చి
దవ్యయానందమయము; నిరంతరంబు, ప్రకృతి తన్నాశ్రయింపక ప్రతిభ లేదు.

క. జడమైన ప్రకృతి సతతము, విడువక పరమాత్మఁ గొల్చు వేడుకమై నె
ప్పుడు నాత్మ రమించిన యటు, లడరుఁగాని ప్రకృతి దాని కనవసర మగున్.

మ. తనకుం దాను రమించుచుం బ్రకృతి కత్యంబుఁ జేకూర్చు స్వ
చ్ఛ నిజానందము, దాని మర్మమును గాంచన్ లేని యాత్మానుభూ
తి నిజజ్ఞాన విహీను లీ ప్రకృతి యెంతే సంతతానంద మి
చ్చు నటంచుం దలపోసి కష్టపడి భ్రష్టుల్ సత్సుఖాస్వాదంబునన్.

క. ఈ కీలకం బెఱింగిన, గాక యెట్లు కర్మ బద్ధుఁగా సేయదు? ఈ
లోకమున కర్మ వీడుట,చే కల్గును బంధముక్తి శ్రీరఘురామా!

ఆ. ఏకపత్నియందు శ్రీకరనాసక్తి, సుఖము కలైనేని సుస్థిరముగ
ఎన్ని వేలమంది యెటులఁ బ్రేమించిన, నేమి కొఱఁతకల్గు నేమి ? చెఱుపు.

ఉ. తాను ప్రకాశమానుఁడయి తప్పక సర్వ జగంబు స్వప్రకా
శానుగతంబుఁగా వెలుఁగఁ జాల నొనర్చు ప్రభాకరుం బలెన్
జ్ఞాని సుఖాత్మకుండయి భృశంబు సమస్తము సౌఖ్యపెట్టు న
ట్లూని చరించుఁ గాని అతఁ డొక్కఁపుడున్ వశవర్తి కాఁడు సూ.

క. తన యెదుటఁ గల్గు సకలము, తన కాంతికి కాంతికల్గి తనరుం గానీ
తను వాని బ్రకాశింపం,గను కోఱునె ? యెన్నడైన జ్ఞానియు నంతే.

ఉ. కోరిన గోరుకున్న వదిగో ! రవి లోకము సుప్రకాశ వి
స్తారముఁగా నొనర్చు నను సన్నుతికిం గుఱియయ్యెఁగాక ! ఆ
తీరుననే రఘూత్తమ ! మతి స్తిమితం బయినట్టి యోగి కే
తీరున నైన బద్ధనియతిం జరియింపని కృష్ణచర్యయా.

క. మాయకు లోఁబడు జీవుని, చాయఁ బ్రవర్తింతు విచట జానకిరామా !
మాయాతీతపు వర్తన, చాయలఁ జూపింతు కృష్ణజన్మము నందున్.

గీ. మట్టి యడుసున గట్టినయట్టి యిటుక,గోడపై వాన గుఱిసినఁ గూలిపోవు
గచ్చుటడుసున గట్టిన గట్టిగోడ, వాన దడిసిన కొలఁది ధృవంబు నొందు.

క. ఏవాన మొదట చెరుపో ? ఆ వానయె ! తుదిని మంచి దైనట్టులుగా
ఏవాఁ డేకాంతజ్ఞా,నో ? వాడెల్లరను జ్ఞాను లొనరుపఁ జాలున్.

ఉ. నీ కిది క్రొత్త యంచును గణించి వచించిన వాఁడఁగాను కా
నీ కని పెట్టి నీమత మనిందిత దివ్య సుఖానుభూతి నీ
లోకులు వొందగా జగములోన నిదేపని బూని పుట్టువుం
జేకొనుటన్ వచించితిని ! చెచ్చెర నేనిక పోయి వచ్చెదన్.

మ. అని యత్రాకరణాళిఁ దీర్చికొని శిష్యవ్రాతముల్ కొల్వ స
న్మునులం గూడి యయోధ్య వీడి చేనియెన్ మోదంబునన్ వ్యాసుఁ డం
త ననూనోజ్వల వైభవంబు రఘుతీర్థశ్రేష్ఠ సందర్శనం
బును గావింపఁగ నెల్లలోకముల సభ్యుల్వచ్చి రవ్వారిగన్.

గీ. కిన్నరులు యక్ష రాక్షస పన్నగులును, దేవతా నాగ గంధర్వ దివ్యమునులు
నృపులు ఖగములునుం బ్లవగేంద్రు లప్స,రసలు వచ్చి రా రామతీర్థమున మునఁగ.

ఆ. వృక్ష గుల్మ తీర్థ పక్షివల్ల్యాదులు, నది నదంబులున్ వనధి గిరీంద్ర
తతియు కామరూప ధారిణులై రామ, తీర్థ దర్శనాత్త తృప్తులగుడు.

## దేవతా స్త్రీలు శ్రీరామునిచే వరము నొందుట

క. ఒకనాడు దేవపత్నులు, సుకుమారాకారు దివ్యసుందరుఁ గని జా
నకి యెంత పుణ్యవతి! దా,నికి రాముఁడు వశుఁ డహా! యదృష్టము కాదే?

మ. అనుచున్ మన్మథ బాణ పీడిత హృదాబ్జామేయ బాధాను త
ప్తనులై జానకి దూరమై యెసఁగుటం దామాత్మ నూహించి, యొ
క్క నిశన్ భూరి యలంకృతీలసిత నక్షత్రమ్ములో యన్న మా
డ్కి ని (శ్రీ)రాముని దర్శనార్థమయి శుష్కీభూత చేతస్కలై.

క. కావలి వారల తోడన్, దేవతలము! మమ్ము విభుఁ డుదితమతి తోడం
గావక యున్నన్ యేక,గ్రీవముగా సరయువున నొగిన్ బడుదు మనిన్.

క. వారలు దాసీజనముల,తో రయమున బల్కుచుండ తోడరి వినిన యా
(శ్రీ)రాముఁడు మేల్కని సుర, నారీమణులకును దర్శనం బిచ్చి తగన్.

క. ఓ రమణీ మణులారా! మీరిచ్చటి కింత రాత్రి మించియు రాఁగా
కారణ మనూహ్యమన నా, నారీమణు లిట్టు లనిరి నమ్రశిరసులై.

శా. సర్వజ్ఞుండవు నీవెఱుంగని పనుల్ సర్వేశ్వరా! కల్గునే?
దుర్వారుండగు మన్మథున్ శరములెందున్ డెందము ల్నాట త
ద్గర్వంబున్ భవదీయ సత్కరుణ భగంబుం బొనర్పింప, మా
గీర్వాణాంగన లెల్లవచ్చితిమి సక్తిన్ మమ్ముఁ గాపాడవే!

క. నీ దర్శనంబుఁ గల్గుట,చే దశరథ రాజపుత్ర! చెందితిమి మహా
మోదంబుఁ గల్గె ధన్యత, మో! దేవా! ఇంక భాగ్య మొందింపఁ గదే.

వ. అని వచియించు వారి యభిప్రాయం బెఱింగి.

క. దేవతలు మీరు మానవ, సేవితలు! ననుం బరీక్ష సేయుట కిటులం
గా వచ్చి యుండుదురు నా,కే వెఱపున్ లేదు వ్రతము నెడ నెయ్యేడలన్.

క. మీమీ స్థలముల కేగుఁడు, రామామణులార! యనిన రమణులు నిక్కం
బేమ భవత్స్నేహమునం, గామకుల మటన్న కోప గరిమం బలుకున్.

శా. చాలుంజాలు లతాంగులార! తగునే? చంచన్మహాసాహసం
బేలా? తుచ్ఛ సుఖాప్తికై చెడుట! మేలే? నాదు రాజ్యంబునం
దే లేదీ పరభామలం దడవుటన్ హేయ ప్రసంగంబు, మీ
రేలా? యిట్టుల బేలలై వగవ! నెందే భ్రష్టతం గాంతునే?

మ. అను వాగ్బాణపరంపరానిహతులై యా దేవతాకాంత లం
దునసే మూర్ఛ మునుంగఁగా నెఱిఁగి, సంతోషంబు వా రొందున

ట్లను! నారీమణులార! ద్వాపరమునం దానంద గోపాత్మజుం
డనుగా బుట్టుదు, దేవతల్ యదువులైనన్ మీరు జన్మింపుఁడీ!

ఉ. గోపికలై చరించునెడ గొంకక నొండొకరాత్రి రాసలీ
లా పరకేళి మీర లలరన్ జరియింతు! నిజంబు! ఇప్పుడిం
దీ పగిదిన్ జరించుట మఱెన్నటికిన్ జరుగంగరాదు! దు
ర్వ్యావృతిడింది స్వచ్ఛహృదయలై జరియింపుడు పూజ్యవృత్తిమై.

క. అను వాక్యామృత పానం,బున కొంతగ తృప్తినంది పొలుపగు మేనం
గని మగిడి ప్రాణములు వచ్చిన చొప్పున్ జనిరి తమదు చిత్తము లలరన్.

సీ. ఇంతలో నచటికి నెలమి సాదరముగా, మాయా పురమునుండి మగువ యొకతె
గుణవతి యనుపేర కొమరొప్పెడు శుభాంగి, సరయూనదిన్ భక్తి చైత్రమందు
రామతీర్థస్నాన కామియై వచ్చెనం,చు వచించు రామదాసున్ నతించి
వినుచున్న విష్ణుదా సను గురూత్తమ! గుణ,వతి యన నెవ్వతె? వరుసమీఱ

గీ. ఎవని పుత్రిక! గుణమెట్టి? దెందుచేత, నామెను గుఱించి ప్రత్యేకమైన శ్రద్ధ
చేసి మీరు వచింతురో! చెలియ యెవని,భార్యయో! విస్తరించిన బాగు కాదె?

## అష్టమ సర్గము

### గుణవతీ కథనము

వ. అని ప్రశ్నించిన విష్ణుదాసునకు శ్రీ రామదాస గురువరేణ్యుం డిట్లు నిరూపింపఁ దొడంగె.

గీ. కృతయుగమునకు చివరలో ప్రతిభ నొప్పె, వేదవేదాంగ నిధియైన విప్రవరుఁడు
దేవశర్మ యనాగ నాత్రేయ గోత్ర,జుండు మాయాపురంబున పండితుండు.

గీ. అగ్ని సేవాపరాయణుఁ డతిథి పూజ, నాభిలాషుఁడు సౌరవ్రతాత్మకుండు
నిత్యమున్ సూర్యుఁగొల్చుచు నియతి నపర,సూర్యుని విధాన వెల్గుచుం జొక్కుచుండె.

ఉ. పుత్రులులేని యాద్విజుఁడు భూసుర వంశపవిత్రుఁడాత్త చా
రిత్రుఁడు చంద్రశర్మయన ప్రీతి తనుం భజియించుచున్న స
చ్ఛాత్రుని కిచ్చి యాపెను భృశంబుగ పెండిలి సేసె, నాతఁడున్
మైత్రిఁ జరించుచుండెను కుమారుఁడు లేని కొఱంత తీఱఁగన్.

క. ఒకనాడు మామ యల్లుం, డొక యడవికి సమిధలును కుశోత్కరములు తే
ప్రకట హిమవన్నగస ము,న్నికటమ్మున కరుగ వారినిన్ వెన్ బడుచున్.

క. ఒక రాక్షసి తరుమఁగ మా, మకు నల్లుఁడు నల్లునకును మామయు భయముల్
గకవికలుఁగాఁగఁ జచ్చిరి, వికుంఠమును జేరి రాయి విప్రద్వయముల్.

శా. ఆ క్షేత్రప్రతిభా విశేషమున, ధర్మారాధనా తత్పర
త్వక్షేమైక విశేషతత్త్వమున, భాస్వద్భాస్కరారాధనా
నిక్షేప ప్రభలుల్ల సిల్లుటను, వారిన్ వేగ గొంపోయి రెం
దే క్షేమమ్ముగ నవ్వికుంఠ నగరాధీశాజ్ఞ విష్ణున్ భటుల్.

ఆ. వాననీరు వెల్లువలు పారి జలనిధి, జేరినట్లు శైవ సౌర శాక్త
వైష్ణవ ప్రగాణపత్యులెల్లరు తుది, జెందుదురు వికుంఠ మందిరంబె.

గీ. నామ రూప క్రియా భేదన ప్రసక్తి, నొక్క పరమాత్మయే తగ నొప్పియుండు
నైదు విధముల నననేల నన్నివిధము, లందు భక్తుల యిష్టములందు వోలె!

సీ. ఒక్కని సంసార యుక్తుని కొమరుండు, తండ్రీ! యటంచును దవిలి పిలుచు!
అల్లునిచే మామ! యని, బావమఱదిచే, బావ యటంచును చేవమీఱ
తమ్మునిచే నన్న తల్లిచే బిడ్డగా, మామతోడుతను జామాత యనుచు
వేఱ్వేఱు వరుసల వెవ్వేఱుఁగా పిలు, వం బడ్డ నొక్కఁడై వఱలినటుల

గీ. ఆదినారాయణుఁడు పరమాత్మ తత్త్వ,దుచితరీతులన్ భక్తుల కుచితమైన
రీతులం గొల్వఁబడియు విఖ్యాతిమీఱ, నద్వితీయుఁడై పరఁగు శిష్యా! నిజమ్ము!!!

గీ. సూర్యసమకాంతివంతులై యార్యులైన, యిరువురున్ బ్రాహ్మణోత్తము లేగి రపుడు
సూర్యసమ కాంతివంతమై సొరిది వెల్గు,నట్టి దివ్య విమానమం దనుపమముగ.

ఉ. శ్రీహరి సన్నిధానమును జేరిరి తన్నిభమా శరీర సం
దోహములం జెలంగి పరితోషిలు సూరులఁ జేరి సౌఖ్యసం
దోహులులైరి! కాని పరితోష మెఱుంగదు తండ్రి భర్త లెం
దో హతులైరి రారని కుతూహలముల్ సమయన్ కుమారియున్.

క. గుణవతి దుఃఖాకులమై, గుణవతి యగుటన్ గడంగి గురునకు పతికిన్
ప్రణుతించి మనమునన్ దా, నణుమాత్రము కొఱత వడక యన్నివిధములన్.

క. కల దెల్ల వ్యయపఱచి వా,రల పరలోకముల వెలితి రాకుండఁగ ని
మ్ముల కర్మలఁ గావించి స,ఫల దివ్యాంతఃకరణ ప్రభావిత యగుచున్.

క. బిచ్చమెత్తి జీవించున్, అచ్చపుభక్తిన్ భజించు హరి నహరహమున్
విచ్చలవిడి నింద్రియములఁ, గ్రచ్చుఱఁ జననీయ కర్చఁ గావించు పతిన్.

ఆ. శాంతచిత్త! సత్యశౌచసంపన్న! యే,కాదశీవ్రత ప్రకాశమాన!
విష్ణుదేవళము పవిత్రమ్ముగా శుద్ధిఁ,జేయు ముగ్గులిడు విశిష్టవృత్తి.

గీ. మాఘ వైశాఖ కార్తీక మాసములను, చైత్రమున స్నాన మొనరించి సద్వ్రతముల
బ్రొద్దుపుచ్చును నిత్యముం బూజసల్పు, భక్తితో విష్ణు! జిష్ణు! కృపాకరిష్ణు!

మ. ఇటులెంతో నియమంబులన్ జెలఁగుచున్ హేరాళమై యొక్కనా
డటులో వీనుల విందుఁగా వినియె! నా యీ సత్కథా కర్ణనా
పటు శ్రద్ధా సమయంబులందు సరయూ భవ్యాంబులన్ చైత్ర వి
స్ఫుట మాసమ్మున రామతీర్థమున నిస్తుల్యంబుఁగా మున్గినన్.

గీ. ముక్తి కరతల మౌనని ముఱిసి ముఱిసి, ఎపు డయోధ్యకు పోవుదు? నెపుడు సరయు
వందు రామతీర్థమున నమందరీతి, స్నాన మొనరింతు? ననియును సంబరపడు.

క. ఇటు తలఁచి తలఁచి తా నొ,క్కట వచ్చె నయోధ్యకున్ సకల పుణ్యంబుల్
ఘటియించె ననఁగ! సరయూ, తటమున గనుఁగొనియె రామ ధరణీ భరణున్.

శా. పత్నీబంధుసమేతుఁడై పటగృహ ప్రాంతంబునం దుండగా
రత్నాలంకృత రుక్మనూపురపద ప్రచ్ఛన్న భూభాగునిన్
నూత్నానూన కళాప్రశోభిత తనున్ న్యూనాంబుదశ్యామునిన్
యత్నంబొప్ప కనుంగొనెన్ గుణవతీ యాచ్నా వధూరత్నమున్.

చ. మిత పరివారుఁడై తగ సుమిత్రతనూజుఁడుఁ గొల్వ, సోదరా
న్వితుఁడయి సీతతోడ పరివేష్టితుఁడై సొగటాల నాడుచున్
స్మితవదనాభిరాముఁడు ప్రసిద్ధ గుణప్రతిభాభి రాముఁడున్
జిత మహనీయ కాముఁడు భజింపఁదగెన్ తరుణీ లలామకున్.

శా. ఆకర్ణాంత విశాల దీర్ఘనయన వ్యాకీర్ణ చంద్రానన
శ్రీ కైవల్య వరప్రదాత! హృదయ శ్రీ కౌస్తుభాలంకృత
శ్రీ కల్పోజ్వల దివ్యభూషణుఁడు, శ్రీ సీతా మనోనాయకుం
డా కాంతామణి కిచ్చె దర్శనము దివ్యానంద సంధాయిగన్.

మ. కటి భాగంబున దివ్యరత్న విలసత్కమ్ర ప్రభానూన వి
స్ఫుటమై వెల్గుచు నున్నయట్టి మొలనూ ల్శోభిల్లఁగా, కంకణో
త్పటు బాహాయుగళిన్ ధగద్ధగిత సౌందర్యంబుచే, దిక్కు లం
తట నిండన్ వెలుఁగొందు బాహుపురు లుద్యత్ సత్ప్రభం గూర్పఁగన్.

ఆ. కర్ణకుండలములు కమనీయమౌ కిరీ,టంబు రత్నపుంగరంబు లంగు
ళంబులన్ విరాజిలన్ హారవక్షుఁడై, రమణమీఱు రాము రామ కాంచె.

ఉ. కాంచి ముదంబు నంది తమకంబున వందన మాచరింప, న
భ్యంచితరీతి శ్రీరఘు కులాంబుధి చంద్రుఁడు లేవనెత్తి య

ర్పించిన సత్ఫలాదులను ప్రీతిఁ గ్రహించి సతీలలామ! నే
మించిన నీ మనోరథ మమేయ ఫలప్రద మయ్యెడుం జుమీ.

గీ. అని ప్రసన్నతతోఁపఁ బల్కిన గుణవతి, రామ! నా యభిమతము వేఱేమి కలదు?
వేనవేలైన నీదు దాసీనివహము,నందు నన్నొక్కతెగఁ జూడు మన్న నగుచు.

గీ. సద్వ్రతాచరణ సుశీల సాంప్రదాయ, శోభితవు! బ్రాహ్మణస్త్రీవి! సుందరాంగి!
సేవయే నీవు యిచ్ఛయించితివయేని, ద్వారకాపట్టణంబున ద్వాపరమున.

క. శ్రీకృష్ణాకారుఁడనగు, నాకు సేవ సేయుదువు గుణవతీ! సత్యై
కైకవిహితవృత్తిన్ నే, నీకు విధేయుండ ఋణిని నీ సేవలకున్.

క. నీతండ్రి దేవశర్మయె, ప్రీతిన్ సత్రాజి తనెడు పేరన్! చంద్ర
ఖ్యాతుఁడు పతి యక్రూరా, ఖ్యాతుండై పుట్టుదురు శుభాచరణమణీ!

చ. అని వరమిచ్చినన్ ముదము నంది, సతీమణి యున్నకాలమం
తను నిజధర్మ తత్పరతఁ దాను జరించి, ప్రయాణవేళ నె
మ్మనమును పట్టఁజాలక, సమాహిత చిత్తము నొందఁబోక, గం
గను తనదేహమున్ విడిచి కాంచెను స్వర్గసుఖంబు లొక్కడన్.

క. కాలాంతరమున ద్వాపర, కాలమురా, నవతరించి కమనీయ సుఖ
శ్రీలలరారె సతీమణి, శ్రీలలనాకాము కృష్ణుఁ జెంది యథేచ్ఛన్.

## పింగళా వృత్తాంతము

ఉ. ఒక్కట చైత్రమాసమున నుజ్జ్వల వైభవ మొప్ప రాత్రియం
దొక్కెడ సీతఁగూడి నిదురొందెడి పట్టున రామచంద్రునిన్
[illegible] జేపికోఁదలఁచి ధైర్యము మీఱఁగ నొక్కవేశ్య అ
మ్మక్కరో! పింగళాహ్వాయ! స్వయంబుగఁ జేరఁగవచ్చి ప్రేల్మిడిన్.

ఉ. అందెలు గజ్జెలున్ నినద మానని పైకెగఁబట్టి, కామమున్
తొందఱ వెట్టఁగా నడక తొందఱఁ దా నరికట్టి, సీత తా
నందె, యొకేశయన మందె పరుండుటఁ గాంచి మెల్లఁగా
నందునఁ గల్గు సేవకులకైన నెఱుంగఁగ రాని రీతితోన్.

క. ఇటునటు చూచుచు తిన్నఁగ, పటు నిద్రాసుఖమునన్ సఫలుఁడగు రాముం
జటుల పదసంస్పృశము సే,యుటచే మేల్కొంచి రాముఁ డుద్ధతిఁ బల్కెన్.

ఉ. ఎవ్వతె వీవు? భీతహరిణేక్షణ! యిట్టి నిశీథమందునన్
నివ్వటిలెన్ మదీయ రమణీయ సుసౌప్తిక శాలఁజేర! ని
న్నెవ్వరు నడ్డగింపరె? వినిశ్చయ మెద్ది? యెఱుంగ దెల్పుమా!
జవ్వని! యెంత చేసితివి? సాహస! మింతటి నేర్పు కల్గునే?

వ. అని ప్రశ్నింప.

మ. అపరాధం బొనరించితిన్ రఘుపతీ! ఆమ్నాయముల్ నిన్ను గాం
చపలాపించును కాని దుర్లభము నీసాన్నిధ్య మేలాటి పు
ణ్యపు మాద్యత్ఫలమో? కనుంగొనితి! పాదాబ్జంబులం బట్టితిన్!
కృప నన్నున్ క్షమియించి సాహసము; రక్షింపంగ దే మాధవా!

ఆ. నన్ననుగ్రహింపు మన్న! కామ ప్రపీడితను పింగళను కడింది ననిన
నేకపత్ని వ్రతము నాకుఁ గల్గుట లోక, మెల్ల నెఱుఁగు నీకు తెల్లమె కద!

క. నీ కామ పూర్తి యగుటకు, శ్రీకృష్ణావతరణమున ప్రసిద్ధ మధురలో
నే కంసవధార్థము రాఁ, గా కంసుని యింటి దాసిగా యట మనుమీ.

చ. గణిక వనేక పూరుషుల కాముకవృత్తిఁ జరించినావు! నీ
గుణమునకున్ దగన్ గనఁదగున్ భువిపై నొక దాసిజన్మ, మిం
దణువయినన్ వృథా కలుఁగ, దంతట కంస వధార్థ మేను, ప
ట్టణ మధురన్ జెలంగి నినుడాసి కృతార్థ నొనర్తు పింగళా!

శా. కుబ్జారూపమునుం ధరించియు ననుం గోపాలునింగూడి, నీ
వబ్జాక్షీ! రమియింపఁగాఁ గలవు! నీ యాపేక్షయుం దీరు, నీ
కబ్జప్రాభవ వాసవ ప్రభృతి దేవానీక దుర్లభ్యమా
నబ్జాతాక్ష పదారవింద భజనాహ్లాదంబు సిద్ధించెడిన్.

క. అని యాజ్ఞ నొసఁగి పింగళ, కనంతరము, నిద్రపోయి యవశస్థితి నుం
డిన ద్వారపాలకుల దం,డనముం గావించి సీత నయ మొప్పారన్.

శా. నిద్రన్ లేపి, ధనాంగనా విషయమున్ నేర్పొప్పఁగాఁ దెల్పినన్
క్షుద్ర స్త్రీ హృదయంబుఁ దెల్పనన, నక్షుద్రంబుగా కోప ని
ర్నిద్ర ప్రస్ఫుట తీవ్రరూపమతియై, నీ లీలలం గంటి! నీ
భద్ర ప్రాభవ మేకపత్నివ్రత మిప్పాటన్ వెలుం గొందెనా?

ఉ. వేశ్యను సాగనంపి తగవే? ననులేపి వచించు టెల్ల! నా
వశ్యము; దీనగల్గిన దవశ్య రహస్యము! అట్లు కానిచో
వేశ్య సమక్షమందె నను వేపని కారణ మేమి? వేశ్యకున్
వశ్యుఁడు భర్తయైన నిక వల్లభ సౌఖ్యము తెల్లమే కదా!

ఉ. వ్యాసునితోడ మొన్ననె, శబాసు! ప్రతిజ్ఞ యొనర్చినావు! వి
శ్వాసముఁ గల్గునట్టుల! విభాసుర మేక సతీవ్రతంబు నా
తో సరి లేరటంచు, ముదితుండయి దీవనలిచ్చె నాతఁడుం
గాసుకుఁ గానియట్టి చెడుగాఁ జరియించితి! నేడు దుర్మతిన్.

మ. గణికాపృష్ఠమునున్ స్పృశించిన యసత్కార్యార్హ మిప్పన్ను నే
గణియింపన్ శయనింప యోగ్యమని; దుష్కార్య ప్రవర్తిన్ నభో

ఆదిశేషుఁడు నీశయనతల్పమయ్యె! లక్ష్మణుఁడు లేఁడయ్యె విచక్షణింప!
సకలశాస్త్రములు నిన్ సన్నుతిఁగావించు! దేని గాంచిన నీవె తేజరిలుదు!

గీ. వింక నాకేరు నమ్మక మంకురింప, సాక్ష్యముం బల్కువారు నిశ్శంకదోప!
నీకు దుర్ఘట మేది? త్రిలోకములను, విస్సన వచించినదియె కా! వేద మరయ!

క. ఆడినది యాట! మఱి నీ, పాడినయది పాట! యయ్యె! పరమాత్మవు! ని
న్నాడి నిలువంగఁ గలమే? పాడిఁదప్పకుండ నీవుఁ బరఁగక యున్నన్.

క. ఐనన్ నా తోఁచిన య, ద్దానిన్ వివరింతు నద్ది తగ సల్పిన నీ
దానన్ లేకున్న నదీ, పానీయంబులన విడుతు ప్రాణముల హరీ!

మ. అని నిట్టూర్చుచుఁ బల్కు జానకిని కాంతా! నా మనోహారిణీ!
నిను దక్కన్ పదునాల్గులోకముల నేనిన్ అన్యకాంతన్ మనం
బున నేనిం దలపోయ! నిక్కము! సుమీ! పొల్పొందఁగా దీన, నీ
వనుమానింపకు, మైన నీ యభిమత వ్యాపారముం దెల్పుమా!

క. తదనుసరణముగ నే నీ, హృదయమునకు నచ్చునట్టు లేర్పడ సేతుం
గద! మానినీమణీ! నీ, ముదమే నా ముదము తెల్పుము మనోహారీ!

క. అని గ్రుచ్చి గ్రుచ్చి పల్కిన, విని భూమిజ నీదు గురు పవిత్ర పదాబ్జా
ళిని దాకి పల్క తృప్తిం, గనియెద నటుఁగాక యున్న కల్లగఁ దలఁతున్.

క. ఇందుల కావంతయునేన్, సందేహము లేదటన్న చయ్యనఁగ మహా
నందమున లక్ష్మణుని చేతం దబ్బున పిలువఁబంపెఁ దద్దయు గురునిన్.

ఉ. పల్లకితోడ లక్ష్మణుఁడు భక్తి వశిష్ఠుని జేరఁబోయి యో
సల్లలితాత్మ! సద్గురు! విశంకట వృత్తిని రామచంద్ర భూ
వల్లభుఁడే స్మరించె మిము, వారక పల్లకి నెక్కుఁడన్నచో
వల్లభయా నరుంధతియు వత్తు నిదేమి యసాధ్యకార్యమో?

ఆ. అర్ధరాత్రివేళ యవనీ విభుఁడు రామ, మూర్తి పిలిచెనన్న యార్తి కాదె?
పదుఁడటంచు భార్య పల్క. సపత్నీకుఁ, డై వశిష్ఠుఁ డెక్కె నందలంబు.

గీ. లక్ష్మణుఁడు దానివెన్క సలక్షణముగ, నుండఁగా వేత్రపాణులై దండి రత్న
దీపముల వెల్గునన్ వచ్చె తేజరిలుచు, రామచంద్రుని కడకు భార్యాయుతుఁడయి

మ. దయతో వచ్చిన సద్గురుం గొలిచి, సీతాదేవితోఁ గూడఁగా
ప్రియ మొప్పార నరుంధతిం బహుళసంప్రీతాత్ముఁ గావించి, ని
శ్చయ వృత్తాంత మెఱుంగఁ దెల్పి, పరమాశ్చర్యంబుఁ దోపన్ మహా
దయ! నే పింగళఁగాని యెట్టి సతినేన్ దాకన్ త్రిశుద్ధంబుగన్.

శా. మీ పాదంబుల నంటి చెప్పినని నెమ్మిన్ నమ్మదే నంచు సీ
తా పుణ్యాంగన కోరె! కావున మహాత్మా! నిక్కమైనట్టి యీ

వ్యాపారంబున నాకు సందియ మదేలా ? కల్లు ; నే నెప్పుడున్
మీా పాదంబుల సాక్షిగా నెఱుఁగ నేమిన్ దోషమంచున్ వెసన్.

శా. పాదంబుల్ స్పృశియించె; లజ్జఁగొని బాష్పంబుల్ దగం గార, స
మ్మోదం బుక్కిరిబిక్కిరై యెసఁగ నబ్జాభజాత! తన్నాథునిన్
పాదంబుల్ నెఱిసోఁక మ్రొక్కి, క్షమియింపన్ గోరుచున్నాను! స్వా
మీా! దైవారు కృపాంతరంగమున నన్నిప్పట్టి రక్షింపుమా.

ఆ. ఆడుబుద్ధి యెంతొ పాడుబుద్ధియ కదా! నిప్పు చెదలు పట్టునే ? తలంప
నిన్నుగూర్చి రామ! నే ననుమానింప, పెద్దలకును శ్రమము పెట్టుటయ్యె.

క. నా యజ్ఞానమె బయలై, పోయెఁగదా! నిష్కళంక పుణ్యాత్ముని ఛీ!
ఛీ! యేమని ద్వేషించితి, శ్రీయుతునిన్ రవిని జెనకు చీకటియున్నే ?

అనిన యంత ప్రసన్నుఁడై యవనిజాతఁ, గూడి రాముఁడు పత్నితోఁ గూడియున్న
గురుని వస్త్రాదికముల నిర్భర వినీత, సత్కృతులఁ బూజ సల్పి ప్రశంసలఁ గనె!

క. ఈ రీతిగా వశిష్ఠుఁడు, శ్రీరామ సుపూజితుఁడయి చెలువారంగా
నారీమణి యరుంధతి,తో రమ్యాందోళికన్ కుతూహలమతియై.

సంతసమున నిజాశ్రమస్థలికిఁ జనియె, నంత సీతాసమాలింగి తాంగుఁడగుచు
రామచంద్రుఁడు నిద్రావిరాజితాత్ముఁ, డయ్యె! సీతా మహాదేవి యవసరముగ.

మ. మదిఁ జింతించి శుభోదయంబుననె కొమ్మన్ పింగళన్ బిల్వనం
పి దదీయాగమ కారణంబుననె నొప్పిం గూర్చితిన్ భర్త దో
ర్ఘ్రాదికంచున్, పెనుకంభ మంటగను దానిన్ గట్టి కొట్టించి దు
ర్మదురాలా! మధురాపురంబున త్రివక్ర స్త్రీత్వముం బొందుమా.

క. నీ యపరాధము ముఖ్యాధ,మై యేచెన్ మమ్ము దాసివై కుత్సితవై
పోయి జనియింపుమా! యన, నా యువతియు మిగుల ప్రార్థనంబును సల్పన్.

క. శ్రీకృష్ణు ననుగ్రహమున, నీకు ముక్తికల్గు నని వినిందిత మతియా
నా కాంత పింగళన్ విడి,పోక కనుజ్ఞన్ పొసర్చి భూమిజ యంతన్.

క. నిజచరిత్రలన్ వినిర్మల హృదయుఁడై, రంజిలఁగ నొసర్ప రామమూర్తి!
వేడుకల గ్రహించి విలసిల్లుచుండె త,త్పరతఁగల్గి భక్తి పరతఁగల్గి.

## నవమ సర్గము

గ్రహణస్నానము : లోపాముద్ర గర్వమును లీలగ సీతాదేవి తొలఁగించుట

క. ఒకనాడు రాఘవుఁడు పు,ష్పకమున సీతాసుమిత్రజాదులతో కౌ
తుకవృత్తి రవిగ్రహణము,నకును కురుక్షేత్రమునకు స్నానార్థంబై.

గీ. చనియె; నచటికి వచ్చిరి సకలమునులు, దేవతలును గంధర్వులు దివ్య నాగ
కిన్నరులు నప్సరసలును పన్నగులును, సకల దానములొసఁగె భూజాని విభుత.

చ. గజ తురగోష్ట్రము ల్మొదలుగా తగు షోడశ దానముల్, ముని
వ్రజమును భూసురోత్తములు రాజిల, భూరి యుదార మొప్ప భూ
మిజ సహితంబుగా నొసఁగి, మించిన సంతస మొప్పియుండ, రా
జ జనులు రాజపత్నులును చయ్యన రాముని సీతఁ గొల్వఁగన్.

సీ. అచటఁజేరిన రాజు లందఱు శ్రీరామ, దర్శనమునకు నుత్తంబులైన
కానుకలంగొని కడఁగి వచ్చిరి; రాజ,పత్నులు జానకి పరఁగ దర్శ
నముసేయరాగ, దివ్యము శుభాలింగనా,ద్యనుపమ సమ్మాన మవనిజాత
కావించె; నంతటఁగల్గు సఖీజన, పరివృతయై మునిభార్యలెల్ల

గీ. చేరియుండ సుఖంబుగాఁ గూరుచుండి, యామె కొల్వ లోపాముద్ర యలరి సీత!
ధన్యురాలవు గజయాన! తావకీన, జన్మసార్థక మహహ! రామచంద్రువలన!

మ. వనితా! వీనుల విందుగాఁగను రఘుస్వామి ప్రతాపోన్నతిన్
వినఁగా నీదు ముఖారవిందమున నువ్విళ్ళూరుచున్నాము, మా
మన ముప్పొంగ కృతార్థతం బెఱయ జన్మల్; చక్క వర్ణింపవే!
జనితానంద రసాబ్ధి మగ్నముగ శశ్వద్రామ చారిత్రమున్.

క. అని పలుక నవ్వి జానకి, తన పాణిగ్రహణమాది తక్కిన యీ వ
చ్చిన గ్రహణయాత్ర పర్యం,తనమగు కథ చెప్పె సుంత తప్పక భక్తిన్.

శా. లోపాముద్ర ముదాత్మయై విని, యహెూ! లోకాభిరాముండు మీ
భూపాలుండు సముద్ర సేతు రచనా పూర్వంబుగన్ దోశ్శ్రీమన్
జేపట్టెన్; తృటిమాత్ర నా పతికి నిక్షేపంబుఁగాఁ జెప్పచో
నాపోశం బొనరించి మార్గము క్షణంబం దొప్పఁగాఁ గూర్పఁడే?

గీ. వ్యర్థముగ కపులకు సేతుబంధనమున, శ్రమముఁ గల్పించె నీ సర్వ సాగరములు
రెండుగ్రుక్కల బీల్చిన దండి మాని, నాదు భర్త నెఱుంగఁడే నీదు భర్త!

క. అని గర్వయుక్తముగ పల్కిన విని చిఱునవ్వి సీత కేవలముగ లీ
లను సేతుబంధనమ్మును, బొనరిచె శ్రీరామచంద్రమూర్తి సుసాధ్వీ.

సీ. తన బాణమున సముద్రుని శోషిలఁగఁ జేయ, జలజంతువుల కెంతొ శ్రమము కాదె
గగనమార్గమున రాఁగల్గనుకాని రా,వణునకు మానవ గణన మెట్లు?
హనుమంతుపైని లంకను జేరినట్లైన, తన పౌరుషంబును దలఁతు రెవరు!
ఈది వార్నిధి దాటు టెట్టులు బ్రాహ్మణ, మాత్రంబు నంటుట ముదమె యౌనె?

గీ. ఇన్ని యోచ[illegible] నా నాథుఁ డున్నపాట, సేతువుం గట్టి లంకకుఁ జేరె నట్లు
మున్ను వారధి [illegible]ఁ గట్టినారె? ఇం కెవఁడు కట్టు?

. తల్లి! అగస్త్య వేడిన గదా! సులభం బగునంటి; వియ్యాదిం
 దెల్లముగాదె? యీ జలధి దెప్పున ద్రావిడె మాత్రమార్గమం
 దల్లరిగాదె? స్వార్థమునకై యది క్రమ్మఱఁ ద్రావుమంట! నా
 వల్లభుఁ డెట్లు కోరు? మునివల్లభు; నింత నెఱుంగఁజాలవే?

వార్ధిఁ గట్టె రాముఁ డన్విఖ్యాతి, నీదు భర్తఁ గోఱ నెగడు టెట్లు?
భర్త కరుణ నెగడియుండినఁ గదా, రాముఁడుర్వి యశోభిరాముఁ డయ్యె.

అను సీతావాక్యమ్ముల, విని లజ్జితయయ్యె తేరి వీరుఁడు నీ నా
పనికిఁ నీకు ననారత,మును సుఖమయ్యెడి నటంచు మోదం బలరన్.

. ఆశీర్వాదము చేసి మన్ననలచే నానందముం బొంది, మా
 నీనప్రాణము సమ్ములుం జెలఁగఁ జేరెన్ స్వాశ్రమాగస్త్య మా
 నీశ స్వీకృత పాణిపద్మ యగుచున్, యేతెంచె పేర్మిన్ అయో
 ధ్యేశున్ జేరఁగ సీత, యెల్లరు మహాహీనప్రమోదంబునన్.

సీతారాముల దర్శన, మీ తీరునఁ గల్గెనని మహీజను లెల్లన్
చేతో మోదభరిత వి,ఖ్యాతిం జని రాత్మ సంభృతానందములన్.

పుర పురంధ్రులు దారిలో పొలుపుమీఱ, కుంభదీపనీరాజనాకుంఠిత ప్ర
కాశ స్వాగతవైభవోపేత కమ్రపర్వ, మహిత మర్యాద లొసఁగ రామప్రభుండు.

సీతాసమేతుఁడై సా,కేత రాజమందిరమును క్షేమముగా సా
క్ష్యాత్మ నిజబంధుజన సం,ప్రీతుండై చేరె నిల్చి పృథుల సుఖుండై.

. చాలాకాలము నిత్యనూతన మహాశ్చర్య ప్రభాశాలియై
 యేలెన్, తమ్ములు వారి భార్యలును నెంతే తల్లులున్ భూప్రజల్
 చాలానందంబుగ నంతరంగముల చెల్వారంగ శ్రీరామునిన్
 చాలా మెచ్చుచు దీర్ఘజీవితము గాంచన్ దేవుఁ బ్రార్థించఁగన్.

రమతమ మానసముల ను,త్తమ జీవిత మిట్టి దను విధంబున నాద
ర్శముఁ జూపు దంపతులుగా, ప్రముదంబున బల్కుచుండ్రు రామున్ సీతన్.

రాజువోలె ప్రజ విరాజిలుచుండిరి, వివిధ ధర్మమార్గ విహిత వర్త
నముల సౌఖ్యశోభితామలమూర్తులై, పుణ్యదీప్తి విమలపుంజములన.

గాఢశంకరులన సీ,తారాములు సర్వధర్మ తత్పరమతులై
రారాజిల్లిరి రాముని,దే రాజ్యము రాజ్యమని నుతింగని సుఖులై.

పరదారరతుఁడు నుర్వర వారకాంతాను,రక్తుఁడు మాదక ద్రవ్య సేవ
నారతుండును గను దారిద్ర్యవంతుఁడు, రోగి చింతామతిఁ దోగువాఁడు
పాపాత్ముఁడును హింసఁ బాల్పడువాఁడును, జారుఁడు చోరుఁడు భీరమతియు
హీనుండు మూర్ఖుఁడు హేయ కర్మరతుండు, విహ్వాలుఁడును నవివేకపరుఁడు

గీ. వెతకిపట్టినం దొరుకరు విహిత ధర్మ, తత్పరులె కాని లేరు విపత్పరంప
రాప్రపీడిత చిత్తులు! రామరాజ్య,మందు శ్రీ విష్ణుదాసుఁడా! మందుకైన.

ఆ. లోకరంజకంబు సాకేతనిలయంబు, రామ జానకీ ప్రభామయంబు
శ్రీ విలాసకాండ మీ విధి విలసిల్లు, శిష్య! నిన్నుగూర్చి చెప్పినాఁడ!

క. ఎవఁడు త్రికాలములం దీని విలాసప్రదచరిత్ర నిర్మల భక్తిం
దవిలి పఠియించు వాని కొ,దవు సాక్షాద్రామ తత్త్వ ధర్మము! శిష్యా!

గీ. ధనముఁ గోరినవానికి ధనము, పుత్ర,కామునకు పుత్రులును, భోగకాముకునకు
భోగమును గల్గి సుఖయించు, భుక్తిముక్తు, లొదవును విలాసకాండముం జదువభక్తి.

గీ. రామభక్తిపరాయణుండై మహాత్ముఁ, డెవ్వఁడు విలాసకాండము విను నవ్వరమతి
ఇహసుఖము లందు పాపపరిహారణమును, గాంచు శ్రీరామపదమును గాంచి మించు.

గీ. శ్రేష్ఠము పవిత్రమును సువిచిత్రమును మ,నోహరమును కర్ణానంద దోహదమ్ము!
లోక హృదయంగమంబు సుశ్రీకరమ్ము, శ్రీ విలాసకాండము భువి చెన్నుమీఱు.

క. ఆనందప్రదమగు ని,ద్దానిఁ బఠియింప ధర్మతత్పరమతులై
మానిత సంపన్నికర మ,నూనంబుగ బొందుదురు మనుష్యులు సుఖులై.

క. మంచి వరుని పేర్మిని కా,మించిన కన్నియ పఠించి మించిన భక్తిన్
మంచి పతిఁ బడయు సంశయ, మించుకయును లేదు! పథ్య మిది ఫలద మగున్.

క. ఈ మహి నిది విను మహితలు, సౌమాంగల్యంబుఁ గల్గి చక్కని సుతులం
గామిత సౌఖ్యంబులను న,నామయత ఘటిల్ల కీర్తి నందుదు రెలమిన్.

క. నియమముగ స్నానమొనరిం,చి యనంతర మిది బఠింప చెలువుగ విన్నన్
నియత ఫలమిచ్చు శిష్యా! శ్రియము ప్రియము నయము లొదవు శ్రితజనతతికిన్.

క. చెవులకు నింపై మనసుకు, బవు సొంపై కడు విచిత్ర పరమపవిత్రం
బు విలాసకాండ భవ రోగ విదండ స్వధర్మకుండ గా నలరారున్.

గద్యము

ఇది శ్రీబాలభారతీ వరప్రసాదలబ్ధ కవితా ధారేయ పండిత చిలుకూరి శ్రీరామశాస్త్రి
నామధేయ ప్రణీత శ్రీమదాంధ్రానంద రామాయణాంతర్గత
విలాసకాండము సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

స్వస్తి శ్రీ సమస్త సన్మంగళాని భవన్తు.

భారతీ ప్రెస్, తెనాలి - 1956.